








సత్యనారాయణగారు, బొలిశెట్టి

వైశ్యయువకులు. అరెస్టు బెజవాడలో -౧౧ ౬ ౧౯౩౦. …ండుసంవత్సరములు కఠినశిక్ష.

…త్యనారాయణగారు, ముష్టి

నెల్లూరు.. నెల్లటూరు రథోత్సవసమయమున అరెస్టు.

…త్యనారాయణగారు, రాయప్రోలు

సారాయిషాపుదగ్గర పికెటింగుచేసినందుకు వీరికి ౬ నెలల కఠిన శిక్ష ౧ నెల విడిఖైదును విధింపబడెను.

సత్యనారాయణగారు, సింగని

౧౪౪-వ సెక్షనును తిరస్కరించి తొమ్మిదినెలలు శిక్షను బొందిరి.

సత్యనారాయణమూర్తిగారు, కొమ్మారెడ్డి

ఏలూరువారు. ౧౦౭ సెక్షనును తిరస్కరించి ఒకఏడాది శిక్షను పొందిరి.

సత్యనారాయణమూర్తిగారు, సామవేదం

పశ్చిమగోదావరిజిల్లా కో-ఆపరేటివు ఫెడరేషను అధ్యక్షులును కారాధకులును నగు వీరు వసంతవాడలో ౧౭ సెక్షను క్రింద అరెస్టు …యబడి ఆరునెల కఠినశిక్ష పొందిరి.

…మూ…, యస్.

౧౯౩౧ …వరి ౧౦ అరెస్టు. ౧౧-వ తేది శిక్ష ౬ నెలలు.

…త్యవతమ్మగారు, కొండా

గుంటూరుమండలపు ఎనిమిదవ కాంగ్రెసుసంఘసభ్యురాలు. …రెస్టు ౧౯౩౧ ఫిబ్రవరి ౨౧.

…త్యవీరభద్రరావుగారు, గరిమెళ్ల

కాకినాడ. బులుసు సాంబమూర్తిగారి శిష్యులు. ౧౪౪ …క్షను నుల్లంఘించినందులకై మదరాసులో వీరి కారునెలల కఠిన …క్ష విధింపబడెను.

…రళాదేవిగారు

గంజాంజిల్లా. బరంపురములో అరెస్టుచేయబడిన ఉత్కళ స్త్రీ. ఆరుమాసముల కఠినశిక్ష పొందిరి. విడుదల నవంబరు ౨౭-వ తేది.

సరస్వతి అమ్మాళుగారు

మదరాసులో శాసనోల్లంఘన పెంపర్చి ఆరునెలలు విడిఖైదును బొందిరి.

…ంబమూర్తిగారు, బులుసు

౧౯-౮-౩౦ నాడు సంవత్సరశిక్షను పొందిరి.

…ంబయ్యచౌదరిగారు, అప్పసాని

శాసనోల్లంఘనోద్యమమున తెనాలిలో వీరికి ఆరునెలలు కఠిన శిక్ష విధింపబడెను.

సాంబశివరావుగారు, దిగుమర్తి

రాజమహేంద్రవరము. మలయాళ దేశమున కల్లికోటయందు స్థాపితమయిన కేరళసోపు ఇన్‌స్టిట్యూటునందు రెండేండ్లు పెక్కురకముల సబ్బులు తయారుచేయుటకు నేర్చుకొన్న పరీక్షయందు అగ్రస్థానము నలంకరించిన ఆంధ్రులు వీరొక్కరే.

సుందరంగారు, పి. ఏ.

చెన్నపురిలో పికెటింగు చేసినందుకు అరెస్టు ౬-౨-౧౯౩౧. శిక్ష ఆరునెలలు.

సుందరమ్మగారు, పాదర్తి

ఆగస్టు ౬-వ తేదీనాడు వీరు అరెస్టయిరి. ౨౬-వ తేది నాడు వీరికి ఆరుమాసములు విడిఖైదు విధించిరి.

సుందరరామరాజుగారు, కలిదిండి

వీరిది కేశవరం. నల్లజర్లలో ౧౧-౬-౩౦ ఈతచెట్లు నరికినందులకు అరెస్టుచేయబడిరి.

సుబ్బమ్మగారు, దువ్వూరు, దేశబాంధవి

ఈ సుప్రసిద్ధదేశభక్తురాలిని రాజమండ్రిలో మే ౩౧-వ తేది నాడు అరెస్టుచేసి ఆరునెలలు విడిఖైదు విధించిరి. విడుదల నవంబరు ౨౧-వ తేది.

సుబ్బరాజుగారు, నడింపల్లి

వీరిది కోడూరుపాడు (తూర్పుగోదావరి). సత్యాగ్రహుల నింట జేరదీసినందుకై వీరికి ఆరుమాసములు కఠినశిక్షయు ౧౦౦ రూ. లు జరిమానాయు విధింపబడెను.

సుబ్బరామరెడ్డిగారు, లేబూరి

వీరి నివాసము బుచ్చిరెడ్డిపాళెము. నెల్లూరుజిల్లా సమరసంఘ సభ్యులలో నొకరు. ఉప్పుసత్యాగ్రహమునకై నాలుగునెలల విడిఖైదు పొందిరి.

సుబ్బరాయగుప్తగారు, కోపూరి

అరువదియేండ్లవయస్సు. వీరికి ౧ సంవత్సరము కఠిన శిక్ష విధింపబడెను.

సుబ్బరావుగారు, అన్నవరపు

బెజవాడలోని వైశ్యప్రముఖులు. సత్యాగ్రహమునకై రెండు సంవత్సరముల కఠినశిక్షను బొందిరి.

సుబ్బరావుగారు, వక్కలంక

అమలాపురము కోనసీమ కో-ఆపరేటివుబ్యాంకు డైరెక్టరు. మదరాసులో పికెటింగు చేసినందులకు నిర్బంధింపబడిరి.

సుబ్బారావుగారు, బి. డాక్టరు

యూత్‌లీగు రాజకీయశాఖకు సెక్రిటరి. చెన్నపురిలో ౧౪౪ సెక్షనును ధిక్కరించినందున వీరి కారునెలల కఠినశిక్ష విధింపబడెను.

సుబ్బారావుగారు, డి. వి.

ఏలూరు నివాసులు. మదరాసులో ౧౪౪ సెక్షను నుల్లంఘించినందులకు వీరి కారునెలల కఠినశిక్ష విధింపబడెను.

**సుబ్బారావుగారు, జే. వి.**

సత్యాగ్రహమునకై గుంటూరులో ఒకసంవత్సరము కారాగారశిక్షనందిరి.

**సుబ్బారావుగారు, పాలడుగు**

బందరు వాస్తవ్యులగు వీరికి ౧౪౩, ౧౪౫, ౧౫౫. సెక్షనుల క్రింద ఒకసంవత్సరము కఠినశిక్ష విధింపబడెను.

**సుబ్రహ్మణ్యంగారు, కైప.**

కడపజిల్లా-ఉప్పు సత్యాగ్రహనాయకుడు. శిక్ష రెండేండ్లు.

**సుబ్రహ్మణ్యంగారు, బ్రహ్మజోస్యుల. డాక్టరు**

౧౯-౪-౩౦. నాడు సంవత్సరశిక్ష.

**సుబ్రహ్మణ్యం శ్రేష్ఠిగారు**

గంగపట్టణము (నెల్లూరు) శాంతిసైనికులు. తాళ్లు నరికినందులకు వీరికి తొమ్మిదినెలలు శిక్ష విధింపబడెను.

**సుభద్రమ్మగారు, పి.**

బెజవాడలో నిర్బంధింపబడి ఆరునెలల విడిఖయిదు పొందిరి.

**సూరమ్మగారు, జయంతి**

గంజాముజిల్లా ఉప్పుసత్యాగ్రహములో ఆరునెలలు శిక్ష ననుభవించిరి. వీరు శ్రీ జయంతి వెంకటనారాయణగారి సతీమణి. అరెస్టు జూన్ ౧౯ తేది.

**సూరయ్యచౌదరిగారు, కొల్లిపర**

కపిలేశ్వరపురమునందు తాళ్లు నరికినందుకు వీరికి ౯౪ మాసములు కఠినశిక్ష విధించబడెను.

**సూరిశాస్త్రిగారు, పురాణం**

బందరు. ౧౯-౫-౩౦ నాడు ఆరు నెలలు కఠిన శిక్ష.

**సూరిశాస్త్రిగారు, వంక**

ఏలూరు వాస్తవ్యులు. ౧౦౮-వ సెక్షను క్రింద వీరికి సంవత్సరము విడిఖయిదు విధింపబడెను.

**సూర్యనారాయణ చౌదరిగారు, దేవినేని**

వాసస్థలము కొవ్వలి (పడమటిగోదావరి). క్రిమినలు లా సవరణ చట్టముక్రింద వీరికి ౬ నెలలు శిక్ష విధింపబడెను.

**సూర్యనారాయణమూర్తిగారు, దేవులపల్లి**

వీరు రాజోలుతాలూకా కాంగ్రెసుసంఘాధ్యక్షులు. జిల్లా కాంగ్రెసుసంఘకార్యనిర్వాహకసభ్యులు. వీరికి ౧౫-౬-౩౦ నాడు ౨౪ సంవత్సరములు శిక్ష విధింపబడినది.

**సూర్యప్రకాశరావుగారు, పాలకోడేటి**

రాజమహేంద్రవర నగర కాంగ్రెసు సంఘకార్యదర్శి. ఉప్పు సత్యాగ్రహ మొనర్చినందుకు వీరికి ౨౪ సంవత్సరముల కఠినశిక్ష విధింపబడెను.

**సూర్యప్రకాశరావుగారు, భట్టిప్రోలు**

(చీరాల) మే రెండవ తేదీన వీరికి రెండేండ్ల కఠినశిక్ష విధింపబడెను.

**సూర్యరావుగారు, కడియాల**

పడమటిగోదావరిజిల్లాలోని కానుపాడు గ్రామము వీరి వాస్థలము. ఈతచెట్లు నరికినందునను మైనరు అయినందునను రెండుసంవత్సరముల శిక్ష విధించి బోర్‌స్టలు (తంజావూరు) స్కూలుకు పంపబడిరి

**సోమయ్యగారి సతి, చేబియ్యం**

వీరు ఏజెన్సీలో ౧౦ ఏండ్లనుండి కాంగ్రెసు ప్రచారము చేయుచుండినవారు. రాజమండ్రి తాలూకా సీతానగరం ఫిర్కాలో పన్నులు నిలుపుదలచేసినపుడు అక్కడ చాలపనిచేసినారు. ఇపుడు ఏజెన్సీలో ఉప్పు సత్యాగ్రహ ప్రచారమును చేయుచున్నారు.

**హనుమంతరావుగారు, టంగుటూరు**

శ్రీటంగుటూరు ప్రకాశం పంతులుగారి కుమారుడు. అరెస్టు ౧౨-౬-౧౯౩౦. శిక్ష ఒకఏడాది.

**హనుమారెడ్డిగారు, గండవరపు**

మైపాడు ఫిర్కా శాంతిదళాధిపతి. ఆరునెలల కఠినశిక్ష పొందిరి.

**హరిహరరావుగారు, సూరంపూడి**

తూర్పుగోదావరిజిల్లా.

**బిషగ్వర్. డా॥ యస్. రాజారామరావుగారు, ఏ. యమ్. ...**

వీరు చిన్ననాటినుండి దక్కను హైదరాబాద్‌లో ఆ... ఉరుదు, ఆంధ్రవిద్యల నభ్యసించి, నిజాం సర్కారువారి ఉ... ములు కొంతకాలము చూచి, ఆయుర్వేద కళాశాలలో ఆయుర్వే... నభ్యసించి, భిషగ్వరఅను బిరుదునుబడసి లోకలుబోర్డులో చే... మున్నగు పదవులను గడించి సుమారు పండ్రెండుసంవత్సరములనుండి స్థానం వైద్యులుగాను స్వంతముగాను వైద్యముచేయుచున్నారు. ఆంధ్రనాటకములందు మిక్కిలి ఉత్సాహము వీరు ధరించు ప... రుస్తుం, తానీషా మొదలగు మొగలు చక్రవర్తుల పాత్రములు చూదగినవి.

**శ్రీయుత. ఆత్మకూరి హనుమంతరావుగారు, తిరుపతి.**

వీరు బాల్యమునుండి ఆంధ్రనాటకరంగమునందు మిక్కిలి ఉత్సాహముతో రంగస్థలమునకు వన్నె గలిగించుచున్నారు. వీరి భావప్రకటన, పాత్రమునకు దగినగానము, భావ. వీటికేలాటి. కళంకముండదు. కొందరిని అచ్చటచ్చట నటకులనుకూడ తయారుచేసి పేరుకాంచి...

**యస్. యన్. మరియప్పగారు,**

పలువిధములగు వస్త్రములు తయారుచేయుటలో పేరుగా... వారు. మదరాసులోని గురుబసవకంపెనీలో ఏజంటు. మద... వీరశైవసంఘకోశాధికారి.

AMRUTANJAN
The Best INDIAN PAIN BALM

# అమృతాంజనము

## అన్ని నొప్పులకు పరమామృతము

దక్కని డబ్బితో సహా సీసా 1-కి వెల 0—8—0.

అన్ని చోట్ల దొరుకును

అమృతాంజనము దేశమందంతటను వ్యాపించి లక్షలకొలది సీసాలు అమ్మకమగుచును, జనోపయోగమై, పలుబడి సంవత్సరములుగా ప్రఖ్యాతినిబడసియున్న దను సంగతి లోకవిదితముగదా!

అమృతాంజన మనగ తలనొప్పి నుండని ఆసేతుహిమాచలము, హిందూదేశమందంతటను ప్రసిద్ధి చెందినది. విజ్ఞానసర్వస్వములు (Encyclopædias) గూడ ఘోషించుచున్నవి.

తలనొప్పులు, పార్శ్వపు నొప్పులు, కీళ్ల నొప్పులు, కణత నొప్పులు, మెడ నొప్పులు, మూడుపోట్లు, వాయువుపోట్లు, మూలశంక, ఎమిడికలు, గాయములు, తేలు-జెట్టికాట్లు, పక్షవాతము, పడిసెము, శంకశైత్యము, ఉబ్బసము, బెణుకులు, సంధివాతము, శైత్యము, రొమ్ముశైత్యము, ఎగరొప్పు, వణకులు, నెత్తురుకాకట, చీముపట్టుట, చుండు, పేలు, మొటిమలు, పురుపుటికాయలు, వాపులు, తీపులు, ఎలుకపులు, బొబ్బలు, దద్దులు, తామర, తీట, దురద, మంట, కర్పాణి, యివి యననేల, అవి యననేల, సకలమైన నొప్పులు, బాధలును పరిమార్చు దివ్యౌషధము.




అమృతాంజనము అమృతాంజనమే కాని తాంజనము అనేకులచే మున ప్రతియొక్క రుషధ మని నిర్ధారణ చేసి నొప్పులను నివర్తించునని చెప్పలగాదు. ఇతర సమ సాటియైన మందు యేదొకటి లేదు. అమృ పరీక్షింపబడి యుక్కాల మానసూత్రిక, ఉత్తమ యున్నారు. ఇది అనేక చెప్పులు, మాటమాత్రము ఔషధములను ఉపయోగించి తృప్తికరము లేకున్నచో, ఈ అమృతాంజనమును ఒక్కసారి యుపయోగించి చూడుము. అట్లు ఉపయోగించిన, అనుభవములో నిశ్చయము తెలియగలదు.

డబ్బి 1-కి 0-6-0 **తామర తైలము** డజను 3-8-0

రాజారాణి గుర్తుగల తామర తైలము పూతినాశకము లగు చాల మంచి మందులతో తయారుచేయబడి ప్రఖ్యాతిగాంచినది. పెక్కుయేండ్లనుండి యున్న తామర, తీట, పనుగుగజ్జి, శోభ, పొడలు మొదలగువానిని రెండేపూతలతో నిర్మూలముచేసి చర్మమును శుభ్ర పరచును. దీనిని చర్మముపై రాచిన మంట యుండదు.

## మోహిని తైలము

స్త్రీ పురుషులు వాడుటకు యోగ్యమైనది

మెదడునకు, కంటికి చలువనిచ్చి సౌందర్యమును పెంపొందించి కు లను పెంచును. సువాసన గలిగించి మనోహరముగా నుండును. సుఖనిద్ర, విశ్రాంతి నిచ్చును. వెల సీసా 1-కి 0-12-0 లు.

డబ్బి 1-కి 0-2-0 **దంత చూర్ణము** డజను 1-4-0

పంటిపోటును బాపి, నోటి దుర్గంధమును పోగొట్టి పండ్లు తోముటకు బాగు డును. చిగళ్లనుండి రక్తము కారకుండును.

**అమృతాంజనం డిపో** మద్రాసు — బొంబాయి— కలకత్తా.




# అమృతాంజనము

## అన్ని నొప్పులకు పరమామృతము

చక్కని డబ్బితో సహా సీసా 1-కి వెల 0—8—0.

అన్ని చోట్ల దొరుకును

అమృతాంజనము దేశమం దంతటను వ్యాపించి లక్షలకొలది సీసాలు అమ్మకమగుచు, జనోపయోగమై, పలుబడి సంవత్సరములుగా ప్రఖ్యాతినిబడసియున్న దను సంగతి లోకవిదితముగదా!

అమృతాంజన మనగ తలనొప్పినుండని ఆసేతుహిమాచలము, హిందూదేశమం దంతటను ప్రసిద్ధి చెందినది విజ్ఞానసర్వస్వములు (Encyclopædias) గూడ ఘోషించుచున్నవి.

తలనొప్పులు, పార్శ్వపు నొప్పులు, కీళ్ల నొప్పులు, కణత నొప్పులు, మెడ నొప్పులు, మాడుపోట్లు, వాయుపుపోట్లు, మూలశంక, ఎమిడికలు, గాయములు, తేలు-కెజ్జెరకాట్లు, పక్షవాతము, పడిసెము, కంఠశైత్యము, ఉబ్బసము, బెణుకులు, సంధివాతము, శైత్యము, రొమ్ముశైత్యము, ఎగరొప్పు, వణకులు, నెత్తురుకారుట, చీముపట్టుట, చుండు, పేలు, మొటిమలు, పురుపుటికాయలు, వాపులు, తీపులు, ఎఱుపులు, బొబ్బలు, దద్దులు, తామర, తీట, దురద, మంట, కర్పాణి, యివి యననేల, అవి యననేల, సకలమైన నొప్పులు, బాధలును పరిమార్చు దివ్యౌషధము.




అమృతాంజనము అమృతాంజనమే కాని తాంజనము అనేకులచే మున ప్రతియొక్కరు మధ మని నిర్ధారణ చేసి నొప్పులను నివర్తించునని చెప్పుల గాదు. ఇతర నకు సాటియైన మందు వేరొకటి లేదు. అమృ పరీక్షింపబడి యిక్కాల మనఃపూర్తిగ, ఉత్తమా యున్నారు. ఇది అనేక చెప్పుల, మాటమాత్రము ఔషధములను ఉపయో గించి తృప్తికరము లేకున్నచో, ఈ అమృతాంజనమును ఒక్కసారి యుపయోగించి చూడుము. అట్లు ఉపయోగించిన, అనుభవములో నిశ్చయము తెలియగలదు.

డబ్బీ 1-కి 0-6-0 **తామరతైలము** డజను 3-8-0

రాజారాణి గుర్తుగల తామరతైలము పూతినాశకము లగు చాల మంచి మందులతో తయారుచేయబడి ప్రఖ్యాతిగాంచినది. పెక్కు యేండ్లనుండి యున్న తామర, తీట, పసుగుగజ్జి, శోభ, పొడలు మొదలగువానిని రెండేపూతలతో నిర్మూలముచేసి చర్మమును శుభ్ర పరచును. దీనిని చర్మముపై రాచిన మంట యుండదు.

## మోహినితైలము

స్త్రీ పురుషులు వాడుటకు యోగ్యమైనది

మెదడునకు, కంటికి చలువనిచ్చి సౌందర్యమును పెంపొందించి కురులను పెంచును. సువాసన గలిగించి మనోహరముగా నుండును. సుఖనిద్ర, విశ్రాంతి నిచ్చును. వెల సీసా 1-కి 0-12-0 లు.

డబ్బి 1-కి 0-2-0 **దంతచూర్ణము** డజను 1-4-0

పంటిపోటును బాపి, నోటి దుర్గంధమును పోగొట్టి పండ్లు తోముటకు బాగు డును. చిగుళ్లనుండి రక్తము కారకుండును.

**అమృతాంజనం డిపో** మద్రాసు — బొంబాయి — కలకత్తా.

శ్రీ శివాభ్యాం నమః

# శ్రీ ప్రజోత్పత్తినామ సంవత్సర సిద్ధాంత పంచాంగము

శ్లో. శ్రీకల్యాణగుణావహం రిపుహరం దుస్స్వప్నదోషాపహం, గంగాస్నాన విశేషపుణ్యఫలదం గోదానతుల్యం నృణామ్;
ఆయుర్వృద్ధిద ముత్తమం శుభకరం సంతాన సంపత్ప్రదం, నానాకర్మసుసాధనం సముచితం పంచాంగ మాకర్ణ్యతామ్.







ఈ పంచాంగము

శ్రౌతస్మార్తమార్గప్రవర్తకులు, జ్యోతిష్యల సంకార్ణవ పూర్ణశశాంకులు నగు

బ్రహ్మశ్రీ మల్లయారాధ్యులవారి పుత్రులిందును, బ్రహ్మశ్రీ కప్పా వేంకటకృష్ణశాస్త్రి,

యగా. నాగేశ్వరశాస్త్రులుగార్ల ప్రియశిష్యుండును నగు

## కనకయ్య సిద్ధాంతిగారు గణించినది

ఆంధ్రపత్రికా ముద్రాశాలయందు ముద్రితమైనది.

## సంవత్సరఫలము

ఈ సంవత్సరమున చైత్ర వైశాఖమాసములయందు అచ్చటచ్చట స్వల్పవృష్టియు, ఎండ వేడిమియు ప్రారంభమై పశ్చిమవాతము హెచ్చుగా వీచును. జ్యేష్ఠమాసమునందును ఎండలు మెండై వడవరగాలివీచును. అధికాషాఢ నిజాషాఢములయందు సస్యానుకూలముగా వర్షించును. శ్రావణ భాద్రపదమాసములయందు సువృష్టియు ఆశ్వయుజ కార్తికమాసములయందు వాయుసహితవృష్టియు కలుగును. నవనాయకులలో రసాధిపతిగాక తక్కినవారు శుభులు అగుటచే అన్ని పంటలున్నూ బాగుగా ఫలించును. బెల్లము పొగాకు వగైరా రసవస్తువులకు ధర అధికముగ నుండును. పూర్వాపరసస్యములు బాగుగ ఫలించును. పశువులు క్షీరప్రదములై సుఖముగ నుండును. ప్రజలు చోర రోగాదులవల్లను, అగ్నివల్లనున్ను బాధలులేక సుఖముగా నుందురు. ప్రజలు రాజులవలన బాధనొందెదరు. అధికాషాఢ బ ౧౦ మొదలు నిజాషాఢ బ ౧౨ వరకు గురు మౌఢ్యము-నిజాషాఢ బ ౬ షష్ఠి ప్రభృతి ఆశ్వయుజ శు ౫ పంచమివరకు శుక్రమౌఢ్యము. చైత్ర, భాద్రపద శుద్ధ పూర్ణిమలయందు సంపూర్ణ చంద్రగ్రహణములున్నూ ఫాల్గుణ శుద్ధ పూర్ణిమయందు ముఖ్యమానోదయ చంద్రగ్రహణమున్నూ పరువాలును పీసముల కధికముగా పంటలుపండి నాలుగు తూములవర్షమున్నూ కురియును. జ్యేష్ఠ బ ౧౨ లు యమునానదీపుష్కరప్రవేశము.

స్వస్తి సర్వేజనాః సుఖినో భవంతు. శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

### శ్రీగురుభ్యో నమః.

వాగీశాద్యా స్సుమనస స్సర్వార్థానా ముపక్రమే;
యం నత్వా కృతకృత్యా స్స్యు స్తం నమామి గజాననమ్.

అవాచ్యాత్మస్వరూపాయ శిష్యజ్ఞానప్రదాయినే;
నమ స్సద్గురునాథాయ వటస్థలబ్రహ్మరూపిణే

గురవే సర్వలోకానాం భిషజే భవరోగిణామ్;
నిధయే సర్వవిద్యానాం దక్షిణామూర్తయే నమః.

### గురు స్తవము

శ్రీకృష్ణాన్వయవారిరాశిశశినా కౌండిన్యగోత్రాంచితో
విద్యార్థిప్రజనస్తుతో సుచరితో సాంగత్రయీపారగః;
రాజద్రాజసుపూజితో సవినయం షాట్శాస్త్రభాక్ సుగు-
ప్రాజ్ఞో వేంకటకృష్ణనామసుమనో నాగేశ్వరాఖ్యో భవేత్.

### దైవజ్ఞవంశావళిః

శ్రీమజ్జోస్యులవంశమౌక్తికమణి ర్మాహేశజాలాగ్రణీ
శ్శుద్ధాత్రేయమహర్షిగోత్రసహితో మోహాదివిధ్వంసకృత్;
విశ్వఖ్యాతవరాశ్వలాయనమహర్షిప్రోక్తసూత్రాంచిత
శ్శైవాచారపరాయణో హి శశికారాధ్యస్సముజ్జృంభతే.

తస్య శ్యామకృష్ణభవో భవాంబ్రిస్సోమగోపన్న సత్కీర్తిసంభోజ్జ్వలో
మార్తాండాస్వారితనూత్తమానవనవత్ర్యోగోల్లసత్పాత్రిభవః;
సల్లీలాయుత మల్లికార్జునసమాఖ్యాఖ్యాతిదిగ్వ్యాప్తభవో
దేశే మధ్యతనే చకాస్తి పరవస్తూపాస్త్యుపాస్తోద్భవః.

తస్యాహం తనయ స్సమిద్ధవినయస్సర్వేశ్వరాంఘ్రిద్వయా
సేవాపాదితతత్కృపాధిగతసచ్ఛాస్త్రత్వప్రబోధోదయః,
శ్రీమచ్ఛాస్త్రసింధువారిధివిగాహోదగ్రబుద్ధ్యాశయ
స్సోహం శ్రీ కవకాహ్వయో వ్యరచయత్పంచాంగ మేత న్ముదా.

### సంవత్సరాది దినకృత్యము

అబ్దాదౌ బంధుసంయుక్తో మంగళస్నాన మాచరేత్,
వస్త్రై రాభరణై ర్దేహ మలంకృత్య తత శ్శుచిః.

విఘ్నేశం భారతీం ఖేటాన్ దైవజ్ఞ మభిపూజ్య చ;
సంవత్సరఫలం సమ్య క్ఛ్రుత్వా విప్రా న్సమర్చయేత్.

ఈ (ఆంధ్ర) దేశమున లోకవ్యవహారమునకు చాంద్రమానాబ్దము గ్రహించుదురు. శేషాచలమునకు దక్షిణదేశమున సౌరమానాబ్దము గ్రహించుదురు. వింధ్యమున కుత్తరదేశమున బార్హస్పత్యమానాబ్దము గ్రహించుదురు. అంతటను గురూదయాబ్దమును గ్రహించుదురు. ఈ సంవత్సరమునకు చాంద్రమానాబ్దము ననుసరించి ప్రజోత్పత్తిసంవత్సర మని పేరు. సౌరమానము ననుసరించి-చైత్ర శు ౧ మొదలు చైత్ర బ ౧౦ వఱకు ప్రమోదూతసంవత్సర మనియు, అటుపైని సంవత్సరాంతము వఱకు ప్రజోత్పత్తిసంవత్సర మనియు పేరు. బార్హస్పత్యమానము ననుసరించి ఈ సంవత్సర చైత్ర శు ౧ లు మొదలు జ్యేష్ఠ బ ౧ వఱకు చిత్రభానుసంవత్సర మనియు అటుపైని సంవత్సరాంతమువఱకు స్వభానుసంవత్సర మనియు పేరు. గురూదయాబ్దమున-పుష్యాబ్ద మని పేరు.

ఈ ప్రజోత్పత్తినామసంవత్సరమునాటికి

| | |
|---|---|
| సృష్ట్యాదిగత సౌరాబ్దములు | ౧౯౫, ౫౮, ౮౫, ౧౩౨ |
| కల్యాది గతాబ్దములు | ౫౦౩౨ |
| శాలివాహనశకాబ్దములు | ౧౮౫౩ |
| ప్రభవాది గతాబ్దములు | ౪ |
| హూణశకగతాబ్దములు | ౧౯౩౧-౩౨ |
| ఫసలీ | ౧౩౪౦-౧౩౪౧ |
| హిజరి | ౧౩౪౧ |

అగుచున్నది.

సకలకల్యాణభాజన మైన ఈ ప్రజోత్పత్తినామ సంవత్సరము నాటికి సౌరసిద్ధాంతము ననుసరించి ఆదిసృష్టికర్తయగు బ్రహ్మయొక్క పరమాయుర్మానమున సగమునకు పైని మొదటి వత్సరమున, మొదటిమాసమున, మొదటి పక్షమున, మొదటి దినమున పగలు, ౧౩ గడియలు ౪౨ విగడియలు గడచినవి.

### అబ్దత్రయ ఫలము

### చాంద్రమానాబ్ద ఫలము

శ్లో. సువర్ణం సర్వధాన్యాని సులభాని యయుర్నరాః,
దృప్తా స్సర్వసంపద్భిః క్షేమారోగ్యం ప్రజాపతౌ.

ఈ ఫలము సంవత్సరారంభమునుండి సంవత్సరాంతమువరకు జరుగును.

### సౌరమానాబ్ద ఫలము

శ్లో. సువృష్టి స్సర్వదేశానాం ధనధాన్య సమృద్ధయః,
క్షేమం సుభిక్ష మారోగ్యం ప్రమోదే ధర్మ ఈదృశః.

ఈ ఫలము సంవత్సరారంభమునుండి చైత్ర బ ౧౦ లు వఱకు జరుగును. తరువాత సంవత్సరాంతమువఱకు పైని చెప్పిన చాంద్రమానాబ్దఫలము జరుగును.

### బార్హస్పత్యమానాబ్ద ఫలము

శ్లో. చిత్రార్ఘ వృష్టిసస్యాద్యై ర్విచిత్రా నిఖిలా ధరా,
నిరాకులాఖిలా లోకా శ్చిత్రభాన్వాఖ్యవత్సరే.

ఈ ఫలము సంవత్సరారంభమునుండి జ్యేష్ఠ బ ౧ వఱకు జరుగును. తరువాత సంవత్సరాంతమువఱకు స్వభానుసంవత్సరఫలము.

శ్లో. నందంతీహ జనా స్సర్వే భూమి ర్భూరిఫలాన్వితా,
స్వభానువత్సరే భూమి క్షీమద్భూపాలవిగ్రహా.

ఈ ప్రజోత్పత్తి సంవత్సరమునకు రాజు మొదలైన పరిపాలకవర్గము—తత్ఫలము

### రాజు-శుక్రుడు

శ్లో. సమృద్ధ సస్యా వసుధా సువృష్టి
ర్గావో హి సంపూర్ణ పయోధరశ్చ,
ప్రియాః ప్రియాణాం జనయంతి తోషం
కావ్యోపధాత్రై ర్నృపతే ఽబ్దనాథే.

గ్రంథాంతరే:

శ్లో. పీయూషతే మధు మధూ పటు కామినీభి
ర్గీయతే శ్రీణపతీర వేణువీణా,
భోభుజ్యతే విభుమున్నా త్స్వజనై ప్రహృష్ట
మర్త్యేఽపి శిష్య పాదపద్మ జనాసమానో హ్యైః.

ఈ ఫలము పాంచాల విదర్భ సౌరాష్ట్ర దేశముల కధికముగా కలుగును.

### మంత్రి-చంద్రుడు

శ్లో. సువృష్టిస్సర్వసస్యానాం ఫలితాని భవంతి చ,
క్షేమారోగ్యం సుభిక్షంచ జాయతే శశిమంత్రిణి.

ఈ ఫలము పౌండ్ర కళింగ దేశముల కధికముగాఁ గలుగును.

### సేనాధిపతి-చంద్రుడు

శ్లో. అతివర్షం రాతివాయు రరోగా స్సుఖినో జనాః,
బహుక్షీరప్రదా గావ శ్చంద్రే సేనాధిపే సతి.

ఈ ఫల మన్ని దేశములకును ప్రాప్తించును.

### సస్యాధిపతి-గురువు

శ్లో. యజ్ఞోత్తమదనాః ఫలితాశ్చ భవంతి హి,
పీతధాత్రీ చ ఫలితా గురౌ సస్యాధిపే సతి.

ఈ ఫలము ఘూర్జర, యవన దేశముల కధికముగా ప్రాప్తించును.

### ధాన్యాధిపతి-బుధుడు

శ్లో. మధ్యవృష్టి ర్మందతోయం మేఘా వాతేన పీడితాః,
త్రాస స్సర్వనృపాణాం చ బుధే ధాన్యాధిపే సతి.

ఈ ఫలము సర్వదేశములకును గలుగును.

### అర్ఘాధిపతి-చంద్రుడు

శ్లో. సువృష్టి స్సర్వసస్యానా [illegible]
మహతీ చార్ఘవృద్ధిశ్చ చంద్రే చార్ఘాధిపే సతి.

ఈ ఫల మన్ని దేశములకును ప్రాప్తించును.

### మేఘాధిపతి-చంద్రుడు

శ్లో. సువృష్టి స్సర్వదేశానాం ఫలితా ధాన్యజాతయః,
బహుక్షీరప్రదా గావ శ్చంద్రే మేఘాధిపే సతి.

ఈ ఫల మాంధ్రదేశమున కధికముగాఁ గలుగును.

### రసాధిపతి-శని

శ్లో. మధ్యవృష్టి ర్మందసస్యం రసజాతి ధనక్షయః,
మ్లేచ్ఛానాం జాయతే వృద్ధి ర్మందే యది రసాధిపే.

ఈ ఫలము కొంకణ మగధ దేశముల కధికముగాఁ గలుగును.

### నీరసాధిపతి-గురువు

శ్లో. పూగీఫలా న్యభిలరత్న సువర్ణ ధాన్య
కార్పాస చర్మ కుసుమాని చ చందనం చ,
వృద్ధిం యయు ర్ద్విజగణా స్సుఖినో భవంతి
భూమాత నీరసపతౌ సురరాజపూజ్యే.

ఈ ఫలము మాళవదేశమున కధికముగాఁ గలుగును.

### పశుపాలకుడు-శ్రీకృష్ణుడు

శ్లో. పశువృద్ధి స్సుభిక్షం చ బహుసస్యార్ఘ సంపదః,
సంపూర్ణ దుగ్ధవృద్ధిశ్చ గోపాలే పశునాయకే.

### స్థానసంరక్షకుడు-శ్రీకృష్ణుడు

శ్లో. కృష్ణే తు పయసా నాశః.

### పురోహితుడు-గురువు

శ్లో. విప్రా స్స్వకర్మనిరతా నీరోగా స్సుఖినో జనాః,
గావః కామదుఘా లోకే గురౌ పురోహితే సతి.

### పరీక్షకుడు-గురువు

శ్లో. పరీక్షకే సురాచార్యే మధ్యసస్యార్ఘ వృష్టయః,
ప్రజానామాగ మహోత్సవం నీతియుక్తా పరీక్షకాః.

### గణకుడు-శుక్రుడు

శ్లో. గణకే భార్గవే లోకే గణకా బుద్ధిసంయుతాః,
వృష్టి సస్యార్ఘ వృద్ధిశ్చ శుభద స్సర్వజంతుః.

### గ్రామపాలకుడు-చంద్రుడు

శ్లో. చోరాహి వ్యాఘ్రభీతిః స్యా త్సర్వత్రాపి నృపోత్తమః;
ఫలితా వృక్షజాతిస్తు శశాంకే గ్రామపాలకే.

### దైవజ్ఞుడు-సూర్యుడు

శ్లో. విప్రా స్స్వకర్మనిరతా స్సర్వేషాం శుభదా నరాః,
రక్తభూమిస్తు ఫలితా రవౌ దైవజ్ఞనాయకే.

ఈ పురోహితాది ఫలములు సర్వదేశములకును వర్తించును.

## మేఘము-వర్షము

ఈ ప్రజోత్పత్తి సంవత్సరమునకు—ఆవర్తనామక మేఘము కేరళశిఖరమున పుట్టుచున్నది.

శ్లో. మందతోయం మహావర్షం సేంద్రచాపం సగర్జితమ్,
వృద్ధిస్స్యాద్భూర్యసస్యం చ ఆవర్తే మేఘలక్షణమ్.

## వర్షము-నాలుగుతూములు

శ్లో. చతురాఢక వృష్టిః.

ఫలము: ఇందు పదిపాళ్లు సముద్రమునను, ఆరుపాళ్లు పర్వతములయందును, నాల్గుపాళ్లు భూమిపైనను వర్షించును. ఇట్లు ఇంద్రుడు నియమించినాడు.

## తూముయొక్క పరిమాణము

శ్లో. షష్టియోజన విస్తీర్ణం శతయోజనమున్నతమ్,
ఆఢకస్య ప్రమాణంతు దేవమానేన గణ్యతే.

## వర్షధాన్యాదుల వృద్ధిక్షయములు

వర్షము ౧౧; ధాన్యము ౧౫; శీతము ౧౧; తృణము ౧౫; ఉష్ణము ౪; మారుతము ౯, ప్రజావృద్ధి ౧౯; ప్రజాక్షయము ౧౪; రాజవిద్వరము ౧౪; ఉగ్రము ౧౪; పుణ్యము ౧౪; పాపము ౧౪; వ్యాధులు ౧౫; శాంతి ౧౩; ఆచారము ౧౯; అనాచారము ౧౩; జన్మము ౧౧; మరణము ౯; దేశోపద్రవము ౪; దేశసౌఖ్యము ౯; చోరభయము ౧౧; చోరనాశము ౨౧; అగ్నిభయము ౧౪; శాంతి ౪; మృగోపద్రవము ౧౦; మృగక్షయము ౧౫; కీటకభయము ౨౧; కీటకనాశము ౧౩; మూషకోత్పత్తి ౯; మూషకనాశము ౧౧; సర్పోత్పత్తి ౨౧; సర్పనాశము ౨౧; కామము ౫; లోభము ౧౯; మోహము ౧౫; మదము ౫; మాత్సర్యము ౯; సుఖము ౧౧; దుఃఖము ౧౧; భోగము ౯; విసంబము ౫; మనోవ్యథ ౧౪; ద్వేషము ౧౧; ప్రతిష్ఠ ౨౧; అప్రతిష్ఠ ౧౩; ద్యూతము ౨౧; మత్తత ౧౧; జలోత్పత్తి ౧౪; స్త్రీశోత్పత్తి ౫; ధాతువాదము ౯; భయము ౧౩; శౌర్యము ౧౪; దుష్టనిగ్రహము ౨౧; శిష్టపరిపాలనము ౪; సత్యము ౯; అసత్యము ౧౧; విశ్వాసము ౧౩; అవిశ్వాసము ౧౫; దయ ౧౪; నిర్దయ ౧౪; న్యాయము ౧౯; అన్యాయము ౧౯; అజ్ఞానము ౪; జ్ఞానము ౧౯; కాపట్యము ౯; నిష్కాపట్యము ౯; ధర్మము ౧౪; అధర్మము ౧౪; గోమాయువృద్ధి ౧౩; తన్నాశము ౧౦; శలభవృద్ధి ౧౩; తన్నాశము ౮; మశకవృద్ధి ౧౬; తన్నాశము ౧౬; మత్కుణవృద్ధి ౪; తన్నాశము ౮; వృశ్చికోత్పత్తి ౧౬; తన్నాశము ౧౬; వ్యాఘ్రవృద్ధి ౮; తన్నాశము ౧౦; సస్యవృద్ధి ౫; తన్నాశము ౬; శుకవృద్ధి ౬; తన్నాశము ౬; పికవృద్ధి ౭; తన్నాశము ౫; కుక్కుటవృద్ధి ౭; తన్నాశము ౭; పతత్రివృద్ధి ౮; తన్నాశము ౬; ధేనువృద్ధి ౨; తన్నాశము ౬; మహిషవృద్ధి ౨; తన్నాశము ౫; మృగవృద్ధి ౮; తన్నాశము ౫; ఛాగవృద్ధి ౫; తన్నాశము ౫; అశ్వవృద్ధి ౫; తన్నాశము ౩; గజవృద్ధి ౬; తన్నాశము ౮; ఉష్ట్రవృద్ధి ౮; తన్నాశము ౮; విప్రవృద్ధి ౬; తన్నాశము ౨; క్షత్రియవృద్ధి ౮; తన్నాశము ౫; వైశ్యవృద్ధి ౩; తన్నాశము ౩; శూద్రవృద్ధి ౬; తన్నాశము ౩; మ్లేచ్ఛవృద్ధి ౩; తన్నాశము ౨; సంకరవృద్ధి ౫; తన్నాశము ౩; వజ్రవృద్ధి ౫; వైడూర్యవృద్ధి ౨; గోమేధికవృద్ధి ౩; పుష్యరాగవృద్ధి ౮; విద్రుమవృద్ధి ౫; మరకతవృద్ధి ౫; మాణిక్యవృద్ధి ౫; నీలవృద్ధి ౫; ప్రవాళవృద్ధి ౫; సువర్ణవృద్ధి ౨; రజతవృద్ధి ౮; తామ్రవృద్ధి ౪; కాంస్యవృద్ధి ౨; లోహవృద్ధి ౭; అయోవృద్ధి ౨; త్రపువృద్ధి ౧౦; సీసవృద్ధి ౧౦; రసవృద్ధి ౬; వ్రీహివృద్ధి ౧౯; శాలివృద్ధి ౧౭; కులుత్థవృద్ధి ౧౦; తిలవృద్ధి ౧౮; ముద్గవృద్ధి ౧౮; సర్షపవృద్ధి ౬; చణ ౬; చణకవృద్ధి ౬; గోధూమవృద్ధి ౧౭; కోద్రవవృద్ధి ౧౦; ప్రియంగువృద్ధి ౧౬; యావనాళవృద్ధి ౧౭; శ్యామాకవృద్ధి ౧౨; రాజమాషవృద్ధి ౮; నీవారవృద్ధి ౧౬; శింబిధాన్యవృద్ధి ౧౨; అతివృష్టి ౫; అనావృష్టి ౧౫; స్వచక్రభయము ౯; పరచక్రభయము ౩; విద్యుత్తు ౧౦; శిలాపాతము ౪; గర్జితము ౪; అండజములు ౪; స్వేదజములు ౯; ఉద్భిజ్జములు ౧౫; జరాయుజములు ౪; స్థావరములు ౧౪; జంగమములు ౪; ఇతర జీవరాసులు ౧౫.

## మేషసంక్రాంతికాలము-ఫలము

ఈ సంవత్సరమున చైత్ర కృష్ణ ౧౧ ఏకాదశి సోమవారము నాడు, తెల్లవారవరితిథియందు సూర్యోదయాది ఘ. ౩౯-౩౧ విఘటికలకు సూర్యుడు మేషరాశియందు ప్రవేశించును.

## కాలఫలము

శ్లో. రాత్రౌ చే న్మేషసంక్రాంతి స్సువృష్ట్యారోగ్య సంపదః.

## వారఫలము

శ్లో. సోమవారే సుభిక్షకృత్.

ఈ ఫలము ద్రవిడ గౌడదేశముల కెక్కువగా నుండును.

## ఆర్ద్రానక్షత్ర కాలము-ఫలము

ఈ సంవత్సరము అధికాషాఢ శుద్ధ సప్తమీ సోమవారము నాడు పూర్వఫల్గుని నక్షత్రమందు సిద్ధనామయోగము గరకరణమున సూర్యోదయాది ఘ ౨౭-౨౪ విఘటికలకు సూర్యు డార్ద్రానక్షత్రమున ప్రవేశించును.

| | |
|---|---|
| తిథిఫలము: | సప్తమ్యాం క్షేమ ముత్తమమ్. |
| వారఫలము: | సోమవారే సుభిక్షకృత్. |
| నక్షత్రఫలము: | భగర్క్షే శుభదః ప్రోక్తమ్. |
| యోగఫలము: | సిద్ధియోగే సుభిక్షకృత్. |
| కరణఫలము: | దుర్భిక్షం గరజాహ్వయే. |
| కాలఫలము: | దివార్ద్రా సస్యనాశాయ. |
| సంక్రాంతికే కాలఫలము | పూర్వాహ్ణకాలే జగతో విపత్తిః. |

### భరణ్యాది వహ్నిమండల ఫలం-అతివృష్టిః

### జ్యేష్ఠ శుక్ల ప్రతిపద్యుక్త-సోమవారఫలం

శ్లో. సుభిక్షం క్షేమ మారోగ్యం వృష్టిస్సస్యవివర్ధనీ,
ఆనందనిరతా ధాత్రీ జ్యేష్ఠాదౌ చేందువాసరే.

### ఆషాఢ శుక్ల పంచమీయుక్త సోమవారఫలం-అతివృష్టిః

### ఆషాఢ శుక్ల నవమీయుక్త స్వాతీనక్షత్రఫలం

శ్లో. ఆషాఢే శుక్లపక్షే తు నవమీ స్వాతిసంయుతా,
వాయుః స్వాత్రి సంవాతి భూమౌ బీజం న వాపయేత్.

### ఆషాఢ కృష్ణపక్షరోహిణీయుక్త తిథిఫలం

శ్లో. ఆషాఢే కృష్ణపక్షే తు దశమీ రోహిణీయుతా,
సర్వసస్యసమృద్ధిస్స్యాత్ దేశాదశ్యాం తు మధ్యమమ్.
ఈ కాలుసుఫలములు చాంద్రమానమున కెక్కు-వగా ఫలించును.

### కుజచారఫలము

వక్రము లేదు-జ్యేష్ఠ శుద్ధ లగాయతు నిజాషాఢ శు 3 లు వఱకు అంగారకుఁడు సింహరాశియందు సంచరించును. సంవత్సరారంభము నుండి సంవత్సరాంతమువఱకు కుజుఁడు పుష్యమీనక్షత్ర 3 తృతీయపాదము లగాయతు-ఉత్తరాభాద్రద్వితీయపాదమువఱకు బుజాగతిచే సంచారము చేయును.

శ్లో. సింహం గతే క్షితిసుతే యది సింహభాగే
రోషం నయే త్పృథివయకాల ఇవాంబురాశిమ్,
భీమేంద్రనీలసదృశం ఘనమేఘబృందం
ఖద్యోతకైః కృపణదాన మివాంబురాశిమ్.

శ్లో. చిత్రావిశాఖాసుహి వాంసు భేషు
విశ్వంధరాయా స్తనయః ప్రయాతః,
ధరాం సమస్తా ముదకప్రమగ్నా
ముదగ్ధకస్యాన్యులకేమః కరోతి.

శ్లో. యామ్యపార్శ్వ విశాఖాసు త్రిపూర్వేషు చ భూమిజః
కరోతి మహతీం వృష్టిం వారిపూర్ణా వసుంధరా.

శ్లో. స్వాతిమిత్రేంద్రకౌ బ్రాహ్మి ప్రాజాపత్యోత్తరేషు చ.
సంచరన్ బలవాన్ హంతి క్షేమ స్వంచ క్షితా పపి.

### బుధచారః—

| | |
|---|---|
| చైత్ర శు ౨ శ పశ్చాదుదయం | వైశాఖ శు ౬ పశ్చాదస్తమయం |
| వైశాఖ బ ౧౨ ప్రాగుదయం | జ్యేష్ఠ బ ౧౨ శ ప్రాగస్తమయం |
| నిజాషాఢ శు ౨ శు పశ్చాదుదయం | శ్రావణ శు ౫ పశ్చాదస్తమయం |
| శ్రావణకృష్ణ ౮ శ ప్రాగుదయం | భాద్రపద బ౧౨ ప్రాగస్తమయం |
| ఆశ్వయుజ బ౧౮ పో పశ్చాదుదయం | మార్గశీర్ష శు౨ పో పశ్చాదస్తమ |
| మార్గశీర్ష బ ౩ అ ప్రాగుదయం | పుష్య శు బ ౬ ప్రాగస్తమయం |
| మాఘ బ ౧౦ బు ప్రాగుదయం | ఫాల్గున బ ౧౪ పో పశ్చాదస్తమయం |

### బుధచారఫలము

శ్లో. ఆర్ద్రాదిపిత్ర్యభాంతేషు దృశ్యో యది చంద్రజః,
తదా దుర్భిక్షకలహా రోగాణాం చాపి వృద్ధికృత్.
పౌషాషాఢశ్రావణవైశాఖే ష్వింద్రుజ స్సమాఘేషు,
దృష్ట శ్శుభాయ జగతాం శుభఫలకృ త్త్వస్తగ శ్చేషు.
ఇషోర్జమాసయో ర్దృష్టి శ్శస్త్రదుర్భిక్షకారకః,
ఉదితః శశిజో న్యూనా మితరేషు శుభప్రదః.

### గురుచారము

గురువు ఈ సంవత్సరారంభమునుండి జ్యేష్ఠ బ ౧౧ లు వఱకు మిథునరాశియందును, అదిమొదలు కార్తిక శు ౭ వఱకు కర్కాటకరాశియందును, అదిమొదలు మార్గశీర్ష నవమివఱకు సింహరాశియందును, అదిమొదలు వత్సరాంతమువఱకు కటకరాశియందు వక్రత్వముచేతను సంచరించును.

శ్లో. సురేంద్రవంద్యే భువి యుగ్మరాశౌ
గతే క్షితీశాః కలహోత్సుకాస్స్యుః,
ఈతేర్భయం శస్త్రభయం నరాణాం
క్వచి త్ప్రవృత్తి రతి పయోధరాశ్చ.

శ్లో. బృహస్పతౌ కర్కటరాశిసంస్థే
గావశ్చ మేఘాశ్చ పయోధరాస్స్యుః,
సస్యాభివృద్ధిశ్చ ధరేద్ధరిత్రీ
సదా ద్విజాశ్చా ధ్వరతత్పరాస్స్యుః.

శ్లో. సింహరాశిగతే జీవే విస్యా భూసురసజ్జనాః,
అతివృష్టిర్వ్యాధిభయం నృపా యుద్ధే లయం యయుః.

### గురువు మూఁడురాసులయందును సంచరించు ఫలము

శ్లో. ఏకస్మిన్ వత్సరే జీవే రాశిత్రయ ముపాగతే,
తదా వసుంధరా కీర్ణా మహాస్థిస్థ స్తకోటిభిః.

### శుక్రచారఫలము

| | |
|---|---|
| నిజాషాఢ శు ౬ మంగళవారం | తూర్పున అస్తమించును. |
| ఆశ్వయుజ శు ౧౦లు | పడమర ఉదయించును. |
| పుష్యమీనక్షత్రమున | అస్తమించును. |
| స్వాతీనక్షత్రమున | ఉదయించును. |

శ్లో. రౌద్రభాది చతుర్కేషు ఉదయే చాస్తగే భృగౌ,
విప్రపీడాః ప్రజాయంతే సస్యవృద్ధిః ప్రజాయతే.

శ్లో. స్వాతీత్రయే భృగో ర్వ్యక్తే రోధయే త్స్ర ప్రవర్షతి,
ఉదయాస్తమయే యాతి శుక్లపక్షే యదా భృగుః.
గజాశ్వరాజపుత్రాణాం శోణితం పిబతే మహీ,
ఉదయాస్తమయే యాతి కృష్ణపక్షే యదా సితః.
గజాశ్వరాజపుత్రాణాం వృద్ధిం చ కురుతే ఒవ్యహమ్.

## గ్రహణమాసఫలం

శ్లో. పుణ్యారూపాపజీవాశ్చ పాన్యశిల్పిలేఖకాః,
మోదంతే మంపవృష్టిస్సాన్యా గ్రహణే సతి చైత్రకే.

శ్లో. మాఘఫాల్గున చైత్రేషు జ్యేష్ఠ శ్రావణమాసయోః,
సర్వగ్రస్తోఽగ్ర్య ఇందురాస్య రాజరాష్ట్రవినాశకృత్.

## అయనఫలం

సౌమ్యాయనే విప్రభూపాన్ హంతి.

హస్తనక్షత్రమందు గ్రహణము సంభవించుటచే వాయవ్యమండలము-ఫలము.

శ్లో. వాయవ్యమండలే గ్రస్తే చోర రోగాగ్నిజం భయమ్,

## వర్ణఫలము

పాంశువిలోహితరూపః క్షత్రధ్వంసాయ భవతి వృష్టేశ్చ.

ఈగ్రహణము అర్ధరాత్రికిపూర్వము సంభవించుటచేత పూర్ణిమాప్రయుక్తమైన శ్రాద్ధములు పగలు రెండుజాములలోగా జరిగించవలసినది.

## కారికావృత్తౌ

శ్లో. యామార్ధ్వం మధ్యరాత్రౌ దర్శశ్చే
త్పూర్వం మధ్యాహ్నేచ కర్తవ్యమేవ.

నిత్యభోజనము, మూడుయామములలోపలగా చేయవలసినది.

శ్లో. చంద్రగ్రహే తుయామాన్ త్రీన్ బాలవృద్ధాతురైర్వినా,

కన్యా తులా ధనః కుంభ మీనరాశులయందు జనించినవారున్నూ, హస్త ఉత్తర చిత్త నక్షత్రములయందు జననమొందినవారున్నూ, ప్రకారాంతరముచే కన్యా తులా కుంభ మిథునరాశులయందు జననమొందినవారున్నూ శాంతి యథావిధిగా చేసికోవలసినది.

ప్రజోత్పత్తి సంవత్సర భాద్రపద శుద్ధ ౧౫ పూర్ణిమా శనివారమున ఉత్తరాభాద్రా నక్షత్రమున రాహుగ్రస్తమైన ఖచ్ఛన్న (సంపూర్ణ) చంద్రోపరాగము, పింగళవర్ణము.



| | ఘ. వి. | | ఘ. ని. |
|---|---|---|---|
| అస్తాది ఈశాన్య స్పర్శకాలము | ౧౩-౧౫ | రాత్రి | ౧౧-౧౮ |
| నైరృతినిమీలనకాలము | ౧౬-౧౪ | | ౧౨-౨౯ |
| మధ్యకాలము | ౧౮-౦ | | ౧-౧౨ |
| ఆగ్నేయోన్మీలనకాలము | ౧౯-౪౫ | | ౧-౫౪ |
| బింబాదర్శనకాలము | ౩-౩౦ | | ౧-౨౪ |
| వాయవ్యమోక్షకాలము | ౨౨-౪౨ | | ౩-౫ |
| ఆద్యంతపుణ్యకాలము | ౯-౨౩ | | ౩-౪౭ |

## గ్రహణమాసఫలము

శ్లో. కళింగ వంగ సౌవీర సౌరాష్ట్రమ్లేచ్ఛకాన్ నృపాన్,
హంతి రాహుస్సభస్యేచ యోషిద్గర్భవినాశనమ్.

## అయనఫలము

శ్లో. విట్ఛూద్రాన్ దక్షిణాయనే హంతి.

## వర్ణఫలము

శ్లో. పాంశువిలోహితరూపః క్షత్రధ్వంసాయ భవతి వృష్టేశ్చ.

## గ్రాసఫలము

సర్వగ్రస్తౌ చంద్రసూర్యౌ క్షుద్వ్యాధ్యగ్నిభయప్రదౌ.

ఈ గ్రహణము ఉత్తరాభాద్రానక్షత్రమున సంభవించుటచే వారుణమండలఫలము.

శ్లో. వారుణే సర్వజంతూనాం క్షేమం రాజ్ఞాం మహోత్సవమ్.

మీన-మేష-మిథున-సింహ-కన్యారాశులయందు జననమొందినవారున్నూ ప్రకారాంతరముగా మీన-ధను-సింహ-మేష రాశులయందు జననమొందినవారున్నూ శాంతి చేసికోవలసినది.

పూర్ణిమాప్రయుక్త శ్రాద్ధములు పగలు రెండుజాములలోపుగాను జరిగించుకోవలసినది.



ఈ సంవత్సర ఫాల్గున శు ౧౫ పూర్ణిమా మంగళవారమున ఉత్తర ఫల్గునీ నక్షత్రమున కేతుగ్రస్తమైన ముఖ్యగ్రాసోదయమను పేరుగల చంద్రగ్రహణము ౧౫ వీసములపైని గ్రహణము-కృష్ణవర్ణము.

| | ఘ. వి. | | ఘ. ని. |
|---|---|---|---|
| సూర్యోదయాది ఆగ్నేయ స్పర్శకాలము | ౨౫-౫౯ | రాత్రి | ౪-౭౩ |
| మధ్యకాలము | ౨౯-౫౧ | | ౫-౫౬ |
| వాయవ్యమోక్షకాలము | ౩౩-౪౩ | | ౭-౨౭ |
| ఆద్యంతపుణ్యకాలము | ౭-౪౪ | | ౩-౬ |

## గ్రహణమాసఫలము

శ్లో. పీడాకరం ఫాల్గున మాసి పర్వం
వంగాంగకాశ్మీరక మేఖలానామ్,
నృత్తజ్ఞసస్యప్రథితాంగనానాం
ధనుష్కరక్షేత్ర తపస్వినాంచ.

## అయనఫలము

సౌమ్యాయనే విప్రభూపాన్ హంతి.

## వాయవ్యమండలఫలము

శ్లో. వాయవ్యమండలే గ్రస్తే చోరరోగాగ్నిజం భయమ్.

## వర్ణఫలము

శ్లో. చంద్రసూర్యోపరాగేషు కృష్ణపక్షేన పంయుతా;
పూర్వారిష్టం వవర్షేణ అతివృష్టిర్నిరంతరమ్.

ఈ గ్రహణమునకు పూర్ణిమాప్రయుక్త శ్రాద్ధములు రాత్రి మోక్షానంతరము చేయవలసినది. నిత్యభోజనమున్నూ రాత్రియందే చేయవలెనది. పగలు చేయంగూడదు. పతిహీన స్త్రీ కర్తృక శ్రాద్ధములు ఈ రోజున ఉపవసించి మరునాడు చేయవలసినది.

శ్లో. గ్రస్తే చంద్రే తూదితే తస్య ముక్తిం
దృష్ట్వా తత్ర శ్రాద్ధమన్నేన కార్యం-ఇతి కాలికాస్మృతౌ.

కన్యా తులా వృశ్చిక కుంభ మీన రాసులయందు జనన మొందిన వారును ఉత్తర-పూర్వఫల్గుని-హస్త నక్షత్రములయందు జనన మొందిన వారును, ప్రకారాంతముగా కన్యా తులా కుంభ-మిథున రాసులయందు జనన మొందినవారును శాంతి యథావిధిగా చేసికోవలసినది.

## కందాయములు

| అశ్వ | భ | కృ | రో | మృ | ఆర్ద్ర | పున | పుష్య | ఆశ్రే | మఖ |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ౧ | ౪ | ౭ | ౨ | ౫ | ౦ | ౩ | ౬ | ౧ | ౪ |
| ౨ | ౦ | ౧ | ౨ | ౧ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ |
| ౩ | ౪ | ౪ | ౨ | ౦ | ౩ | ౧ | ౪ | ౨ | ౦ |

| పూఫ | ఉఫ | హ | చి | స్వా | వి | అనూ | జ్యే | మూ |
|---|---|---|---|---|---|---|---|---|
| ౭ | ౨ | ౫ | ౦ | ౩ | ౬ | ౧ | ౪ | ౭ |
| ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ |
| ౭ | ౧ | ౪ | ౨ | ౦ | ౩ | ౧ | ౪ | ౨ |

| పూషా | ఉషా | శ్ర | ధని | శత | పూభా | ఉభా | రేవ |
|---|---|---|---|---|---|---|---|
| ౨ | ౧ | ౧ | ౩ | ౬ | ౧ | ౪ | ౭ |
| ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ |
| ౦ | ౩ | ౧ | ౪ | ౨ | ౦ | ౩ | ౧ |

శ్లో. ఆదిశూన్యే మహావ్యాధి ర్మధ్యశూన్యే మనోవ్యథా,
అంత్యశూన్యే ఫలం స్వల్పం త్రిశూన్యే నిష్ఫలం భవేత్.

శ్లో. నిమ మేష్యర్ధలాభస్స్యాత్ స్సమే తు సమతా భవేత్,
శూన్యే శూన్యస్యహాపోతి కందాయఫలమీదృశమ్.

## ఆదాయవ్యయములు

| | ఆ. | వ్య. | | ఆ. | వ్య. |
|---|---|---|---|---|---|
| మేష వృశ్చికములకు | ౨ | ౮ | ధనుర్మీనములకు | ౫ | ౧౪ |
| వృషభ తులలకు | ౧౧ | ౧౪ | మకరకుంభములకు | ౮ | ౮ |
| మిథునకన్యలకు | ౧౪ | ౧౧ | | | |
| కర్కాటకమునకు | ౮ | ౧౧ | సర్వాదాయము | | ౫౯ |
| సింహమునకు | ౧౧ | ౫ | సర్వవ్యయము | | ౭౧ |

## రాజపూజ్యావమానములు

| | పూ. | అ. | | పూ. | అ. |
|---|---|---|---|---|---|
| మేషమునకు | ౧ | ౭ | తులకు | ౫ | ౬ |
| వృషభమునకు | ౪ | ౭ | వృశ్చికమునకు | ౧ | ౨ |
| మిథునమునకు | ౭ | ౭ | ధనస్సునకు | ౪ | ౨ |
| కర్కాటకమునకు | ౩ | ౩ | మకరమునకు | ౭ | ౨ |
| సింహమునకు | ౬ | ౩ | కుంభమునకు | ౬ | ౫ |
| కన్యకు | ౨ | ౬ | మీనమునకు | ౩ | ౫ |

## సంవత్సరఫలములు

| | | |
|---|---|---|
| అశ్విని, పుష్యమి, స్వాతి, అభిజిత్తు | ఈనక్షత్రములకు | రాజపూజ్యత |
| భరణి, ఆశ్రేష, విశాఖ, శ్రవణం | ,, | యుద్ధము |
| కృత్తిక, మఖ, అనూరాధ, ధనిష్ఠ | ,, | భూమినాశము |
| రోహిణి, పుబ్బ, జ్యేష్ఠ, శతభిషం | ,, | మనస్తాపము |
| మృగశిర, ఉత్తర, మూల, పూర్వాభాద్ర | ,, | ఆయుష్యము |
| ఆర్ద్ర, హస్త, పూర్వాషాఢ, ఉత్తరాభాద్ర | ,, | అర్థలాభము |
| పునర్వసు, చిత్త, ఉత్తరాషాఢ, రేవతి | ,, | రోగము |

## వెలల హెచ్చుతగ్గులు

చాంద్రమానము ననుసరించి

చైత్ర, అధికాషాఢ, నిజాషాఢ, శ్రావణ, భాద్రపద, కార్తిక, మార్గశిర, పుష్యమాసములయందు వెలలు సమముగ నుండును.

వైశాఖ, మాఘ మాసములయందు వెలలు తక్కువగ నుండును.

జ్యేష్ఠ, ఫాల్గున మాసములయందు వెలలు హెచ్చుగా నుండును.

సౌరమానము ననుసరించి

మేష, మిథున, మకర, మీనమాసములయందు వెలలు సమముగ నుండును.

వృషభకర్కాటకమాసములయందు వెలలు తక్కువగ నుండును.

సింహ, కన్యా, తులా, వృశ్చిక, ధనుః, కుంభ మాసములయందు వెలలు హెచ్చుగ నుండును.

## వర్షయోగములు-తద్భంగములు

### చైత్రమాసము

ఈ మాసమున గ్రహములు దుష్టనాడులయందును, సునాడులయందును, ఉండుటచే స్వల్పవృష్టియు, ఉష్ణాధిక్యమును గలుగును.

### వైశాఖమాసము

ఈ మాసమున గ్రహసంచారాదులవల్ల కొలదిగా వర్షమును స్వల్పవర్షము పడమరగాలి యొక్కువగా కలుగుటయు కలుగును.

## జ్యేష్ఠమాసము

ఈమాసమునందు గ్రహములలో ఎక్కువమంది వాత, అతివాత దహనాది దుష్టనాడులయందు సంచరించుటచేత పశ్చిమ వాయువును, ఉష్ణాధిక్యమును విశేషముగాఁ గలిగి బుధశుక్రసమాగమాది సుయోగములవలన ఖండవృష్టి గలుగును.

## ఆషాఢమాసములు

జ్యేష్ఠ బహుళాష్టమి మొదలు అధికాషాఢ శు సప్తమివఱకు సూర్యుని మృగశిరానక్షత్రసంచారకాలమునందు రవ్యాదిగ్రహము లన్నియు దుష్టనాడీసంచారముచేత పశ్చిమవాయువును, ఉష్ణాధిక్యమును గలుగును.

అధికాషాఢ శు ౭ లు మొదలు బ షష్ఠివఱకు సూర్యుని యొక్క ఆర్ద్రానక్షత్ర సంచారకాలమునందు సూర్యుఁడు పూర్ణజలరాశియందు శ్రీ నక్షత్రమునందు ప్రవేశించుటచేతను బుధశుక్రుల మధ్య రవి నడచుటచేతను గ్రహములు దుష్టనాడులయందు సంచరించినప్పటికిని అప్పటప్పట సామాన్యముగా వర్షించును. అధికాషాఢ బ ౬ షష్ఠి మొదలు నిజాషాఢ శుక్ల పంచమివఱకు పునర్వసు నక్షత్ర రవి సంచారకాలమునందు గురుర్వస్తమయము, గురు బుధ చంద్ర సమాగము మొదలుగాఁగల సుయోగములు గలుగుటచే సింహాంగారకాది, పురోంగారకాది స్వల్పదోషము లున్నప్పటికిని విశేషముగా వర్షము కురిసి నదులు బాగుగా ప్రవహించును.

నిజాషాఢశుక్ల పంచమి మొదలు బహుళపంచమివఱకును సూర్యునియొక్క పుష్యమీనక్షత్రసంచారకాలమునందు గ్రహములన్నియు సునాడులయం దుండుటచే సామాన్యముగా వర్షించును.

నిజాషాఢ శు ౧౪ లు మొదలు బ ౫ లు వఱకు గురుశుక్రులు ఏకరాశిగతు లగుటచే బాగుగా వర్షించును. నిజాషాఢబహుళ పంచమి మొదలు శ్రావణశుద్ధనవమివఱకు ఆశ్రేషానక్షత్రమునందు సూర్యునియొక్క సంచారకాలమునందు ఖండవృష్టిగా మం[illegible] లు కురియును.

## శ్రావణమాసము

శ్రావణశుద్ధ నవమి మొదలు బహుళనవమీపర్యంతము సూర్యుని యొక్క మఘానక్షత్ర సంచారకాలమునందు సూర్యుఁడు శ్రీ నక్షత్రయుక్తుఁడై నిర్జలరాశియందు ప్రవేశించుటచేతను, పురోంగారకాదిత్రావయోగములవల్లనను వర్షాభావము కొంతకలిగి యున్నప్పటికిని చిత్రానక్షత్రమునందు కుజసంచారమును, గ్రహములకు జలనాడీసంచారాదిసుయోగములవల్లను సస్యానుకూలముగ వర్షించును.

శ్రావణ బహుళనవమి మొదలు భాద్రపద శు ౧ లు వఱకు సూర్యునియొక్క పుబ్బానక్షత్ర సంచారకాలమునందు శ్రీ పుంనక్షత్రయుక్తుఁడై నిర్జలరాశియందు ప్రవేశించుటచేతను అంగారకదోషమువల్లను రవి బుధ గురువులుమాత్రము జలనాడులయం దుండుటచేతను జూరంధ్రకాలమున బాగుగా వర్షించును. వాయువుతోఁ గూడి వర్షించును.

## భాద్రపదమాసము

భాద్రపద శు ౧ మొదలు బ ౧ పర్యంతము సూర్యునియొక్క ఉత్తరానక్షత్ర సంచారకాలమునందు బుధ శుక్ర సమాగమాది సుయోగములవల్ల సస్యానుకూలముగ వర్షించును.

భాద్రపద బ ౧ లు లగాయతు ఈ బ ౧౪ వఱకు సూర్యుని యొక్క హస్తానక్షత్ర సంచారకాలమునందు విశాఖయందు కుజుఁడుండుటచేతను రవి బుధ గురువులు జలనాడులయందుండుటచేతను, ఇతర గ్రహములు దుష్టనాడులయందు ఉన్నప్పటికిని రవి శ్రీ పుంనక్షత్రయుక్తుఁడై పూర్ణజలరాశియందు ప్రవేశించుటచేత కొంచెము వాయువుతోఁ గూడి సంపూర్ణమైనవృష్టి గలుగును.

## ఆశ్వయుజమాసము

భాద్రపద బహుళ ౧౪ మొదలు ఆశ్వయుజ శుద్ధ ౧౩ పర్యంతము సూర్యునియొక్క చిత్రా నక్షత్ర సంచారకాలమునందు చతుర్గ్రహ కూటము గలుగుటచేతనున్ను గ్రహములన్నియు దుష్టనాడులయం దుండుటచేతనున్ను మధ్యవృష్టి కలుగును.

ఆశ్వయుజ శు ౧౩ మొదలు ఈ బ ౧౧ పర్యంతము సూర్యుని యొక్క స్వాతీనక్షత్రసంచారకాలమునందు వాయుసహితమైన వర్షము సస్యానుకూలముగా కురియును.

## కార్తికమాసము

ఆశ్వయుజ బ ౧౧ మొదలు కార్తిక శు ౧౧ వఱకు సూర్యుని యొక్క విశాఖానక్షత్ర సంచారకాలమునందు సామాన్యవృష్టి గలుగును. అనూరాధామాలాంతమువఱకు సూర్యుఁడు సంచరించు కాలమునందు మధ్యదేశమునందు స్వల్పవృష్టి కలుగును.

## దేశారిష్టయోగములు

ఈ సంవత్సరమున గురుఁడు మూఁడు రాసులయందు సంచరించుటచేతను, కుజగురువులకు శనిగురువులకు షష్ఠాష్టక సమసప్తకాది దోషములు గలుగుటచేతను లోకమునకు అరిష్టము కలుగును.

## పంచాంగశ్రవణఫలము

యశ్శృణోతి మధుశుక్లపక్షకే వర్షవాహసచివాధికంఫలమ్; ప్రాప్నుయా ద్దురితముక్తవిగ్రహః ఆయురర్థ మతులం యశస్సుఖమ్. కన్యాసనీ కాంచనకిర్గజానాం గవాం సహస్రం పరితం ద్విజేభ్యః; దత్వా ఫలం యల్లభతే మనుష్య స్తత్తత్ఫలా న్యబ్దఫలాని శ్రుత్వా.

రాజా మంత్రీ సస్యనాథో రసానా
మీశస్సార్ధం స్వామినో నీరసానామ్;
అర్ఘాధీశః కించ మేఘాధినాథో
ద్యు శ్శ్రేణియ శ్శృణ్వతాం తత్ఫలాని.

## రామానుజీయ శ్రీవైష్ణవ తిరునక్షత్రములు

| | | | | |
|---|---|---|---|---|
| చిత్రి | అశ్విని | మేషమాసము | వడుగనంబి తిరునక్షత్రము | |
| | కృత్తిక | ,, | ఉయ్యకొండార్ | ,, |
| | ఆర్ద్ర | ,, | ఎంబెరుమానార్ | ,, |
| | పునర్వసు | ,, | ముదలియాండాన్ | ,, |
| | ,, | ,, | చక్రవర్తితిరుమగనార్ | ,, |
| | చిత్త | ,, | మధురకవుల | ,, |
| | హస్త | ,, | దేవప్పెరుమాళ్ | ,, |
| వైయాశి | స్వాతి | వృషభమాసము | అరగసింగర్ | ,, |
| | ,, | ,, | పెరియతిరుమలనంబి | ,, |
| | విశాఖ | ,, | నమ్మాళ్వార్ | ,, |
| | అనూరాధ | ,, | పెరియభట్టర్ | ,, |
| ఆని | స్వాతి | మిథునమాసము | పెరియాళ్వార్ | ,, |
| | అనూరాధ | ,, | నాథమునుల | ,, |
| ఆడి | పూర్వఫల్గుని | కటకమాసము | శ్రీ ఆండాళ్ | ,, |
| | ,, | ,, | యదుగిరినాచ్చియార్ | ,, |
| | ఉత్తరాషాఢ | ,, | ఆళవందారు | ,, |
| | ,, | ,, | పుండరీకాక్ష | ,, |
| ఆవణి | రోహిణి | సింహమాసము | శ్రీ కణ్ణన్ | ,, |
| పెరటాశి | విశాఖ | కన్యామాసము | తిరుమలనంబి | ,, |
| | శ్రవణము | ,, | వేదాంతదేశికుల | ,, |
| | ,, | ,, | తిరువేంకడముడైయాన్ | ,, |
| అర్పిశి | కృత్తిక | తులామాసము | కూరకులోత్తమదాసర్ | ,, |
| | మూల | ,, | మనవాళమహామునుల | ,, |
| | పూర్వాషాఢ | ,, | సేనముదలియాళ్వార్ | ,, |
| | శ్రవణం | ,, | పొయిగైయాళ్వార్ | ,, |
| | ,, | ,, | పిళ్ళైలోకాచార్యర్ | ,, |
| | ధనిష్ఠ | ,, | పూదత్తాళ్వార్ | ,, |
| | శతభిషము | ,, | పేయాళ్వార్ | ,, |
| కార్తికై | కృత్తిక | వృశ్చికమాసము | తిరుమంగైయాళ్వార్ | ,, |
| | ,, | ,, | నంబిళ్లైగారి | ,, |
| | రోహిణి | ,, | తిరుప్పాణియాళ్వార్ | ,, |
| మార్గళి | జ్యేష్ఠ | ధనుర్మాసము | తొండరడిప్పొడియాళ్వార్ | |
| | ,, | ,, | పెరియనంబి | ,, |
| తై | పునర్వసు | మకరమాసము | యంబార్ | ,, |
| | మఖ | ,, | తిరుమడిశైయాళ్వార్ | ,, |
| | హస్త | ,, | కూరత్తాళ్వార్ | ,, |
| మాశి | మృగశిర | కుంభమాసము | తిరుకచ్చినంబి | ,, |
| | పునర్వసు | ,, | కులశేఖరాళ్వార్ | ,, |
| | రోహిణి | ,, | నంబెరుమాళ్ | ,, |
| పంగుని | పుష్యమి | మీనమాసము | యతిరాజసంపత్కుమారర్ | ,, |
| | ఉత్తర | ,, | శ్రీరంగనాచ్చియార్ | ,, |
| | రేవతి | మేషమాసము | పెరియ పెరుమాళ్ | ,, |

వైశాఖ శు ౫ వైఖానసానాం శ్రీనివాససుధీవేదాంత తిరునక్షత్రం.
మాఘ శు ౧౨ వైఖానసానాం శ్రీరామజన్మోత్సవం.
శ్రావణ శు ౧౫ మంగళవారం వైఖానసానాం విఖనసాచార్య తిరునక్షత్రం.
ఆషాఢ శు౧౪ శనివారం వైఖానసానాం చూట్టకుడుతినాచ్చారు తిరునక్షత్రం.

## శ్రీమాధ్వ పుణ్యదినములు

చైత్రశు. ౨ వేదవ్యాసతీర్థుల పుణ్యదినము
శు. ౬ కవీంద్రతీర్థుల ,,
౧౩ సత్యవ్రతతీర్థుల ,,
బ. ౩ వాగీశతీర్థుల ,,
బ. ౧౩ సత్యవిజయతీర్థుల ,,
వైశాఖ శు ౩ విద్యాధిరాజతీర్థుల ,,
జ్యేష్ఠ శు. ౩ సత్యసంధతీర్థుల ,,
బ. ౨ సత్యపూర్ణతీర్థుల ,,
బ. ౩ రఘువర్యతీర్థుల ,,
ఆషాఢ శు. ౯ సత్యాధిరాజతీర్థుల ,,
బ. ౫ శ్రీజయతీర్థుల ,,
శ్రావణ శు. ౧ రాఘవేంద్రతీర్థుల ,,
శు. ౮ సత్యవరతీర్థుల ,,
భాద్రపదశు.౧౦ సత్యేష్టకామతీర్థుల ,,
బ. ౩౦ మాధవతీర్థుల ,,
ఆశ్వయుజశు. ౭ సత్యపరాయణతీర్థుల ,,
కార్తిక శు. ౧౦ సత్యవరతీర్థుల ,,
శు. ౧౧ వేదనిధితీర్థుల ,,
బ ౭ విద్యానిధితీర్థుల ,,
బ. ౧౪ పద్మనాభతీర్థుల ,,
మార్గశిర శు. ౧౧ సత్యనిధితీర్థుల ,,
శు. ౧౨ రఘునాథతీర్థుల ,,
పుష్య శు. ౧౨ రఘూత్తమతీర్థుల ,,
బ. ౬ సత్యకామతీర్థుల ,,
బ. ౮ నరహరితీర్థుల ,,
బ. ౧౪ విద్యాధీశతీర్థుల ,,
బ. ౩౦ పురందరదాసతీర్థుల ,,
మాఘశు. ౯ (మధ్వనవమి) ఆనందతీర్థ ,,
ఫాల్గున శు. ౨ సత్యబోధతీర్థుల ,,
శు. ౪ వ్యాసరాజస్వాముల ,,
శు. ౬ సత్యవ్రతతీర్థుల ,,

## ప్రసూతిశాంతి నక్షత్రములు

| | |
|---|---|
| ఉత్తర (పా. ౧) | ఆశ్లేష (పా. ౪) |
| పుష్యమి (పా. ౨, ౩) | మఖ (పా. ౧) |
| పూర్వాషాఢ (పా. ౩) | రేవతి (పా. ౪) |
| చిత్త (పా. ౧, ౨) | అశ్విని (పా. ౧) |

జ్యేష్ఠ, మూల ఈ నక్షత్రములయందును, తండ్రి యొక్క జన్మనక్షత్రములయందును శిశువులు పుట్టినచో శాంతిచేయవలెను.

## శంకుస్థాపనాది ముహూర్తములకు శుభమైన తిథి వార నక్షత్రములను తెలియజేయు చక్రము

| ముహూర్తముల పేరు | తిథులు | వారములు | నక్షత్రములు | లగ్నములు | విశేషవిధులు |
|---|---|---|---|---|---|
| శంకుస్థాపనము | ౩-౫-౭-౧౧-౧౩ | బు-గు-శు | రో-మృ-హ-రే-అనూ-ఉ.భ-పుష్య-శ్ర-పున-ధ-శ-అశ్వి-స్వా | వృ-కర్కా-కుం-మీ | చతుర్థశుద్ధి |
| గృహప్రవేశము | ౨-౩-౫-౭-౧౦-౧౩-౧౫ | సో-బు-గు-శు | అశ్వి-రో-మృ-పున-పుష్య-ఉ.భ-స్వాతి-అనూ-శ్ర-ధ-శత | వృష-సింహ-వృశ్చి-కుం-మీ-క-ధ-మి. | అష్టమ,ద్వాదశశుద్ధి |
| వివాహము | ౨-౩-౫-౭-౧౦ | సో-బు-గు-శు | అశ్వి-రో-ఉ.భ-హ-స్వా-అనూ-మూల-ఉ.షా-శ్ర-శత-ఉ.భా | వృ-మి-కర్కా-సిం-తు-ధను-కుం-మీ | లగ్నశుద్ధి |
| గర్భాధానము | ౨-౩-౫-౭-౧౦ | సో-బు-గు-శు | రో-ఉ.భ-హ-స్వాతి-అనూ-ఉ.షా-శ్రవ-శత-ఉ.భా-ధని-మృగ | వృ-మి-క-సిం-తు-ధను-కుంభ | లగ్నశుద్ధి-సప్తమమందుం పాపగ్రహములు లేకుండుట-పర్వవర్జము |
| పుంసవనము | ౨-౩-౫-౭-౧౦-౧౩-౧౫ | సో-బు-గు-శు | అశ్వి-రో-మృగ-పున-పుష్య-ఉ.భ-హ-చి-స్వా-అనూ-మూల-ఉ.షా-శ్రవ-ధ-శత-ఉ.భా-రే | మే-ధ-మి-మీ | నవమశుద్ధి-మూడవ మాసము |
| సీమంతము | ౨-౩-౫-౭-౧౦-౧౩-౧౫ | ఆ-మం-గు | అశ్వి-రో-మృ-పున-పుష్య-ఉ.భ-హ-చి-స్వా-అను-మూ-ఉ.షా-శ్ర-ధ-శ-ఉ.భా-రే | మే-ధ-మీ | ౬-౮-మాసములు-నవమశుద్ధి |
| జాతకర్మ | ౨-౩-౫-౭-౧౦-౧౩ | సో-బు-గు-శు | రో-ఉ.భా-ఉ.షా-స్వా-పున-శ్ర-ధని-శత-అశ్వి-హస్త-పుష్య-అనూ | వృష-తు-మి-క-ధ-మీన-కటక | అష్టమశుద్ధి |
| నామకరణము | ౨-౩-౫-౭-౧౦-౧౩ | సో-బు-గు-శు | అశ్వి-రో-ఉ.భ-ఉ.షా-ఉ.భా-స్వా-పున-శ్ర-ధ-శ-మూ-హస్త-పుష్య-అనూ | వృ-తు-మి-కన్యా-ధను-మీన-కటక | అష్టమశుద్ధి |
| డోలారోహణము | ౨-౩-౫-౭-౧౦-౧౩ | సో-బు-గు-శు | అశ్వి-రో-మృ-ఉ.భ-ఉ.షా-ఉ.భా-పున-హ-చి-స్వాతి-వి-అనూ | వృ-మి-కర్కా-కన్య-తు-ధను-మీ | ౧-౩-౫ మాసములు శుభము-అష్టమశుద్ధి |
| అన్నప్రాశనము | ౨-౩-౫-౭-౧౦-౧౩ | సో-బు-గు-శు | అశ్వి-రో-మృ-పున-పుష్య-ఉ.భ-ఉ.షా-ఉ.భా-హ-చి-స్వా-అనూ-శ్ర-ధ-శత-రే | వృ-మి-కర్కా-క-తు-ధను-మీ | పురుషులకు-౬-౮-౧౦ మాసములు, స్త్రీలకు ౫-౭-౯-మాసములు, శుభము. దశమశుద్ధి,లగ్నమందు పాపగ్రహములు లేకుండుట |
| కర్ణవేధ | ౨-౩-౫-౭-౧౦ | సో-బు-గు-శు | అశ్వి-మృ-పుష్య-హ-చి-స్వాతి-అనూ-శ్ర-ధ-శ-రే-ఆర్ద్ర-ఉ.భ-ఉ.షా-ఉ.భా | వృ-మి-కర్కా-క-తు-ధ-మ | ౬-౮ మాసములయందు శుభము-అష్టమశుద్ధి |
| కేశఖండనము | ౨-౩-౫-౭-౧౦ | సో-బు-గు-శు | అశ్వి-మృ-పున-పుష్య-హ-చి-స్వా-శ్ర-ధ-శ-రేవతి | వృ-మి-కర్కా-క-తు-ధ-మీ | ఉత్తరాయణం-పూర్వాహ్ణము |
| అక్షరస్వీకారము | ౨-౩-౫-౭-౧౦ | సో-బు-గు-శు | అశ్వి-పున-పుష్య-హ-చిత్త-అనూ-శ్ర-స-రేవతి | మే-కర్కా-తు-మ | ఉత్తరాయణం, ౫-వ సం అష్టమశుద్ధి, సూర్యుడు చరస్థిరరాసులయం దుండగా |
| విద్యారంభము | ౨-౩-౫-౭-౧౦-౧౨-౧౩ | ఆ-సో-బు-గు-శు | అశ్వి-మృ-ఆర్ద్ర-పున-పుష్య-ఆశ్లే-పూ.ఫ-పూ.షా-పూ.భా-హ-చి-స్వా-అమా-మూల | మే-కర్కా-తు-మ | అనధ్యయనములను విడిచిపెట్టవలెను. శస్త్రవిద్యాభ్యాసమునకు-ఆది-మంగళవారములు-శుభము |
| ఉపనయనము | ౨-౩-౫-౭-౧౦ | బు-గు-శు | అశ్వి-రో-మృ-పున-పుష్య-ఉ.భ-ఉ.షా-ఉ.భా-హ-చి-స్వా-శ్రవ-ధ-శత | పాపగ్రహములు కేంద్రమందు లేకుండ నుండు లగ్నము | అష్టమశుద్ధి-లగ్నమందు పాపగ్రహములు లేకుండుట-పూర్వాహ్ణము |

| ముహూర్తములు | తిథులు | వారములు | నక్షత్రములు | లగ్నములు | విశేషవిధులు |
|---|---|---|---|---|---|
| వివాహము | ౨-౩-౫-౭-౧౦-౧౩ | బు-గు-శు | రో-మృ-మ-స్వా-హ-అనూ-శ్ర-రే-ఉఫ-ఉషా-ఉభా-మూల | వృ-మి-కర్కా-కన్య-తు-ధను-మీన-మే | సప్తమశుద్ధి |
| కర్ణధారణము | ౨-౬-౫-౧౨-౧౩ | సో-బు-గు-శు | అశ్వి-పున-పుష్య-ఉఫ-ఉషా-ఉభా-హస్త-చి-స్వా-అనూ-శ్ర-రే | వృ-మీ-కర్కా-క-తుల-మ-కుం-ధ | పూర్వాహ్ణమందు శుభము |
| నవవస్త్రధారణము | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩ | బు-గు-శు | అశ్వి-ఉఫ-ఉషా-ఉభా-హ-చిత్త-స్వా-అనూ-శ్ర-ధ-శత-రే | వృ-మి-కర్కా-క-తు-ధ-మీ-మ-కుం | తృతీయశుద్ధి |
| ప్రయాణము | ౨-౩-౫-౭-౧౦-౧౩ | సో-బు-గు-శు | మృ-అశ్వి-పుష్య-పున-హ-అనూ-శ్ర-మూల-ధ-రే | మే-వృ-కర్కా-తు-ధను-మీనం-మకరం | సంధిశుద్ధి-వారశూల-తిథిశూల-నక్షత్రశూలలుకల దిక్కులు వదలిపెట్టవలెను |
| గృహారంభము | ౨-౩-౫-౭-౧౦-౧౩-౧౫ | సో-బు-గు-శు | అశ్వి-రో-పుష్య-ఉఫ-ఉషా-ఉభా-హ-అనూ-శ్ర-శత-ధ-రే | కర్కా-వృ-మీ-మ- | తూర్పు-ఈశాన్య-ఉత్తర దిక్కులయందు ఉత్తమము |
| బీజావాపము | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩ | సో-బు-గు-శు | రో-హ-చి-స్వా-పున-పుష్యమి-ఉఫ-ఉషా-ఉభా-మూల-ధ-రే | వృ-మి-కర్కా-కన్య-తుల-ధను-మీనం | శుభగ్రహదృష్టిగల లగ్నము శుభమైనది |

ఈ ముహూర్తములకు ఏకవింశతి మహాదోషములు వదలిపెట్టవలెను. పంచకరహితముగ నుండవలెను. చంద్రతారాబలము లుండవలెను. పాపగ్రహములు అనగా రవి, చంద్ర, కుజ, రాహు, కేతు, క్షీణచంద్ర, పాపయుత బుధులు లగ్నమునకు ౩-౬-౧౧ స్థానములయందును, శుభగ్రహము లగు గురు, శుక్ర, పూర్ణచంద్రులు, పాపయుతుడు కాని బుధుడు, లగ్నమునకు ౧-౨-౪-౫-౭-౯-౧౦-౧౧ స్థానములయందును ఉండిన శుభము. చంద్రుడు పాపిష్ఠుడైనను, శుభుడైనను లగ్నమువందుండ కూడదు.

### పంచకమును దెలిసికొను పద్ధతి

శుక్లప్రతిపత్తు మొదలు తిథి సంఖ్యయును, ఆదివారము మొదలు వారసంఖ్యయును, అశ్విన్యాదిగా నక్షత్రసంఖ్యయును, మేషాదిగా లగ్నసంఖ్యయును కలిపి, తొమ్మిదిచే భాగించగా శేషము పంచకమనబడును. అందు ౧ మిగిలెనేని మృత్యుపంచకము, ౨ మిగిలెనేని అగ్నిపంచకము, ౪ మిగిలెనేని రాజపంచకము, ౬ మిగిలెనేని చోరపంచకము, ౮ మిగిలెనేని రోగపంచకము. శేష సంఖ్యలు నిష్పంచకములు (శుభమయినవి). మతాంతరము : తిథిసంఖ్య శుక్లపక్షములో శుక్లప్రతిపత్తు మొదలుకొనియు, కృష్ణపక్షములో కృష్ణప్రతిపత్తుమొదలుకొనియు గణించుట గలదు. మార్తాండగ్రంథకర్త గతతిథులను లగ్నసంఖ్యను కలిపి తొమ్మిదిచే భాగించగా శేషము ముందుచెప్పిన ప్రకారముగా చూచుకొనుట కూడ గలదు. ధ్రువకము కలుపుట శాస్త్రసమ్మతము కాదు.

### అమృత యోగములు

ఆ॥ రో-ఉత్తర-ఉషా-ఉభా-హస్త-రేవతి-శ్రవ-మూల
సో॥ మృగ-స్వాతి-రేవతి-పున-శ్రవ
మం॥ రోహి-మూల-అశ్వి-ఉఫ-ఉషా-ఉభా
బు॥ పూషా-పూఫ-పూభా-కృ-ఉఫ-ఉషా-ఉభా
గు॥ అశ్వి-పుష్య-స్వా-మ
శు॥ మూ-హ-రే-అనూ-స్వా-ఉఫ-ఉషా-ఉభా
శ॥ మ-స్వా-కృ-రో-శత

### మరణ యోగములు

ఆ॥ అనూ-జ్యే-మ-విశా-ధని
సో॥ విశా-కృ-మ-పూభా-ఉషా
మం॥ శత-ఆర్ద్ర-విశా-పూభా
బు॥ ధని-మూల-రే-అశ్వి-హ
గు॥ మ-రో-శత-ఆర్ద్ర-విశా-పూఫ
శు॥ పుష్య-రో-జ్యే-శ-అశ్వి-మ
శ॥ ఉఫ-హ-చి-ఉషా-పూభా-ఉభా-రే

### రాహుకాల గుళికకాలములు

సూర్యోదయము 6 ఘంటలకు అయ్యే దివసములకు

| వారములు | రాహుకాలము మొదలు | రాహుకాలము వరకు | గుళికకాలము మొదలు | గుళికకాలము వరకు |
|---|---|---|---|---|
| ఆదివారము | $4\frac{1}{2}$ | 6 | 3 | $4\frac{1}{2}$ |
| సోమవారము | $7\frac{1}{2}$ | 9 | $1\frac{1}{2}$ | 3 |
| మంగళవారము | 3 | $4\frac{1}{2}$ | 12 | $1\frac{1}{2}$ |
| బుధవారము | 12 | $1\frac{1}{2}$ | $10\frac{1}{2}$ | 12 |
| గురువారము | $1\frac{1}{2}$ | 3 | 9 | $10\frac{1}{2}$ |
| శుక్రవారము | $10\frac{1}{2}$ | 12 | $7\frac{1}{2}$ | 9 |
| శనివారము | 9 | $10\frac{1}{2}$ | 6 | $7\frac{1}{2}$ |

## సూర్యునియొక్క ఉదయాస్తమయకాలములు

| నెల | తేది | ఉదయం ఘం | ఉదయం ని | అస్తం ఘం | అస్తం ని | నెల | తేది | ఉదయం ఘం | ఉదయం ని | అస్తం ఘం | అస్తం ని |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ౧౯౩౦ సం. ఏప్రిల్ | ౧ | ౬ | ౪ | ౬ | ౧౪ | అక్టోబరు | ౧ | ౫ | ౫౯ | ౫ | ౫౨ |
| | ౧౦ | ౫ | ౫౭ | ౬ | ౧౫ | | ౧౦ | ౬ | ౦ | ౫ | ౪౪ |
| | ౨౦ | ౫ | ౫౧ | ౬ | ౧౮ | | ౨౦ | ౬ | ౨ | ౫ | ౩౭ |
| | ౩౦ | ౫ | ౪౪ | ౬ | ౨౦ | | ౩౦ | ౬ | ౫ | ౫ | ౩౩ |
| మే | ౧ | ౫ | ౪౪ | ౬ | ౨౦ | నవంబరు | ౧ | ౬ | ౬ | ౫ | ౩౧ |
| | ౧౦ | ౫ | ౪౨ | ౬ | ౨౨ | | ౧౦ | ౬ | ౧౦ | ౫ | ౩౦ |
| | ౨౦ | ౫ | ౩౭ | ౬ | ౨౬ | | ౨౦ | ౬ | ౧౫ | ౫ | ౨౭ |
| | ౩౦ | ౫ | ౩౬ | ౬ | ౨౬ | | ౩౦ | ౬ | ౨౧ | ౫ | ౨౯ |
| జూన్ | ౧ | ౫ | ౩౬ | ౬ | ౩౦ | డిశంబరు | ౧ | ౬ | ౨౨ | ౫ | ౨౯ |
| | ౧౦ | ౫ | ౩౬ | ౬ | ౩౨ | | ౧౦ | ౬ | ౨౮ | ౫ | ౩౦ |
| | ౨౦ | ౫ | ౩౭ | ౬ | ౩౫ | | ౨౦ | ౬ | ౩౨ | ౫ | ౩౫ |
| | ౩౦ | ౫ | ౩౯ | ౬ | ౩౮ | | ౩౦ | ౬ | ౩౫ | ౫ | ౩౬ |
| జూలై | ౧ | ౫ | ౪౦ | ౬ | ౩౮ | జనవరి ౧౯౩౧ | ౧ | ౬ | ౩౧ | ౫ | ౪౬ |
| | ౧౦ | ౫ | ౪౨ | ౬ | ౩౮ | | ౧౦ | ౬ | ౩౫ | ౫ | ౫౫ |
| | ౨౦ | ౫ | ౪౬ | ౬ | ౩౬ | | ౨౦ | ౬ | ౩౮ | ౬ | ౦ |
| | ౩౦ | ౫ | ౪౭ | ౬ | ౩౨ | | ౩౦ | ౬ | ౩౭ | ౬ | ౫ |
| ఆగస్టు | ౧ | ౫ | ౪౯ | ౬ | ౩౧ | ఫిబ్రవరి | ౧ | ౬ | ౩౭ | ౬ | ౫ |
| | ౧౦ | ౫ | ౫౧ | ౬ | ౨౮ | | ౧౦ | ౬ | ౩౫ | ౬ | ౧౧ |
| | ౨౦ | ౫ | ౫౮ | ౬ | ౨౨ | | ౨౦ | ౬ | ౩౩ | ౬ | ౧౪ |
| | ౩౦ | ౫ | ౫౫ | ౬ | ౧౪ | | ౨౭ | ౬ | ౨౬ | ౬ | ౧౬ |
| సెప్టెంబరు | ౧ | ౫ | ౫౬ | ౬ | ౧౪ | మార్చి | ౧ | ౬ | ౨౬ | ౬ | ౭ |
| | ౧౦ | ౫ | ౫౬ | ౬ | ౭ | | ౧౦ | ౬ | ౧౬ | ౬ | ౧౦ |
| | ౨౦ | ౫ | ౫౮ | ౫ | ౫౬ | | ౨౦ | ౬ | ౧౨ | ౬ | ౧౨ |
| | ౩౦ | ౫ | ౫౭ | ౫ | ౫౨ | | ౩౦ | ౬ | ౫ | ౬ | ౧౪ |

## ఆనందాదియోగములు

| ఆది | సోమ | మం | బుధ | గురు | శుక్ర | శని | యోగములు | ఫలము |
|---|---|---|---|---|---|---|---|---|
| అశ్వి | మృ | ఆశ్లే | హ | అనూ | ఉషా | శ | ఆనందః | ద్రవ్యలాభము |
| భర | ఆ | మ | చి | జ్యే | అభి | పూ | కాలదండః | విఘ్నము |
| కృ | పున | పూ | స్వా | మూ | శ్ర | ఉభా | ధూమ్రాక్షః | హాని |
| రో | పు | ఉఫ | వి | పూషా | ధ | రే | ప్రజాపతిః | కార్యసిద్ధి |
| మృ | ఆ | హ | అ | ఉషా | శ | అశ్వి | సౌమ్యః | ధనవ్యయము |
| ఆ | మ | చి | జ్యే | అభి | పూ | భ | ధ్వాంక్షః | విఘ్నము |
| పున | పూఫ | స్వా | మూ | శ్ర | ఉభా | కృ | ధ్వజః | రాజ్యలాభము |
| పు | ఉఫ | వి | పూషా | ధ | రే | రో | శ్రీవత్సః | లక్ష్మీలాభము |
| ఆశ్లే | హ | అనూ | ఉషా | శత | అశ్వి | మృ | వజ్రః | కలహము |
| మ | చి | జ్యే | అభి | పూభా | భ | ఆ | ముద్గరః | మరణము |
| పూఫ | స్వా | మూ | శ్ర | ఉభా | కృ | పున | ఛత్రం | రాజ్యలాభము |
| ఉఫ | వి | పూ | ధ | రే | రో | పు | మిత్రం | కార్యసిద్ధి |
| హ | అనూ | ఉషా | శ | అశ్వి | మృ | ఆశ్లే | మానసః | శ్రీలాభము |
| చి | జ్యే | అభి | పూభా | భ | ఆ | మ | పద్మం | కార్యహాని |
| స్వా | మూ | శ్ర | ఉభా | కృ | పున | పూ | లంబం | భోజనలాభము |
| వి | పూషా | ధ | రే | రో | పు | ఉఫ | ఉత్పాతః | ద్రవ్యనాశము |
| అనూ | ఉషా | శత | అశ్వి | మృ | ఆశ్లే | హ | మృత్యుః | హాని |
| జ్యే | అభి | పూభా | భ | ఆ | మ | చి | కాలః | కార్యహాని |
| మూ | శ్ర | ఉభా | కృ | పున | పూ | స్వా | సిద్ధః | కార్యసిద్ధి |
| పూషా | ధ | రే | రో | పు | ఉఫ | వి | శుభం | శుభకార్యసిద్ధి |
| ఉషా | శ | అశ్వి | మృ | ఆశ్లే | హ | అనూ | అమృతం | శ్రీసంతోషము |
| అభి | పూ | భ | ఆ | మ | చి | జ్యే | ముసలం | భోజనహాని |
| శ్ర | ఉభా | కృ | పున | పూ | స్వా | మూ | గదా | ఆపదము |
| ధ | రే | రో | పు | ఉఫా | విశా | పూ | మాతంగః | స్వర్ణలాభము |
| శ | అశ్వి | మృ | ఆశ్లే | హ | అనూ | ఉషా | రాక్షసః | క్లేశము |
| పూభా | భ | ఆ | మ | చి | జ్యే | అభి | చరః | దుర్వార్తాశ్రవణము |
| ఉభా | కృ | పున | పూ | స్వా | మూ | శ్ర | స్థిరః | కార్యసిద్ధి |
| రే | రో | పు | ఉఫ | విశా | పూ | ధ | వర్ధమానః | అతిశయలాభము |

# మానవాదర్శ గ్రంథమండలివారి

## సుప్రసిద్ధ గ్రంథరాజములు

3 సంపుటములు 84 ప్రకరణములు **మానవ జీవితము** మొత్తం 2200 పుటలు

కొక్కొక్క సంపుటము స్టిఫ్‌బైండు **3-8-0** ఫుల్ క్యాలికో **4-0-0**

గ్రంథకర్త: బౌద్ధవాఙ్మయబ్రహ్మ దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు.

ప్రాక్కథనకర్త. సి. ఆర్. రెడ్డిగారు, పీఠికకర్త ప్రొఫెసరు, యస్. రాధాకృష్ణన్‌గారు.

ఇది తెలుగుభాషలో నేటివరకు వెలువడియుండని యొక్క బ్రహ్మాండమగు నైతిక సద్గ్రంథరాజము. ఈగ్రంథమును గూర్చి మేము చెప్పుకొనుటకంటె జగద్విఖ్యాతులగు పండితుల ప్రశంసావాక్యముల నుదహరించిన పాఠకులే స్వయముగ నీగ్రంథప్రాశస్త్యమును గ్రహింపగలరను తలంపుతో వారిప్రశంసావాక్యముల క్లుప్తముగ నీదిగువ పేర్కొనుచున్నాము.

"వాస్తవముగ నీగ్రంథమందలి విషయము, లక్ష్యము, పద్ధతి, శైలి, ఒకదానికొకటి మిన్నయైనట్టుగ ప్రశంసార్హములుగ నున్నవి."—యస్. రాధాకృష్ణన్‌గారు.

"ఇందు ప్రతిమనుష్యునకు అన్నికాలములందును అన్ని యవస్థలయందును, అన్ని పరిస్థితులయందును, యెట్టినడవడి వహింపవలయునో ఆధర్మమార్గములన్నియు విదగ్ధపూర్వకముగ నివేదింపబడియున్నవి. దీనిలో లేనినీతులు లేవు. నీతిమతబోధించి పెంపొందించు గ్రంథములలో దీనికి సమానమైనది నాకు దెలిసినట్టుగ నేభాషయందును లేదు"—కట్టమంచి రామలింగారెడ్డిగారు.

"ఇందు మానవజీవితము పాఠకమనుటకు ఎల్లమార్గములు ఉపాఖ్యానముల సహాయముగ వివరింపబడినవి. గ్రంథకర్తగారు గాంధీయుగమునందు కలిగినమార్పును చక్కగా నిరూపించిరి"—ఆంధ్రపత్రికా సంపాదకీయము.

"ఈగ్రంథమును విమర్శింప యావత్ లోకవిమర్శకులు లరుదని చెప్పవచ్చును."—రాయసం వెంకటశివుడుగారు.

"ఇందులో యెన్నో వున్నతాదర్శములు యెలుగెత్తి వర్ణింపబడి వున్నాయి. మానవజీవితమున కవసరమైన అన్ని విషయాలు చాలామట్టుకు వ్రాయబడి యున్నాయి"—భారతి.

ధర రు. **4-0-0** **బుద్ధపురాణము** **1300** పుటలు

గ్రంథకర్త: బౌద్ధవాఙ్మయబ్రహ్మ దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు.

ఇది ఆంధ్రములో కేవల మౌలిక గద్యగ్రంథరాజము. ఇందు బుద్ధుని సమగ్రమగు జీవితచరిత్రయు, బౌద్ధమతధర్మములును, విపులముగ వ్రాయబడి యున్నవి. ఈగ్రంథమును ప్రొఫెసరు యస్. రాధాకృష్ణన్, సి. ఆర్. రెడ్డిగారు మున్నగు30 మంది మహాపండితులు వేనోళ్ల బొగడి యున్నారు.

దర రు. **1-0-0** **ఆత్మవిజయము** **300** పుటలు

అనువాదకులు: బౌద్ధవాఙ్మయ బ్రహ్మ దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు

ఇందు మానవుని దైహిక మానసిక జీవితౌన్నత్యమునకు ముఖ్యసాధనములైన 14 విషయములు వివరింపబడియున్నవి.

ధర రు. **0-4-0** **శ్రీకృష్ణవేణువు** **60** పుటలు

ఇది శ్రీ వాస్వానీపండితునిచే వ్రాయబడిన గ్రంథమున కనువాదము.

## నిష్కామయోగము (భగవద్గీత)

ధర మిక్కిలి స్వల్పము కేవరుబైండు **0-6-0** స్టిఫ్ బైండు **0-8-0**

400 పేజీలు తృతీయ ముద్రణము

మూలగ్రంథకర్త: వ్యాఖ్యాత మహాత్మాగాంధి

అనువాదకులు: దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు.

ఇందు మూలశ్లోకములు, అర్థము, మహాత్ముని వ్యాఖ్యానము కలవు.

ఒక ముఖ్యసూచన:—బుద్ధపురాణ, మానవజీవిత సంపుటాభిప్రాయముల పుస్తకమును మానవజీవిత విషయసూచిక పుస్తకమును, కార్డువ్రాసిన పంపగలము. మానవజీవితము, మూడుసంపుటములు ఒకేసారి కొనిన 10-0-0 రూపాయలకు యివ్వబడును. గ్రంథాలయములకు, చందాదారులకు సంపుటము 1.కి 0-4-0 తగ్గించి యివ్వబడును. మాగ్రంథమండలి గ్రంథములన్నింటికి, ఆర్డరు యిచ్చువారు ముందు రెండురూపాయిలు అడ్వాన్సుగా పంపవలయును.

మానవాదర్శ గ్రంథమండలి, అంగలూరు, కృష్ణాజిల్లా.

# Lister

# లిస్టర్ "డీసెల్" ఇంజన్లు

## వర్టికల్ టైపు

సాలిడ్ ఇన్ జెక్షన్

4 స్ట్రోకులు

సైజులు, 5 మొదలు 38 బి. హెచ్. పి. వరకు గలవు



చేతితో చల్లదనము
నుండియే
ప్రారంభించవచ్చును
కార్ట్రిడ్జి
ఎలెక్ట్రిక్
ఇగ్నిషన్
లేక
లాంపులతో
అవస్యము లేదు

క్రూడు ఆయిల్‌తో
ప్రారంభించి నడుపవచ్చును
నూనె ఖర్చు
చాలతక్కువ.

ముఖ్య సంపకదార్ల చే
మద్రాసులో స్టాకు చేయబడినవి

**MASSEYS (1930) LTD**
**ENGINEERS**

(తపాల పెట్ట నెం. 60)

రాయపురం. మదరాసు.



ఓం

# ప్రస్తావన

శ్లో. ఓం నమః ప్రణవార్థాయ శుద్ధజ్ఞానైకమూర్తయే;
నిర్మలాయ ప్రసన్నాయ దక్షిణామూర్తయే నమః.

శ్రీమన్మహాదేవుని యాజ్ఞానుసారముగ ప్రవర్తమానంబగుచున్న బ్రహ్మాండప్రవృత్తియందు భూగోళమునం దొక చాంద్రమానాబ్దము గడచినది. దిక్కాలబద్ధమైన విశ్వప్రవృత్తియందు దిక్కాలప్రభావము గణనీయమైనను దిక్కాలాతీతుడైన విశ్వేశ్వరునియందు దిక్కాలప్రభావము నిరవధికముగ నున్నది. అనంతమైన కాలము, అఖండమైనవిశ్వము విశ్వేశ్వరుని లీలావిలాసములను పురుషార్థసిద్ధికి ఖండాఖండరూపములను ప్రత్యక్షము చేయుచున్నవి. అనంతమైన కాలచక్రమునం దొక సంవత్సరప్రవృత్తి అతిస్వల్పమైనను వ్యక్తివిషయములందు విశేషముగ గనుపట్టుచున్నది. పిపీలికాదిబ్రహ్మపర్యంతము వ్యాప్తమైన ప్రవృత్తియంతయును జననమరణములకు లోనగుచు కాలప్రభావమును పరిమితము చేయుచున్నది. జననమరణావృతమైన సంసారప్రవృత్తియందు పరబ్రహ్మమువలెనే పరమాణువును పరమానందము ననుభవించుచు జీవయాత్రను సార్థకము చేయుచున్నది. అవ్యక్తము మహదహంకారావృతమై వ్యక్తిరూపమును దాల్చుచు కాలప్రవాహమునకు బద్ధమగుచున్నది. వ్యక్త్యహంకారము జననమునకు మూలమై మమకారావృతమై దిక్కాలపరిమిత మగుచున్నది. నేను నాది యను సంకల్పముతో దిక్కాలసంస్మరణము గలుగుచున్నది. నేను అనంతమైన కాలమునకును, అఖండమైన విశ్వమునకును కర్తృత్వభోక్తృత్వాభిమానములను గలిగి దిక్కాలబద్ధ మగుచున్నది. నిర్వికల్పమైన నేను సవికల్పమై నామరూపములనుదాల్చి దేశకాలపాత్రబద్ధమై మహాప్రవృత్తియందు వ్యవహరించుచున్నది. అహంకారమమకారావృతమైన నేను దిక్కాలముల నాశ్రయించి విశ్వప్రవృత్తిని వెలయించుచున్నది. పరబ్రహ్మమువలె పరమాణువును విశ్వభోక్తృత్వము నభిలషించుచు స్వయంవ్యక్తిత్వమును గోరుచున్నది. నిత్యమైన స్వయంభుత్వము సిద్ధించుటకై అనిత్యములైన దేశకాలములను సంకీర్తనముచేయుట పరిపాటియైనది. సంవత్సరారంభమున పంచాంగశ్రవణ మీమహాఫలమును సమకూర్చుటకు వినియోగపడుచున్నది.

ప్రమోదూత సంవత్సరము గడచినది. ప్రజోత్పత్తి సంవత్సర మారంభమైనది. నూతనసంవత్సరారంభమునందు కాలసంస్మరణమును జేయుట ఆత్మోపలబ్ధికి సాధనము కాగలదు. ఈ ప్రజోత్పత్తిసంవత్సరముతో శాలివాహన శకాబ్దములు 1853, విక్రమార్కశకాబ్దములు 1985, క్రైస్తవశకాబ్దములు 1930, ఫసలీ శకాబ్దములు 1339, భరతశకాబ్దములు 5075 గతించినవి. వైవస్వత మన్వంతరమునందు, కలియుగమునందు ప్రథమపాదమునందు 5032 సంవత్సరములు ముగిసినవి. కలియుగారంభమునుండియు 83 పరివృత్తులు ముగిసి 84 వ పరివృత్తియందు అయిదవసంవత్సరమైన ప్రజోత్పత్తి సంవత్సరము ప్రారంభమైనది. సృష్ట్యాదినుండియును 1,95,58,85,032 సంవత్సరములు గతించినవి. బ్రహ్మకల్పము నందు ద్వితీయపరార్థమునందు పగటియందు 13 గడియలు, 42 విగడియలు గతించినవి. అనంతమైన కాలచక్రమునం దొక వత్సరవృత్తాంతము అతిస్వల్పమైనను అనంతప్రభావమును సంస్మరింప జేయుచున్నది. కాలబద్ధమైన మహాప్రవృత్తియందు నూతనసంవత్సరారంభము నూతన



శ్రీ

సంకల్పములకు సాధన మగుచున్నది. ప్రజోత్పత్తి సంవత్సరారంభమునందు ప్రజలు నూతనసంకల్పములను గలిగి కాలసంకీర్తనమును జేసి కామితార్థములను బడయుదురు గాక!

అనంతకాలసంస్మరణమువలె నఖండదేశ సంకీర్తనమును నిత్యానిత్యవివేకమునకు సాధనంబుగనున్నది. కాలమువలె దేశమును ననంతముగ గనుపట్టినను పరిమితముగ నున్నది. అంతవంతము లైన దేశకాలము లన్యోన్యాశ్రయములై యవ్యక్తము నాశ్రయించి యున్నవి. అఖండమైన ఖగోళ మవ్యక్తప్రభావమును స్ఫురింపజేయుచున్నది. గణకులు, జ్యోతిశ్శాస్త్రజ్ఞులు, ప్రకృతిశాస్త్రజ్ఞులు, తత్త్వశాస్త్రజ్ఞులు దేశకాలనిర్ణయమును చేయజాలకున్నారు. విశ్వపరిమాణమును కాలము నిర్ణయింపజాలకున్నది. కాంతికిరణము క్షణమునకు ౧,౮౬,౦౦౦ మైళ్లచొప్పునను ప్రసరించుచు చంద్రమండలమునుండి భూమండలమున ౧¼ క్షణములో చేరుచున్నది. కాంతికిరణము ఖగోళమునందలి దూరతమమైన గోళమునుండి భూగోళము చేరుటకు ౧౦,౦౦,౦౦,౦౦౦ కాంతిసంవత్సరములు గావలయునని జ్యోతిశ్శాస్త్రజ్ఞులు నిర్ణయించుచున్నారు.

**దేశ సంస్మరణము**

అనంతమైన కాలమును, అనంతమైన దేశమును సంస్మరించునపుడు స్వస్థలస్వకాలములు జిజ్ఞాసువులకు పరమాణువులుగ గనుపట్టు చున్నవి. విశ్వప్రవృత్తి మానవులందు ప్రాజ్ఞులకు వారి యల్పత్వమహత్త్వములను స్ఫురింపజేయుచున్నది. అనంతమైన కాలమును, అఖండమైన విశ్వమును సంభావించుటకు మానవుల కఖండమైన శక్తిగలదు. ఆశక్తిని విశ్వప్రవృత్తియం దాత్మోద్ధరణమునకు వినియోగించుట సుఖమునకును, ఆత్మనాశమునకు వినియోగించుట దుఃఖమునకును గారణం బగుచున్నది. నామరూపవిలసితమైన విశ్వ భోగాభిలాష దుస్తరమై దుఃఖమునకు మూలమగుచున్నది. జాతులు, వ్యక్తులు అహంకార మమకారపరాయణులై సంసారమును దుఃఖమయము చేయుచున్నవి. మానవు డహంకార మమకారములను విడిచి విశ్వవ్యాపకుడైన పరమేశ్వరుని గనుగొని శాంతిసుఖములను బడయుచున్నాడు. ఈపరమార్థమునే సంవత్సరారంభమునందు పురోహితులు చేసెడి పంచాంగశ్రవణము స్ఫురింపజేయుచున్నది. మానవునకు అనిత్యమును దేశకాలపాత్రబద్ధమును నైన భౌతికసంపదల యల్పత్వమును, నిత్యమును దేశకాలపాత్రాతీతమును నైన దైవసంపదల మహత్త్వమును పంచాంగశ్రవణము స్మరింపజేయు చున్నది.

ప్రజోత్పత్తి సంవత్సరమునకు శుక్రుడు రాజు, గణకుడు-ఫలము:—సస్యసమృద్ధి, సువృష్టి, క్షీరాభివృద్ధి, సాంసారికసౌఖ్యము, గణకబుద్ధివికాసము, సస్యార్ఘవృద్ధి, సర్వజంతుసౌఖ్యము; చంద్రుడు మంత్రి, సేనాధిపతి, అర్ఘాధిపతి, మేఘాధిపతి, గ్రామపాలకుడు-ఫలము:—సువృష్టి, సర్వసస్యఫలము, క్షేమారోగ్యము, సుభిక్షము, అతివర్షము, అతివాయువు, ప్రజారోగ్యసౌఖ్యము, గోక్షీరాభివృద్ధి, అర్ఘవృద్ధి, ధాన్యాభివృద్ధి, చోరభయరాహిత్యము, రాజులసత్యప్రియత్వము, వృక్షఫలాభివృద్ధి; గురువు సస్యాధిపతి, నీరసాధిపతి, పురోహితుడు, పరీక్షకుడు-ఫలము :— యవగోధూమచణకాభివృద్ధి, పీతధాత్రీ సస్యాభివృద్ధి, పూగీఫల రత్నసువర్ణధాన్య కార్పాసచర్మ కుసుమ చందనాభివృద్ధి, ద్విజగణసౌఖ్యము, సర్వసస్యార్ఘాభివృద్ధి, ప్రజానురాగము, పరీక్షకనయమార్గాభివృద్ధి, విప్రుల స్వకర్మనిరతి, ప్రజాసౌఖ్యారోగ్యాభివృద్ధి, గోక్షీరాభివృద్ధి; బుధుడు ధాన్యాధిపతి-ఫలము:—మధ్యవృష్టి, మందతోయము, మేఘపీడ, సర్వనృపసంత్రాసము; శని రసాధిపతి-ఫలము:—మధ్యవృష్టి, మందసస్యము, రసజాతిధనక్షయము, మ్లేచ్ఛజాత్యభివృద్ధి; సూర్యుడు దైవజ్ఞుడు-ఫలము:— విప్రస్వకర్మనిరతత్వము, సర్వజనసౌఖ్యము, రక్తభూమి సస్యాభివృద్ధి; శ్రీకృష్ణుడు పశుపాలకుడు, స్థానసంరక్షకుడు - ఫలము:—పశువృద్ధి, సుభిక్షము, సస్యార్ఘసంపత్తు, తృణసమృద్ధి, క్షీరసమృద్ధి, సామాన్యఫలము:—

శ్లో. సువర్ణం సర్వధాన్యాని సులభాని యయుర్నరాః,
దర్పితా స్సర్వసంపద్భిః క్షేమారోగ్యం ప్రజాపతౌ.

ప్రజోత్పత్తియందు ప్రజలు పాలకులు ధనధాన్యసమృద్ధి గలిగి సంపన్నులై క్షేమారోగ్యములను గలిగి యుందురు. శుభగ్రహములైన శుక్రుడు రాజు, చంద్రుడు మంత్రి, గురువు సస్యాధిపతి, బుధుడు ధాన్యాధిపతి అగుటం జేసి ప్రజోత్పత్తి సంవత్సరమునందు ధనధాన్యాది సమృద్ధి గలిగి ప్రజలు సకలసౌఖ్యములను అనుభవించునటులు సూచనలు గలవు. ప్రజోత్పత్తి సంవత్సరము శాంతియుతమై ప్రజలు సకలశుభములను బడయుటకు భగవంతు డనుగ్రహించు గాక!

ఐరోపా మహాసంగ్రామము గలుగజేసిన విషాదావస్థ ప్రపంచావృతమై మహాసంక్షోభమును గలుగజేయుచున్నది. అన్ని దేశములందును మానవకల్యాణసాధనమైన పునర్నిర్మాణము దుస్తరముగ నున్నది. అన్ని దేశములందును ప్రజలు పనిపాటులులేక అన్నాతురులై దుఃఖవేదన ననుభవించుచున్నారు. శ్రీమంతములైన అమెరికా, గ్రేటుబ్రిటను, జర్మనీ, మొదలగు పాశ్చాత్త్య దేశములందు నిరుద్యోగసమస్య భయంకరరూపమునుదాల్చినది. గ్రేటుబ్రిటనునందు నిరుద్యోగుల సంఖ్య 21,11,467 లకు పెరిగినది. నిరుద్యోగులకుగాను ప్రభుత్వము 7,00,00,000 సవరనులను గత సంవత్సరమునందు వ్యయముచేసినది. ప్రజాపోషణమునకు మూలాధారములైన దూదిపరిశ్రమ, లోహపరిశ్రమ, బొగ్గుపరిశ్రమ, మొదలగు పరిశ్రమలు క్రమముగ క్షీణించుచు రాజ్యాదాయము క్రమముగ క్షీణించుచున్నది. ఈ విషమ పరిస్థితులందును సైన్యవ్యయము యథాప్రకారము పెరుగుచునే యున్నది. అమెరికా సంయుక్తరాష్ట్రములందును నిరుద్యోగులసంఖ్య 60,00,000 లకు పెరిగినట్లు లెక్కలు విశదము చేయుచున్నవి. గత సంవత్సరమునందు వందలకొలది ధనాగారములు పడిపోయినవి. అమెరికాయందు గ్రేటుబ్రిటనునందువలె నిరుద్యోగులకు రక్షకధనము లేదు. జర్మనీయందును నిరుద్యోగులసంఖ్య ప్రజలయం దారవవంతునకు పెరిగినది. కనడా, ఆస్ట్రేలియా, సంయుక్త దక్షిణాఫ్రికా మొదలగు దేశములందును నిరుద్యోగము వ్యాపించుటచే ప్రజలస్థితి దుర్భరముగ నున్నది. సంపన్నదేశములందువలెనే ఇతర దేశములందును నిరుద్యోగుల సంఖ్య క్రమముగ పెరిగి ప్రపంచమునందంతటను మహాసంక్షోభమును గలిగించుచున్నది.

మహాసంగ్రామమునందు దుఃఖవేదన ననుభవించిన ఫ్రాన్సుదేశమును మాత్రము నిరుద్యోగసమస్య పీడింపకుండుట విచిత్రముగ గనుపట్టుచున్నది. దీనికి కారణము ఫ్రాన్సుదేశపరిస్థితులందే కనబడుచున్నది. ఫ్రాన్సుదేశము చిరకాలమునుండియును వ్యవసాయపరిశ్రమను సంరక్షించుచున్నది. ఫ్రాంసుదేశమునందు మిగిలిన పాశ్చాత్త్యదేశములందువలె వ్యవసాయ పరిశ్రమ కృశించలేదు. ఫ్రాన్సుదేశ పోషణమునకు వలయు ఆహారపదార్థములు ఫ్రాన్సునందే ఉత్పత్తి యగుచున్నవి. యుద్ధానంతరము సంప్రాప్తమైన నిరుద్యోగమును వారించుటకు నిరుద్యోగులకు రాజ్యాధికారులు పనిపాటులు గల్పింపగలిగిరి. బొగ్గు, లోహ పరిశ్రమలు రాజ్యావలంబనము గలిగి ప్రజాపోషణమునకు వినియోగపడుచున్నవి. నిర్మాణ పదార్థములకు స్వదేశమునందు స్వల్పమూల్యమును, విదేశములం దధికమూల్యమును నేర్పడునటు లార్థిక పరిస్థితులు నిర్మితములైనవి. స్వదేశపరిశ్రమలకు రక్షణవిధానము నవలంబించి పరిశ్రమలపోషణము సుకరముచేసినది. దేశమునందు బంగారమును నిలువచేసి ధరలపరిమాణమును నిలువబెట్టినది. సంగ్రామసమయమునందు భగ్నమైన ప్రాంతములను పునర్నిర్మాణముచేయుచు ప్రజలకు పనిపాటులను గల్పించినది. పాశ్చాత్త్యరాజ్యములందు నిరుద్యోగసమస్య సంక్షోభమును గలుగజేయుచున్న విధమును రాజ్యముల చరిత్రములు విశదము చేయుచున్నవి.

పాశ్చాత్త్యరాజ్యములు సంగ్రామసన్నాహమునకై చేయుచున్న వ్యయము పరమానర్థములకు గారణం

సంగ్రామ వ్యయము

బడుచున్నది. రాజ్యాదాయమునందు విశేష భాగము సంగ్రామ సన్నాహములకై వినియోగపడుచు ప్రజాక్షేమము ధర్మసంరక్షణము దుర్లభము లగుచున్నవి. సంగ్రామ సన్నాహము లాత్మరక్షణమునకన్నను పరపీడనమున కధికతరముగ వినియోగపడుచున్నవి. యూరపురాజ్యములు స్వదేశ ప్రజలను రక్షించుటకవలంబించెడి రాజ్యనీతి మహాసంగ్రామములకును, సంక్షోభమునకును పరపీడనమునకును సాధనంబుగనున్నది. సంగ్రామబలమంతయును ధర్మనాశనమునకు వలెను ధర్మరక్షణమునకు వినియోగపడుట లేదు; ప్రజానాశనమునకువలెను ప్రజాపోషణమునకు వినియోగపడుటలేదు. రాజ్యాదాయమునందు విశేషభాగము సంగ్రామసన్నాహములకు వినియోగపడుచు విద్వేషము, విశ్వాసరాహిత్యము, హింస, వినాశము సంభవించుచున్నవి. పురుషార్థమునకు సువ్యక్త స్వప్రయోజనము ప్రయోజనమయినపు డింతకన్న నధికఫలము గలుగజాలదు.

విశ్వప్రవృత్తియందు పరార్థస్వార్థములకును, త్యాగభోగములకును, ధర్మాధర్మములకును, ఆత్మానాత్మలకును సంరంభ మనవరతము సంప్రాప్తమగుచున్నది. ఈ సంరంభ మంతః

సువ్యక్తస్వ ప్రయోజనము

ప్రవృత్తికిని బాహ్యప్రవృత్తికిని సంప్రాప్తమగుచు శాంతిసంక్షోభములను గలుగజేయుచున్నది. స్వార్థపరములైన కుటుంబకులాభిమానములు స్వార్థపరములైన వ్యక్తిజాతియాభిమాన రూపములనుదాల్చి మహాసంక్షోభ సాధనములైనవి. కుటుంబ కులవికాసములకు వ్యక్తివికాసము సాధనంబైనను పరస్పరసంయోగ సాహచర్య విరహితములైన వ్యక్తివికాసము సమిష్టివికాసమునకు నిరుపయోగమై సంరంభమునకు మూలమైనది. జాతీయాభిమానము స్వార్థారాధనముకును, పరపీడనమునకును మూలమైనది. భోగపరమైన స్వార్థారాధనమునకు పరిమాణము గనుపడదు. వ్యక్తులను జాతులను భాగ్యభోగాభిలాషయా వహించి పురుషార్థమునకు మూలస్కంధమైన ధర్మాభిలాష సంకుచితమైనది. పేరునందు ధర్మమును కార్యమునం దధర్మమును నిత్యకృత్యములైనవి. ప్రబలమైన జాతులు స్వోపభోగమునకై పరదేశముల నాక్రమించుకొని పరపరిశ్రమలను, పరసంపదలను, పరస్వత్వములను, పరసంస్కారమును నిర్మూలముచేసి దుర్బలజాతులనునిర్మూలముచేసినవి. పరాధీనస్థితియందున్న పెద్దజాతులకును గౌరవస్థితి దుర్భరమైనది. పిపీలికాదిబ్రహ్మపర్యంతముగల జీవజాలములాత్మోపలబ్ధినిబడయుటకు సంపూర్ణాధికారమును గలిగియున్నవి. ఈయధికారమునకు సాధనసాధ్యములు త్యాగముగాని భోగముగాదు. పరార్థముగాని స్వార్థముగాదు. పాశ్చాత్యరాజ్యము లారాధించిన సువ్యక్తస్వార్థపరత్వము ధర్మవిరుద్ధమై మహాసంక్షోభమునకు మూలమగుచున్నది. ప్రపంచము సంక్షోభపరమైన పాశ్చాత్య ధర్మానుష్ఠానమునుచేయుచు దుఃఖభూయిష్ఠమైన విధమును ప్రపంచపరిస్థితులు విశదము చేయుచున్నవి.

ప్రపంచసంపదలు మారణసాధనమునకు వినియోగింపబడుచున్న విధమును యిరోపా మహాసంగ్రామము విశదము చేసినది. సంగ్రామమున

మారణ సాధనములు

కనే కార్బుదముల రూప్యములు వ్యయ మైనటులు పరిగణింపబడినది. సంగ్రామానంతరమునను రాజ్యములు, ప్రజ లన్నము లేకను పరితపించుచున్నను, ప్రతియేటను అర్బుదములను వ్యయము చేయుచున్నవి. సంగ్రామములందు మహారాజ్యముల లక్ష్యము పృథివ్యధిపత్యము నుండి సముద్రాధిపత్యమునకును, సముద్రాధిపత్యమునుండి ఆకాశాధిపత్యమునకును వ్యాపించినది. ఆకాశసంగ్రామవిమానముల నిర్మాణరక్షణములకు గతసంవత్సరమునందు గ్రేటుబ్రిటను 178, అమెరికా సంయుక్తరాష్ట్రములు 330, ఫ్రాన్సు 460, ఇటలి400, జపాను 100, లక్షల నవరసులను, గతసంవత్సరమునందు గ్రేట్బ్రిటను సైన్యములకు 405, యుద్ధనౌకలకు 517, విమానములకు 178, మొత్తము 11,00 లక్షల నవరసులను వ్యయముచేసినది. ఈయపారమైన వ్యయమును భరించుట దుర్భర మనియును, ప్రజా

క్షయమగుచున్నదనియును ప్రాజ్ఞులందరును సంగీకరించుచున్నారు గాని సంగ్రామ సన్నాహములం దెవరును వెనుకబడుట కంగీకరించుటలేదు. అన్ని రాజ్యములును ఒకరాజ్యము నింకొకరాజ్యమును మించుటకే ప్రయత్నమును జేయుచున్నవి. గతసంవత్సరమునందు లండను నగరమునందు జరిగిన నౌకాసమావేశము కొంతవరకు సంతృప్తికరముగ నున్నది.

గ్రేటు బ్రిటను, అమెరికా సంయుక్తరాష్ట్రములు, ఫ్రాన్సు, ఇటలీ, జపాను రాజ్యముల ప్రతినిధులు నౌకాదళ నిర్మాణమును నియమించుటకుసమావేశమైరి. యుద్ధనౌకల నిర్మాణమును నియమించుటకు

**నౌకా సమావేశము**

గ్రేటు బ్రిటను, జపాను ఒడంబడికను చేసినవి. ఈయే డాయొడంబడికయందు ఫ్రాన్సు,ఇటలీచేరినవి. కానిఈయొడంబడిక గ్రేటు బ్రిటనుకు అపాయకరమని కన్సర్వేటీవు పక్షమువారును సంగ్రామ దక్షులును ఘోషించుచున్నారు. గ్రేటు బ్రిటనునందు పన్నులభారము దుర్భరమైనది. పరిశ్రమలు స్తంభించినవి; నిరుద్యోగమస్యవిపరీతముగ నున్నది. వ్యాపారము క్షీణించినది; సకలవ్యవహారములును సందిగ్ధస్థితియందున్నవి. ఈమహాసంక్షోభసమయమునందు కర్తవ్యము దుర్గ్రాహ్యముగ నున్నది. బ్రిటీషు రాజ్యాంగపక్షములన్నియును విలయావస్థయందున్న విధమును వ్యవహారములు విశదము చేయుచున్నవి.

లేబరుపక్షము రాజ్యాధికారమును వహించుచున్నను బలహీనముగ నున్నది. లిబరలుపక్ష రక్షణము లేకను లేబరుపక్ష మొకక్షణమైనను నిలువజాలదు. లేబరుపక్ష

**బ్రిటీషు రాజ్యాంగ పక్షములు**

రక్షణమును లిబరలుపక్షము స్వప్రయోజన రక్షణమునకై చేయుచున్నది. గ్రుడ్డిలో మెల్లయను విధమునను బొత్తుగాను లేకపోవుటకన్నను ఏదో నామరూపములనైనను గలిగియుండుట సంతోషదాయకము. బ్రిటీషు రాజ్యాంగములందును ప్రపంచ రాజ్యాంగములందును లిబరలు (మితవాద) పక్షమునకు స్థానము లేదనుట తెలిసినవిషయము. అయినను బుద్ధిపూర్వకముగను ఆత్మహత్యను జేసికొనుట యసంభవము. లిబరలుపక్షము కొంతకాలము వ్రేలాడినను ప్రయోజనరహితముగనే యుండుట సహజము. లిబరలుపక్షమునందును చీలికలు గలిగినవి. సర్ జాన్ సైమను లాయిడు జార్జిగారలకు పొందుపొసగకున్నది. భారతీయ రాజ్యాంగముల విషయమై సర్ జాన్ సైమనుగారు ససేమిరా యనుచున్నారు. కేంద్రప్రభుత్వమునందు బాధ్యతగిట్టదు. సాంఘాతికరాజ్యాంగము దూరాదర్శముగాని ప్రస్తుతము ప్రయోగయోగ్యముగాదు.లాయడుజార్జిగారు తటస్థముగ నున్నారు.

లేబరుపక్షమునందును చీలిక గలిగినది. స్వతంత్ర కార్మికపక్షము లేబరుపక్ష కార్యవిధానమును నిరసించుచున్నది. అధికారపక్ష వ్యవహారములను నిరాకరించుచున్నది. భారతీయరాజ్యాంగములందు స్వతంత్రపక్షము పూర్ణ స్వాతంత్ర్యప్రదానమును గోరుచున్నది. మోసలె గారు మొదలగువారు ప్రభుత్వపక్షమునుండి విడిపోవుచున్నారు. లేబరుపక్షము నిరుద్యోగసమస్యను, భారతీయ రాజ్యాంగసమస్యను, వ్యయభారసమస్యను, కార్మిక సమస్య మొదలగు సమస్యలను ధర్మానుకూలముగను నిర్ణయింపకను స్వపక్షపరపక్షవిశ్వాసములను గోల్పోయినది.

కన్సర్వేటివుపక్షమునందును విభేదము లేర్పడినవి. ఇంతవరకును నాయకుడుగనున్న బాల్డ్వినుగారిని త్రోసివేసి క్రొత్తనాయకునిక్రొత్తసామ్రాజ్యపక్షమును నిర్మించుటకు బీవరుబ్రూకుప్రభువు మొదలగువారు ప్రయత్నించుచున్నారు. ఈ పక్షప్రయోజనము స్థిరమైన స్వార్థారాధనము పరపీడనము. “సౌకాయుష్యము నాకారోగ్యము” అనెడి యసహజపరిస్థితులను సుస్థిరము చేయుటయై యున్నది. గ్రేటు బ్రిటను చిరకాలము నిరాటంకముగ ననుభవించిన పరిశ్రమలను సంరక్షించుకొనుటకు నూతన పక్షము గోరుచున్నది. ఆపక్షము నిర్ణయించెడి విధానము 1. బ్రిటిషువ్యవసాయ పరిశ్రమకు రక్షణము. 2. రాజ్యవ్యయమునందు మితవ్యయము. 3. ఇండియా, ఈ

జిప్టులకు, ఇక నేమియును రాజ్యాంగ సంస్కరణముల నీయకుండుట. 4. బ్రిటీషు సామ్రాజ్యాంతర్భాగములందు సంరక్షణవిధానమును. స్వపరిపాలనముగలసామ్రాజ్యాంతర్భాగములన్నియును పరిశ్రమసంరక్షణవిధానమును నిరాకరించుచున్నవి. పరాధీనస్థితియందున్న భాగములమీదను బలవంతముగ నీవిధానమును మోపినను ప్రయోజనము గలుగదు. చీనా, ఈజిప్టు ఇండియా యవలంబించిన బహిష్కారవిధాన మీాసత్యమును విశదము చేయుచున్నది. కన్సర్వేటివుపక్షసిద్ధాంతములు వర్తమానకాలమున కనుపయోగములైనను ధనాధికారలాభములను చిరకాల మనుభవించిన పూర్వపరాయణులు సాధ్యమైనంతవరకును స్వప్రయోజనములను విడువజాలరు. ఈపక్షపు భావిపరిణామ మెటులున్నను పక్షసిద్ధాంతములు గ్రేట్బ్రిటనుకును, సామ్రాజ్యమునకును, ప్రపంచమునకును నిరుపయోగముగ నున్నవి. బ్రిటీషు సామ్రాజ్యభారమును వహింపవలసిన లేబరు, లిబరలు, కన్సర్వేటీవుపక్షములు పనచెడి సంయోగములేకను విలయావస్థయందున్నపుడు సామ్రాజ్యభావిపరిణామము దురూహ్యముగ నున్నది. భారతీయ రాజ్యాంగసమస్యను నిర్ణయించుటయందు మూడుపక్షములవారు చూపిన ప్రతిఘటనము స్వరాజ్యసంపాదనమునకు భారతీయుల కర్తవ్యమును విశదము చేయుచున్నది.

**అన్న వస్త్రములు**

ప్రపంచప్రవృత్తియందు పరమాణువును పరబ్రహ్మమును జీవయాత్రయందు ప్రాణసంరక్షణమున కన్నమును గోరుచున్నవి. ప్రాణులన్నగతములు. సకలజీవజాలములకును జీవయాత్రకు ఫలము సుఖప్రాప్తి, దుఃఖ నివృత్తి. ఈఫలములను సాధించుటకు సాంఘిక వ్యవస్థలు, మతధర్మములు, రాజ్యాంగములు, దేశకాలపాత్రముల సంస్కారముల కనురూపముగ నేర్పడుచున్నవి. జీవయాత్రకు ఫలనిర్ణయమునందు, మరణానంతర స్థితియందు భేదాభిప్రాయములున్నను జీవనము విషయమై భేదాభిప్రాయములు లేవు. జీవయాత్రయందు సుఖసాధనమునకు అన్నము, బట్ట, ఇల్లు, పరమావసరములుగ పరిగణింపబడుచున్నవి. ప్రపంచమునందు పర్యాప్త మగుచున్న సంఘర్షణములు, సంగ్రామములు ఈలాభమును పొందుటకే ఏర్పడుచున్నవి. ప్రజలు వారిదేశములకు సహజమైన మార్గములనువిడిచి పరమార్గముల నవలంబించుచు సుఖవ్యాజమునను వారుదుఃఖము ననుభవించుచు నితరులకు దుఃఖమును కలిగించుచున్నారు. పాశ్చాత్త్యరాజ్యములు ప్రజాపోషణమునకు అవసరమైన అన్నపరిశ్రమను విసర్జించి అనవసరమైన భోగ్యవస్తుపరిశ్రమల నవలంబించి ప్రపంచమును దుఃఖమయము చేసినవి. అన్నవస్త్రములకితరదేశములమీాద నాధారపడవలసిన దేశములకు శుభస్థితిదుర్ఘటము. ఐరోపామహాసంగ్రామము సకలరాజ్యములకును ఈగుణపాఠమును సుగమముచేసినది. ప్రాణరక్షణమునకును పరాశ్రయ మవసర మైనదేశములస్థితిగతులు పరమప్రమాదజనకము లనువిషయము సర్వత్ర తెలిసియున్నది. వ్యవసాయపరిశ్రమను నిరర్థకము చేసి వస్తునిర్మాణపరిశ్రమల నపారముగా వృద్ధిచేసిన గ్రేట్బ్రిటనును, ఇతరపాశ్చాత్త్యరాజ్యములును వర్తమానసమయమునందు పరమవిషాదము ననుభవించుచున్న విధమును గ్రేటుబ్రిటనుపరిస్థితులు విస్పష్టము చేయుచున్నవి. పాశ్చాత్త్యరాజ్యము లనవసరములైన భోగ్యపదార్థముల నపారముగా నిర్మించి స్వదేశములందును, పరదేశములందును అసహజస్థితిని గలుగజేసినవి. ఈస్థితి ప్రపంచమునందంతటను పరావలంబనమును శరణ్యము చేసినది.

అన్నములేని దేశములందపారమైన పరిశ్రమాగారములునిర్మితములైనవి. వ్యవసాయదేశములందలసత్వము వ్యాపించినిరవలంబనము పరిపాటియైనది. పారిశ్రామికదేశములందు వ్యవసాయమపరూపమై పారతంత్ర్యము పరిపాటియైనది. ఉభయత్రనిర్వ్యాపారము నిరుద్యోగము సంప్రాప్తము లగుచున్నవి. ప్రపంచమునవర్తమానవిషమస్థితుల కీస్థితియే మూలమని ఆర్థికపండితులందరు నంగీకరించుచున్నారు. ఈ మహోపద్రవమునుండి తమ ప్రజలను గాపాడుకొనుటకు వివిధరాజ్యములును చేయుచున్న విశ్వ

ప్రయత్నములను గతశతాబ్దిచరిత్రము సహస్రముఖములను విశదము చేయుచున్నది. పాశ్చాత్త్యరాజ్యముల పరాక్రమణ నీతి జాతుల నంతరింపజేసినది; మానమును పోగొట్టినది; ధర్మమును చెఱిపినది; పశుబలమును ప్రమాణము చేసినది; భోగారాధనము పరిపాటిచేసినది; పురుషార్థములందు ధర్మము లుప్తమై అర్థకామములు పరమార్థములైనవి. భాగ్యవంతములైన స్వతంత్ర దేశములం దీదుర్భర స్థితికి ప్రతీకారములను గల్పించుట కవకాశము లున్నను పరతంత్ర దేశములం దేవిధమైన ప్రతీకారమును గనుపించదు. ఈవిషాదస్థితి భరతవర్షమునందు విపరీతాకృతిని దాల్చి సకలమును స్తంభింపజేసినవిధమును సత్యాగ్రహ సంరంభారంభమునందు ఇర్వినుప్రభువునకు గాంధిమహాత్ముడు పంపిన లేఖ విశదము చేయుచున్నది.

ఆదికాలమున నుండియును భరతవర్షము ప్రపంచ కల్యాణమునకు బహువిధములను దోడ్పడిన విధమును ప్రపంచేతిహాసము విశదముచేయుచున్నది. మానవసౌఖ్యమునకు సాధనములైన అన్నవస్త్రములను భరతఖండము ప్రపంచమునకు సమకూర్చినవిషయము సుప్రసిద్ధము.

భరత ఖండము

బ్రతుకుట కవసరమైన వ్యవసాయ పరిశ్రమ ఆదికాలముననుండి నేటివరకును ప్రజాదరణమును గలిగియున్నది. భారతమాత తన సంతానమున కేకాక ఇతరులకును ఆహారపదార్థములను నేడును సమకూర్చుచున్నది. ప్రజలయందు 100 కి 85 మందికి వ్యవసాయము జీవనాధారముగ నున్నది. అన్నముతోపాటు బట్టలను భరతవర్షము ప్రపంచమునకు సమకూర్చినవిధము ప్రపంచేతిహాసములం దొకసుందరాధ్యాయము. కాడి కదురు కవ్వము పూజ్యములై స్వయంపోషణము పరపోషణము సులభముగ నేర్పడినవి. పూర్వకాలమునందు సువర్ణభూమియని హిందూదేశము ప్రపంచమునందు ప్రఖ్యాతిని బడసినది. పరదేశీయుల లోభమునకు గురియైనది. లోభావేశపరులైన అలెగ్జాండరులు, తైమూరులు, క్లైవులు, హేస్టింగులు గలుగజేసిన సంక్షోభము పరమవిషాదమును గలుగజేయుచున్నను ఆంగ్లేయాక్రమణము సర్వనాశనమునకును మూలమైనది. దేశమునకు సకలసందర్భములందును పరావలంబనము శరణ్యమైనది. అన్నవస్త్రములు, విజ్ఞానము,ధర్మము, మతము,శౌర్యము, పరాక్రమము, సంకల్పము, సత్త్వము నిరాశ్రయములై మరణయాతన సహజావస్థయైనది. ఈ మహా విలయావస్థయందు ధర్మసంస్థాపనము పునరుద్ధరణమునకు సాధనముగ నున్నది.

ప్రపంచమునందు ధర్మముచెడి అధర్మము ప్రబలునపుడుధర్మసంస్థాపనమున కాత్మసాక్షాత్కారము సాధనమగుచున్నది. ప్రపంచప్రవృత్తియందు

ధర్మసంస్థాపనము

సత్యము,అహింసధర్మములం దుత్తమధర్మములు. "సత్యాన్నాస్తిపరోధర్మః" "అహింసాపరమోధర్మః" అనెడి వేదవాక్యములు ధర్మనిర్వచనమును చేయుచున్నవి. ప్రలయావస్థయందున్న వర్తమానసమయమునందు ధర్మసంస్థాపనమును జేయుటకు పరమధర్మమైన సత్యాహింస ధర్మము శరణ్యముగ నున్నది. భాగ్యభోగపరములైన భౌతికసంపదలు సంరంభమునకువలెను శాంతికి సాధనములు గావను విషయమును పాశ్చాత్యసంస్కారము భయంకరముగను వ్యక్తముచేసినది. ప్రపంచ మనుభవించుచున్న దుఃఖవేదన నుపశమింపజేసి శాంతిని స్థాపించుటకు ధర్మోద్ధరణమవసరమని ప్రాజ్ఞులందరును నంగీకరించుచున్నారు. మతాచార్యులు, సేనానాయకులు, ఆర్థికపండితులువ్యవసాయప్రియులు, పరిశ్రమాభిమానులు, కళాకోవిదులు, కవులు, పత్రికాసంపాదకులు, వక్తలు వారివారి సంసారానుసారముగను తరణోపాయములను సూచించుచున్నారు. ఈయుపాయము లన్నియును కొంత ప్రయోజనకరములైనను శాంతికిని ధర్మమును స్థాపించుటకును నిరుపయోగములుగ నున్నవి. ప్రపంచశాంతికిని ధర్మసంస్థాపనమునకును నిరుపయోగములైన సాధనములను విడిచినవీనసాధనముల నవలంబింపవలసిన యావసరము ప్రపంచమునకు గలిగినది. ఆసాధనమును నిర్ణయింపగల యధికారసంస్కారములు బుద్ధుడు, జినుడు, క్రీస్తు, మహా

మ్మడు, జనకుడు, శ్రీరాముడు, శంకరుడు, రామానుజుడు మొదలగు మహాత్ములకు జన్మస్థానమైన ప్రాచ్యదేశము లకుమాత్రమె గలవని పాశ్చాత్యపండితులును నంగీకరించుచున్నారు. ప్రపంచశాంతికిని ధర్మసంస్థాపనమును అహింసాసత్యాత్మకమైన ధర్మమును స్థాపించుట శాధ్యాత్మకపరమైన సత్యాగ్రహము సాధనముగనున్న విధమును సకలమతములును తత్త్వములును వెల్లడి చేయుచున్నవి. ప్రపంచమునందలి సర్వ మతతత్త్వ సంప్రదాయసిద్ధమైన సత్యాగ్రహ సాధనమును ప్రపంచశాంతికి సకలరంగములందు నవలంబించుటకు గాంధిమహాత్ము డుపక్రమించిన సత్యాగ్రహసాధనము భరతవర్షమునకు వలె ప్రపంచమునకంతకును వినియోగపడగల విధమును కాలము వ్యక్తము చేయగలదు.

**సత్యాగ్రహ ప్రస్థానము**

గత సంవత్సరమునందు గాంధిమహాత్ము డుపక్రమించిన సత్యాగ్రహ ప్రస్థానము ప్రపంచచరిత్రయందపూర్వమైన కార్యసిద్ధికి సత్యప్రభావమును సహస్రముఖములను విశదము చేయుచున్నది. దండనమున కభ్యస్తమైన ప్రపంచమైన ప్రపంచమునందు త్యాగాభ్యాసమునుచేయుట దుస్తరమైనను సాధ్యమని మహాత్ముల ప్రభావము విశదము చేయుచున్నది. త్యాగమూర్తులైన బుద్ధునకు, క్రీస్తునకుగల ప్రతిభ మహారథులైన నెపోలియనుకు, హానిబలునకు సీజరుకు రావణాదులకును లేదు. ఈపరమార్థమునే గాంధి మహాత్మునిజీవితమును, సత్యాగ్రహప్రస్థానమును విశదము చేయుచున్నవి. గతసంవత్సరమునందు గాంధిమహాత్ముడు సత్యాగ్రహప్రస్థానము నుపక్రమించినపుడు వారిని ఉన్మత్తుడని పరిహసించిన మహానుభావులు సత్యాగ్రహ మహిమను గ్రహింపజాలరు. ఒకసంవత్సరములో సత్యాగ్రహ ప్రభావము ప్రపంచమునకు విదితమైనది. గాంధిమహాత్ముడు పూనిన సత్యాగ్రహదీక్షను వేలకొలది స్త్రీలుపురుషులు, బాలురువృద్ధులు, శ్రీమంతులు సామాన్యులును అవలంబించి ప్రభుత్వమును స్తంభింపజేసిన విధము ప్రపంచమున కాశ్చర్యమును గలుగజేసినది. గాంధిమహాత్ముడు మే 5 వ తేదీని నిర్బంధింపబడెను. నానారాష్ట్రీములలోని నాయకులు కాంగ్రెసుసభాధ్యక్షుడు నిర్బంధింపబడిరి. ఆ సమయమునందు ప్రభుత్వమవలంబించిన రాజ్యతంత్రము పరమాసహ్యమును గలుగజేసినది. ప్రభుత్వము భేదతంత్రము నెప్పటివలెనే యవలంబించినది. నిరంకుశాధికారులు దేశభక్తులనందరను నిర్బంధించి మితవాదులను చేరదీసి భేదతంత్రము నవలంబించిన విధమును మహాప్రహసనముగను బరిణమించినది. గాంధిమహాత్ముడును నెహ్రూగారులును వల్లభభాయి సరోజినీగారులును ప్రభుతంత్రమును ప్రతిఘటించినవిధమును యరవడ నైని చెరసాలలందు నిర్బంధితులకును సప్రు జయకరులకును నడిచిన రాయబారములు విశదము చేయుచున్నవి. సంకల్పసిద్ధిగల గాంధిమహాత్ము డేతంత్రములందు చిక్కుకొనకుండుటయందు విచిత్రము గనుపడదు.

### సప్రూ, జయకరు రాయబారములు:

"భారతదేశమున మరల శాంతిపరిస్థితులను కలిగించుటకు రెండు నెలలనుండి మేము చేయుచున్న ప్రయత్నములయొక్క వివరణము.

1. కాంగ్రెసు ప్రతినిధులు రౌండుటేబిలు సభలో పాల్గొను టనుగూర్చి పండిత మోతీలాలు నెహ్రూగారిని 20-6-1930 వ తేదీని లండను డెయిలీహెరాల్డు పత్రిక ప్రత్యేకవిలేఖకుడు జార్జిస్లోకోంబు గారు సందర్శించి ప్రశ్నింపగా నపు డతనితో మోతీలాలుగారు తమ అభిప్రాయములను తెలిపిరి. ఆ సంభాషణ లిదివరకే పత్రికలలో ప్రకటింపబడెను.

2. అటుపిమ్మట కొలదిరోజులకే స్లోకోంబుగారు బొంబాయిలో మోతీలాలుగారిని మరల సందర్శించి సంభాషించిరి. అపుడు స్లోకోంబుగారు కొన్ని షరతులను వ్రాసి మోతీలాలుగారికి చూపించగా ఆ షరతులను మోతీలాలుగా రామోదించిరి. అపుడు మోతీలాలుగారును స్లోకోంబుగారును జయకరుగారును మాత్రమే అచట నుండిరి. ఆ షరతుల పత్రమున కొకప్రతిని స్లోకోంబుగారు జయకరుగారి కిచ్చిరి వాటి నాధారముగా చేసికొని జయకరుగారుగాని మరియొకరుగాని రాజప్రతినిధితో సంభాషింపదగునని యూహింపబడెను.

3. అపుడు సప్రూగారు సిమ్లాలో నుండిరి గాన యీ షరతుల పత్రమునకు మరియొక ప్రతిని, ఒక లేఖను స్లోకోంబుగారు సప్రూగారికి టపాలో పంపించిరి.

47, ఆదియప్పనాయకవీధి, మద్రాసు,
4-11-24.

"ఆర్యా,

మీయొక్క యద్భుతశక్తిగల తాయెత్తును ధరించి డాక్టరు పరీక్షయం దుత్తీర్ణుడనైతిని. అందువలన రెండవతరగతిలో కృతార్థుడనైతిని. కనుక మీతాయెత్తు యద్భుతశక్తి గలిగినది కాబట్టి మరి నాలుగు వి. పి. ద్వారా పంపుడు."

విధేయుడు,

(సం) డా. సి. నాథముని యల్. యమ్. పి,
సర్జన్ అండ్ ఫిజిషియన్.

---

పోస్టు, బారిరో, బోర్గస్ 10-9-25.

"గౌరవనీయులారా,

మీరు పంపిన యమోఘమైన శక్తిగల రక్షను గత 3 సంవత్సరములనుండి యుపయోగించి కృతార్థుడనైతిని. కాబట్టి మరొకదానిని వి. పి. ద్వారా పంపుడు."

తమ విధేయుడు,

(సం) బి. సి. చౌదరీ మెడికల్ ఆఫీసరు,

---

బంగాళా ఆసుపత్రి, ఖాగల్ పూర్,
పోస్టు, ఖాశీపూర్ పాట్నాజిల్లా, బెంగాల్ 1-3-26.

"ఆర్యా,

శనిగ్రహము వలన తమయొక్క రక్షధారణవల్ల నెలదినములలో నాకు యారోగ్యమందు హెచ్చుతీరము చేయబడినదని తెలుపుటకు సంతోషమైనది. మీరు తెలిపినదంతయు యథార్థము గనుక మరొకదానిని రెండు పగడములతో సహా నాభార్యకు పంపవలెను."

విధేయుడు,

(సం) డాక్టరు యస్. యమ్. రహమాన్
మెడికల్ ఆఫీసరు,

---

ఖాశీపూర్ ధర్మవైద్యశాల.
కుప్టాన్ కాలీయరి కుసుండ పోస్టు మన్‌భామ్ 11-7-22.
మెసర్స్ జి. డి. జోషి అండ్ కో, ఢిల్లీ.

---

"ఆర్యా,

మీయొక్క జగద్విఖ్యాతిగాంచిన రక్షను 11 మాసములనుండి ధరించుచుంటిని. దీనిశక్తి వర్ణింప శక్యముగాదు. నామనస్సునందుండు కోరికలన్నియు ఫలించినవి. నాకు సహాయకారి యగుటవలన నామిత్రులనుకూడ ప్రోత్సహించుచున్నాను. మీ రక్ష యద్భుతశక్తి గలిగియున్నది.

నేడే రు 25 మనియార్డరు ద్వారా సరస్వతీదేవిని ప్రార్థించుటకు పంపియుంటిని. మరొకదానిని పంపినయెడల మీ కెంతయో కృతజ్ఞుడను."

విధేయుడు,

(సం) జె. జి. ఫిలిప్స్,

## ఇంగ్లాండు దేశపు ప్రజలు

"ఆర్యా,

ఇందు వెంట రు 10 ఒకరక్ష, పట్టుతాడుకొరకు పంపుచున్నాము.

నేను యిదివరలో నొకటి యుపయోగించి దాని ఫలితము బొందియుంటిని, ఆలస్యము లేక వెంటనే పంపుదురని యాశించుచున్నాము."

తమవిధేయుడు,

ఆర్ట్ అండ్ డిసైన్ ఎంబ్రాయిడర్ వర్క్స్,
14, సెటిల్స్‌వీధి కమ్మర్షియల్ రోడ్డు,
లండన్ ఇ. సి. 1.

---

## కాలమునకు దగిన నూతన యద్భుతము

ధవళేశ్వరం 13-3-27 (గోదావరి)

"ఆర్యా,

మీరు పంపిన తాయెత్తు నాకు అన్ని విషయములలోను తృప్తికరముగ పనిచేసినది. దీనియొక్క గుణము యొకేమాదిరిగ యున్నది. దీని ట్రేడ్ మార్కు సరస్వతియే యింత నమ్మకమైన పనిచేయుచున్నది, కాబట్టి నేను నాస్నేహితులకు చేయు సలహాయేమన నిరుపయోగమైన రక్షలనుమాని మోసపోకుడి."

తమవిధేయుడు,

(సం) పి. బి. సుబ్రోం,
అసోసి ఐ, ఇ, యస్, లండన్,
మెకానికల్ అండ్ ఎలెక్ట్రికల్ ఇంజనీరు.

---

## మునిసిపల్ కమిషనరు

"ఆర్యా,
ధనబాద్ 24-11-20.

మీరక్ష గడచిన 4 సంవత్సరములనుండి ధరించుచుంటిని. దాని గుణముల విషయములో వేరుగ చెప్ప నవసరము లేదు."

తమవిధేయుడు,

(సం) నాథసింగ్,
మునిసిపల్ కమీషనరు.

---

## పోలీసు యుద్యోగులు

కోర్టు ఆఫీసు డార్జిలింగ్ 8-1-27.

ప్రియమైన పండిట్ గారు,

మీరు 1924 సంవత్సరము అక్టోబరు మాసమున పంపిన గొప్పరక్షను సంపూర్ణమైన విశ్వాసముతో ధరించి, లాభమును డిశెంబరుమాసములో బొందితిని. నేటివరకు తెగిన సొమ్మును మనియార్డరు ద్వారా పంపియుంటిని. దీనిని సరస్వతీదేవి ప్రార్థనకై పంపియుంటిని.

ఇట్లు విధేయుడు,

(సం) నహాల్ వాన్ సింహా.
పోలీస్‌కోర్టు, యిన్స్పెక్టరు డార్జిలింగ్.

# G. D. JOSHI & Co.

**ORIGINAL INVENTORS AND SOLE PROPRIETORS, SARASWATI ASHRAM,**

*Tele: Address:—"TALISMAN"* **No. 1430; Peepul Mahadev; DELHI.**

"ఈ షరతులపై నాధారపడి మనము రాజప్రతినిధితో సంభాషించుటకు పండిత మోతీలాలు నెహ్రూగారు సమ్మతించిరి" అని ఆలేఖలో స్లోకోంబుగారు వ్రాసిరి.

### స్లోకోంబుగారు సప్రూగారికి వ్రాసిన లేఖలోనివిషయములు

25-6-1930 వ తేదీని యీ స్టేటుమెంటును బొంబాయిలో నేను పండిత మోతీలాలు నెహ్రూగారికి చూపించితిని. మధ్యవర్తులెవరైన దీనిపై నాధారపడి రాజప్రతినిధితో సంభాషించుటకు నా కెట్టి ఆక్షేపణయును లేదు అని మోతీలాలుగారు తెలిపిరి.

రౌండుటేబిలు సభవారు సంపూర్ణస్వాతంత్ర్యముతో చేయగలుగునట్టి సూచనలను గూర్చి బ్రిటను దొరతనమువారును ఇండియా దొరతనమువారును ఇపుడే ఊహవలన నిర్ణయించుటకు, అవి యిటు లుండగలవని భావించుటకు కొన్ని పరిస్థితులలో వీలులేకపోయినను రౌండుటేబిలు సభవారు చేయగలుగునట్టి సూచనలపైని బ్రిటిషు పార్లమెంటువారు చేయగలుగునట్టి నిర్ణయమిటులుండ గలదని బ్రిటను ఇండియా దొరతనముల వారిపుడు ఊహింపజాలక పోయినను, భారతదేశమునకు సంపూర్ణస్వాతంత్ర్యము నొసంగవలెనను విషయమును భారతదేశముయొక్క ప్రత్యేకపరిస్థితులను ఆవశ్యకములను అతిదీర్ఘకాలమునుండి భారతదేశమునకు బ్రిటను దేశముతోగల సంబంధమునుబట్టి రౌండుటేబిలు సభవారు నిర్ణయించిన రీతిని పరస్పరము అంగీకరించి సర్దుబాటు చేసికొను పద్ధతిని అధికారమును మార్చుటకు సంబంధించిన షరతులకు లోబడు పద్ధతిని తాము సమర్థించెదమని బ్రిటను ఇండియా దొరతనములవారు రహస్యముగా గాంధిగారికిని వాగ్దానము చేయునెడలను లేక అట్టి వాగ్దానమును దొరతనమువారు చేయుదురని బాధ్యతగల మరి యొకరు తెలిపినయెడలను గూడ తన మట్టుకు మోతీలాలుగారు దానికి సమ్మతించెదరు. అట్టి వాగ్దానమును దొరతనమువా రొసంగుటయును మోతీలాలుగారు దాని నామోదించుటయును కొనసాగునెడల అటుపిమ్మట సర్వవిషయములలోను సమాధానప్రయత్నమును జరుపుట కవకాశమేర్పడును. అందువలన వెంటనే సత్యాగ్రహము విరమింపబడును. దొరతనమువారిపు డవలంబించుచున్న కఠినశాసనవిధానముగూడ రద్దుపరచబడును. ఉదారభావముతో రాజకీయఖైదీల విడుదలగూడ జరుపబడును. అటుపిమ్మట పరస్పరము ఆమోదింపబడిన షరతులపైని కాంగ్రెసుప్రతినిధులు రౌండుటేబిలు సభలో పాల్గొనుటకుగూడ నవకాశమేర్పడును అని స్లోకోంబుగా రపుడు జయకరుగారికి వ్రాసిరి.

### రాయబారములను ప్రారంభించుట

ఈ లేఖపై నాధారపడియే మే మిద్దరమును జూలైనెల మొదటి వారములో పెక్కుసారులు సిమ్లాలో రాజప్రతినిధికి బాగుగా వివరించితిమి. పిమ్మట నీదిగువ లేఖనుగూడ వ్రాసితిమి.

౧

### సప్రూజయకరుగార్లు రాజప్రతినిధిగారికి వ్రాసిన లేఖ.

అయ్యా,

ప్రస్తుతము భారతదేశము నందలి రాజకీయ స్థితిని తాము గమనింపగోరెదము. సహజశాంతిస్థితిని మరల నెలకొలుపుటకు ఎట్టి కాలవిలంబనమును చేయకుండ వెంటనే యేదోకొంత ప్రయత్నము జరుపు టత్యవసరమని మేము నమ్ముచున్నాము. సత్యాగ్రహము ప్రారంభించుటవలన కలుగునట్టి విపత్తులను మేము గుర్తించియేయున్నాము. కావుననే ఆయుద్యమముతో మే మెట్టి సంబంధమును కలిగించుకొని యుండకపోవుటయేగాక దానిపట్ల నెట్టి సానుభూతిని గూడ మేము చూపియుండలేదు. సత్యాగ్రహమువలన ప్రజలకును ప్రభుత్వమునకును గూడ సంఘర్షణ మేర్పడినది. అందువలన దొరతనమువారికి కఠినవిధానమును ప్రారంభింపవలసి వచ్చినది. ఆకారణమున ప్రజలకు ప్రభుత్వముపట్ల విద్వేష మధికమైనది. ఈ రీతిగా విషమస్థితి యేర్పడుటవలన దేశముయొక్క స్థిరవసతులకు చాల నష్టము కలుగుటకు గూడ నవకాశ మేర్పడినది.

ప్రస్తుతస్థితిలో సత్యాగ్రహనాయకులు గూడ శాంతిని నెలకొల్పుటలో తోడ్పడునట్లు వారిని ప్రోత్సాహపరుపగలుగుదు మను నమ్మకముతోను ఆశతోను ప్రస్తుతస్థితినిగూర్చి వారిలో కొందరితో మేము స్వయముగా చర్చించుటకు మా దేశముపట్లను మే మొనర్పదగిన ముఖ్యకర్తవ్య మనియే మేము నమ్ముచున్నాము.

సత్యాగ్రహమును ప్రతిఘటించుటకు దొరతనమువారికి తప్పనిసరియే యైనను రాజ్యాంగవిధానమునుగూర్చి అందరికిని సంతృప్తికరమగు నేదోయొక పద్ధతిని కనిపట్టగలుగుటకు సకలప్రయత్నములను చేయవలె ననియే మీరుగూడ చాల ఆందోళనముతో నున్నారని మీ ఉపన్యాసముయొక్క ముఖ్యాభిప్రాయమని మే మభిప్రాయపడుచున్నాము. ఇది సరియైన యభిప్రాయమే యగునని నమ్మెదము. సత్యాగ్రహము విరమింపబడినచో దొరతనమువారు ప్రస్తుతమునం దవలంబించవలసివచ్చిన విధానమును, ఆ విధానమును కొనసాగించుటకు తాత్కాలికముగా చేయవలసివచ్చిన ఆర్డినెన్సులను ఇటుపైగూడ కొనసాగించుట కెట్టి ఆవశ్యకమును కలుగదనిగూడ మేము నమ్ముచున్నామని తెలుపు టవసరమే యగును.

అతిముఖ్యమగు భారతస్వరాజ్యవిధానమును నిర్ణయించునట్టి పనిని కొనసాగించుటకు అత్యవసరమగు శాంతిని దేశమునందు నెలకొల్పుటకు తోడ్పడవలెనని కోరుచు మాఅభిప్రాయములను వారి కెరింగించి వారితో సాకల్యముగ చర్చించి వారికి నచ్చచెప్పుటకుగాను మేము చెరసాలకు వెళ్లి మహాత్మగాంధి పండిత మోతీలాలు నెహ్రూ పండితజవహరలాలునెహ్రూగార్లతో సంభాషించుటకు మా కనుమతి నొసగవలెనని మేము మిమ్ములను కోరుచున్నాము.

ఇటుల వీరు ముగ్గురితోను సంభాషించుటలో మా సొంత బాధ్యతపైననే వెళ్లుచున్నాముగాని ప్రభుత్వ ప్రతినిధులముగా గాని మరియే పక్షముయొక్క ప్రతినిధులముగా గాని మేము వెళ్లుటలేదని స్పష్టముగా తెలుప గోరుచున్నాము. మా ప్రయత్నము విఫలమైనచో అందులకుగూడ మేమే బాధ్యుల మగుదుము.

ఇటుల మేము ఎరవాడ నానిటాలు చెరసాలలకు వెళ్లి మహాత్మునితోను, నెహ్రూగారిద్దరితోను మాటలాడుటకు మాకు అనుమతి నొసంగుటకు మీరు సమ్మతించువెడల అందులకు మాకు కావలసిన సౌకర్యముల నన్నిటిని కలుగజేయునట్లు బొంబాయి సంయుక్తరాష్ట్రముల ప్రభుత్వములవారికి తాము ఉత్తరువులను పంపగోరెదము.

మే మటులు మహాత్మజీతోను నెహ్రూగార్లతోను సంభాషించునపుడు ప్రభుత్వోద్యోగు లెవ్వరునుగూడ నచట నుండగూడదు. మేము రహస్యముగా సంభాషించుటకునుగూడ తాము మాకు అనుమతి నియ్యవలెను. ఇందులకు ప్రత్యుత్తరమును హోటెలు సెసిలుకు మాలో జయకరుగారిపేర పంపగోరెదము.

## ౨

## రాజప్రతినిధిగారు పంపిన ప్రత్యుత్తరము

వైసురీగలు లాడ్జి,
సిమ్లా ౧౬-౮-౧౯౩౦.

అయ్యా,

మీరును సర్ తేజబహదరు సప్రూగారును ౧౩ వ తేదీని వ్రాసిన లేఖ నాకు చేరినది. దేశమునందు మరల శాంతిని నెలకొల్పుటకు గాంధి, మోతీలాలు నెహ్రూ, జవహరలాలు నెహ్రూగార్లతో సంభాషించుటకు అనుమతి నియ్యవలెనని మీరు నన్ను కోరితిరి. మీరు ఈ విషయమున శక్తివంచన లేకుండ పనిచేసెద మనికూడ తెలిపియుంటిరి. సత్యాగ్రహముపట్లను స్వరాజ్యముపట్లను నేనును ఇండియా దొరతనమువారును ఎట్టిభావములను కలిగి యున్నదియును భారత శాసనసభలో ౯-౮-౩౦ తేదీని నేనొసగిన ఉపన్యాసమున స్పష్టముగా తెలిపియే యున్నాను. భారతదేశమున కంతటికిని, ఈ దేశమునందు నివసించుచున్న చాల ముఖ్యములగు సంఘములకును రాజకీయ పక్షములకును వర్గములకును గూడ సత్యాగ్రహమువలన అధికమగు నష్టము కలుగుచున్న దనియే మేము నమ్ముచున్నాము. కావున ఇట్లు నష్టపడుచున్న ప్రజల సాహాయ్యముతో సర్వవిధములను శక్తివంచన లేకుండ సత్యాగ్రహమును ప్రతిఘటించుట దొరతనమునకు ముఖ్యకర్తవ్యమే యగును. దేశమునందలి వివిధ సంఘములవారికిని సామరస్యమును కలిగించి వారి సాహాయ్యముతో పరిపాలనావిధాన సమస్యను పరిష్కరింపవలెనని కూడ మేము చాల ఆందోళనము నొందుచున్నామని మీరు సరిగానే గ్రహింపగలిగితిరి. ఇండియా దొరతనమువారు సైమను నివేదికను సాకల్యముగా పరిశీలించిన పిమ్మట నెట్టి సూచనలను చేయునదియును పిమ్మట రౌండుటేబిలుసభలో బ్రిటిను భారతదేశముల ప్రతినిధులు కలసి చర్చించినపిమ్మట వారెట్టి సూచనలను చేయునదియును, అటుపిమ్మట పార్లమెంటుసభవారు రౌండుటేబిలు సభవారి నివేదికను చర్చించి యెట్టి తీర్మానమును చేయునదియునుగూడ ఇపుడు నేనూహించుట కెట్టి అవకాశమును లేదు. కాని భారతదేశ వ్యవహారములలో భారతీయులు వెంటనే యే విషయములనుగూర్చి బాధ్యతలను వహించుట కవకాశము లేదో అట్టివిషయముల పరిపాలనముగూర్చి మాత్రమే ప్రత్యేకపు టేర్పాటులను చేయునట్టి పద్ధతిని తక్కిన సకల విషయముల పరిపాలనమునందును వీలైనంత అధికముగ బాధ్యతనే భారతీయులకు వశపరుచునట్లు చేయుటలో నేనును ఇండియా దొరతనమువారును గూడ మాకుగల ప్రత్యేకావకాశములలో శక్తివంచన లేకుండ తోడ్పడుటకే సంసిద్ధులమై యున్నామని నేను ఈనెల 9 వ తేదీని చాల స్పష్టముగానే తెలిపికొంటిని. ఆవిషయము లేవో వాటినిగూర్చి చేయదగిన క్షేమములగు నేర్పాటు లెట్టివో మున్నగు విషయములు రౌండుటేబిలు సభలోనే చర్చింపబడవలసి యుండునుగాన రెండు దేశములవారును పరస్పర విశ్వాసముతో కలసి ఆలోచించినచో సమాధానము కలుగకుండుట కెట్టికారణమును లేదనియే నేను నమ్ముచున్నాను.

ఇందుల కవసరమగు స్థితిని దేశమునందు మరల కలుగజేయుటకు మీరు కాంగ్రెసునాయకులతో సంభాషించుటవలన తగిన అవకాశము ఏర్పడనవచ్చునని మీరు నమ్ముచున్నపుడును, ఈరీతిగా మీరు తోడ్పడ గోరుచున్నపుడును మీ ప్రయత్నములకు నెట్టి విరోధములనైన కలుగజేయుట నాకును ఇండియా దొరతనమునకును గూడ సముచితము కాజాలదు. సత్యాగ్రహమును ప్రతిఘటించుటలో మొదటినుండియును ఎవరు ఇండియా ప్రభుత్వ పక్షముననే యుండిరో యెవరి సాహాయ్యము అమూల్యము అని నేను భావించుచుంటినో అట్టి మీ విషయమున నేను మరియొకరీతిగా ప్రవర్తించుట కెట్టి యవకాశమును లేదు.

ఈ లేఖకు మీవద్దనుండి మరల ప్రత్యుత్తరము వచ్చినవెంటనే భారతదేశమునందు మరల శాంతిని నెలకొల్పుటకు దేశసేవానిరతితో మీరు చేయదలచిన ప్రయత్నము నిర్విఘ్నముగా కొనసాగుటకు తగిన యుత్తరువులను నేను రాష్ట్రీయప్రభుత్వములకు పంపించెదను.

చిత్తగించవలెను.
(సం) ఇర్విను.

## సప్రూజయకరుగార్లు మొదటిసారి గాంధిమహాత్మునితో సంభాషించుట

మాకును రాజప్రతినిధికిని ఇటుల ఉత్తర ప్రత్యుత్తరములు జరిగిన పిమ్మట 1930 జూలై నెల 23,24 తేదీలను మేము ఎరవాడ

చెరసాలకు వెళ్లి గాంధిమహాత్మునితో సంభాషించితిమి. అపుడు దేశ స్థితినంతను మహాత్మునకు వివరించి చెప్పుటయేగాక రాజప్రతినిధికిని మాకును జరిగిన సంభాషణయొక్క సారాంశమును గూడ తెలిపితిమి. అపుడు గాంధిగారు నయిని చెరసాలలోనున్న పండిమోతీలాలు నెహ్రూ, పండిత జవహర్‌లాలు నెహ్రూగార్లకు చూపించుటకు ఈ దిగువను వివరింపబడిన నోటును లేఖను వ్రాసి మాచేతికిచ్చిరి.

## 3

### రాజ్యాంగప్రయోజనము

(1) ఈప్రశ్నకు సంబంధించినంతవరకు నావ్యక్తి అభిప్రాయ మేమనగా, తాత్కాలిక స్థితిలో పూర్ణస్వరాజ్యము (లోకలు సెల్ఫ గవర్నమెంట్) విషయమున అవసరమయిన భద్రములను గూర్చియే రౌండుటేబిలుసభలో చర్చజరుగునెడల అందులకు నాకెట్టి ఆక్షేపణ యును లేదు. కాని ఆసభలో ఇండిపెండెన్సు సమస్య నెవరైన నెత్తి నచో దానిని సభవారు త్రోసివేయగూడదు. రౌండుటేబిలు సభలో కాంగ్రెసువారు పాల్గొనుటకు ముందు ఆసభయొక్క సంపూర్ణనిర్మాణమును గూర్చి నేను పూర్తిగా తెలుసుకొనగోరెదను.

(2) రౌండుటేబిలు సభ యేర్పాటు కాంగ్రెసువారికి సంతృప్తి కరముగా నుండినచో సహజముగానే సత్యాగ్రహము (సివిల్ డిసొ బీడియన్సు) విరమింపబడును. అనగా శాసనోల్లంఘనము కొరకె యిపుడు జరుపబడుచున్న కొన్ని చట్టముల ఉల్లంఘనము మాత్రమే నిలిపివేయబడును గాని మద్యపానమును విదేశవస్త్రములను గూర్చి దొరతనమువారె నిరోధ శాసనములను ప్రకటించినయెడల తప్ప అనగా మద్యపాన విక్రయములను విదేశవస్త్రధారణ విక్రయములను దొర తనమువారే నిషేధించినయెడల తప్ప లేనిచో మద్యపానమును విక్రయ మును విదేశవస్త్రధారణమును విక్రయమును జరుగకుండ శాంతియుత ముగ కాంగ్రెసువారు పికెటింగు చేయుచునే యుందురు. మరియు ప్రజలు ఉప్పును తయారుచేయుచునే యుండవలెను. ఉప్పుచట్టము నందలి శిక్షానిబంధనను దొరతనమువారు అమలు జరుపగూడదు. దొర తనమువారు ఉప్పుగల్లీలపైనను ఇతరుల ఉప్పుగల్లీలపైనను గూడ కాంగ్రెసువారు దాడిసలుపరు. ఈకడపటి షరతును అంగీకరించితి మని దొరతనమువారు వ్రాతమూలకముగా తెలియజేసినచో దీనిని తక్కిన షరతులపట్టికలో చేర్చకుండుటకు గూడ నేను సమ్మ తించెదను.

(3. ఏ) సత్యాగ్రహమును విరమించిన వెంటనే రాజకీయ ఖైదీల నందరిని, విచారణలో నున్న వారినందరిని అనగా దౌర్జన్య మొనరించి నందులకును, దౌర్జన్యమును ప్రోత్సాహపరచినందులకును శిక్షింపబడిన వారిని తప్ప తక్కినవారినందరిని వదలివేయవలెను.

(బి) ఉప్పుచట్టము, ముద్రణాలయచట్టము, ఆదాయచట్టము మున్నగు చట్టముక్రింద దొరతనమువారు వశపరుచుకొనిన ప్రజల సొత్తుల నన్నిటిని మరల వారి కిచ్చివేయవలెను.

(సి) శిక్షింపబడిన సత్యాగ్రహుల వద్దనుండియు ముద్రణ చట్టము క్రిందను తీసికొనబడిన జుల్మానాల ధరావతుల మొత్తముల నన్నిటిని మరల వారి కిచ్చివేయవలెను.

(డి) సత్యాగ్రహ సందర్భమున రాజీనామాల నిచ్చినట్టియు లేక పనిలోనుండి తొలగింపబడినట్టి గ్రామోద్యోగులలోను ఇతర ఉద్యోగులలోను మరల నెవరైన పనులలో చేరగోరినయెడల వారి పనులను వారి కియ్యవలెను.

ష.రా: వెనుక అసహాయోద్యమమునందు రాజీనామాల నిచ్చిన వారికిని డిస్మిసు చేయబడినవారికిని గూడ ఈ (డి) షరతు వర్తిం చును.

(ఇ) రాజప్రతినిధి చేసిన ఆర్డినెన్సు లన్నిటిని రద్దుపరచవలెను.

నేనిపుడు తెలిపిన యీ యభిప్రాయములు కేవలము వ్యక్తి అభిప్రాయములు. ఏలనగా ఖైదులో నుంచబడినవానికి దేశమునందు జరుగుచున్న విషయము లేవియును తెలియచేయబడవు గాన ఖైదులో నున్న వాడు రాజకీయములను గూర్చి యెట్టి అభిప్రాయమును వెల్లడింప గూడదు. అతనికి విషయములు సరిగా తెలియవు. నేను నిర్బంధము నందుండకున్నచో నా అభిప్రాయమున కుండదగిన విలువ యిపుడు ఉండగూడదనియే నాఅభిప్రాయము. జయకరు సప్రూగార్లు ఈ నోటును పండిత మోతీలాలు నెహ్రూ, పండితజవహరలాలు నెహ్రూ, వల్లభభాయి పటేలుగార్లకును ప్రస్తుతము ఉద్యమమును నడపించు చున్న కాంగ్రెసునాయకులకునుగూడ చూపించవచ్చును కాని పత్రిక లలో మాత్రము ప్రకటింపగూడదు. ఇపుడు దీనిని రాజప్రతినిధికిగూడ చూపించగూడదు. దొరతనమువా రీషరతుల కిపుడు సమ్మతించినను గూడ నన్ను చెరసాలనుండి వదలినపిమ్మట నే నిపుడు కోల్పోయిన ఆత్మవిశ్వాసము నాకు మరల కలుగుటయును రౌండుటేబిలుసభకు ఆహ్వానింపబడు నట్టి వివిధపక్షముల నాయకులందరును ముందుగా కలసి ఆలోచించి రౌండుటేబిలు సభలో కోరదగిన కడపటి పరిమితి షరతు నుగూర్చి యేకాభిప్రాయ మగుటయును జరిగిననేకాని నేను పాల్గొన జాలను. నేను వెనుక రాజప్రతినిధికి వ్రాసిన లేఖలో వివరించిన 11 అంశములనుబట్టి యిటుపైని ఏర్పరుపబడనున్న స్వరాజ్య విధానముల నన్నిటిని సమయము వచ్చినపుడు పరీక్షించుటకు నాకు స్వాతంత్ర్య ముండవలెను.

(సం) యం. కే. గాంధి.

23-7-30, ఎరవాడ సెంట్రలు ప్రిజను.

## ౪

## మహాత్ముడు పండిత మోతీలాలుగారికి వ్రాసిన లేఖ

### మహాత్ముడుపైని వివరించిన నోటుతోపాటు ఈ లేఖనుగూడ సప్రూ జయకరుగార్ల కిచ్చెను

"నా స్థితి చాల అసందర్భముగ నున్నది. నా స్వభావమట్టిదగుటచే దేశమునందు జరుగుచున్న విషయములనుగూర్చి నేను ఖైదులోనుండి నిర్ధారణగ నా అభిప్రాయమును తెలుపజాలను. కావున నా కేషరతులు సంతృప్తికరముగ నుండునో వాటిని కేవలము చిత్తుముసాయిదాగానే వ్రాసి మన మిత్రులద్వారా మీవద్దకు పంపితిని. వెనుక స్లోకోంబుగారు ఈ చెరసాలలో నాతో సంభాషించినపుడుగూడ నేమి తెలుపుటకును నా కెంతమాత్రమును మనస్కరించలేదు. కావున మీతో సంభాషించవలెననికూడ నేనపుడు స్లోకోంబుగారితో చెప్పితిని. కాని స్లోకోంబుగారు చాల బతిమాలుటచే నేను నిరాకరింపజాలకపోతిని కాన నా యభిప్రాయము నతనికి తెలిపితిని. మీతో సంభాషించుటకు పూర్వమే పత్రికలలో ప్రకటించుటకుగూడ అనుమతి నిచ్చితిని. గౌరవప్రదమైన రాజీ కుదురుటకు తగిన అదను కలిగినచో దాని కభ్యంతరము కలిగించుటకు నేను సమ్మతింపనుకాని తగిన కాలము వచ్చినదా అను విషయమున నాకింకను సంశయము మిక్కిలి హెచ్చుగానే యున్నది. చివరకు నిర్ధారణమైన ప్రత్యుత్తరము నియ్యవలసినవారు పండిత జవహరలాలు నెహ్రూగారే. మీరును నేనును జవహరలాలుగారికి సలహానుమాత్రమే యియ్యగలుగుదుము. నేను సప్రూజయకరుగార్ల చేతికిచ్చిననోటు (మెమో)లో నేను తెలుపగల కనిష్ఠపరిమాణము షరతులనే తెలిపితిని. నేనంతకంటె తగ్గింపజాలను. పండిత జవహరలాలుగారి కిష్టమున్నచో ఇంకను తగ్గించుటకాయన కర్హత కలదు. ప్రస్తుతము ప్రజలచిత్తవృత్తినిబట్టి యీ దినము కాంగ్రెసుయొక్క ఆంతరంగిక భావమునుబట్టియును గూడ నా స్థితి అసందర్భముగానే యున్నది. లాహోరు కాంగ్రెసు మహాసభలో ఆమోదింపబడిన తీర్మానము నతిక్రమించకుండ నెంతటి కఠిన షరతులను మీరు కోరినను గూడ ఆమోదించుటకు నాకెట్టి సంశయమును లేదు. కావున ఈ నోటు మీకును జవహరలాలుగారికిని సంతృప్తికరముగా నుండినయెడల తప్ప, లేనిచో మీరు దీనికెట్టి విలువను ఒసగనవసరము లేదు. నేను రాజప్రతినిధికి వ్రాసిన మొదటిలేఖలో తెలిపిన 11 షరతులనుగూర్చి మీరును జవహరలాలుగారును ఆమోదించియుండలేదని నే నెరుగుదును. వాటినిగూర్చి యిప్పటికైనను మీ అభిప్రాయము మారినదో లేదో నాకు తెలియదు. నాకుమాత్ర మిపుడు పూర్తిగ సంశయనివారణము కలిగినది. అవి యిండిపెండెన్సుయొక్క సారాంశములే. వాటిని వెంటనే అమలులో పెట్టుటకు భారతజాతికి అధికారమొసగజాలునట్టి యెట్టిషరతులనుగూడ నే నామోదింపజాలను. ఈ నోటు(మెమో)లో నేను పదకొండు షరతులలోను మూడు షరతులను మాత్రమే వివరించి యుండినను తక్కిన 8 షరతులను నేను వదలుకొనలేదు. ఈ మూడును సత్యాగ్రహమునకు సంబంధించిన వగుటచే ఈనోటులో ఈమూడింటిని మాత్రమే నేను పేర్కొంటిని. నేను మనము నిర్ధారణ చేసిన స్థితిని భంగపరచునట్టి యెట్టి సంధిలోను నేను పాల్గొనజాలను.

చిత్తగించవలెను.

(సం) యం. కే. గాంధీ.

## ౫

### 28-7-30 తేదీగల నెహ్రూపండితుల మెమోరాండము

కేంద్రకారాగృహము. నైనీ అలహాబాదు:—సర్ తేజ్ బహదూర్ సప్రూ, జయకరుగార్లతో మేము చాలసేపు ముచ్చటించియుంటిమి. బ్రిటీషు ప్రభుత్వమునకును, హైందవులకును నడుమ ప్రస్తుతము జరుగుచున్న పోరాటమును సాధ్యమైనచో నంతమొందించుటకో లేక తాత్కాలికముగ నైనను నిలుపుటకో, గాంధిగారిని మమ్ముల నిరువురను మా మా కారాగృహములలో సందర్శించుటకు తమ్ము ప్రేరేపించిన సంభవముల నన్నిటిని వారు మాకు తెలియజేసిరి. సంధి జరుగవలెననెడి వారియథార్థమగు నిచ్ఛను మేము మెచ్చుకొనుచున్నాము. సంధి సమకూరుటకుపకరింపగల మార్గముల నన్నిటిని మేము సంతోషముతో నన్వేషింతుము కాని, జాతీయోద్యమములో నెంతయో త్యాగమునుగావించియున్న హైందవులకు ఈ సంధి గౌరవప్రదమయినదిగ నుండవలయును. మరియు, ఈ సంధియొక్క ఫలితము మా దేశముయొక్క స్వాతంత్ర్యముగనే యుండవలయును. కాంగ్రెసుయొక్క ప్రతినిధులముగ మాకు ఈ సంస్థయొక్క తీర్మానములలో ముఖ్యమగు భాగములను మార్చుటకు అధికారము లేదు. అయినను కాంగ్రెసుయొక్క మూలసూత్రములను మన్నించినచో వివరములలో మార్పును గావింపవలయుననెడి సిఫార్సును గావించుటకు కొన్ని సందర్భములలో మేము సంసిద్ధులముగ నుండగలము. మొదటి యడుగులోనే మమ్ముల నొక చిక్కు ఎదుర్కొనుచున్నది. మేమిరువురము కారాగృహములో నున్నాము. కొంతకాలముగ బహిఃప్రపంచమునకును, జాతీయోద్యమమునకును దూరమైతిమి. మాలో నొకనికి రమారమి మూడు నెలలుగా దైనికపత్రిక యొద్దియు నొసంగబడి యుండ లేదు. గాంధీజీకూడ చాల నెలలుగా కారాగృహములో నుండియున్నారు. ఇంతేకాదు. ప్రథమకార్యనిర్వాహకసంఘములో మాతోబాటు సభ్యులుగా నుండినవారు రమారమి యందరును ఇపుడు కారాగృహములలోనున్నారు. వర్కింగుకమిటీయే అక్రమసంఘముగా ప్రకటింపబడినది. హైందవజాతీయమహాసభయొక్క నిండుసమావేశమునకు మాత్రమే యధికారములో రెండవస్థానము నాక్రమించు

అఖిల ఇండియా కాంగ్రెసుకమిటీ కాంగ్రెసు సంస్థలలో నాఖరు నిర్ణయమును గావింపగల సంస్థ. దీని సభ్యులు 350 మందిలో రమారమి 100 కి 75 మంది కారాగృహములలో నున్నారు. జాతీయోద్యమమునుండి విడివడియున్న మేము మాసహోద్యోగులతోడను, అందులో ముఖ్యముగా గాంధిజీతోను సమగ్రముగా నాలోచింపనిది స్పష్టమును నెట్టి చర్యను గైకొనుటకును బాధ్యత వహింపజాలము.

ఇక రౌండుటేబిలు సమావేశము విషయములో, ముఖ్యమగు సంగతులనుగూర్చి ముందుగనే యొకయొడంబడిక నుదిరినగాని ఎట్టి ఫలితమునైనను పొందజాలమని మాకు తోచుచున్నది. అట్టి యొడంబడిక చాలముఖ్యమని మే మభిప్రాయ పడుచున్నాము. అయ్యది స్పష్టమైనదిగా నుండవలెను. తప్పు అభిప్రాయములకుగాని అపార్థములకుగాని యవకాశ ముండరాదు.

సర్ తేజ్ బహదూరు సప్రూ, జయకరుగార్లు తమ సొంతబాధ్యతపైననే వ్యవహరించుచుండుటయు, వారు ఇర్విన్ ప్రభుని తరఫునగాని, వారి ప్రభుత్వము తరఫునగాని యెట్టిమాటయు నొసంగజాలకుండుటయు పారిరువురును ప్రకటనము గావించిన తమ లేఖలో ఇర్విను ప్రభువు స్పష్టపరచియున్నారు. కాంగ్రెసునకును బ్రిటీషు ప్రభుత్వమునకును పైన సూచించినటువంటి యొడంబడిక సిద్ధించుటకు మార్గమును తయారుచేయుటలో వారు (సప్రూజయకరుగార్లు) జయప్రదముగుటమాత్రము సాధ్యము కావచ్చును. గాంధిజీతోను మాయితర సహోద్యోగులతోను సంప్రతింపక స్పష్టమగు నెట్టి సంధిషరతులనైనను సూచించుటకు మాకు సాధ్యముగాదు గనుక, సర్ తేజబహదూరు సప్రూ జయకరుగార్ల చే గావింపబడిన సూచనలగూర్చియు, మాకు జూపబడిన జూలై 23 వ తేదిగల తమ చీటిలో గాంధిజీ గావించియున్న సూచనలగూర్చియు చర్చింపమానితిమి. మొత్తము మీద గాంధిజీయొక్క యభిప్రాయములలో రెండవదానితోను మూడవదానితోను మే మేకీభవింపవచ్చును. కాని మాసూచనలను గావించుటకు పూర్వము పై సంగతులనుగూర్చిన వివరములను, అందులో ముఖ్యముగా గాంధిజీయొక్క మొదటియభిప్రాయమును వారితోను, ఇతరులతోను గలసి చర్చింపగోరెదము. ఈ మాచీటిని (నోటును) రహస్యముగా నుంచవలయుననియు, 23-7-30 తేదీగల గాంధిజీయొక్క చీటిని (నోటును) ఎవరికైతే చూపించెదరో వారికిమాత్రమే దీనిని కూడ చూపింపవలయుననియు సూచించుచున్నారము.

౬

### మహాత్మునికి పండిత జవహర్లాల్‌గారి లేఖ

జూలై, 28 తారీఖున నైని సెంట్రల్ జెయిలునుండి శ్రీయుత పండిత జవహర్లాల్‌గారు ఎరవాడయందున్న గాంధిమహాత్మునికి ఈ క్రింది లేఖను వ్రాసిరి:—

బాపుజీ గారి దివ్యసముఖమునకు

ఒక చెరసాలనుండి యింకొక చెరసాలకు వ్రాయుట లైనను, ఇంతకాలము గతించిన తరువాత మీకు ఉత్తరము వ్రాయుట నాకు చాల సంతసము కలుగజేయుచున్నది. ఉత్తరము దీర్ఘముగా వ్రాయవలెనని యిచ్ఛ పొడముచున్నది. కాని అట్లుచేయుట కియ్యది సమయము కాదు. కావున ఈ లేఖలో ప్రస్తుతవిషయమునుమాత్రము వివరింతును.

డాక్టరు తేజబహదూరు సప్రూగారును, శ్రీయుత జయకర్ గారును నిన్నవచ్చి మా నాయనగారితోడను నాతోడను చాలసేపు మాటలాడిరి. ఈనాడు మరల వారు వచ్చి మాటలాడెదరు. ఇదివరకే విషయములన్నిటిని వారు మాకు తెలియజేసిరి గనుకను, మీ ఉత్తరమును, నోటును మాకు చూపిరి గనుకను, వారు మరలవచ్చి మాతో మాటలాడకముందే విషయము తండ్రీకొడుకుల మిద్దరము విచారించుకొని ఒక తీర్మానమునకు వచ్చుట మేలనని మేము తలచితిమి. రెండవసారివచ్చి వారు మాటలాడినప్పుడు ఏదైన క్రొత్తవిషయములు బయలుపడినచో ఇప్పుడు చేసికొనిన నిర్ధారణము మార్చుకొనుటకు మేము సంసిద్ధులమై యున్నాము. ప్రస్తుతసమయమున మేము చేసికొనిన నిర్ధారణ తేజబహదూరు సప్రూగారికిని జయకర్ గారికిని ఇచ్చిన నోటులో పొందుపరిచితిమి. ఇది క్లుప్తముగా నున్నది. కాని మాచిత్తప్రవృత్తులను ఈ లేఖవలన మీరు తెలిసికొనగలుగుదురు. మనవైఖరి యెట్లుండవలెనను విషయమున నాయనగారికిని నాకును భేదభావ మేమియును లేదు. ఇద్దరమును ఏకమనస్కులమై యున్నాము. రాజ్యాంగసమస్యాపరిష్కారమునుగూర్చి మీరు తెలిపిన యభిప్రాయము నాకు ఇష్టము గాలేదు. మానాయనగారికి కూడ ఇష్టము గాలేదు. మనస్థితులకును వాగ్దానములకును దేశమునందలి ప్రస్తుత పరిస్థితులకును మీయభిప్రాయ మెట్లనుకూలించునో నాకు తెలియుటలేదు. ఇంతకాలము ప్రయత్నమువలన మనకు చేకూరిన స్థానమునకు విఘాతము కలుగు సంధికి మన మొప్పుకొనరాదని మీరు చెప్పినదానితో నేనును మానాయనగారును సంపూర్ణముగా నేకీభవించుచున్నాము. ఈకారణమువలన మనము ఒక తీర్మానమునకు వచ్చుటకు పూర్వము సంగతిసందర్భములను సమగ్రముగ చర్చించుట యవసరము.

ఎదిరివారు తగినంత ముందంజ వేయలేదని నే నంగీకరింపవలసియున్నది కావున మనము బలహీనముగ ప్రవర్తించుటకాని తప్పటడుగు వేయుటకాని ఉపద్రవకరమని నాభయము.

నేను అత్యుక్తుల నన్నిటిని వీడి మితవాదమునే కావించుచున్నాను. నామట్టుకు నేను పోరాటమునిన సంతసింతును. నాయందు ప్రాణమున్నదని తెలిసికొనుట కది తోడుపడును. భారతదేశమునందీ నాల్గుమాసములలో జరిగిన విషయములు నాకు బ్రహ్మానందమును

కలుగజేసినవి. నామాతృదేశమునందలి స్త్రీల యెడలను, పురుషుల యెడలను, బాలుర యెడలను గర్వభావము వహించుటకు ఈకాలమునందు జరిగిన విషయములు కారణములైనవి. కాని చాలమంది ప్రజలకు ఈ స్వభావములేదు. వారు శాంతిని వాంఛింతురు. కనుక నేను తీవ్రముగ ప్రయత్నించి నన్ను నేను చంపుకొని, శాంతికావలెనను భావమును వహించుచున్నాను. మీరు మీయింద్రజాలమహిమచే నవీనభారతదేశమును సృష్టించినందులకు మిమ్ము అనేకవిధముల అభినందించుచున్నాను. ఇకముందు ఏమి రానున్నదో నాకు తెలియదు. కాని జరిగిపోయిన విషయములవలన జీవితము సార్థకమైనది. సామాన్యములగు మనజీవితములు మహాఘనత వహించినవి.

నైనిటాలు చెరసాలలోనున్న నేను దౌర్జన్యరాహిత్య సాధనముయొక్క మహత్త్వమును గూర్చి బాగుగ నాలోచించినాను. ఇదివరకుకంటె నిప్పుడు నేను ఈ సిద్ధాంతమునెడల హెచ్చు అభిమానము కలవాడనైతిని. మీరు ప్రతిపాదించిన దౌర్జన్యరాహిత్య సిద్ధాంతమునకు దేశీయులు చూపిన సానుభూతి మీకు అసంతృప్తికొలుప లేదని నేను తలంచుచున్నాను. ఎక్కడనో ఒకచోట తప్ప దేశము ఈ దౌర్జన్యరాహిత్యసిద్ధాంతమును ఆశ్చర్యకరమగు విధమున చేపట్టినది. ఇట్టి సానుభూతి చూపబడునని ఇదివర కెన్నడును నేను తలపలేదు.

మీ 11 షరతులయెడల నాకు అంగీకారములేదు. అవి మంచివి కావని తలచుటవలన నేనిట్లు చెప్పుటలేదు ఇవి చాల ముఖ్యమైనవే. ఐనను ఇవి స్వాతంత్ర్యము యొక్క స్థానము నాక్రమింపజాలవని నాయభిప్రాయము. ఐనను ఈ 11 షరతులను తక్షణము అమలులో పెట్టుటకు భారతజాతికి శక్తినియ్యని యే సూచనలకును మన మంగీకరింపరాదని మీరు చెప్పినమాటలతో నేనేకీభవింతును. 8 రోజుల క్రిందట మానాయనగారికి యింజక్షను ఇచ్చినప్పటినుండి నాన్నగారికి జబ్బుగనున్నది. ఆయన చాలబలహీనముగ నున్నారు. నిన్న సాయంకాలము చాలసేపు సప్రూ జయకర్లతో సంభాషించుటవలన వారు చాల డస్సిపోయినారు.

(సం) జవహర్లాలు.

### పండిత మోటలాలుగారి వాక్యములు

నన్నుగూర్చి ఆదుర్దా పడవద్దు. ఇది తాత్కాలికమగు జబ్బే కాని వేరుకాదు. రెండుమూడు రోజులలో స్వస్థత కాంచగలనని యాశించుచున్నాను. నాప్రేమ నంగీకరింపుడు.

(సం) మోతీలాల్ నెహ్రూ

### రెండవసారి మాటలాడినతరువాత వ్రాసినది

సర్ తేజబహద్దూరు సప్రూ, జయకర్ గార్లతో మరల నింకొకసారి మాటలాడితిమి. వారి యిచ్చ చొప్పున మా నోటులో కొన్ని మార్పులు చేసినాము. కాని వానివలన ముఖ్యవిషయములలో వచ్చిన భేదమేమియు లేదు. మా యభిప్రాయము స్పష్టమే. అందువిషయమున నాకు సందేహమేమియు లేదు. మావైఖరి మీ యాదరణమును పొందగలదని తలచుచున్నాను.

ఆప్రకారమున జూలై 31 వ తేదిని ఆగష్టు 1 తేదీ 2 తేదీల యందును జయకరుగారొక్కరే గాంధిగారిని సందర్శించిరి. అప్పుడు గాంధిగారు ఈ క్రింది లేఖను వ్రాసియిచ్చిరి.

(1) బ్రిటిష్ సామ్రాజ్యమునుండి భారతదేశమును విడగొట్టుటకు భారతీయులకు అధికారావకాశము లేనటువంటియు గాంధిగారు నిర్వచించిన 11 షరతులను అమలుపరచుటకు అధికారావకాశము లేనటువంటియు రాజ్యాంగప్రణాళిక యేదియును గాంధిగారు అంగీకరింపజాలరు.

(2) గాంధిగారియొక్క యీ యభిప్రాయములనుగూర్చి వైస్రాయిగారికి వెంటనే తెలియజేయవలయును. ఎందువల్లననగా అటు పిమ్మట రౌండుటేబిలుసభలో ఈ విషయములను గూర్చి గాంధిగారు ప్రస్తావించునెడల వైస్రాయిగారు ఇది గాంధిగారికి పుట్టిన క్రొత్తయూహ లని విస్మయపడకుండుటకై ముందుగా తెలియజేయవలెను. ఇదివరలో బ్రిటిష్‌వారికి ఒసంగబడియున్న ప్రత్యేకపుహక్కు సౌకర్యముల నన్నింటినిగూర్చి పునర్విమర్శ చేయుటకై యొక నిష్పాక్షిక విచారణాసంఘము నేర్పాటు చేయవలసినదిగ గాంధిగారు రౌండుటేబిలుసభయందు నిష్కర్షగ కోరగలరను విషయముకూడ వైస్రాయిగారికి తెలియజేయవలెను.

ఈ లేఖ వ్రాసినపిమ్మట ఆగష్టు 13, 14, 15 తేదీల యందు పూనాలోని ఎరవాడ జెయిలులో మాకును గాంధీగారికిని మోతీలాలుగారికిని జవహర్లాలుగారికిని ఒకసంప్రతింపు సమావేశమును మాకును వల్లభభాయిపటేలుగారికిని డాక్టరు సయ్యదుమహమ్మదు గారికిని జైరామదాసు దౌలతురాముగారికిని సరోజనీనాయుడు గారికిని ఇంకొక సంప్రతింపు సమావేశమును జరిగెను. ఈ సంప్రతింపుల పర్యవసాన మేమనగా:—వైస్రాయిగారికి చూపించ గలందులకై కాంగ్రెసునాయకులు మా కొక లేఖను వ్రాసి యిచ్చిరి. ఆలేఖ యీ క్రిందిరీతిగా నుండెను.

## ౨

## కాంగ్రెసు నాయకులందరును కలసి వ్రాసిన లేఖ

ఎరవాడ చెరసాల 15-8-30

ప్రియమిత్రులారా!

కాంగ్రెసువారికిని బ్రిటిష్‌వారికిని శాంతి సమాధానములు చేకూర్చుటకై మీరు పూనుకొనినందులకు మీకు మేమెంతయు కృతజ్ఞులము. మాకును వైస్రాయిగారికిని జరిగిన యుత్తరప్రత్యుత్తరములను

బట్టియు, మీకును మాకును జరిగిన సంభాషణలనుబట్టియు చూడగా దేశమునకు గౌరవప్రదమైన సంధిషరతు లేర్పడుటకు పరిస్థితు లింకను పరిపక్వము కాలేదని మాకు తోచుచున్నది. గత అయిదుమాసముల లోను ప్రజాసామాన్యమందు నూతన ప్రబోధము విశేషముగా కలిగినను ప్రజలలోని వివిధసంఘములవారు అనుభవించినకష్టము లెక్కువగానున్నను, సంకల్పసిద్ధికి తగినంత ఆత్మత్యాగము గాని కష్టపరంపరలు గాని ప్రజల కింకను కలుగలేదు. శాసనోల్లంఘనోద్యమము దేశమున కరిష్ట మాపాదించె నని కాని, రాజ్యాంగవిరుద్ధమైన పద్ధతి యని కాని, ఈ యుద్యమము దుర్ముహూర్తమునందు ఆరంభింపబడిన దని కాని మీరును వైస్రాయిగారును తలంచుచున్నట్లుగా మేము కూడ తలంచుటలేదని మీకు విశదపరచ నవసరము లేదు. రక్తసిక్తమైన విప్లవములతో ఆంగ్ల దేశచరిత్ర నిండియున్నది. ఆరుధిరమయ మహావిప్లవములను జంకుగొంకు లేక ఆంగ్లేయులు కొనియాడిరి. ఆ పాఠములనే మాకు నేర్పి ఆ మార్గముల ననుసరింప మాకు బోధించిరి. కాబట్టి సంకల్పమునందును అనుష్ఠానమునందును శాంతముగా వెలయుచున్న యీ యుద్యమమును వైస్రాయిగారుగాని, వివేకియైన యాంగ్లేయు డెవ్వడుకాని గర్హించి దూషించుట ధర్మముకాదు. కాని, యీ శాసనోల్లంఘనోద్యమమునుగూర్చి అధికారులుగాని అనధికారులుగాని ప్రకటించు దూషణ ఖండనములకు మేము వాదప్రతివాదములు చేయువారము కాము.

ఈ శాసనోల్లంఘనోద్యమమును జనసామాన్యము శిరసావహించి యవలంబించుటవల్లనే అది సమర్థింపదగినదై యున్నది. కనుక మేము విశదపరచగోరెడి విషయ మేమనగా ఒకవేళ మీతో మేము చేతులు గలుపుటకు వీలున్నయెడల శాసనోల్లంఘనమును పూర్తిగా నిలిపివేయుటకుగాని, తాత్కాలికముగా నిలిపివేయుటకుగాని మేము కోరుచున్నాము. నిర్నిమిత్తముగా మన దేశమువారిని స్త్రీలను పురుషులను పిల్లలను చెరసాలలపాలు చేయుట గాని, లాటీకర్రల కర్పించుటగాని, ఇతరబాధల నొందజేయుటగాని మాకు వేడుకగాని ముచ్చటగాని కాదు. కాబట్టి శాంతి సమాధానములకు గల అవకాశములను పూర్తిగా విమర్శించుటకై మేము శక్తివంచనలేక కృషిచేయగలమని మీకును మీద్వారా వైస్రాయిగారికిని అభయమొసంగుచున్నాము. కాని, అట్టి అశావకాశములు భూనభోంతరాళముల మధ్య నెచ్చటను మాకు కన్పించుట లేదు. భారతదేశాభ్యుదయమార్గమును నిర్ణయించగలవారు భారతీయులే యను దృఢమైన నమ్మిక మాంగ్లేయాధికారులమనస్సున కెక్కినట్లుగా సూచన లేవియు కన్పించుటలేదు. సదుద్దేశసంకలితులైన యధికారుల వాగ్దానప్రమాణములనుకూడ మేము విశ్వసింపజాలకున్నాము. ఈ సనాతన భారతభూమిసంపదైశ్వర్యములను శతాబ్దులనుండియు ఆంగ్లేయులు పీల్చి పిప్పిచేయుటవల్ల, భారతీయులు నేడు అధఃపతితులై తమ రాజకీయార్థిక నైతిక దైన్యమును గుర్తింపజాలకున్నారు. ఈ రీతిగా భారతీయుల నిరంతర దైన్యమునకు కారణభూతులైన ఆంగ్లేయులే కర్తలైన ప్రక్కకుతొలగి వెనుకకుమరలి భారతీయుల భావ్యభ్యుదయమున కడ్డము రాకుండుటయే ఆంగ్లేయు లిప్పుడు చేయదగిన యుపకార మనుసంగతి ఆంగ్లేయు లంగీకరింపజాలరు. కాని, మీరును మనసోదర దేశీయులు మరికొందరును ఆంగ్లేయులవలె భావింపరనుసంగతి మాకు తెలియును. రానున్న రౌండుటేబిలుసభలో హాజరై సంప్రతించుటకు తగినంత పరివర్తనము ఆంగ్లేయులయందు కలిగినదని మానమ్మకమైయున్నది. మేము ఇప్పుడు ప్రతిబంధకముల జిక్కియున్నను ఈవిషయమున మాశక్త్యనుసారము మీకు తోడ్పడగలము.—మీరు స్నేహపూర్వకముగ చేయుచున్న యీసంధిప్రయత్నములకు మేము చేయదగిన సహాయ మీక్రింద పేర్కొనిన దొక్కటే. కాబోవు రౌండుటేబిలుసభనుగూర్చి వైస్రాయిగారు మీకు వ్రాసిన యుత్తరములో వైస్రాయిగారి వాక్యములు అస్పష్టార్థభూయిష్ఠములుగ నున్నవి. అందువల్ల గతసంవత్సరము లాహోరులో భారతజాతి కోరిన కోరికల కనుగుణముగ నన్వయించి వైస్రాయిగారి వాక్యములకు విలువకట్టుటకు వీలు లేకున్నది. అదియును గాక, కాంగ్రెసువర్కింగు కమిటీసభను సక్రమముగా జరిపి సంప్రతించకుండగను, లేదా అవసరమైనచో అఖిలభారత కాంగ్రెసు కమిటీసభ జరిపి సంప్రతించకుండగను, కాంగ్రెసు సభాధికారము వహించి ఏదియును నిర్ణయించి మేము చెప్పజాలము. కాని, మామట్టుకు మేము ఈ క్రింది షరతులు లేని సమాధాన మేదియు అంగీకరింపజాలము. రౌండుటేబిలు సభలో నిర్ధారణచేయబడు రాజ్యాంగప్రణాళిక ఏదైనను ఈ మూడు అవకాశములును అట్టి ప్రణాళికలోనుండి తీరవలెను:

(1) బ్రిటిషుసామ్రాజ్యములోనుండి భారతీయులు విడిపోవుటకు ప్రణాళికలో అధికారావకాశము లుండవలెను.

(2) ఆ ప్రణాళికవల్ల భారతీయులకు స్వదేశ సంరక్షకసైన్యాధికారమును, సంపూర్ణార్థిక స్వాతంత్ర్యమును నుండవలెను. వైస్రాయిగారికి గాంధిగారు వ్రాసిన లేఖలో పేర్కొనిన 11 షరతులును ఆ ప్రణాళికలో చెల్లింపబడవలెను.

(3) బ్రిటిషువారికి ఈ దేశములో గల ప్రత్యేకహక్కుసౌకర్యముల న్యాయాన్యాయములను గూర్చియు, ప్రజలపద్ద ప్రభుత్వమువారు చేసిన ఋణముల న్యాయాన్యాయములను గూర్చియు స్వరాజ్యప్రభుత్వమువారికి ఆఋణములయం దుండదగిన బాధ్యతనుగూర్చియు విచారణచేయుట కొక నిష్పాక్షికవిచారణసంఘమును నియమించుటకు అధికారావకాశము లా రాజ్యాంగప్రణాళికలో నుండవలెను.

షరా:—ప్రభుత్వాధికారమును భారతజాతీయప్రభుత్వము వారికి ఒప్పగించునప్పుడు బ్రిటిష్‌వారితో పరస్పరమును చేసికొనవలసిన సర్దుబాట్లనుగూర్చి నిర్ణయించుటకు భారతీయ ప్రతినిధిసంఘమే అధికారము కలిగియుండవలెను.

2. పైనిజెప్పినదంతయును బ్రిటిష్‌గవర్నమెంటువారికి సాధ్య మని తోచేయెడలను, ఆప్రకారముగ అంగీకారయోగ్యమై యున్నదని వారు స్పష్టముగ ప్రకటించేయెడలను, శాసనోల్లంఘనోద్యమము రద్దు చేయవలయు నని వర్కింగుకమిటీవారిని మేము కోరగలము. అనగా కేవలము శాసనధిక్కారార్థము చేయుచున్న శాసనోల్లంఘనమును మాత్రము నిలిపివేయుదుము. కాని, విదేశవస్త్రవిక్రయసాత్వికనిరోధము గాని, మద్యవిక్రయసాత్వికనిరోధముగాని యథాప్రకారముగ జరుగుచునేయుండును. సంపూర్ణ మద్యపాననిషేధమును ప్రభుత్వమువారు అనుశాసించువరకును విదేశవస్త్ర నిషేధమును ప్రభుత్వమువారు అనుశాసించువరకును పైనిజెప్పిన సాత్వికనిరోధము జరుగుచునేయుండును. ప్రజలు ఇష్టానుసారము నిరాటంకముగ ఉప్పుపండించుకొనుచునే యుండగలరు. ఉప్పుచట్టములోని దండనవిధు లేవియు అమలుపరచ కూడదు. కాని, గవర్నమెంటువారి డిపోలమీదకుగాని ఇతర ఆసాములడిపోలమీదకుగాని దండెత్తకుండగలము.

శాసనోల్లంఘనము నిలిపివేయబడుటకు పూర్వము ఈక్రింది విధులను గవర్నమెంటువారు నిర్వర్తింపవలెను. 1 హింసాకలితమైన దౌర్జన్యములు చేసినందులకుగాని, అందులకు పురికొల్పినందులకుగాని శిక్షితులైనవారు తప్ప మిగిలిన సత్యాగ్రహఖైదీల నందరను విడుదల చేయవలెను. (2) ఉప్పుచట్టము ననుసరించికాని ముద్రణశాసనము ననుసరించికాని రెవిన్యూచట్టము ననుసరించికాని సర్కారువారు దాఖలుపరచుకొనియుండిన, స్థిరచరాస్తులన్నియు మరలా యివ్వబడవలెను (3) ముద్రణాశాసనము ననుసరించి నిందితులైన వారివద్ద వసూలుచేసిన జరిమానాలును ధరావతులును వాపసుచేయవలెను. (4) శాసనోల్లంఘనోద్యమము ననుసరించి తమయుద్యోగములకు రాజీనామాల నిచ్చియుండిన అధికారులను గ్రామోద్యోగియులను మరల నుద్యోగములందు చేర్చుకొనవలెను. శాసనోల్లంఘనోద్యమ కారణంబున బర్తరఫు చేయబడిన యుద్యోగులుకూడ మరల నుద్యోగపదవులు కోరే యెడల వారి కా పదవుల నొసంగవలెను.

షరా:—పైని జెప్పిన షరతులు వెనుకటి సహాయనిరాకరణోద్యమావలంబులకుగూడ వర్తింప జేయవలెను.

5. వైస్రాయిగారు తమ స్వతంత్రాధికారముతో అమలుపరచిన నిరంకుశశాసనముల నన్నిటిని (ఆర్డినెన్సులను) రద్దుచేయవలెను.

పైని జెప్పిన షరతు లన్నియు ఆమోదించి చెల్లింపబడిన పిమ్మట రౌండుటేబిలు సభయందు కాంగ్రెసు ప్రతినిధులు హాజరు అయ్యే విషయమును రౌండుటేబిలుసభ్యవర్గవిషయమును నిర్ణయింపబడును.

ఇట్లు సద్భావముతో విన్నవించు:—(సం) మోతీలాలునెహ్రూ, (సం) సరోజనీ నాయుడు, (సం) వల్లభభాయి పటేలు, (సం) జయరామదాసు దౌలతురామ్, (సం) సయ్యదు మహమ్మదు, (సం) జవహర్‌లాలు నెహ్రూ.

## ౮

## రాయబారుల లేఖ

## పండితులకును గాంధిమహాత్మునికిని అభినందనములు

బొంబాయినుండి 1930 సంవత్సరము ఆగస్టు 16 తారీఖున సప్రూజయకర్‌గారలు వ్రాసిన లేఖ ఈక్రింద పొందుపరుపబడినది:-

బొంబాయిలో మలబార్ హిల్లునందలి వింటర్‌టన్ రోడ్డు నుండి మేము ఈ క్రింది ప్రత్యుత్తరమును ఆగస్టు 16 తారీఖున పంపితిమి.

మిత్రులారా,

పూనాయందును అలహాబాదునందును మిమ్ములను కలసికొని ముచ్చటించినప్పుడు మీరు మాయెడల చూపిన యాదరణకును, ఓపికకును మిమ్ముల నెంతయు నభినందించుచున్నాము. దీర్ఘము లగు నీ సంభాషణలవలన మీకు కలిగిన కష్టమునకు మేము చింతిల్లుచున్నాము. ఆరోగ్యము చెడిన సమయములో అలహాబాదునుండి బొంబాయికి వచ్చుటయందు పండిత మోతీలాల్ నెహ్రూగారికి కలిగిన కష్టమునకు మాకు దుఃఖమగుచున్నది. శాసనోల్లంఘనోద్యమమును విరమించి, రౌండుటేబిల్ సమావేశమునందు పాల్గొనుటకై మీరు చెప్పిన షరతులుగల లేఖ మా కందినది. మీకు ఇదివరకు తెలియజేసినట్లు ఈపని మేము (1) అప్పుడు కాంగ్రెస్ అధ్యక్షుడుగా నుండిన పండిత మోతీలాల్ నెహ్రూగారు జూన్ 20 వ తారీఖున స్లోకోంబుగారికి చెప్పిన ప్రాతిపదికమీదను, (2) జూన్ 25 వ తారీఖున స్లోకోంబుగారు పండిత మోతీలాల్ గారికి పంపినపత్రము ప్రాతిపదికమీదను ప్రారంభించితిమి. ఈషరతులు మాకును, రాజప్రతినిధిగారికిని సంధికుదురుటకు ప్రాతిపదికగా పండిత మోతీలాల్ గారిచే నప్పుడు అంగీకరింపబడెను. స్లోకోంబుగారు ఈరెండు పత్రములను మాకు పంపిరి. తరువాత మేము సంధి కుదురుటకు వీలుకలదేమోయని విచారించుటకు గాంధిమహాత్ముని, పండిత జవహార్లాలుగారిని, పండిత మోతీలాలుగారిని కలసికొని ముచ్చటింప గోరుచు రాజప్రతినిధి యాజ్ఞ వేడితిమి. పైని తెల్పబడిన రెండవ పత్రము మావద్దనుండి మీరు తీసికొంటిరి. ఈనెల 14 వ తారీఖున మీరిచ్చిన ఉత్తరములోని షరతులు మనచే నంగీకరింపబడినవే యని యిప్పుడు మాకు కనబడుచున్నది. రాజప్రతినిధి దీనిని విచారించుటకై దానిని పంపవలసియున్నది. వారి నిర్ణయమునకై మేము వేచియుండవలెను. ఈ లేఖలలో ముఖ్యమైనవానిని పత్రికలలో ప్రచురింపవలెనను మీ కోరికను మేము గమనించితిమి. మీలేఖను రాజప్రతినిధి యాలోచించినతరువాత ఉత్తర ప్రత్యుత్తరముల నన్నిటిని ప్రచురిం




# సుగంధనశ్యము

చిరకాల పరిశ్రమచే, ఇది కనిపెట్టబడినది. ఇదివరకే ఇది లోకమందంతటను వ్యాప్తము చేయబడి సుప్రసిద్ధమైనది. కాబట్టి దీనినిగురించి మేము విశేషించి శ్లాఘింపవలసిన పనిలేదు.

ఈ సుగంధనశ్యము నుపయోగించుటవల్ల మెదడు, ముక్కు, కన్నులతో సంబంధించిన సమస్త వ్యాధులును సమూలముగ నశించును. పీనసము, ఒంటితలనొప్పి, తలలోనిపోట్లు, జలదోషములు, మొదలగు కంఠమునకు పైబడిన 96 వ్యాధులకును ఈ సుగంధనశ్యము పెట్టినదిభిక్షము. ఇట్టి గుణవిశేషము గలిగి యింతసులభముగా విక్రయింపబడు నౌషధ మిదితప్ప మఱియొకటిలేదు. చిరకాలముంచినను చెడని సుగంధ విశేషమువలన, పొడి యభ్యాసములేనివారికి సహిత మిది హితవుగా నుండును.

ముఖ్యగమనింపు:—ఆంధ్ర లేక ఆంగ్లభాషలలో విలాసమును విడి విడిగా వ్రాయవలెను.

బుడ్డి 1-కి అ. 0-4-0; వి. పి ఖర్చు అ. 0-4- డజన్ 1-కి రూ. 2-8-0 వి. పి. ఖర్చు 0-9-0.

## యూక్‌లిప్‌టస్ ఆయిల్

స్వచ్ఛమైన నీలగిరితైలము ఇన్‌ఫ్లుయంజా, ప్లేగు, కలరా. వీటికి పరమౌషధము వైద్యమునందు ప్రసిద్ధిచెందిన ఒక వైద్యునివల్ల చెప్పబడిన ఈతైలము వాంతిభేది, ప్లేగువ్యాధి, తేలు మొదలైన విషజంతువుల కాటులు, కత్తిమొదలైనవాటి గాయములు, నరములచుఱుకు, నిప్పు మొదలైనవాటివల్ల కలిగెడు అనేకవిధములైన వ్రణములు, ఇన్‌ఫ్లుయంజా, మలేరియా, అనేకవిషజ్వరములు, దగ్గు ఉబ్బసము, వాయువు వల్ల కలిగెడిపోట్లు, నొప్పులు, పల్లునొప్పి, తలనొప్పి, ఒంటితలనొప్పి, కండ్లమంట, శీతభేది, మొదలైన వాటికి అనుభవసిద్ధౌషధము, 1 ఔ. బుడ్డి 1-కి అ. 0-4-0; వి. పి. చార్జి 0-4-0;

1 ఔ. బుడ్లు 12-కి రు, 2-8-0; వి. పి. చార్జి 0-12-0; 1 ఔ. బుడ్లు గ్రోసు 1-కి 28-0-0.

**టి. సి. నాగలింగప్ప అండు కంపెని,** 280 వాల్‌టాక్సురోడ్డు, పోష్టుబాక్సు 516, పి. టి. మద్రాసు.

# గుణము చౌక అందము




## నూతన 1931 నమూనాలు యిప్పుడు ప్రదర్శింపబడుచున్నవి

వివరములకు వ్రాయుడు లేక దయచేయుడు.

# బైరాం షా అండు కో, లిమిటెడ్.

29, జనరల్‌పాటర్సరోడ్ మౌంటురోడ్డు, మద్రాసు.

ఫోన్ 8157 — టెలిగ్రామ్సు "మినోరు"

సబ్ డీలర్ల పేర్లు:—

1. కె. జె. ధనం అండు కో, వెల్లూరు.
2. యం. గౌస్ మోదీన్ అండు సన్సు, నెల్లూరు.
3. వి. ముత్తుమోటార్‌వర్క్సు కడలూరు ఒ. టి.
4. పి. యల్. సోమసుందరంచెట్టియార్, సేలం.
5. పి. శౌరయ్య బ్రదర్సు, గుంటూరు.
6. యస్. హెచ్. అబ్దుల్లా సైకిల్ అండు మోటారు ఇంపోర్టింగు కంపెనీ, బెజవాడ.

చేదము. ఈలేఖను పూర్తిచేయుటకు ముందు ఒకవిషయమును మీకు చెప్పవలసియున్నది. శాసనోల్లంఘనోద్యమమును విరమించుటవలన దేశములో స్థితి చాల బాగుపడునని నమ్ముటకు మాకు కారణములుండెను. దౌర్జన్యరహితముగా ప్రవర్తించిన ఖైదీలందరును విడుదల చేయబడుదురనియు, చిటగాంగు, లాహోరు కుట్రకేసుల విషయమై ప్రతిపాదింపబడిన ఆర్డినెన్సులు తప్ప తక్కినవన్నియు రద్దుచేయబడుననియు, దేశములో నన్ని రాజకీయసంస్థలకంటె కాంగ్రెసువారికి రౌండుటేబిలు సమావేశములో హెచ్చు ప్రాతినిధ్య మియ్యబడుననియు నమ్ముటకు మాకు కారణము లుండెను. మరియు స్లోకోంబుగారితో సంభాషించుచు పండిత మోతీలాల్ గారు చెప్పినషరతులకును, మోతీలాల్ గారి సమ్మతితో స్లోకోంబుగారు మాకు పంపిన ప్రకటనమునకును, రాజప్రతినిధి మాకుపంపిన లేఖలోని షరతులకును ముఖ్యభేదము లేవియు లేవని మేము అభిప్రాయపడినట్లు తెలిపితిమని చెప్పుట అనవసరము.

మీమిత్రులు,
(సం) తేజబహద్దూర్ సప్రూ,
,, యమ్. ఆర్. జయకరు.

అటుతరువాత జయకర్ గారొక్కరే ఆగస్టు 21 వ తేదీనాడు కాంగ్రెసు నాయకులు వ్రాసియిచ్చిన యుత్తరమును సిమ్లాకు తీసికొనిపోయి వైస్రాయిగారితో సంప్రతించిరి. సర్ సప్రూగారు 25 వ తేదీనాడు జయకరుగారిని కలసికొనిరి. అటుపైని మేము 25,27 తేదీల మధ్య వైస్రాయిగారిని మరికొందరు ప్రభుత్వకార్యనిర్వాహక వర్గ సభ్యులను చాలసార్లు సందర్శించితిమి. దీని కంతకును ఫలితముగ, అలహాబాదులోను ఎరవాడలోను కాంగ్రెసు నాయకులకు చూపింపవలసినదిగా వైస్రాయిగారు మా కీ క్రిందియుత్తరమునిచ్చిరి.

## ౬

### రాజప్రతినిధిగారి లేఖ

వైస్రీగల్ లాడ్జి,
సిమ్లా, 28 ఆగస్టు. 1930.

ప్రియమిత్రులు సర్ తేజబహదర్ గారికి,

జయకర్ గారును మీరును గలసి ప్రస్తుతము జైలులోనున్న కాంగ్రెసు నాయకులతో జరిగించిన సంప్రతింపుల ఫలితములను గూర్చి నాకు తెలియజేసినందుకును, వా రందరును గలసి ఆగస్టు 15 వ తేదీనాడు వ్రాసిన లేఖను దానికి మీరు వ్రాసిన ప్రత్యుత్తరమునుగూడ నాకు పంపినందుకును మీకు నేను నా కృతజ్ఞతను దెల్పుకొనుచున్నాను. భారతదేశములో మరల సాధారణపరిస్థితులను నెలకొల్పుటకై ప్రజాసేవ చేయు నుద్దేశముతో మీ యంతటమీరై భారమును వహించి ప్రయత్నములు కొనసాగించిన మీ యున్నతభావమును నేనెంత యెక్కువగా హర్షించుచున్నదియు మీరు తెలిసికొనగోరెదను. మీరు మీ ప్రయత్నములకు దిగినప్పటి స్థితిగతులు మరల నొకసారి జ్ఞాపకముచేసికొందగినవి. భారతీయులు ప్రస్తుతమున బాధ్యత వహించి నిర్వహించుటకు తగిన స్థితిలో లేని విషయములలో తగిన యేర్పాటులను గావించుచు, తదనుకూలముగ వారి సొంత వ్యవహారములను నిర్వహించుకొనుటలో వారికెంత యెక్కువ యధికారమిచ్చుటకు వీలగునో అంతయెక్కువ యధికారమును వారు సంపాదించుకొనుటకు వారికి హృదయపూర్వకముగ సాహాయ్యపడుటకు నేను సిద్ధముగా నున్నాననియు నా ప్రభుత్వమువారు గూడ నట్లే కోరుచున్నారనియు ఈసందర్భమున బ్రిటిషు ప్రభుత్వమువారి యభిప్రాయముగూడ నిదియే యని నేను నిస్సందేహముగా చెప్పగలననియు, జూలై 16 వ తేదీనాడు నేను వ్రాసిన యుత్తరములో మీకు నేను స్పష్టపరచియుంటిని. ఇట్లు భారతీయులు బాధ్యత వహించుటకు తగిన స్థితిలోలేని యంశములేవి? వానివిషయమున ఎట్టియేర్పాట్లు గావింపవలసి యుండును? అను సంగతులనుగూర్చి లభించినంతవరకు సాధనసంపత్తి నంతను పరీక్షించి సమాలోచించుట లండన్ సభ కార్యక్రమమునం దొకభాగము 9 వ తేదీ నాడు నేను శాసనసభయం దొసంగిన యుపన్యాసమునందు మరి రెండుసంగతులను నేను స్పష్టపరచి యున్నాను.

ఈ రాజ్యాంగసమస్య నంతను, పూర్తిగ, అన్నిదృక్పథముల నుండియు పరీక్షించుటకు, లండన్ సభకు వచ్చు ప్రతినిధులకందరికిని నిరాఘాటమైన యధికారముకలదు, అనునది యందు మొదటిది. ఆ సభవారు ఆమోదించిన ఎట్టినిర్ణయమైనను సరే, అటుతరువాత క్యాబినెట్ వారు పార్లమెంటువారి యెదుట పెట్టబోవు సూచనలకు ఆధారముగ నుండును అనునది రెండవది. కాంగ్రెసు నాయకులు మీకు వ్రాసియిచ్చిన యుత్తరము మీరు స్వయముగా పూనుకొన్న యీ కార్యములో మీకు సాహాయ్యపడుటలేదేమో అని నాభయము. మీరుగూడ ఈ సంగతిని ఒప్పుకొందురని నానమ్మకము ఈ యుత్తరముయొక్క సాధారణధోరణిని బట్టియు, అందుగల యంశముల ధోరణినిబట్టియు, కాంగ్రెసు కార్యక్రమమనుకూలమున దేశమున కంతకును, ముఖ్యముగ ఆర్థికదృష్టినిబట్టి యెంతటిహానిగలిగినదియు, చూచినచో, అందుగల సూచనలనుగూర్చి వివరముగా చర్చించుటకు ప్రయత్నించుటవల్ల ఏవిధమైన ప్రయోజనము గాని యుండునని నాకు తోచదు. అం దుదాహరింపబడిన ప్రతిపాదనల ఆధారముగా గొని చర్చకు దిగుట యసాధ్య మని నేను స్పష్టముగా చెప్పవలసియుండును. మీరు మరల కాంగ్రెసు నాయకులను చూడగోరినచో వారి కీసంగతి స్పష్టపరుపవలయునని నేను కోరుచున్నాను.

ఆగస్టు 16 వ తేదీనాడు మీరు వారికి వ్రాసిన ప్రత్యుత్తరమునందలి కడపటి పేరానుగూర్చి చెప్పవలసిన సంగతి యొకటిగలదు. మన మీ సంగతులనుగూర్చి చర్చించినప్పుడు శాసనోల్లంఘనము విర

మింపబడినప్పు డింక నటుపై ఆర్డినెన్సులకు అవసరముండదు. కాబట్టి ఒక్క లాహోరు కుట్రకేసు, చిట్టగాంగు దోపిడికేసుల సందర్భమున తప్ప మిగతవిషయములలో ఆర్డినెన్సులను అమలులో నుంచగోరనని నేను చెప్పియుంటిని. కాని శాసనోల్లంఘనము విరమింపబడినదను కారణమునుబట్టి సరిగా అట్టిది విరమింపబడినసమయమునకే స్థానిక ప్రభుత్వములకు (రాష్ట్రప్రభుత్వములకు) గూడ శాసనోల్లంఘనములో శిక్షింపబడినవారినిగాని అరెస్టయి విచారణలోనున్న వారినిగాని వెంటనే విడుదలచేయుటకు దగిన యవకాశముండునో ఉండదో నిశ్చయముగ నేను చెప్పజాలననికూడ స్పష్టపరచియుంటిని. ఈసందర్భమున ఉదారభావముతో కార్యవ్యవహారమును నిర్వహింపవలసియుండునని నేనెంతగట్టిగ నాశించుచుండినను, ఆయాకేసుల ప్రత్యేకస్వభావము లనుబట్టి సానుభూతితో వారిని ఆయారాష్ట్రప్రభుత్వములవారు పరిశీలించునట్లు వారికి సలహానొసంగుటయొక్కటియే నేను చేయగలిగిన పనియనికూడ అప్పుడు నేను స్పష్టముగ జెప్పియుంటిని. కాంగ్రెసువారు శాసనోల్లంఘనమును విరమించి లండన్‌సభలో పాల్గొనగోరినచో వారి కుండవలసిన ప్రాతినిధ్యమునుగూర్చి మీరు సూచించియున్నారు. ఈసందర్భమున కాంగ్రెసువారు, అధికసంఖ్యాకత్వము విషయమున, సభ మొత్తముమీదనే తమకు మెజారిటీ యుండవలెనని కోరుటలేదని మీరుచెప్పినట్లును, అటుపై కాంగ్రెసువారికి తగినంత ప్రాతినిధ్యము సమకూర్చవలసినదిగా సార్వభౌముని ప్రభుత్వమువారిని కోరుటలో నాకేమియు కష్టముండదని నేను నాయభిప్రాయమును తెలియబరచినట్లును నాకుజ్ఞాపకము. కాంగ్రెసుపక్షమువారు తమకిష్టమైన ప్రతినిధులపేర్లను వ్రాసియిచ్చినచో అవసరమునుబట్టి ఆపేర్ల పట్టికను పరిశీలించుటకు నేనంగీకరించెదననికూడ నేను చెప్పియుంటిని. ఇట్టి పరిస్థితులలో, మీప్రయత్నములకు తగినఫలము, మీరాశించిన ఫలితము, కలుగకుండ పోయినచో ప్రజలకు పూర్తిగా తెలిసియుండవలయును. అందుచే ఉత్తరములు శీఘ్రముగా ప్రకటింపబడుటమంచిది. ఈ కారణమునుబట్టి నాస్థితినిగూర్చియు, నా ప్రభుత్వముయొక్క స్థితినిగూర్చియు స్పష్టముగా మీరు తెలిసికొన గోరుచుందురని నా యభిప్రాయము.

ఇట్లు
(సం) ఇర్విన్

## నెహ్రూ పండితులను మరల సందర్శించుట

కాంగ్రెసు నాయకుల యుత్తరము విషయమున మాచే సూచింపబడిన కొన్ని సంగతులనుగూర్చి రాజప్రతినిధికిని మాకును జరిగిన సంప్రతింపులయొక్క ఫలితములనుకూడ కాంగ్రెసు నాయకులకు దెలుపుటకు రాజప్రతినిధి మాకనుజ్ఞ నొసంగిరి. ఆగస్టు 28 వ తేదీనాడు సిమ్లాను వదలి నెహ్రూపండితులను డా. మొహమ్మద్‌గారిని 30, 31 వ తారీఖుల నాడు నైనీలోకలసి సంభాషించితిమి. వారికి రాజప్రతినిధిగారి లేఖను జూపించి మా సంభాషణయొక్క ఫలితములను దెలియబరచితిమి. ఆగస్టు 15 తేదీని వారు మాకు వ్రాసియుండిన యుత్తరమున సూచింపబడి యుండనట్టియు, ఆగస్టు 28 వ తేదీగల రాజప్రతినిధిగారి జాబునం దెత్తుకొనబడి యుండనట్టియు సంగతుల విషయమున, నీ క్రిందిపద్ధతిపై ఒడంబడిక సాధ్యమగు నని రాజప్రతినిధిగారితో మేము జరిపిన సంభాషణలవలన మేము నమ్మగలిగియున్నా మని వారికి దెలియజెప్పితిమి—

(అ) రాజ్యాంగసూత్రమువిషయమున ఆగస్టు 28 వ తేదీనాడు రాజప్రతినిధి మాకు వ్రాసియున్న యుత్తరమునందు రెండవ పేరాలో సూచింపబడిన నాల్గుముఖ్యసూత్రములలో నడువబడిన రీతినే సంగతి సందర్భము లుండగలవు.

(ఆ) ఇండియాకు ఇష్టమున్నపుడు సామ్రాజ్యమునుండి విడిపడుటకు హక్కుండునా యను ప్రశ్నను రౌండుటేబిలు సమావేశమున గాంధిజీ గొని తెచ్చుటకు అనుమతింపబడునా యను విషయమున, సంగతిసందర్భము లిట్లున్నవి :—"రాజప్రతినిధిగారు మాకు వ్రాసిన లేఖలో నుడివియున్నట్లుగా, రౌండుటేబిలు సమావేశము స్వేచ్ఛగా సంప్రతింపులను జరుపుట కుద్దేశింపబడిన సమావేశము. కావున నేరైనను తమకు రుచించిన ఏప్రశ్ననైనను సూచింపవచ్చును కాని, యీ ప్రశ్ననిపుడు గాంధిగారు లేవదీయుట వివేకవంతము గాజాలదని రాజప్రతినిధి యభిప్రాయపడిరి. అయినను, వారు ఇండియా ప్రభుత్వమును ఈ ప్రశ్నతో సంబోధించుచో ఈ ప్రశ్నను చర్చనీయాంశముగా పాటింప ప్రభుత్వమువారు సంసిద్ధులు గారనియే రాజప్రతినిధి యందురు. అప్పటికిని గాంధీగారీప్రశ్నను లేవదీయ గోరుచో రౌండుటేబిలుసమావేశములో వా రటుల గావింపదలచియున్నారని ఇండియామంత్రికి ప్రభుత్వమువారు దెలియబరతురు.

(ఇ) ధనవ్యయభారములను గొన్నింటిని ఇండియా భరింపవలసియుండుటను గూర్చియు, ఈ విషయమును నిష్పాక్షికమగు విచారణసంఘముచే పరీక్షింపబడునటులు చేయుటనుగూర్చియు రౌండుటేబిలు సమావేశములో చర్చింపబడుటకుగల హక్కువిషయములో సంగతిసందర్భము లిట్లుండును:—ఋణములనన్నిటిని పూర్తిగా నిరాకరించునట్టి సూచనకయినను రాజప్రతినిధి యొప్పుకొనజాలరు. అయినను ఇండియాయొక్క ధనవ్యయభారమునకు సంబంధించిన యెట్టి ప్రశ్ననైనను, ఎవరైనను రౌండుటేబిలు సమావేశములో పరీక్షార్థము గొని రావచ్చును.

(ఈ) ఉప్పుచట్టమునుండి రక్షణనొసగు విషయమున రాజప్రతినిధిగారి వాదన యిది: (1) ఉప్పుపన్నునుగూర్చి పైమనకమిషను వారు గావించియున్న సిఫార్సు అంగీకరింపబడుచో ఈపన్ను రాష్ట్రముల వశమునకు మార్చబడగలదు. (2) మరియు, ఇప్పటికే ప్రభుత్వాదాయము చాల లోటుగలిగియుండెను. కాన, ఆదాయమున

నుపకరించు ఈ యుపకరణమును పోగొట్టుకొన ప్రభుత్వమువా రిచ్చ గింపరు. అయినను, ఉప్పుచట్టమును శాసనసభవారిచే రద్దుపరిపించ గల్గి నచో, అట్లు రద్దుపరచుటవలన గలిగిన యాదాయపు నష్టమును భర్తీ చేయుటకు మార్గము సూచింపబడుచో, రాజప్రతినిధియు, వారి ప్రభుత్వమును ఈ ప్రశ్నను దానిగుణాగుణముల ననుసరించి యాలోచింప గలరు. శాసనములలో నుప్పుచట్టమొక భాగముగానుండువరకు నుప్పుచట్టము బహిరంగముగా నుల్లంఘింపబడుటకు రాజప్రతినిధి యుపేక్షింపజాలరు. సద్భావమును, శాంతియు మరల నెలకొనినపిదప దేశములోని బీదలకు ఆర్థికసాహాయ్య మేరీతిని చక్కగా నొసగబడ గలదో రాజప్రతినిధితోను, వారి ప్రభుత్వముతోను గలసి సంప్రతించుటకు హైందవనాయకులిష్టపడుచో రాజప్రతినిధి హైందవ నాయకుల చిన్నసమావేశము నొకదానిని సంతోషముతో జరిపెదరు.

(ఉ) పికెటింగు విషయమున సంగతిసందర్భము లివి:—పిక్కెటింగువలన ప్రజలలో నేయొక భాగమునకుగాని యిబ్బందిచికాకు (న్యూసెన్సు) గల్గినను, పిక్కెటింగుతో సహా మనుష్యులయెడ జబర్దస్తీ, బలప్రయోగము మొదలగునవి జరిగినను, శాసనముల ప్రకారము చర్య దీసికొనుటకు రాజప్రతినిధి హక్కు నుంచుకొనెదరు. మరియు ఉన్నట్లుండి యుదయింపగల పరిస్థితుల నెదుర్కొనుటకు వలయు శాసనానుసారమగు అధికారమునుకూడ ప్రభుత్వమువారు గల్గియుందురు. పైషరతులకు లోబడి, శాంతి నెలకొనినపుడు పిక్కెటింగు ఆర్డినెన్సు ఉపసంహరింపబడును.

(ఊ) 6 వ ప్రశ్న, శాసనోల్లంఘనోద్యమసందర్భమున రాజీనామా నిచ్చియున్నట్టియు, తొలగింపబడి యున్నట్టియు నుద్యోగస్థులకు సంబంధించినది. ఈ విషయమున ప్రభుత్వమువారు చెప్పున దేమనగా, ఈ ప్రశ్న ముఖ్యముగా స్థానిక ప్రభుత్వములకు సంబంధించినది. ఉద్యోగములు ఖాళీగానుండవలయుననియు, ఇటీవలి చిక్కు సమయమున ప్రభుత్వమువారిచే నియమింపబడినట్టియు, విశ్వసనీయులయినట్టియు మనుజులను వారి యుద్యోగములనుండి తొలగింపరాదనియు షరతులకు లోబడి, యావేశాధిక్యముచేత నుద్యోగములను వదలినవారిని మరలనుద్యోగములలోనికి స్థానిక ప్రభుత్వము వారు చేర్చుకొనెదరని నమ్మబడును.

(ఋ) పత్రికాశాసనముక్రింద ప్రభుత్వమువారు వశపరచుకొనిన ముద్రణాలయములను వాపసుచేయు విషయమున నేమియు కష్టముండజాలదు.

(ౠ) జరిమానాక్రింద చెల్లింపబడిన మొత్తమును, ఆస్తులను మరల నిచ్చివేయు ప్రశ్న ఎనిమిదవది. ఈవిషయమున స్పష్టమగు నిర్వచన మవసరము. వశపరచుకొనబడినట్టియు, అమ్మబడినట్టియు ఆస్తుల విషయమున నితరుల (మూడవ మనుష్యుని) హక్కులుకూడ నిమగ్నమై యుండవచ్చును. జరిమానాను వాపసు చేయు విషయమునకూడ కష్టములు గలవు. ఈ విషయమున స్థానిక ప్రభుత్వములు న్యాయదృష్టితో సంచరింపగలవని మాత్రమే రాజప్రతినిధిగారు నుడువజాలియున్నారు.

9 వ ప్రశ్న:—ఖైదీలను వదలిపెట్టు విషయమున జూలై 28 వ తేదీగల తమ యుత్తరములోనే రాజప్రతినిధిగారు తమ యభిప్రాయములను వివరించి యున్నారు.

## పై పద్ధతులపైని రాయబారము లింకను కొనసాగింప వీలు గలదనుట

మా కీకముందుగల కాలవ్యవధి తక్కువగానున్నప్పటికిని పైని సూచించిన పద్ధతులపై మా రాయబారముల నింకను కొనసాగించుటకు వీలుగలదని నెహ్రూ పండితులకును, డాక్టరు సైయద్ మహమద్ గారికిని స్పష్టముగా దెలిపితిమి. అయినను ఈ యాధారముపై నెట్టి యొడంబడికను గావించుకొనుటకు సమ్మతింపజాలమని వారు నుడివి, గాంధిగారి కీక్రిందిజాబు (నోటు) నొసంగిరి:—

## ౧౦

## నెహ్రూగారు గాంధిజీకి పంపిన ఉత్తరము

నెయినీ సెంట్రలు జయిలు, ఆగష్టు 30, 1930.

గాంధిజీకి:—నిన్నను, నేడునుగూడ సప్రూజయకర్ గార్లతో మేము మరికొన్నిసార్లు సంభాషించితిమి. వారితో దీర్ఘముగా చర్చించు నవకాశము లభించినది. ఆగష్టు 28 వ తేదీనాడు ఇర్విన్ ప్రభువు తమకు వ్రాసిన ఉత్తరమును వారు మాకిచ్చిరి. ఆగష్టు 15 వ తేదీనాడు మనము సప్రూ, జయకర్ గార్లకు వ్రాసినలేఖలో గలసూచనల నాధారపరచుకొని చర్చలు సాగించుట అసాధ్యమనియు, అందుచే సప్రూజయకర్ గారల ప్రయత్నములు నిష్ఫలములైన వనియు ఈ యుత్తరములో స్పష్టముగా తెలుపబడినది. మన జాయింటు ఉత్తరములో సంతకము చేసిన వారందరును, తమ తమ వ్యక్తిబాధ్యతలమీద ఎంతవరకు పోగలిగినదియు పూర్తిగ చర్చించినపై మన మా యుత్తరమును వ్రాసియుంటిమన్న సంగతి మీ రెరుగుదురు. కొన్ని కొన్ని ప్రధానములైన షరతు లంగీకరింపబడవలయు ననియు, బ్రిటీషుగవర్నమెంటువారు దీనినిగూర్చి స్పష్టముగా ప్రకటింపవలయుననియు లేకపోయినచో ఎట్టి పరిష్కారమును తృప్తికరముగ నుండజాలదనియు మన మందు వ్రాసియుంటిమి. ఇట్టి ప్రకటన బ్రిటీషు గవర్నమెంటువారు చేసినచో, శాసనోల్లంఘనమును విరమింపవలసినదిగా కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమువారికి సూచించుటకు మన మంగీకరింపగలమనియు, కాని, శాసనోల్లంఘనము విరమించుటతో నోటుగనే, మన యుత్తరములో సూచింపబడిన కొన్ని యంశములను ఇండియా ప్రభుత్వమువా రమలుపరచవలసి యుండుననికూడ మనమందు వ్రాసియుంటిమి. ముందుగా తేలవలసిన యీ యంశములన్నియు సంతృప్తికరముగా ప్రకటింప

బడినచో తరువాత లండను సభ ప్రాతినిధ్యమును గూర్చియు, అందు కాంగ్రెసువారు పాల్గొనుటనుగూర్చియు నిశ్చయింపబడు నని కూడ నందు తెలిపియుంటిమి.

"ఈసూచనల నాధారముగా దీసికొని చర్యలను సాగించుటయే అసలు అసాధ్యమని ఇర్విన్ ప్రభువు అభిప్రాయపడుచున్నాడు. ఇట్టి సందర్భములలో మనకు సమాధానమున కవకాశ మేమియు నుండజాలదు. ఇర్విన్ ప్రభువు ఉత్తరములోని సంగతులును, దానిధోరణియు నటుండ, ఈ నడుమ ప్రభుత్వమువారు సాగించిన చర్యలుగూడ వారికి శాంతి యక్కరలే దని తెలియజేయుచున్నవి. ఢిల్లీలో కాంగ్రెసుకార్య నిర్వాహకసంఘము సమావేశ మగునని ప్రకటింపబడినవెంటనే ఢిల్లీ రాష్ట్రములో నైసంఘసమావేశము కాగూడ దని నిషేధించుటలోను, ఆటుతరువాత ఆ సంఘమువందలి సభ్యులను చాలమందిని అరెస్టుచేయుటలోను గల యర్థ మిది యొక్కటియే కాని మరియేమియుగాదు. ఈ అరెస్టులనుగూర్చికాని యీగవర్నమెంటువారి తక్కినచర్యలనుగూర్చి కాని మే మేమియు మొర పెట్టబోము. ఈ చర్యలలో కొన్ని నాగరకతాహీనము లైన వనియు క్రూరము లనియు మాయభిప్రాయము. వానికి మాస్వాగతము. కాని ఒకవైపునుండి ఏసంస్థ శాంతినీయగలదో, ఏసంస్థతో సమాలోచింప గోరుచున్నారో ఆసంస్థమీదికే దండెత్తుటకును, మరియొకవైపునుండి శాంతి కావలయునని కోరుటకును సంబంధ మేమియు గనబడదు. దేశమునం దంతటను కాంగ్రెసుకార్యనిర్వాహకవర్గమును నిషేధించి దాని సమావేశములను నిరోధించినచో ఇంక శాంతి కవకాశము రవ్వంతయైన లేదనియే దానియర్థము. ఎట్టి పరిస్థితులలోనైనసరే, ఈజాతీయోద్యమ మిట్లు కొనసాగుచుండవలయుననియే తప్పక దానియభిప్రాయము. కాకపోయినచో భారతీయులపక్షమున మాటలాడుట కధికారముగలవా రందరును భారతదేశకారాగృహములలో బడియున్నప్పుడు మరి యింకెవ్వరితో సంప్రతింపులు? ఇర్విన్ ప్రభువు లేఖయు బ్రిటిషు ప్రభుత్వమువారిచర్యయు సప్రూ జయకర్ గార్ల ప్రయత్నములు భగ్నములైనట్లు స్పష్టపరచుచున్నవి. ఈఉత్తరములోని విషయములను మీరు తెలిపిన సమాధానములనుబట్టి చూడగా ఇంతకుపూర్వము మనము స్థిరపరచిన స్థానముకంటెనుగూడ వెనుకకే పోవునట్లు మాకు కనబడుచున్నది. మన భావములకును ఇర్విన్ ప్రభువుగారి భావములకును అపారమగు భేదము కనబడుచుండుటచే వివరములను తెలుపుట యనవసరము. కాని ఇర్విన్ ప్రభువుగారి లేఖలోని యంశములను కొన్నిటిని మీకు మేము తెలుపగోరెదము. ఇర్విన్ ప్రభువు వెనుక భారతశాసనసభలో నుపన్యసించినప్పుడు తెలిపిన విషయములును, జూలై 16 వ తేదీన ఇర్విన్ ప్రభువు సప్రూ జయకర్ గార్లకు వ్రాసిన లేఖలోని విషయములును మాత్రమే యిపుడు మరల ఇర్విన్ ప్రభువు లేఖలో తెలుపబడినవి. ఎరవాడచెరసాలనుండి మన మందరమును కలసి వ్రాసిన లేఖలో మనము సూచించి యుండునట్లు ఆ ఉపన్యాసములోని వాక్యము లన్నియును ఊహాతీతములుగానున్నవి. వాటిలో గొప్ప యర్థమిమిడియుండినను ఉండవచ్చును లేదా అవి నిరర్థకము లైనను కావచ్చును. భారతదేశమందలి ప్రజలకు బాధ్యమగునట్టి సంపూర్ణజాతీయప్రభుత్వమును వెంటనే యిచ్చుటయును, దేశరక్షక సైన్యముపైనను ఆర్థికవిషయములపైననుగూడ ప్రజలకు అధికారము నొసగుటయును వెంటనే నెరవేర్పవలసిన భారతీయుల కోరికలుగా భావింపబడవలయునని మనమందరమును కలసి వ్రాసిన లేఖలో స్పష్టముగానే తెలిపియున్నాము. కావున మామూలుగా భద్రము లనబడు వానినిగూర్చి ఆలోచించుటకును, ఆలస్యమును గలిగించుటకునుగూడ ఎట్టియవకాశమును లేకేలేదు. ఇప్పు డధికారమును వహించియున్నవారియధికారమును ప్రజాప్రభుత్వమునకు వశపరచుటలో కొన్ని కుదురుపాటులు ముఖ్యముగా జరుగవలసియే యుండును. భారతీయులచే ఎన్నుకొనబడినప్రతినిధులే వీనిని నిర్ణయింపకర్తలని యిదివరకే తెలిపియున్నాము.

భారతీయులు తమ యిష్టము వచ్చినప్పుడు సామ్రాజ్యమునుండి విడిపోవుటకు వారికిగల హక్కునుగూర్చియు బ్రిటిషువారి హక్కులను సదుపాయములనుగూర్చి పరిష్కరించుటకొక స్వతంత్రవిచారణ సంఘమును నేర్పరుచుటను గూర్చియు రాజప్రతినిధి లేఖలో "రౌండు టేబిల్ సభ కేవలము స్వతంత్రమైన సభయే కావున అచట ఏసమస్యనైనను చర్చకు తీసికొనిరావచ్చును" అని మాత్రమే యున్నది. ఈ విషయము వెనుక చెప్పినదే. క్రొత్తదేమియుకాదు. "బ్రిటిషుసామ్రాజ్యమునుండి విడిపోవుటనుగూర్చిన సమస్యను భారతీయ ప్రతినిధులు నిజముగా చర్చకు తీసికొని రాదలచినచో ఇండియాదొరతనమువారు దానిని బహిరంగసమస్యగా ఆలోచింపజాలరు. భారతీయప్రతినిధులు దీనినిగూర్చి రౌండుటేబిల్ సభలో చర్చింపగోరెదరని మాత్రమే వారు ఇండియామంత్రికి తెలిపెదరు" అని ఇర్విన్ ప్రభువు తెల్పెను.

'ఆర్థిక సమస్యలనుగూర్చి పరిశీలింపబడదగినవి యేవో కొన్ని మాత్రమే యుండగలవు' అని ఇర్విన్ ప్రభువు వ్రాసెను. అట్టి సమస్యలలో భారత ప్రభుత్వఋణము అను సమస్యకూడ చేర్చవలసియుండునని మేము కోరుచున్నాము. ఈరెండుసమస్యలును చాలముఖ్యములని మాయభిప్రాయ మగుటచే వీనినిగూర్చి ముందుగా మనకు ప్రభుత్వమువారితో సంగీకారము కుదురుట ప్రధానాంశమే యగును.

రాజకీయఖైదీలను విడుదల చేయుటనుగూర్చి రాజప్రతినిధి తెలిపినవిషయములు చాల సంకుచితములుగను అసంతృప్తికరములుగను ఉన్నవి. అహింసాత్మకమగు సత్యాగ్రహమున జైలుకు బోయిన వారి నందరినైనను విడుదల చేయుదురని ఆయన వాగ్దాన మీయలేదు. ఈవిషయమును రాష్ట్రప్రభుత్వములవారే పరిష్కరింప నర్హులని ఆయన తెలిపెను. ఇట్టివిషయమునందు రాష్ట్రప్రభుత్వముల యొక్కయు స్థానికప్రభుత్వములయొక్కయు అనుగ్రహముపై

సాధారణపడియుండుట మాకిష్టముకాదు. అహింసానిరతులగు ఇతర ఖైదీలవిషయమునుగూర్చి రాజప్రతినిధి యేమియు చెప్పలేదు. సత్యాగ్రహము ప్రారంభింపబడుటకు పూర్వమే రాజకీయనేరములకు శిక్షింపబడిన కాంగ్రెసువా రెందరో కలరు. మీరట్ కేసులోని ఖైదీలు ఈతెగలోనివారేయని మనమీవరకే స్పష్టముగా తెలిపియున్నాము. ఈకేసు ఇంకను విచారణలోనే యుండుటచే 18 నెలలనుండి వీరందరును చెరసాలలోనేయున్నారు. కాన వీరినందరిని వెంటనే విడుదల చేయవలయును.

ఇర్విన్ ప్రభువు బెంగాల్ లాహోరు ఆర్డినెన్సు కేసుల ఖైదీలను ఈతెగలో చేర్చగూడదనెను. మేమిందుల కంగీకరింపజాలము. దౌర్జన్యము సలిపినందులకు శిక్షింపబడినవారినిగూడ వదలివేయవలెనని మనము కోరియుండలేదు. మనయుద్యమము కేవలము అహింసాత్మక మగుటవలన చిక్కు కలిగింపకుండుటకే మన మట్లు కోరలేదు. కాని, వారిని వదలుట మన కిష్టములేక కాదు. దౌర్జన్యమునకు సంబంధించిన వారిని ప్రత్యేకన్యాయస్థానములవారు విచారింపవలెను. వాటిపై అప్పీలు లేదు. అని రాజప్రతినిధి ఆర్డినెన్సులను చేసియుండెను. ఇది న్యాయముగాదు. మనదేశీయులగు వీరినిగూడ మామూలు న్యాయస్థానములలోనే విచారణ చేయవలయుననియైన మనము కోరకతప్పదు. వీరివిషయమున ఎన్నియో అద్భుతవిషయములు వినవచ్చినవి. బహిరంగ న్యాయస్థానములలోనే వీరిని కఠినముగా కొట్టిరని తెలిసినది గావున వీరి విచారణ మామూలు న్యాయస్థానములలోనే జరుగుట మిక్కిలి యవసరము. వీరికి ఎట్టి సౌకర్యములను కలిగింప కుండుటచేతను అసమ్మతిని తెలుపుటకు చిరకాలమునుండి వీరిలో కొందరిప్పుడు నిరాహార దీక్షపూనియున్నారు. వారిలో కొందరిప్పుడు మృత్యుద్వారమునకు చేరువగా గూడనున్నారు. బెంగాలు ఆర్డినెన్సును రద్దుపరిచి దానికి బదులుగా ఇప్పుడు వంగరాష్ట్ర శాసనసభవారొక చట్టమును చేసిరని తెలియుచున్నది. ఆ చట్టమును ఆర్డినెన్సునుగూడ మిక్కిలి యాక్షేపణీయములే. ఇప్పుడు వంగరాష్ట్ర శాసనసభలో సరియైన ప్రజాప్రతినిధులెవ్వరును లేరుగావున ఆసభలో ఆమోదింపబడినను ఆచట్టమున కెట్టి విలువయు నుండదు.

సీమగుడ్డలదుకాణములవద్దను, సారాదుకాణములవద్దను ఇకముందు పికెటింగు చేయుటనుగూర్చి యిప్పుడున్న పికెటింగు-ఆర్డినెన్సులను రద్దుపరచుటకు రాజప్రతినిధి యంగీకరించెను. కాని, అవసరము కలిగినచో మరల పికెటింగును నిరోధించుటకు క్రొత్తన్యాయాధికారముల నుపయోగించెద నని అతడు వ్రాసెను. అనగా అతనికి అవసర మని తోచినప్పుడెల్ల క్రొత్త ఆర్డినెన్సులను చేయుచుండగలడనియే యర్థము. మనమందరమును కలసివ్రాసిన లేఖలో ఉప్పుచట్టమునుగూర్చియు ఇతర విషయములనుగూర్చియు మనము చేసినసూచనలకు రాజప్రతినిధి సమాధానములుకూడ ఎంతమాత్రమును సంతృప్తికరములుగా లేవు. ఉప్పును గూర్చి మీరు ప్రామాణికులని ప్రసిద్ధిపడసియున్నారుగాన ఆవివరము లన్నియు మే మిచ్చుట తెలుపుట అనవసరము. ఈ విషయములను గూర్చి యిదివరకు మనము తెలిపినభావములను మార్చుకొనుటకు మా కిప్పు డెట్టి కారణమును కనబడుటలేదు.

మన మందరమును కలసి వ్రాసిన లేఖలో కోరిన ముఖ్యవిషయములనుగూర్చియు కొన్ని స్వల్పవిషయములను గూర్చియునుగూడ రాజప్రతినిధి యంగీకరింపగలిగియుండలేదు. మన దృక్పథమునకును ఇర్విన్ ప్రభువు దృక్పథమునకును అపరిమితమైన భేదము కనబడుచున్నది. ఈ భేదము మిక్కిలి ప్రధానమయినదిగా గూడ నున్నది. మేము వ్రాసిన యీ లేఖను (నోట్) శ్రీమతి సరోజినీదేవి, సర్దార్ వల్లభభాయిపటేల్, జయరాందాస్ దౌలత్‌రాంగార్లకుగూడ చూపించి సప్రూ జయకర్‌గార్లకు ప్రత్యుత్తరము వ్రాసి యీయగోరెదము. ఈ రాయబారములను గూర్చినయంశముల నన్నిటిని దేశీయులకు తెలుపుటలో ఇక నెంతమాత్రమును ఆలస్యము జరుగకూడదు. వారికట్లు తెలుపకుండుట న్యాయమునుగాదు. ఈలేఖల నన్నిటిని పత్రికలలో ప్రకటించుటయేకాక, వీటి ప్రతుల నన్నిటిని ప్రస్తుతము కాంగ్రెసు అధ్యక్షుడుగా నున్న చౌదరీ ఖలీఖుజ్జామన్ గారికి పంపవలయు ననికూడ మేము సప్రూజయకర్‌గార్లను కోరియుంటిమి. ఈ విషయములనన్నిటిని ఇప్పుడధికారము వహించియున్న భారత కాంగ్రెసు సంఘమువారికి వెంటనే తెలుపకుండ మన మేపనిని గూడ చేయగూడదు.

(సం) మోతీలాల్
,, సయ్యద్ మహమద్
,, జవహర్లాల్

## కాంగ్రెసునాయకుల కడపటిలేఖ

మీకు వైస్రాయివ్రాసిన లేఖను మే మతిజాగరూకతతో పరిశీలించితిమి. మీరు దాని కనుబంధముగా వైస్రాయిగారికిని మీకును జరిగినసంభాషణలను, లేఖలో చేరనివిషయములను మాకు దయతో నెరుకపరచితిరి. మోతీలాల్, జవహర్లాలు, సయ్యదు మహమ్మదు గారలు మీ మూలకముగా నంపినలేఖనుగూడ మేము శ్రద్ధతో పరికించినారము. ఈ లేఖపై లేఖాసంభాషణలంగూర్చి వారి దీర్ఘసమాలోచనల సారము, ఈపత్రముల పరామర్శించుటతో మేము రెండు రాత్రులు గడపితిమి. ఈపత్రములందలి విషయములంగూర్చి మీతో సంభాషణలు యథేచ్ఛముగా సలిపి పూర్తిసాహాయ్యమును పొందినారము.

ఇంతకును మేము బహిఃప్రపంచముతో సంబంధములేక యున్నవార మైనందున కాంగ్రెసుతరపున సంపూర్ణాధికారము వహింప

జాలము. సైనికశైలునందలి విఖ్యాతపురుషు లంపిన లేఖార్థములతో మేము సంపూర్ణముగ నేకీభవించువారము. వీరు దేశభక్తిప్రేరితు లయి క్లేశమున కోర్చి కాలహరణమును సరకుగొనక రెండు మాసములుగా నిర్వహించిన యీసంధిరాయబారములనుగూర్చి కడమాటను మేము మామాటలలో కూర్చవలసినదిగా వారాదేశించినారు. కావున సంధి సాధించుటకు ప్రతిబంధకములైన మూలవిభేదములను మేము సంక్షిప్తముగా సూచించెదము. జూలై 16 వ తేదినాటి వైస్రాయిగారి లేఖ పండిత మోతీలాల్ నెహ్రూగారు జూన్ 20 వ తేదిని స్లోకోంబుగారి కొసగిన సంప్రతింపునకు సమాధాన మిచ్చుటకుగా నిశ్చితమైనది. స్లోకోంబుగారు మోతీలాలుగారికిచూపి, వారిసమ్మతి నందించుకొన్న విజ్ఞాపనమునకును, వైస్రాయిలేఖలోని భావమునకును ఎట్టి తృప్తికరమైన సామరస్యమును మా కగపడుటలేదు. ఇచట మోతీలాలుగారి విజ్ఞాపన సంప్రతింపులందలి ప్రస్తుతభాగములను పొందుపరచుచున్నాము.

“రౌండుటేబిల్ సమావేశమునకు చర్చనీయాంశముల నెరుకపరచక, మేమచటికి వచ్చి అధినివేశప్రతిపత్తికిగా వాదించవలెననినచో నే నంగీకరింపను కాని, స్వతంత్రహిందూదేశమునకు రాజ్యాంగము నిర్మించుటకే సమావేశము కూడుచో, హిందూదేశపు ప్రత్యేకావసరములను, మనపూర్వ సంబంధమును గుర్తించిచేయు నిబంధనల కవకాశ మిచ్చుటకు సమ్మతించుచు, నామట్టమునకు నేను కాంగ్రెసు రౌండుటేబిల్ సభలో పాల్గొనవచ్చు నని హితవొసగువాడను.” “మా గృహాంగణమునకు మేమే యజమానులమై మనవలెను. అయినను బ్రిటిషు అధికారమునుండి పరిపాలనమును బాధ్యతాయుత భారతమంత్రివర్గమునకు కరగతము చేయు మధ్యకాలములో ఉచితమైన నిబంధనలకు మేమొప్పుకొనగల్గుదుము.” “ఒక దేశము మరియొక దేశముతో, ఒక జాతి మరియొక జాతితో సమానప్రతిపత్తి గలిగియుండునట్లు మేము బ్రిటిష్ వారితో ముఖాముఖిగ విషయమును చర్చింపవలెను.”

“రౌండుటేబిలు సమావేశములో ఇరువాగులకును మధ్య పొసగు నిబంధనలకును మధ్యకాలమున ప్రత్యేకావసరములు ప్రస్తుతపరిస్థితులు పూర్వసంబంధములంబట్టి బ్రిటను హిందూదేశములకు కూడు పరతులకును బద్ధమైన సంపూర్ణబాధ్యతాయుతప్రభుత్వమునకు తాము తోడ్పడెద మని ఇండియాప్రభుత్వము ఆంతరంగికముగా వాగ్దాన మొసగవలెను.”

## మరి వైస్రాయిలేఖలో ప్రస్తుతార్థము

‘హిందూదేశపుప్రజలు ప్రస్తుతము బాధ్యత వహింపజాలని శాఖలుదప్ప, మిగిలినవాని నెంతవరకైనను భారతీయుల కాయత్తము చేయుటయే నాయభీష్టము. నాప్రభుత్వముయొక్క సంకల్పమును ఇట్టిదే. బ్రిటనుదేశపు ప్రభుత్వమువారును ఇట్టి యభిప్రాయమునే కల్గియున్నారనుటకు నామనమున సందియము లేదు. మావేర్వేరు అధికారనిర్ణీతరంగములందు మేము దీనినే సమర్థింతుము. మరి యీ బాధ్యతవహింపజాలనివిషయము లెవ్వియో యెట్లు వాటిని భావిరాజ్యాంగమున పోషగింపవలెనో రౌండుటేబిలుసమావేశమువారికి పరామర్శనీయము కాని, ఇరుపక్షములకును, పరస్పరవిశ్వాస ముండుచో ఏకీభావము అసాధ్య మని నేను నమ్మజాలను.’

రెండుపక్షములకు విస్తారము భేదమున్నదని మా యభిప్రాయము. మోతీలాలుగారు రౌండుటేబిలుసమావేశము మూలకముగా ఇప్పటిస్థితి మారిపోయి స్వతంత్రభారతదేశ ముదయించుటను భావించుచున్నారు. వైస్రాయిగారు తమ లేఖలో తమ్ము, తమప్రభుత్వమును, బ్రిటిష్‌మంత్రివర్గమును భారతీయులకు ప్రస్తుతము బాధ్యత వహింపజాలని శాఖలనుగూర్చి తగిన సదుపాయములను చేయుటతో పొసగునంత స్వకార్యవిచారణాధికారము నొసగుటకు మాత్రమే బద్ధుల గావించుచున్నారు. వేరు మాటలలో పెట్టినచో లాన్స్‌డౌన్ సంస్కరణములతో ప్రారంభించిన పరంపరలో మరికొంత ముందరికి జరుగుటయే యవధి యని తేలుచున్నది. మాయీవ్యాఖ్య సరియే అని మాభయమగుటచే, ఆగస్టు 15 వ తేదీని మేమును, మోతీలాల్, జవాహరలాలు, సయ్యదు మహమ్మదుగార్లును సంతకముచేసిన లేఖలో మా యభిప్రాయములను వ్యతిరేకక్రియారూపమున, ఏది కాంగ్రెసును తృప్తిపరచదో దానిని నిర్వచించితిమి. మీ రిపుడు వైస్రాయిగారి నుండి తెచ్చిన లేఖ వారి మొదటి లేఖయందలి సారమునే యేకరువు పెట్టుచున్నది. మరి, మా లేఖను సమాలోచనకేనియు తగని దానిగా తిరస్కారముతో త్రోసివేయుచున్నదని చెప్పుటకు మేము ఖేదము నొందుచున్నాము. మా ప్రతిపాదనలు చర్చకు మూలాధారముగా నసాధ్యములట. మీరును ఈవిషయమున కొంత వెల్తురు నొసగినారు. హిందూదేశము సామ్రాజ్యమునుండి విడిపోవుట కవిచ్ఛిన్నమైన హక్కు గలిగియుండవలెనను ప్రశ్నతో గాంధిగారు ఇండియా గవర్న్మెంటు నెదుర్కొనుచో వైస్రాయిగారు దాని నెత్తుకొనజాల మని చెప్పగలరనుట మీరు తెలిపినారు. మే మన్ననో, యీ విషయము స్వాతంత్ర్యహిందూదేశపు భావిరాజ్యాంగమున కాయువుపట్టుగ పరిగణించుచున్నాము. దీని కెట్టిచర్చయు నక్కరలేదు. ఇపుడు హిందూదేశము సంపూర్ణబాధ్యతాయుతప్రభుత్వమో, సంపూర్ణస్వపరిపాలనమో (మరి యేమాట నుపయోగించినను సరే) పొందుచో, ఇచ్ఛకాధారమైననే యది సామ్రాజ్యమున భాగస్వామి కావలెను. ఇకముందు హిందూదేశము సామ్రాజ్యమున భాగము గాక సమానప్రతిపత్తిగల స్వతంత్రభాగస్వామి కావలయు ననిన, దాని కా సంబంధమువలన అనురాగపు కోర్కెలు తమంతట జనింపవలెను, ఈ సిద్ధాంతమే మేము పైన సూచించిన సంప్రతింపు ప్రకటనయందును గలదు. కావున, బ్రిటిషుప్రభుత్వము గాని బ్రిటిష్‌ప్రజలు గాని యీసిద్ధాంతమునసాధ్యమనియో అసమర్థనీయమనియో భావించుచుండు

నంతకాలమును మా యభిప్రాయములో కాంగ్రెసు స్వాతంత్ర్యసమరమును సాగింపవలసినదే.

మరి మేము సూచించిన అల్పవిషయము—ఉప్పుపన్నుపై వైస్రాయిగారివాదము ప్రభుత్వపుమనంబును మాకు వెల్లడి సేయుచున్నది. ఎవరినిరంతరకృషి ప్రభుత్వమునకు అస్తిభారమో, ఆజనము కోట్లకొలది హిందూదేశపు మైదానములందు ఆకలిచే మ్రగ్గుచుండ, సిమ్లా శిఖరములందు పరిభ్రమించు బ్రిటిషుపరిపాలకులు సామాన్యజనముయొక్క కష్టనష్టములు లేశమేనియు నెరుగలేదనుట మాకు కరతలామలకము. పేదలకు వాయుజలంబులవలె అవసరమైన ప్రకృతిసిద్ధవస్తువుయొక్క నిర్వక్రమగు నాక్రమణము సమర్థించుటకై నిర్మలహృదయుల రక్తము చిందువారినను ప్రభుత్వమునకు దాని అవినీతిచిత్తమున కెక్కనిచో వైస్రాయి సూచించినట్టిభారతనాయకసమావేశము ఎట్టిఫలమును నీయజాలదు. ఈయాక్రమణ (మొనాపలి) నుపసంహరింప గోరుదానికి తగిన ఆదాయమునకు మూలము మాపవలెనని గోరుట గాయపరచి గేలిసేయుటయగును. దీనివలన తేలునదేమనగా దుర్భరన్యాయభూయిష్ఠమగు నీపరిపాలనావిధానమును ప్రభుత్వము కల్పాంతమువరకు సమర్థింపదలచుకొన్నది. ఇంకొకమాట. ఇచట నేకాక ప్రపంచమందెల్లెడలను ప్రభుత్వములు అసంతృప్తికరమగు చట్టముల నుపసంహరింపక పోయినను వాని యుల్లంఘనమును సంహరించుచునే యున్నది. ఇతరముఖ్యవిషయము లనేకములకు మేము విమర్శింపవలసిన యవసరము లేదు. అన్నిటిలోను వైస్రాయిగారికను ప్రజాభిప్రాయముగా మాచే ప్రతిపాదింపబడిన సిద్ధాంతముల నంగీకరించుటకు ముందున కడుగిడలేదు. ప్రస్తుతము బ్రిటిష్ ప్రభుత్వమునకును కాంగ్రెసుకకును అగాధమగు విభేద మున్నదని ప్రత్యక్షీకరించుటకు మేము ముఖ్యవిషయములను తగినంత చర్చించినార మని నమ్ముచున్నాము. సంధిరాయబారములు విఫలమైనవని యెవ్వరును ఆశాభంగము చెందజనదు. స్వాతంత్ర్యమునకై దృఢవ్రతమై కాంగ్రెసు సమరమునకు దిగినది. మనదేశము అసాధారణపు ఆయుధమును చేపట్టినది. దీని మహిమ గ్రహించుటకు పాలకులకు కాలము పట్టును. కొన్ని నెలలబాధలు వారిహృదయమును మార్చజాలకపోయెను. ఎవరు సంపాదించుకొన్నను సక్రమమైనసంపత్తును కాంగ్రెసు హానిపరుపదలచుకొనలేదు. బ్రిటిష్ ప్రజపై దానికి ద్వేషములేదు. కాని తననైతికబలమంతటితోను అది బ్రిటిషుపరిపాలనను ప్రతిఘటింపకతప్పదు. అహింసయే నెలకొనియుండుచో జాతీయాశయములు సఫలమగుకాలము తొందరలోరాగలదని మావిశ్వాసము. అధికారనిశ్చయము శాసనోల్లంఘనమునుగూర్చి పలుమారుపలుకు తిరస్కారంపుభావముల గమనించియు మే మిది నిర్వచించువారము. ఇదివరకు మీరు సంధి సాగించుటకై సల్పినకృషికి మేము మిమ్మభినందింతుము. కాని కాంగ్రెసుసంస్థయం దధికారము వహించువారితో రాయబారములు జరుపుటకు తగినకాల మింకను రా లేదని మాయభిప్రాయము. ఖైదీలముగాన మాకొకలోపముగలదు. మాయభిప్రాయములు మూడవపక్షమువారు చెప్పుమాటలపై నాధారపడునుగాన లోపసంయుతములు. కాంగ్రెసు అధికారులకు మమ్ము సందర్శించుటకు యథేచ్ఛమగు అవకాశముగలదు. ప్రభుత్వమువారు సంధికాశపడుచో వారు మమ్ము సందర్శించుట కెట్టి ప్రతిబంధకము నుండబోదు.

(సం) యమ్. కె. గాంధి.
,, సరోజనీనాయుడు.
,, వల్లభభాయి పటేలు.
,, జయరాందాసు దౌలతరామ్.

సూచన:—బహిఃప్రపంచమునకు తెలియుటకుగాను మేము ముఖ్యమైన వాఙ్మూలములను యథార్థమును ప్రకటించుటతో తృప్తి చెందుచున్నాము. మధ్యవర్తుల ధర్మముప్రకారము మే మీవాఙ్మూలములపై ఈ ప్రకటనలో మా విమర్శనలను చేయదలచుకొనలేదు. పై వాఙ్మూలముల ప్రచురణకు మేము వైస్రాయిగారి సమ్మతిని పొందియున్నామని మాత్రమె విన్నవించువారము.

## రౌండుటేబిలు సమావేశము

సైమనుకమిషను నియామకమువలెనె సైమనుకమిషను నివేదికయును భారతీయులయందు నిరాశనుగలుగజేసినది. కన్సర్వేటివు పక్షమువా రవలంబించెడి కుతంత్రమును సైమనుకమిషనుప్రహసనము విస్పష్టముచేసినది. మూడుపక్షము లేకాభిప్రాయమును వ్యక్తము చేయుటకై పన్నిన పన్నాగము నిరర్థకమైనది. కన్సర్వేటివుపక్షము పరాజయమును బడసినపుడు భారతరాజ్యాంగములసందర్భములందు సంకుచితమైనను నవీనలక్ష్య మవసరమైనది. సత్యాగ్రహోద్యమము దుర్జయమైనది. లేబరుపక్షవాగ్దానములు నిరర్థకములైనవి. రాజ్యాంగములందును, పరిశ్రమలందును, వ్యాపారములందును ప్రతిష్టంభనముగలిగినది. రౌండుటేబిలు సమావేశము శరణ్యమైనది. గాంధిమహాత్ముడును కాంగ్రెసునాయకులును రౌండుటేబిలు సమావేశమును నిరాకరించుట న్యాయమనియును జెయిలునందు నడిచిన రాయబారములును రౌండుటేబిలు సమావేశ నిర్ణయములును విశదము చేసినవి.

లండనునగరమునందు దివ్యప్రాసాదమునందు మహావైభవముతో రౌండుటేబిలుసమావేశము ప్రారంభ

మైనది. మహారాజులు, రాజ్యాంగవేత్తలు, మంత్రులు, స్త్రీలు, పురుషులు సభాభవనము నలంకరించిరి. జార్జి సార్వభౌముడుచేసిన ప్రసంగము సామ్రాజ్యాశయములను వ్యక్తముచేసినది. సర్ తేజబహద్దరు సప్రూ, శ్రీనివాసశాస్త్రిగారులు, బికానీరు మహారాజు, భోపాలు నవాబు, రామ్సెమాక్డొనాల్డు, సాంకె ప్రభువు, బెన్నుగారులు, మొదలగువారుచేసిన గంభీరోపన్యాసము లుదారభావములను విశదముచేసినవి. ఇంగ్లాండునందలి రాజ్యాంగపక్షములన్నియును భారతీయులసదాశయములను ప్రశంసించినవి. భారతీయప్రతినిధు లనుభవించిన విందులు, వేడుకలు, మర్యాదలు భారతీయులను వినమ్రులనుజేసినవి. రౌండుటేబిలుసమావేశనిర్ణయములు బ్రిటీషుద్వీపములందును భరతవర్షమునందును విజయధ్వానములను బడసినవి. రామ్సెమాక్డొనాల్డుగారి కడపటి ప్రసంగము భారతీయహృదయమునం దాశాంకురములను గలుగజేసినది.

కాంగ్రెసుపక్షావలంబుల కారంభమునుండియును రౌండుటేబిలు సమావేశమునందును దాని నిర్ణయములందును విశ్వాసము గలుగకున్నది. కారణము బ్రిటీషు రాజ్యాధికారు లవలంబించెడి రాజ్యనీతి. మాటలందు బాధ్యతాయుత పరిపాలనమును, క్రియలయందునిరంకుశ పరిపాలనమును బ్రిటిషురాజ్యనీతికి లక్ష్యములు. ఈ పరమలక్ష్యమునె లండను సమావేశము సమకూర్చినది. బ్రిటీషురాజ్యతంత్రజ్ఞులు హిందూమహమ్మదీయవిభేదములను, బ్రిటీషుప్రాంతసంస్థానవిభేదములను విస్తరింపజేసి సంయుక్తాభిప్రాయమును దుస్తరము చేయుటకుజేసిన ప్రయత్నములు విఫలములైనవి. హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు, నిమ్నజాతులు స్వసంఘాభిమానమును వెల్లడిచేసినను బాధ్యతాయుతపరిపాలన మవసరమని ఏకగ్రీవముగను వ్యక్తముచేసిరి. ఇందులకనుహాపముగను భరతవర్షమునకు, ౧. సంయుక్తపరిపాలనము, ౨. కేంద్రప్రభుత్వమునందు బాధ్యత, 3. రాష్ట్రీయస్వపరిపాలనము, ౪. బ్రిటీషు ప్రయోజనరక్షణములు బాధ్యతాయుతపరిపాలనమును స్థాపించుటకు సాధనములని యంగీకరింపబడినవి. రాజ్యాంగవిమర్శనలతోపాటు నిర్బంధప్రస్థానమును వ్యాపించినది. దీనివలన ప్రయోజనమున్నను లేకున్నను కాంగ్రెసుపక్షాదరణము లేకను దేశపరిపాలనముదుర్భరమని విశదమైనది. ముప్పదియైదుకోట్లప్రజలను నిర్బంధించి పాలించుట యసాధ్యమని సువ్యక్తమైనది.

రౌండుటేబిలు నిర్ణయములు- కాంగ్రెసు

భారతప్రభుత్వ మపూర్వమైన నిర్బంధవిధానము నవలంబించి సత్యాగ్రహోద్యమమును నిరోధించుట కుపక్రమించినది. ప్రభుత్వము నాగరకప్రపంచమునకు సహజమైన పరిపాలనధర్మమును విసర్జించినది. ఇష్టానుసారముగను తాత్కాలికశాసనములను ప్రయోగించి సకలస్వత్వములను నిరోధించుట కుపక్రమించినది. దొంగలకు, దోపిడిగాండ్రకు, హంతకులకు, దుర్మార్గులకు వినియోగపడవలసిన శాసనములను సత్యాగ్రహులపై ప్రయోగించి నిరంకుశప్రభుత్వము స్వధర్మమును విసర్జించినది. సత్యాగ్రహులకు భోజనవసతుల నొసంగుట నేరమైనది. పది ఆర్డినెన్సులును పోలీసును విచ్చలవిడిగను రాజ్యము చేసినవి. 144 శాసనము సర్వతోముఖమును బడసినది. ప్రభుత్వమునకు నిర్బంధశాసనములు సంతృప్తిని గలుగజేయలేదు. లాఠీప్రయోగము శరణ్యమైనది. స్త్రీలు, బాలురు, వృద్ధులు అవమానములపాలైరి. స్వల్పనేరములకు కఠినశిక్షలు విధింపబడినవి. జెయిలులందును సత్యాగ్రహులకు 'సి' తరగతి నిచ్చి నిరాదరణావమానములపాలు చేసిరి. ప్రభుత్వమవలంబించిన నిర్బంధవిధానమంతయును నిరర్థకమైనది. సత్యాగ్రహప్రస్థానము మహాప్రళయమువలెను వ్యాప్తమై ప్రపంచమునం దంతటను భయభ్రాంతులను గలుగ జేసినది. సత్యాగ్రహోద్యమము బ్రిటిషుప్రభుత్వమును స్తంభింపచేసినది. బ్రిటిషువస్తుబహిష్కారణము సత్యాగ్రహమునకు జతపడి బ్రిటిషు వ్యాపారమును స్తంభింపజేసినది. బ్రిటిషుప్రభుత్వము దండనోపాయమును విసర్జించి సామోపాయము

నిర్బంధప్రస్థానము

శ్రీ



సుప్రసిద్ధియకృత్ ప్లీహోదర (Liver and spleen) వీరు జాడ్యచికిత్సకులు. "విజయనగర వైద్యులు", "జమ్ములు గారు" ఇత్యాది ఉపనామములచేత విశేషముగను, జమ్మి వెంకటరమణయ్యగారు, అను నిజనామధేయముచేత, విరళముగను, తెలియబడు చున్నవారు.

డాక్టరు వెంకటరమణయ్యగారు దక్షిణభారతదేశమున చిరకాలము నుండి వన్నెకెక్కిన పండితవంశమునకు చెందినవారు. వీరి పూర్వులు శ్రీ శ్రీ శ్రీ విజయనగరమునకు విద్యానగరమను ఖ్యాతిని సంపాదించిన ప్రముఖులలోనివారు.

కొలదికాలము లౌకికవృత్తిలోని కాకర్షింపబడియు, ఆశ్వినులకృపచే మహావిఖ్యాతవైద్యులగు కీర్తిశేషులయిన బ్రా॥ శ్రీ॥ వడ్లమాని సూర్యనారాయణ శాస్త్రిగారి యొక్కయు, మధ్వ శ్రీ॥ కాసూరి అణ్ణయ్యాచార్యులవారి యొక్కయు అనుగ్రహమునకు పాత్రులయి, వైద్యశాస్త్రాభ్యాసము నొనర్చిరి.

అందును, బాలరోగ ప్రకరణము నభిమానముగ గ్రహించి, అందు విశేషకృషిని, పరిశోధనమును సల్పిరి. వైద్యపథమునకు మరలిన కొద్దికాలముననే నవనవోన్మేషముల నొప్పు తమ బుద్ధివికాసమున బాలరోగనిదానమందును, చికిత్సయందు దినదిన ప్రవర్ధమానముగు ప్రతిష్ఠ వహింపసాగిరి.

లీవరు, స్ప్లీనువ్యాధుల చికిత్సయందు, డాక్టరు వెంకటరమణయ్యగారికి లభించిన యశస్సు అసమానముగ విలసిల్లదొడగెను. నాటినుండి ఆంగ్ల, ఆయుర్వేద, యునానీ, హోమియోపతి, జలవైద్యులయందును, ప్రత్యేకముగను, సమష్టిగను, అగ్రగణ్యులనిపించుకొనినవారందరు, లీవరు, స్ప్లీనువ్యాధులకు వెంకటరమణయ్యగారి యౌషధమే శరణమని ఘంటాపథముగ చాటుచున్నది, ఉపయోగించుకొనుచున్నారియును, యెల్లరకు తెలిసిన విషయము. ఇటీవల దాక్షిణాత్యప్రముఖులు పలువురి యాహ్వానింప విజయనగరమునుండివచ్చి మదరాసునందు నివాస మేర్పాటు చేసికొనియున్నారు.

వెంకటరమణయ్యగారి మందుయొక్క ప్రాచుర్యమును, ప్రాశస్త్యమును గాంచి, కక్కుర్తిపై, కొందరు మాదిరియౌషధములను తయారుచేసి, అమాయికులగు ప్రజలకు, శిశువులకును ద్రోహ మొనర్చుచున్నారని తెలిసికొనుట మిక్కిలి శోచనీయము. ఇంతకన్న అకృత్య ముండబోదు.

భగవంతుడు తమకిట్టి సిద్ధక్రియను ప్రసాదించినందుకును, మానవసేవ నీవిధముగచేయ నవకాశ మొసగినందుకును, డాక్టరు వెంకటరమణయ్యగారు యథాశక్తి మానవజాతికి సేవయొనర్ప సంకల్పించియేయున్నారు.

స్థిరమగు సేవయు, ఉపకారమును యెప్పుడును లక్షణరూపముగ నేయుంట సహజము, ఆవశ్యకమునని యెల్లరు నెరుంగుదురు. కావున, బాలరోగహేయభూతములు, జాడ్యప్రదములు నగు నాహారవిహారాదిపద్ధతుల సాకల్యముగ విమర్శించి, వివిధవైద్యపద్ధతుల యందు నుదాహరింపబడిన ఆరోగ్యసూత్రములను, సమయములను ఆయుర్వేదసిద్ధాంతభూతములగు సంప్రదాయములతోను, సూక్తులతోను పరిపోల్చి, యనుభవరూఢమగు ఫక్కిని, లోకోపకారముగ నుండునట్లు, గ్రంథరూపముగ ప్రకటింప సంకల్పించిరి. అంతకన్న నమూల్యమగు సేవ యుండజాలదు.

కొలదికాలముననే ఆయుద్యమము ప్రారంభము చేయబడుననియు, యెంతవరకు సాధ్యమో అంతదనుక శ్రీ వెంకటరమణయ్యగారు తమబుద్ధి, శక్తిసామర్థ్యములను యీమహత్కార్యమునకు వినియోగింపనున్నారనియు వినుట మిక్కిలి సంతోషదాయకము.

ఇంతకన్న నాంధ్రలోకమునకు, ఆంధ్రలోకమునకేగాదు. మానవలోకమునకును చేయదగిన సేవయు, తన్మూలమున నాంధ్ర లోకమునకును రాదగిన గౌరవమును నుండజాలదు — ఇతి సంగ్రహం.

వివరములకు:— 4. శాలైవీథి, మైలాపూరు, మద్రాసు.




బెంగుళూరుజిల్లా బోర్డువారిచే 1929 సం॥ పార్కు-ఫేరు ప్రదర్శనమునం దొసగబడిన

## బంగారు పతకము

నవలంబింపవలసిన యవసరము గ్రహించినది. రామ్సే మాక్డోనాల్డుగారు లండనునందుచేసిన ప్రసంగము భారత రాజ్యాంగ విధానమునందు బ్రిటిషుప్రభుత్వమవలంబింపవలసిన నూతనవిధానమును విశదముచేసినది.

“బాధ్యతాయుతప్రభుత్వముగల రాష్ట్రములందు శాసనసభ్యులను విస్తరింపజేసి ఎక్కువ నియోజకాధికారమునిచ్చి ఏర్పాటు చేయవలెనని ప్రభుత్వమువారు ఆలోచించుచున్నారు. రాజ్యాంగవిధానమును తయారుచేయునపుడు స్వల్పసంఖ్యాకుల రాజకీయప్రాతినిధ్యముతో బాటు వివిధస్వల్పసంఖ్యాకుల హక్కులను గాపాడి జాతిమతకుల భేదములు వీరి పౌరసత్వములకు భంగములేకుండజేయు బాధ్యతను ఏర్పాటు జేయుటవసరమని ప్రభుత్వమువారు తమధర్మముగ తలంచుచున్నారు.

వివిధసంఘములవారు తమ తమ భిన్నాభిప్రాయములను వదలుకొని ఒడంబడిక చేసికొనవలెననియు అయ్యది వారిధర్మమనియు ప్రభుత్వమువారు తలచుచున్నారు. రాయబారములు సాగుచుండగా అట్టి ఒడంబడిక కుదురునో అయ్యదెంతయో లాభించును. అనుకొన్న విషయము చేకూరుటకు ఇదెంతయు తోడ్పడగలదు. క్రొత్తరాజ్యాంగ విధానమును త్వరలో అమలుజరుపుటకు ఆలస్యము గలుగరాదని ప్రభుత్వమువారు ఆతురతను చూపుచుండుటయే గాక ఈ రాజ్యాంగవిధానమును అన్ని సంఘములవారును సుహృద్భావముతోను, విశ్వాసముతోను ప్రారంభించవలెనని ఆతురతతో నుండుటచే ఇట్టి ఒడంబడిక యెంతయో లాభించును.

భారతదేశ పరిస్థితులకు తగు రాజ్యాంగవిధానమును గూర్చి ముఖ్యసిద్ధాంతములను ఆలోచించుచున్న వివిధోపసంఘములు సవిస్తారముగ ఈ ఫెడరలు విధానమును చాలవరకు పరిశీలించినవి. ఇంకను పరిష్కారము కావలసిన విషయములుగూడా చాలవరకు ఆలోచింపబడెను. అయినప్పటికిని సభాస్వభావమునుబట్టియు లండనులో ఈ సభవారికున్న వ్యవధి కొంచెమగుటచేతను ఇంతవరకు సభ వాపుచేయుటకు ప్రభుత్వమువారు అవసరమని తలంచిరి. ఇంతవరకు చేసిన పనినిగూర్చి భారతీయుల యభిప్రాయమును గనుగొనుటకు ఈ సభ వాపుచేసిరి. వారు వారు తెలిపిన చిక్కులను లేకుండజేయుటకును ఉపాయము వరయుటకును సభ వాపుచేసిరి. మనము పూర్తిచేసిన పని అంతయు క్రొత్తభారతరాజ్యాంగవిధానమున కన్పించునటుల మన సహకారమును సాగించుటకు ఏదైన విధానమును దెలిపెదరేని ప్రభుత్వమువారు ఆలస్యముగాకుండ ఆలోచించెదరు.

ఈలోపుగ ప్రస్తుతము శాసనోల్లంఘనమున పనిచేయుచున్నవారు రాజప్రతినిధి కోరినటుల జేసెదరేని ఈ ప్రకటనము ననుసరించి సహకారము సల్పగోరెదరేని వారి సహాయమును బడయుటకు చర్యను దీసికొనెదరు.”

**మాక్డొనాల్డుగారి ప్రసంగము**

ఆ ప్రసంగమున కనురూపముగ భారతప్రభుత్వము భారతకాంగ్రెసు కార్యనిర్వాహక సంఘసభ్యులను జనవరి 19 వ తేదిని నిర్బంధమునుండి విడుదలచేసినది. కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గము ప్రయాగయందును, ఢిల్లీ యందును సమావేశమై కాంగ్రెసుకర్తవ్యమును నిర్ణయించినది. కర్తవ్యమును నిర్ణయించినను సప్రూ, శాస్త్రి, జయకరుగార్ల ప్రార్థనలను గమనించి నిర్ధారణలు రహస్యముగ నుంచబడినవి. సప్రూ, శాస్త్రిగార్ల ఆగమనముతో తిరిగి రాయబారములు ప్రారంభమైనవి. గాంధిమహాత్ముడు స్వాభిమానమును విడిచి సమావేశమును కోరుచు ఇర్విను ప్రభువునకు వ్రాసినలేఖ కార్యసాధనమునకు ధర్మజ్ఞులవలంబించెడి మార్గమునకు నిదర్శనముగ నున్నది. మిత్రులు, సహచరులు నివారించినను గాంధిమహాత్ముడు తన అంతరంగికప్రబోధము ననుసరించి ఇర్విను ప్రభువునకు లేఖన్వ్రాసి ధర్మవిజయమును బడసిన విధమును దురభిమానులకు హితోపదేశమును జేయుచున్నది. ఆత్మబలము పశుబలమును, ధనబలమును జయించగలవిధమును సత్యాగ్రహప్రతిభ విశదము చేయుచున్నది. ఇర్వినుప్రభువు గాంధిమహాత్ముని కోరిక నంగీకరించుచు సమావేశము నేర్పాటుచేయుట వారి సౌజన్యమును వ్యక్తముచేయుచున్నది. ఇర్విను-గాంధి సంప్రతింపులు గోప్యములైనను ధర్మవినయవిధేయతలయందొకరి నొకరు మించిరని వదంతులు తెల్పుచున్నవి. ఇర్వినుప్రభువు ఇట్టిప్రశాంతస్వభావమునే 1929 డిశంబరు మాసమునందు చూపిన భారతవర్షమునకును, బ్రిటనునకును దుఃఖానుభవముతప్పియుండును. నిరంకుశాధికారుల కధికారాభిమానమునందు గల పట్టుదల ధర్మనిర్వహణమునందు గలుగుట దుస్తరము. భరతవర్షమునందు తాత్కాలికముగనైనను శాంతినిస్థాపించుటకు గాంధిమహాత్ముడు చూపించిన సహనము, సాహసధైర్యములు, త్యాగము ప్రపంచ చరిత్రయందు శాశ్వతప్రతిష్ఠను బడయగలవు. శాంతిస్థాపనకు శాస్త్రి, సప్రూ, జయకరు గార్లను

భోపాలు నవాబు, బికనీరు మహారాజాగార్లును, ఇతరులును, చేసిన ప్రయత్నములు ప్రశంసనీయములు. ఇర్విన్ప్రభువు చూపిన శాంతధర్మమార్గ మధికారులకు ముందైనను స్వధర్మనిర్వహణమునకు ప్రమాణమగుటకు భగవంతు డనుగ్రహించు గాత!

గాంధి-ఇర్వినుసంధి

### ఇండియాప్రభుత్వప్రకటన

(1) రాజప్రతినిధికిని గాంధిగారికిని జరిగిన సంభాషణలకు పర్యవసానముగా శాసనోల్లంఘనోద్యమము విరమింపబడునటులును, ఇండియాప్రభుత్వమును రాష్ట్రీయప్రభుత్వములును బ్రిటనుప్రభుత్వపు ఆమోదమును బడసి కొంతచర్య గైకొనవలసినట్లును ఏర్పాటు కుదిరినది.

### రాజ్యాంగసమస్య

(2) రాజ్యాంగసమస్యలవిషయములో ఇకముందు జరుగు చర్చలన్నియు రౌండుటేబిలుసభలో విచారింపబడిన రాజ్యాంగవిధానమును మరింత పరిశీలించుటకై యుండగలవు. దీనికి బ్రిటనుప్రభుత్వమువారి యనుమతి గలదు. రౌండుటేబిలుసభలో చిత్తుగా తయారుచేయబడిన రాజ్యాంగవిధానములో ముఖ్యాంశము "ఫెడరేషను" అట్లే భారతీయులకు పరిపాలనాబాధ్యత హిందూదేశముకొఱకుగానే చేయబడు మినహాయింపులు రక్షణోపాయములును ముఖ్యాంశములు. దేశసంరక్షణము విదేశవ్యవహారములు, అల్పసంఖ్యాకులకు రక్షణలు, హిందూదేశపు ఆర్థికపరపతి, ఋణాదులకు బాధ్యత యనువిషయములం గూర్చినవే మినహాయింపులు గాని రక్షణోపాయములు గాని.

### కాంగ్రెసు పాల్గొన నుండుట

3. 1931 సం. జనవరి 19 వ తేదిని ప్రధానామాత్యుడు ప్రకటించినరీతిని జరుగనున్న రాజ్యాంగ సంస్కరణపరిష్కారమునందు కాంగ్రెసుప్రతినిధులు పాల్గొనుట కేర్పాట్లు గావింపబడును.

4. శాసనోల్లంఘనోద్యమమునకు చెందినకార్యములం గూర్చి ఒడంబడిక కుదిరినది.

### శాసనోల్లంఘనోద్యమోపసంహారము

5. శాసనోల్లంఘనము నిష్కర్షముగా విరమింపబడును. ప్రభుత్వమువారును దీనికిబదులు చర్య గైకొనెదరు. శాసనోల్లంఘనమును విరమించుట యనగా, ఆయుద్యమాభివృద్ధికై దొరకొనబడుచున్న అన్ని చర్యలను విరమించుట—ముఖ్యముగా ఈక్రిందియంశములను గమనింపవలెను.

(అ) ఏ చట్టముయొక్క అంశములను గాని కావలెనని సమష్టిగా ధిక్కరించుట.

(ఆ) భూమిశిస్తును గాని, చట్టప్రకారము చెల్లింపవలసిన యితర రేపన్యును గాని చెల్లింపగూడదను ఉద్యమము.

(ఇ) శాసనోల్లంఘనోద్యమమునకు ప్రోద్బలముగా వార్తాపత్రములను ప్రచురించుట.

(ఈ) సివిలు, మిలిటరీఉద్యోగులను గ్రామోద్యోగులను ప్రభుత్వమునకు ప్రతికూలముగ పురికొల్పుట, తమ ఉద్యోగములకు రాజీనామా లిమ్మని ప్రచారము చేయుట.

### విదేశవస్తుబహిష్కారము

(6) విదేశవస్తు బహిష్కారములో రెండు సమస్యలు గలవు. ఒకటి-ఆబహిష్కారోద్దేశ్యము; రెండవది - ఆబహిష్కారపద్ధతులు. ప్రభుత్వాభిప్రాయ మీక్రిందివిధమున నున్నది:—భారతీయ స్వదేశపరిశ్రమలను ప్రోత్సహించుటకు ప్రభుత్వమువారి యామోదము కలదు. భారతదేశపు ఐహికైశ్వర్యసముద్ధరణలో నీపారిశ్రామికోద్యమ మొక భాగము కావున, వ్యక్తిస్వాతంత్ర్యమునకును, శాంతిశాసనసమర్థనమునకును భంగములేకుండ పైయుద్దేశ్యముతో చేయుప్రచారమును, ప్రోత్సాహమును, ప్రకటనాదుల కుంచింపవలె నని ప్రభుత్వపుకోరిక కాదు. అయినను శాసనోల్లంఘనోద్యమకాలమున విదేశవస్తుబహిష్కారము ముఖ్యముగా బ్రిటిషువస్తువులబహిష్కారముగానే ప్రయోగింపబడెను. (ఒక్కవిదేశవస్త్రబహిష్కారవిషయములోమాత్రము బ్రిటిషు ఇతరము-అనుభేదము లేక అన్నివిదేశవస్త్రములును బహిష్కరింపబడెను.) అట్టి బ్రిటిషువస్తు బహిష్కారము రాజకీయోద్దేశ్యములతో కూడుకొన్నదై బ్రిటనుదేశమున ఒత్తిడికలుగజేయుట కుద్దేశింపబడెను. రాజ్యాంగవిషయమును బ్రిటిషు ఇండియాప్రతినిధులు, సంస్థానప్రతినిధులు, బ్రిటిషుప్రభుత్వమువారు, బ్రిటనులోని యితరరాజకీయపక్షములును కలసి జరుపబోవు సమావేశములో కాంగ్రెసుప్రతినిధులు స్నేహము వహించి పాల్గొనబోవునప్పుడు, పైయుద్దేశ్యములతో కూడుకొన్న బహిష్కారము తగియుండదని అంగీకరింపబడెను. అందువలన శాసనోల్లంఘనోద్యమము విరమింపబడు ననుటతో బ్రిటిషువస్తు బహిష్కారము రాజకీయసాధనముగా నుపయోగించుటకూడ స్పష్టముగా విరమింపజేయబడినట్లే యని అంగీకరింపబడెను. రాజకీయాందోళనకాలమున బ్రిటిషువస్తువులను అమ్ముట గాని, కొనుట గాని మానుకొనినవారు తమ కిష్టమున్నచో, ఆపద్ధతిని, మార్చుకొనుట కెట్టినిరోధమును ఇకముందు ఉండకూడదు.

### పికెటింగు

(7) విదేశవస్తువులను పోనడచి, వాటికి బదులు స్వదేశవస్తువుల నుద్ధరించుటకు గాని, మద్యపానమును మానిపించుటకు గాని, అవలంబింపబడుచున్న పద్ధతులలో సాధారణపు చట్టపు హద్దుల నతిక్రమించి కావింపదగు పికెటింగుతప్ప నితరప్రకారములైన పికెటింగు

ప్రయోగింపబడదు. చట్టసంబద్ధ మని పై నుడివినపికెటింగు నిర్బంధ ముగా గాని, నిరోధముగా గాని, భయపెట్టుటగా గాని, ప్రతికూల ప్రదర్శనములు సేయుటగాగాని, పౌరుల కడ్డము తగులుటగాగాని సాధారణచట్టముల కట్టి భంగముగా గాని యుండగూడదు. ఎక్కడనైనను ఈపద్ధతు లవలంబింపబడెనేని అచట పికెటింగు నిలిపివేయబడును.

### పోలీసుచర్యలవిచారణ

(8) పోలీసుప్రవర్తనల నధిక్షేపించుచు కొన్నికొన్ని సందర్భములను గాంధిగారు ప్రభుత్వమునకు తెలియజేసి బహిరంగవిచారణ జరిపింపవలసినదని కోరినారు. ప్రస్తుతసందర్భములలో ఈవిషయమున ప్రభుత్వమునకు గొప్పచిక్కు లున్నవి. అట్టివిచారణలు పరస్పర నిందారోపణలకు కాలుద్రవ్వుట యగును. కావున శాంతిసముద్ధరణకు భంగకారు లగును. ఈఅంశముల గమనించి గాంధిగారు పోలీసువిచారణవిషయమున పట్టుపట్టలేదు.

(9) శాసనోల్లంఘనోద్యమము విరమించుటతో ప్రభుత్వము వారు గైకొనబోవుచర్య లీక్రింద వివరింపబడినవి.

### ఆర్డినెన్సుల ఉపసంహారము

10. శాసనోల్లంఘనోద్యమసందర్భమున కావింపబడిన ఆర్డినెన్సు లన్నియు ఉపసంహరింపబడును. విప్లవోద్యమమును ప్రతిఘటించుటకై కావింపబడిన 1931 సం. ఒకటవ ఆర్డినెన్సు ఇందులో చేరదు.

### క్రిమినలు లా సవరణచట్టముక్రింద నిషేధములు తొలగింపబడును

11. 1908 వ సం.పు క్రిమినలు లా సవరణచట్టముక్రింద, అక్రమసంఘములుగా నిర్దేశించుచు నిషేధించినసంఘములపై నిషేధపుటుత్తరువులు ఉపసంహరింపబడును. ఇందుకు పైనిషేధపుటుత్తరువులు శాసనోల్లంఘనోద్యమసందర్భమున కావింపబడినవిగా నుండవలెను. ఇటీవల బర్మాప్రభుత్వమువారు క్రిమినలు లా సవరణచట్టముక్రింద గావించిన నిషేధపుటుత్తరువు ఇందులో చేరదు.

### విచారణలోనున్న ప్రాసిక్యూషను లెత్తివేయబడును

12. శాసనోల్లంఘనోద్యమపరముగా ప్రారంభమై జరుగుచున్న ప్రాసిక్యూషనులు విరమించుకొనబడును. ఇందుకుగాను విచారణలోనున్న నేరములు దౌర్జన్యరాహిత్యములుగా నుండవలెను. పరిభాషాను సారముగా దౌర్జన్యయుత మని కాని, అట్టి దౌర్జన్యమునకు ప్రోద్బలము లని కాని భావింపబడు నేరములలో కూడ ప్రాసిక్యూషనులు విరమింపబడును.

(ఆ) క్రిమినలు లా ప్రొసీజరుకోడుక్రింద జరుపబడుచున్న సెక్యూరిటీకేసులకుకూడ పైనియమములే అనువర్తించును.

(ఇ) శాసనోల్లంఘనోద్యమమందు పాల్గొనినన్యాయవాదులపై రాష్ట్రీయప్రభుత్వములు హైకోర్టులలో లీగల్ ప్రాక్టీషనర్సుచట్టముక్రింద కేసు పెట్టియున్నయెడల అట్టికేసులు విరమించుకొనుట కాయాకోర్టులలో రాష్ట్రప్రభుత్వము లనుమతి కోరగలవు. ఇందుకుగాను ఆయా న్యాయవాదివ్యక్తుల చర్య దౌర్జన్యరాహిత్యమై యుండవలెను.

(ఈ) సోల్జర్లపై గాని పోలీసులపై గాని ఆజ్ఞోల్లంఘనకై జరుపబడు ప్రాసిక్యూషను లీనియమములో చేరవు.

### రాజకీయఖైదీలవిడుదల జరుగును

13. (అ) దౌర్జన్యరహితమైన నేరములకు శాసనోల్లంఘనోద్యమసందర్భమున జైలుకు పోయినవారి నందరిని ప్రభుత్వమువారు విడుదలచేసెదరు. దౌర్జన్య మనుశబ్దమునకు పారిభాషికముగా నుపయోగించు దౌర్జన్యము అర్థము కాదు.

(ఆ) ఏఖైదీ గాని (అ) నియమములో చేరియుండి దౌర్జన్యవిరహితమగు జైలునేరమునకు దేనికైనను శిక్షింపబడియున్నయెడల ఆశిక్షకూడ రద్దుచేయబడును. అట్టిజైలునేరమునకిప్పుడు ఏఖైదీమీద గాని ప్రాసిక్యూషను జరుగుచున్నయెడల అట్టి ప్రాసిక్యూషను విరమించుకొనబడును. ఇందులో దౌర్జన్యశబ్దము పారిభాషికము కాదు.

(ఇ) ఆజ్ఞోల్లంఘనమునకై శిక్షింపబడినసోల్జర్లను పోలీసులను ఈరాజకీయఖైదీలవిడుదలనియమములో చేరరు.

### జరీమానాలు

(14) ఇప్పటికి వసూలుచేయబడని జరీమానాలు వసూలుచేయబడవు. క్రి. ప్రొ. కోడుక్రింద సెక్యూరిటీ రద్దుపరచుట కాజ్ఞ గావింపబడి, అట్టిసెక్యూరిటీమొత్త మింకను వసూలు చేయబడకయున్నయెడల అవి యిక వసూలుచేయబడవు. వసూలు చేయబడినజరీమానాలు, గాని రాబట్టుకొబడిన సెక్యూరిటీధనము గాని యేమాత్రమును మరల నిచ్చివేయబడదు.

### అదనపుపోలీసుల విరమించుట

(15) శాసనోల్లంఘనోద్యమసందర్భమున అదనపుపోలీసులను ఆయావాస్తవ్యులు వ్యయమును భరించునట్లుగా నియమించినచోట్లనెల్ల రాష్ట్రప్రభుత్వములు తమవిచక్షణత నుపయోగించి ఆయదనపుపోలీసు సిబ్బందిని విరమించెదరు. అదనపుపోలీసువ్యయమున కక్కరవ గాకుండ ఇప్పటికి వసూలుచేయబడినధనమును రాష్ట్రప్రభుత్వములు మరలనిచ్చివేయజాలవు.

### ఆస్తిని మరల ఇచ్చివేయుట

(16) (అ) శాసనోల్లంఘనోద్యమసందర్భములలో, సక్రమముగా అనుభోగ్యమైన చరాస్తిని ఆర్డినెన్సుక్రింద గాని క్రిమినలు లా సెక్షనులక్రింద గాని ప్రభుత్వమువారు స్వాధీనపఱచుకొని యున్న

చోట్ల నెల్ల అది ఇప్పటికిని ప్రభుత్వస్వాధీనమందే యున్న యెడల మరల నిచ్చివేయబడును.

(ఆ) భూమిసిస్తును గాని మరియేపన్నును గాని రాబట్టుటకై జప్తు చేయబడినచరాస్తి మరల నిచ్చివేయబడును. కాని ఆచెల్లించని మనిషి సమంజసమైనకాలములోపల ధృష్టముగా పన్ను చెల్లింపడని కలెక్టరునకు ఆధార మున్నయెడల పైనియమము చెల్లదు. సమంజసమయినకాలమును నిర్ణయించుటలో పన్ను చెల్లించుటకు సమ్మతి యుండియు శక్తిలేనివారివిషయమునుగూర్చి శ్రద్ధ వహింపబడును. అవసరమైనయెడల భూమిశిస్తు పరిపాలనానియమములప్రకారము సిస్తు వసూలు నిలిపియుంచబడును.

(ఇ) చరాస్తి ఖిలమైనందులకు పరిహార మొసగబడదు.

(ఈ) చరాస్తిని జప్తు చేసినవెనుక ప్రభుత్వమువారు విక్రయించియో మరియెట్లో పరిష్కారము చేసియున్నయెడల, పరిహార మొసగబడదు. విక్రయమువలన వచ్చినడబ్బు చెల్లింపవలసినపన్ను కధికముగా నున్న తప్ప మరల నిచ్చివేయబడదు.

(ఉ) జప్తు న్యాయశాస్త్రరీత్యా జరుగలేదని తోచినవారు కోర్టు కెక్కి కేసుచేసి న్యాయము పొందవచ్చును.

## జప్తు చేయబడిన స్థిరాస్తి

(17) (అ) 1930 వ సంవత్సరపు 9 వ ఆర్డినెన్సుక్రింద ప్రభుత్వము స్వాధీనము చేసికొనినస్థిరాస్తి ఆయార్డినెన్సునిబంధనలబట్టియే మరల నిచ్చివేయబడును.

(ఆ) భూమిశిస్తు గాని, మరి ఏపన్ను గాని వసూలు చేయుటకై జప్తు చేసికోబడిన భూమి మొదలగు స్థిరాస్తి విషయములో ఇపుడు ప్రభుత్వస్వాధీనమందున్న స్థిరాస్తి అంతయు మరల నిచ్చివేయబడును. అట్లిచ్చివేసినను పన్ను చెల్లించవలసినవాడు సమంజసమైనకాలములో ధృష్టముగా చెల్లించడని తలచుటకు కలెక్టరున కాధారమున్నయెడల ఆస్తి యిచ్చివేయబడదు. సమంజసమైనకాలమును నిర్ణయించుసందర్భములో పన్ను చెల్లించుటకు సమ్మతి యుండియు శక్తిలేనివారివిషయమున శ్రద్ధ వహింపబడును. అవసరమైనయెడల పన్ను వసూళ్లు పరిపాలనాసూత్రముల ననుసరించి నిలిపివేయబడును.

(ఇ) జప్తు చేసిన స్థిరాస్తి ప్రభుత్వపుచేయి దాటిపోయి మూడవవారికి చేరిపోయినయెడల, ప్రభుత్వమునకు చెందినంతవరకా విషయ మంతటితో ఆఖరైనయట్లే తలంపవలెను.

వరా:—ఈ విక్రయములు కొన్నియైనను అక్రమములు అన్యాయము నని తనకు తెలిసియున్నట్లుగా గాంధిగారు నివేదించినారు. ప్రభుత్వమువారుమాత్రము తమకు తెలిసినదానినిబట్టి వివాదము నంగీకరింపజాలరు.

(ఈ) ఆస్తిజప్తువిషయము న్యాయశాస్త్రరీత్యా లేదని తలచువారు కోర్టు కెక్కి కేసుచేసి న్యాయము పొందవచ్చును.

18. చట్టనిబంధనలప్రకారము గాక వేరువిధముగా పన్నులు వసూలు చేయబడినసందర్భము లతిస్వల్పము లనియే ప్రభుత్వమువారి విశ్వాసము. అయినను అట్టిసందర్భములలో న్యాయము కలుగజేయుట కక్రమము స్పష్టపరుపబడినచోట్ల నెల్ల విచారణ సలిపి చర్యగైకొనవలసినదిగా జిల్లాఉద్యోగులకు రాష్ట్రప్రభుత్వములు ఉత్తరువు లంపగలవు.

## ప్రభుత్వోద్యోగులను మరల స్వీకరించుట

(19) తమ ఉద్యోగములకు రాజీనామా నిచ్చినవారిస్థానము లందు శాశ్వతముగా ఇతరులను నియమించి యున్న యెడల ప్రభుత్వమువారు మరల పూర్వపుమనుష్యులను నియమింపజాలరు. రాజీనామా నిచ్చినప్రభుత్వోద్యోగులు కాని, గ్రామోద్యోగులు కాని మరల తమ నౌకరీల నపేక్షించునెడల రాష్ట్రప్రభుత్వము లాయామనుష్యులగుణాగుణములనుబట్టి ఉదారమైనపద్ధతినే అవలంబించెదరు.

## ఉప్పు తయారుచేయుట

(20) ఉప్పుశాఖపరిపాలనవిషయములో ఇప్పుడున్న చట్టముల నుల్లంఘించుటను ప్రభుత్వమువారొప్పుకొనజాలరు. ప్రస్తుతము దేశపు ఆర్థికస్థితిగతులబట్టి ఉప్పుచట్టములను ఎక్కువగా మార్పుచేయుటకును వారికి వీలుగాదు. అయినను కొంతమంది బీదజనుల సౌకర్యార్థము తామిపుడు కొన్నికొన్నిచోట్ల పరిపాలనానిబంధనలబట్టియే అవలంబించు పద్ధతిని ఉప్పు లభ్యమగుచోట్లకు చుట్టుపట్లనున్న గ్రామాదులజనులు ఉప్పును సేకరించుటకును, తయారు చేసికొనుటకును, ఆయాగ్రామాదులలోనే విక్రయించుటకును అవకాశ ముండునట్లేర్పాటు చేసెదరు. ఈనిషిద్ధలవణమును బయటివారికి అమ్మకమునకుగా నుపయోగింపగూడదు.

21 ఈఒడంబడికలోనినియమములను కాంగ్రెసువారు సంపూర్ణముగా పాటింపకపోవునెడల ప్రభుత్వమువారు పౌరవ్యక్తిసంరక్షణార్థమును, శాంతిశాసనసమర్థనార్థమును అవసరమైన చర్యలను గైకొనవలసియుందురు.

(సం) హెచ్. డబ్ల్యు. ఎమర్సన్,
ఇండియా ప్రభుత్వ కార్యదర్శి.

## భారతకాంగ్రెసుకార్యసంఘమువారి తీర్మానము

"ఇండియా గవర్నమెంటువారికిని కాంగ్రెసువారి పక్షమున గాంధిగారికిని జరిగిన తాత్కాలికమగు ఒడంబడికలోని షరతులను భారతకాంగ్రెసు కార్యసంఘమువారు ఆలోచించి వాటి నన్నిటిని ఆమోదించిరి. ఈషరతుల ప్రకారము వెంటనే పనిని ప్రారంభింప

వలెనని దేశమునందలి అన్ని కాంగ్రెసు సంఘములకును తెలియజేయుచున్నారు. ఈషరతులలో కాంగ్రెసువారు నెఱవేర్పవలసిన వాటి నన్నిటిని దేశమునం దంతటను కాంగ్రెసువారు సరిగా నెఱవేర్చెదరనియె కార్యసంఘమువారు నమ్ముచున్నారు. ఈ ఒడంబడికలోని షరతులను కాంగ్రెసువారు సరిగా నెఱవేర్చుటపైననే పూర్ణస్వరాజ్యమాధారపడి యుండునని సంఘమువారు స్పష్టపరచుచున్నారు"

అను తీర్మానము నేడు జరిగిన భారత కాంగ్రెసు కార్యసంఘ సభలో నామోదింపబడెను.

## కాంగ్రెసుసంఘముల కన్నిటికిని కర్తవ్యమును స్పష్టపరచుట

"కాంగ్రెసుమహాసభవారిపక్షమున భారతకాంగ్రెసుకార్యసంఘమువారికిని ఇండియాగవర్నమెంటువారికిని తాత్కాలికముగా ఒడంబడిక కుదిరినందున ఈఒడంబడికప్రకారము పనిచేయుటకు వివిధరాష్ట్రములందున్న కాంగ్రెసుసంఘముల కన్నిటికి వెంటనే తెలియజేయుటకు వీరు తగినయేర్పాటులు చేయగోరెదను.

1. శాసనోల్లంఘనమును, పన్నులనిరాకరణమునుగూడ వెంటనే విరమించవలెను. ఇటుపై నేచట్టములను (లాసు రిస్యులేషన్సు) కాంగ్రెసువా రెవ్వరునుగూడ ధిక్కరింపగూడదు. తిరస్కరింపగూడదు. ఉల్లంఘింపగూడదు.

2. బ్రిటిషువస్తుబహిష్కారమును కేవలము బహిష్కారమాత్రముగా ప్రయోగింపగూడదు. ఈ విషయములో వ్యక్తులకు స్వేచ్ఛ నీయవలెను.

3. నిషా చేయునట్టివస్తువులను పానీయములను, అన్నివిదేశములబట్టలను సారాదుకాణములను బహిష్కరించుట కనుమతి యియ్యబడెను గాన అవసరము కలిగినచో వీటిని బహిష్కరించుచునే యుండవలెను.

4. ఈదుకాణములవద్ద పికెటింగు చేయునపుడు తీవ్రచర్యలను (ఎగ్రసివు) జరుపగూడదు. ఎవరినిగూడ బెదరింపగూడదు. నిర్బంధింపగూడదు. నిరోధింపగూడదు. విరోధభావముతో వెట్టిప్రదర్శనములను (డిమానిస్ట్రేషన్సు) చేయగూడదు. రాకపోకల కట్టియభ్యంతరమును కలిగింపగూడదు. ప్రజలు రాకుండ అడ్డుపెట్టగూడదు. మామూలు న్యాయశాస్త్రమునకు సంబంధించిన యే నేరమును గూడ చేయగూడదు.

౫. ఎచటనైన నీతిగా పికెటింగు చేయుటకు వీలు కలుగనిచో అట్టిప్రదేశములలో పికెటింగుచేయుట మానివేయవలెను.

6. విదేశవస్తువుల నన్నిటిని పరిత్యజించి దేశీయవస్తువులనే వాడవలెనని కూడ బోధించుచుండవలెను.

7. చాలమంది గుంపుగా చేరి ఉప్పుచట్టముల నుల్లంఘింపగూడదు. ఉప్పుకొఠారులపైని దాడి సలుపగూడదు.

8. ఉప్పు పోగుచేయుటకును తయారుచేయుటకును వీలుగా నున్నప్రదేశములలో నివసించుచుండు గ్రామస్థులు ఇటుపైనిగూడ ఉప్పు పోగుచేయవచ్చును. తయారుచేయవచ్చును. దానిని వారు ఉపయోగించుకొనవచ్చును. ఆప్రాంతములలో నున్నవారికి విక్రయింపవచ్చును. కాని ఆఉప్పును దూరప్రదేశములం దున్నవారికి విక్రయింపగూడదు. ఆఉప్పుతో పెద్దయెత్తున వ్యాపారము చేయగూడదు.

9. ఇటుపై డిక్లరేషను ఇయ్యకుండ పత్రికలను ప్రకటింపగూడదు.

10. సిస్తులను చెల్లింపజాలకపోవుటవలన గాని ఆర్థికము ప దురవస్థలవలనగాని స్వగ్రామములను వదలివేసి యితరస్థలములకు వెళ్లినవారు మరల స్వగ్రామములకు వెళ్లుటకును, భూమిసిస్తును చెల్లింపవలసినవారు దానిని చెల్లించుటకును సంసిద్ధులు కావలెను.

11. దొరతనమువారు భూమిసిస్తులను ముజరా యిచ్చునట్లును వసూలు చేయకుండునట్లును చేయుట కితరపద్ధతుల నవలంబింపవలెను.

12. రాజకీయఖైదీల నందరిని వెంటనే విడుదల చేసెదరు గాన కరాచీకాంగ్రెసుమహాసభకు ప్రతినిధుల నెన్నుకొనువిషయమున ప్రత్యేకముగా ఉత్తరువులు పంపబడును."

అని భారతకాంగ్రెసుకార్యదర్శి డాక్టరు సయ్యదు మహమదు గారు ప్రతిరాష్ట్రీయకాంగ్రెసుసంఘమునకును తంతివార్త నంపెను.

## గాంధిమహాత్ముడు పత్రికావిలేఖకుల సభలో నుపన్యసించుట

ఢిల్లీ, మార్చి ౫:—దేశీయపత్రికలవిలేకరులును విదేశీయపత్రికల విలేకరులును చాలమంది నేడు మహాత్ముని సందర్శించిరి. ఆసభలో మహాత్ముడు ఒకగంటసేపు మాటలాడెను.

"ఇర్విన్‌ప్రభువుసహనము నిరుపమానము; కార్యనిమగ్నత మరింత నిరుపమానము. ఇర్విన్‌ప్రభువు నిరంతరమును చాల సౌజన్యముతో మిక్కిలి మర్యాదగానే ప్రవర్తించెను.

పూర్ణస్వరాజ్యమును బడయుటయే కాంగ్రెసువారి యాశయము. దీనినే సంపూర్ణస్వాతంత్ర్యము (కంప్లీటు ఇండిపెండెన్సు) అని కొంద రందురు గాని యీవాక్యము పూర్ణస్వరాజ్య మనుభావమును సరిగా నెల్లడింపజాలదు. ఈపూర్ణస్వరాజ్యమును బడయుటకే కాంగ్రెసువా రిపుడు రౌండుటేబిలుసభలో పాల్గొనుచున్నారు.

ఇదివరకు లండనులో జరిగినరౌండుటేబిలుకాన్ఫరెన్సులో సగము వరకైనను మన ఆశయములు కొనసాగలేదు. సమగ్రనిరంకుశవర్గమును

సమగ్ర ప్రజాసత్తాకవర్గమును చేరి ఫెడరేషనుగూడ నేర్పడినచో గొప్ప అనర్థకము కలుగకమానదు.

కాంగ్రెసుసభ అశేష భారతీయులకును ప్రతినిధిసభయై యున్నదిగాన బ్రిటిషు యిండియాలోని ప్రజ లెట్టిస్వాతంత్ర్యములను బడయ గోరుచున్నారో అట్టిస్వాతంత్ర్యములనే సంస్థానములప్రజలుగూడ బడయగలుగుటకు తగినయేర్పాటులను చేయవలె నని కాంగ్రెసువారు కోరినచో సంస్థానాధిపతులు పెడచెవిని పెట్ట రనియే నమ్మెదను.

కాంగ్రెసువారి యాశయము సిద్ధింపవలె ననిన దేశమునందుగల అన్ని పక్షములవారును సంస్థానాధిపతులును, ఆంగ్లేయులును గూడ తోడ్పడుట ముఖ్యావసరమే యగును.

కావున నిపుడు కాంగ్రెసువారికిని గవర్నమెంటువారికిని తాత్కాలికముగా జరిగినఒడంబడికను కొనసాగించుటకు దేశీయు లందరునుగూడ పూనుకొనవలెను. వా రటులు చేసినచో మన యాశయముకొరకు పట్టుపట్టుట కవసరమగు ప్రతిష్ఠ కాంగ్రెసుకు చేకూరగలదు.

అరాజకవర్గమువారు గూడ కనీసము ప్రస్తుతకాలానుగుణ్యమగు నావశ్యకముగా భావించిరైనను తమదౌర్జన్యవిధానమును విరమించి అహింసావిధానమున యాశయమును బడయుటకు కాంగ్రెసువారి కొక యవకాశము నొసగవలె నని కాంగ్రెసువారును నేను స్వయముగాను గూడ అరాజకపక్షమువారిని కోరుచున్నాను. అరాజకపక్షమువారిపు డిందులకు సమ్మతించినచో అటుపిమ్మట రాజకీయఖైదీల నందరిని ఉరిశిక్ష విధింపబడినవారిని గూడ వదలివేసెదరు. కాని అడియాశలను కలిగింపగూడ దనిమాత్రము నేను హెచ్చరింపక తప్పదు.

మే మిపుడు ప్రారంభించిన యుద్యమమునం దమెరికా మున్నగు విదేశములవారు సానుభూతిని ఆదరమును వెల్లడించుచున్నా రని నేను బాగుగా నెరిగియేయుంటిని. ఇటుపై నింకను కష్టతరములగు పరిస్థితులను మే మెదుర్కొనవలసి యుండుటచే అపుడుసైతము విదేశీయు లింతకంటె అధికమైన సానుభూతినిగూడ చూపుచున్నచో మా ప్రయత్నము ఫలించునెడల అఖిలప్రపంచముయొక్క శాంతికిని అత్యధికమగు నాధార మేర్పడగలదు.

ఇర్విను ప్రభువు నాయనుమానముల నన్నిటిని పూర్తిగా తొలగించి నాకు చిత్తశాంతిని కలుగజేసెను. ఇపుడు కాంగ్రెసువారికిని దొరతనమువారికిని ఒడంబడిక జరుగుటవలన ప్రజ లపారములగు కష్టములకు పాలుగావలసినదురవస్థ తొలగినది.

ఇది విజయమే అగునెడల నిది కాంగ్రెసువారికిని దొరతనము వారికినిగూడ చెందుమగాన దీనినిగూర్చి కాంగ్రెసువా రెవరునుగూడ పొంగను గూడదు క్రుంగను గూడదు. ఎవ్వరునుగూడ నిరాశను చెందగూడదు. త్యాగమునకును కష్టానుభూతికిని పరిమితులు బాగుగానే నిర్ధారణ చేయబడియున్నవి. ఆపరిమితి పూర్తియైనపిమ్మటగూడ వాటినే కొనసాగించుచుండుట అవివేకమును గొప్ప అక్రమమునుగూడ నగును. ఇదివరకు జరిగిన యన్యాయములనుగూర్చి యెవరును అధికముగా యోచింపగూడదు. పూర్ణస్వరాజ్యముపైననే తమభావముల నన్నిటిని కేంద్రీకరింపజేయవలెను.

ఒడంబడికలో రెండవరౌండుటేబిలుసభనుగూర్చిన వాక్యమునకు రెండర్థములను చేసికొనుటకు వీ లుండునట్లే ఆవాక్యము వాడబడెను.

ఫెడరేషను కేవలము భ్రాంతిమూలకమే కావచ్చును. లేక రెండు ప్రత్యేకావయవములు కలసి పనిచేయుటవలన మొత్తముశరీరమున కంతటికిని అధికమగు బలమును చేకూర్చుటకు తగినసజీవమును సాంగము నగు వ్యక్తియే కావచ్చును.

బాధ్యత వట్టిఛాయయే కావచ్చును. లేనిచో లేక సమున్నతమహావృక్షమువలె వంగనట్టియు వంచుటకు వీలులేనట్టియు నేర్పాటుగూడ కావచ్చును.

రక్షణలు భారతమాతకాలుచేతుల నంటగట్టునట్టి బంధములే కావచ్చును. లేదా క్రొత్తగా నాటబడినమొక్కను చాల ప్రేమతోను, శ్రద్ధతోను పెంచవలసి యుండునుగాన నట్లు దానిని కాపాడుట కవసరమగునట్టి పలువిధములగు కంచెలుగూడ కావచ్చును.

రెండుపక్షములవారును తమతమపద్ధతుల ప్రకారము పనిచేయుట కవకాశ ముండును.

భారతదేశమునందు రాజకీయముగను, సాంఘికముగను, ఆర్థికముగను, నైతికముగనుగూడ నిజమైన అభివృద్ధి కలుగుటకు ఫెడరేషను బాధ్యత, రక్షణలు, మినహాయింపులు మున్నగున వన్నియును సాధనభూతములుగా నుండునట్లు చేయవలె ననియే కాంగ్రెసువారు ముఖ్యముగ కోరుచున్నారు. ఈవిషయమును రౌండుటేబిలుసభవా రందరును గూడ నామోదించునట్లు కాంగ్రెసువారు చేయగలిగినచో దానివలన కలుగునట్టిఫలితము పూర్ణస్వరాజ్యమే (కంప్లీటు యిండిపెండెన్సు) అగు నని నేను చెప్పగలను.

ఈ నూతనావకాశమును కాంగ్రెసువారు చక్కగా నుపయోగించుకొనినచో ఈ పూర్ణస్వరాజ్యవిధానమునకు మంచి పునాదిని కలిగింపవచ్చును; లేదా తగిన యాత్మవిశ్వాసమును ధైర్యమును లేకపోవుటవలన ఈ యవకాశమును వ్యర్థ మొనరింపవచ్చును.

ఎటు లైనను కాంగ్రెసువా రిపుడు ప్రభుత్వమునకు తోడ్పడుటకు పూనుకొనిరి గాన గిట్టితరుణమున దేశమునందు గల అన్ని పక్షములవారును సంస్థానాధిపతులును ఆంగ్లేయులునుగూడ కాంగ్రెసు వారికి తోడ్పడుట ముఖ్యతమమై యున్నది" అని మహాత్ముడు నుడివెను.

## మరికొన్ని వివరములు

అమెరికా పత్రికావిలేఖరులును ఇండియాపత్రికావిలేఖరులును మొత్తము 15 మంది నేను మధ్యాహ్నము అన్సారిగారి మందిరమున మహాత్ముని సందర్శించిరి. అపుడు తనకును రాజప్రతినిధికిని జరిగిన ఒడంబడికనుగూర్చి మహాత్ముడు వారి కెరిగించెను.

"రాజప్రతినిధి అపారమగు ఓరిమిని సహనమును బూని మిక్కిలి శ్రమపడి పని చేయుటయును చాల మర్యాదగా సంభాషణలను జరుపుటయును, కలుగకుండినచో, ఈ ఒడంబడిక కుదిరియుండదని నేను ముందుగా మీకు తెలుపగోరుచున్నాను. నేను ఇర్వినుప్రభువునకు చాల ఆగ్రహము కలిగింపదగినరీతిని అనుద్దిష్టముగానే చాలసారులు మెలగియుండవచ్చును. అతనియోరిమిని నేను కఠినముగానే పరీక్షించియుండవచ్చును. కాని ఒక్కసారియైన నతడాగ్రహమును గాని, వేసటను గాని అవంతయైన కనబరచియుండలేదు. మొదటినుండి కడవరకును ఇర్వినుప్రభువు మిక్కిలి ధారాళముగానే ప్రవర్తించెను. సాధ్యమైనచో నెటులనైన సమాధానమును కలిగించి తీరవలెనని అతడు దీక్షపూనెననికూడ నేను నమ్మెదను.

నేను మొదట చాల భయాందోళనములతోనే సంభాషణలను ప్రారంభించితిని. నా కవిశ్వాసముగూడ హెచ్చుగానే యుండెను. కాని ప్రారంభమునందే యిర్వినుప్రభువు నాసంశయము లన్నిటిని పూర్తిగా తొలగించి నాకు చిత్తశాంతిని కలిగించెను.

నేను మొదట రాజప్రతినిధికి లేఖ వ్రాసినపు డెటులనైనను సమాధానమును కలిగించితీరవలెనను దృఢసంకల్పముతో వ్రాసియుండలేదు. కాని యిపుడు సమాధానము కుదురనిచో దేశమున ప్రజలకష్టములు వెనుకటికంటె నూరురెట్లధికమై యుండుట నిశ్చయము గావునిపుడు సమాధానము కుదిరినందులకును, ప్రజ లిట్టిబాధలకు గురిగావలసిన యవసరము తొలగినందులకును నేను భగవంతునకు వందనసహస్రముల నర్పించుచున్నాను.

## వినమ్రతతో భగవంతుని ప్రార్థింపుడు

సమాధానము కుదిరినందుల కెవ్వరు నుప్పొంగగూడదు. ఇపుడు జయాపజయములనుగూర్చి ఆలోచించుట కెట్టి కారణముమ లేదు. మనకు పూర్ణస్వరాజ్యము లభించువరకును మనము విజయులము కాజాలము. కావున నిపుడు కష్టములపాలగుటవలననైనను లేక మిక్కిలి ఓరిమితోను మృదుమధురవాక్యములతోను వాదప్రతివాదములను జరుపుటవలననైనను తమ యభీష్టముపడయుటకు తమవిధిని నెరవేర్చుట కవసరమగు ధైర్యత్యాగవివేకాదుల నొసగుమని యెల్లవారును వినమ్రులై భగవంతుని ప్రార్థింపగోరెదను. గత 12 నెలలనుండియు సత్యాగ్రహమునందు పాల్గొని అష్టకష్టముల ననుభవించిన లక్షలకొలది దేశీయు లందరును ఇపుడుగూడ నటులనే ఐకమత్యము వివేకము కార్యనిరతి మున్నగువాటి నత్యధికముగా వెల్లడించుచుందు రని నమ్మెదను.

## సమాధానమువలన నిజమైనయవకాశ మేర్పడినది

ఇపుడు సమాధానము కుదిరినందుల కానందభరితు లగువారు కొంద రుండుచెడల చాల నిరాశను చెందుచున్నవారుగూడ కొంద రుండగల రని నేను బాగుగా నెరుగుదును. శౌర్యసాహసములతో కష్టముల ననుభవించుటయే యిట్టివారికి ప్రియతమము. అందువలననే వారి కత్యధికమగు నానందము కలుగును. ఎంతకాలమునకైనను వారు సహించుచుందురు గాని ఆకష్టదశ తొలగుచో పనిచేయుటకు తమ కవకాశము లే దనియును లక్ష్యముగూడ చాల దూరమైన దనియును వారు భావింపకుండజాలరు. "మీరు సహనముతో భగవంతుని ప్రార్థించుచు శ్రద్ధగా గమనించుచుండుడు" అనియే నే నట్టివారికి తెలిపెదను. కష్టముల ననుభవించుటకుగూడ స్పష్టమగు మితియే కలదు. తనతో చర్చించుటకు ప్రతిపక్షి అవకాశమును కలుగజేసినపుడుగూడ కష్టములపాల్పడుచునే యుండగోరుట గొప్పతప్పిదమే యగును. అవకాశ మేర్పడినపుడు దాని నుపయోగించుటయే ముఖ్యకర్తవ్య మగును. ఇపుడు కలిగినసమాధానమువలన మంచియవకాశ మేర్పడిన దనియే నేను నమ్మెదను. కాంగ్రెసువారు రౌండుటేబిలుకాన్ఫరెన్సులో పాల్గొనుటకు ముందు ఇంకను చాల విషయములు జరుగవలసియే యున్నవి. ఇదివరకు జరిగిన యత్రకమము లెంత ప్రబలముగా నుండినను వాటికి పరిహారమును బడయగోరుట కాంగ్రెసువారి ప్రధానాశయము కాదు. పూర్ణస్వరాజ్యమును బడయుటయే కాంగ్రెసువారిప్రధానాశయము. అదియే భారతీయుల జన్మహక్కు. అది పూర్తిగా లభింపనిచో భారతీయులకు సంతృప్తి కలుగజాలదు.

ఈపదమును మిక్కిలి భద్రముగా మరుగుపరుచుచున్నట్టివాక్యము రెండర్థముల నిచ్చుటకు బుద్ధిపూర్వకముగా సమర్థమైయున్నది. ఫెడరేషను కేవలము భ్రాంతిమూలకమే కావచ్చును. లేక మొత్తముశరీరమున కంతటికిని బలమును కలిగించుటకు తగినరీతిని రెండుప్రత్యేకావయవములు కలసి పనిచేయునట్టి శారీరకస్థితిగూడ కావచ్చును.

రెండవప్రాపసదగినబాధ్యతగూడ పట్టిఛాయయేకావచ్చును. లేనిచో అది వంగనట్టియు వంచుటకు వీలు కానట్టియు సమున్నతగంభీరమహావృక్షముగూడ కావచ్చును. రక్షణలవలన భారతదేశమునకు కలుగగల లాభమునుబట్టి చూచినచో నవి కేవలము ఎండమావులును భారతమాతకాలుసేతుల నంటగట్టు గట్టిబంధములునుగూడ కావచ్చును. అవి భారతమాత మెడకు తగిలింపబడిన ఉరితాళ్లుగూడ కావచ్చును. లేదా క్రొత్తగా నాటబడిన లేతమొక్కను చాలక్షేమముతోను శ్రద్ధతోను పెంచవలసియుండును గాన నట్లు దానిని కాపాడుట కవసరమగునట్టి పలువిధములగు కంచెలుగూడ నవి కావచ్చును.

ఈ ప్రాపులకు ఒకపక్షమువా రొకయర్థమును మరియొకపక్షమువారు మరియొకయర్థమును చేయుటకుగూడ నవకాశము కలదు. ఈపదమును మరుగుపరుచుచున్నట్టివాక్యమునుబట్టి రెండుపక్షముల

వారును తమతమవిధానముల ననుసరించి పని చేయుచుండుటకుగూడ నవకాశము కలదు.

భారతదేశమునందు రాజకీయముగను సాంఘికముగను ఆర్థికముగను నైతికముగనుగూడ నిజమైనయభివృద్ధి కలుగుటకు ఫెడరేషను, బాధ్యతరక్షణలు, మినహాయింపులు, మున్నగువాటి నన్నిటిని సాధనభూతములుగా చేయవలె నను నుద్దేశముతోనే కాంగ్రెసువారు రౌండుటేబిలుసభలో పాల్గొనుట కిపుడు తమయామోదమును వెల్లడించిరి.

ఈ విషయమును రౌండుటేబిలుసభప్రతినిధు లందరును బాగుగా గ్రహింపగలుగునట్లు కాంగ్రెసువారు చేయగలిగినచో మనయాశయము పూర్తిగా సిద్ధింపగలదు. కాని యిది చాల కష్టసాధ్యమని నే నెరుగుదును. మార్గము చాల దుర్గమము. కంటకశిలాభూయిష్ఠము. కాని కాంగ్రెసువారు సంపూర్ణధైర్యవిశ్వాసములతో నీనూతనకార్యనిర్వహణమునకు గడంగినచో ఫలసిద్ధి కలుగగల దని నేను నిస్సంశయముగా చెప్పగలుగుదును. కావున నిది యంతయును కాంగ్రెసువారిహస్తగతముగానే యున్నది. వారీయవకాశమును సరిగా నుపయోగించుకొనినచో జగద్విఖ్యాతిని బడయగలుగుదురు. లేనిచో విఫలు లగుదురు. కాని యీకార్యమును నెరవేర్పవలెనని[న] కాంగ్రెసువారికి సంస్థానాధిపతుల సాహాయ్యమును నాంగ్లేయులసాహాయ్యమును గూడ నత్యవసరమే యగును.

## సంస్థానాధిపతులకు విజ్ఞప్తి

దేశమునం దున్న యితరరాజకీయపక్షములవా రందరును యథార్థముగ స్వాతంత్ర్యమును బడయగోరుటలో కాంగ్రెసువారి కెంతమాత్రమును తీసిపోవుట లేదుగాన నిపుడు వారికి నే నెట్టివిజ్ఞప్తిని చేయ నవసరము లేదు.

సంస్థానాధిపతులవిషయ మిట్టిది కాదు. ఫెడరేషనునకు వారు సమ్మతించుటగూడ నాకు చాల ఆశ్చర్యముగానే యున్నది. వారు ఫెడరలుయుంటియూ సమానభాగస్వాములుగా నుండగోరినచో బుద్ధిపూర్వకముగానే ముందంజ వేయగోరెదను. కావున ఈ ఫెడరేషనులో నిటుపైని తమతో సమానభాగస్వాములుగా నుండగోరు (కాంగ్రెసు) వారుగాని వారిపక్షమున నితరులు గాని చేయునట్టివిజ్ఞప్తిని వినుటకు వారు నిరాకరింప రనియును త్యాగవిరహితమగు పట్టుదలను బూన రనియును నేను నమ్మెదను. కాంగ్రెసువారివిజ్ఞప్తి సంస్థానాధిపతులు తిరస్కరించినచో కాంగ్రెసువారిస్థితి మిక్కిలి అసంగతమును హాస్యాస్పదము నగును. కాంగ్రెసుమహాసభ భారతదేశమునందలిప్రజల కందరికినిగూడ ప్రతినిధిసభయే గాన సంస్థానములప్రజలు బ్రిటిషుఇండియాప్రజలు అను భేదము కాంగ్రెసులో నెంతమాత్రమును లేదు. సంస్థానములపరిపాలనమునుగూర్చి కల్పించుకొనకుండుటలో నిప్పటివరకును కాంగ్రెసువా రధిక మగువివేకమును, ఆత్మనిగ్రహమునుగూడ చూపించియుండిరి. సంస్థానాధిపతుల కనవసరముగా నాగ్రహము కలిగింపజేయకుండుటకుమాత్రమే కాక ఇట్టియాత్మనిగ్రహమును తామే విధించుకొనుటచే అవసరము కలిగినపుడు కాంగ్రెసువారివిజ్ఞప్తిని సంస్థానాధిపతులు వినునట్లు చేయుటకుగూడ కాంగ్రెసువా రిట్టితాటస్థ్యము నవలంబించిరి. అట్టియవసర మిప్పుడు కలిగిన దని నేను నమ్మెదను గాన సంస్థానములప్రజలపక్షమున కాంగ్రెసువా రొనరించినట్టివిజ్ఞప్తిని సంస్థానాధిపతులు తిరస్కరింప రని నేను నమ్మవచ్చునా?

## ఆంగ్లేయులకు విజ్ఞప్తి

ఆంగ్లేయులకుగూడ నే నిట్టివిజ్ఞప్తినే చేయగోరెదను. రౌండుటేబిలుసభలో ఆలోచనలు జరుగుటవలన భారతదేశము స్వపరిపాలనమును బడయవలసియున్నయెడల అందుల కాంగ్లేయులసద్భావమును సాహాయ్యమునుగూడ అత్యవసరమే యగును. లండనుసభలో ఆంగ్లేయు లంగీకరించినవిషయమువలన మా యాశయమునం దర్ధభాగమైనను మాకు చేకూరజాలదు. ఆంగ్లేయులు నిజముగా మాకు సాహాయ్యము చేయగోరినచో దేనిని బడయుటకు వారు తమప్రాణముల నర్పించుటకుగూడ వెనుదీయరో అట్టిస్వాతంత్ర్యప్రకాశము ననుభవించుటకు వారు భారతీయులకుగూడ నవకాశ మియ్యవలెను.

## భగవంతు డిచ్చినస్వాతంత్ర్యమును మనుష్యులుమాత్ర మేల యియ్యకూడదు?

పొరపాటులను చేయుట యను మహారణ్యమున పరిభ్రమించుటకు భారతీయుల కవకాశ మేర్పడు విషయమున ఆంగ్లేయరాజనీతిజ్ఞులు అడ్డుదగులగూడదు. పొరపాటులను చేయుటకుమాత్రమె కాక పాపకార్యముల నొనరించుటకుగూడ సంపూర్ణస్వాతంత్ర్య ముండనిచో అట్టిస్వాతంత్ర్య మెంతమాత్రమును అపేక్షణీయము కాదు. తనసృష్టిలో నెట్టి యల్పప్రాణికైనను పొరపాటుల నొనర్చుటకు భగవంతుడే సంపూర్ణస్వాతంత్ర్యము నిచ్చియున్నప్పుడు మానవులు తా మెంతటి యనుభవజ్ఞులైనను ఎంతసమర్థులైనను అట్టి యమూల్యమగు హక్కును తమతోడిమానవు లనుభవింపకుండ చేయుటలో వారి కెటులానందము కలుగగలదో గ్రహించుట కలవికాకుండ నున్నది. రౌండుటేబిలుసభకు కాంగ్రెసువారి నాహ్వానించుటనుబట్టి చూచినచో భారతీయులు సంపూర్ణస్వాతంత్ర్యమును బడయగోరుటకు వారికిగల అసమర్థత తప్ప మరెట్టి యభ్యంతరమును చూపబడదనియే విశ్వసింపదగియున్నది. భారతదేశము రోగిష్ఠిబిడ్డ యనియును ఆబిడ్డకు దాయీలను ఇతరుల సాహాయ్యమును ప్రాపును ఇంకనుఅవసరమే యనియు రౌండుటేబిలు కాన్ఫరెన్సువారు భావింప రనియే నేను నమ్మెదను.

## గొప్ప అమెరికాదేశమువారికి విజ్ఞప్తి

గొప్ప అమెరికా రిపబ్లికుదేశమునందలి ప్రజలకును ప్రపంచమునం దితరదేశములప్రజలకునుగూడ నేను నావిజ్ఞప్తిని ప్రకటింపగోరెదను.

# "రాబ్సన్

## వర్టికల్ కోల్డ్ స్టార్టింగ్ క్రూడాయిలు ఇంజనులు

ఫోర్ స్ట్రోక్ సైపువి వేడిచేయ నవసరము లేకనే నిమిషములో స్టార్టు అగును. ఆయిలు ఖర్చు బహు తక్కువ. నీటి పంపులకు సుప్రసిద్ధముగా పనిచేయును. పంపులు ఇంజన్లు సిద్ధముగా నున్నవి.

రెండు స్ట్రోకు ఇంజనులలో కలుగు ఇబ్బంది లేవియు ఇందులో కలుగవు.



## హెవీ కోల్డు స్టార్టింగు క్రూడాయిలు యింజన్లు

ఇంజనులు అమితబలమైనవి. నిమిషములో స్టార్టు అగును. క్రూడాయిలు ఖర్చు బహుతక్కువ. "హార్సుపవరు" సరిగా చూపును. ఇతర ఇంజనులవలె మాయింజనులకు రివల్యూషనులను పెంచి హార్సుపవర్లు ఎక్కువచేయులేదు.

రాబ్సన్ గాస్‌యింజనులు, హాట్ బల్బు యింజనులున్ను విక్రయించబడును. స్పేర్ సామానులు రెడీ స్టాకులో దొరకును.

5 మొదలు 60 హార్సు పవరువరకు ఇంజన్లు స్టాకులో నుండును. ధరలకు, క్యాటలాగులకును వ్రాయుడు

ఏజెంట్లు :—

# లండన్ ట్రేడింగు కంపెనీ,

హెడ్డాఫీసు :—బెజవాడ. న్యూ యిండియా బిల్డింగ్సు, సెకండులైను బీచ్, మద్రాసు.

ఈసత్యాగ్రహమునకు అహింసాసత్యములే మూలాధారము లగుటచే తదారాధకులమగు మేము అపుడపుడు పెడత్రోవను పడుచుండిననుగూడ ఈ ఉద్యమము విదేశీయులభావశక్తిని ప్రకోపింపజేయుటయే కాక దీనిపట్ల వారియాశ్చర్యమును జిజ్ఞాసకుగూడ వృద్ధి నొందించెను. వారికి ముఖ్యముగా అమెరికావారి కీవింతభావము సానుభూతి క్రింద గూడ మారినది. ఇది నిశ్చయముగ సాహాయ్యమే యగును. ఇట్టిసానుభూతిని మాపుచున్నందులకు నేనును, కాంగ్రెసువారును నిశ్చయముగా కృతజ్ఞులమై యున్నార మని నేను చెప్పగలను.

## ప్రపంచశాంతి

ఇపుడు కాంగ్రెసువారు ప్రారంభించుచున్నపని యింకను కష్టతరమే యగును గాన కడవరకును ఈసానుభూతి నిలుపబడుటయే కాక యింకను దినదినము వృద్ధినొందగల దనిగూడ నే నాశించెదను. ఇపుడు ప్రపంచశాంతికొరకే అన్నిదేశములవారునుగూడ పరితపించుచున్నారు. కాన అహింసాసత్యముల సాహాయ్యమున భారతీయులు స్వరాజ్యమును బడయగలిగినచో ప్రపంచశాంతికి ఘనతమ మగుసేవ చేసినవారుగూడ నగుదు రని నేను వినమ్రుడనై విన్నవించుచున్నాను. ఇపుడు వివిధదేశములవారును మనఃపూర్వకముగా చేయుచున్న అత్యధికమగుసాహాయ్యమునకు భారతీయు లపు డణుమాత్రముగా నైనను ప్రత్యుపకారమును చేయగలిగినవా రగుదురు.

## పోలీసువారికిని సివిలుసర్వీసువారికిని విజ్ఞప్తి

పోలీసుశాఖవారికిని సివిలుసర్వీసువారికిని ఈకడపటివిజ్ఞప్తిని నే నొనరించుచున్నాను. "పోలీసులవలన అత్యాచారములు కొన్ని జరిగినట్లు తెలియవచ్చుటచే వాటినిగూర్చి విచారణ చేయవలె నని కోరితిని" అని యిండియాదొరతనమువారు ఒడంబడికనుగూర్చి చేసిన ప్రకటనలో కలదు. ఆవిచారణనుగూర్చి నేను పట్టుపట్టకపోవుటకు గలకారణముగూడ నందే కలదు. పోలీసుశాఖవారివలన సాగింపబడుచున్న రాజ్యాంగయంత్రమునందు సివిలుసర్వీసుశాఖయొక్క ప్రధానాంగమే యగును.

భారతదేశము త్వరలోనే స్వాతంత్ర్యమునుబడయగలదనియు, అపుడు తాము భారతమాతకు భృత్యులై భక్తివిశ్వాసములతో సేవ చేయవలసినదే యుండు ననియును సివిలుసర్వీసుశాఖవారు మనఃపూర్వకముగా నమ్ముచున్నచో ప్రజలు సివిలుసర్వీసు, పోలీసుశాఖలవారితో వ్యవహరింపవలసివచ్చినపుడే వారు మాభృత్యు లనుదృష్టితోనే మేము వారితో వ్యవహరించుచున్నాము. కాని వారు మా యజమాను లనుభావముతో వ్యవహరించుట లేదు అని ప్రజలిపుడుగూడ నమ్ముటకు తగినరీతి నిప్పటినుండియునుగూడ పోలీసు సివిలుసర్వీసుశాఖలవారు ప్రవర్తింపదగుదు రని నేను విన్నవించుచున్నాను.

## దౌర్జన్యమునకు నిరోధింపబడినవారికిని శిక్షింపబడినవారికిని విజ్ఞప్తి

దౌర్జన్య మొనరించినందులకు శిక్షింపబడి చెరసాలలో నున్నవారితోడిఖైదీలు వేలకొలదిగా నుండకపోయినను వందలకొలదిగా నున్నారనుట కెట్టిసంశయమును లేదు. వీ రందరిపక్షమునను గూడ చాలమంది నాకు తంతివార్తల నంపుచున్నారు. దౌర్జన్య మొనరించినవారికిసైతము కారాగృహవాసశిక్షను విధించుటలో నా కెట్టిసమ్మతమును లేనిమాట నిజమే. గత ౧౨ మాసములనుండియు కారాగృహవాసము నొనరించుచున్న సత్యాగ్రహఖైదీల నందరిని ఇపుడు విడుదల చేయబోవుచున్నారు గాన నపుడు రాజకీయోద్దేశములచే దౌర్జన్యము నొనరించినందులకు శిక్షింపబడినవారుగూడ మాకు గలవివేకమే తమకుగూడ కలదని తెలుపజాలకపోయినను మా కెట్టిప్రేమత్యాగములు కల వని నేను తెలుపుచున్నానో అట్టిప్రేమత్యాగములు తమకుగూడ కలవని తెలుపుటకు హక్కుగలిగియుందు రని నే నెరుగుదును కావున నన్నును నాతోడిసత్యాగ్రహులను విడుదలచేయుట మాని వారినే ముందుగా విడుదలచేయవలె నని న్యాయముగా నేను కోరగలిగి యున్నచో తప్పక అటులనే కోరియుందు ననుట కెట్టిసంశయమును లేదు. కాని న్యాయముగా నే నటులు కోరదగినస్థితిలో నుండలే దనినవిషయము దౌర్జన్యపక్షమువారుగూడ బాగుగా గ్రహింపగలిగియే యున్నారు.

## కాంగ్రెసువారి నూతనసంకల్పము

ఇటు లనుటవలన నేనును భారతకాంగ్రెసుకార్యసంఘమువారును దౌర్జన్యపక్షమువారిని గూర్చి ఆలోచింపనేలే దని యెవ్వరునుగూడ భావింపగూడదు. కాంగ్రెసువారు తాత్కాలికముగానైనను మనఃపూర్వకముగానే దొరతనమువారితో సహకార మొనరించుటకు కృతనిశ్చయు లైరి. ఈయొడంబడికలోనివిషయములు నెరవేర్పవలసిన వాటి నన్నిటిని గౌరవప్రదముగను సమగ్రముగను వారు నెరవేర్పగలుగునెడల కాంగ్రెసువారికి అప్రతిహతమగుప్రతిష్ఠ విధిగా నేర్పడగలదు. సత్యాగ్రహమును సాగించుటలో కాంగ్రెసువారికి శక్తి కల దనునమ్మక మిపుడు దొరతనమువారికి బాగుగా కలిగిన దని నేను నమ్మెదను గాన యీసంధివిషయములనుగూడ కాంగ్రెసువారు సరిగా నెరవేర్చినచో నీవిషయమునగూడ కాంగ్రెసువారికి ఘనమగుశక్తియే కల దనునమ్మక మిపుడు దొరతనమువారికిగూడ బాగుగా కలుగగలదు.

## ప్రజలసాహాయ్యము

ఇట్టియధికారమును ప్రతిష్ఠయును కాంగ్రెసువారికి లభించుటకు తగినరీతిని దేశీయు లందరును నడచుకొనినయెడల దౌర్జన్యమునకు నిరోధింపబడినవారు మీరట్టుకుట్రకేసుఖైదీలు మున్నగువా రందరును గూడ త్వరలోనే విడుదలచేయబడుదు రని నేను వాగ్దాన మొనరించెదను.

## దౌర్జన్యపక్షము

దౌర్జన్యమువలన స్వరాజ్యమును బడయఁగోరుచున్నవారొక పక్షము భారతదేశమునందు కలదనుట కెట్టిసంశయమును లేదు. వీరిసంఖ్య మిక్కిలి తక్కువగానే యుండినను వీరు మిక్కిలి చురుకుగానే యున్నారని కూడ నే నెరుగుదును. దౌర్జన్యమువలన నెన్నటికిని స్వరాజ్యము రాదనునమ్మకము వారికి లేకపోయినను తాత్కాలికముగా విరమించు టవసర మనునమ్మకముతోనైనను వారు ప్రస్తుతము దౌర్జన్యవిధానమును విరమింపదగుదురని నే నిదివరకే వారిని కోరియుంటిని. ఇపుడు మరల నింకొకసారిగూడ కోరుచున్నాను.

## అహింసామహిమ

అహింసావిధానమునందుఁగల మహిమను వారుగూడ నిపుడు గ్రహింపగలిగియేయుందురు. భారతదేశమునందుగల 33 కోట్లప్రజలలోను అత్యద్భుతము నపూర్వమునను నిట్టియుద్బోధ మిపు డాకస్మికముగా కలుగుటకు అహింసావిధానమే కారణమై యుండు ననువిషయమును దౌర్జన్యపక్షమువారుగూడ కాదనజాలరనియే నేను తలచెదను. అహింసాసత్యములపై నాధారపడినవిధానమును కొనసాగించుటకు కాంగ్రెసువారికిని నాకును సహనముతో దౌర్జన్యపక్షమువారు కలుగజేయవలెనని నేను కోరెదను. నేను దండికి బయలుదేరి యింకను పూర్తిగా ఒకవత్సరమైనను కాలేదు. 33 కోట్ల ప్రజకు సంబంధించిన పరిశోధనకు సంబంధించినచరిత్రలో ఒకవత్సర మనునది ఒకక్షణికముతోనే తుల్యమగును. కావున దౌర్జన్యపక్షమువారింకను ఓరిమిని బూనఁగోరెదను.

దేశమాతసేవ నెల్లవారునుగూడ త్వరలోనే చేయవలసి యుందురు గావున నందులకు వారు తమప్రాణములను కాపాడుకొనఁగోరెదను. వా రటులు చేసి హత్య చేసినందులకు ఉరిశిక్ష విధింపబడినవారి ప్రాణములనుగూడ ఉరికంబములనుండి కాపాడుటకు గూడ కాంగ్రెసువారి కవకాశము కలుగచేయవలెనని దౌర్జన్యపక్షమువారిని కోరెదను.

ఇవి నాయొక్కయును కాంగ్రెసువారియొక్కయును ఆశయములై యున్నవి. వీటిని నెరవేర్చుటకు మేము ప్రయత్నింపబూనితిమి గాని ఫలితము భగవదనుగ్రహముపైననే ఆధారపడును గాన నెవరును లేనిపోనియాశలను పెట్టుకొనఁగూడదనికూడ నేను కోరుచున్నాను.

## స్వరాజ్యసిద్ధికి నాందీపూజ

గౌరవప్రదమగు సంధిని కుదుర్చుటకు నేను సర్వశక్తులను వినియోగించితిని. కాంగ్రెసువారు నెరవేర్పవలసినషరతులను వారు సరిగా నెరవేర్చువిషయమున నేను శక్తివంచన లేకుండ పని చేసెదనని యిర్విన్ప్రభువునకు వాగ్దానమొనరించితిని. ఈ ఒడంబడిక యిపుడు తాత్కాలికమే యైనను క్రమముగా నిదియే స్థిరపడవలెను. స్వరాజ్యమున కిది ప్రాతిపదికము కావలెనను సంకల్పముతోనే యీసంధి కొరకు నేను ప్రయత్నించితిని గాని రేపు దీనిని చిన్నభిన్నమొనరించుకొరకు నే నిట్టిగట్టికృషిని సలిపియుండలేదు. ఈసంధి కుదురుటకు సర్వవిధముల తోడ్పడినవారి కందరికినిగూడ నేను వందనముల నర్పించుచున్నాను అని మహాత్ముడు నుడివెను.

ఇపుడు దీనినిగూర్చి కొన్నిప్రశ్నల నడుగవచ్చునా? అని కొందరపుడు మహాత్ము నడిగిరి. మీ రందరును రేపు మరల వచ్చి నన్ను ప్రశ్నల నడుగవచ్చును. అంతవరకును వేచియుండఁగోరెదను అని మహాత్ము డనెను.

గాంధి ఇర్విను ఒడంబడిక సంగ్రామవిరామమును విశదము చేయుచున్నది. ఈ నిర్ణయమునందు సత్యాగ్రహులు విషాదమును బొందవలసిన యవసరము లేదు. ఈ ఒడంబడిక గలుగజేసిన విశ్రాంతిసమయమునందు కాంగ్రెసుపక్షము పూర్వాపరసంబంధములను విచారించి కార్యవిధానమును నిర్ణయించుటకు అవకాశములు గలుగుచున్నవి. విజయము గలిగినదని ఉప్పొంగుటకును అవకాశము లేదు. కరాచీయందు కాంగ్రెసునకు సత్యాగ్రహప్రస్థానమును విమర్శించి భావికర్తవ్యమును నిర్ణయించుటకు వ్యవధి గలుగ గలదు. గాంధిమహాత్మునకు హిందూమహమ్మదీయసమస్యను, సిక్కుసమస్యను, సంస్థానముల సమస్యను, బ్రిటిషు ప్రయోజనముల రక్షణముల సమస్యను విమర్శించి నిర్ణయించుట కవకాశములు గలిగినవి. ఈ లబ్ధావకాశములను మహాత్ముని సంకల్పసిద్ధికై దేశీయులందరు యథాశక్తిని తోడ్పడి స్వధర్మనిర్వహణమును చేయుదురు గాక!

పరమేశ్వరానుగ్రహమున ప్రజోత్పత్తి సంవత్సరారంభమునందు 22 వ ఉగాది సంచికను ఆంధ్రలోకమునకు సమర్పింప గలిగినందుల కాంధ్రులకు ధన్యవాదముల నర్పించుచున్నాము. ఈ సంచికయందు గతసంచికయందువలెనే వ్యాసములు వివిధములైన శీర్షికలందు ప్రచురింపబడినవి. రాజకీయములందు రాజనీతి - రాష్ట్రాంగములు, గాంధిమహాత్ముని అర్థికాశయములు; సారస్వతమందు స్వభావోక్తి, వ్యాకరణబాహుళ్యము, తన్మయత్వము, ఆంధ్రభారతకావ్యోత్పత్తి, కల్పసూత్రములు,

విమర్శనలు గమనార్హములు. కథలయందు కాళ్ల చప్పుడు, ఏది ప్రేమ, వింత విశాలాక్షి మొదలగునవి నూతనమార్గమున రచింపబడి పాఠకుల హృదయముల నాకర్షింపగలవు. జ్యోతిషము, చరిత్ర, వైద్యము, సంగీతము మొదలగు శాస్త్రములకు సంబంధించిన వ్యాసములు ప్రజాహృదయమునందు వ్యక్తమగుచున్న పరిశోధనాభిలాషను విశదము చేయుచున్నవి. సంచిక యందు ప్రచురింపబడిన పద్యములు, గీతములు ప్రజా హృదయము నావరించిన నూతనభావోదయమును, ఉత్సాహమును, కార్యపరత్వమును విశదముచేయుచున్నవి. ప్రజాప్రబోధమునకు సాధనభూతమైన సారస్వతరచనల యందు కవులు, విమర్శకులు, గ్రంథకర్తలు నూతన మార్గముల నవలంబించి సర్వతోముఖమైన ఆంధ్రవ్యక్తి త్వవికాసమునకు తోడ్పడుటకు భగవదనుగ్రహము గలుగు గాత !

ప్రజోత్పత్తి సంచికకు దండియాత్రకు బయలు దేరిన గాంధిమహాత్ముని పటము ముఖపటము. కౌపీనమును ధరించి, కర్రనుబూని, సత్యాగ్రహులను వెంటబెట్టుకొని గాంధిమహాత్ముడు చేసిన సత్యాగ్రహ చిత్రపటములు యాత్ర ప్రపంచేతిహాసములందు పరమా ద్భుతదృశ్యముగ నుండ గలదు. శూరుల జైత్రయాత్రలు, మతస్థాపకుల ధర్మయాత్రలు, భక్తుల తీర్థయాత్రలు గాంధిమహాత్ముని సత్యాగ్రహయాత్రకు సాటిగావు. అన్నవస్త్రములకు పరితపించుచు ప్రపంచ మును దుఃఖభూయిష్ఠము చేయుచున్న వర్తమాన యుగ సంస్కారమునందు పరివర్తనము చేయుట కవతరించిన గాంధిమూర్తి లనంతరూపములను వ్యక్తమగుచున్నవి. మహాత్ముని మందస్మితము, ముగ్ధముఖారవిందము, దుర్బలదేహము, పవిత్రజీవితము, శుద్ధస్వభావము, సత్య ధర్మశీలము సత్యాగ్రహయాత్రయందు లక్షలకొలది ప్రజల కానందమును గలుగజేసినవి. ఆ యానందమునె ముఖపటము కావ్యకళారూపమునను వ్యక్తము చేయు చున్నది. సంసారప్రవృత్తియందు లలితకళలు, చేతిప నులు కర్మయోగాభ్యాసమునకు సాధనంబు లగుచున్నవి. వివిధకర్మలును నియత కర్మరూపమును దాల్చునపుడు లలితకళారూపమును దాల్చుచు కర్మయోగారూఢమునకు సాధనంబు లగుచున్నవి. మహాత్ముడైన గాంధిగారికి రాటపునాదమునందు మధురశ్రావ్యనాదము వినబడు చున్నది; పాకీపనియందు పరిశుద్ధాత్మ గోచరంబగు చున్నది; చదువులందువలెను పనులందును పరమాత్మ ప్రత్యక్షమగు చున్నది; సకలపదార్థములందును నిత్యమైన సత్యస్వరూపము స్ఫురించుచున్నది. సత్యాగ్రహి యోగారూఢుడై బ్రహ్మానందము ననుభవింపగల విధ మును ముఖపటము జిజ్ఞాసువుల సంభావనకు సాధన భూతముగ నున్నది.

త్రివర్ణపటము లాంధ్రచిత్రకళావికాసమును వ్యక్తము చేయుచున్నవి. వాసుదేవనుగారి గ్రీష్మము, సత్యనారాయణగారి అభిసారికచిత్ర కళా వికాస ము నకు నిదర్శనములు. నందలాలు బోసుగారి కూతురు శ్రీగౌరిబాలగారి గొర్లకాపరి వంగాంధ్రరచనలకు చిత్రకళా రచనలయందు గల భావైక్యమును వ్యక్తము చేయు చున్నది. ఛాయాచిత్రపటములు సత్యాగ్రహశిబిర ములను, సత్యాగ్రహోత్సవములను, సత్యాగ్రహసైనికు లను దెలుపుచున్నవి. ఆంధ్రదేశమునందు 3000 సత్యాగ్రహులు స్వరాజ్యసిద్ధికిని, శాంతిస్థాపనమునకును ఆత్మార్పణము చేసినవిధమును గత సంవత్సరపుచరిత్ర విశ దము చేయుచున్నది. శ్రీయుతులు గుళ్లపల్లి నాగయ్య, కాకుమాని దుర్గాప్రసాద రావు, కంభంపాటి కుమార స్వామి, మాటూరి సత్యనారాయణ గుప్త, ప్రభల సుబ్బారావు, ఆదూరి వేంకటరాజుగారులు, దేశక్షేమము నకై జెయిలులందు ప్రాణములను సమర్పించి అమరత్వ మును బడసిరి. స్వాతంత్ర్యసిద్ధికై దుఃఖపరంపరల ననుభ వించిన అందఱు సత్యాగ్రహయోధుల పటములను సంచికయందు ప్రచురింపజాలనందులకు చింతిలుచున్నా రము. ప్రచురింపకుండుటకు గారణము పటములు లభింప కుండుటయెయని మనవి చేయుచున్నాము. రెండుటేబిలు

సమావేశమునకు సంబంధించిన పటములును ప్రచురింపబడినవి. ఆ పటములందు బెన్నుగారు పేర్కొనదగి యున్నారు. భరతఖండమునందు ఇర్విన్ప్రభువర్యుడును, ఇంగ్లాండునందు సాంకెప్రభువు, రామ్సెమాక్డొనాల్డు బెన్నుగారలును భారతరాజ్యాంగసమస్యలపట్లను వారలకు గల సంకుచితావకాశములందును జూపిన విశాలలక్ష్యము ప్రశంసనీయము. శాంతిసమరము నుపసంహారము చేసిన కాంగ్రెసుకార్యనిర్వాహకవర్గపు పటమును గలదు. స్వరాజ్యసంరంభమునందు స్వాతంత్ర్యసిద్ధికై ప్రాణమానధనములను సమర్పించిన పండితమోతిలాలుగారి చిత్రము వృద్ధులకును యువకులకును త్యాగప్రభావమును స్ఫురింపజేయుట కాచంద్రార్కము లక్ష్యముగ నుండ గలదు. భాగ్యభోగపరాయణుండైన శ్రీయుత పండిత మోతిలాలు నెహ్రూగారు విరాగియై ఆనందభవనమును స్వరాజ్యభవనముగ మార్చిన యితిహాసము రాజ్యాంగరంగమునందువలెను నిత్యసంసారప్రవృత్తియందును పరమార్థబోధకముగ నుండగలదు.

**ఆంధ్రుల ప్రతిభ**

గతసంవత్సరమునందు ప్రవర్ధమానంబైన సత్యాగ్రహప్రస్థానము భరతవర్షమునందంతటను నాంధ్రుల ప్రతిభను విస్తరింపజేసినది. ప్రఫుల్లచంద్రరాయిగారు చెప్పినటు లాంధ్రులు పరమోత్సాహముతో సత్యాగ్రహరంగమునం దాత్మార్పణము చేసినవిధము ప్రశంసార్హముగ నున్నది. ఏప్రిలు మెయినెలలలోనె వందలకొలది సత్యాగ్రహులు నిర్బంధింపబడిరి. కాంగ్రెసుసంఘము లక్రమసంఘములుగ నిర్దేశింపబడినవి. ఆంధ్రరత్నభవనము, సత్యాగ్రహశిబిరములు ప్రభుత్వాక్రమణమును బొందినవి. దేశమునందు ముఖ్యప్రదేశములందు 144 శాసనము జారీచేయబడినది. గుడివాడఏలూరులందు తుపాకులు పేల్చబడినవి. గుంటూరు బందరు రాజమహేంద్రవరము గుడివాడ అంగలూరు మొదలగు ప్రదేశములందు లాఠిప్రయోగము జరిగినది. పోలీసువారు ప్రజలకు జూపిన యవమానదౌర్జన్యములు పరమాసహ్యమును గలుగజేసినవి. శ్రీమతి దుర్గాబాయమ్మగారు చెన్నపురియందును, శ్రీమతి లక్ష్మీబాయమ్మగారు గుంటూరునందును, శ్రీమతి రుక్మిణమ్మగారు వేదారణ్యమునందును, ఇతరయువతులు భిన్నప్రాంతములందును జూపిన సాహసోత్సాహము లాంధ్రుల ప్రతిష్ఠను విస్తరింప జేసినవి. అఖిలభారతకాంగ్రెసు స్థాయిసంఘసభ్యులును రాష్ట్రీయకాంగ్రెసుసభ్యులును నిర్బంధింపబడిరి. యువజను లెందరో శ్రీకృష్ణజన్మస్థానమును పరమానందముతోను స్వీకరించి మాతృదేశాశీర్వాదములకు పాత్రులైరి. గాంధిమహాత్ముని అహింసాసందేశము నాంధ్రదేశము సంపూర్ణముగను గ్రహించిన విధమును దుఃఖానుభవసమయమునందును దేశమునందు వ్యాప్తమైన ప్రశాంతస్థితి విశదము చేయుచున్నది. గతకాలమునందువలెను భావికాలమునందును ఆంధ్రలోకము స్వరాజ్యప్రాప్తికిని, లోకకల్యాణమునకును, ప్రపంచశాంతికిని యథాశక్తిని స్వధర్మనిర్వహణమును జేయుటకు భగవంతు డనుగ్రహించు గాత!

**నవయుగ సందేశము**

ప్రపంచము వర్తమానసమయమునందు మహాదుఃఖవేదన ననుభవించుచున్న విధమును వివిధదేశముల పరిస్థితులును విశదము చేయుచున్నవి. భూతసంరక్షణమున కాధారభూతమైన అన్న మపారముగను నుత్పన్నమగుచున్నను ప్రజ లన్నాతురులై కృశించుచున్నారు. పరదేశసంపదలకై ప్రపంచమునం దంతటను మహాసంరంభము సంప్రాప్తమగుచున్నది. ప్రజ లవసరమైన యన్నములేకను కృశించుచున్నను అనవసరమైన మాదకపదార్థములకును, చుట్టలకును, సంహారసాధనములకును, కుటుంబాదాయము దేశాదాయము వ్యయమగుచున్నది. ఈ మహోపద్రవము నుండి ప్రపంచము నుద్ధరించుటకు ప్రాజ్ఞులు చేసెడి ప్రయత్నములు నిరర్థకములుగ నున్నవి. నానాజాతిసమితి నిరర్థకముగ నున్నది. ఆయుధనియమసభ నిరర్థకమైనది. ప్రపంచమునం దంతటను నిరుద్యోగసమస్య ప్రబలి దుఃఖవేదన దుర్భరమగుచున్నది. ప్రపంచవ్యాప్తమైన దుఃఖవేదన నుపశమింప జేయవలసినభారము వ్యక్తులమీదను

# ఉగాది

సెట్టి లక్ష్మీనరసింహముగారు (కవితాసమితి)

శ్రీ వాగడఁ బ్రజోత్పత్తిం
గావింపఁగఁ దలఁచి యజుని, గాయజుని, జిరం
జీవులుగఁ గనిన ప్రభవి
ష్ణూ, విష్ణూ, వినతు లీ ప్రజోత్పత్తి సమున్.

ప్రజోత్పత్తి జేకూరుపఁ బ్రహ్మవై, యు
ర్వి జీవంబులం బెంప విష్ణుండవై, దే
హిజాలంబుఁ ద్రుంపఁ మహేశుండవో దే
వ, జేజే ప్రజోత్పత్తి వర్షంబునందున్.

ప్రభవమయి, విభవంబునం బ్రబలి, శుక్ల
పక్ష శశి గతి వృద్ధి యేర్పడి, ప్రమోద
కరము గాని ప్రజోత్పత్తి కలుగనేల?
ఈ ప్రజోత్పత్తి సుఖదమై యెసఁగుఁ గాక!

ప్రల్లదులటు శుకములు వదరం దొడఁగెఁ; బికములునై
జ్జోల్లసనము దెలుపఁ గూసె; నొదవె వేపచెట్ల స
త్పల్లవములు, విరులుఁ; జూతతరులు పిందెలూనె; మ
త్తిల్లెఁ దేంట్లు; మాధవుఁడరుదెంచె వసరమం గనన్;

“వచ్చె! వచ్చెఁ! గ్రొత్త వత్సరం, బిది మహో
త్సవదినం!” బటంచు జనపదనగ
రముల జనులు మిగులఁ బ్రమదంబు నొందిరి
ముదముల పెనుగాది గద యుగాది!

---

# వీరశైవుడు

శ్రీ శివశంకరశాస్త్రిగారు

అనుదినము చెప్పుచుండు కల్యాణనగర
తోరణసమీపభూమి బౌరాణికుండు
గ్రంథముంబూని చరితముల్, కాపురులు
చెవులురిక్కించి వినగ సక్కజముతోడ.

నిజవదనభస్మదీధితి నిఖిలదిశల
చంద్రికలుగాయ, కంఠదేశమ్మునందు
దివ్యరుద్రాక్షమాలిక తేజరిల్ల
శైవలింగపసాయిత శస్త్రధారి.

భూరిపంచాక్షరీజపపూతవాక్కు,
వీరశైవుడు కక్కయ్య వీథివెంట
పోవువాడు విలోకించి పుణ్యకథలు
చెప్పుచున్నాడు భట్టని చేర దరికి.

నాల్గుగడియలకాల మానా డతండు
తత్పురాణమ్మువినుచు క్రోధమ్ముతోడ
నేత్రములు జేవురింపగా "నిలుపు మింక
పక్షపాతి, పురాణపుభట్టుగాడ

నీయసత్కథ! గ్రంథమ్ము నీరుచేతు!
తుంచెదను నాల్క యోశివద్రోహి యిపుడె!"
అని మహోగ్రుడయి నరింప నచటివారు
ప్రాస్పడిరి భీతిచే నోట మాటలేక.

హరి జగత్కర్తయనెగాని హరికి భర్త
యీశ్వరుండని చెప్పలే దీకథకుడు
హరిపరాశక్తియనిచెప్పె, నంతెగాని
చెప్పడు పరాపరుం డిందుశేఖరు డని.

హరిమహామాయయని యాత డనియె గాని
హరునిగూర్చి మహాదేవు డనగ లేదు
అనియె విశ్వనామాంకుడు హరియటంచు
హరుడు విశ్వేశ్వరుం డని యన డితండు.

హరుడు బ్రహ్మకపాలంబు హస్తమందు
బట్టి భక్షించె మన్నని పలికె గాని
సంపద లొసంగు నిజభక్తజనుల కనడు;
శ్రీమహాదేవు నిందయే చేసినాడు.

ఇట్టిఖలు, కిట్టిద్రోహికి, నిట్టిపాపి
కీశ్వరప్రీతి యగునట్టు లిడియె శిక్ష!
అని యురుముపోలె కక్కయ్య యార్చి పేర్చి
హర, మహాదేవ, త్రిపురసంహరణ యనుచు—

చేతిదొంకెనతో భట్టుశిరము ద్రుంచి
శోణితాక్తశరీరసంశోభియగుచు,
'జయ బసవలింగ, నందికేశ్వర, కుమార,
శివ, భవానీశ' యనుచు తాండవముచేసె.

# స్తుతిరత్నములు

కీ॥ శే॥ వట్టిపల్లి నరకంఠీరవశాస్త్రి గారు

చరణం కరోమి చేతసి
శరణం శరవణభవాగ్రజాతస్య
విఘ్నా నఖిలజనానాం
నిఘ్నానంఝుడితి భక్తినిఘ్నానామ్.

కమలా మాశ్రితకమలాం
కమలాసనముఖ్యవినుతపదకమలామ్
కమలాశయస్య తనుజాం
కమలాక్షప్రేయసీం నమామ్యనిశమ్.

వాణీం మధుకరవేణీం
వీణాపుస్తకశుకోల్లసత్పాణీమ్
నాణీయోగుణవేణీ
మేణీనయనాం భజామి కలవాణీమ్.

వాణీం ప్రణమ్రజనదత్తమనోజ్ఞవాణీం
శ్రేణీభవన్మధుపమండలరమ్యవేణీమ్
శోణాధరీంముహురహం ప్రణమామిమూర్ధ్నా
వీణావినోదరసికాం వచసాం విభూత్యై.

---

# సోత్ప్రాసము

పండిత శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు

కొంకక స్వేచ్ఛఁ బోఁగొట్టితి వాల్జూపుఁ
ద్రాట ముంగాళ్ల బంధాలు వేసి,
కౌఁగిట నిక్షేపించి గంటులువడి వాడి
పోవ నొక్కితిఁ దీఁగఁ బోలు మేను,
మునిపంటఁ గొఱికి తామూలమ్ము కండకం
డలు గాఁగఁ బవడంపుఁ జెలువు మోవి,
కనకుండఁ జేసితిఁ గప్పించి కువకువ
ధ్వానమ్ములను గమ్మ నైన నిద్ర
ఇంత చేసినఁ గసి తీర దించుకేని
ఊహ యున్నది నలిపివేయుటకె యింక;
వడయుమీ కృష్ణ! నేడైనఁ బారిజాత
సూనముల శయ్య నలజడిలేని సుఖము.



# బ్లాక్ స్టోన్

## "స్ప్రింగ్-ఇంజెక్షన్"

కోల్డు స్టార్టింగ్ క్రూడ్ ఆయిల్ ఇంజన్లు ఒకటి లేక రెండు చక్రములతో, బలముగా నిర్మింపబడినవి. సులభముగా ఉపయోగించ వచ్చును. పనిచేయుటలో మిత వ్యయము.

---

మే మింకను, "హాపర్ కూల్డు" కోల్డు స్టార్టింగ్ క్రూడ్ ఆయిల్ ఇంజనులును, వర్టికల్ కిరోసిన్ ఆయిల్ ఇంజనులును, క్రూడ్ లేక కిరోసిన్ ఆయిల్ యింజన్లతో నడుపుటకు వీలైన పోర్టబుల్ అండ్ స్టేషనరీపంపింగ్ సెట్లు; సప్లయి చేయగలము. గొప్ప పవర్ హౌసులనుండి, ఎలక్ట్రిక్ దీపములకు వలయు పవరుకల్పించునట్టి యింజనులును, జనరేటింగు సెట్సులుకు ప్రత్యేకధరలు ఇచ్చెదము.

# స్వచ్ఛమైన ఎంగల్ బర్గు

## రైస్ మిల్లింగ్ మెషినరీ



అమెరికా యందు గల ఎంగల్ బర్గు హాల్లర్ కంపెని వారికి మేము భారత దేశమున సోల్ యేజంట్లము. అసలు ఎంగల్ బర్గు హాల్లర్లు, పెల్లరులు యితర విడిభాగములు మావద్దను మాత్రమే దొరకును.

## నమూనాలను అంగీకరింపకుడు

రైస్ మిల్లింగ్ కు సంబంధించిన యావద్విషయములను గురించి మీకు అనుభవము గల సలహాల నివ్వగలము.

## పవర్—మెషినరీ, గిరింగ్, బెల్టింగ్ మున్నగునవి

సరఫరా చేయగలము.

# మార్షల్ సన్సు అండు కో (ఇండియా) లిమిటెడ్.,

9. సెకండులైన్ బీచ్—మద్రాసు.







౧, ౨. ఇండియన్ రౌండుటేబిల్ కాన్ఫరెన్సుకు తయారుచేసిన సభాభవనము-రెండు దృశ్యములు







ఇండియన్ కాన్ఫరెన్సు

౧. శ్రీ జార్జిచక్రవర్తిగారు ప్రారంభోపన్యాసమును చదువుచున్నారు.

౨. హౌస్ ఆఫ్‌లార్డ్సు భవనమున ఇండియన్ రౌండుటేబిల్ కాన్ఫరెన్సు ప్రతినిధులకు పార్లమెంటు సభవారు చేసిన విందు.

# రాజనీతి—రాష్ట్రాంగములు

వి. బాపిరాజుగారు, బి. ఏ., బి. యల్.

(ప్రమోదూతసంచిక తరవాయి)

## 3—శాసనవర్గము

రాష్ట్రాంగములందు మూడవది శాసనవర్గము. మూడవది యగుటచే దీని ప్రాముఖ్యము తక్కువ యనరాదు.

పాలకవర్గ మమలులో పెట్టవలసిన శాసనముల నీ వర్గము నిర్మించుచుండును. పాలకవర్గము రాజ్యాంగ చక్రములను నడుపున దయినను తద్విధానమును సూచించుట శాసనవర్గపు విధియై యున్నది. ప్రజాభిప్రాయమును నిరూపించుట కాధారమై యున్నది. పాలకవర్గము ప్రజల హక్కులను ధిక్కరింపకుండ నిది కాపాడుటకు మూలమై యున్నది. ప్రజాభిప్రాయమును వెల్లడిచేయుట కీవర్గ మవసర మనియు, ఏథెన్సునందువలె ప్రత్యేకాభిప్రాయములను ప్రజలే వెల్లడిచేయవచ్చుననెడి కొందరి యభిప్రాయమీ ప్రస్తుతపు రాజ్యాంగములందు వర్ధిల్ల నేరదు.

### శాసనవర్గ నిర్మాణము—బాహ్యనిర్మాణము

అనేక దేశములందు శాసనవర్గ కార్యక్రమము రెండు వర్గముల క్రింద విభజింపబడి రెండువర్గములును నడుపుచున్నది. ఇది ద్వంద్వవర్గవిధాన మనబడును. ఇరువర్గములామోదించువరకును ఏ శాసనమును అమలునకు రాజాలదు. ద్వంద్వవర్గవిధానమం దిరువర్గములందును శాసనములు చర్చింపబడుట కవకాశ మున్నందున న్యాయవిచారణ కవకాశ మెక్కువ యున్నదనియు అల్పసంఖ్యాకులై ప్రాతినిధ్యరహితులైన బుద్ధిమంతులకు ప్రాతినిధ్య మిచ్చుట కవకాశమున్నదనియు కావున ద్వంద్వవర్గవిధాన మవసరమని కొందరి యభిప్రాయము. కాని రెండు వర్గములందున చర్చ జరుగుట చర్వితచర్వణమనియు, ఈ విధాన మామోదింపబడిన దేశములందీ రెండవ వర్గమునకు ప్రాముఖ్యమే లేదనియు, ఏకీభవించియుండు పాలకవర్గమున కవరోధముగ విభక్తమైన శాసనవర్గము బలహీనమగుననియు కొందరు వాదింతురు. వీరివాదనయందలి బలాబలములు మన దేశమందలి Council of State వలన ప్రత్యక్షమగుచున్నవి.

### అంతర్నిర్మాణము—మొదటివర్గపు నిర్మాణము

ఈ వర్గమందలి ప్రజాప్రతినిధు లేవిధముగా నెన్నుకొనబడవలె ననునది ప్రథమవిషయము. కొన్నిచోట్ల ఎన్నికల విధానము మూలముగను కొన్ని దేశములందు పాలకవర్గము ఏర్పరుచువిధానము మూలముగను ఈ రెండు విధములుగను సభ్యు లేర్పరుపబడుదురు. ఎన్నికలవిధానమునకే ప్రాముఖ్యము గలదు.

(1) ఈ పద్ధతికొరకు ఒక దేశము కొన్నిసీమలుగను, లేక రాష్ట్రములుగను, లేక నాడులుగను విభజింపబడవలెను. అనగా స్థలవిభాగము ముఖ్యముగాని వృత్తులు, కులములు ముఖ్యములుగావు. తుది రెండుమార్గములవలంబించిన యెడల స్వకీయాభిమానమును మెండై దేశాభిమానమునకు కొరతకల్గును. (2) ప్రజల ప్రత్యేకపు వోట్ల మూలముగ గాని లేక తాలూకాబోర్డు, ఇత్యాది స్థాయిసంఘముల సభ్యులు వారి వోట్లమూలముగగాని, ఈ సభలకు ప్రతినిధు లెన్నుకొనబడుటయు గలదు.

### ఎన్నికల విధానము

1. స్వతంత్ర దేశములందు ఎన్నుకొను హక్కు ప్రతిమానవునకును సహజమై యున్నది. ఉన్మత్తులు, నేరస్థులు, మైనర్లు తప్ప మిగిలిన ప్రతిమనుజునకును, ఎన్నికహక్కు గలదు. ఈ సర్వతోముఖమైన హక్కు కొన్ని దేశములందు మాత్ర మామోదింపబడినది. కాని దీనికి సర్వతోముఖవ్యాప్తమైన విద్యయు, ఆ హక్కును చలాయించు రాజకీయజ్ఞానమును మూలాధారమై యున్నవి. దీనినే Universal Suffrage అందురు.

2. ఈ హక్కు స్త్రీలు పొందవలె ననువాదన ప్రబలుచున్నది. రాజకీయహక్కుల విషయములో స్త్రీ పురుషజాతిభేదము పాటింపరాదనియు ఆస్తులకు హక్కుదారులైన స్త్రీలకు పన్నులిచ్చు బాధ్యత కలిగినప్పుడు వారీ హక్కునుకూడ పొందదగినవారై యున్నా రనియు మొదలైన కారణము లీవాదమును బలపరుచు చున్నవి. కాని యీవాదమునకు ప్రతికూలు రనేకులుకలరు. సంఘపు కట్టుబాట్లు తొలగినప్పుడు స్త్రీలు రాజకీయసంస్థలయందు పాల్గొనినయెడల సంఘము విధ్వంస మగుననియు ప్రకృతి నిర్మాణము ననుసరించి స్త్రీలట్లు గావింపరాదనియు, అన్ని ప్రదేశములందును స్త్రీలహక్కులను కాపాడుటకు స్త్రీలే యావశ్యకమని చెప్పుట మిథ్య యనియు, అనేక దేశములందు చిరకాలమునుండి స్త్రీల హక్కులను వారి కంటె పురుషులే బాగుగ కాపాడుచున్నారనియు వీరు వాదించుచున్నారు. ఏదియెట్లున్నను ఈ Woman suffrage movement ప్రతిదేశమునందును బలము పొందుచున్నది.

3. మిల్లు అను శాస్త్రవేత్త ఈమూడవవిధానమునకు మూలము నిట్లు నిరూపించుచున్నాడు.

"రాజ్యాంగమందు విజ్ఞానుల కొసంగబడు రాజకీయసంబంధమగు బాధ్యతలు మూఢుల కిచ్చినయెడల ప్రమాదము వచ్చును. రాజ్యాంగవిధానమునందు ప్రతి మానవునకును హక్కు వుండవలెననుటలో ప్రతిమానవునకును ఆహక్కు సమానముగా నుండవలెననుట తగదు." కాబట్టి వీరి యభిప్రాయముప్రకారము విజ్ఞానులకు ఒకటి కంటె ఎక్కువవోట్లుండవలెను. వెనుక బెల్జియమ్‌దేశమందు 25 ఏండ్ల వయసును మించిన పట్టభద్రులకు 2 వోట్ల హక్కు ఒసంగబడు చుండెడిది. దీనిని Plural Voting అందురు.

4 నాల్గవది Proportional Representation అనబడును. ఇందు అత్యధికమైన వోట్లు వచ్చుట ప్రధానము గాదు. ఒకసీమయందలి వోట్ల సంఖ్యను ఆ సీమ ప్రతినిధుల సంఖ్యచే భాగింపబడి కావలసిన వోట్లసంఖ్య నిర్ధారణచేయబడి మిగిలిన వోట్ల క్రమప్రకారము వరుసలో నెన్నుకొనబడినవారి పరము గావింపబడు చుండును. దీనివలన వోట్లు వృథాకాకుండుటయు వివిధసీమలయొక్క విస్తీర్ణపు భేదము పాటింపకుండుటయు ప్రాతినిధ్యము బాగుగా సమకూరుటయు ఈపద్ధతి ముఖ్యోద్దేశములు.

### ఎన్నికలయందు గమనింపవలసిన విధులు

(1) ఎన్నికలవిధానము సంఘమునకును అప్పటికి నిలిచియున్న స్థాయిసంఘములకును సంబంధించి యుండవలెను గాని, కొత్తసీమలను సృజింపరాదు.

(2) ప్రతి ప్రతినిధియు ఆయా నియామకుల సముదాయమునకు సంబంధించిన వాడుగ నుండవలెను. అనగా వ్యవసాయదారుల ప్రతినిధి వ్యవసాయమునకు సంబంధించిన వాడుగనే యుండవలెను.

(3) ఎన్నికల హక్కునుపొందిన వారా రాజ్యపు ప్రజలై యుండవలెను.

(4) అట్టిమానిసి కొంత ఆస్తిని కలిగినవాడుగ నుండవలెను. కాదేని బాధ్యతయొక్క విలువను గుర్తింప జాలడు.

(5) పాలకవర్గమందు పాల్గొను సర్కారు ఉద్యోగస్థులును, మతి భ్రమించినవారును, మైనర్లును, శిక్షింపబడినవారును వోట్ల హక్కును పొందదగరు.

(6) ప్రతి ప్రతినిధియు తన నియామకుల హక్కులను, కాపాడుటకు ప్రయత్నించుచు వారియభిప్రాయ

ముల ప్రకారము సభలయందు మెలంగుచుండవలెను. ఇందుల కేమాత్రము తప్పరాదనుటకు వీలులేదు. తన నియామకుల ఉద్దేశములకంటె నిష్పక్షపాతమైనట్టియు, నిష్కల్మషమైనట్టియు, సూక్ష్మబుద్ధిచే గ్రాహ్యమైనట్టియు తనబుద్ధి కుశలతవలన విచారింపగల్గునట్టి ధర్మాధర్మవిచక్షణయే ప్రతి ప్రతినిధికిని ప్రధానము. అతడు ప్రజల యభిప్రాయములను తన వివేచనతో నిమిత్తములేక వెల్లడిబుచ్చు టెలిఫోను అని చెప్పుటకు వలనుపడదు.

ఆంతర్నిర్ధారణమునందు యోచింపదగిన మరికొన్ని విషయములు

(1) శాసనసభాధ్యక్షుని యెన్నిక—అతని విధ్యుక్తములు.

(2) సభికుల సంఖ్య.

(3) సభాసమావేశము — సమావేశ నియమిత కాలము.

(4) సభ ముగింపు

(5) సభయందు పాలకవర్గాధిపతులు పాల్గొనవచ్చునా? అట్లయిన ఎంతవఱకు? మొదలైన విషయములు.

పై విషయములు ఆయాదేశమున కనుకూలముగా వివిధముగ సమర్థింపబడుచున్నవి.

(6) పక్షవిధానము.

ఇది చాలముఖ్యమైన క్రమము. ఈ విధానమును బర్కు ఇట్లు నిర్వచించుచున్నాడు:

"ఒక యేకాభిప్రాయమైన నియమముల ననుసరించి దేశమున కుచితమైన లాభమును ఏకస్థులై పెంపొందజేయు కూటమిని, పార్టీ అనిగాని, పక్షములేక కక్షఅని గాని అందురు." ఈ పక్షముయొక్క ముఖ్యోద్దేశము దేశీయోన్నత్యమునకు పాటుబడుటకాని, పార్టీయొక్క స్వలాభాపేక్షమాత్రము కాదు.

(1) అంగీకృతమైన నిర్మాణములేనిదే యే విధానము కొనసాగదనుట కిది యొక నిదర్శనము.

(2) ఈవిధానమున వోటర్లు నియమితపక్షాభిప్రాయముల ననుసరించి వోట్ల నిచ్చునట్లు జరుగును.

(3) పార్టీకృషివలన జనసామాన్యమునకు దేశమున కనుకూలమగు విషయములనుగూర్చి తెలిసికొనుట కవకాశము కలుగును.

(4) పార్టీపద్ధతివలన అధికసంఖ్యాకులునైన యొక పార్టీనుండి పాలకవర్గమేర్పరుపబడి, పార్టీయొక్క నియమముల ననుసరించి, నిరాటంకముగ రాజతంత్రమును నడపుట కనుకూలమగును. లేనియెడల ఒక విధానమును ప్రారంభించి అమలులో పెట్టుటకు ఏపాలకవర్గమునకును ధైర్యముగాని అవకాశముగాని కలుగదు.

పార్టీయందలి ముఖ్యాంశములు

(1) దేశమున కనుకూలమగు నియమములు లేదేని ఏదియు పార్టీ అని పిలువబడ నేరదు. కాబట్టి మతసంబంధమైనట్టియు, జాతిసంబంధమైనట్టి నియమములు అనర్థకములు.

(2) ఆయాపక్షముల కపజయము సంభవించినను ఆయాకక్షీదారులు, ఏకీభావముతో నుండవలెను. కాని ఆపక్షము నియమితమైన పద్ధతులనుండి కక్షి తొలగిన యెడల అందలి యే కక్షీదారుడైనను తిరస్కరించవచ్చును.

పక్షనిర్మాణమున కనుకూలమగు పరిస్థితులు

(1) ప్రజారాజ్యమునందు గాని పక్షనిర్మాణము వీలులేదు.

(2) ఏపక్షముయొక్క అభిప్రాయములును ఆదేశ ప్రభుత్వనాశమును కోరునవి కాగూడదు.

ఉదా: రాజ్యమందు సమూలమైన మార్పుకోరు పక్షమును రాజ్యాంగమందు సమత్వము నాశించు పక్షమును ఒకే దేశమం దుండుటకు వీలులేదు. కావున ఇంగ్లాండువంటి దేశములందు బోల్షివిక్కులకు ఎడము లేదు.

(3) పార్టీలమధ్య ఉండతగిన వాదభేదములు, మతసంఘసంబంధములైనవి కాక రాజకీయభేదములతో నుండవలెను.

(4) దేశమందు 2 పార్టీలకంటెయెక్కువ ఉండుట భావ్యము కాదు. ఇది ప్రకృతికి మానవ స్వభావమునకు ననుకూలమై యున్నది. ఏసంఘమందును రాజకీయ విషయములో రెండు అభిప్రాయములు మాత్ర ముండుట సహజము. (1) పూర్వసాంప్రదాయావలంబనము, (2) స్వేచ్ఛానువర్తనము—

ఎన్ని భేదాభిప్రాయము లున్నను అన్నియు పై రెంటికి ననుకూలించియె యుండును. కావున ఏమూడవ భావముకూడ పై రెంటిలో నొకటిగా భావింప నవకాశ ముండును. అందుచే ఏ రాజకీయ సంస్థయందును కూడ మూడవపార్టీకి ఆవశ్యకత అగపడదు. రెండు పార్టీలకంటె ఎక్కువకతు లున్న దేశమందు ఒకపార్టీయొక్క అభిప్రాయములను కొన్నింటిని మరియొకపార్టీ అవలంబించుటయు, సంఖ్య కొలదియగుటయు, కొంతకాలములో క్షీణించుటయు, బలమునకు తన అభిప్రాయమును మార్చుకొనుచు, మరియొక పార్టీతో రాజీపడుటయు సంభవించుచుండును.

పార్టీపద్ధతి వలన అనర్థకములు

(1) ఒకపార్టీయొక్క అభిప్రాయము నెంతటి ఆశయమున్నను, ఆ యా కట్టుబాట్లవలన స్వేచ్ఛాను వర్తన కవకాశము లేదు. కొన్నియెడల స్వబుద్ధిని వీడ వలసి వచ్చును.

(2) కక్షియొక్కబలము నిర్మాణమునం దున్నది. ఇప్పటి ప్రజారాజ్యములం దానిర్మాణమునకు వలయు ధనము నేకరించువారి యధీనమునందు పార్టీ నిలువ వలసి వచ్చుచున్నందున అట్టి ధనికులు పార్టీయొక్క అభిప్రాయములకు కర్తలగుచు వారి యిష్టానుసారము నడపుచుందురు. అట్టియెడ ప్రజామోదమునకు విముఖత సంభవించు చుండును.

(3) ప్రత్యేకతరూపుమాయును.—ఉత్కృష్టాశయముగలవారు ఏ పార్టీకిని చెందకుండ ఎన్నికలలో జయ మందినను, వారు పాలకవర్గమునందు పాల్గొనుటకును వారి ప్రాజ్ఞత చూపుటకును నవకాశములేదు. పై కారణముల చేత కొన్ని దేశములందు, పార్టీపద్ధతి నవలంబింపక సముదాయపద్ధతి నవలంబించు చున్నారు. ఇందు ప్రత్యేకత కవకాశ ముండును.—అల్పసంఖ్యాకులకు ప్రత్యేకత కల్గును. దీనిని Group system అందురు. మరియు పై కారణముల చేత కొన్ని దేశములందు రాజ్యాంగమందలి ప్రతిముఖ్యాంశమునకును వోటరు యొక్క అభిప్రాయము కనుగొని పరిపాలనము జరుపబడుచుండును. దీనినే రిఫరెండము అందురు. మరియు ఒకానొక శాసననిర్మాణమునకు ఒకసంస్థ తీర్మానించు వరకు వేచియుండక ప్రజలే (అనగా నియమితసంఖ్యాకులు) అట్టి శాసన మావశ్యకమని తోచినేని, వారి వోట్లమూలముగా ఆ శాసనమును తీర్మానించి అమలులో పెట్టుచుందురు. దీనిని ఇనీషియేటివ్ అందురు. ఈ రెండు పద్ధతులును స్విట్జరులాండునందును అమెరికా దేశమందును అమలు జరుపబడు చున్నవి.

శాసనవర్గాంతర్భాగమందు, అనగా శాసనసభాంతర్భాగమందు జరుగు కార్యక్రమము విషయమై విరివిగ వ్రాయ నవసరములేదు. ఆ యా దేశముల కనుకూల మగునట్లు కార్యక్రమపు వివరములకు వలయు నిబంధనలు పైసూత్రముల ననుసరించి గావింపబడుచుండును.

---

# ప్రజాస్వాతంత్ర్య పరిపాలనము—దానికిగల ప్రతిబంధకములు

చా. వెం. హనుమంతరావుగారు, యమ్. ఎ. బి. ఇ. డి.

ఇరువదవ శతాబ్దములో ఎక్కువగ వ్యాప్తిజెందిన రాజకీయసూత్రములలో ప్రజాస్వామికప్రభుత్వపు అభివృద్ధి ఒక ముఖ్యస్థానము నాక్రమించు నని ఎల్ల రంగీకరించవలయును. ఐరోపామహాసంగ్రామము అంతమొందిన తరువాత ఈవిధానము చాల దేశములలో ఏర్పాటుకాబడినది. ముఖ్యముగ యూరప్ ఖండములో పూర్వపు జర్మనీ, ఆస్ట్రియా, రష్యా సామ్రాజ్యము లంతరించి వాటిస్థానమున అనేకములగు చిన్న చిన్న రాజ్యములు బయల్వెడలినవి. ఇవికాక ఇక కొన్ని దేశములందు రాజప్రభుత్వ మంతమొంది దానికి బదులుగ ప్రజాస్వాతంత్ర్యరాజ్యవిధానములు(Democratic Government) ఏర్పాటుచేయబడినవి. యూరప్‌లోనేకాక ఇతర ఖండములందుకూడ ప్రజాప్రభుత్వములుగాని, ఆప్రభుత్వసూత్రములపై నాధారపడియుండు ఇతర రాజ్యాంగవిధానములు గాని ఎక్కువగ ఏర్పాటు కాబడినవి. యుద్ధము ప్రారంభింపబడినపుడును, అది జరుగుచుండుకాలములో కూడను, దానియందు పాల్గొనిన దేశములవారు తాము ప్రపంచమున ప్రజాస్వామికప్రభుత్వసూత్రమును నెలకొల్పుటకే పోరాడుచుంటిమని అనేకసార్లు ప్రకటించియుండిరి. ఇట్లొక ప్రక్కనుండి ప్రజాప్రభుత్వసూత్రము ప్రబలమగుచుండ వేరొక ప్రక్కనుండి దానివిచ్ఛిన్నమును, విఫలత్వమును ప్రకటించుపద్ధతులును విధానములును బయల్వెడలి దానియందలి నమ్మకమును సడలించుటకు చాల తోడ్పడుచున్నవి. యుద్ధానంతరమున ముఖ్యముగ ఈనమ్మకము ఎక్కువగ క్షీణించుచుండుట స్పష్టముగ కానగును. పరస్పరవిరుద్ధభావములను వెలిపుచ్చు పై రెండుసంగతులయందును ఎంతవరకు నిజ మున్నదియో గ్రహించుటయు, వాటియొక్క నిజానిజములను పరిశీలించుటయు అవసరము. హిందూదేశమందుకూడ ప్రజాపరిపాలనావిధానమును ప్రవేశపెట్టుటకు ప్రయత్నములు జరుగుచున్న ఈసమయములో అట్టి పరిశీలనయొక్క ఆవశ్యకత అందరును అంగీకరించవలయును.

## ౨

ప్రజాప్రభుత్వ మనిన ప్రజలలోనే ప్రభుత్వాధికారమంతయు నిబిడీకృతమై యుండునట్టి ప్రభుత్వవిధానమని అర్థము చెప్పవచ్చును. ఆ పదమునకు అనేక రాజకీయవేత్త లనేకము లగు భిన్నభిన్న వ్యాఖ్యానములు చేసియున్నారు కాని దాని సంపూర్ణార్థమును విస్పష్టపరుచు వ్యాఖ్యానమేదియు లేదనియే అనుకొనవచ్చును. కాని "దేశమందలి అధికసంఖ్యాకు లగు ప్రజల యభిప్రాయము ననుసరించి జరుపబడు"చుండు ప్రభుత్వమే ప్రజాప్రభుత్వ మన జెల్లునని నిర్వచించిన చాలవరకు సరియగు అర్థము వచ్చిన దని తలంపవచ్చును. "ప్రజలు" అనుమాటకు సరిగ సరిపోవు నిర్వచనము చేయుటలో గల కష్టములను మన మూహించుకొనిన పైన చేయబడిన అర్థము చాల సరియైనదే యనుటలో సందేహము లేదు.

## 3

ప్రజాస్వామికప్రభుత్వ మేదేశమునకూడ పూర్తిగ ప్రజాప్రభుత్వము(Government by the people)గ నుండుట లేదని మనము గ్రహించవలయును. దానికి కారణము ఎచ్చటనుకూడ ప్రజలందరును (అనగా యుక్త

వయస్సు కల్గినట్టి ప్రజలని మన మనుకొనవచ్చును) రాజకీయవిషయములందు పాల్గొనుటకు తగిన స్థితియందు లేకుండుటయే. అట్లు పాల్గొన లేకుండుటకు వివిధము లగు కారణము లుండవచ్చును; దేశముయొక్క శీతోష్ణస్థితి, ప్రజలయొక్క అలవాట్లు, వారి రాజ్యాంగవిధానపు అభిప్రాయములు మొదలగున వన్నియు అట్టి అసహాయస్థితికి తోడ్పడును. కాని పై కారణము లన్నియు ప్రజాస్వామిక ప్రభుత్వ మాయా దేశములలో ప్రవేశపెట్టబడుటకే అడ్డంకులుగ నుండవచ్చును. ఉదాహరణముగ దక్షిణ-అమెరికాయందున్న వివిధ ప్రజాప్రభుత్వములు గల దేశముల స్థితిగతులు తీసికోవచ్చును. ఆ దేశములలో ప్రజాప్రభుత్వ మేర్పాటు చేయుటయే పొరపాటు. కాని ఆ దేశము లన్నిటియందును ఆవిధానమే అమలునం దున్నది. ప్రస్తుతము మన మాలోచించవలసినది ఒకసారి ప్రజాప్రభుత్వము నేర్పాటు చేసినతర్వాత దానిని జయప్రదముగ నిర్వహించుట కవసరము లగు పద్ధతు లేవి యను విషయము. ఆ సందర్భములో ప్రజలందరును ప్రభుత్వవిషయములలో పాల్గొనవలె ననిన ఏమి అవసరమని ఆలోచించిన తెలున దేమన (1) వారికి తగిన సావకాశ ముండవలెను (2) రాజకీయముల నర్థము చేసుకొనుటకు తగినంతవిద్య యుండవలెను. (3) తమతమ యుద్దేశ్యముల ప్రకారము నడచుకొనుటకు శక్తియుండవలెను. కాని ఈ నియామకములు గల ప్రజ లే దేశమందును లేరనియే చెప్పవచ్చును. ప్రజాపరిపాలనావిధానమునందు ఎక్కువ కాలము కృషి చేసినట్టియు, ఎక్కువ అనుభవము కలిగినట్టియు ఇంగ్లండు, అమెరికా సంయుక్తరాష్ట్రములలో నైన నీవిషయములందు ప్రజలు తగినంతవర కభివృద్ధి చెందిరను సంగతి వివాదాస్పదమే. ప్రజాస్వామిక ప్రభుత్వములు కల ఈ దేశమునందు కాని ఏ యితర దేశములందు గాని జరుగుచున్న దేమన ప్రభుత్వవిషయములు వాటికి తగియుండి, వాటియందు పాల్గొనుటకు అవకాశములు కల్గియున్న కొద్దిమందికే వదలివేయబడుచున్నవి. అట్లు రాజ్యాంగవిషయములలో పనిచేయువారు ఆయా దేశములందలి అధికసంఖ్యాకులగు జనుల యభిప్రాయముల ననుసరించి పరిపాలనావిధానమును నడుపుచున్నారా లేదా యను విషయము ఆయాం దేశములందు గల ప్రజాభిప్రాయబలముపై (Strength of Public opinion) నాధారపడి యుండును. కాని ప్రజాభిప్రాయమునకు వ్యతిరేకముగ, అనగా ఏ దేశమునందు గాని అప్పటికియున్న ప్రజాభిప్రాయ మని యర్థము. ఎవ్వరికిని కాని పరిపాలించుట దుస్తరమే యగునను సంగతి మనము జ్ఞాపక ముంచుకొనవలెను. ఇట్లు ప్రజాసమూహమునుండి ప్రజలయందు గల రాజకీయవిజ్ఞానము ఇంకను ఇతరవిషయముల సంపుటి వలన బయల్వెడలిన ప్రజాభిప్రాయమున కుత్తరవాదముగ రాజ్యము జరుపబడుచుండు ప్రభుత్వవిధానములనే ప్రజాస్వామిక ప్రభుత్వవిధానము లని పిల్వబరగును.

౪

ప్రజలందరును ప్రభుత్వవిషయములలో పాల్గొనుటకు వీలులేనపుడు దానికిబదులు ప్రజలయభిప్రాయములను సరిగ వ్యక్తీకరించుటకు కొన్ని సంస్థలైనయుండుట ముఖ్యావసరమైయున్నది. ఇప్పుడు ప్రజాస్వామిక ప్రభుత్వములు గలదేశము లన్నిటియందును కూడ ఇట్టిసంస్థల ద్వారముననే ప్రభుత్వము నడుపబడుచున్నది. వాటినే ప్రజాప్రతినిధిసభ (Representative Institutions) లని పిల్చుచున్నారు. కాని, ఈ ప్రజాప్రతినిధిసభలు ప్రజాభిప్రాయమును పూర్ణముగ విశదపర్చుచున్నావా లేదా యను విషయమే ప్రస్తుతము చర్చనీయాంశము. ఒకసారి ప్రజలచే (అనగా వోటర్లుగా నున్న ప్రజలచే) ఎన్నుకొనబడిన తరువాత ప్రజాప్రతినిధిసభలు వాటిదారినే యవి పోవుచు ప్రజాభిప్రాయమునం దప్పు డప్పుడు కల్గుచున్న మార్పులను వ్యక్తీకరించుట కనుకూలించనివిగ నున్నవి. దానివలన చాలచోట్ల ప్రజాభిప్రాయము ఒకపద్ధతిగను, ప్రజాప్రతినిధిసభల యభిప్రాయము వేరొకపద్ధతిగను నుండుటకూడ తటస్థమగుచున్నది. అదియుకాక ప్రజాప్రతినిధిసభలు వాటికార్యక్రమమును నడుపుకొనుటకు కొన్నికొన్ని నిబంధన లుండుట అవసరము. అట్టి నిబం

ధన లేవియు లేనినాడు ఆసభలన్నియు యుద్ధభూముల క్రింద మారు నని ప్రస్తుతము నిబంధనలక్రింద పనిచేయుచున్న జర్మనీ, ఫ్రాంసు మొదలగు దేశములందలి పార్లమెంటుసభల విషయములను వినుచు చదువుచున్న మన కందరకును విశదమే. నిబంధనల ప్రకారము పనిజరుగుట ముఖ్యమే; కాని వాటివలన ఈసభలందు కార్యక్రమము తొందరగ జరుగకుండుటయు, ముందు జరుగవలసిన కార్యములు వెనుకను, వెనుక జరుగవలసిన కార్యములు ముందుగను జరుగుటయు కూడ కలదు. మరియు ప్రభుత్వవిధానము ఎక్కువ క్లిష్టమగుచున్న ఈకాలములో, ప్రజల జీవితసౌఖ్యముల కెక్కువ సంబంధము గల విషయములు ప్రభుత్వమువారి ఆలోచనలోనికి వచ్చుచుండుట జరుగుచున్న ఈకాలములో, ప్రజాప్రతినిధిసభలద్వారా ప్రభుత్వపుకార్యములను నిర్వహించుటకు రోజురోజునకును ఎక్కువకష్ట మగుచున్నది. ఈకారణములవలన ప్రజలలో, వాటిపై సనుమానము, వాటి పరిపాలనాపద్ధతులపై నిరాశ, అనిష్టము దినాదినాభివృద్ధిగాంచి అవి దేనిసందర్భములో ఏర్పాటుచేయబడినవో ఆప్రజాప్రభుత్వవిధానముపై కూడ నమ్మకము నశించుటకు కారణ మగుచున్నవి.

౫

పైన చెప్పబడిన నిరాశ, ఆశాభంగము, అనిష్టము మొదలగునవియే ప్రస్తుతకాలములో ప్రజాస్వామిక ప్రభుత్వముపై మోజుతగ్గుటకు ముఖ్యమగు కారణమైయున్నది. వాటివలననే ప్రపంచమందు ప్రజాస్వామిక ప్రభుత్వములు గల హెచ్చుతగ్గుగ అన్ని దేశములలోను ఏదో ఒకవిధముగ దానికి వ్యతిరేకముగనుండు పద్ధతులు బయల్వెడలుచుండుట మనము కాంచుచున్నాము. ఇటలీ, స్పెయిను, పోలండు మొదలగు దేశములలో ఈప్రతిఘాతము నిరంకుశాధికారి యగు నొకనియంతయొక్క అధికారము (Dictator-ship) గా పరిణమించినది; రష్యాలోను, ఇప్పుడు కొంతవరకుజర్మనీలోను అది ప్రజాసమూహముయొక్క ప్రభుత్వము(Dictatorship of the Proletariat) గా పరిణమించినది; మరికొన్ని దేశములలో, ఉదాహరణముగ చైనా, అర్జింటనా, బ్రేజిల్, పెరు మొదలగు దేశములలో, అది ఆయుధగ్రస్తమగు తిరుగుబాటుగను, మిలిటరీప్రభుత్వముగను పరిణమించుచున్నది. విధాన మేదయినను కారణముమాత్రము అన్నిటికిని ఒక్కటియే. ప్రపంచమందు ఎల్లచోట్లను ఈకాలములో ఆర్థికసమస్య ప్రబలమై, ఆర్థికదుస్థితి హెచ్చగుచున్నది; దానిని జయప్రదముగ నెదుర్కొని పరిష్కరించుటకు ప్రజాప్రతినిధిసభలకు శక్తిసామర్థ్యములు లేకుండపోవుచున్నవి. దాని పరిష్కరణసందర్భములయందే పైనచెప్పినట్టి పరిస్థితులు గోచరమగుచున్నవి. ప్రజాస్వామికప్రభుత్వమునకు ప్రతిబంధకములును, అడ్డంకులును, శత్రుకోటిలోనివియు నగు ఆపరిస్థితులవలననే ఆప్రభుత్వమునకు ప్రపంచమందు ఆదరణ తగ్గిపోవుట కల్గుచున్నది.

౬

నిరంకుశాధికారప్రభుత్వమునకు నవీనకాలములో మూలాధారమును ఆయువుపట్టును ఇటలీదేశమై యున్నది. అచ్చట ముస్సోలినీ (Mussolini) అను నాతడు ఫాసిస్టు విధానము (Fascism) నేర్పాటుచేసి, ప్రజాప్రతినిధిసభలను చెదరగొట్టి తనప్రతిభను సాటి నిరంకుశముగ రాజ్యపరిపాలనను గావించుచున్నాడు. ఇటలీలో ప్రబలిన ఆర్థికదుస్థితి, పనిలేనివారి కష్టములు, వ్యవసాయదారుల నష్టములు-ఇవన్నియు ఇటలీలో యుద్ధానంతరము ఎక్కువ ప్రబలమై ముస్సోలినీకి తనప్రతిభను ప్రకటించుటకు తగిన సావకాశముల నేర్పాటుచేసెను; వాటి నాధారముగ గొని ఆతడు నిరంకుశపరిపాలనను ప్రవేశపెట్టి ప్రభుత్వము చేయుచున్నాడు. ఈపద్ధతియే ఇప్పుడు చాలా తొందరగా యూరప్ ఖండమందలి ఇతర దేశములలో వ్యాప్తి చెందుచున్నదని మనవార్తాపత్రికలకు విదేశపుప్రతినిధులు వ్రాయు లేఖలను బట్టియు, ఇతరమార్గముల నుండియు మనకు తెలియుచున్నది. ప్రజాస్వామికప్రభుత్వమునకు కంటకముగ బయల్వెడలిన విధానములలో ఈఫాసిస్టు విధానము ప్రధానస్థాన మాక్రమించుచున్నది.

౭

రెండవది రష్యాదేశములో ప్రబలుచున్న బొల్షెవిక్ తిరుగుబాటు. బొల్షెవిక్‌లు జార్ (Czar) చక్రవర్తుల నిరంకుశపరిపాలనముపై తిరుగుబాటు చేసి వారిని కూలద్రోసి ప్రజాసమూహముయొక్క నిరంకుశ పరిపాలనమును వారిస్థానమున ప్రతిష్ఠించిరి. ఈతిరుగుబాటుకుకూడ ప్రధానకారణము ఆర్థికదుస్థితియు, ఆర్థికపుహెచ్చుతగ్గులేమైయున్నవి. కాని బొల్షెవిక్కులు ప్రజాప్రభుత్వ విధానమును కాని, దానికి మూలాధారములగు ప్రతినిధిసభలనుకాని ఏర్పాటుచేయక, వారి ఆర్థికసౌకర్యముల చేకూర్చుట కనువుగ నుండు సంస్థలనుమాత్రమే ఏర్పర్చి కొని పరిపాలన కొనసాగించుచున్నారు. బొల్షెవిక్ పద్ధతికిని, సమష్టివాదన (Communism) కును చాల దగ్గర సంబంధము గలదు. ప్రజాస్వామిక ప్రభుత్వములుగల ఇంగ్లడు, ఫ్రాంసు, అమెరికా మొదలగు దేశములలో ఈ సమష్టివాదన నెమ్మదినెమ్మదిగ ప్రవేశించి పార్లమెంటరీ సంస్థలు వాటిప్రజలలో పార్లమెంటరీవిధానములందు మక్కువను తొలగించుటకు ప్రయత్నించుచున్నది. సమష్టివాదనకును ప్రస్తుతము ప్రపంచమందములలో నున్న పద్ధతులకును పరస్పరవైరుధ్యమున్నదని చెప్పవచ్చును. ఇప్పుడు వ్యాపించియుండి అనాదినుండి ఒకేవిధముగ వచ్చుచుండిన జాతి, మత, కుల, ఆర్థిక కట్టుబాట్లను భేదములను రూపుమాపి క్రొత్తపద్ధతిపై ప్రపంచనీతిని నడపుటయే దానియొక్క ముఖ్యోద్దేశము, ప్రధానసూత్రమునై యున్నది. బొల్షెవిక్కులు ఈసమష్టివాదనను పూర్తిగఅంగీకరించినవారగుటచే ప్రజాస్వామికప్రభుత్వమునకును వారికిని చాలవిరోధమని వేరుగ చెప్ప నవసరము లేదు.

పైన సూచింపబడిన రెండుసూత్రములును ఈకాలములో ప్రజాప్రభుత్వమును వీలయినట్లయిన వేళ్లతో పెకలించివేయుటకు పూనుకొని యున్నవి. ఇవికాక ఇతర సంస్థలు, ఇతర విధానములుకూడ దానికి వ్యతిరేకముగ నుండి ప్రజాప్రభుత్వమును నిజముగ ప్రజాప్రభుత్వమని పిల్చుటకు వీలు లేకుండ చేయుటకు ప్రయత్నించుచున్నవి. కాని ప్రజాప్రభుత్వపుసూత్రము మాత్రము వీటి యన్నిటివలన నమసిపోవు నని భయపడుట కెంతమాత్రమవసరము లేదు. ఎందువల్ల ననగా, "ప్రజలు" అనువారు సర్వకాల ముండువారే. ఏవిధమగు ప్రభుత్వమైన నేర్పాటు కావచ్చును; ఒకవిధమగు ప్రభుత్వము మారి వేరొక విధమయిన ప్రభుత్వ మేర్పాటు చేయబడవచ్చును; కాని ప్రజలుమాత్ర మెల్లకాలము మారకుండ యుండరు. వారి అభిప్రాయములకు వ్యతిరేకముగ చాలకాలము ఏప్రభుత్వ విధానముకాని జరుగుననుట కల్ల; నిరంకుశాధికారి యగు ప్రభుత్వనియంతకాని, లేక ప్రభుత్వమును నడుపు ఒకకూటముకాని ప్రజాభిప్రాయమునుత్రృణీకరించి జయము పొందుట పొసగదు. ఈఆశయే, ఈసంగతియే ప్రజాప్రభుత్వపుసూత్రము నామోదించు ప్రతివానికిని అది ప్రపంచమునం దెప్పుడునుకూడ అంతరించ దను అభయము నిచ్చుచున్నది.

---







చెన్నపురి ఉప్పు-సత్యాగ్రహదళము

౧. ఊరేగింపు-సత్యాగ్రహశిబిరమువద్ద. నాయకులు: శ్రీ టంగుటూరి ప్రకాశంపంతులు, శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు, శ్రీ గద్దె రంగయ్య నాయుడుగారు. ౨. ఊరేగింపు 'స్వరాజ్య'కార్యాలయమువద్ద. నాయకులు: శ్రీ టంగుటూరి ప్రకాశంపంతులు, శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు,







చెన్నపురి ఉప్పు-సత్యాగ్రహము

౧. మైలాపూరు సముద్రతీరమున ఉప్పు తయారుచేయుట. ౨. తిరువళ్లిక్కేణి సముద్రతీరమున ఉప్పు తయారుచేయుట.

## *ననుప్రేరేపింపుము

వెలువోలు సీతారామయ్య చౌదరి గారు

ఋషిమునీశ్వరుల సంతానము, దార్శనికులసంతానము, నేఁ డజ్ఞానాంధకారమున, మోహాంధకారమునఁ దెన్నుఁగానక తల్లడిలుచున్నది. సర్వోత్కృష్టశూరవీరసంతానము నేఁడు పిరికిపందలైపోయినది. మహాగౌరవశాలిని యగు నార్యజాతి నేఁ డైక్యభావమును, శక్తిని, పరిత్యజించి, దీనమై, హీనమై, దుర్బలమైపోయినది. సర్వజగత్తునకు సభ్యతను, ధర్మజ్యోతిని బ్రదాన మొనర్చెడి భారతజనని నేఁడు దాస్యశృంఖలాబద్ధమై, పదదళితమై తనసంతానమును ఆశాపూర్ణవీక్షణముల విలోకించుచున్నది.

మేము ఋషిసంతతిమని గర్వముసెందువారు నేఁడు మనలో నెందఱుగలరు? తన మాతృదేవియొక్క దుఃఖదారిద్ర్యములచే బీడితహృదయులైనవారు నేఁడు మనలో నెందఱుగలరు?

నేను నాజీవనమును, నాజాతీయాదర్శపునరుద్ధరణమునందును, రాష్ట్రపునర్నిర్మాణమునందును, నామాతృభూమికి స్వాతంత్ర్యము సమకూర్చుటయందును అర్పణసేయఁజాలునటుల నాకు శక్తి నొసంగుము, ధైర్య మొసంగుము, సాహస మొసంగుము.

ఓస్వామీ! నాజీవనము ఋషులయొక్క తపోజీవనమై, పవిత్రతాజీవనమై శోభిల్లుఁగాత!

ఓదయానిధీ! నాజీవనమున నార్యుల యాదర్శసేవాప్రేమలు ప్రకాశించుఁగాత!

ఓభాగ్యవిధాతా! న న్నార్యభూమియొక్క పవిత్రచరణములయం దాత్మార్పణ మొనరించుకొనునటులఁ బ్రోత్సాహ మొనరింపుము.

ఓనాథా! నీదివ్యప్రేరణచే నేను లోకహితార్థజీవి నగునటులఁ బ్రేరేపింపుము.

---

## సంవత్సరాది

ఉప్పులూరు వెంకటసుబ్రహ్మణ్యము గారు

"కోడి కూయుచున్నది. తూరుపు తెల్లవాఱుచున్నది. లెమ్ము, వత్సా! లెమ్ము. నేఁ డుగాదిపండుగ కదా! తలంటుకొందువుగాని" యని పిలుచు తల్లిపలుకులకు కండ్లు నులుముకొనుచు రేచునికి నాఁటిదినము తాను తినఁబోవు రుచ్యములగు పిండివంటలనుగుఱించితక్క వేరొక్క యాలోచన తోఁచుట లేదుకదా! కడచిన వత్సరమునుగుఱించి యొక్కతలంపేనియు మనసున కెక్కవలదా! ఆహా! అజ్ఞానము!

మానవునకు లోకమునందుఁ దనకర్తవ్యమును, గతకాలమందుఁ దా నొనర్చిన కృత్యములను, భావికాలమందుఁ దా నొనర్పవలసిన కరణీయములను, నిర్ణీతమగు జీవితకాలలేశమును తలఁపునకుఁ దెచ్చు దినములు ప్రతివత్సరమును తప్పక రెండు వచ్చుచుండును. అందొకటి జన్మదినము. రెండవది సంవత్సరారంభదినము. జన్మదినోత్సవము జరపుకొనుట కొందఱిలోనేకాని, వత్సరారంభదినోత్సవము సర్వత్ర జరపఁబడుచున్నది. చాంద్రమానరీతి నాంధ్రకర్ణాటమహారాష్ట్రఘూర్జర దేశములందు

* కుమారహృదయోచ్ఛ్వాసములనుండి.

చైత్రశుద్ధ పాడ్యమినాఁ డీయుత్సవముజరగును. నాఁటియుత్సవము లెవ్వరైన పైదేశములవా రలక్ష్యము చేయుదురా? ఈ దేశములం దిదియే కాలమానమున కారంభదినము. ఇదియొక పర్వదినము. నేఁడు వినిర్మలభావములు మనోవీథి గోచరింపవలయును.

పాఠకమహాశయులారా! ఒక్క త్రుటికాలము యోజింపుఁడు గతవత్సరమునుగూర్చి; ఒక వత్సరమున మూఁడువందల యఱువదియైదుదినములుకదా! ఇన్నిదినములను వృథచేయక గడపితిరా? వానిని నిరంతరసత్కార్యకరణముచే ననుదినభగవన్నామసంకీర్తనముచే గడపితిరా? కాని నా మట్టున నాకు గతవత్సరమున నాచేసినకార్యములం దలఁచినగుండియ లదరుచున్నవి. అయ్యో! ఒక్క నిమేషకాలమైనను పరమాత్మచింతనమునకై సరిగా వినియోగింపలేదే! చేసినదైనను, నిష్కామముగ, మనఃస్ఫూర్తిగఁ దదేకపరతతోఁ జేసియుంటినా? అదియును సందేహమే! పోనీ, విద్యాభివృద్ధిఁ జేసికొంటినా? నాజ్ఞానజ్యోతిపైనున్న తెరను తొలగింప నేదేనియు ప్రయత్నమును చేసితినా? నాజ్ఞానలేశమునకు నూతనవిషయములఁ జేర్చితినా? ఒక్కటియును లేదే! పోనీ, సోదరమానవసేవఁ జేసితినే? సర్వభూతములను సమదృష్టితోఁ జూచి మృగాదులకుఁ గల్గుహింసను నివారించితినే? ఇఁక నేదైనను ప్రయోజనకారియగు కార్యమును జేసితినే? భగవన్నామసంకీర్తనము సున్న. విద్యాసంపాదనము పూర్ణబిందువు. దేశసేవ యనలేలేదు. నేనేదిచేసితినని సంతసింతును. ఇన్నిదినములును నిష్ప్రయోజకము లయ్యెనే! పోయినకాలము మరలవచ్చునా! కాలము రివ్వునఁ బరువెత్తుచున్నయది. మానవుని యాయువా, కొద్ది. ఇంకను తెలిసికొనవలసినవిషయములా సముద్రములో జలబిందువులుపోలె నగణ్యములు. కావున కాలమును వృథగాఁబోనిచ్చుట మనకుఁ బాడికాదు. ఈవత్సరము నైనను పాడుచేయక, సత్ప్రయోజనకారియగునట్లు ఉపయోగింప శక్తినిచ్చుఁగాతయనిసర్వేశ్వరుని ప్రార్థించెదను.

పాఠకులారా! ఉగాదిపండుగనాఁడు 'చేదు' అనఁబడు షడ్రసోపేతమైన గుజ్జనొకదానిని మనవా రిచ్చుచుందురు. అది యెందులకో తెలియునా? అనేకరససమ్మిళితమైన యాగుజ్జు నొకేభావమున స్వీకరించుచున్నవా రదేవిధమున నావత్సరమునఁ గలుగఁబోవు సుఖదుఃఖములను సమానదృష్టితో స్వీకరింపవలయునని. పండుగదినమున 'దుఃఖము లే'ని యువాచ్యము లాడుచున్నవాఁడనని కోపగింపకుఁడు. కీడెంచి మేలెంచవలయునుగదా! పండుగనాఁడంతయు నానందముననుండ నాగుజ్జునకు వికారభావద్యోతకమగు 'చేద'ను పేరు మనవారేలపెట్టిరి? ఇది తెలిసియేకదా!

'జాతస్యమరణంధ్రువం'. మనము కలకాల మిచ్చట నుట్టిఁగట్టుకొని యూగులాడఁబోవునది లేదుకదా! ఉన్నంతకాల మందరికిని పొందుగనుండి మనజీవితమును సద్వినియోగముఁ జేయుదము గాక! సుఖదుఃఖము లస్థిరములుకదా! ఈవత్సరము సుఖోపేతమై యుంటె నేమో! కావున ప్రజోత్పత్తి సంవత్సరమునకు హృదయపూర్వకమగు స్వాగత మొసఁగుదము.

మీ రీవత్సరమున నాయురారోగ్యైశ్వర్యసంపత్తితో వెలయుచుందురుగాత! 'సర్వేజనాఃసుఖినో భవంతు' అని సర్వేశ్వరుని ప్రార్థించుచు విరమించెదను.

---







౧. సమ్మర్ స్పిన్నింగు స్కూలు. 'ఉమన్సు ఇండియన్ అసోసియేషను' వారు, (చెన్నపురి) ఎగ్మూరు పాంథియన్ తోటలో 12-5-1930 నాడు స్త్రీలకొరకు దీనిని స్థాపించిరి. ౨. పైన పేర్కొన్న స్కూలులో స్త్రీలు నూలు వడుకుచుండుట. ౩. చెన్నపురి కాంగ్రెసు మహిళామణులు నూలు వడుకుట. 58/35 సింగరాచారి వీథి, తిరువల్లిక్కేణి.










౧. అఖిలభారతమహిళాసాంఘికసారస్వతమహాసభ-చెన్నపురి. 1930. అధ్యక్షురాలు: శ్రీశ్రీశ్రీ తిరువాంకూరు జూనియరు మహారాణీగారు.

౨. అఖిల-ఆసియా-మహిళా మహాసభ, కార్యనిర్వాహకసంఘము-లాహూరు. 1930.

౩. ప్రాచ్య విశ్వవిద్యాలయ మహిళాసంఘ కార్యనిర్వాహకవర్గము. 1930.

# గాంధి మహాత్ముని ఆర్థికాశయములు

నేత్రకంటి వెంకట యోగానందరావుగారు, బి. ఏ., బి. యల్.

ప్రస్తుతమున హిందూదేశము పాశ్చాత్త్యదేశములలోవలెనే నవీన - ఆర్థిక సంప్రదాయమునకు కొంతవరకు లోనై యున్నది. ఇప్పుడు హిందూదేశములో 91 బ్యాంకులు (ఒక లక్షకు పైగా మూలధనము కలవి), 80 భీమా కంపెనీలు, 40,000 మైళ్లు రైలు మార్గములు, సుమారు 7000 ఫ్యాక్టరీలును కలవు. ఫ్యాక్టరీలలో పని చేయు కార్మికులును పదిహేను లక్షలకు పైగా కలరు. హిందూదేశముయొక్క విస్తీర్ణమునుపట్టి తక్కినదేశములతో పోల్చిచూచినపుడు పారిశ్రామికజీవితము మిక్కిలి అధమస్థితిలోనే యున్నదని ఒప్పుకొనవలసియున్నది. ఈ దేశములోని సుమారు యేడులక్షల గ్రామములలో పెక్కుగ్రామములు నవీన నాగరికతా వాసనను స్వల్పముగానైనను పొందలేదు. నూటికి 71 మంది వ్యవసాయదార్లుగా నున్నారు. పారిశ్రామికవృత్తులలో నూటికి ఒక్కరుకూడ లేరు. వ్యవసాయదార్లు, పారిశ్రామికులు చిరకాలమునుంచి ఆచారముగా వచ్చుచున్న పనిముట్లనే ఉపయోగించుచు, ఫలితమునుకూడా కొంచెముగానే పొందుచున్నారు. మరియు ధనార్జనలో అభివృద్ధి పొందలేకుండావున్నారు. అందువలన పాశ్చాత్త్య దేశములతోపాటు వారి వృత్తులను, పద్ధతులను పూర్తిగా అవలంబింపవలయునా లేక హిందూదేశము తన పురోభివృద్ధికి తన నిజపద్ధతులను పట్టుదలతో నవలంబించుచు, పాశ్చాత్త్యపద్ధతులను కొంతవరకు అవలంబించుచు తన నాగరికతను నిల్పుకొనగలదా యనుప్రశ్న ముఖ్యముగా తీర్పవలసియున్నది. పాశ్చాత్త్యనాగరికతాప్రభావము బొంబాయి, కలకత్తా, మద్రాసు మిల్లులు గల కొన్ని పట్టణములలోతప్ప యితరభాగములయందు బహుస్వల్పమేయున్నది.

మహాత్మ గాంధి ఆర్థికవిషయములలో తాను ప్రమాణ మని చెప్పుకొనకపోయినప్పటికిని, ఆతనికి కొన్ని ఆర్థికవిషయములలో కొన్ని ఖండితములైన అభిప్రాయములు కలవు. వానిని ఆతడు దేశమునకు ప్రబోధము కావించుచు, దేశములో ఏతత్ప్రకారము పునరుద్ధారణ చేయుటకు యత్నించుచున్నాడు. గాంధి మహాత్ముని యుద్దేశ్యము ప్రకారము పాశ్చాత్త్యనాగరికత భయానకమైనందున చాలవరకు త్యజింపదగినది. ప్రాచ్యపాశ్చాత్త్యజీవితములు పూర్తిగా భిన్నము లయినవి. ప్రాచ్య నాగరికత ఆధ్యాత్మికమైనది; పాశ్చాత్త్య నాగరికత ఐహిక ప్రాపంచిక సంబంధమైనది. హిందూదేశములో కర్మసిద్ధాంతము ననుసరించి ఉత్తరగతులను బోధించును. పాశ్చాత్త్యులు ప్రకృతప్రాపంచిక జీవనమునే నమ్మికొని, భౌతికవృత్తులలో ప్రాముఖ్యముపొంది వృద్ధిపొందుటకు యత్నించుచున్నారు. పాశ్చాత్త్యులు తీవ్రవేగకరమైన జీవితమును అవలంబించుచున్నారు. హైందవులు శాంతియుత వర్తనమునే ప్రశంసింతురు. ఉభయనాగరికతలును వేర్వేరుప్రదేశములలో జనించి, వేర్వేరుప్రదేశములందు వృద్ధి పొందుటనుపట్టి యేప్రదేశమువారు ఆనాగరికతనే అవలంబించుట యుక్తము; లేనియెడల దీర్ఘకాలమునకు ఒకచోటినుండి యితర ప్రదేశములో నాటిన వృక్షమువలె క్షీణించుటయే జరుగును. హిందువులు క్షణక్షణభంగురమగు ప్రాపంచికసౌఖ్యమును విలువచేయరు. కాన హిందూదేశమునకు శాంతియుతమైన నిజనాగరికత వాంఛితమైనది. పాశ్చాత్త్యదేశములనుండి తమకు కావలసిన, ఉపయోగకరములైన విషయమును, హిందువులు నేర్చుకొని నిపుణులు కావచ్చును. కాని పూర్తిగా వారి ననుకరించుటమాత్రము ప్రమాదము. వారి జీవితములనుండి కొన్ని విషయములు మన జీవితములో అనుకరించునటుల యేర్పాటు చేసికొనవచ్చును. కాని, సమూలముగా ఐరోపీయుల జీవితము హిందువులు జీవించుట మాత్రము హేయము.

ప్రజాసామాన్యము హిందూదేశములో వారి నాగరికతనే అవలంబించుచున్నారు. కాని ధనవంతులుమాత్రము పాశ్చాత్త్య నాగరికతకు లోనగుచున్నారు. అందువలన తమ నాగరికతలో వారికి వస్తుకమును పునరుద్ధారణ చేయవలెను. (యంగు ఇండియా 1927. పే. 176-258). అట్టి నాగరికత పురాతన ఆర్యుల నాగరికతకాదు. అది యెట్టిదో మనకు తెలియదు.

## సంపూర్ణ పారిశ్రామికమును నిరోధించవలెను.

(1) గాంధిమహాత్ముని తలంపులో పారిశ్రామికమనగా విశేషవ్యాప్తితో అనేకమంది యేకప్రదేశములో పనులుచేయుచు ఒక్కని మూలధనముతో నడుపు వృత్తులు. ఇట్టివృత్తులు యజమాని లాభముకొఱకై యుండును. ఇట్టి పారిశ్రామిక వృత్తులకు గాంధీజీ "బలవద్విరోధి." యూరపులో యిట్టి పారిశ్రామికజీవనమువల్ల కొలదిమంది ధనవంతులై ప్రజాసామాన్యము అధమస్థితికి దిగిపోయిరి. ఇతరదేశీయులు నిర్ధనులైరి. హిందూదేశముకూడ యిట్టిస్థితికి దిగి యింకెవరిని సాధించి ధనము సేకరింపగలదు? హిందూదేశముకంటె ప్రస్తుతములో అధమదేశము లేకపోవుటవల్ల హిందూదేశమున కట్టి లాభమును గలుగదు. 2. ఇట్టి విశేషపారిశ్రామిక పద్ధతి, వేర్వేరుదేశముల పోటీలకు కారణమై యుద్ధములను దెచ్చును. 3. మఱియు, సామాన్య గ్రామ

జీవనమును నాశనము చేసి అసంతుష్టిని కలుగజేయును. (యంగు యిండియా 1927. పే. 150). 4. వస్తువులయుత్పత్తిలో మెషీనులు ఉపయోగించుటవల్ల, దేశమునందు ప్రజలు నిరుద్యోగులై సోమరు లగుదురు. 5. అట్టిస్థితివలన దేశములో కొందరే ధనాధికారులై, మిగత జనులను అణచిపెట్టియుండుట కలుగును. అందువల్ల పూర్ణపారిశ్రామికము గొప్పఅరిష్టము. (యంగు యిండియా 1924–1926). కాబట్టి ఖద్దరు ప్రధాన సాధనముగా ఇట్టి స్థితిని ప్రతిఘటింపవలసియున్నది.

అయినను, కొన్ని మార్పులతో పారిశ్రామికమునుగూడ సౌఖ్యదాయకముగా జేయవచ్చును. గాంధిమహాత్ముని యుద్దేశ్యములో పరిశ్రమలుకూడ ప్రకృతి శక్తులలో ఒక తరగతికి జెందినవి. ప్రకృతిశక్తులు మన సుఖమున కుపయోగింపవచ్చును; లేక మన యొక్కగాని, యితరులయొక్కగాని నాశనమునకు ఉపయోగింపవచ్చును. హిందూదేశములో పరిస్థితులు, యూరపులోకంటె యితరమయినవి కాబట్టి యీ దేశములో కొన్ని మార్పులతో పరిశ్రమలను వృద్ధి పొందింపవచ్చును. మిల్లు అధికారులు తమ కూలీలను, భాగస్వాములుగను, తాము సంస్థను గౌరవముగ, సుఖకరముగ నడపింపవచ్చిన బాధ్యులుగను యెంచినచో, సామాన్యపరిశ్రమలు ఐరోపాలోవలె జననాశహేతువులు కావు. హిందూదేశములో ఆధ్యాత్మిక తత్త్వము సహజముగుటవల్ల, పూర్తిగా దేశము పారిశ్రామిక మయిపోవునని భయపడ నవసరము లేదు. యూరోపు ఖండమే కొంతకాలమునకు తన జననాశనమును గుర్తించి హిందూదేశపద్ధతుల ప్రకారము సామాన్య గ్రామవృత్తులకు పోవలిసివచ్చును. (యంగుయిండియా 1924—1926, వాల్యూం, 683–684). యంత్రసాధనములవిషయమై మహాత్మ గాంధియొక్క అభిప్రాయములు 'ఇండియన్ హోమురూలు' వ్రాసిన నాటినుండి కొంత మార్పుచెందినవి. ఆగ్రంథమునందు సాధారణముగా నుపయోగించు ప్రయాణసౌకర్యము లిచ్చు పాశ్చాత్యయంత్రసామగ్రిని ఖండించియున్నాడు. అందు యంత్రములు మహాపాపసూచకములు (పే. 109). యంత్రములమీద వ్యామోహము వృద్ధియైనయెడల దేశము దుఃఖపూరితమగును (పే. 106). యంత్రసామగ్రియెడల ఒక్క సుగుణమునుకూడ నిరూపించుటకు నాకు జ్ఞప్తికివచ్చుటలేదు. దానియొక్క చెడుగులనుగూర్చి గ్రంథములు వ్రాయవచ్చును. (పే. 109).

గాంధిమహాత్ముడు ఇంతతీవ్రముగ యంత్రములనుగూర్చి వ్రాయుటకు కారణముల నాలోచించినచో ముఖ్యముగా నాల్గు కనిపించుచున్నవి. 1. హిందూదేశమునందు దేశీయములగు చేతివృత్తులను నశింపచేసి, హిందూదేశమును దరిద్రముగ జేసినవి మాంచెస్టరు మిల్లులు కదా? 2. యూరోపువాసులే తమయొక్క యంత్రములు శక్తికి మించినందున వినాశనమును సమీక్షించుచున్నారు. 3. యంత్రశాలలో పనిచేయు కార్మికులజీవితము మిక్కిలి హీనముగా నున్నది. 4. యంత్రసామగ్రులు విషయలంపటులగు పాశ్చాత్యుల నాగరికతాజనితములు. (యంగుయిండియా 1924-1926 వాల్యూము, పే. 1131.) గాంధి మహాత్మునికి యంత్రవిముఖత ఎంతవరకు వెళ్లినదనగా యంత్రశాలలన్నియు భూమిపైనుండి యొక్కసారిగా అదృశ్యమైనను తా నొక్క కన్నీటిబిందువైనను విడువనని నుడివియున్నాడు.

కాని మహాత్ముడు దూరదృష్టితో వీక్షించి యంత్రములు ప్రకృత నాగరికతలో నుండి పూర్తిగా తొలగించుట అసాధ్యమని గుర్తించియున్నాడు. అందువలన కొన్నితరహాల యంత్రముల నుపయోగింపవచ్చునని కొంతవర కంగీకరించియున్నాడు. 1. అనవసరమయిన మానవప్రయాసను తగ్గించునవి. అనగా సింగరు-కుట్టు-యంత్రములవంటివి. యజమానుల స్వార్థ లాభమునకుగాక లోకమున సమస్తజనుల సౌఖ్యార్థమును, దేశజాతివిచక్షలేక యుపయోగింపబడునవి (యం. ఇం. పే. 1109). 3. జీవితము సులభముగా గడుపుట కుపయోగించు యంత్రములు. అనగా, జీవితములో ముఖ్యముగా ఆరోగ్యమును రక్షించుకొనుట కుపయోగించు యంత్రములు సైకిలు, మోటారుకారులు ముఖ్యావసరములు కావు. 5. జీవిత సంరక్షణయందు ఏర్పడినయంత్రములు. మహాత్ముడు స్టీమరులు, టెలిగ్రాపులు, పాశ్చాత్యపారిశ్రామిక జీవితమునకు ఉపకరములు కానియెడల వానినికూడ అంగీకరింతునని నుడివియున్నాడు. "యంత్రముల నిరోధింపను; యంత్రములపైని గలవ్యామోహమును నిరోధింతును." మానవశ్రమ తగ్గించు యంత్రములపై వ్యామోహపడి వానిని విరివిగా నుపయోగించినందువల్ల మానవులు తిండిలేక వీధులలో అల్లాడుచున్నారు. మానవప్రయాస కొంతమంది ధనికులకేగాక సర్వ మానవులకును తగ్గవలెను. ధనము సర్వజనుల హస్తగతమై యుండవలెను. ప్రస్తుతకాలములో యంత్రములు ఏ కొలదిమందియో, జనసామాన్యము మీద దాడిచేయుట కుపయోగించుచున్నవి. (యంగుయిండియా 1924-1926). పై ఉదాహృత భాగములబట్టి యంత్రశాలలు సామాన్య జనులకు హింసను తెచ్చిపెట్టినందువల్లనే యంత్రములయెడ మహాత్ముడు విముఖు డగుచున్నాడని స్పష్టమగుచున్నది.

ఆర్థికశాస్త్రము, ధనసంపాదనవిషయమై మాత్రమే ఆలోచించును. మహాత్ముడు అనవసరముగా విరివిగా ధనసంపాదనమును నిరసించును. అపరిమితార్థికాభివృద్ధి నైతికజీవితమునకు ప్రతికూలమని ఆతని యభిప్రాయము. మానవుడు తనకు కావలసిన తిండి, బట్ట, ఉనికితప్ప ఇతరములు వాంఛింపగూడదు. ఈ మాత్రపు పనులకు ఆర్థిక శాస్త్రసాహాయ్య మనవసరము. ఆర్థికశాస్త్రమను వేరుశాస్త్ర మనవసరము (వ్యాసములు-ఉపన్యాసములు పే. 255). ఆర్థికశాస్త్ర గ్రంథములకంటె మన ధర్మశాస్త్రములే ఎక్కువ మార్గదర్శకములు. ఆతని వ్రాతలలో మతమునకును ఆర్థికవిషయములకును గల సంబంధమును చర్చించియున్నాడు. కాని మతబోధచేయుటకు పూర్వము తిండి, బట్ట యిచ్చుట ముఖ్యావశ్యములై యున్నవి. ఆర్థికశాస్త్రము మతసూత్రముల ననుసరించి యుండవలెను. మతము ఆర్థికరీతి నుపచరించుటకు సానుకూలమై యుండవలెను. 1927 సం. యంగు ఇండి

యాలో మతమునకును, ఆర్థికజీవితమునకును గల పరస్పరసంబంధమును విపులముగా మహాత్ముడు చర్చించియున్నాడు. దానిలో ముఖ్యాభిప్రాయ మేమనగా జంతుహింసా నివారణసంఘములు, గోరక్షణ సంఘములు మొదలైనవి అశక్తములగు గోవులను రక్షించుటకు తగిన ధనబలముగలవై యుండవలెను. మతసంస్థలుకూడ ఆర్థికవిషయములను మరువకూడదు. సర్వజన సౌఖ్యసాధనముగా గాక యేసంస్థను గాని స్వలాభ స్వీకరణమునకై నడుపరాదు.

## పెద్దనగరములయెడ నిరసన

పెద్దనగరములయెడల మహాత్మునికి గల నిరసనభావమును సూక్ష్మముగా మూడుభాగములక్రింద గమనింపవచ్చును. (1) పట్టణములలోని జీవితము పల్లెలలోని జీవితముకంటె అధమమైయున్నది. (2) ధనధాన్యవృద్ధికి, వానియుత్పత్తికి కారణములైన గ్రామముల భాగ్యమునంతయును పట్టణములు పీల్చి పిప్పిచేసి, తమ అన్యాయపు పోషణకు ఉపయోగించుచున్నవి. (3) హైందవ నాగరికత ముఖ్యముగా గ్రామసమన్వితమైనది. పాశ్చాత్య నాగరికత పట్టణములలోనే యుండునది. మనపూర్వులు నగరములను సజ్జనులకు వలలవంటివనియు, వృథాభారములనియు ఎంచియుండిరి. అందువల్ల పట్టణములలో ప్రజకు క్షేమము లేదని రోసియుండిరి. మహానగరములు ముష్కర చోరనిలయములై వ్యభిచారాదిదోషభూయిష్ఠములై యున్నవి. తత్ప్రదేశములలో ధనవంతులు బీదలను దోచి జీవింతురు. (ఇండియన్ హోమురూలు పే. 65) హిందువులకు వారిస్వభావమునుబట్టి గ్రామజీవనమే సహజము. ఎవరికి వారు శుభ్రముగా నుండుటయే కాని, సమూహముగానుండి మ్యునిసిపల్ శుభ్రతవంటిది అనుభవించుట వారికి సహజముకాదు. పాశ్చాత్యులు ఐహికసుఖమును వాంఛించి మ్యునిసిపాలిటీలు మొదలైనవి నిర్మించి గ్రామములను వదలిపెట్టిరి. నగరపారిశుద్ధ్యమునందు పాశ్చాత్యులనుండి మనము అనేకలాభకరములగు సంగతులను నేర్చుకొనవచ్చును. (యంగుఇండియా 1924-26.) మరియిన్ని, అట్టిజను పెద్దపట్టణములు, గ్రామముల జీవరక్తమును పీల్చి, తాము దేశమునకు చీడవలె వర్తించుచున్నవి. ఖద్దరు పరిశ్రమ ఒకవిధముగా తిరిగి గ్రామ పునరుద్ధరణకు ఏర్పాటు చేయబడినది. తూర్పునుండి పడమరకు ఉత్తరమునుండి దక్షిణమునకుపోవు వివిధములైన యినుపదారులు, గ్రామములయందలి సామాన్యజనుల భాగ్యమును లాగివేయు అనేకనాళములై యున్నవి. తిరిగి పట్టణములనుండి పల్లెలకు ధనమును ప్రవహింపజేయవలెను. (యంగుఇండియా 1927)

## స్వదేశీ సూత్రము

మహాత్మునితలంపులో స్వదేశీయనగా దేశీయములైన సంస్థలను జీవింపజేసి దేశములో ఉత్పత్తియగు సామగ్రినే ఉపయోగింపవలెను. తత్సూత్రము, మతముప్రకారముగాను, రాజకీయముగాను, ఆర్థికముగానుకూడ వర్తించును. అందువలన మననాగరికత, మతము, భాష, వస్త్రధారణము మనరాజకీయ, ఆర్థికసంస్థలును దేశీయోత్పన్నములై యుండవలెను. తాత్కాలికముగ కొంచెము అసుఖమును కలిగించినను దేశీయవస్తువు మొదలయినవాని విషయములయందు పట్టుదల కలిగియుండి ఒకవిధముగువిధిగా ఎంచి వానిని వదలకుండ నడవవలెను. ఆర్థికముగా, మనదేశములో తయారైనవస్తువులనే మనము ఉపయోగింపవలెను. మరియిన్ని యేవృత్తులు లేనియెడల దేశము దరిద్రమగునో వానిని ప్రోత్సహించి ఆభాగములలోనైనను విదేశవస్తువులను బహిష్కరింపవలెను. అందు వలన విదేశీవస్తువులను పూర్తిగా బహిష్కరింపవలెనా? దానికి ప్రత్యుత్తరము పూర్తిగా విడువనక్కరలేదనియే. ఈదేశములో తయారుకాని కొన్నివస్తువులనుమాత్రము వాడవచ్చును. అనేక విదేశీయవస్తువులు మనకు అవసరములేనివే. వాని ఉపయోగము తగ్గించుకొనవలెను. అనేక అనవసరదిగుమతులు మానినయెడల దేశము చాల ధనవంతమై యుండును. మనదిగుమతులలో ప్రధానమైనవానిలో బట్ట ముఖ్యమైనది. వస్త్రవిషయములో చేతితోవడుకుట, నేయుట ప్రారంభించినయెడల పూర్తిస్వదేశి వెంటనే లభించును. మహాత్ముడు ఖద్దరుపై నెంతయెక్కువగా శ్రద్ధవహించుచున్నాడో పైకారణము స్పష్టీకరించును.

మహాత్ముని ఆర్థికాశయములు:—మహాత్ముని ఉపన్యాసములు వ్రాతలు గమనించినచో యీదిగువ అంశములు ముఖ్యముగా తోచును. (1) ఆహారము వస్త్రము, నిలుచుటకు శరణ్యము సర్వమానవులకు ఉండునటుల ఏర్పడవలెను. ఈలోటులు తీరినగాని మానవునికైవ చింతన కనకాశముండదు. (2) ఆహారవస్త్ర శరణ్యేతరములగు కోరికలు ఆముష్మికమునకు సహాయముగా నుండవు. అందువలన అనవసరములు. (3) ప్రతిమానవుడును తనకు కావలసిన ఆహారము, వస్త్రము స్వయముగా తయారుచేసికొనవలెను. (4) ప్రతిగృహము, ప్రతిగ్రామము ప్రతిదేశము, ఆర్థికముగా స్వయంసహాయధురీణమై యుండవలెను. (5) ఆహారము, వస్త్రము లాభమునిమిత్తము వర్తకమునకు లోనై యుండకూడదు. (6) విరివిగా జరుపు వాణిజ్యము వ్యక్తిలాభమునకుగాక సర్వజనోపయోగమునకై యుండవలెను. (7) యంత్రములు కొంతవరకు ఉపయోగింపవచ్చును. కాని వానిని పూర్తిగా త్యజించుటయే ఆశయముగా గమనింపవలెను. (8) సారాయము, నల్లమందువగైరాలలో వర్తకము నాటంకపరుపవలెను. (9) దేశదేశములనుండి వలసపోవుట శ్రేయోదాయకముకాదు. (10) ప్రజలలో ధనవ్యత్యాసముండుట తొలగింపలేము కాని అన్నితరగతులవారికి పరస్పరస్నేహభావముండవలెను. (11) అనవసర-అపాత్రదానమును వదలివేయవలెను. "పనిచేయక, తిండిలేదు" అనుసూత్రమును అనుసరింపవలెను. భిక్షాటనవృత్తిని పోగొట్టవలెను. (యంగు ఇండియా 1924-26). (12) ప్రతిమానవుడు నేదో యొక శారీరక శ్రమపడవలెను. అందువలన పాటు పడుటయొక్క ఘనత తెలియును. సామాన్య-పాటకపుజాతియెడ అనాదరణ తగ్గి గౌరవము కలుగును.

ఓ సుల్తాను మహమ్మదూ! కృతకవిద్యుత్కాంతుల న్నమ్మి యా
శాసౌధంబును గట్టుకొంటి నది నిస్సారంపు టాకాశమై
నా సర్వస్వము దొంగిలించి నరకానన్ గూలిపోయెన్ వృథా
యాసప్రాప్తిగ నిల్చినాఁడ నొకదుఃఖాక్రాంతలోకంబునన్.

పూనిక రాసికెక్కె మనుజభుక్తి యొసంగెడు రాతిగుండె, సు
ల్తానుల కస్మదీయకవితాసుధఁజిందిన పాతకంబు, నా
పై నటనం బొనర్చినది వాస్తవ మిట్టి స్వయంకృతైకదో
షానలదగ్ధమై చనిన యర్థము నాకు లభింపఁబోవునే.

హాయిగ నీయశస్సు వెలయంగల చక్కని మేడఁగట్టి దీ
ర్ఘాయువుఁ బోసినాఁడ భవదన్వయవల్లికి, పట్టిచేతులన్
బోయెద నంధకారమున మున్గి, సుఖంబుల ప్రొద్దుగ్రుంకె, రా
జా! యిఁకఁ దాఁటవించెద, భయంకరదుఃఖితమూలవాటికన్.

ఒక్కొఁక పద్దియంబునకు నొక్కొఁక నెత్తురు బొట్టు మేనిలోఁ
దక్కువఁగా రచించితి వృథాశ్రమయయ్యెఁ గులీనుఁడైన రా
జెక్కరణిన్ మృష ల్పలుకునే? కవితా ఋణమీయకుండునే
నిక్కమెఱుంగ నైతి గజనీ సులతాను మహమ్మదగ్రణీ!

ఇంక విషాదగీతికలకే మిగిలెన్ రసహీనమై, మహీ
పంకము నాకలమ్మెన, నభాగ్యుఁడనైతి, వయఃపటుత్వము
గ్రుంకె, శరీరమం దలముకొన్నది వార్ధకభూత మీవిరా
కాంకితబాష్పము ల్పలములైనవి ముప్పదియేండ్ల పూజకున్.

అల్లా తోడని పల్కి నాపసిఁడికావ్యద్రవ్యమున్ వెండితోఁ
జెల్లింపన్ దొరకొన్న టక్కరివి, నీచేఁ బూజితుండైనచో
నల్లాకున్ సుఖమే? మహమ్మదునృపాలా! సత్యవాక్యం బెవం
డుల్లంఘింపఁడొ వాఁడె పో నరుఁడు ధన్యుం డిద్ధరామండలిన్.

చిరముగ బానిసేయు నభిషేక మొనర్చితి, మల్లెపూవు ట
త్తరు లొలికించి, మాయఁజలతారున రాదఁగదా? పసిండి యో
కఱకుతురుష్కభూపతి! యఖండమహీవలయంబునందు నా
శిరమునఁ బోసికొంటిని నశింపని దుఃఖపు టగ్నిఖండముల్.

అలసట దీర్చుకొందును మహమ్మదురాజులతో సమాధిశ
య్యలపయి, ముప్పదేఁడుల ప్రయాసకు డెందము కందిపోయె, ని
ర్మలమగు చిత్తశాంతి కిఁక మార్గము లే దెనలేని పండు వె
న్నెల గురియించు నాకవిత నీకు లభించె నబద్ధవాదికిన్.

---

# యాచ్ఞా దైన్యము

అద్దిశెట్టి లక్ష్మణస్వామి నాయుడుగారు

౧

నానయొకింత లేమిని సనాతనధర్మము మాని పొట్టకూ
దూని యనేకమాయలకు నోడి మనంబునఁ బుట్టెడానతోఁ
గాని కులంబుఁ జేరి కడగండ్లకులోనయి "దేహి" యంచు యా
చ్ఞానతమస్తకం బగు జనంబు జనింపగనేల దైవమా!

౨

పాండిత్యంబు యశంబు చూడరు ప్రభావంబన్న నేమున్న దే
మండీ యందరు డబ్బుకోస మిది యెత్తానంను రంతేను నా
కృండుం దీర్పఁడు తృప్తిపాన లకటా! కానంత దైన్యంబుతో
నుండంజూచి మొగాన మూతురిఁక నయ్యో యాచ్ఞ యేపాటిదో!

౩

పరువా లేదు, ధనంబు లేదు సుఖమా మాట్లాడఁగారాదు నెం
దటిలోనం జెయి క్రిందుమాత్రమె యినీ దైన్యంబు యాచ్ఞార్థమై
ధరఁ బుట్టం జనుగాని యెవ్వఁ డిది స్వాతంత్ర్యంబుఁ బోనాడి పెం
బరవిత్తై గరతుల్య దైన్యమును నాహ్వానించుఁ జూడుండఁగన్.

౪

పడుచును లేచుచున్ మెరకపల్లములే యనుకోక యేఁగి కా
ల్నడకను వానిపంచఁ బదినాళ్లు పడింబడి నిట్టి చాకి రో
కృఁడె గతిలేక చేసి తుది గవ్వయుఁ గానఁగలేక తాను సూ
ర్పడి నడువంగలేని పరువాలక మెంతటి జాలిఁ గొల్పెడిన్.

౫

కుడువఁగఁ గూడు లేదు పడుకోఁ బరుపా యసలే పాలికిన్, నె
కృడఁ దలఁదాచుకోఁ దలముఁ జేరెఁడు గల్గదు; కట్టుబట్ట చే
పడకు శరీర మెల్లఁ జెడి పాడగుఁ జిచ్చుగతిఁ న్మవంబులోఁ
జిడిముడిపాటు హెచ్చు ఛిఛిఛీ పరదేశము నేఁగ యాచ్ఞకై.

౬

ఫలముం గోరుట సిగ్గు బాగ్గగును సన్మానంబు మన్నాను స
త్కృళలన్ శక్తియుఁ జట్టుబండ లగు క్రోధావేశమా హెచ్చుఁ జం

చలితంజేసి మతిభ్రమంబు గలుగన్ సర్వంబు నీరీతి న
ష్ట్యాలనొండొంటికి మూలమై చెడును యాచ్ఞాదైన్య నైచ్యంబుగన్.

౭

రార మ్మింక కుమారు "పో, తిరిగిరా రావయ్య రే పిన్నడే
రా, రాలే" దని తూలనాడి పలుకన్ రాపిల్లఁగా ల్తీపులం
బోరామిల్లకు రైలుబండ్లఁ దిరుగన్ ముప్పూఁటకున్ ఖర్చులిం
తే రానున్న ఫలంబు యాచ్ఞకయి పోతే లోభిగేహాళికిన్.

౮

కాళ్లుపడిపోయె మోకాళ్లు కదలిపోయె, వంటపూఁటింట సొమ్మంత వదలిపోయె
రైలుఛార్జీల నటునిటు రాపిడాయె, చావు బోగాయె యాచ్ఞకై దేవురింప.

౯

సర్వలోకాలు కుక్షిలో సాఁకు వాఁడు, బడుగఁడై నేలమూఁడడుగు లడిగికొనుట
దేవదేవుఁడె జంగమై తిరిపెమెత్తి, కొనుట యాచ్ఞానిశాటి కైకోలుగాదె.

౧౦

కాలుసేతులు చక్కఁగాఁ గదలుచున్న, బుద్ధి చూఱుకుగఁ బనిసేయ ముందువెన్క-
లను నెఱింగిన నిజముగాఁ దనువునందు, నసువులేయున్న యాచ్ఞకై యరుగనగునె.

---

## వీరధర్మము

ఉభయభాషాప్రవీణ, తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు

(పల్నాటి వీరశిఖామణి యగు బాలచంద్రుఁడు రణమునకుఁ బోవు తలంపు వెలువరించినతఱిఁ దల్లియగు నైతాంబ యిట్లనుచున్నది.)

అక్కట కుమార! నీకేల - రిక్కరగిన్ బోధఁజేసి రీ వెక్కడఁబో
రెక్కడఁ బోరునమెక్కడఁ - జెక్కిలి నిటు మీఁటఁ బాలు సిందెడి నీకున్.

జంతులాటగాదు బలి చెడుగుడుగాదు - బొంగరాల విసరు భంగిగాదు
గోలిగుండ్లనాడి కొనుమక్కిగాదు సం - గరము తగరుపోరు కాదుతనయ!

హుంకారము లతులధను - ష్టంకారము లార్భటులును జంకెనలును బల్
బింకెలుఁ బొంపిరివోయెడు - సంకులసమరోర్వి నిల్వఁజాలుదె తండ్రీ?

మదగజఘీంకృతుల్ తురగమండలి హేషలు భేరిభాంకృతుల్
రథగణనేమిధంఘణ లరాళకరాళకృపాణఝంఝుళుల్
గుదిగొను సింహనాదము లకుంఠితభంగిఁ జెలంగ సాధ్వసా
స్పదమగు యుద్ధరంగమున బాలుఁడ నీ వెటు నిల్తు సెప్పుమా ?

కత్తుల తళతళలకు నీ - చిత్తము కంపింపఁ గనుఁగఁ జీఁకటిక్రమ్మన్
దత్తఱపడు వడిఁ బగఱొక మొత్తమ్మై ముట్టనెట్టు మొత్తెదువారిన్.

యుద్ధము లొనర్చి దేశంబు నుద్ధరించి - జాతికిం గులమునకు విఖ్యాతిఁ దెచ్చి
మమ్ము నలరింప భావికాలమ్ము లేదె ? - తరుణమిదిగాదు మాను మీ తలఁపుఁ గుఱ్ఱ!

సంతతిలేక కడుంగడుఁ - జింతిలిచింతిల్లి చిట్టచివరకుఁ జెన్నం
డింత దయ సూప నిన్గని-సంతసపడితిన్ ఫలించె జన్మం బనుచున్.

నానిధానంబవీవు నాప్రాణమీవు - నన్ను నెడఁబాసిపోవుదే నాయనమెడసి
తగవుగా దీప్రయాణంబు తగదు తగదు - విడువు సంగ్రామవాంఛనో వెడఁగుఁగుఱ్ఱ!

నీతండ్రి రణోర్వికిఁ జన - నాతోడ నుండువనుచు నమ్మితి నెదలో
నోతండ్రి ! నాకడుపునం - దీతఱిఁ జిచ్చిడకుమేటికీ సాహసముల్.

ఆలింపుము నాపల్కులఁ - జాలింపు మపాయజనకసంగరయాత్రన్
దూలింపుము రోషమ్మును - బాలింపుము నీదుతండ్రి పంపుకుమారా !

వ. అనుటయు నబ్బాలచంద్రుఁ డిట్లనియె.

వెఱఁగయ్యె నీదుపల్కుల - తెఱఁగుం బరికింపఁ దెల్గుఁ దెఱవకు నెఱపో
టరియగు బ్రహ్మనపట్నికిఁ - బిఱికితనం బిట్లు వెల్లివిరియం దగునే.

బాలుఁడవంచు సంగరము భంగు లెఱుంగనివాఁడవంచు గు
ఱ్ఱా లిగిలించినంతనె కరంబు భయంపడెదంచు నాకహో
పోలని నీతులం గఱపఁ బోకుము వైరివిదారణక్రియా
ద్వేలయశస్కుఁడౌ వెలమవీరశిఖామణి నీఁ డెఱుంగుమా!

బాలుఁడు గాఁ డితండు యువపట్టము నేలెడు దిట్ట యౌవన
శ్రీలలితుండె సత్క్రియలఁ జేయువలంతి యతండె దుస్థితిన్
డీలుపడంగఁ దోలి నిజదేశసముద్ధరణం బొనర్పఁగన్
జాలిన మేటివాఁడె పటుసాహసకోహలుఁ డూహసేయఁగన్.

కొండలఁ బిండియొనర్చెద, దండధరుండన విరోధిదళములనెల్లన్
చెండాడెద వేల్మిడిబ్రి, హర్మ్యంబులఁ బట్టి బంతులాడెద జననీ!

కారెమపూడి రంగమునఁ గయ్యముకోసము కాలుదువ్వుచు
న్నారు తెలుంగుజోదు లదనన్ గదనంబునఁ దూఁకి మూఁకలో

వీరవిహారము సలిపి విశ్రుతకీర్తిఁ గడింపకున్న నా
పేరును కెంపుసొంపు చెడఁ బెద్దలుఁ బిన్నలు బ్రువ్వఁ దిట్టరే.

జనకుం డాహవభారము న్నిజభుజన్యస్థంబునం దాల్చి తీ
అనిశస్త్రంబులఁ జిక్కుద్రుక్కు తతి ధైర్యస్థైర్యనిర్భాతి చూ
తనయుం డెవ్వఁడు రాణివాసములఁ జింతం బాసి వాసించునో
జననీ! వేగ సముజ్జ్వలమ్ము సమరోత్సాహంబు తీండ్రించెదన్.

ఆహవమున శిష్యత చని - దోహలమునఁ గసిమసంగి దుష్టవిరోధి
వ్యూహంబులఁ ద్రుంచెద నా - బాహాబలమెల్లఁ జేట పడుచుండమునన్.

తెలుఁగుం దేశచరిత్రకుఁ - దెలువిచ్చి సువర్ణవర్ణచిత్రితములు నై
పలునాఁటి వీరగాథలు - విలసిల్ల నొనర్తు నారవిసుధాకరమున్.

గత్యంతరంబు సెప్పకు - మత్యంతోత్సాహమలర నాజి "యశోవా
మృత్యుర్వా" యని దూఁకెద - నిత్యంబగు పనము దెసల నింపెదఁ దల్లీ.

వెలమలు కమ్మవీరు లతివిక్రమధుర్యులు రెడ్డిజోదులుం
దెలఁగలు దేశదాస్యమును ద్రెంప విరోధిశిరోధిఖండనో
జ్జ్వలకరవాలహస్తులయి సంగరలక్ష్మి నలంకరింప నన్
నిలుపఁదలంచెదిందు జననీ! నిను సేమనువాఁడఁ జెప్పుమా.

స్వార్థనిరతుండు తుచ్ఛభోగాభిరతుఁడు - పాఱిపోవు దేశద్రోహి పైని మాలి
మాలడాఁగిన డాఁగుఁగా కాలమునకు - దూఁక కవఁడుండు నిశ్తతి పీఁకతోడ.

నీవెఱుఁగని ధర్మంబులు - లేవైనను బాలమోహలీనాత్మకనై
యీవిధిఁబల్కెదు దానిన్ బోవిడువం దగిన యదను బొమ్మిది తల్లీ!

పుత్రుఁడని మిత్రుఁడనియుఁ గళత్రమనియు - భర్తయని సోదరుండని బాంధవుఁ డని
బాలుఁడని వృద్ధని తలంచువేళగాదు - తల్లిరో సాగుచుండె స్వాతంత్ర్యరణము.

కరికర్ణాంతవిలోలము - శరీరము తటిత్సమంబు సకలార్థంబుల్
నరనీగుమాదళగతి - కరములు భోగములు వీనఁ గాంపులు చనుచే.

కాయం బనపాయముగా - దోయమ్మరో! కీర్తిమాత్ర ముందును గవిరాట్
గేయంబై యాచంద్ర - చ్ఛాయానాయకము దశదిశావ్యాప్తంబై.

వీటనున్నను గాటంపుఁ గాటనున్న - మృత్యు నెదిరింప నెవనికి శక్తిగలదు
ఉప్పతిల్లుచు జెల్లుచు నుండుఁగాని - యొల్లబోద్దులు నోక్కమే నెట్లు నిలుచు.

బ్రదికిన నాల్గుదినంబులు - పదిరాయని జగము మెచ్చు పటుపౌరుషమం
పదపొంపిరి పోఁవగనుం - డఁదగున్నరుఁ డంచు బుధు లన న్వినవో కో.

"అరయ వివృతస్వర్గ - ద్వారము రాజులకు నాహవం" బంచు మహో
దారుఁడు శాంతనవుఁడు తా - భారతసంగ్రామమందు భాషింపఁడొకో.



౧. శ్రీమతి గుమ్మిడివల దుర్గాబాయమ్మగారు. (శి) ౨. శ్రీమతి అంగచ్చి అమ్మాళుగారు. (శి) 3. శ్రీమతి కామాక్షి అమ్మాళుగారు, (శి)
౪. శ్రీమతి కే. యస్. మీనాక్షి అమ్మాళుగారు. (శి) ౫. శ్రీమతి సరస్వతి అమ్మాళుగారు. (శి)





చెన్నపురి ఉప్పు-సత్యాగ్రహదళము

౧. నాయకుడు: శ్రీ వి. యల్. శాస్త్రిగారు. ౨. స్త్రీల ఊరేగింపు. నాయకురాలు: శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారు.

అమ్మరో! వీరసింహముల కాహవరంగ మొకండె వాసమో
గ్యమ్మగు కావనం బచటఁ గాయముఁ బాసినఁ బాయకున్న సౌ
ఖ్యమ్మున కించుకంతయును గల్గదు లోఁ టటకేగలేని ద
ద్దమ్మలు భుక్తిముక్తులకుఁ దవ్వెదురం చనరో కొ- పండితుల్!

తను వస్థిరంబు గావున - మనుజుం డనయంబు న్రపమత్తతతోడం
బొసరింపం దగు మృత్యువ - దనసదనావాసి వోలెఁ దనధర్మంబుల్.

ఉత్తమమగు నరజన్మం - బెత్తిన ఫలమేమిః? సుగతికేగెడుమార్గం
బెత్తోయుంబునఁ గానక - మత్తిల్లి చరించునతఁడు మాలరో చెపుమా!

వ. సుగతికిం బాత్రంబులగు వృత్తంబులు రెండుమాత్రంబకలవు. వాని నెఱింగింతువినుము.

గురుశుశ్రూష లొనర్చి ధర్మవిదుఁడై కోపాదులం గెల్చి సం
సరణాబ్ధిం దరియించి నిశ్చలమతిన్ సత్సంగతిం గాంచి త
త్పరతత్త్వంబు నెఱుంగు మానవుఁడు శుంభత్తేజముం దాల్చి తా
నిరతానందనివాసరాజ్యపదవిన్ నిర్భీకుఁడై నిల్చెడిన్.

ఎవఁడు పరరాజవశ్యమై వవసి దాస్య - శృంఖలాబద్ధమై నిజశ్రీవిలాస
దూరమై గతగౌరవోదారమై దు - రంతపరిభవజనితదుఃఖాగ్ని హేతి
పటలసంతప్తహృదయమై పరితపించు - దేశమాతను గాంచి దుఃస్థితుల నెంచి
నెవ్వగలఁ గుంది వేఁడి కన్నీరురాల్చి - మాతృదాస్యవిమోచనమహితకీర్తిఁ
బొంగి స్వాతంత్ర్యసంగ్రామభూమి దూఁకి - వీఁక రేకెత్త మార్తురమూఁక నెదిరి
చించి చెండాడి దోశ్శక్తి చెడినవెనుక - వైరివీరాసినిర్భిన్నవక్షుఁడగుచు
నలసి ధైర్యంబు విడక "ధన్యోఽస్మి" యనుచు - నమలమగు దేశమాతృపాదాబ్జపీఠి
కసువులను ధారవోయు న య్యనఘమూర్తి - గగనవీథికిఁ జని నిరాఘాటధాటిఁ
జండకరమండలముఁ జించి చెండివైచి - గుంపుగూడి నిలింపు లగ్గింపఁ బెంపు
సొంపుదీపింప మోక్షంబుఁ జూఱఁగొనెడి.

వ. ఇందుఁ దొలుకర్జంబు మకుఁబోంట్ల కయితిగాని చెద్దంబు కావుటంజేసి కడపటి మార్గంబ మాకుశరణ్యంబు. శస్త్రికజీవనులకు నాలంబ మేలిపనదనంబు. శౌర్యంబు నెడసి యెన్ని ధర్మువు లొనర్చిన మమ్ము విజ్ఞులు మెచ్చంబోరు. పోరికి నీడంబోవు తటి వెన్నుండు కిచ్చెడికిం గఱపిన సుద్దులపొలకువ నెఱుంగవే? వెండియు,

మాతృదేశం బన్యమనుజేశ్వరునిచేతఁ - జిక్కి స్వాతంత్ర్యంబు దక్కి తనదు
జాతీయతను బాసి చేతోగతంబైన - తలఁపు వెలువరింపఁ దగినవాక్కు
నెడసి లోలోపలనే క్రుళ్లికుములుచు - నీచదాస్యమున మునింగి పిఱికి
తనము వరించి నితాంతకష్టపరంప - రల నీఁగి దారిద్ర్య మలమదిక్కు
లేక శోకించువేళఁ దల్లి మొరనాల - కించి మైపులకింపఁ జలించి కొంచె
మేని నామెకుఁ దోడ్పడలేనిబిడ్డ - బ్రతుక దేటికి? ధాత్రికి బరువుచేటు.

---

# వ్యాసము

రాయసము వేంకటశివుడుగారు, యం. ఏ.

## వ్యుత్పత్తి, నిర్వచనము

సంస్కృతమున, విపూర్వకమగు ‘అస్’ అను ధాతువునకు వేర్పఱచుట అనియును, నిపూర్వకమగు ‘అస్’ అనుదానికి ఉంచుట అనియును అర్థము. “వ్యాస మనఁగా ఏదేని యొకవిషయమును విరివిగా వ్రాయుట” అనియును, “ఉపన్యాస మనఁగా ఏదేని యొకవిషయము నెత్తి విస్తరించి చెప్పుట” అనియును, శబ్దరత్నాకరము వాకొనుచున్నది. గద్యరూపవిషయప్రస్తావనము ఉపన్యాస మనుటకంటె వ్యాస మనుటయె సమంజసము. వాగ్రూపాంశకథనమున కుత్తరహిందూదేశమున వ్యాఖ్యాన మనియును, మన యాంధ్రదేశమున నుపన్యాస మనియును వ్యవహారము కలదు.

ఆంగ్లమున వ్యాసమును ‘ఎస్సే’ యని వ్యవహరింతురు. ‘తూచుటయును’, ‘యత్నించుట’ యును దీని వ్యుత్పత్త్యర్థములు. “అనిబద్ధచిత్తవిహారణమే వ్యాస” మని జాన్సనుపండితుఁడు వచించియున్నాఁడు. “పరిపూర్ణముగఁ గాని, ఏకదేశంబుగఁ గాని పరిపాటిగ నింపుగులుకు శైలిచే నొప్పు నాతిదీర్ఘముగు విషయవిస్తరము వ్యాస” మని అక్స్‌ఫర్డు ఇంగ్లీషుకోశకారుని యభిమతమై యున్నది. “రచయిత కిష్టానుసారముగ సులభరీతి వచనరచనము సంక్షేపరూప విషయవిస్తరణమే వ్యాస” మని బ్రిటానికా సర్వవిషయప్రదీపిక యందున్నది.

అసమగ్రమై, నియమరహితమైనది వ్యాస మని తొల్లింటి యాంగ్లేయవ్యాసకర్త లూహించిరి. కాని యిప్పటివారి యభిప్రాయ మది కాదు. ఏరచయిత లైనను, చదువరులకు సుబోధకములగు తేట మాటలతో వ్యాసమూలమున తనభావమును వ్యక్తీకరింపవచ్చును. భావ మెంత గూఢమయ్యును, తేటదనము గలిగి, మృదుసలలితమై యొప్పారుటయె వ్యాసలక్షణము. లఘుగమున నెంతటిదియు, వస్తుతః గంభీరమయ్యు వాలకమున నల్లగపడకుండుటయు—ఇదియె వ్యాసమునకుఁ గల సొంపు. గమనసౌలభ్యమును, భావనిత్యధోరణియును దానికి జీవకళలై విలసిల్లును. సర్వసాహిత్యార్థసాధనము వ్యాస మని యాధునికుల యభిప్రాయము.

## ఇంగ్లీషు వ్యాసచరిత్రము

ఆంధ్రవ్యాసరచనకు ఆంగ్లవ్యాసరచన మూలం బగుటం జేసి, అద్దాని కథాసంగ్రహ మిచ్చుట అత్యంతావశ్యకము. క్రీ. శ. 1571 వ సంవత్సరమున ఫ్రాంసుదేశీయుఁడగు మాంటేను మొట్టమొదట వ్యాసములు రచించెను. మాంటేను వ్యాససృష్టికర్త యనఁబరఁగును. లోకానుభవమును వెదచల్లుచు, ముఖ్యముఖ్య సుపాఖ్యానములచే రసపుష్టిం గావించుచు, తనయిచ్చవచ్చినట్లెల్ల ఆఖ్యాయికలుగ వ్యాసము వ్రాయుటను నను నాచారమున కాతఁడు మార్గదర్శి యయ్యెను. పదునేను సంవత్సరములకుఁ బిదప ఇంగ్లీషుకృతికర్త యగు బేకను తన ప్రథమ వ్యాసములను ప్రచురించెను. మాంటేనునుండి యాతఁడు వ్యాసరూపమును మాత్రమె గైకొని అభిన్నముగ స్వకపోలకల్పనాని శేషములఁ జిత్రించెను. ఏకాంతవాసియగు ఫ్రెంచిగ్రంథకర్తకును, లౌకికరాజకార్యధురీణుఁడగు నాంగ్లేయన్యాయవాదికిని వ్యాసరచనయందు సామ్యము కుదురుట దుర్ఘటము. వ్యాస మనిన సంబంధరహితమగు మాహాపరంపర యని బేకని మతము. వ్యాసములు చెల్లాచెదరగు వాలోచన లని బేకను నుడివెను. ఉద్గ్రంథరచనలవలన విసివి పేసారిన బేకనునకు వ్యాసరచన విశ్రాంతిహేతువగుటచేత నయ్యది క్షుద్రకావ్య మని యాతఁ డూహించినను, జనసామాన్యమున కది హృదయరంజక మగుటఁ బట్టి ఆతనికి దానిపట్లు మహాదరమె యయ్యెను. బేకను వ్రాసిన పూర్వోత్తరవ్యాసములకు శైలిని భేదము గలదు. పూర్వవ్యాసములలోని వాక్యములు సూత్రభంగిని సంక్షేపరూపములై, “కరకర” మనుచుండును. ప్రతివాక్యము భావగర్భితమై యొప్పుచుండును. బేకనునకు విషయమె ప్రధానము. మాంటేనున కది యప్రధానము. ఆంగ్లేయవ్యాసరచనకు బేకను ప్రథముఁడైనను, “కవులీ” వ్యాసబ్రహ్మ యని పరిగణింపఁబడుచున్నాఁడు. స్టీలు అడ్డిసనులు, టాట్లరు, స్పెక్టేటరు మొదలగు తమపత్రికలలోఁ జక్కని వ్యాసములు రచించి ప్రచురించిరి. అడ్డిసనుని రచనలు మృదుహాస్యభూయిష్ఠములై పొలుపారుచుండును. గోల్డుస్మిత్తు, ‘భ్రమరము’, ‘లోకనివాసి’ యను నతిమనోహరములును హాస్యరససమ్మిళితములును నగు వ్యాసములు వ్రాసెను. పదునెనిమిదవశతాబ్దమున నింగ్లండులో వ్యాసరచన క్షీణించెను. 19వ శతాబ్దమున ల్యాంబు జీర్ణవ్యాసోద్ధరణమును గావించెను.

‘ఈలిరుూవ్యాసములు’ వీతల్ కృతములే. ఇవి వ్యక్తిగతభావములకును, మృదుపదసంపదకును, సొంపగు వర్ణనలకును ఆలవాలములై యున్నవి. డిక్విన్సీ, మెకాలే మున్నగు ప్రముఖులు వ్యాసములు రచించిరి. మెకాలేవ్యాసము లన్నియు నన్ని ప్రత్యేకకావ్యములుగ పెన్నెంబడెయున్నవి. ఈశతాబ్దమున చిర్రెలు, గార్డు మొదలగువారలు పేరెన్నికఁగన్న వ్యాసకర్తలు.

## వ్యాసలక్షణములు

వ్యాసము నాతిదీర్ఘముగ నుండు వచనరచన. కావ్యమునకు వలెఁ గాక వ్యాసమునకు విషయనిర్వహణమునందలి జాగరూకతయు, వర్ణనౌచిత్యమును ఉపక్రమోపసంహారసామ్యమును ప్రధానాంగములు. వ్యాసకర్త “సూక్ష్మమున మోక్షముఁ” జూపవలెను. విషయసంగ్రహ రచనారహస్యము వారిఁ దెలిసి యుండవలయును. సంగ్రహముగా నున్నదని రచన విస్ఫారమై యుండఁజనదు. సంక్షేపకథనంబును విషయవిస్తృతియు నను లక్షణద్వయోపేతమై వ్యాసమొప్పారుచుండవలెను. కడు విస్తృతమైనచో అది వ్యాసం బన నొప్పదు; దానిని వ్యాఖ్యాన మనియు కావ్య మనియు పేర్కొనఁదగును. పరిపూర్ణభావవిస్ఫూర్తియు, విశ్లేషణాంశచర్చయు వ్యాసమున నుండఁజనదు.

ఉద్గ్రంథములందువలె వ్యాసమందు శాస్త్రచర్చలు, ఖండనమండనములు, విరుద్ధాంశసామరస్యములు సమకూర్పరాదు. పదముల పరుషత్వము లేక, కులుకుపదనము కలిగి, కొంతవఱకు క్రమభంగము నొందిన వ్యాసము ఉండఁజెల్లును. చర్చయుండినను అది యున్నదా లేదా యను సందేహోత్పాదకమై యుండిననొప్పును. తర్కసహితమైనను తర్కరహితముగఁ గాన్పించు వ్యాసరచన నిర్దుష్టచమత్కృతికిఁ దార్కాణమై యుండును.

వ్యాసమందలి చర్చ శాస్త్రచర్చలవలె గంభీరముగ నుండరాదు. భావకవిత్వమునందువలె రచయితవ్యక్తిత్వము తేటతెల్లముగ నుండవలెను. కావ్యములు వ్యాఖ్యానములు బాహ్యసత్యస్థాపకములు. వ్యాసమున కాంతరంగికసత్యనిరూపణమే ప్రధానము.

వ్యాసరచనను గుఱించి తమ వ్యాసరాజమున అలెగ్జాండరు స్మిత్తుగా రిట్లు చెప్పుచున్నారు. “రూపమున వ్యాసము భావకవిత్వమును బోలియున్నది. ఈ రెంటి రచనకును, లఘువైనట్టిది గాని గురువైనట్టిది గాని యేదో యొక మనోవృత్తియే కారణ మగుచుండును. పట్టుపురుగుచుట్టును పట్టువలె ముఖ్యభావము చేదేని వ్యాస మావరించి యుండును. ఏదేశసాహిత్యచరిత్ర మారసినను, తొలుత నే వ్యాసకర్త లున్నట్లు కాన్పింపదు. కృతికర్తలు చరిత్రకారులు వ్యాసకర్తకు పూర్వులై యుండిరి. ఉద్రేకాదులకు లోనుగాక వ్యాసకర్త శాంతచిత్తుఁడై విశ్రాంతి నొందియుండును. అతఁడు నూతనకల్పనలకుఁ దొడంగక ఇదివఱకున్న విషయజాలమునకు వ్యాఖ్య లొనరించుచుండును. గ్రంథకర్తలు, గ్రంథరసగ్రాహులు దేశమందు ప్రబలినపిమ్మటనే, వ్యాసకర్త తనరచనలు ప్రకటించును. అతని రచనలు “ఇతిహాస” భూయిష్ఠములు. వీని నెల్ల పాఠకులు గ్రహించి తదనుసరణమును గావింపవలెను.”

## ఆంధ్రవ్యాస రచనా ప్రారంభము

ఆంగ్లేయ పరిపాలనయు, తద్విద్యాసంపర్కజనితనాగరికతయు ఆంధ్రవ్యాసరచనకు మూలకారణములు. ప్రప్రథమమున చెన్నపురి, బందరు, రాజమహేంద్రవరము మున్నగు పట్టణములలో ఆంధ్రవార్తాపత్రికలు స్థాపితములై కాలక్రమమున ప్రబలినవి. అందలి సంపాదకీయోపవ్యాసములు వ్యాసరూపమునకే యొండుచు వచ్చినవి. ఆకాలమునఁ బ్రచురింపఁబడిన శ్రీయుత చిన్నయసూరి నీతిచంద్రికయీ వ్యాసశైలికి మార్గదర్శక మయ్యెను. బందరునందలి ‘పురుషార్థప్రదాయిని’ చెన్నపురియందలి ‘ఆంధ్రభాషాసంజీవని’ల నీ సందర్భమునఁ బేర్కొనవచ్చును. ఈ రెండు పత్రికలకును మఱికొన్నింటికిని రాజమహేంద్రవరవాస్తవ్యుఁ డొకయువకుఁ డాకాలమున తఱచుగ చిన్నవ్యాసములు వ్రాయుచుండెను. పిమ్మట తానే పత్రికాధిపతియై, ‘వివేకవర్ధని’ యను పత్రికారాజమును బ్రకటించెను. ఆయువకుఁడే వీరేశలింగకవివరుఁడు.

అప్పటికి ముఖ్యముగ నా కవిపుంగవుఁడు పద్యకావ్యములే రచించుచుండెను. పత్రికాముఖమున పద్యరూపముననే పలుమారు తన యభిప్రాయప్రకటనముఁ గావించుచుండెను. క్రమముగ సాహిత్యాంశములనుండి యాయన సాంఘికాంశములకు దిగవలసి వచ్చెను. ఆనాఁడు వారిగద్యశైలి చిన్నయసూరిశైలి ననుసరించి యుండెడిది. తఱచుగ వ్రాయుచుండుటవలన వారిశైలికి మార్దవ సౌలభ్యము లేర్పడినవి. వివేకవర్ధనీప్రథమభాగములకంటె తరువాత వానియందు ఆయనరచనలు భావముననేగాక భాషయందును మెఱుగు దేరెను.

1878-79 వ సంవత్సరములనాఁటికి కాలము చాలవఱకు మారిపోయెను. వార్తాపత్రికలు పలుచోట్ల స్థాపితము లయ్యెను. మత, సాంఘిక, రాజకీయవిషయములు జనులహృదయముల నాకర్షింపసాగెను. వీరేశలింగముపంతులు నెలకొల్పిన వితంతువివాహాదిసంస్కరణములును, ఏతద్విషయమై యాయన రచించిన వ్యాసాంశములును, ప్రజలు బాహాటముగఁ జర్చింపసాగిరి. ఇట్లు పత్రికాప్రకటనము, సంఘసంస్కరణమును ఆంధ్రవ్యాసరచనమునకు ప్రబలము నుద్బోధకము లయ్యెను.

## ఆంధ్రవ్యాసచరిత్రము

వీరేశలింగకవి ఆంధ్రవ్యాసకర్తలలో ప్రథముఁడని చెప్పవచ్చును. ప్రథమమున పద్యరచనయే యాయనకుఁ బ్రియమైనదైనను, సంఘసంస్కరణాభిలాష ఆయన హృదయమున నావిర్భ

## వ్యాస రచనము

పట్టి మూత్రపతనమునను, విధానవర్ణనాక్రమమునను ఏకృతి యందైన నిపుణత చేయరాదు. గ్రంథరచనమునకు స్వభావజన్యము లగు శక్తి రుచులును, విద్యావ్యాసంగములవలన లభించిన రసజ్ఞతయును ఆవశ్యకములు. ఆంధ్రభాషలోను ఇంగ్లీషు సారస్వతమందును గల గొప్ప వ్యాసముల పరిచితి యత్యావశ్యకము. పలువిధ హాస్యరసమును మెలకువతోఁ బ్రయోగింప నేర్చియుండుట అత్యావశ్యకము. స్వాభావికముగ జిహ్వకు మాధుర్యము రుచికరమైనను, మితిమించిన నదియె మొగము మొత్తును. జీవితయందుకు శోషిల్లిన బాలునకు నిమ్మరసముతోఁ గూడిన గోరస మింపనునట్లు సంసారమున విసిగి వేసారిన మనస్సునకు మృదువగు రచనాచమత్కృతి హృద్యముగ నుండును. గ్రంథరచనకు తదభిలాషాధిక్యమును విశేషానుభవమును ముఖ్యములు. తాము చేతులార నాటిన యమూల్యాంకురములను మిగుల జాగరూకతతోఁ బెంచెడి కర్షకునివలె వ్యాసకర్త తన రచనాకౌశలమును నన్నిటఁ బెంపొందించుకొనుచుండును.

వ్యాసమునకు రచయితయొక్క వ్యక్తిత్వము ప్రధానము. జీవితమును గుఱించియు, వ్యాసవిషయమును గూర్చియు నతని యాలోచనలును, అతని భావపరిణామమును ముఖ్యములు. తన యభిప్రాయముల నెట్లు ఉపక్రమించి, సాగించి యుపసంహరింపవలయునో యతఁ డెఱిఁగి యుండవలె. మెలకువలను గ్రహించుచుండవలయును. భూమి లోనికి బాగుగ వేళ్లుపాఱిన వృక్షము, నలువైపులకును వ్యాపించెడి రమ్యములగు కొమ్మలు, జీవకళతో నొప్పెడి కోమలములగు పర్ణములు, సువాసనలు వెదజల్లెడి సుందరకుసుమములు, జంతుసంతానమున కాదరువగు స్వాదుఫలములును దాల్చియుండెడికీతిరి, వ్యాసరాజము విషయప్రాశస్త్యము సత్యనిరూపణమును ముఖ్యముగఁ గలిగి, విశాలభావములతోను లలితపదములతోను నొప్పి చదువరుల కానందమును లాభమును జేకూర్పునట్టిదిగ నుండవలయును.

---

పరిశోధక మహాశయుడు (The Research Worker)



# స్వభావోక్తి

కల్లూరి వెంకట సుబ్రహ్మణ్య దీక్షితులు గారు

కవి చిత్రకారుఁడు నను నిద్దఱును బ్రకృతిపరిశీలకులు. పూఁదేనెం దుమ్మెద యాస్వాదించున ట్లెల్లవస్తువు లయందలి సౌందర్యసారమును గ్రహింపఁగల నేర్పువీరిది. దీనింబట్టి స్థాయిభావపరిణామకారణములగు విభావాను భావాదుల నుచితరీతిం బోషించి సహృదయహృదయా హ్లాదకరమగు నిర్భరానందసంవిద్రూపరసపరిస్ఫూర్తిఁ గావించుటలో వీరి నైపుణ్యమునందుఁ బరస్పరసామ్య ము గన్పట్టును. అదిగాక కవి కావ్యమునందును, చిత్ర కారుఁడు చిత్రరచనమునందును నారాధింపవలసిన రసాధి దేవతామూర్తి యొక్కటి యగుటచే వీరికిఁ బరస్పర సహకారము నుపకారి కావచ్చును. రసపరిష్కృతము లగు నిర్మలహృదయముకురములం దనేకచిత్రవిచిత్రా కృతులు ప్రతిబింబించుచుండును. కల్పనాపటిమచే వింత మెఱుఁగుఁ గూర్చి రసజ్ఞలోకమున కయ్యాకృతుల నెఱుకసేయుటకు వలయు నైసర్గికప్రతిభ వీరిపాలి సొమ్ము. సాధారణజనులవలెఁగాకఁ దొల్తఁ దమ హృదయఫలక మునం దీర్చి దిద్దుకొనిన యాకారమునుగాని, భావమును గాని యినుమడించినశోభతో వాచికముగా సాక్షాత్కా రింపఁజేయఁగలవాఁడు కవి. జీవకళ లుట్టిపడఁ జిత్రింపఁ గలవాఁడు చిత్రకారుఁడు. వీరిలోఁ జిత్రకారునకు రసజ్ఞ లోకమును సమ్మోహింపఁజేయఁ బ్రధానసాధనము "స్వభావకథనము". ఇతని నిసర్గప్రతిభాసంరంభవిభ్రాం తికిఁ బరమావధి యయ్యదియ.

"అవస్థానుకృతిర్నాట్యమ్" అనుటచే ననుకా ర్యుల యవస్థాస్వరూపముల ననుకరించి ప్రేక్షకసమాజ మును జొక్కించు నటకునకు నీ "స్వభావకథనమే" పర మావధి. అట్లే —

కవిప్రయత్నమునకు నీ "స్వభావోక్తి" ప్రధాన పరికరము. నిసర్గప్రతిభాపరమావధి కధీనములైన యాకా రములను, భావములను విదగ్ధజనమనోహరముగ నపూర్వ రచనావైచిత్రిని ననువుపఱచి శబ్దార్థముల మూలమునఁ బలుకనేర్చిన కవి ధన్యుఁడు. వింతసొంపుల నింపు నాతని పలుకులే కావ్యశోభాకరములగు నలంకారములు. ప్రకృతి కైకగోచరమగు సహజస్వరూపము నిచ్ఛావిలాసముగా మెఱుఁగుసొబఁగులు తులకింపఁ బలుతెఱఁగుల నలంక రించుట కలంకారపరికరము కావలసినంత కవిసృష్టిలోఁ గలదు. అందీ స్వభావోక్తి యున్నతస్థాన మాక్రమింపఁ గలదు. రసపరికరములగు విభావానుభావాదుల మనోజ్ఞ స్వరూపము నీయలంకారము నిరూపించునంత తేటగను, సూటిగను తక్కింగల యలంకారములు నిరూపింపఁ జాలవు. స్థాయిభావవికాసమున కిది ముఖ్యసాధనము. రసికబృందమున కీ యలంకారమునం దాదర మెక్కుఁ డగుట కిదియే కారణము. మనుచరిత్రమున శృంగార రసపోషణకు వలయు పరికరముం గూర్చుటకు—

సీ. కులిశధారాహతి పొలుపుఁజెడి నుండి
యడుఁగుమోవఁగ జేగురైనతటులఁ
గనుపట్టులోయగంగాడ్రరమువారఁ
జలువయూనయ్యేటి కొలఁకులందు
నిసుకపెట్టినసేల నేదియర్కాంశులఁ
జొరనీక దట్టమై యురులుగవియు

క్రముకపున్నాగనారంగరంభానాళి
  కేరాదివిటపికాం తారవీథిఁ
గెరలు పికశారికాకీరకేకిభృంగ
పారపధ్వని తవలోని చంద్రకాంత
దరులు ప్రతిశబ్దమీన గంధర్వయుత
గానఘూర్ణితమగు నొక్కకోనఁ గనియె.

అని యొక యపూర్వదృశ్యమును కవి స్వభావోక్తి మూలమునం గల్పించెను. ఇదితప్ప యుపమ లెన్నిఁ జెప్పినను, యుత్ప్రేక్ష లెన్నిఁగూర్చినను, శ్లేషచమత్కృతు లెన్నిఁ గుమ్మరించినను మఱి యేయలంకారముల జెసంగు హావణించిన నిట రసోదయము కాదు. సమయోచితముగ స్వభావోక్తి రాణించును. ఆంధ్రకవితాపితామహుఁ డిట్టిసమయములఁ గుర్తించుటలోఁ గడునేర్పరి. అతని —

" తతనితంబాభోగధవళాంశుకములోని
  యంగదట్టపుకావి రంగువలన "

" అబ్బురపాటుతోడ నయనాంబుజముల్ వికసింప "

" చూచి ఝుళంఝుళత్కటకసూచితవేగ పదారవిందమై "

అను పద్దెములందలి స్వభావోక్తుల రామణీయకం బపూర్వమై సమయోచిత మగుటచే సహృదయుల నధికముగా నాకర్షించుచున్నది.

ఈ యలంకారము కేవలరసోపస్కారహేతువే కాక కవికాలమునందలి నాగరికత, శిల్పాదికళల యభివృద్ధి, ఆచారాదర్శములు, రాజ్యాంగపద్ధతులు మొదలగు చరిత్రాంశముల నందందు నిరూపించుటకు ముఖ్యసాధన మగుచున్నది. దానంజేసి కవికిఁగల లౌకికజ్ఞానసంపత్తి వెల్లడియగుటయు, పాఠకునకుఁ బ్రాచీనచరిత్రావబోధమై లోకవ్యవహారజ్ఞానము చేకూరుటయుం దటస్థింపఁ గలదు. అపుడుగాని కావ్యప్రయోజనము సాకల్యముగ ఫలింపదు.

మనుచరిత్రకారుఁడు వరూథిని గట్టుకొన్న వస్త్రమును వర్ణించుటంబట్టి పురాతనకాలమునుండియు స్నిగ్ధములు సుస్నితములు నగు వస్త్రములు తయారగుచుండెడి వని నేటి చరిత్రకారులు సిద్ధాంతీకరించుట కవకాశము కలిగినది. రామాయణాదికావ్యముల యందలి స్వభావోక్తులంబట్టి శిల్పాదికళల యభివృద్ధి నిరూపింపఁబడినది. శ్రీనాథుఁడు మొదలగుకవుల చాటుపద్యములును, విశ్వగుణాదర్శమువంటి గ్రంథములును స్వభావోక్తులచే నత్యంతరమణీయములై యట్టి చారిత్రాంశములను బోధించుచున్నవి. కవికి నైసర్గికప్రతిభ, కూలంకషమగు శాస్త్రపరిచితి, లోకజ్ఞానము, వాక్పాండిత్యము అను వీనిలో నేదిలోపించినను స్వభావకథనము లోకోత్తరచమత్కారి కానేరదు. కవికిఁగల వాక్పాండిత్యమును, ప్రతిభావిశేషమునుఁ బరీక్షించుట కిది గీటురాయి యనవచ్చును. అందుచేఁ బ్రాచీనాలంకారికు లిద్దాని నాద్యలంకృతియని వక్కాణించి దీని కుపమాదు లన్నిటికంటె బ్రాముఖ్యమిచ్చిరి.

కావ్యాదర్శమున —

" నానావస్థం పదార్థానాం రూపం సాక్షా ద్వివృణ్వతీ
  స్వభావోక్తిశ్చ జాతి శ్చేత్యాద్యా సాలంకృతి ర్యథా."

అని దండ్యాచార్య లీ యలంకారలక్షణమును దొల్త వివరించుటలో నీ విశేష మిమిడియున్నది. "ఆద్యా" యను కంఠోక్తి దానిని మఱికొంత స్పష్టముచేయుచున్నది.

ఇట్లుండ నవీనులు :—

" తత్ర ప్రథమ మనేకాలంకారబీజభూతత్వా దుపమా నిరూప్యతే "
(విద్యానాథుఁడు.)

అని యుపమాలంకారమును మొదటి దనిరి. అనేకాలంకారబీజభూత మనుకారణముచే నావిషయమును సమర్థించి స్వభావోక్తిని దూరముగ విసరిరి. అందుచే నర్థాలంకారము లుపమాదు లైనవి. ఈవిషయ మెంతవఱకు సమంజసమో చూతము.

ఉపమాలంకార మనేకాలంకారబీజ మఁట; అగుఁగాక ! ఉపమకుఁగూడ బీజ మగుచున్నది స్వభావోక్తి.

ఏలన:—ప్రకృతాప్రకృతములకు సామ్యము వాచ్యమగుచో నుపమ యగునుకదా! అట్లగుచో ప్రకృతమనఁబడు వస్తువుయొక్క సంపూర్ణస్వరూపము కవిప్రతిభాగోచరమైనపుడుగదా అప్రకృతముతో సామ్యము వాచ్యమగుట. ముఖస్వరూప మిది యని నిర్ణయింపఁబడినమీఁదట నది చంద్రునివలె నున్నదనుట పొసఁగునుగాని వర్ణ్యస్వరూపానుభవము లేనప్పుడు సాదృశ్యప్రసక్తి యెట్లు? అందుచే వస్త్వవస్థా స్వరూపానుభవము నున్నదున్నట్లు వివరింపనేరని కవి కుపమాదులతోడి సంబంధము నపుంసకవధూకాంతుఁడే యనఁదగు. ఒకవేళ పూర్వకవిసాంప్రదాయములను, గమనికలను గుర్తించి వారి భావములను, పదములను సేకరించి "పులినిజూచి నక్క వాఁత పెట్టుకొన్నట్లు" ముఖ మిందుబింబమనియు, కనులు కలువరేకులనియు నల్లిబిల్లిగ నాల్గుపదము లల్లవచ్చునది కవిత్వమా? ఆయలంకారములు కవిప్రతిభావిశేషసూచకములా? కావు.

ప్రకృతిసుందరములగు సవయవసంస్థానములు గల మూర్తి నలంకరించుటకు హారనూపురాద్యలంకారము లెట్టివో కవిప్రతిభాగోచరములగు విభావానుభావాదుల నిసర్గసుందరస్వరూపము నలంకరించుట కుపమాదు లట్టివి. అనఁగా జాతిక్రియాగుణద్రవ్యభేదముచే నలుతెఱంగులైన విభావానుభావాదుల యవస్థాస్వరూపములను రసజ్ఞలోకమునకు సులభముగ బోధించి రసానుభవముఁ జేకూర్చుట కుపమాదులు సాధనము లగుచుండును. కవి వివక్షిత మిందు స్వభావోక్తియే యగును. అందుచే నలంకారము లన్నిటికి స్వభావోక్తి బీజ మగుటలో సందియము లేదు.

"శంపాలతికతోడి జలదంబుకైవడి
మెఱుఁగుటొల్లియతోడి మేనివాని"

అని పాడుకొను కవీంద్రుని హృదయముకురమునఁ దొల్తఁ బ్రతిబింబించినది 'మెఱుఁగుటొల్లియతోడి మేని వాని' సొబఁగుకాని, మెఱుపుతోడి మేఘంబు గాదు. ఆప్రతిబింబితాకృతినే యాతఁడు ప్రధానముగా రసజ్ఞలోకమున కెఱుకపఱుపఁ దలఁచినదియు. అందుల కొకపోలిక గొనితేఁగోరి ప్రకృతినొక్క మాఱు సింహావలోకముం గావించి మెఱుపుదీవపొత్తు గల మేఘంబు నేర్చికూర్చి రసజ్ఞులకు స్వప్రతిభైకగోచరమగు మూర్తి నతిసులభముగాఁ బ్రత్యక్షము సేసినాఁడు. ఇం దుపమాలంకారమునకు స్ఫూర్తియున్నను స్వభావోక్తియే యిం దతిసుందరముగ గోచరించుచున్నది. ఇట్లలంకారజాతమునెల్లఁ దఱచిన నీ స్వభావోక్తి దానిలో నంతర్బింబితమై కన్పట్టకమానదు.

మేఘసందేశమున —

"తస్యాః కించిత్కరధృత మివ ప్రాప్తవానీరశాఖం
హృత్వానీలం సలిలవసనం ముక్తరోధోనితంబమ్
ప్రస్థానంతే కథమపి సఖే లంబమానస్య భావి
జ్ఞాతాస్వాదో వివృతజఘనాం కో విహాతుం సమర్థః"

అని కలదు. సృష్టిం దలక్రిందసేయఁగల నిసర్గప్రతిభాసంపన్నుఁడగు కవిబ్రహ్మ యొకవిధమగు సృష్టినిర్మాణమునం దృప్తినందఁజాలఁడు. అందులకుఁ దన కావ్యసృష్టియం దత్యద్భుతనూతనదృశ్యములం గల్పించుకొని వినోదించుచుండును. ఆతని వినోదము సహృదయహృదయాకర్షకమైనది.

ఈ శ్లోకమున — గట్టుక్రిందకుం దిగిన గంభీరానదియు, నందుఁ దేరిన నల్లనీటిపైకొఱఁగిన వేతసశాఖయు, నందు పైపై నలముకొనిన మేఘంబునుఁ గల యొక మనోహర ప్రకృతిదృశ్యము ప్రత్యక్షీకరింపఁబడినది. భావనాప్రపంచమున లీనుఁడైనపుడు స్వప్రతిభలో గోచరించు నైజస్వరూపమును వెల్లడించుటయే కవియొక్క ముఖ్యోద్దేశ్యము. అగుచో నిది స్వభావోక్తియే యగును. అయిన నిది స్వభావోక్త్యలంకార మనఁజెల్లదు. కవిప్రతిభ యంతటితో విశ్రమింపలేదు. స్వభావసిద్ధమైన పూర్వదృశ్యము కావ్యసృష్టిలో నొక వింతపరిణామము నొంది నూతనదృశ్యముగాఁ గన్పట్టుచున్నది. ఇందు

నమ్మకమైన

# క్రాస్లీ ఇంజన్లు

నానాదేశములందు ప్రసిద్ధిచెందినది.




## దృఢమైన నమూనా—క్రమమైన సామగ్రి

మొదటితరగతి పనితనము

సులభము — ఎక్కువకాలము మన్నును — మితవ్యయము

**2½ బి. హెచ్. పి. నుండి అంతకు పైన గలవు.**

అన్ని రకముల ఫ్యూయల్సును యుపయోగింపవచ్చును,

# క్రాస్లీ బ్రదర్సు లిమిటెడ్.,

**14. బ్రాడ్వే, మద్రాసు.**

ఆంధ్రజిల్లాలకు ఏజంట్లు:—

మెసర్సు పైడా చినవెంకటరమణన్న బ్రదర్సు,

యక్స్పోర్టర్లు అండ్ యింపోర్టర్లు, కాకినాడ.

## ది గ్రేట్ ఈస్టర్న్ లైఫ్ అస్యూరెన్సు కంపెనీ, లిమిటెడ్.

(స్ట్రెయిట్సు సెటిల్‌మెంటులో ఇన్‌కార్పొరేట్ చేయబడినది) (ఇంగ్లాండులో రిజిష్టరు చేయబడినది.)

ఉత్తరువు పొందబడిన మూలధనము 250,000 — వసూలుచేయబడిన మొత్తము 142,010

మూలధనము రు 1,40,00,000 లకు పైబడి యున్నది.

భీమాచేయబడిన మొత్తం రు 5,00,00,000 లకు పైబడినది.

చెల్లింపబడిన హక్కుల మొత్తం రు 70,00,000 లకు మించియున్నది.

ఇది ఆదర్శప్రాయమగు పాలసీ—పాలసీని రద్దుచేయకూడదు.

మా ప్రత్యేకసదుపాయములు—ఆకస్మిక ప్రమాదములు, వ్యాధులకు రక్షణ, ఉద్యోగము, కాపురము వీటితో జోక్యము లేకపోవుట, స్త్రీల జీవితములు సహితము భీమాచేయబడును.

ప్రావిడెంట్ కోరకులు! — పూచీగల సౌకర్యములు!!

భీమాచేయించుకొన్నవారు 60 సంవత్సరముల వయసుకు లోబడి శాశ్వతదౌర్బల్యము గాని అశక్తిని గాని పొందినచో, మరల ప్రీమియములు కట్టవలసిన పనిలేదు. ప్రతిసంవత్సరము కంపెనీవారే అతని ఆయుష్కాలమున భీమా మొత్తమునకు పదవవంతు ప్రకారం ప్రతిసంవత్సరము పదిసంవత్సరములకు చెల్లించుచున్నారు.

లభించిన ధనము భారతదేశమందే వడ్డీకియ్యబడును.

ధారాళమైన పద్ధతులపై పనిచేయు ఏజంట్లు కావలెను. ఇతర వివరములకు ఈక్రింది విలాసములకు వ్రాయవలెను.

బ్రాంచి మేనేజరు: ఎం. వి. మర్చంటు, 50, 52 చర్చిగేట్ వీధి, ఫోర్టు, బొంబాయి

చీఫ్ ఏజంటు: ఆర్. వెంకటాచారి, లిబర్టీ హౌస్, వేపేరి, మద్రాసు.

---

# CHEVROLET LUCKY CONTEST

## FOR BUS & LORRY OWNERS




## $1\frac{1}{2}$ ton Chassis to be Given Away

# FREE

*Ask for Particulars:—*

## BYRAMSHAW & Co., Ltd.,

29, General Patters Road,

Mount Road, MADRAS.

Telephone:—3157. Telegrams:—"MINORU".







౧. ఆంధ్రచిత్రకళాశాల, కాకినాడ. (M. S. N. Charities)
౨. ఆంధ్రమహాసభ, చెన్నపురి 1930. నాటకశాఖ-నటబృందము.










౧. స్త్రీల స్వదేశీలీగు-మైలాపూరు, చెన్నపురి. ౨. శ్రీమతి కొమాండూరు రంగనాయకమ్మగారు.
3. గాంధి స్పిన్నింగ్ ఆశ్రమము, 29, వెంకటరంగంపిళ్లవీధి, తిరువల్లిక్కేణి-చెన్నపురి, స్థాపకులు : ప. పురుషోత్తంగారు.

గంభీరానది గంభీరనాయిక యైనది. ఒడ్డుక్రిందనున్న నల్లనీ రామెనితంబమును వీడిన విరహసూచకమైన నల్లని వలువయైనది. నీటి కొఱఁగిన వేతసశాఖ వస్త్ర నిరోధక మగు నామెహస్తమైనది. మేఘుఁడామెకు నాయకుఁడయ్యెను. కవిబ్రహ్మయొక్క యీవినూత్నశిల్పనా కౌశలమున శృంగారరస ముద్దీపితమైనది. రూపకార్థాంతరన్యాసాలంకారము లిందు బహిర్వ్యక్తములై ప్రాధాన్యము వహించినవి. అందుచే నూత్నశిల్పమునకుఁ బునాది యని స్వభావోక్తి ననవలసియుండును.

అనుకరణప్రధానములగు దృశ్యకావ్యములయం దీ స్వభావోక్తి మిక్కిలిగఁ గూర్పఁబడును.

కాళిదాసుని శాకుంతలమున :—

"దర్భాంకురేణ చరణః క్షత ఇత్యకాండే
తన్వీ స్థితా కతిచిదేవ పదాని గత్వా
ఆసీ ద్వివృత్తవదనా చ విమోచయంతీ
శాఖాసు వల్కల మసక్త మపి ద్రుమాణామ్."

గీ. చరణమునఁ గ్రుచ్చికొనెఁ గుశాంకురమటంచుఁ
గొన్నియడుఁగులె నడచి యా కొమ్మనిలిచె
తరువు శాఖల వస్త్రంబు దగులకున్నఁ
దీసికొనుదానివలె వెన్కఁ దిరిగిచూచె. (క.పీ.)

అని గలదు. శృంగారరసాధిదేవత యిందు సహజస్వరూపమునఁ దాండవించుచున్నది, నాయికయొక్క తాదాత్వికావస్థాస్వరూపము నతిసుందరముగఁ బ్రత్యక్షీకరించుటలో కవిప్రతిభ కిందుఁ బూర్తియైన పని కుదిరినది. అత్యద్భుత సంవిధానముచే నాలంబనవిభావముయొక్క సహజసౌందర్యసామ్రాజ్యము కవివాక్పుణ్యముచే మెఱుఁగుదీరి యొక్కింత వింతరామణీయకము నెనయ నఖండబ్రహ్మానంద సబ్రహ్మచారియగురసము జాలెత్తినది. సహృదయహృదయములయందలి హర్షాంకురముల కది జీవము.

స్థాయిభావవికాసమునకు నీ స్వభావకథనమే హేతువనుటకు,

"రాజా-సఖే! తపస్విభిః కైశ్చి త్పరిజ్ఞాతోఽస్మి
చింతయ తావత్కేనాఽపదేశేనసకృద ప్యాశ్రమే వసామః"

అను నాయకుని వాక్యము గుర్తు. తరంగితమగు రసప్రవాహమున నుబ్బూతలూగుచున్న యాతని డెంద మిప్పుడు నిశ్చయస్థానము నధిగమింపఁగలిగినది. 'కుంభగత ప్రదీపకళికాశ్రీ దోఁప నేకాగ్రత న్నిర్వృతిఁ జెందుట' యన నిదికదా! కాదేని యేదేని మిషపెట్టియైన నిటనుండుమను నుత్కంఠాసూచకవాక్యము బయల్పడు టెట్లు? ఇది స్వభావోక్తివలనఁ గలిగిన పరిణామము. ఈస్వభావమును నటకుఁడుగూడ సరసముగా ననుకరింపగలిగెనా, సామాజికుని భాగ్యవిశేష మేమని చెప్పవలయును. ఇట్లు విభావానుభావాదిసామగ్రిఁ బోషించి సహృదయులఁ జొక్కించు నీ స్వభావోక్త్యలంకారప్రాగల్భ్యమును శృంగారాదినవరసక్రమమున వివరించుటకు తావు చాలదు. కాళిదాసాదుల రచనలయం దీ స్వభావోక్తుల పొందిక లనంతములు.

సగుణారాధకుల కీ యలంకారమునం దభిరుచి మెండు. లక్ష్యముం జూపినఁగాని వ్యాకరణసూత్రార్థ మవగాహన కానివడువునఁ దా మారాధించు దేవతామూర్తి కనులఁ బొడకట్టినఁ గాని భక్తిరసానుభవము సిద్ధింపదు. భక్తిరసానుభవమునకు మూర్తిసాక్షాత్కారమే పరమావధి కదా! భక్తిరసప్రధానమగు శ్రీకృష్ణకర్ణామృతమునం దీస్వభావోక్తు లతిసుందరములు ననేకములును.

"అంసాలంబితవామకుండలధరం మందోన్నతభ్రూలతం
కించిత్కుంచిత కోమలాధరపుటం సాచిప్రసారేక్షణమ్
ఆలోలాంగుళిపల్లవై ర్మురళికా మాపూరయన్తం ముదా
మూలేకల్పతరో స్త్రిభంగిలలితం జానే జగన్మోహనమ్."

ఉ. మూఁపున వామకుండలము
మోవి నొకించుక మోడ్పునందముం
జూపెడు నోరచూపు సొగ
సుంబొమ నొక్కట నిక్క గన్పడం

గ్రేవులు పొక్కఁ గల్పికము
క్రిందఁ ద్రిభంగిగ నిల్చి యంగుళీ
వ్యాపితవంశపూర్తి యయి
వర్తిలు మోహనమూర్తిఁ గొల్చెదన్.

అని చిన్నికృష్ణుని సహజసుందరస్వరూపము నత్యంతరసోద్దీపకముగఁ జిత్రించి స్వప్రతిభాగోచరమగు మూర్తి నింతకంటెఁ దెలుపఁజాలనో యనునట్లు, "జగన్మోహనమ్" అను పదముచే స్వసంరంభమున కవధిఁ గల్పించికొనినాఁడు కవిపుంగవుఁడు. ఆంధ్రీకరణము నత్యంత రమణీయముగ నున్నది. "గ్రేవులుపొక్క" అను పదము మూలాధికమయ్యు నంకముఁ గూర్చినది. ఇచటి స్వరూపము చిత్రకారునకుఁ జక్కనిపనిఁ గల్పింపఁగలదు.

పరమభక్తాగ్రేసరుఁ డగు పోతన మహాకవికి స్వభావోక్తి ప్రియతమము. అతని గ్రంథమునం దతిలలితము లైన స్వభావోక్తు లనేకములు గన్పట్టును.

చూడుఁడు :—

ఒకచెలికానిపై నొకచేయిఁజాచి వే
ఱొకచేత లీలాబ్జ మూఁచువానిఁ
గొప్పునకుం దని కొన్ని కుంతలములు
చెక్కుల నృత్యంబు సేయువాని
గుఱుచమంగులుపుచ్చి కొమరాఱఁగట్టిన
పసిఁడివన్నియ గల పటమువాని
నొసలఁ దిరిగిరా నలవడఁ జుట్టిన
దట్టంపుఁ బింఛపు దండవాని
రాజితోత్పలకర్ణపూరములవాని
మహిత పల్లవపుష్పదామములవాని
భువనమోహన నటవేష భూతివానిఁ
గనిరి కాంతలు కన్నుల కఱవు దీర.

కనినవారు కాంతలే కాదు; కవియు, మనమును. ఇచట గోపికావల్లభుని సహజస్వరూపము కనుపొంపుగఁ గన్పట్టుచున్నది. కవిహృదయమునం దోచుచున్న మూర్తిని సంపూర్ణముగఁ జిత్రించుటకీ పద్యఫలకము చాలనే లేదంటకు "కన్నుల కఱవుదీర" అనుపదమే నిదర్శనము.

అదిగాక భువనమోహననటవేషుని మూర్తిం బూర్తిగ నిరూపింప నితరతరము?

అత్యంతరసోపస్కారకారణమై పండితపామరజన సామాన్యము నానందింపఁ జేయుటలో స్వభావోక్తికి మించిన యలంకార మొండు గానరాదు.

భాగవతమున నీకవి కృష్ణుని శైశవమును వర్ణించుటలో :—

కనుపున దింపుగాఁ గట్టినవలువలో
లాలితవంశనాళంబుఁ జొనిపి,
విమలశృంగంబును వేత్రదండంబును
జారిరానీక చంకను నిఱికి
మీఁగడ పెరుఁగున మేళవించినచల్ది
ముద్ద డాపలిచేత మొనయ నునిచి
చెలరేఁగి కొసరి తెచ్చిన యూరుఁగాయల
వ్రేళ్లసందులనెల్ల వెలయ నిఱికి
సంగడీలనడుమఁ జక్కనఁ గూర్చుండి
నర్మభాషణముల నగవు నెఱపి
యాగభోక్త కృష్ణుఁ డమరులు వెఱఁగంద
శైశవంబు నెఱపి చల్దిగుడిచె.

అని శ్రీకృష్ణపరమాత్మను లీలామానుషస్వరూపమునఁ జిత్రించుటలోఁ గవిచూపిన వాక్నైపుణ్య మవాచ్యము. గొల్లపిల్లలలో నా భగవానుని, నాయిద్దరిలో పాకకులను సైక్యముగావించుట కీకవి కూర్చుకొనిన పరికరము నిరుపమానము. అప్రాకృతతేజోమూర్తి నాలకాపరిఁ జేసి యా మూర్తియొక్క తొల్లిటివేషమును "యాగభోక్త" యను పదముచే గోచరింపఁజేసి రెంటిలో భేదమునుఁ గట్టకట్ట నిల్పి చూపుటచే నీమహాకవిసంవిధాన మత్యాశ్చర్యకరమైనది. అమరులు వెఱఁగందుటయు నందులకేఁగదా!

ఇట్లు స్వభావోక్తులు కవిప్రతిభనుబట్టి మనోజ్ఞము లై కావ్యలక్ష్మి నలంకరించుచుండును. పూర్వాలంకారికుల మతమున నిది ప్రాధాన్యము వహించుటయు నుచితమే యగును. అభిరుచింబట్టి మతభేదము గాని మతభేదముంబట్టి యభిరుచి కాదుగదా!

# వ్యాకరణ బాహుళ్యము

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

ఇప్పుడు ఊరనూరను వ్యాకరణములు బయలుదేరుచున్నవి. వానిలోఁ గొన్ని పాఠ్యపుస్తకములు నగుచున్నవి. గ్రంథములును పెద్దవియే. గ్రంథములని బయలుదేరినవాని నెల్లఁ జూడవలయు నను కుతూహలము విద్యార్థుల కుంటయు వింత కాదు.

ఈ వ్యాకరణపు బొత్తుల నెల్లఁ జదివినవారికి 'అతఁ డిన్ని వదలెను. ఇతఁ డిన్ని పూర్తిచేసెను. ఆతనిపాండిత్య మట్టిది. ఈతని రచనాశక్తి యిట్టిది. దాని కిది మూలము. దీని కది వివరణము' అను నీభేదములు తెలియవచ్చుట తప్ప మఱొకపురుషార్థవిశేషములు తెలియవు. ఈ సులభవ్యాకరణములును, ఈ పరిమితవ్యాకరణములును, ఈ సంగ్రహవ్యాకరణములును, ఈ భాషానుశాసనములును ప్రాఁతవ్యాకరణములతోఁ జేరి మనకట్టెదుట నుండుతఱి నేదే నొకవ్యాకరణమును శిష్టభాషావివరణచణము నేఱుకొని విద్యార్థులచేతి కందీయవలెను. ఇది 'కొండ త్రవ్వి యెలుకను బట్టుట' యైపోవుచున్నది. ఈ విషయమున, ఇప్పటి యుభయభాషాభూషణపరీక్షలో మొదటి సంవత్సరద్వయమున బాలవ్యాకరణకవిజనాశ్రయములను బాఠ్యపుస్తకములను జేసి రెండవ సంవత్సరద్వయమున నన్నయభట్టీయమును, అప్పకవీయమును బాఠ్యపుస్తకములను జేయుటవంటిరీతులను పాఠ్యపుస్తకనిర్ణేతలు మానుకొనవలయును. వ్యాకర్తలు సైతము పూర్వసూత్రకర్తల మార్గములఁ దెలిసికొని లాఘవప్రధానములుగ వ్యాకరణములను సూత్రీకరించి విద్యార్థుల వృథావ్యాసంగభారమును దగ్గింపవలయును. దీనికై పూర్వులగు నాంధ్రభాషావ్యాకర్తల ధోరణు లెట్టివో, స్వపాండిత్యప్రకటనకుఁ గాక విద్యార్థిజనోపకృతికై భాషాప్రవేశసౌలభ్యమును బ్రాచీనవైయాకరణుల వ్యాకరణప్రణాళిక లెట్లు సాధించెడినో, తెలుపుచు వ్యాకరణబాహుళ్యమును గూర్చి కొంచెము పరిశీలింతము.

విద్యార్థి యనేకజ్ఞానములను సంపాదింపవలసి యున్నాఁడు. అన్నిజ్ఞానములు నొకబాసలో సమకూరుట దుర్లభము. కావునఁ గొన్నిబాసలను విద్యార్థి నేర్చికోవలయును. ప్రస్తుతము మనవిద్యార్థికిఁ గావలసిన జ్ఞానములు సమకూడుటకు సంస్కృతము, తెలుఁగు, ఇంగిలీషు, హిందీ అనుబాసలు నాలుగును తప్పక రావలసినట్లు చెప్పుచున్నారు. అట్టియెడ నొక్కొక్క బాసలోఁ బూర్ణప్రవేశము కలుగుటకుఁ జాలకాలము పట్టును. అట్టిబాస వచ్చుటకు సాధనము వ్యాకరణము. ఆ వ్యాకరణము కొద్దిగా నుండి బాసకు మార్గదర్శిగా నుండవలెను. వ్యాకరణము లేనిబాస - నేర్చుకొనుట యరిది. వ్యాకరణము నేర్చుకొనక, నాలుగు సంవత్సరములకు సాధించెడి భాషను వ్యాకరణముతో నేర్చుకొనుచు రెండు సంవత్సరములలో విద్యార్థి పడయఁగలఁడు. విడివిడిగ నూఱుప్రయోగములనుండి విద్యార్థి సేకరింపఁగల భాషానియమరహస్యమును చిన్నసూత్ర మొక్కటి కరతలామలకముం జేయఁగలదు. భాషలో నర్థనిర్ణయము సేయుటకును వ్యాకరణ మూఁతగఱ్ఱ. కావుననే వేదార్థనిర్ణయసాధనముగ నుండెడి వ్యాకరణమును వేదమునకు రెండవ యంగముగాఁ బెద్దలు పరిగణించిరి. వ్యాకరణ మను పదమునకు వివరించునది యని యర్థము. బాసను వివరించి విద్యార్థికిఁ జూపునది కనుకనే దీని కీపేరు వచ్చినది. ఇంగిలీషుభాష

వ్యాకరణముతోడనే నేర్పఁబడుచున్నది. కావున నది తొందరఁగా బాలురకు వచ్చుచు మాటలాడుటకును వ్రాయుటకును బనికివచ్చుచున్నది. సంస్కృతమును మనము పిల్లలకు వ్యాకరణము లేకుండ నేర్పుచున్నాము. కావుననే ఐదాఱేండ్లకుఁ బంచకావ్యములు నాటకములు చదివి యొకవాక్యమయినఁ దప్పులు లేకుండ వ్రాయలేని వారును, ఒకగంటయేని స్వీయవ్యవహారము మాటాడుకో లేనివారునునై యేకవచనమునకు బహువచనము చెప్ప లేని విద్యార్థులు కొందఱు తేలుచున్నారు. దీనివలన వ్యాకరణము బాసవచ్చుట కెంతముఖ్యమో తెలియఁబడెడి. కాని యేబాస వ్యాకరణమైనను ఆ బాసలోఁ బ్రవేశము రూఢమగునంతవఱకే నేర్పఁబడును. సంస్కృతమున మాత్రము భాష వచ్చినతర్వాతఁ బ్రారంభింపఁబడి అది ప్రత్యేకశాస్త్రముగ నేర్పఁబడుచున్నది. ఆ సంప్రదాయమును దెలుఁగులోనికిఁదీసికొనివచ్చి వ్యాకరణపుఁబొత్తములను బండ్లమీఁదఁ దోలింపవలయు నని యుహోబలపండితుఁడు కొంత త్రోవ త్రొక్కియున్నాఁడు. ఏ నన్నయభట్టీయమునో పరమప్రమాణముగఁ బాణినీయమును సంస్కృతమునకుఁ బెట్టుకొనినట్లు పెట్టుకొని, ఆసూత్రములచేతనే భూతవర్తమానకాలములందలి భాష నెల్ల సమర్థింపఁ బూనితిమేని యాంధ్రవ్యాకరణములోఁగూడ భాష్యములును, పరిభాషేందుశేఖరములును, శబ్దేందుశేఖరములును బుట్టవలసియేవచ్చును. ఎప్పుడును బెరుగుచుండెడి వాడుకబాస కావున దీనికిఁ బ్రతిశతాబ్దియందును వ్యాఖ్యానములు వ్రాయవలసి వచ్చుచునే యుండును. కాని యిట్టి వ్యాకరణబాహుళ్యము తెలుఁగుబాసకు మనము కోరుకోఁదగ్గది కాదు. ఈసుష్క-వ్యాసంగముతోఁ బరిశ్రాంతులైన విద్యార్థుల కైహికాముష్మికపారమార్థికవిజ్ఞానసంపాదనలందు విసుపు గలుగుట మనకుఁ దీఱని యాపద.

వ్యాకరణ లాఘవమునకుఁ బూర్వులు త్రొక్కిన దారులు

1. చిన్నచిన్న సూత్రములతో గొప్పయంశములఁ జెప్పుట.

2. ప్రసిద్ధమగు ప్రాయికభాషకే వ్యాకరణము వ్రాసి విశేషములఁ బ్రయోగజ్ఞానమునఁ దెలిసికొనుఁడనుట.

3. సామాన్యముగ జనులవాడుకలోఁ గల్గెడి తప్పులనుమాత్రము సవరించుచుఁ జెప్పుట.

4. గొప్పగొప్ప భాషాసంప్రదాయసిద్ధాంతముల నొక్కొక్క-మాటతో ధ్వనింపఁజేయుట.

5. ప్రాచీనవ్యాకరణములు చెప్పని యంశములనే వివరించుట.

ప్రాచీనవ్యాకరణనిర్మాతల కెల్ల వ్యాకరణబాహుళ్య మిష్టము లే దనుటకు వారి సూత్రనిర్మాణమొకసాక్షి. సూత్రముల రచించిన పాణిన్యాచార్యుల వారు మఱింత లాఘవమును గోరి యనువృత్తుల పద్ధతిఁ బెట్టుటం జేసి సూత్రముతో వృత్తి వల్లింపవలసిన యావశ్యకత గల్గి లాఘవమును మించిన గౌరవము వచ్చిపోయినది. సూత్రపాఠ మంతయు నష్టాధ్యాయివరుసన వల్లించినవారికైనను ముందు సూత్రము స్మృతికిఁ దట్టును గాని వెనుకటిసూత్రము తట్టదు. కాన వెనుకటి సూత్రములనుండియే తఱచుగఁ దెచ్చుకోవలసి యుండెడి యనువృత్తులు వృత్తి రానిచో స్ఫురించుటలేదు. కావున నత్యంతలాఘవము నపేక్షింపక యేసూత్రమున నాసూత్రపదములతో నన్వయము పూర్తి యగున ట్లుండుట వ్యాకరణలాఘవమునకు గొప్పహేతువు. చాలవఱకు నన్నయభట్టారకుని సూత్రము లీతీరుననె యుండును. కొన్ని సూత్రములను స్పష్టప్రతిపత్తికై గౌరవమును సహించి రచించె. 'భూయడుభయోః' లాఘవాపేక్ష మితిమించి తల పగులఁగొట్టినను అర్థముగాని సూత్రాలు వ్రాసి భాష్యాలకును వ్యాఖ్యానాలకును దారి చూపుట లఘూకరణము కాదుకదా! వ్యాకరణము లఘువుగ నుంటకై నన్నయత్రొక్కినత్రోవలలో నిదియు నొకటి.

మఱియుఁ "ప్రాయికనిత్యప్రయోగలక్ష్మ" అను మాటలచే సుప్రసిద్ధులగు మహాకవులు పలుచోట్ల వాడి

డుప్రయోగములకే వ్యాకరణము గాని దారితప్పి యెక్క-డనో ఒక్క-చోఁ బ్రామాదికముగఁ గాని జాతీయపదప్రీతితోఁగాని లోకోక్తిలోలతతోఁగాని ధ్వనిపరాయత్తతతోఁ గాని వాడినపదములకు వ్యాకరణము వ్రాయఁబనిలేదనియుఁ జాటుపద్యములలోఁ బ్రాస్తావికపద్యములలో మహాకవులు వాడియున్నను గ్రంథస్థములు కానియట్టి వాని కెల్ల వ్యాకరణ మనావశ్యక మనియు సూచన గన్పట్టెడిని—ప్రాయికము లనఁ దఱచు వాడఁబడినవి నిత్యము లన గ్రంథస్థములై చాలకాలము నిల్చునవి.

కొన్ని శ్రీనాథాదుల చాటువులుకూడ చిరస్థాయితను గాంచినవి. కాని వానిని రచించునపుడు కవి గ్రంథస్థప్రయోగములయెడ నున్నంతటి దోషభీతితో నుండఁడు కాన వానిలోని ప్రయోగాలనుబట్టి వ్యాకరణముల రచించి యాదారిని రహదారిని జేయుట నన్నయ కిష్టము లేదు. కావుననే అథర్వణుఁడు మున్నగువారికట్టి దిద్దుటకు వీలు కలిగినది. "నః కా"అని సూత్రి మున్నది. వెదకఁగా వెదకఁగా "నిషధేంద్రుబచ్చునర్క, ఉత్సవము కేళు, అండజాధీశ్వరు కొనఁగ, నగుబాటు కోర్చి"అను నిట్టి ప్రయోగాలు కన్పట్టినవి. ఐనను నగాగమసహితములకుఁ బ్రయోగసమృద్ధి గలదు కాని యితరములకు లేదు. ఇట్టి దిద్దుఁబాటులు కొన్ని తరువాతి కవులనాఁటి వాడుకలు మాఱుటచేఁ గలిగినవి. అది సహజమే. వారినాఁడే విరుద్ధములైన ప్రయోగము లుండునెడ వారిప్రాయికనిత్యప్రయోగలక్షణ పక్షపాతమే అట్టియుపేక్షకుఁ గారణమై వ్యాకరణలాఘవమున కుపకరించిన దనుకోవచ్చును.

మఱియు "అద్దంత్యస్తాలవ్యశ్చుర్వక్రస్యాన్యస్మిథస్య వర్ణశ్చ" అని సూత్రించె. చజలకు 'అఆ ఉఊ ఒఓఔలు కలసినప్పుడు దంత్యత గలుగుచుండ, అకారముతోఁ గూడిన చ జ లు దంత్యము లనెను. ఇ ఈ ఎ ఏలం గూడి చజలు తాలవ్యము లగుచుండ, ఎ ఏలతోఁ గూడినవే తాలవ్యము లనెను. ఇది తెలియక చెప్పె ననుట హాస్యాస్పదము. ఇట్లు చెప్పుటచేత నీయన రచనాపద్ధతి యొక్క కొంత తెల్ల మగుచున్నది. జనుల కుచ్చారణమునఁ బొరపా టెక్కడఁగలుగునో అక్కడనే సవరణలుగ వ్యాకరణము వ్రాసెను గాని 'వాఁడు' అను పదములో వకారమున కొకసూత్రము, డాకు మఱొకసూత్రమును వ్రాసినట్లు వ్రాసి ప్రక్రియను పెంచి యుండలేదని దీనిచేఁ దెలియఁబడును. ప్రౌఢవ్యాకృతిలోని సర్వనామప్రక్రియ యిట్టిది. 'జాణ జడ' మొదలైన పదాలను దాలవ్యయుక్తములుగ వాడుట యిప్పటికిని మాయని వాడుకయై యున్నది. మఱియు చేప, జేన, చేద చేట మొదలైనవి A కు సరిపోయెడి యాకారముతో నుచ్చరించుట యిప్పటికిం గలదు. "చెలువులసాకిరి చాయమగఁడు" అను యతి యిట్టిదోషముననే గల్గె. వీని సవరణమాత్రమే చేయ నెంచి కడమయచ్చులను సవరణయావశ్యకము కామి వానిపొంతకు నన్నయ పోలేదు. "సర్వత్రాజ్వాత్కా-ర్యం జ్ఞేయం యస్య ద్రుతప్రకృతికేభ్యః" అను సూత్రము సైత మిట్టి సవరణకే యేర్పడిన ట్లున్నది. "అద్యః క్రియాసు" అను సూత్రముచేత నథర్వణాదులవలెఁ బ్రజ యుచ్చారణమును ద్రోసిపుచ్చక ఇతఁడు అతఁడు మొదలైనవానిని యకారాదులగానే తీసికొని వానికి సంధిలో వైరూప్యము రాకుంటకు యకారదృష్టిని నిరసించుచున్నాఁడు. యెతఁడు అనుకొను రోజులలో వచ్చును+యెతఁడు=అను పదములు కలపునప్పుడు వచ్చునెతఁడు అను గ్రాంథికరూపము నిష్పన్న మగుస ట్లెవఁడును సంధి చేయఁడు కదా? మీఁదుమిక్కిలి వచ్చున్యెతఁడు అని గ్రామ్యసంధిని గూడఁ జేయునుగదా? అట్టి వైపరీత్యము భాషకు రాకుండఁ బైసూత్రము "సర్వత్రా" అనునది సవరణచేయుచున్నది. ఈ రీతి నన్నయ్య దగుట తిరమై నచోఁ బరోపకారపరతతప్ప నన్నయయందు స్వపాండిత్యప్రకటనేచ్ఛ యశేషభాషారూపవివరణాగ్రహద్వారమునఁ గన్పట్టఁబోదు. ఆయన సూత్రములు చేసిన లక్ష్యము లెల్ల నిట్టివే యనుట కిప్పటియుచ్చారణము వీలు కలుగఁజేయుటలేదుగాని యప్పటి యుచ్చారణరీతి శాసన పరిశోధనవలనఁ దేలునేని అప్పటి యుచ్చారణము ననుసరించి యే సూత్రములను సవరణకుఁజేసెనో ఏసూత్ర

ములను ప్రసిద్ధప్రయోగములకుఁ జేసెనో మనము తెలిసికొనఁగలము. అన్నియు నవరణలకుఁ జేసినట్లు లేవు. కనుక నీసూత్రము నట్టిది కా దనుట న్యాయ్యముగ లేదు. చుట్టు, చుట్టాలు, జుట్టు మొదలగువానిని దంత్యములనకుంట కితర కారణము గన్పట్టదు. నిరుడు శ్రీయుతులు జయంతి రామయ్యపంతులుగారు తెలిపిన డుబ్బుమార్పుల నాలోచించిన భాషాపరిణామస్వభావము తెల్లమై అప్పటి యుచ్చారణముల నవరణ చేసి సంస్కరించిన రూపములను శిష్టప్రయోగరూఢములను జెప్పుటకే యీ సూత్రములు చాల నిర్మితము లేమో అని మాత్ర మేల తలంపఁగూడదు? తత్సమభాషకే యెక్కువగ వ్యాకరణము వ్రాసి యాచ్ఛికభాషకుఁ గొలఁదిగ వ్యాకరణము వ్రాయుటకును నన్నయ అపేక్షితగ్రన్థనిర్మాణరుచియే కారణ మనుకొనుచున్నాను. నన్నయభారతమునఁ దత్సమములు మూఁడుపాళ్లును, అచ్ఛిక మొక్కపాలును నై యున్నదికదా! అప్పటి గ్రంథములవాడుక యెల్ల నిట్లే శిష్టసమ్మతిం బడయుచున్నట్లు మన మూహించుకొనుట తప్పు కాదు. ఇట్లుండ పొత్తముల వాడుకలో నెక్కువగ లేని యాచ్ఛికమునకుఁ బ్రక్రియాసమృద్ధితో వ్యాకరణములు నింపుట వ్యాకర్తలకు సంస్కార్యమైన గ్రాంథిక భాష కుపయోగించెడి పని కాదు. కావున నిది వదలి తత్సమవిచారణను ముఖ్యముగఁ జేసెను. ఇయ్యదియు వ్యాకరణము కొద్దిసేయురీతులలో నొకటియే.

మఱియుఁ గొన్నిచోట్ల సూచనలతో గొప్ప వ్యాసము వ్రాయఁదగ్గయంశములను ధ్వనింపఁజేసి "సూచనా త్సూత్రమ్" అను నార్యోక్తిని సార్థకముఁ జేసెను. అట్టివానిలో "ప్రవాహినీ దేశ్యా" అను నుడి యొకటి. ప్రవాహమునఁ బ్రాఁతనీరే యెప్పుడు నుండదు. ప్రాఁతది పోవం గ్రొత్తది వచ్చు. అదియుం బోవ మఱొకటి వచ్చు. అట్లే యేకాలమున కెయ్యది వాడుకలో నుండి మహాకవి ప్రయోగములలోఁ జేరుటచే నిర్దోష మనిపించుకొనుచుండునో అట్టి అచ్చ తెలుఁగే మిక్కిలి రసభావాదుల ధ్వనింప జాతీయమై లోకోక్తులై సామెతలై పాలువారుచుండు. నిజమున కీసూచన ననుసరించియే కవిలోకయాత్ర జరుగుచున్నది. ఏకవి తనకాలములోని క్రొత్త జాతీయభాషను, క్రొత్తలోకోక్తులను వాడుకొని రసభావపోషణము నొనర్పలేదు? ఏకవి గిరి గీచినట్లు రేఖామాత్రమునైన నతిక్రమింపక ప్రాచీనకవిప్రయోగపారాయణముతోనే కాలము గడపియుండె? పొంకె, తొట్టి, మెట్టవసీకా మొదలైన యిట్టి పదములచేత నేకవి యిప్పుడు ప్రసాదగుణమును, ద్రాక్షాపాకమును జాతీయభాషలో నిమిడింపఁగలఁడు? కాన యిట్లు ఒప్పుకొని కొందఱును, ఒప్పుకొనక కొందఱును సర్వథా కార్యపథమున శిరసా వహించు పద్ధతి నొక్కపదముతో "ప్రవాహినీ" సూచించుచు వ్యాకరణము నెంత లఘువు చేసెనో మనము గమనింపవలెను. కేవల యచ్చతెలుఁగువేఱునేత యిట్టి యాశయముతోడనే యనుకోవచ్చు. మఱియు "సంకేతితసుప్రసిద్ధమేవ పదం" అనుచోట ప్రకృతవ్యవహారములోనుండి మహాకవి ప్రయుక్తమైనవే వాడవలెను గాని పొంకెవంటిపదాలు వాడఁగూడ దనుచున్నాఁడు. ప్రసిద్ధము=కవిప్రయుక్తము. ఇట్లనుటచేతనే సంకేతిత మను నర్థము వచ్చె. సంకేతితము గాని దానిని మహాకవులు వాడరుకదా! ఇట్టియెడ సంకేతిత మనుట యెప్పుడును భాష ప్రజలసంకేతమునకు గోచరమై యుండవలె నని యాచార్యాశయమై యుండనోపు. అనఁగా అందఱకును వినుటతోడనే యీపదాని కీయర్థమని నిఘంటువులు తిరుగవేయకుండను, అొమ్ముల్లు మురుగ నిఘంటువులు వల్లింపకుండను దెలియవలె నను నాశయముతో ననుకోవలెను. అచ్చతెలుఁగు రామాయణమున తత్సమములను జొరనీమి యను గొప్ప నియమముఁ బెట్టుకొనియుఁ దిమ్మకవి యీ సముదాచారపాలనమునకే ప్రసాదమును బోషించె. అథర్వణాచార్యులవారును వ్యాకరణలాఘవమున కొక మంచిదారి చూపిరి. తెలుఁగు వాడుకభాష కాన సంస్కృతమువలె నాఁగిపోవునది కాదు. కాన యెప్పుడును వ్యాకరణములు పుట్టుచుండవలెను. అట్టి వ్యాకరణములలో పూర్వవ్యాకరణోక్తములు పదియేనుపాళ్లును, తమది

యొకపాలుగను వ్యాకర్త లెల్ల వ్రాయుచున్న గ్రంథము లూరక పెరిగిపోవును. అట్లు గాకుండ పూర్వులు చెప్పని దానినే క్రొత్తవ్యాకర్తలు వ్రాయుచుండిన గ్రంథము లఘు వగును. నేర్చుకొనువారికి సౌలభ్యము గలుగు. ఇట్టి పద్ధతిని దాను నిర్మించి, నడచి, మనకుఁ జూపించినవాఁ డథర్వణాచార్యుఁడు. నన్నయభట్టీయమున నేవి చెప్పఁబడలేదో వాని నెల్లఁ బూస గ్రుచ్చి నట్లు చూపుచుఁ బునరుక్తి లేశ మయినఁ దననుడికారము నంటకుండఁ గారికలను వ్రాసి తెల్గును బోషించినతండ్రి యథర్వణ ముని. ఈ కారికలలో నన్నయోక్తముల కనువాదము లుగనుండినవి యన్నియుఁ బ్రక్షిప్తము లని యథర్వణ కారికల యుపోద్ఘాతమున శ్రీవఝ్ఝల చినసీతారామ స్వామి శాస్త్రిగారు నిరూపించినారు. కాన అథర్వణుఁడు చూపిన లఘువ్యాకరణనిర్మాణరీతి మనము నేర్చుకోఁద గ్గదిగ నున్నది.

వ్యాకరణములు భాసను సాంతముగ నియమింప లేవు

నూతనభావోద్దీపకములగు శబ్దము లెల్లప్పుడును దేశభాషాప్రవాహములఁ బుట్టుచుండును. అట్టిపదములు భాషాసౌభాగ్యవేత్తలగు సహృదయులచేఁ బొత్తములం బ్రవేశపెట్టఁబడి విజ్ఞానుల యామోదములచే గ్రాహ్యము లగు. "సోఽర్థ స్తద్వ్యక్తిసామర్థ్యయోగీ శబ్దశ్చ కశ్చనఅని ధ్వనికర్త. నన్నయ, అథర్వణుఁడు, వెల్లంకితాతంభట్టు, ఎలకూచి బాలసరస్వతి, ముద్దరాజురామన్న, అప్పకవి, అడిదము సూరకవి, కస్తూరిరంగకవి, కూచిమంచితిమ్మకవి, శిష్టు కృష్ణమూర్తిగారు, చిన్నయసూరి, బహుజనపల్లి సీతారామాచార్యులు మున్నగు ప్రాచీనవైయాకరణు లెన్నెన్నిసూత్రాలు వ్రాసినను భారతములోని ప్రయోగములే నిశ్శేషముగ సాధింపఁబడుటలేదు. ఇతరకవుల క్రొత్తభాషను గూర్చియు నిప్పటి యభినవభాషలను గూర్చియు నేమి చెప్పవలె?

కావున వ్యాకరణములు భాష నంతను నియమించి చూపుట కేర్పడ వనియు భాషాప్రవేశమునకు దారి చూపునవి యనియుఁ దేలుచున్నది.

చూడుఁడు—

ఇట్టివెల్ల వ్యాకరణముల కక్లేశముగ లొంగకున్నవి.

| | |
|---|---|
| వినంగఁబడియెఁ | పారిజా. |
| వేశ్వోజ నిచ్చి | భార. ఆది |
| అమ్ముని నాథవరేణ్యుఁడు | ,, ,, |
| ఉండుసంత | |
| కేకయపతులు నాదిగైన | భార. ఉద్యో |
| రావచ్చు | |
| సీతలగొట్ట | |
| కరుణను రాఁబనిచె | భార. అ |
| అయ్యకు విచారము గల్గినయేని | భార. ఉ |
| నిన్నటంగోలె | భార. ఆది |
| ఎందులదానవు | |
| ఏమికారణమున | |
| నీకారణమున | |
| రూపవతియట్టె | |
| మీాయందయుండి | |
| రారమ్ము | |
| మనుమనుమని | |
| యనియనిమెదేని | కళా. |

ఈ యంశమును "పర్యాప్తో మన్మతే తు సంకేతః" అనుసూత్రముతో నన్నయాచార్యుఁడు సూచించె. దీని కహోబలపండితుఁడు "శాస్త్రస్య దిక్ప్రదర్శనార్థత్వాత్. య త్సంకేతితం శిష్టప్రయోగానూహం చ పదం, తత్ప్రయోజ్య మిత్యత్రాస్మాక మభినివేశః" అని వివరించెను. మఱియు నహోబలపండితుఁడు స్వయముగఁ గూడ "ఆద్య ప్రకృతేరపి ప్రయోగానుసారిత్వమేవ" అని "బోధయే త్క్రియదు క్లిష్టో మార్గవిత్సహ యాతి కిం, ప్రమాణ మకలంకస్య పూజ్యపాదస్య లక్షణమ్" అను ధనంజయవచనమును బ్రమాణముగఁ జూపి తెలుఁగు ప్రయోగానుసారి యని యేమిచెప్పవలె ననినాఁడు కైముతికన్యాయముగా. అథర్వణాచార్యులవారును "భాషీయ మమితా తత్ర దేశ్యా చిత్రస్వభావయుక్, తచ్చిత్రతా తు ద్రష్టవ్యా పూజ్య

పాదసుభాషితైః" అనుచో ప్రయోగములవలననే భాషాస్వరూప మశేషముగఁ దెలియఁబడును గాని వ్యాకరణమువలనఁ గా దని తెల్పెను. వ్యాకరణమును గూడ వ్రాసెఁ గాన బాసకు దిక్ప్రదర్శనము సేయునవి వ్యాకరణము లని యథర్వణాశయము వ్యక్తము.

చిన్నయసూరిగారును "రేఫంబులును లఘ్వలఘువులుం దక్కఁగల విశేషంబులు నార్యవ్యవహారంబులం దెలియుట శ్రేయంబు" అని రేఫఅకారనిర్ణయముకై కూచిమంచితిమ్మకవి అప్పకవి మున్నగువారు చేసిన యత్తికోలునుసైత మీసడించుచున్నాఁడు. ఇతరు లక్షరమున కక్షరమునకును ప్రక్రియాసూత్రములను వ్రాసిన యాచ్ఛికసర్వనామములకు శబ్దమంజరిగా వ్రాసి చూపిన సూరిగారికి వ్యర్థవ్యాకరణకల్పన మిష్టము కా దని వేఱుగఁ జెప్ప నేల?

---

పట్టణములలో మోటారుప్రమాదములు లేకుండుటకు కొన్ని సూచనలు





# CITROËN

ధరలు "సిట్రోన్" సరసము

4 సిలండర్లు, 6 సిలండర్లు ఫ్రెన్చి మోటారుబండ్లు, బస్సుఛ్యాసీలు, లారీలు.

బలీయమైన ఇంజన్ — ఉక్కు రేకులతో చేయబడిన బాడి.

**50 మొదలు 70 మైళ్లు వేగము.**

ఒక గాలన్ పెట్రోలుతో 30 మైళ్లకు తక్కువ లేకుండా పోగలిగినది.

కావలసినవారు: మదరాసు మౌంటు రోడ్డులో కార్ ష్టైలు బిల్డింగులో నూతనముగా యేర్పడిన "మోటార్సు లిమిటెడు" కంపెనివారివద్ద చూడవచ్చును,

నెమలి - కృష్ణమూర్తి బి.ఏ., మేనేజరు.

Wanted Agents in Andhra Districts.













౧. శ్రీమతి బి. లక్ష్మీ అమ్మాళుగారు (శ) ౨. శ్రీమతి కమలాబాయిగారు (శ)
౩. శ్రీమతి కృష్ణాబాయిగారు (శ) ౪. శ్రీమతి కమలాబాయిగారు (శ)













౧. శ్రీ కే. జనార్దనరావుగారు. (?) ౨. శ్రీ ఇనటూరి శరభరాజుగారు. (?) ౩. శ్రీ జవ్వాజి అప్పారావు గుప్తగారు. (?)
౪. శ్రీ కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తిగారు. (?) ౫. శ్రీ మాణిక్యంగారు. (?) ౬. శ్రీ జి. రామచంద్రరావుగారు, యం. ఏ. (?)

# పాలకురికి సోమనాథకవి; పంచప్రకారగద్య

బండారు తమ్మయ్యగారు

ప్రాచీనాంధ్రవాఙ్మయస్వరూపము నెఱుంగఁ గోరు వారికిఁ బాల్కురికి సోమనాథుని కృతుల యొక్క సవిమర్శపఠన మత్యంతావశ్యక మని పలువు రిప్పుడు గుర్తించుచున్నారు. నన్నయభట్టారకునకుఁ బూర్వముండిన యాంధ్రవాఙ్మయము తెఱంగును సోమనాథుని కృతులను బట్టి మనము కొంతవఱ కూహింపవచ్చును. ఆంధ్రభాషలో వృత్తరూపమగు పద్యరచనము నన్నయ్యకుఁ బూర్వ ముండినను లేకున్నను మాత్రాగణబద్ధములగు బహువిధపదరచనములును, గద్యరచనములును నన్నయ్యకుఁ బూర్వము చిరకాలమునుండియే వెలయుచుండినట్లు తలంచు నవకాశములు సోమనాథుని కృతులయందుఁ గానవచ్చును. వెలనాటిచోడుని సభలో మహావివాద మొనర్చుటకయి మల్లికార్జునపండితుఁ డేఁగు తెఱి నాతని వెంటఁ గైవార మొనర్చుచు భక్తు లేతెంచు సందర్భమునఁ జెప్పఁబడిన.—

"శ్రుతి పంచగద్యలు రుద్రనిమహిమ
శతకంబు శివతత్త్వసార మాదిగను
గద్యపద్యంబు లాకాంక్షఁ జదువుచు
హృద్యంబుగా సత్కవీశ్వరుల్ పొగడ
మది నుబ్బి సంసారమాయాస్తవంబు
పదములు తుమ్మెదపదము ల్ప్రభాత
పదములు పర్వతపదము లానంద
పదములు శంకరపదము ల్నివాళి
పదములు తావేశుపదములు గొబ్బి
పదములు వెన్నెలపదములు సంజ
వర్ణన మఱి గణవర్ణనపదము
లర్ణవఘోషణ ఘూర్ణిల్లుచుండఁ
బాడుచు నాడుచుఁ బరమహర్షమునఁ
గూడి సద్భక్తసంకుల మేఁగుదేర"

అను వాక్యములనుబట్టి పంచగద్యలవంటి గద్యకృతులును, తుమ్మెదపదములు ప్రభాతపదములవంటి పదరచనములును జాలఁగాలమునుండియు మన భాషలో నుండియున్నట్లు లూహించుట కెట్టియాటంకము నుండ రాదు. మఱియు సోమనాథుఁడు తన గ్రంథములలో "గద్యపద్యకృతులు" అని తెలుచుగా నుదాహరించుచుండును.

"ఉరుతరగద్యపద్యోక్తులకంటె
సరసమై పరఁగిన జాను తెనుంగు
చర్చింపఁగా సర్వసామాన్య మగుటఁ
గూర్చెద ద్విపదలు గోర్కెఁ గైవార"
(బసవపురాణము)

"బసవన్న మహిమ శుంభద్భక్తియుక్తిఁ
బసరించితివి గద్య పద్యాదికృతుల"

"ఆరూఢగద్య పద్యాది ప్రబంధ
పూరితసంస్కృతభూయిష్ఠరచన
మానుగా సర్వసామాన్యంబు గామి."

"ఉపమింప గద్యపద్యోదాత్తకృతులు
ద్విపదయు సమము భావింప నెట్లనిన." పం॥ చ॥

అను వాక్యములవలన మన భాషలోఁ బద్యరచనము కంటె ముందుగా గద్యరచనలు వెలసినట్లును, ఆ గద్య కృతులు తరువాత వెలసిన పద్యకృతులవలెనే సంస్కృత పదభూయిష్ఠములుగా నుండియున్నట్లును, సోమ నాథుఁడు తొలుదొలుత బసవస్తోత్రముల నిట్టి గద్య పద్యకృతులలో నొనర్చి, యవి సర్వజనసామాన్యము లయి తన మతప్రచారమున కంతగా నుపకరింపక పోవుటచేఁ దన ప్రధానగ్రంథము లగు బసవపురాణపండితా రాధ్యచరిత్రములను నాంధ్రజనసామాన్యమగు ద్విపదలోఁ గూర్చినట్లును దలంపనగును. మల్లికార్జునపండితుఁడు గూడ నిట్టి గద్యకృతులను గొన్నిటిని గూర్చియుండెను.

"...గద్యపద్యసమితి శివుని మహిమఁ జెప్పినట్టి మల్లికార్జునపండితయ్యగారిఁ దలఁతు ననుదినంబు"

(అనుభవసారము)

"ఉత్కృష్టసద్భక్తి లింగోద్భవు దేవు
గద్యంబు నా నొక్క గద్యంబు చెప్పి."

"పాంచభౌతికపంచ పంచేంద్రియ ప్ర
పంచదూరు నుతించుఁ బంచగద్యలను." (పం. చ.)

కాని యీగద్యకృతుల స్వరూపస్వభావము లెట్టివి? గద్య మన వచన మనునర్థమున మన మిప్పుడు వ్యవహరించుచున్నాము. మన లాక్షణికులుకూడ నిట్లే నిర్వచించినారు.—

"సీ. పరఁగుఁ గవిత గద్యపద్యంబు లనఁ జాల
కల్పనంబు వలదు గద్యమునకు
పాదనియతి నొప్పఁ బద్యంబు; లవియు వృ
త్తములు జాతు లనఁగ నమరుఁ గృష్ణ!"

"క. కనుఁగొనఁ బాదరహితమై
పనుపడి మాలిక ద్వైవోలె బహుముఖరచనం
బన మొఱయు గద్య మది దాఁ
దెనుఁగుకృతుల వచన మనఁగ దీపించుఁ గదా"

అని యనంతుఁడు తనఛందోదర్పణమున గద్యలక్షణము నిర్వచించి "స్వస్తి సమస్తభువనరక్షాదక్ష శ్రీ పుండరీకాక్ష, భుజగపతిసింహాసనారూఢ, సురనికరమకుటతటఘటితసురుచిరమణిగణప్రభావిభాసితపాదపీఠ ......" ఇత్యాదిగా లక్ష్యము నుదాహరించినాఁడు. భీమకవి, అప్పకవి, చిన్నకోటపెద్దన మున్నగువారు గూడ నిట్లే పాదనియతి గలది పద్య మనియు, అది లేనిది గద్య మనియు నిర్వచించినారు. కాని మన సోమనాథుని గద్యకృతు లిందులకుఁ గొంత విలక్షణముగా నున్నవి. అనంతుఁ డుదాహరించిన గద్యములవంటివానినే కాక మాత్రాగణబద్ధము లయి యొకవిధ మయిన పాదనియతి గల లఘురచనములనుగూడ నాతఁడు గద్యములుగనే గణించినట్లు కానవచ్చుచున్నది. (బసవపురాణపండితారాధ్యచరిత్రములలో నాశ్వాసములచివర నీతఁడు వ్రాసిన గద్యలుకూడ వచనములోఁ గాక ద్విపదలోఁ గూర్పఁబడినవి) ఈతని గద్యకృతుల స్వరూపస్వభావములను గొంతవఱకుఁ జర్చించుచు "పాలకురికి సోమనాథకవి: గద్యకృతులు" అను వ్యాసము నిదివఱలో ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికలో (సం 15 సం 5, 6.) ప్రకటించి యుపలబ్ధము లయిన యీతని గద్యకృతులను ముందు క్రమముగఁ బ్రకటింతు ననికూడ వ్రాసియుంటిని. బసవపురాణపీఠికలో శ్రీ ప్రభాకరశాస్త్రిగా రీగద్యకృతుల యాద్యంతములను మచ్చునకుఁ జూపియున్నారు. ఉదాహరణగ్రంథములలోఁ బ్రాచీనమగు నీతని బసవోదాహరణమును శాస్త్రిగారు భారతిలో సమగ్రముగఁ బ్రకటించియున్నారు. సోమనాథుని గద్యకృతులలోఁ బ్రధానమగు పంచప్రకారగద్య నిప్పుడు ప్రకటించుచున్నాను. అయిదు విధములగు గద్యరచనము లిందుండుటచే దీని కీపేరు పెట్టినట్లు తోఁచుచున్నది. మల్లికార్జున పండితుని పంచగద్యలుకూడ నిట్టివే కాఁదగును. అనంతుఁడు చెప్పినట్టు లిట్టి గద్యరచనములు బహుముఖములుగా నుండు నని తోఁచుచున్నది. పాఠకు లీగద్యమును జిత్తగించి తిన్నాలమున సోమనాథుని గద్యకృతుల స్వరూపస్వభావములను గొంతవఱకు గ్రహింతురు గాక!

పంచప్రకారగద్య

శ్లో. స్వస్తి శ్రీప్రమథాన్వవాయోత్తమశిలా
ద శ్రీ మునీంద్రాత్మజః
శ్రీకంఠప్రతిబింబమూర్తి రసఘ
శ్శ్రీనందినాథో విభుః,
తస్యాంశోద్భవ! దండనాథ! బసవ
శ్రీనామధేయప్రభో
త్వత్కారుణ్యతరంగితం మయి సదా
నిక్షిప్యతాం వీక్షణమ్.

౧

జయ జయ బసవ— శ్రీమన్మహావృషభేంద్రావ
తార-సమంచితవీరమాహేశ్వరాచారసార - ప్రమథగణా
లంకార-జగత్త్రిసూత్రధార-దేవబసవా! (౧)

నిరాకుల నిరర్గళ నిరతిశయ నిజభక్తితాత్పర్య
శరణగణ చరణారవింద మకరంద ధారాభిషేక సంగత
మంగళాలంకారవిరచితోత్తమాంగ - అనవరత సుఖాను
షంగ - జ్ఞానవైరాగ్యైశ్వర్య విభ్రాజిత గుణోత్తుంగ-సకల
లోకప్రసారితకీర్తికాంతాభుజంగ- దేవబసవా! (౨)

అనర్గళ జ్ఞాన దుర్గాంతర్గత మార్గభ్రష్ట నికృష్ట
నానాయోని పరిపీడిత జన్మజరామరణ వైదిక వైష్ణవ
జైన బౌద్ధ చార్వాక మాయావాది దుష్టమృగ వినర
వినశన వినోద వివిధ లుబ్ధకాయమాన నిశిమోద్దండ-
శివసమయపరిపాలన (ప్రచండ)-అణిమాద్యష్టగుణమణి
గణకరండ-ఖండితకందర్పకోదండ- దేవబసవా! (3)

అవికల దనుజ మనుజ దివికేంద్ర చంద్రోపేంద్ర
వాణీంద్ర మునీంద్రాది పశుగణ ప్రమథగణ సంభావ
నీయాగణ్యపుణ్య -దూరీకృతత్రైగుణ్య - సకలమాహేశ్వ
రాగ్రగణ్య—చతుర్దశభువనవరేణ్య— దేవ బసవా! (౪)

నివృత్త సకలేంద్రియప్రచుర నిరతిశయ సము
చ్ఛ్రిత మానస పరమసుఖ నివేశ శివ యోగ నిద్రా
సమయ సమాగత దౌవారికవిదారిత ప్రత్యాగత జంగమ
లింగ సుగతగమనాగమన నిజప్రాణ—వీరమాహేశ్వరా
చార సత్ప్రాణ-అధరీకృతాన్యసమయసంపాదితతర్క-పు
రాణ_అనవరతాభ్యుదయపరమకల్యాణ- దేవబసవా!(౫)

సముధిగతసామవేదసంజాతసకలస్వరోద్భూతవిభ్రా
జిత దేశిమార్గ సముల్లసిత సాలంకార గానకళాకలాప
సముద్దిత నిరూపితోత్తమలింగ నాయక—అభీష్టఫలదా
యక-భక్తిభాండాగారసంపద్విధాయక— ప్రణమిత చెన్న
బసవ దండనాయక— దేవ బసవా! (౬)

సకల వేదాంతాపాదిత లింగప్రసాద విముఖ
మదోన్మత్త నిషాదసంహారకారణ ధారణ ప్రత్యక్ష
లలాటేక్షణ—అశుశుక్షణిసదృక్ష విషభక్షణ—సకల
జగదవనకళావిచక్షణ— సంచితసద్భక్తిలక్షణ_జంగమావ
తార సంగమేశ్వర (నిరూపిత)లలాటతట తృతీయేక్షణ—
దేవ బసవా! (౭)

అఖర్వ భక్తి నిర్వాహ నిర్వికల్ప నిర్వక్ర క్రియా
విక్రమ సంపన్న సముచిత శివార్థప్రాణాభిమాన—
మాని తానర్ఘ్య మణిగణ భాస్వరాముల్య రత్నఖచిత
(స్వర్ణ) రజతాలంకారహార భవ్య దివ్యాంబర వరతుర
గాందోళికా రథాది పరికల్పిత జంగమసపర్యా సమాగత
భూతిశాసన రుద్రాక్షమాలికాలంకార సముత్కర
ప్రచుర వేష లాంఛన—సన్నిహితవార్తాకఫల లింగ
జంగమస్వరూపణ విశ్వాసనికేతన—నిరవధిభక్తి పరితో
షిత పురాతన—దురితనికురంబవిదూర నిస్తరంగాంత
రంగ నిరాకృత మకరకేతన— దేవ బసవా! (౮)

౨

అపిచ మహామహిమోన్నతవిభవా—భవపాశో
త్కర శాతలవిత్రా—విత్రాసిత బిజ్జలధరణీశా—ధరణీశ
ప్రకరార్చిత చరణా—చరణద్యుతిజిత కోమలపద్మా—
పద్మభవప్రముఖామరవినుతా — నుతగాంధర్వసుఖస్ఫురి
తాంగా—అంగానంగ వికారవిరహితా—హిత శివయో
గానంద సుఖాశ్రమ—ఆశ్రమధర్మా ధర్మవివర్జిత—జితమ
దవిహ్వలమానుషజన్మా—జన్మ జరామరణాదవిదూరా—
దూరనిరాకృత భవసంసర్గా — సర్గస్థితిలయపాలనచరి

తా—చరితార్థాఖిలజంగమభక్తా— భక్తజనాంతఃకరణ నియుక్తా—దేవబసవా!

౩

జయ జయ నిరవధినిర్మలగాత్రా—జయ జయ దురితలతాచయదాత్రా — జయ జయ కేవలభక్తి కళత్రా—జయ జయ భావాతీతచరిత్రా—జయ జయ తనుగుణ పరిపదమిత్రా—జయ జయ వివిధేంద్రియ మదక్షేత్రా—జయ జయ సద్గుణ మణిగణపాత్రా— జయ జయ భవదుఃఖాబ్ధివహిత్రా—జయ జయ వీరాచారాచార్యా—జయ జయ చారు పురాతనచర్యా— జయ జయ నందీశ్వర గాంభీర్యా—జయ జయ వందిత మునిగణవర్యా—జయ జయ నిగమాదిత సోదర్యా— జయ జయ సజ్జనహితసత్కార్యా—జయ జయ జగద వనకళాధుర్యా—జయ జయ జంగమభక్తిసపర్యా— జయ జయ బిజ్జల నిరసనశౌర్యా—జయ జయ శరణ గణాలంకారా—జయ జయ పరమవ్యోమ విహారా— జయ జయ కారుణ్యామృతపూరా—జయ జయ వీర వ్రతవిస్తారా—జయ జయ పరిహృత జనమందారా— జయ జయ చిత్తజమద సంహారా—జయ జయ సుమహత్తత్త్వాధారా—జయ జయ పముదిత లింగకుమారా— జయ జయ భక్తపదాంబుజభృంగా—జయ జయ మంగళ మహిమోత్తుంగా—జయ జయ లింగేంద్రియసర్వాంగా- జయ జయ నవరస వర్తనరంగా-- జయ జయ ధవళిత-కీర్తిభుజంగా—జయ జయ సాక్షాచ్ఛ్రీగురులింగా— దేవ బసవా!!

౪

జయ దురిత పరిహరణ—జయ సుకృత పరిచరణ—జయ నిష్కృతరవికిరణ—జయ సుకవినుతి కలిత—జయ విరచముఖ లలిత—జయ వినయనయ మిళిత—జయ విజితభవసదన — జయ సుజనగణ పదన—జయ నిగిరణితమదన— జయపరమసుఖసహిత- జయవిషయ.........గుణరహిత - జయ వృషభపదమ హిత— దేవబసవా!

౫

జయ శివరంజన—జయ భవభంజన—జయ కరుణాకర—జయ శరభీకర—జయ మితభావణ—జయ శ్రితపోషణ-జయ గుణరాజిత -జయ గణపూజిత—జయ జయ శ్రీబసవదండనాథ! నమస్తే నమస్తే నమస్తే నమః—

శ్లో. బసవస్య కృపామూర్తేః సోమనాథప్రసాదినః,
అనవద్య మిదం గద్యం నిరంతరజగన్నుతమ్.

పంచప్రకారగద్య సంపూర్ణమ్.

---

# సుబంధువు

శ్రీ అమరవాది హనుమచ్ఛాస్త్రిగారు, యమ్. ఏ.

గీర్వాణసారస్వతప్రపంచములో సుబంధుమహాకవి ప్రఖ్యాత గద్యప్రబంధకారుడై వెలయుచున్నాడు. సంస్కృతభాషలో రచింపబడిన నవలలలోన చెప్పుకో దగినది సుబంధుకృతమగు వాసవదత్తయే.

కాళిదాసాదిమహాకవులవలె ఈసుబంధుకవిని గురించికూడ నెక్కువగ తెలియవచ్చుటలేదు. బాణునికి పూర్వమందున్న యేకావ్యకర్తలయొక్కయు కాలనిర్ణయవిషయమున నిదమిత్థమని నిష్కర్షకాధారములు లభించుటలేదు. కావుననే సుబంధుకాలమును నిర్ణయించుట కష్టతర మయిపోయినది.

"సుబంధు" నామము మొట్టమొదట ఋగ్వేదసర్వానుక్రమణికలో గానవచ్చుచున్నది. అందు గోపాయన (లోపాయన) పుత్రుడైన 'సుబంధు' ఋగ్వేద ద్రష్టలలో నొకడని చెప్పబడి యున్నది. ఐనను వాసవదత్తారచయితృసంకేతమగు సుబంధుపదమునకును, ఈసుబంధుపదమునకు నెట్టిసంబంధము గూడ లేదనియె చెప్ప నొప్పు.

లౌకికవాఙ్మయస్వరూపములో సుబంధుమహాకవిని గురించిన ప్రసక్తి యెక్కువ లేదు. ఉన్నవానిలోపల ప్రాచీనతమమై ముఖ్యతమమైనది బాణుని హర్షచరితలో గాంచబడుచున్నది.

"కవీనా మగల ద్దర్పో నూనం వాసవదత్తయా
శక్త్యేవ పాండుపుత్రాణాం గతయా కర్ణగోచరమ్."
—ఉపోద్ఘాతము, శ్లో. ౧౨.

బాణుడు తనరెండవకృతియగు కాదంబరిలో గూడ "ఇయ మతిద్వయీ కథా" అని చెప్పియున్నాడు. "అతిద్వయీ" యనుపదమునకు "వాసవదత్తాబృహత్కథల నతిశయించినది" యని విమర్శకు లర్థము చెప్పుచున్నారు.

బాణునితరువాత అష్టమశతాబ్దపరభాగమున జీవించియుండిన, వాక్పతికవి, తనప్రాకృతకావ్యమగు "గౌడవహో" నిట్లు పలికియున్నాడు.

*"భాసమ్మి జలణమిత్తే కాంతీదేవే అ జస్స రహుఆరే
సోబంధవే అబంధమ్మి హారియందే య ఆనందో."

1200 A. D. ప్రాంతమువాడైన కవిరాజు తన రాఘవపాండవీయములో—

"సుబంధు ర్బాణభట్టశ్చ కవిరాజ ఇతి త్రయః
వక్రోక్తిమార్గనిపుణా శ్చతుర్థో నోపలభ్యతే."
—౧-౪౧. శ్లో.

అని సుబంధువును ప్రశంసించినాడు. ద్వాదశశతాబ్దిలోనివాడైయగు మంఖకవియొక్క శ్రీకంఠచరితమం దొకశ్లోక మిట్లున్నది.

మేంఠే స్వర్ద్విరదాధిరోహిణి వశం యాతే సుబంధౌ విధేః
శాంతే హంత చ భారవౌ విఘటితే బాణే విషాదస్పృశః,
వాగ్దేవ్యా విరమంతు మంతువిధురా ద్రాగ్ దృష్టయ శ్చేష్టతే
శిష్టః కశ్చన స ప్రసాదయతి తాం యద్వాణిసద్వాణినీ.

ఇతనికి రెండు శతాబ్దముల తరువాత నున్న శార్ఙ్గధరుడు తన పద్ధతిలో నవమశతాబ్దివాడగు రాజశేఖరుని గూర్చి ప్రశంసించియున్నాడు. అందొకశ్లోకములో నీరీతి లిఖింపబడియున్నది.

"భాసో రామిలసౌమిలౌ వరరుచిః శ్రీసాహసాంకః కవి
ర్మేంఠో భారవికాళిదాసతరళాస్కంద స్సుబంధు శ్చ యః,
దండీ బాణదివాకరౌ గణపతిః కాంతశ్చ రత్నాకరః
సిద్ధా యస్య సరస్వతీ భగవతీ కే తస్య సర్వేఽపి తే."

సదుక్తికర్ణామృతములోను వల్లభదేవుని సుభాషితావళిలోను, రాజశేఖరకర్తృకముగ నుదాహరింపబడియున్న శ్లోకములో సుబంధుప్రశంస కలదు.

*"సుబంధౌ భక్తి ర్నః క ఇహ రఘుకారే న రమతే
ధృతి ర్దాక్షీపుత్రే హరతి హరిచంద్రోఽపి హృదయమ్,

* "జ్వలనమిత్రుడైన భాసునియందును, కాంతిదేవుడైన రఘు(వంశ) కారునియందును, సుబంధుకృతియందును, హరిచంద్రునందును, ఎవరికానందముకలదో" అని శ్లోకార్థము.

* దాక్షీపుత్రుడన పాణినియనియు, రఘుకారుడన రఘువంశకర్త యయిన కాళిదాసనియు గ్రహించునది.

విశుద్ధోక్తి శ్శూరః ప్రకృతిమధురా భారతిగిరః
తథా ప్యంతర్మోదం కమపి భవభూతి ర్వితనుతే."

15 వ శతాబ్దమున నుండిన వేమభూపాలు నాశ్రయించియున్న వామనభట్టబాణుడు తన వీరనారాయణచరితమందు (వేమభూపాల చరితమందు) నొకశ్లోకములో శ్లేషరూపముగ స్తుతినొనరించి యున్నాడు. ఆశ్లోకమిది:

"ప్రతికవిభేదనబాణః కవితాతరుగహనవిహరణమయూరః,
సహృదయలోకసుబంధు ర్జయతి శ్రీభట్టబాణకవిరాజః."

ఇట్టి వింకను గొన్ని గలవు గాని యీ వివరణములలో నెద్దానియందును సుబంధువునుగూర్చి విశేషించి తెలియదగినయంశ మొక్కటియు లేదు. ఈగ్రంథము లన్నిటికంటె బూర్వుడు వాసవదత్తాకారుడనిమాత్రమే వీనిమూలమున విదిత మగుచున్నది.

16 వ శతాబ్దమునాటివాడగు బల్లాలకవి తన భోజప్రబంధమునందు నేకాదశ శతాబ్దమున ధారానగరమును బాలించిన భోజరాజుచరిత్రము వర్ణించియున్నాడు. అందులో భోజుని యాస్థాన మయిదువందల విద్యాధికులచే నలంకరింపబడిన దనియు, వారిలో పదమువ్వురు మాత్రమే ప్రాముఖ్యము వహించిరనియు నందు సుబంధుమహాకవి యొకడనియును రచింపబడియున్నది. భోజప్రబంధముయొక్క ప్రతు లన్నియుబరిశీలించి చూడగా, ఈ విద్వాంసులయొక్క సంఖ్యావిషయములో పరస్పరభేదము గానవచ్చుచున్నది. అట్లగుట నీవాక్యమంత విశ్వాసపాత్రముగ దోపకున్నది.

ఇక సుబంధుకాలనిర్ణయమున కాధారభూతములైన యంశము లేవైనను వాసవదత్తాగ్రంథరాజములో నున్నవేమో పరిశీలింప వలసియున్నది. ఈగ్రంథములో వాత్స్యాయన కామసూత్రములు, భారతీయ నాట్యశాస్త్రము, శ్రీమద్రామాయణము, మహాభారతహరివంశములు, మొదలైన మహాగ్రంథములేగాక న్యాయ మీమాంసాదర్శనములు, బౌద్ధజైనమతములుగూడ పేర్కొనబడియున్నవి. అయినను, కాలనిర్ణయమున కీవిషయ మంతగా దోడుపడుట లేదు.

వాసవదత్తోపోద్ఘాతములోని పదియవశ్లోక మీసందర్భమున నుపకరించునేమో కనుగొనవలయును. ఆశ్లోక మిది—

"సారసవత్తా విహతా నవకా విలసంతి చరతి నో కంకః,
సరసీవ కీర్తిశేషం గతవతి భువి విక్రమాదిత్యే."

ఇందులో స్తుతింపబడిన విక్రమాదిత్యుడు పూర్వ ముజ్జయినిలో రాజ్యపాలన మొనరించినవాడును, శకపురుషుడును నని తలంపబడు విక్రమార్కుడు కానేరడనుటమాత్రము స్పష్టము. అసలట్టివాడొక డున్నాడా? అనియే విమర్శకుల సందేహము.

ప్రాచీన భారతదేశచరిత్రలో, విక్రమాదిత్యబిరుదవిభ్రాజితులగు చక్రవర్తు లిరువు రుండిరని వ్రాయబడియున్నది. మొదటివాడు 374-413 (క్రీస్తుశకము) రాజ్యముజేసిన ద్వితీయచంద్రగుప్త చక్రవర్తి. ద్వితీయుడు యశోధర్మనాముడు. ఈ నృపాలుడు విక్రమాదిత్య బిరుదము వహించి 533 సంవత్సరమున మాళవరాజ్యస్థాపన మొనర్చి 583 సం. వఱకు దానిని పరిపాలించినవాడు. సుబంధుకవి ఈ యశోధర్ముని కాలమువాడే యని యనేకులు పాశ్చాత్యపండితు లభిప్రాయపడుచున్నారు. పై శ్లోక మాధారముజేసికొని, యిట్లు నిర్ధారణము చేయుట కేవల సాహసకార్య మని కొందరు విమర్శకుల తలంపు.

వాసవదత్తకు టీక వ్రాసినవారలలో సుప్రసిద్ధుడైన 'నరసింహవైద్య' యను నాతడు గ్రంథకారునిగురించి యిట్లు పలికియున్నాడు:—

"కవి రయం విక్రమాదిత్యసభ్యః; తస్మిన్ రాజ్ఞి లోకాంతర ప్రాప్తే ఏతన్నిబంధం కృతవాన్." వాసవదత్తయొక్క దక్షిణదేశపు ప్రతిలో సుబంధుకవి "శ్రీ వరరుచిభాగినేయః" అనియున్నది. ఈ వాక్యమునకును, భోజప్రబంధములోని "వరరుచిసుబంధువులు సమకాలికులు" అన్నదానికిని, ఏకవాక్యత గనుపట్టుచున్నది. అయినప్పటికిని కాలనిర్ణయసందర్భమున నీయంశము లంత తృప్తికరములు కాజాలవు.

ఈ కవికాలనిర్ణయమునకు శాసనాధారమైన దొక్కటియు లభించుటలేదు. క్రీ. శ. 1158 సంవత్సరపునాటిదగు బాలగామియొద్ద లభించిన కన్నడశాసన మొకదానిలో మాత్రము సుబంధునామ ముదాహరింపబడియున్నది*. ఇంతమాత్రమున నిది యెక్కువ ప్రయోజనకారి కాలేదు. ద్వాదశశతాబ్దమునాటికి సుబంధుకీర్తి దక్షిణదేశమందు సైతము విస్తరించినదని మాత్ర మిందువలన విదితమగుచున్నది.

వాసవదత్త నంతయు బరిశీలింపగా కాలనిర్ణయమున కాధార మొకచోట దొరకుచున్నది. ఒక సందర్భములో సుబంధుమహాకవి,

"బౌద్ధసంగతి మివాలంకారశోభితాం"

అనియు,

"న్యాయస్థితి మివ ఉద్యోతకరస్వరూపాం"

అనియు వర్ణించియున్నాడు.

ఇందు మొదటిదానిలో బౌద్ధాచార్యుడగు ధర్మకీర్తియొక్క "బౌద్ధసంగత్యలంకార" మను గ్రంథమునకు సూచన కలదని నిరూపింపబడుచున్నది. ఈధర్మకీర్తి, క్రీ. శ. 671-695 సంవత్సరములమధ్య హిందూదేశమున కేతెంచిన 'ఇట్‌సింగ్' అను విదేశ

* Vide, Mysore inscriptions (Rice) p. 111, Bangalore 1879

యాత్రికునిచే గొనియాడబడియున్నవాడు. కావున తత్పూర్వకాలికు డగుచున్నాడు.

రెండవ యుపమానములో న్యాయాచార్యుడైన యుద్యోతకరునికి సూచన యున్నదని గుర్తింపబడుచున్నది. ఈ యుద్యోతకరుడు బౌద్ధదిఙ్నాగుని మతమునకు ఖండనరూపమయిన న్యాయవార్తికగ్రంథమును వ్రాసియున్నాడు. దిఙ్నాగాచార్యుడు 520-600 A. D. కాలమువాడనునది నిశ్చితపూర్వమైన విషయము. అట్లగుట నుద్యోతకరుడుగూడ, షష్ఠశతాబ్దాపరభాగమునకంటె ముందు జీవించి యుండడనుట ధ్రువము.

ఈ పైరెండువిషయముల బరికించినచో సుబంధువుయొక్క కాలము కొంచె మించు మించుగా నిర్ణయింపవచ్చును. అతని జీవిత కాలాద్యంతముల నిర్ణయించుటలో బాణుని హర్షచరిత్ర, ఉద్యోతకరుని న్యాయవార్తికము ప్రమాణము లగుచున్నవి. బాణుడు తన హర్షచరితమును 640 సంవత్సరప్రాంతములలో రచించినట్లు సాధింపబడియుండుటచే తత్పూర్వమే సుబంధువు తన వాసవదత్తను వ్రాసియుండవలయు నను సంశయము సిద్ధించుచున్నది. ఇట్లే యుద్యోతకరుని గూర్చిన ప్రస్తావన గలదు గాన, వాసవదత్త న్యాయవార్తికరచనా కాలానంతరము రచియింపబడి యుండవలయునని నిర్ధారిత మగుచున్నది. కావున సుబంధువు తన వాసవదత్తను, ప్రాయశః, 605-612 సంవత్సరములమధ్య వ్రాసియుండు ననుట న్యాయ్యము.

ఏదోవిధమున కాలము నిర్ణీత మయినను, దేశము నిర్ణయించుట దుస్సాధ్యము. భోజప్రబంధము ననుసరించి భోజుని సభాస్తారుడుగాన సుబంధువు ధారానగరమున గ్రంథరచన మొనర్చెనని యంగీకరించుట యుక్తి యుక్తముగా దోచుట లేదు.

సుబంధుకవియొక్క జీవితాంశము లేవియు, విశేషముగ మనకు లభింపలేదు. వాసవదత్తలోని యుపోద్ఘాతములో దనను గురించి "సుజనైకబంధు" అని చెప్పుకొని యున్నాడు. కావ్యమునకు వ్యాఖ్యానముజేసిన 'శివరామ' పండితు డీమాటకు "మంచివారలకు హితుడు" అని యర్థము జేసియుండ, పాశ్చాత్యపండితులు "సుజన నామునికి సోదరుడు" అను నర్థము గల్పించియున్నారు. ప్రాకృత వ్యాకరణకర్తయగు వరరుచి కీకవి భాగినేయుడని యొకప్రతీతి గల దని ముందు జెప్పబడియున్నది. కాని యయ్యది విశ్వాసజనకము గాలేదు. కాశ్మీరబ్రాహ్మణు డీకవియని గూడ జనశ్రుతి యొకటి ప్రచారములో నున్నది.

వాసవదత్తగాక యితరగ్రంథము లేవియు సుబంధువు రచించినట్లు తోపదు. శార్ఙ్గధరపద్ధతి, సుభాషితావళి, పద్యావళి, ఇత్యాది గ్రంథములలో సుబంధుకృతములుగ నుదాహరణము లీయబడియున్నవన్నియు వాసవదత్తనుండియే గైకొనబడియున్నవి. ఇది యిట్లుండ 'హాల్' అను పాశ్చాత్యపండితునిచే షాజహాన్ కాలమునకు జెందిన 'వేణీదత్త' కవికృతమగు 'పద్యవేణి' యను గ్రంథమున నున్నదనియు, 'సుబంధు' రచితమనియు నీక్రిందిశ్లోకభాగ ముదాహరింపబడుచున్నది.

"అక్షమాలాప వృత్తిజ్ఞా కుశాసన పరిగ్రహా,
బ్రాహ్మీవ దౌర్జనీ సంస ద్వందనీయా సమేఖలా."

కొంతకాలమువఱకు నీశ్లోకము సుబంధువుదే యని యందరనుకొనిరి గాని యిటీవల విమర్శకుల కృషిచే నియ్యది త్రివిక్రమభట్టకృతమగు నలచంపూగ్రంథమందలిదిగా నిరూపింపబడినది.*

వాసవదత్త:— పెక్కు ప్రతులలో వాసవదత్త 'ఆఖ్యాయికా' యనియే పేర్కొనబడియున్నది. ఆఖ్యాయిక యనునది గద్యకావ్యములలో నొక భేద మనియు, దాని కుదాహరణము హర్షచరిత మనియును ఆలంకారికులు చెప్పుచున్నారు. బాణకవి యీ సుబంధుకృతి నాఖ్యాయికగనే గ్రహించియున్నాడు. విశ్వనాథకవిరాజు తన సాహిత్య దర్పణములో నాఖ్యాయికా లక్షణ మిట్లు నిర్వచించినాడు.

"ఆఖ్యాయికా కథావత్స్యా త్కవే ర్వంశాను కీర్తనం,
అస్యా మన్యకవీనాంచ వృత్తం గద్యం క్వచిత్ క్వచిత్.
కథాంశానాం వ్యవచ్ఛేద ఆశ్వాస ఇతి బధ్యతే,
ఆర్యావక్త్రాపవక్త్రాణాం ఛందసా యేనకేనచిత్.
అన్యాపదేశే నాశ్వాసముఖే భావ్యర్థసూచనమ్."
—6. పరిచ్ఛేదము. 334-335

కథయనునది రెండవభేదము. బాణుని కాదంబరి దీని కుదాహరణము. సాహిత్యదర్పణకారుడు కథాలక్షణ మిట్లు తెల్పియున్నాడు:

"కథాయాం సరసం వస్తు గద్యైరేవ వినిర్మితం,
క్వచి దత్ర భవే దార్యా క్వచి ద్వక్త్రాపవక్త్రకే,
ఆదౌ పద్యై ర్నమస్కారః ఖలాదే ర్వృత్తకీర్తనమ్."
—6. పరిచ్ఛేదము. 332-333

ఈ లక్షణప్రకార మాలోచించినచో వాసవదత్తను కథగా పరిగణించుటయే న్యాయ్యము. ఏలన, ఆఖ్యాయిక కవసరమగు నుచ్ఛ్వాసము లిందు లేవు. పైగా కథ కవసరమగు "ఆదియందు ఖలాదివృత్తవర్ణన" మిందు గానవచ్చుచున్నది. వాసవదత్తాకాదంబరీలకు గల యన్యోన్య సాదృశ్యము వాసవదత్తాహర్షచరితలకు గల పరస్పరభేదమును బురస్కరించుకొని వాసవదత్త ఆఖ్యాయిక కాదనియే నిర్ణయింపబడుచున్నది. కావున కథావిశేషమనుటయే యుక్తము.

* Vide R. Krishnamachariar's introduction to Vasavadatta p. p. 39-40.

ఆయినను దండి చెప్పినట్లు * "కథాఖ్యాయిక యేకజాతిరే" యను భావముతో నీవాసవదత్తను ఆఖ్యాయిక యనవచ్చును. లేదా కథ యని చెప్పవచ్చును.

సుబంధుకవిత్వము మిక్కిలి ప్రౌఢమై అలంకారాదిశోభితమై యలరారుచున్నది. వాసవదత్తలో కథాసంవిధానమున కంత ప్రాముఖ్య మున్నట్లు తోపదు. ఇతివృత్త మంతయు గుణాఢ్యుని బృహత్కథ ననుసరించి కూర్పబడినది. కథామాత్ర మాధారము చేసికొని సుబంధువు తన రచనాసామర్థ్యము నంతయు విశదీకరించియున్నాడు. గంభీరాకృతుల వర్ణింపబూనిన సుబంధువుయొక్క యత్యద్భుతశక్తి వెల్లడియగుచున్నది. "నదులు, పర్వతములు, బాలురుదీర్చిన సేనావాహిని" ఇత్యాదుల వర్ణనము సంస్కృతసారస్వతమునం దసమానమైనదై శోభిల్లుచున్నది.

సుబంధుకవి తన ప్రబంధ మంతయు 'గౌడీ' రీతిలోనే రచించియున్నాడు. ఆలంకారికులు గౌడీరీతి కుండవలసినవని నిర్ణయించిన గుణము లన్నియు వాసవదత్తలో నిరూపింప బడియున్నవి. ఆలంకారికు లీక్రిందివిధమున, 'గౌడీ' రీతిని పలులక్షణముల నిర్వచించియున్నారు.

"ఓజః ప్రకాశకై ర్వర్ణైర్బంధ ఆడంబరః పునః
సమాసబహులా గౌడీ......"

అని సాహిత్యదర్పణకారుడు.

"ఓజఃకాంతిమతీ గౌడీయా" †

అని వామనకావ్యాలంకార సూత్రవృత్తి.

"శ్లేషః ప్రసాద స్సమతా మాధుర్యం సుకుమారతా
అర్థవ్యక్తి రుదారత్వ మోజఃకాంతిసమాధయః,
ఇతి వైదర్భమార్గస్య ప్రాణా దశగుణాః స్మృతాః,
ఏషాం విపర్యయః ప్రాయో దృశ్యతే గౌడవర్త్మని."

అని ఆచార్యదండి.

ఇన్ని లక్షణములును వాసవదత్తలో గానవచ్చుచున్నవి. సుబంధువున కలంకారప్రియత్వము మెండు. అలంకారగర్భితము కాని వాక్యమే లేనట్లు తోచుచున్నది. ఈయలంకారములలో ముఖ్యమైనవి, శ్లేష, ఉత్ప్రేక్ష, విరోధము, అతిశయోక్తిమొదలైనవి. గీర్వాణవాఙ్మయములోని శ్లేషకవితారచనకు సుబంధువు మొదటివా డనవచ్చును. బాణుడు తన కవితాపద్ధతియం దంతటను సుబంధువును విశేషముగ ననుకరించియే యున్నాడు. ఈతని గ్రంథములో ప్రతిపదమందును శ్లేష యుండనేయున్నది. గ్రంథాంతమున దనను గురించి తానే,

"సరస్వతీదత్తవరప్రసాద శ్చక్రే సుబంధు స్సుజనైకబంధుః,
ప్రత్యక్షరశ్లేషమయప్రపంచవిన్యాసవైదగ్ధ్యనిధిం ప్రబంధమ్."

అని చెప్పుకొనియున్నాడు.

ఇతనిలో శ్లేష అతిమై యొకప్పుడు పాఠకుని మనస్సునకు విసువు గల్గించునట్టిది గూడ యగుచున్నది. కనుకనే రాఘవపాండవీయ కర్తయగు, "కవిరాజు" తను ముస్సురిని వక్రోక్తిమార్గనిపుణులనుగా ప్రశంసించినాడు.

ఇక నీతని గ్రంథమునుండి కొద్దిగ నలంకారము లుదాహరింపబడుచున్నవి.—

శ్లేష. కుదాహరణము:—

"వానరసేనామివ సుగ్రీవాంగదశోభితాం."

విరోధాభాసః:—

"అగ్రహేణాపి కావ్యజీవజ్ఞేన."

ఉత్ప్రేక్ష:—

"దధిధవళే కాలకుపణకగ్రాస పిండఇవ, నిశాయమునా
ఫేనపుంజఇవ, మేనకానఖమార్జనశిలాశకలఇవ......"

మాలాదీపకాలంకారము:—

"భుజబంధేన కోదండం, కోదండేన శరాః, శరై రరిశిరః."

రూపకాతిశయోక్తి:—

"విలోచనేందీవరభ్రమరపంక్తిభ్యాం, ముఖమదనమందిర తోరణాభ్యాం, రాగసాగరవేలాభ్యాం, యౌవనవర్తకలాసికాభ్యాం, భ్రూలతాభ్యాం, విరాజమానాం" ఇత్యాదులు—

శబ్దాలంకారములలో సుబంధువునకున్నవి వచ్చినవి యమకానుప్రాసములు:—

యమకము:—

"ఆందోళితకుసుమకేసరే కేశరేణుముషి రణితమధుమణీనాం రమణీనాం వికచకుముదాకరే ముదాకరే"

అనుప్రాసము:—

మదకలకలహంససారస రసితోద్భ్రాంతాః కూటవికట పుచ్ఛచ్ఛటా వ్యాఘాత వికచకమలఖండ విగళిత మకరందబిందు సందోహసలిలయా......ఉపకూలసంజాత నళినికుంజపుంజిత కులాయకుక్కుట ఘటఘూత్కార ఘోరతీరయా......"

* "తత్కథాఽఽఖ్యాయికేత్యేకాజాతిః సంజ్ఞాద్వయాంకితా"

—కావ్యాదర్శము, ప్రథమపరిచ్ఛేదము.

† "ఓజః కాంతిశ్చ విద్యేతే యస్యాం సా, ఓజఃకాంతిమతీ గౌడీయానామ రీతిః, మాధుర్యసౌకుమార్యయో రభావాత్, సమాసబహులా, అత్యుల్బణపదాచ" అని వామనుని సూత్రార్థవృత్తి (వివరణము.)



౧. శ్రీ బులుసు రామకోగారావుగారు (రి)  ౨. శ్రీ వి. యల్. శాస్త్రిగారు (రి)  ౩. శ్రీ డా. పి. నటరాజన్ గారు (రి)
౪. శ్రీ పి. చిన్నస్వామయ్యర్ గారు (రి)  ౫. శ్రీ యస్. సత్యమూర్తి అయ్యరుగారు (రి)



7 ౧. శ్రీమాన్ కొమాండూరు గోవిందరాజాచార్యులుగారు. ౨. శ్రీ రావు అచ్చయ్యారావుగారు. (కీ)
౩. శ్రీ పుసులూరి కోదండరామయ్యగారు (కీ) ౪. శ్రీ చేబియ్యం శ్రీరామమూర్తిగారు (కీ) ౫. శ్రీ మల్లాది రామమూర్తిశాస్త్రిగారు (కీ)

# కట్టడములకు కావలసిన

# సామాను లేవైనను మీకు కావలసిన

## వివరములకు, ఆర్డర్లకు మాకు వ్రాయుడు

ఈ పనులలో మాకు 30 సం॥ల అనుభవము గలదు. గంజాం, విశాఖపట్టణము, గోదావరి, కృష్ణా, నెల్లూరుజిల్లాలలో నిర్మింపబడిన భవనములలో పెక్కింటికి కావలసిన సామానులను మేమే సరఫరా చేసియుంటిమి. డెల్టాభూములలో వ్యవసాయమునకు కావలసిన గాజుతూములను మేమే సరఫరాచేసితిమి. అవియింకను మంచిస్థితిలో పనిచేయుచున్నవనగా మాసామానులు అంత శ్రేష్ఠమైనవనియే గదా నిర్ధారణ చేయబడిన అభిప్రాయము.

అనేక గవర్నమెంటు భవనములందును, వ్యాపారసంస్థలయందును, బ్యాంకులందును, క్లబ్బులలోను, దక్షిణహిందూస్థానమున రాజులు, జమీందారులు మున్నగువారి స్వగృహములందును, నేలమీద పరచెడు రాళ్లు, కొయ్యపనులు, గోడకు వేయు చిత్రవిచిత్ర రాళ్లు, ఆరోగ్యరక్షణసంబంధమైన యేర్పాటులు, మొదలగు పనులను వారికిబహుతృప్తికరముగా మేమె నెరవేర్చితిమి.

యథార్థముగా మావద్ద యెప్పుడును శ్రేష్ఠమైనసరకుల నిల్వయుంచెదము. చౌక యగు వస్తువులు వలయువారికి ఆర్డర్లమీద తెప్పించి యిచ్చెదము.

మంగుళూరు పెంకులు, నేలమీదపరచెడు చలువరాతి పెంకులు, సిమెంటు, చలవగాయి, యిటుకపెంకులు, సిరామిక్ పెంకులు, గ్లేజుడు పెంకులు (సాదా, తెలుపురంగులు) మున్నగునవి పలువిధము లయినవాటిని యెక్కువగా నిల్వయుంచెదము.

అస్బెస్టాస్ రేకులు, సాదాలేక వంపులుగలవి; లక్ష్మీబ్రాండ్ పోర్టులాండ్ సిమెంటు, వజ్రబ్రాండ్ పోర్టులాండ్ సిమెంటు, వైట్ సిమెంటు అన్నివిధములయిన శానిటరీ సరకులు, మడువదగిన గేట్లు, రోలరు షట్టర్లు మున్నగునవి గలవు.

మరియు, మోడర్న్ క్రూడ్ ఆయిల్ ఇంజన్లు (కోల్డుస్టార్టింగు) ఫుల్ డీసెల్ టైపు; విండ్ మిల్లు, ఎలెక్ట్రిక్ అండ్ మోటారుపంపులు, గూడ గలవు. ఇంగ్లీషుస్టాండర్డు టైపురైటర్లు, పోర్టబుల్ సైజులు గూడ యున్నవి.

ఇంకను, ఫేసిట్ కాల్క్యులేటింగ్ మిషన్లుగూడ మావద్ద నున్నవి.

### పై వాటిలో మీకేది కావలసినను మాకు వ్రాయుడు.

## లక్ష్మీరతన్స్ లిమిటెడ్,

316 తంబుచెట్టి వీధి, మద్రాసు.

**For Literature, Love, Romance, Thrills, Mystery, Politics Galore.**

# JOIN THE CURRENT CIRCULATING LIBRARY.

**The Only Cheapest and up-to-date Library in S. India.**

## 6 REASONS WHY YOU SHOULD JOIN OUR LIBRARY!

1. *The Cheapest Library.*
2. *Centrally Located.*
3. *Library is opened from 8-30 A.M. to 7 P.M. on all days including all Government and Commercial Holidays except Sundays.*
4. *Members can suspend their membership for 15 days and more and subscription will not be charged for such days.*
5. *Books delivered at subscriber's Residences.*
6. *We have more than 5,000 new volumes of Fiction and non-fiction. New Books are added to the Library Every week.*

---

**Rates of subscription.**

| | One Month | 6 Months | 1 Year |
|---|---|---|---|
| 1 Book at a time | 1 0 0 | 5 8 0 | 10 0 0 |
| 2 Books at a time | 1 8 0 | 8 0 0 | 15 0 0 |
| 3 Books at a time | 2 4 0 | 12 0 0 | 22 8 0 |
| Delivery Charges | 0 8 0 | 2 8 0 | 4 12 0 |
| Deposit (Returnable) | 2 0 0 | 3 0 0 | 4 0 0 |

Rates of subscription and Rules for mofussil residents will be sent on application.

---

Foreign Illustrated Weeklies Fashion, Books and Magazing are also circulated.

---

**A Few select opinions of our Subscribers:**

"..I have found your Library very useful and I am sure it must be so to many others as well. Your arrangements with regard to the circulation of books leave nothing to be desired. Your, prompt attention to the demands of your members is a specially noteworthy feature of your Library—" *Mrs. Visalam Govinda Menon c/o Mr. P. Govinda Menon B.A., B.L.,—13—2—31.*

"...I have been a member ever since it was started. The Library contains books of general interest, a wide collection of Novels besides many books of standard literature ..The management spares no pains to make the library an useful one of its kind The system of *Home Delivery* makes it convenient for all especialiy ladies..." *Mahalakshmi Parameswari ammal 24—2—31,*

"...Books relating to political, social, Religious Ecomic and other subjects are kept in the library. The staff employed is courteous and prompt and the library supplies a long felt want—" *T. V. Venkatarama Iyer Avl. B.A., B.L.,—8—2—31.*

"...The current circulating Library started only a few months ago, has been rendering a good service to the reading public at a nominal subscription. I am well pleased with the wide range of books—" *Rao Bahadur C. T. Alwar Chetty, B.A.,—6—2—31*

"...I find the service courteous. There are a number of current books. An intelligent touch with some of the most interesting of modern productions in fiction is kept up and the library is being constantly added to. Your 'Library supply a felt need to the reading public in Madras—" *T. S. Pillay Esq., B.A. (Hons). Currency Officer. Madras,—10—2—31.*

"...Your library fulfils a much needed service in Madras with a representative collection of books—" *C. R. Sreenivasan, B.A., Editor, Swadesamitran 24—2—31.*

*PROPRIETORS:—*

**THE MADRAS NEWS AGENCY, 183 MOUNT ROAD, MADRAS.**



౧. శ్రీ డాక్టరు బి. సుబ్బరావుగారు. (ఓ) ౨. శ్రీ డాక్టరు డి. వి. సుబ్బరావుగారు (ఓ) ౩. శ్రీ ఈ. కృష్ణయ్యరుగారు (ఓ)
౪. శ్రీ సత్య వీరభద్రరావుగారు (ఓ) ౫. శ్రీ టంగుటూరు హనుమంతరావుగారు (ఓ)





౧. శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు బెజవాడలో తమ గృహమున నవరాత్రోత్సవసమయమందు సన్మానించిన పండితబృందము.

౨. హైదరాబాదులాంధ్రమిత్రమండలి శ్రీ సిరుగూరు జయరావు(ఐ.సి.యస్.)గారిని (క్రిందినుండి రెండవవరుసలో నడుమనున్న వారు) సన్మానించుట.

ఇది రెల్ల దిక్కాత్రోదాహరణము. విశేషముగ నీయవలసి వచ్చినచో గ్రంథవిస్తృతి తప్పదు. ప్రౌఢకవిత, దీర్ఘసమాసములు, జటిలపదములు మొదలైన వుంటచే, వాసవదత్తలో నన్వయకాఠిన్య ముండకతీరదు.

ఏమిచిత్రమో కాని, గద్యరచనకంటె సుబంధుకవిపద్య రచన రమ్యతరముగ నున్నది. గద్యకావ్యమే యయినను, ఈకృతిలో పెక్కుశ్లోకము లుండకపోలేదు. భావవ్యక్తి బ్రకటించుటకు గద్యము కంటె పద్యమే వీలగుచున్నది. స్వభావోక్తిగర్భితమగు నీక్రింది సింహ వర్ణనశ్లోకము మిగుల మనోరంజక మగుచున్నది.

"స శ్యోదంచదవాంచదంచితవపుః
పూర్వార్ధపశ్చార్ధ భాక్
స్తబ్ధోత్తానితపృష్ఠనిష్ఠితమనా
గ్భుగ్నాగ్రలాంగూలభృత్
దంష్ట్రాకోటి వికంకటాస్య కుహరః
కుర్వన్ సటా ముత్కటా
ముత్కంఠః కురుతే క్రమం కరిపతౌ
క్రూరాకృతిః కేసరీ."

సుబంధుమహాకవికి పూర్వమునందు రచితములైన గద్య ప్రబంధము లంతగా లేవు. ఉన్నచో * భట్టారహరిచంద్రకృతమైన గద్యకావ్య మొకటియు, దండిదశకుమారచరిత మొకటియు మాత్రమే కావలయు. ఇందులో మొదటిదానిని గూర్చి నామమాత్ర జ్ఞానము తప్ప వేఱువిషయము మన కెఱుఁగరాకున్నది. రెండవదియగు దశకుమారచరిత్రకును వాసవదత్తకును, చాలా భేదము కలదు. దండి పదలాలిత్యమునకును, సుబంధుశబ్దకాఠిన్యాదిగుణములకును పోలిక యే లేదు. అయినను ఓజఃకాంతిగుణాంచితమై సర్వాంగసుందర మైన యిట్టి ప్రఖ్యాతగ్రంథమును రచించి సుబంధువు సంస్కృత భాష కపారమైన సేవ గావించెను. శ్లేషకవిత్వమున కుచ్చైఃస్థాన మిచ్చి పరిపోషించిన వారలలో సుబంధువే మొదటివాఁడు. ఈతని కావ్యములోని శ్లేషోక్తులను బట్టియే అత్యంతశ్లేషమయములైన రాఘవపాండవీయము, రామచంద్రుని రసికరంజనము మొదలైన ద్వ్యర్థిత్ర్యర్థికావ్యములు రచింపబడినవని విమర్శకుల యభిప్రాయము. † గీర్వాణ వాఙ్మయములో గద్యకావ్యములకు ప్రాముఖ్యము లభించిన దీసుబంధుకృతివలననే. కృతియొక్కటే యయినను అది మహాకావ్య ముగా నొనరించి కవిసార్వభౌముడై చిరకీర్తిభూషితుడై సుబంధు మహాకవి ప్రకాశించుచున్నాడు. కనుకనే లక్ష్మణకవి "సూక్తావళి" యను గ్రంథములో ని ట్లనుచున్నాడు:

"జీయా ద్గద్యసుధాధున్యాః సుబంధుః ప్రభవాచలః,
యద్భంగాశ్లేష మాసాద్య భంగః కవిభి రాశ్రితః."

---



---

* "పదబంధోజ్జ్వలో హారీ కృతవర్ణక్రమస్థితిః, భట్టారహరిచంద్రస్య గద్యబంధో నృపాయతే."—బాణుని హర్షచరిత. ఉపో. ౧౩.

† R. Kristnamachariar గారి ఉపోద్ఘాతము చూచునది. p. p. 18.

# పాఠకుని యొక్క తన్మయత్వము

కవికొండల వేంకటరావుగారు, బి. ఏ., బి. యల్.

పఠించుచు 'నే నెక్కడున్నాను' అని యొకానొక సంప్రశ్నము ప్రశ్నించుకొనునంత పాఠకునకు స్వీయ శక్తిగాక పరశక్తి "నే నెక్కడున్నాను" అని మాఱువలుకుచుండునేని యదియ పాఠకుని తన్మయత్వము.

ఇది పాఠకున కెప్పు డబ్బుచున్న దన, ఎప్పుడు పాఠకుడు తనయొక్క దృష్టిపథమును విడిచి, కవియొక్క దృష్టిపథమును విడిచి యంశము యొక్క దృష్టిపథమున నిలుచుండి ఆయావాక్యములను పఠించుచున్నాడో అప్పు డబ్బుచున్నది.

ఏదో యొకటి కవి లోకవర్తనమందుఁ గనుఁగొనుచున్నాఁడు. అతనుఁగొన్నది పాఠకుఁడు గ్రహింపఁబూనుకొనుచున్నాఁడు. కావున ఏదో అన్న అంశమును మనము గుర్తించుటకు సంకల్పము గొనక, వెయ్యిమాఱు లొక పద్యమును బఠించినను, లక్షసారులు వల్లె వేసినను లాభము లేదు. నాల్కచివర పద్దెమాడునదియు, బుఱ్ఱలో వ్యాఖ్యానము ధ్వనించునదియు, కాని హృదయరంగమునందు దీప్తి సున్న. ఆత్మకు వ్యక్తిత్వము హుళక్కి.

ఉదాహరణము: రామాయణాఖ్య తీసికొనుఁడు. రామాయణకథ కవియను వాల్మీకి యొక్క జీవితమును గాదు; పాఠకులమగు మనయొక్క జీవితమును గాదు. అవి చదువులో మనలను మఱచి, వాల్మీకిని మఱచి, శ్రీరాముడు, సీత, అని స్మరించుకొందుమా లేదా? అదియ పరశక్తి; అదియ తన్మయత్వము. ఈ తన్మయత్వమునకు ప్రప్రథమలక్షణము పాఠకుఁడు తనను, వ్రాయనవానిని గూడ మఱచి అంశమునే లక్ష్యముగాఁ గొనుట యందున్నది.

అంశమునే లక్ష్యముగాఁ గొనుట యన, అంశమునకు బాహ్యస్వరూపమైన భావనా? అంశమున కాంతరంగికమగు భావమునా? రెండింటినిం గాదు; తదంశప్రతిపాదితమగుచున్న ధర్మమును లక్ష్యముగాఁ గొనవలెను.

రాను రాను మనవ్యాసమున మన మెచ్చో నున్నాము? తన్మయత్వమునకు లక్ష్యము అంశముచే ప్రతిపాదిత మగుచున్న ధర్మము. ధర్మప్రతిపాదనము సేయని యంశ ముండదు. ప్రతియంశమునకు నొకానొక ధర్మము సహజమర్మమై డాఁగియుండును. దానియందు మనము లక్ష్య ముంచి పఠింపవలయును.

ఉదాహరణము: శ్రీ సీతారాముల సీతిచరిత్రము చదువునప్పుడు రావణాసురుని పదితలలయందుఁ గాని, రాముని కార్ముకమునందుఁగాని లక్ష్య ముంచి, చదువుచు తన్మయుల మగుటచే పరశక్తి గోచరించదు. సీతారాముల చరిత్రమునందలి నైతికవికాసమునెడ లక్ష్యముంచి, భ్రాతృధర్మము, పితృవాక్యపరిపాలనము, ఏకపత్నీవ్రతనైష్ఠికప్రవృత్తి, శరణాగతత్రాణపరాయణత్వము, లోనైన చరిత్రోదితములగు ధర్మములయెడల లక్ష్యముంచి పఠించిన తన్మయభావము సిద్ధించును.

కావున పాఠకుఁడు తాను చదువు నంశధర్మమును ముందుగ నిర్వచించుకొని దాని వెలుతురున లక్ష్య ముంచి పఠింపఁ దొరఁకొనవలయును. తన్మయుఁడై యందలి నిజానంద మనుభవింపవలె నన్న—

ఏతద్ధర్మము లోకమునందు నాయూహ ననుసరించి రెండు తెఱంగులుగఁ దోఁచునది. (1) విశ్రుతము (2) విస్మృతము.

ఉదాహరణము:—కేవలశ్రుతము గాలివానం దోఁచు. ఊఁఅక వీచి, చెట్లు కదలించి, పెద్దపెద్దవాన చినుకుల మొత్తి రొదసేయుధర్మము అద్దానిది. కేవల స్మృతమునకు ఒకానొక తెల్లని మేఘ మొకానొకప్పుడు దూదిగుట్టవోలె ఆకసమున కొకవైపు నిలిచియుండు, సూర్యకాంతి నవార్యకాంతి నారుచున్నదా అన్నట్లు. ఇట్లంటి నని ప్రకృతియం దొకదానికి కేవలము విశ్రుతియు, మఱొక్కదానికి కేవలము విస్మృతియు నని గాదు నాయభిప్రాయము. ఒకధర్మము వెలుగుగొల్పు దాని యందు రెండవధర్మము మఱుగుపడి యుండును. తుపాను వినరునప్పుడు దానిచర్య చూచుచున్నాము; వినుచున్నాము. కాని దాని విరామము ఇంద్రియగోచర మగుటలేదు. అట్లే మేఘ మంతవఱకు చేసిన ప్రయాణము గాని యూపైని చేయఁగల ప్రయాణము గాని మన కగోచరంబు.

కావ్యమునం దట్లు గాదు. రెండు ధర్మములును మిశ్రమములై యుండును. ఒకానొక యంశముయొక్క విశ్రుతధర్మమునందు దానియొక్క విస్మృతిధర్మమును గూడ మేళవించి యంశముయొక్క పరిపూర్ణస్వరూపము మన కగపించువఱకు ఆసక్తి నిలుపును.

ఉదాహరణము:—కొండమీద నిలుకడగ నున్న మేఘమును కాళిదాసు తన మేఘసందేశమున దేశదేశములం ద్రిమ్మఱచేసి విశ్రుత మొనరించినాఁడు. విస్మృతి నున్న మేఘమునకు విశ్రుతధర్మ మొనగూర్చినాఁడు. అచ్చో పాఠకుఁడు తన్మయుఁడు కావలెనన్న మేఘము కొండపై నిలుకడ నుంట సాక్షాత్కరించుకొనవలయును; మననము సేయవలయును . తరువాత దానితోపాటు ప్రయాణము సేయునట్లుగ శ్లోకములు పఠింపఁబూనవలయును. మననచాతుర్యము లేక కేవలము పఠనసంభ్రమమాత్రుఁ డగునేని పాఠకుఁ డాకావ్యమునందు తన్మయుఁడు గానేరఁడు. అట్లే రెండవపరిస్థితి కుదాహరణము:— తృణావర్తునికథ యున్నది. అందున సుడి గాలి గిఱ్ఱునఁ దిరిగి బాలకృష్ణుని పైకి తీసికొనిపోయెను, అని చదువుచున్నాము. అంతవఱకును చదివి యూఱకొనుటలో అందము పూర్తి కాదు. అంతవఱకు కేవలవిశ్రుతము. ఆసుడిగాలి నడఁగించి మందస్మితుండగుచు క్రిందికిం డిగిన గోపాలునియందు మనము విస్మృతిలోలుర మగుటయం దున్నది సంపూర్ణతన్మయత్వము.

కావున సృష్టియం దొకచో కనిపిన నేరని శ్రుత స్మృతములు రెండును సమీకరణము చేయఁబడి కావ్యమునందు మన కొకయంశ మానందము గొల్పుచున్నది. ఆ తెఱంగు ననుసరించి పాఠకుఁడు చదువుటయందును, చదివినదానిని మననము గొనుటయందునుంగూడ తగు శరీరస్వాస్థ్యము, తగునిర్మలమానసము, తగుప్రసన్నతార్ద్రహృదయము కలిగియున్నంగాని తన్మయత్వ మలవఱచుకొననేరఁడు.

# ఒక యాంగ్లేయవిద్యాధికు లొనర్చిన విమర్శనపు పరీక్ష

కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు, "విమర్శకాగ్రేసర"

ఆంగ్లేయవిద్యాపద్ధతి మనవారి హృదయక్షేత్రములయందు నాటుకొనం బ్రారంభించినది మొదలుకొని విచిత్రభావోదయము కలుగఁజొచ్చినది. స్వీయానుభవవిరక్తియుఁ బరకీయానుభవానురాగమును హెచ్చఁజొచ్చెను. మనపద్ధతు లన్నియు నిస్సారము లనియు విదేశపద్ధతులే యభ్యుదయదాయకము లనియుఁ దలంపులు పుట్టినవి. దానితో నడుగడుగునను బరపదదాస్యమును మనలో హెచ్చినది. ఆదియందు రాజకీయవిషయమునసే మనవారు పరదాస్యము తప్పక చేసి యభివృద్ధి నొందవలసియున్న దని తలంచుచుండెడివారు. అయ్యది క్రమక్రమముగా నన్ని విషయములలోనికిని బ్రాఁకినది. భాషావిషయమునను మతవిషయమునను సాంఘికాచారవిషయమునను లెక్కలు, సమస్త విషయములందును గూడఁ బశ్చిమమే మనకుఁ బరమావధియై పోయినది. పాశ్చాత్త్యులవలె వేషమువేసినవాఁడే వివేకి, ఆభాషను నేర్చినవాఁడే జ్ఞాని యను తలంపులు ప్రబలుటయే కాక మనదేశవేషభాష లెందుకుం బనికిరానివి యను నూహాలు ప్రబలుచున్నవి. పాశ్చాత్త్యవిద్యలు నేర్చినవాఁడే విద్వాంసుఁడుగాని దేశీయవిద్యలు నేర్చినవాఁడు విద్వాంసుఁడుగాఁ డని లోకజ్ఞశిఖామణిగా నెంచఁబడుచువచ్చిన యాంధ్రదేశవిద్యాసాగరుఁడు నుడివియుండెను. గ్రంథాదివిమర్శనవిషయమునను పాశ్చాత్త్యవిద్యాసాంగత్యాధికత యత్యవసరమను నాశయములు వొడముఁజొచ్చెను.

ఈనడుమ "పెద్దన-నీతిపరుఁ" డను వ్యాసరాజమును వ్రాసి యాంధ్రసాహిత్యపరిషత్పత్రిక (సంపుటము 19-సంచిక 3) లోఁ బ్రచురించిన మాన్యశ్రీన్యాయపతి కృష్ణారావుపంతులు బి. ఏ., బి. యల్. అడ్వొకేటుగారు, తమ వ్యాసతల్లజములోఁ బైయంశమును ఋజావుచేయుచు నిట్లు లిఖించిరి:

"చరిత్రాత్మకవిమర్శనము లిక్కాలమున నవసరము. కవి యొక్క కాలమున విమర్శకుఁడు జీవించి యున్నాఁడనియెంచియే దాని విమర్శింపవలెను. ఇట్టి విమర్శనము ఆంగ్లేయవిద్యాధికులకు తెలియునుగాని తెనుఁగువిద్య నభ్యసించిన వారికి తెలియుట దుష్కరము."

చరిత్రాత్మకమగు విమర్శన నాంగ్లేయవిద్యాధికులకు మాత్రమే తెలియుననుట వింత కాదా? ఆంగ్లేయేతరవిద్యాధికులకు నియ్యది యేల తెలియదు? వారికి లోకజ్ఞాన ముండదని శ్రీ కృష్ణారావు పంతులవారి యభిప్రాయమై యుండనోపు. ఇది యసంగతము. మనవిద్యల నభ్యసించిన సుజ్ఞాన మలవడు నవుటకు సందియ మెంతమాత్రమును లేదు. పాప మాసంగతిని మన పంతులువారును నొకమూలనుండి యంగీకరించుచునే యున్నారు. వీరు పెద్దనార్యు నొకగొప్పలోకజ్ఞునిగ భావించుచున్నారు. అతఁ డాంగ్లేయ విద్యాధికుఁడు కాఁడు గదా? అతనికి లోకజ్ఞత యెట్లు వచ్చిన దన, మనవిద్యల నేర్పుకొనుటచేతనే వచ్చిన దనవలెను. ఇట్లు మనవిద్యల నొకవైపునుండి జ్ఞానదాయకములుగా నంగీకరించుచును గూడ సువిమర్శనము లాంగ్లేయవిద్యాధికులకే సాధ్యము లనుట వింత కాదా?

అది య ట్లుండనిండు. విద్యాధికు లైనంతమాత్రమున లాభము లేదనియు లోకజ్ఞత యంతమాత్రముచే నలవడఁజాలదనియుఁ బ్రవరుని గూర్చి ముచ్చటించు సందర్భమున మనపంతులవారు "ఊరక విద్యయే లోకజ్ఞానము చేకూర్పదని ధ్వని" యని లిఖించియేయుండిరి గదా! న్యాయమును చెప్పవలసివచ్చిన, బి.ఏ.,బి.ఎల్. అయినవారందఱు తగులోకజ్ఞానములేనివారై జీవనోపాధికిఁ గావలసినైన సంపాదించుకొనలేని స్థితిలోఁ బడి నవయుచున్నారుగారు. లోన సహజముగా నిక్కమగు జ్ఞానదీపములేక మందజ్ఞానదీపముగలవారికి నున్నతవిద్యయను వినిర్మలమగు గాజుకుప్పెయైనను నధికతేజస్సు నెట్లు కలిగింపఁగలదు? పంటాముదపు దీపముపై విలువగల గాజుకుప్పెను దెచ్చి పెట్టిన దాని తేజ మధిక మగునె? కావున విద్యాధికతయే-యందులో నాంగ్లేయవిద్యాధికతయే జ్ఞానజ్యోతిని హెచ్చుగాఁ బ్రకాశింపఁజేయఁ గలిగియుండునని తలంచుట యుచితము కాదు. ఆంగ్లేయవిద్య సుజ్ఞానప్రద మనుటకు నా కేవిధమగు నభ్యంతరము లేదు. కాని యదియే యుండవలెఁ దక్కనవిద్యలు పనికిరావని తలంచుట యనుచితము నసత్యము నని నాతలంపు.

మన పూర్వులలోని విమర్శకులును జరిత్రాత్మకవిమర్శనములఁ గావించియే యున్నారు. కవులచరిత్రలు మున్నగువానిలో కీ. శే. కందుకూరి వీరేశలింగముగారు మున్నగువారు చరిత్రాత్మకవిమర్శనములను గావించియున్నారు. ఆవిమర్శనములను నాంగ్లేయవిద్యాధికులును శిరసావహించియున్నారు. వీరేశలింగముగా రాంగ్లేయవిద్యాధికులు గారు కదా? వా రట్లేలచేయఁగలిగిరి? ఇప్పుడు బయలువెడలుచున్న

సారస్వతమును బరిశీలించిచూచిన శ్రీవీరేశలింగముగారికంటెను నల్పాంగ్లేయపాండిత్యము గలవారు-పెక్కుల, నది లేనివారుగూడఁ జారిత్రాత్మకవిమర్శనమును జేయుచున్నట్లు స్పష్టము కాఁగలదు.

ఇఁకఁ బంతులవారు చారిత్రాత్మకవిషయమునఁ దమ విమర్శనములో నేరీతిగా నడచుకొనిరో ముందుగాఁ బరిశీలించి చూచుకొందము. ఈవిషయమై వీ రీక్రిందినియమమును గావించినారు. "కవి యొక్క-కాలమున విమర్శకుఁడు జీవించియున్నాఁడని యెంచి విమర్శింపవలెను." ఇది సరియగు వ్రాఁత కాదు. ఏమన, విమర్శకుఁడు కవికాలమునాఁటివాఁడ ననుకొనుటవలన వచ్చిన లాభ మేదియును లేదు. కవి యేచరిత్రమును వ్రాయునో యాచరిత్రకాలమున నున్న ట్లెంచుకొని కావ్యమును వ్రాయవలెను. కాని తా నున్నకాలపరిస్థితులను బట్టి వ్రాయఁదలఁచుకొన్న పూర్వచరిత్రను జిత్రింపరాదు. ఇప్పు డొక్కరు రామాయణగాథను గావ్యముగాఁ జిత్రించుచు నిక్కాలమున లేని రాక్షసవానరాదులను జిత్రించి తీఁవలెనుగదా! భారతాదులను జిత్రించుచో నిప్పుడు లేని నియోగాదులఁ దెలిపితీఁవలెనుగదా! కావున విమర్శకుఁడు కవికాలమునాఁటివాఁడ ననుకొనుటవలన లాభ మేమి? కవి వర్ణించిన చరిత్ర యేకాలమునాఁటిదో యాకాలమునాఁటివాఁడనని విమర్శకుఁ డెంచుకొనవలసియుండు ననుట యుచితము. కాన పైనీమమునఁ దమ విమర్శనము సద్విమర్శన మగునో కాదో పంతులవారు బాగుగా నాలోచించుకొందురుగాక.

కవి యేకాలమునాఁటి చరిత్రమును జిత్రించుచున్నను దనకాలమునాఁటి విశేషములఁ దనకావ్యములో నెక్కించుట తటస్థింపక మానదు గావునఁ గవికాలపరిస్థితులనుగూడ విమర్శకుఁడు పరిశీలింపవలె నందురా, అట్లు చేయవచ్చును గాని కవి తాను స్వతంత్రగ్రంథము వ్రాసినప్పుడు కొంతవఱ కట్లు చేయవచ్చును.

ఒకగ్రంథము ననుసరించి తనగ్రంథమును వ్రాసి మూలగ్రంథములోని యూహలను స్వీకరించినప్పు డట్లు చేయరాదు. మూలగ్రంథములో లేని యూహలను దాను స్వతంత్రించి తనగ్రంథములోఁ బెట్టినచో నవి యాతనికాలపరిస్థితులనుబట్టి యాయంశము లాతనిగ్రంథములోఁ జేరిన వనవచ్చును.

ఇఁక నాంగ్లేయవిద్యార్థికులకు మనపంతులవారు వివాదమునందున్న విమర్శనములోఁ జారిత్రాత్మకవిమర్శన మెట్లు గావించిరో పరిశీలించి చూచుకొందము.

## హంసీచక్రవాకీ సంవాదప్రశంస

మనుచరిత్రమందున్న హంసీచక్రవాకీసంవాదమును గూర్చి పెక్కులు వ్రాసి వ్రాసి పంతులవారు తుద కిట్లు లిఖించిరి: "స్వరోచి పెక్కండ్రభార్యలను పెండ్లాడుట పెద్దనకు రుచింపలేదు. అయ్యది నీతిబాహ్య మని తోఁచెను. అట్టివి లోకమునఁ బ్రచురింపఁగూడదని యెంచెను. లోకమున నట్టికార్యములు జరుగఁగూడదను నాశతో నీసంభాషణ నిర్మించెను. చక్రవాకి స్పష్టముగ స్వరోచి చేసిన పనులను విమర్శించెను. స్వరోచికి సిగ్గు వచ్చెను."

ఇది సరియగు వ్రాఁత కాదు. హంసీచక్రవాకీసంవాదముగాని, అందలి యూహలుగాని పెద్దన నిర్మించినవే కావు. ఇటఁ బెద్దన చేసిన పని మార్కండేయపురాణములో నున్నకథను, నూహలను దనమాటలతో మనుచరిత్రమునఁ బెట్టుట. మార్కండేయపురాణమందు హంసీచక్రవాకీసంవాదములో హంసాంగన స్వరోచిచేష్టలఁ బెద్దగాఁ జేసి పలుకఁగాఁ జక్రవాకి "నాన యొకింత లేక తనవాతులయొద్దన యొక్క నాతియుం, దాను రమించు నీతఁ డొకధన్యుఁడె యొక్కని కర్థి నూర్తురే, మామకఁ బల్వురంగన" లనెను. స్వరోచి క్రీడావృత్తిని నిరసించుచు నాతని కంతమంది భార్యలపైఁగాని, వారి కాతనియందుఁగాని యగ్గలమైన ప్రేమ యుండనేరదనియు నాతని విద్యాసైపుణ్యముచే నాస్త్రీలు దొరకి రనియుఁ బలికెను.

"క. విను కలహంసీ యొక్కని
మన మొక్కతెయందు నొకతె మన మొక్కనియం
దు నిలుచుఁ దిరమయ యది నల
పనఁగాఁ దనుఁ బ్రియము పలువురందుఁ గలుగునే ?"

అని చక్రవాకి సంభాషించెను.

ఈరీతిగా మార్కండేయపురాణమందున్న యూహలను దనమాటలతో వ్యక్తపఱచిన పెదనను బెద్దచేసి "స్వరోచి పెక్కండ్ర భార్యలను బెండ్లాడుట పెద్దనకు రుచింపలేదు. అయ్యది నీతిబాహ్యమని తోఁచెను. అట్టివి లోకమునఁ బ్రచురింపఁగూడదని యెంచెను. లోకమున నట్టికార్యములు జరుగఁగూడదను నాశతో నీసంభాషణ నిర్మించె" నని వ్రాయుట యుచిత మెట్లగును? పెద్దనార్యుఁడు తాను స్వతంత్రగ్రంథమును వ్రాసి యందు బహుభార్యాత్వాదుల నిరసించువాక్యములఁ బెట్టినచో నాతనికి బహుభార్యాత్వాదులు రుచింపక యట్లు చేసె ననవచ్చును గాని మూలగ్రంథములోని భావములఁ దనమాటలతో వ్యక్తపఱచిన వాని నట్లు తలంపఁదగదు. పెద్దనార్యుఁడు మనుచరిత్రములో స్వతంత్రముగా ననేకవిశేషములఁ దెల్పియున్నాఁడు. అందుల కాతని బొగడఁదగుఁగాని యిప్పట్టున నట్లు గావింపఁదగదు.

## మృగమృగీసంవాదము

హంసీచక్రవాకీసంవాదమునవలెనే యిప్పట్టున మనుచరిత్రములో మృగమృగీసంవాదముగూడఁ గలదు. అదియును మూలమునుండి సంగ్రహించి వ్రాసినదేకాని పెద్దన స్వతంత్రించి వ్రాసినది గాదు. అయినను మనపంతులుగా రాసంవాదమును సాధారణముగాఁ దీసికొని పెద్దన పెద్దసంఘసంస్కర్త యనియు, నాతనికాలమున "బహుళపాణిగ్రహణ" ముండెడిదేమో యనియు, దాని నాతఁడు తీవ్రముగ ఖండించె ననియు నేమేమో వ్రాసిరి. ఇదంతయుఁ

బార్యాపరసందర్భములఁ దిన్నఁగఁ జూచుకొనక చరిత్రాత్మకవిమర్శనము వ్రాయుపద్ధతి నెఱుంగక వ్రాసిన యసంగతపువ్రాఁత.

మార్కండేయపురాణములో నున్న :—

"ఆ. ఏ స్వరోచిఁ గా నొకింతయు నే లజ్జ
విడువనట్టిత్రోవ విడుతు వినుఁడు
లజ్జ మాకుఁ గడుఁ దొలంగుఁడు తొలఁగుఁడు
విగతలజ్జమతుల వెనుకఁ జనుఁడు.

క. పలువురు లలనలు దనకుం
గలుగుట భోగేచ్ఛధర్మకర్మము లెల్ల
న్వ్రాలిసెను వీనికి ధనములు
లలనావర్గంబు కామలంపటుఁ డగుటన్.

ఆ. ఇట్టి యితనిమాడ్కి నెవ్వఁడు వర్తించు
నతఁడు పుణ్యలోకగతుఁడు గాఁడు
గాన నిట్టివానిఁ గామింపఁ డేను స్వ
రోచి నడుచునట్టి త్రోవ నడువ."

అను పద్యముల ననుసరించి పెద్దనార్యుఁడు పంతులుగారుదాహరించిన పద్యములను దన మనుచరిత్రములో లిఖించెను. ఇవి యును నాతని స్వతంత్రోహలు గావు. దీనింబట్టి పెద్దనవిషయమై యేమియును వ్రాయుటకు సత్యేతరులకు నలవుబడదు.

"పెద్దనకాలమం దట్టి వివాహములు విపరీతముగ జరిగెడి వేమొ" యని యాంగ్లేయవిద్యాధికులగు శ్రీ పంతులుగారు వ్రాయుట చూడ వింతను బుట్టించుచున్నది. అట్టివివాహములు (బహుళభార్యా పాణిగ్రహణములు) మార్కండేయపురాణకాలమున విశేషముగా నుండెడివేమో యనిగాని యంతకంటెను సత్యనిరూపణము చేయుటకై స్వరోచికాలమం దుండెడివేమో యనిగాని చరిత్రాత్మకవిమర్శజ్ఞులు వ్రాసిన వ్రాయవచ్చునుగాని మన పంతులుగారివలెఁ బెద్దనకాలమం దుండెడివేమో యని తలంచుట కవకాశ మింతయును లేదు.

న్యాయముచే నమితసంఖ్యగల భార్యలఁ బెండ్లియాడుట యుత్తరదేశమునందు హెచ్చుగాఁ గలదు గాని దక్షిణదేశమునందు లేదు.

బహుళభార్యాపాణిగ్రహణనిరసన మొనరించుటకై పెద్దన పైకథలను వ్రాసెనని చెప్పుట కాధార మేమియును గాన్పింపదు. అట్టిసందర్భమును దేనిని మనపంతులుగారు మాపియుండలేదు. మార్కండేయపురాణమందున్న యూహల నున్నవియున్నట్లు పెట్టిన పెద్దనవాక్యములంబట్టి పెద్దనకాలమున బహుభార్యాపాణిగ్రహణ మమితముగా నుండెడిదేమోయని యూహించుట సద్విమర్శనము గాదు. పంతులుగారు హూణవిద్యాధికులై చరిత్రాత్మకవిమర్శనము వ్రాయుటలోఁ జూపిన ప్రౌఢత యేమియుఁ గాన్పించుట లేదు. పంతులవారు హంసీచక్రవాకీసంవాదమునుబట్టియును మృగమృగీ సంవాదమునుబట్టియును బెద్దన నీతిపరుఁడని తేలుచున్నదని లిఖించిరి గాని పరికించిచూడ నట్టి యవకాశ మేదియును గాన్పించుట లేదు.

పెద్దనార్యుఁడు ప్రవరపాత్రమును జిత్రించుసందర్భమున నాతనిఁ జాల యోగ్యునిగా వర్ణించెనుగాన దానింబట్టి పెద్దన నీతిపరుఁ డని తేలుచున్నదని యూహించి "ప్రవరునిపాత్రమందు పెద్దన నీతి పరుఁడుగాక మఱెట్లుకండని యెట్లు తెలియనగు" నని పంతులవారు లిఖించిరి.

## ప్రవరపాత్రయోగ్యతనుబట్టి

కావ్యమునందలి యోగ్యపాత్రముల యోగ్యతావర్ణనముంబట్టి కవి నీతిపరుఁ డని తేల్చుట సందర్భవిహీనము. చక్కనిబుద్ధిగల కవి యొకనీతిపరునిఁ జిత్రించునపుడు నీతిపరతను జక్కఁగఁ జిత్రించును. అట్లే యవినీతిపరునిఁ జిత్రింపవలసివచ్చినపు డవినీతిలక్షణములను జక్కఁగ వ్యక్తముచేయును. నీతిపరత్వముం జిత్రించుటంబట్టి కవినీతి పరుఁ డని యెంచుచో నవినీతిపరత్వముం జిత్రించుటంబట్టి యాతఁ డవి నీతిపరుఁడనికూడ సిద్ధాంతము చేయవలసివచ్చునుగదా! నీతిపరుని నవి నీతిపరునిఁగూడఁ బ్రౌఢముగాఁ జిత్రించిన కవిని నీతిపరతయు నవి నీతిపరతయు రెండునుగూడఁ గలవాఁడని చెప్పవలసివచ్చును. అది యసంగతము గదా. కాఁబట్టి పాత్రముల నీతిపరత్వావినీతిపరత్వముల వర్ణించినంతమాత్రమునఁ గవిని నీతిపరుఁడని కాని యవినీతిపరుఁ డని గాని యెంచరాదు. అట్లెంచుట సద్విమర్శనలక్షణము గాదు.

ప్రవరుఁడు ప్రసిద్ధచారిత్రముగల యుత్తమపురుషుఁడుగాని కవి కల్పితపురుషుఁడు గాఁడు. ఈతని చారిత్రము మార్కండేయపురాణమున నత్యుత్తమమైనదిగా వర్ణింపఁబడియున్నది. అట్టి ప్రవరపాత్రమును జిత్రింపఁదలఁచిన కవి యెట్టివాఁడైనను వివేకియైనచో నుత్తమ పాత్రముగానే చిత్రించి తీఱవలసియుండును గదా! ఇఁక సత్పురుషుఁడగు ప్రవరుని సత్పురుషునిగాఁ జిత్రించినకతమునఁ బెద్దనార్యుని నీతిపరునిగా భావించుట యెట్లు? ఈ చిత్రించుటలోఁ బెద్దనకు స్వాతంత్ర్య మెక్కడిది?

ఈ ప్రవరపాత్రమునుగూర్చి ముచ్చటించుటలో మనపంతుల వారు లోకమున కర్థముగాని తత్త్వములు కొన్ని వ్రాసిరి. "'బుద్ధిజాడ్యజనితోన్మాదులు' పెద్దనయొక్క వేదాంతవిస్మయమును దెలుపుచున్నది" అని పంతులవారు వ్రాసిరి. ఆవేదాంతవిస్మయ మేదో తెలిపిన బాగుగ నుండును. ఇప్పట్టున పంతులవారు వ్రాసిన యపూర్వసిద్ధాంత ములు కొన్ని గలవు. విదేశవిద్యయే లోకజ్ఞానమునకు మూలమను నపూర్వపండితులు చేయుసిద్ధాంతములును నపూర్వములే యగునుగదా! వానినన్నిటిని జర్చించు టనవసరము. ప్రవరపాత్రమును జిత్రించుటలోఁ బెద్దన నీతిపరుఁ డని తేలుచున్నదనుట యసంగత మని తెలుపుటయే చాలును. మనపంతులుగారును బ్రవరునిఁ బెద్దధీరునిగా నెత్తుకొని తుద కమాయకబ్రాహ్మణత్వమునుండి లోకజ్ఞానశూన్యత్వ

ములోనికి దింపినారు. జ్ఞానశూన్యులను ధీరు లనుటకుఁ గాని శూరు లనుటకుఁ గాని నీతిసారు లనుటకుఁగాని యవకాశ ముండదుగదా!

### నీతులఁ బలికినంతమాత్రమున నీతిమంతు లగుదురా?

పెద్దనను నీతిపరుఁ డనుటకై యింక నొకయుక్తిని మన పంతులవారు చూపిరి. మనుచరిత్రములో నాంధ్రకవితాపితామహుఁడు రచించిన—

"ఉ. ఎవ్వఁడు మీఁదెఱుంగక యథేచ్ఛ సుఖైకరతిం జరింపఁగా
నవ్వల వంశహాని వ్రతహాని యశోధనహాని పుట్టుఁ దా
నవ్వెడ గమ్యమవ్యపథ వయ్యవివేకి చెడుం జగంబునన్
నవ్వఁగఁ బాలు రౌరవమునన్ బడఁ బాలును నిందపాలునై."

అనుపద్యము నిచ్చి యియ్యది నీతులఁ గ్రుమ్మరించుచున్న దనియు నందుచేఁ బెద్దన నీతిపరుఁడై తీఱవలె ననియుఁ బెంచి వ్రాసిరి. కాని పాపము శ్రీపంతులవారు ప్రకరణ మేదియో చూచుకొనలేదు. ప్రకరణమును చూచుకొనకుండ నిచ్చవచ్చినట్లు వ్రాసివేసిరి. మఱియును ప్రకరణాదులఁ జూచుకొనకుండ భావము తెల్పరా దను బోధను బరుల కీక్రిందిరీతిని గావించియుండిరి.

"ఒక వ్యక్తి ఒకకావ్యమును విమర్శించుతఱి కావ్యమునం తను విశాలదృక్పథముతోఁ జూచి యందుండు పాత్రల పోషణ, యౌచిత్యమును పాటించి శీలప్రకటనసమయముల నవలోకించి, ప్రకరణము గుర్తెఱింగి, పాత్రల యవలోకనవిస్తారముల నిశ్చయించి, కవినైజమును, నీతిని వెల్లడిచేయవలెను."

ఈబోధను స్వవిషయములో నించుకయు వీరు వినియోగించుకొనలేదు. పైపద్యమునందుఁ జక్కని నీతు లున్నమాట నిజము. కాని యయ్యవి లోకవంచనార్థమై యొకవంచకుఁడు పలికిన పలుకులు. పెద్దన యీనీతులఁ బెద్దమోసగాఁడగు కలియను పరమనీచగంధర్వునిచేఁ బలికించెను. వాఁడు నీచమగు నింద్రియలోలత్వమునకు దాసుఁడై యున్నవాఁడు. గంధర్వజాతియే నీచసుఖైకరతి గలదని పెద్దన మనుచరిత్రములో స్పష్టము చేసెను. అట్టి గంధర్వజాతిలోఁ జేరిన యీ కలిగాఁడు మొదట వరూధినిని గామించి యామెచేఁ ద్రోసివేయఁబడియునుగూడ నామె నేమియుపాయముచేతనైనఁ బొందవలె నని నిశ్చయించుకొని యింతలో వరూధిని ప్రవరునియందు మోహము పెట్టుకొని తద్విరహతాపపీడితయై యుండుటం గని వాని వేషమును దాను దాల్చి యామెకుఁ దనయందు మనస్సులేకున్నను వంచనపూర్వకముగా నామెను గూడెను. ఇది పరమతుచ్ఛమైనపని. ఈకలిగాఁడు చేసినపని బలాత్కారసంభోగ (Rape) మనియు శిక్షాస్మృతిచే దండనీయ మనియుఁ బెద్దనార్యుని స్థలాస్థల విచారముచేయకుండ వర్ణించుటయే ముఖ్యకర్తవ్యముగాఁ బెట్టుకొనిన యాంగ్లేయవిద్యాధికులగు శ్రీ వెన్నేటి రామచంద్రరావు పంతులు బి. ఏ. గారు కూడ లిఖించియుండిరి. ఇట్టి పరమనీచగంధర్వాధముఁడు వరూధినిని మోసముచేసి కూడినవాఁడయ్యును, సత్యము తెలిసిన నామె శపించునేమో యని భీతి బాధింప నామెనుగూడి ప్రవరుఁ డను భ్రమచేఁ దనకు వశమైనయామెనుండి తప్పించుకొని పోవుటకై నిశ్చయించుకొని పైనీతులఁ దనమోసపుకృత్యమునకు సుపోద్ఘాతముగాఁ బలికెను. ఈపలికినవాఁడు నీతియం దాదరముగలవాఁ డెంతమాత్రమును గాఁడు. ఇట్టివానినోటనుండి వచ్చిననీతివాక్యములంబట్టి నీతులఁ బలికినవా రెల్లరును నీతిపరులు గారనియు లోకవంచకులు నిక్కమైన నీతిపరులకంటె హెచ్చుగా నీతులను గూర్చి ఘనోపన్యాసముల నిత్తు రనియు గ్రహించుకొనవలెను. కాఁబట్టి పై నీతివాక్యములనుబట్టి పెద్దన నీతిపరుఁ డని తెలుపుట కవకాశ మింతయును లేదు.

ఈవిధముగాఁ బంతులవారు మనుచరిత్రమునుండి యెంచిన నీతిచ్ఛాయలనియు నాభాసమాత్రములైనవిగాని నిక్కమైన నీతులైనవి గావు.

ఇఁకఁ బెద్దన గావించిన నీతివిరుద్ధబోధల మనపంతులవారు నీతివంతములు గాపింపఁ బాటుపడిన గమనిక లెట్లున్నవో కనుఁగొందము.

### తరుణియు ననన్యకాంతయు నగు మదవతికోర్కె దీర్పకుండుట తప్పనుట

వరూధినియను పచ్చిలంజ ఘనవ్రతియగు ప్రవరనామక విప్రవరేణ్యునిపైఁ గనువెఱ్ఱఁ బెట్టుకొని యాతనిపైఁబడి తనమోహము దీర్పుమని వేఁడ నా మహనీయుఁడు కామపరవశుఁడుగాక నేను వ్రతనిష్ఠగలవాఁడ ననియు ధర్మముదప్పి పరస్త్రీవైన నిన్నుఁ గూడఁ జాలననియుఁ జెప్పి వరూధినిని నావలకుఁ ద్రోసివైచి తనయింటికిఁ దానుజనియె. వరూధినిమాత్ర మాతనియందలి మోహమును విడువఁజాలక విరహతాపముపాలై యుండుతఱి సూర్యుఁ డస్తమై గ్రుంకుచుండె. అట్టిసూర్యుని వర్ణించుచు మనపెద్దనార్యుఁడు, తరుణియు, ననన్యకాంతయు నగు వరూధినిని విరహతాపము పాలుచేసి క్రూరుఁడై ప్రవరుఁడను మహీసురాధముఁ డరిగెనను కోపమున సూర్యుఁ డాతనిపై రోషభీషణ స్ఫురణ వహించెనో యనునట్లుగా నెఱ్ఱబాఱెనని పలికె. దీనింబట్టి యనన్యకాంతయగు తరుణి తన్ను కామించి యింద్రియసుఖము దీర్పుమని కోరినప్పు డామెకోరికను దప్పక యెట్టి వ్రతనిష్ఠాపరుఁడైనను దీర్పవలసినదే యనియు నట్లు దీర్పక యామెను గామబాధకులోను గావించుట యనయము క్రూరము నహంకారయుతమునగు కృత్యమనియు భావము తేలుచున్నది. కాన నీపద్యమువలన నీతికి హాని కలుగుచున్న దని నే నిదివఱకు వ్రాసియుంటిని. పెద్దన యిచటఁ బెద్దదోషముపాలైనను నాతనిదోషమును దోషమని యొప్పక కొందఱు విద్వాంసు లాతని సమర్థింపఁ బోవుచు వ్యాసములు వ్రాసియుండిరి. వానికన్నిటికిని సమాధానము నే నిదివఱకే చెప్పియున్నాను. వానిని బాగుగాఁ జూచుకొనిన పంతులవారు మరఁ

నీవిషయమై ప్రకటింప నవసరమే లేకయుండును. అయినను నట్లు చూచుకొనక యిదివఱకు ఖండితమైన వాదమునే మరలఁ దెచ్చిపెట్టిరి. ఆలోచనపూర్వకముగాఁ బ్రతివిమర్శకులు గావించుచున్న ప్రతివాదములవలన విషయము చర్వితచర్వణ మగుచున్నది. అయినను మన పంతులవారు తమ యాంగ్లేయవిద్యాధికతంబట్టి విమర్శనపద్ధతికి నూతన తేజము కల్పించితి మని తెల్పుచున్నారు. కావున నింకను దానిని బరిశీలించుచున్నాఁడను.

ఒకపడఁతి కామాంధురాలై తనకు సంబంధములేని యొకానొకపురుషునిఁ దనకామము దీర్పఁగోరి యాతఁ డందుల కంగీకరింపక పోవుటచే విరహముపాలై యుండుటంగన నెవ్వనికైన జాలిపుట్టునట. ఇంతకంటె వింత యుండఁగలదా ?

వరూథిని జారకామినియు, మంచిచెడ్డ లాలోచింపక ప్రతియను ప్రవరునిఁ గామించుట తప్పనియు, ధర్మతత్పరుఁడగు ప్రవరుఁడు నిష్కళంకచారిత్రము గలవాఁడనియుఁ దన నీతినర్తనమును బరీక్షించి యొసఁగొట్టఁగల సమయము వరూథినీవామకాప్సరోంగనామోహపూరితాలింగనముచేఁ గలిగినను దానికి వశుఁడుగాక ధర్మవిజయ మొందిన ధీరునిగాను సంగీకరించిన మనపంతులవారు ప్రవరుఁ డొల్లమిచే విరహతాపమునొందిన వరూథినింగనఁ జాలిపుట్టుననియు, నామెవిరహమునకుఁ గారణభూతుఁ డనునవాహాచేఁ బ్రవరుని గనఁ గామె క్రోధ మదయించి యధముఁడని తిట్టఁ దలఁపులు పుట్టుననియు వ్రాయసాహసించుట యసంగతముగాదా ? స్త్రీ (వరూథిని) యవస్థను లెక్కలోనికిఁ దీసికొనుట, పురుషుని (ప్రవరుని) యవస్థను లెక్కలోనికిఁ దీసికొనకుండుట యాంగ్లేయోన్నతవిద్యాప్రభావము గాఁబోలు! కానిండు. కామించిన కామిని జారకామినియనియుఁ గామింపఁబడిన పురుషుఁడు ప్రతినిష్ఠాపరుఁడనియు, విరాగియనియు నెఱిఁగియున్నవారుగూడ జాలిపడుదురా? అట్లయిన, ప్రవరుఁడు చేసినపని తప్పియని పంతులవారి యభిప్రాయము గాఁబోలు! పెద్దన వేశ్యమాటయే చేతనలేదనియు, తరుణి, అనన్యకాంత యీరెండు నాతనిమనస్సునం జొచ్చెననియుఁ గావునఁ బ్రవరనామక మునిశ్రేష్ఠుఁడు "క్రూరత్వమును, నైచ్యమును, అహంకారమును గలవాఁడని వ్రాసె" ననియు మన యాంగ్లేయవిద్యాధికులు లిఖించిరి.

ఇట ననన్యకాంత యన నేమి? వేశ్య యనుటకుఁగాక మతే మగును? అట్లు కాదనియు వివాహములేని కన్యయనియు నర్థము చెప్పుదురా? అప్పుడుమాత్రము పెద్దన వ్రాసినది నీతిబాహ్యముగాదా? తరుణియగు నొకకన్యక యేపురుషునైనఁ గామించిన వారిఁ దామె కామమును దీర్పవలసియుండునా? అట్లుచేయుట యవినీతికి మూలము గాదా? పెక్కుల, ఈసందర్భమునఁగల 'అనన్యకాంత' యను పదము తరుణియొక్క వేశ్యాత్వమును సూచించుచునే యున్నది. వరూథిని యొకనిభార్య కాని యొకనపతియనియుఁ, నామె సామాన్యయనియుఁ గాన నామెనుగూడుట తప్పుకాదనియుఁ దప్పు కాకుండుటయేకాక మానకుండుటయే తప్పనియుఁ బెద్దన తాత్పర్యమని ప్రకరణముంబట్టి యీపద్యముం జదివిన బాలుఁడైనను గ్రహించుకొన వచ్చును. ప్రకరణముం బట్టి యర్థము చేసికొనవలెనని కదా మన పంతులవారే వ్రాసియున్నారు? దీనికిఁ జరిత్రాత్మకవిమర్శనముకూడఁ దోడగుచున్నది.

## చరిత్రాత్మకవిమర్శనము

చరిత్రాత్మకవిమర్శనమునందు నైపుణ్య ముండవలెనని వ్రాసిన పంతులవారు దాని నిట వినియోగించిన బాగుగనుండి యుండును. పెద్దనార్యుఁడు కృష్ణదేవరాయని యాస్థానమునం దుండిన వాఁడు. పరికించిచూడ రాయలకాలమున వేశ్యను గూడుట గౌరవముగా నెంచఁబడుచుండెడి దని తోఁచెడిని. ఏమన, కృష్ణదేవరాయలు చిన్నాదేవియను వేశ్యను మొదట నుంచుకొని తరువాత నామెను భార్యనుగా స్వీకరించెనని చరిత్రములు ఘోషించు చున్నవి. ఈవిషయమై కీర్తిశేషులైన కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులవారి హిందూదేశకథాసంగ్రహములో ద్వితీయభాగమందు నిట్లు వ్రాయఁబడి యున్నది: "చిన్నాదేవి యొక వేశ్యాంగన యనియు, కృష్ణరాయలు రాజగుటకు పూర్వ మీమె యెడ ననురాగముగలవాఁడై నేను రాజనగుదునేని నిన్ను వివాహమాడి పట్టపురాణిని చేయుదునని మాటయిచ్చి తాను రాజ్యమునకు రాఁగానే యామెను వివాహమాడెననియు నన్నిజ్ వ్రాసియున్నాఁడు."

చిన్నాదేవి యేజాతియాఁడుపడుచో తెలియుటలేదు. ఆమె వేశ్యయగుటచేతనే కాఁబోలు నీసంగతి తెలియవచ్చుట లేదు.

కవులు మున్నగువారు చిన్నాదేవిని రాయలదేవేరిగా వర్ణించుటకు వెనుదీయలేదు. ఇంక రాయలసభలో నున్న కవులసంగతి నాలోచించి చూచినను వేశ్యాక్రియత్వము గౌరవదాయకముగానే భావింపఁబడుచుండెడి దని తోఁచెడిని. రాయల యాస్థాన కవులలోఁ దగు ధూర్జటింగూర్చి యీక్రింది స్తవము రాయలసభలోనే కావింపఁబడినట్లు వాడుకగలదు.

" ఉ. స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కుల కెట్లు గల్గె నీ
యతులితమాధురీమహిమ హా తెలిసెన్ భువనైకమోహనో
ద్ధతసుకుమారవారవనితాజనతాఘనతాపహారి సం
తతమధురాధరోదితసుధారస ధారలఁ గ్రోలఁగాఁ జుమీ."

వేశ్యాధరపానము చేయుటచే ధూర్జటికవి కవిత్వమునందు మాధుర్యము గలిగినదని రాయలసభలో నొక యెన్నిక బయలు వెడలినది. ఇదియొక పెద్దయెన్నిక యనియుఁ దమ తాతఖ్యాతిని వెల్లడించునది యనియుఁ దెలుపుచు కుమారధూర్జటికవి తమ తాతనుగూర్చి "స్తుతమతియైన యాంధ్రకవి" యను పద్యము పుట్టినదని గొప్పగాఁ దన కావ్యములో వ్రాసికొని యున్నాఁడు. తన యాస్థానకవిశేఖరుఁడగు పెద్దనయుఁ దన కావ్యమునకు వేశ్యను కథానాయికనుగాఁ











౧.(ఏ) శ్రీ డాక్టరు పాలకోడేటి గురుమూర్తిగారు(శి) (బి) శ్రీ పాలకోడేటి సూర్యప్రకాశరావుగారు(శి) ౨. శ్రీ నాళం కృష్ణమూర్తిగారు(శి) ౩. శ్రీ సామవేదం సత్యనారాయణమూర్తిగారు(శి) ౪. శ్రీ దేవినేని సూర్యనారాయణచౌదరిగారు(శి) ౫. శ్రీడాక్టరు ముల్పూరి రంగయ్యచౌదరిగారు(శి)




పడమటి గోదావరిజిల్లా ఉప్పు-సత్యాగ్రహదళము

౧. నాయకులు: శ్రీ దండు నారాయణరాజుగారు. ౨. నాయకులు: శ్రీ చిక్కాన వెంకటరత్నం చౌదరిగారు.

దీసికొని యామెను గూడినవానిని సంగభవ విద్యాపారగునిగాను, నామెను దిరస్కరించినవానిని అరసికునిగాను జిత్రించినాఁడు.

రాయలకాలములో నాతని ముఖ్యపట్టణమగు విజయనగరము లోని వేశ్యావాటికం గూర్చి శ్రీకుందూరు ఈశ్వర దత్తుగారు వ్రాసిన "శీర్ణ విజయనగరచరిత్రము" న నిట్లు లిఖింపఁబడినది. "వేశ్యావాటికను గూర్చి యొకమాట మాత్రము చెప్పకతప్పదు. టంకసాల వెనుక నించు మించుగా నిరువది గజముల వెడల్పును, మూడువందల గజముల పొడుపునుగల యొకవీథి గలదు. ఆవీథి కిరుప్రక్కలను చక్కని పూపొదరిండ్లతో నిండిన ముంగిటి వాకిళ్లుగల శోభనగృహములు బారులు తీర్చియున్నవి. ఆ ప్రాంగణములందు జంద్రకాంతశిలానిర్మితములైన వేదికలు వరుసగా గలవు. ఆ వేదికలకు వెనుక మేడ గోడలపై సింహములు, పులులు, చిరుత పులులు, ఏనుఁగులు మొదలగు వన్యమృగములు అనేకములు జీవములతో నున్నట్లుగా చిత్రింపబడినవి. అపరాహ్ణమున ఎండ వేడిమి యించుక తగ్గుచుండ నావారవిలాసినులు చక్కఁగా నలంకరింపఁ బడిన తమ యిండ్ల ప్రాంగణములందున్న చంద్రకాంత శిలా వేదికలపై తివాసుల మీఁదను, కుర్చీల మీఁదను, సోఫాల మీఁదను, ......చేఁజనముతో సుఖోపవిష్టులై యుందురు. ప్రతి వారవిలాసినియు, నొడలంతయు, నవరత్నఖచితమాల్యాభరణములతో, మంచి ముత్తెముల హారములతో గన్నులకు మిఱుమిట్లు గొల్పు చక్కదనముతో, రంగుచీరల గట్టుకొని మాచువారల హృదయములను జూఱ గొనుచుందురు. ఒక్కొక్క వడపుటింటికి ఇద్దఱు ముగ్గురు దాసీలు. వారు తమ యజమానులకడ నిలువబడి మార్గమునబోవు విటకాండ్రను ......ప్రయత్నించు చుందురు.—...వెలయాండ్ర పొత్తుమ గూడి సుఖింప గోరువాడు ఈ వీథినిబోయి తన యిచ్చవచ్చిన తరుణిని బసియవచ్చును"—ఈ వాక్యములను అబ్దుల్ రజా కనుచరిత్రకారుని గ్రంథమునుండి ఈశ్వరదత్తుగారు ఆంధ్రీకరించిరి.

పైవేశ్యావాటిక వంటి వాటికలు పెక్కులు విజయనగరమున నుండెడి నట. పెక్కేల, అవాటికలయం దుండెడి వేశ్యల సంఖ్య పండ్రెండువేలని చరిత్రములవలనఁ దెలియవచ్చు చున్నది.

వీరాగ్రేసరుఁడై శత్రునాశన మొనరించి నిరంకుశప్రతిభతో పృథ్వి నేలిన రాయలమిఁ శృంగారప్రియుఁడును, భోగపరాయణుఁడును గూడ నగుటచే నాతని కాలములో భోగకామిను లుచ్చస్థితినంది యుండుట వింతగాదు. ఈతనికాలములో వేశ్యాప్రియత్వము గౌరవావహముగా నుండెడిదని యితనిచే రచియింపఁబడిన యాముక్తమాల్యద వలనఁగూడ బోధపడఁగలదు. ఇఁకఁ బెద్దనార్యుఁడన్ననో యాతఁడును భోగపరాయణుఁడగు శృంగారకవియే. ఈతఁడు శృంగారప్రియుఁ డగు రాజసంపుం గవి యని యాతఁడొనరించిన "నిరుపహతిస్థలంబు" అను పద్యమే చెప్పుచున్నది. ఇట్టి పరిస్థితులతోఁ గూడియున్న శృంగారకవియు బహిరంగముగా వేశ్యాప్రియత్వముఁ జూపిన శ్రీనాథుని యనుయాయియు నగు పెద్దనార్యుఁడు వేశ్యను దృణీకరింప రాదనియు నట్లుచేసినవాఁడు రసవిహీనుఁడు, క్రూరుఁడు, నధముఁడు ననియు వ్రాయుట వింతకానేరదు. ఇట్టి శృంగారప్రియత్వము హెచ్చిన నీతి కొంత సడలుటను సంగతియుఁ గ్రొత్తదిగాదు.

మన పంతులవారు తమ ఘనవిమర్శనములో "ఒక్కొక పద్యము వలన వ్యక్తుల యభిప్రాయములను నిర్ణయించుట సరికాదు. కావ్య మంతయు పరిశీలించినచోఁ గర్తయభిప్రాయము లెటు లున్నవో గ్రహింపనగును." అని లిఖించిరి.

పైపద్యమునందు నీతి సడలియున్నదని వ్రాసినవారలు కావ్యము నంతను బరిశీలించిరని యాభావమును దెల్పిరి. కావ్యమునందలి యితర భాగములు తరుణి, ననన్య కాంతయను పద్యమునందలి భావమును ఖండించి వేయుటలేదు. ఆపద్యము అనన్యకాంతయగు వేశ్యను గూడుట తప్పుకాదనియు, వేశ్యవలపును దీర్చకుండుట రసికత్వము గాదనియు సిద్ధాంతీకరించు చున్నది. ఆంధ్రదేశవిద్యాసాగరులవారు కావ్యమునందు నీతిబోధకములగు పద్యములు వేలున్నను దుర్నీతిని బోధించు పద్య మొక్కటి యం దుండుచో నాకావ్యమంతయు దుష్టకావ్యమై పోవుననియు మంచి పద్యములు కలిగించు లాభముకంటెఁ జెడ్డపద్యము కలిగించు నష్టమే హెచ్చుగుననియు నొక్క వ్రాసియున్నారు. అదిగాక పెద్దనార్యుఁడీ పద్యముద్వారముగా మాత్రమే నీతికి భంగకరమగు విషయమును బోధించి యుండలేదు. గ్రంథమునం దంతటను బచ్చి శృంగారమును విశేషముగా వర్ణించి యున్నాఁడు.

(1) కర్మఠుఁడు విరాగియు నగు ప్రవరునికి బిళ్లల మొలత్రాడు మున్నగు నగలను, అరుణాంశుకోత్తరీయాదుల వలెవాటును, రాకట్లలను, బెద్దజుట్టుముళ్లను బెట్టి వరూథినికడకుఁ దీసికొని పోయినాఁడు.

(2) హిమగిరిపై జితేంద్రియునకు సప్తభార్యలనిమిత్తమై వీతిహోత్రుఁడువిరహతాపము పాలైనచోటు మున్నగువానిని జూపినాఁడు.

(3) తన్నువలచి పైఁబడిన దివ్యసుందరమూర్తియగు వరూథినిని గూడ లక్ష్యము సేయక ధర్మమునందు స్థిరబుద్ధిగలవాఁడై యామెను ద్రోసిపుచ్చి తనవైరాగ్యమును వెల్లడించిన ధీరుఁడగు ప్రవరుని జేలయని, గోలయని, యరసికుఁడని, క్రూరుఁడని, యధముఁడని నిందించినాఁడు.

(4) తనయందు వలపులేని వరూథినిని మోసముచేసి కూడిన కలియను గంధర్వాధముని సంగభవవిద్యాపారగుఁ డని, వియచ్చరప్రవరుఁ డని స్తుతించినాఁడు.

(5) తననెచ్చెలుల బోధలు నివారితములు గాకుండఁ దానెట్లు భోగముల ననుభవింపఁ గలనని మనోరమ పెండ్లికిముందే పలికిన పలుకులను దీసికొనిపోయి భర్త పడకగదిలో సంభోగించుటకు సిద్ధపడు తఱియందుఁ బెట్టిన నాకొక్కలు జరిగితీఱునని యానవోఢచే నప్పుడు పెట్టించినాఁడు.

ప్రతి ఫలముగ నుంచుటగాని, యాసమయమున నిందీవరాక్షునకు మనోరమ[illegible] నిరసనభావము నింతేని హెచ్చుచేయదా? ఏమన వలయునరిలోఁ దన మనోగతభావము దెలుపుటకు సిగ్గుపడినను నిద్ద ఱును గదిలోనికిఁ జేరిన తరువాతనయిన నాథుఁడు తన్ను సమీపిం చినప్పుడు దెల్పవచ్చును. అప్పుడు దెల్పలేదు. అటఁ దామెను బుజ్జ గించి పెండ్లిఁ జేర్చునప్పుడైనఁ జెప్పలేదు. ముద్దిడుకొనినప్పుడు గాని, కౌఁగిలించుకొనినప్పుడు గాని చెప్పలేదు. అతఁడు శృంగారచేష్ట లొనరించి యొనరించి పూర్ణముగ మోహావేశ మొంది కవియఁ దమకింప నత్తఱిఁ దనకోర్కె నిం దెల్పుటకుఁ దగినయదనని యెంచి యేడ్వ మొదలి డెను. ఇదియేమి సంతోషసమయమున నేడ్చుచున్నావని నాథుఁడు వింతపడి యడిగెను. అప్పుడామె మెల్లగ,

ఉ. అక్కట నాయెడ న్మిగుల నక్కఱ గల్గి చరించు సెచ్చెలుల్
చిక్కి మునీంద్రశాపహతిఁ జెందిన దుర్దమరోగబాధలం
బొక్కుచునున్నవారు వనభూములఁ దద్దశ మాన్పవేని నా
కెక్కడిసౌఖ్య"

మని నుడివె. మనోరమకైన యీచర్య స్వరోచికి నిరసనభావము పుట్టింపదా? ఇట్టి యనుచితచర్యయే నిరసనభావము పుట్టింప నప్పుడు మొదటిదెట్లు పుట్టించును? మనోరమ సంభోగసమయమునఁ గొప కాలమువఱకు దన సంభోగేచ్ఛకు నాతంకము గలిగించినను స్వరోచి మఱియొకలాగున నెంచికొనక తన యభిలాషమునంతను నడచుకొని యారాత్రియే భార్యతోఁగూడ దివియలఁ జేకొంబోవి యరణ్యములలో నికిఁబోయి సఖులంగని పిమ్మట నోషధుల వెదకి తెచ్చి మాత్రలు కట్టి యిచ్చి రోగనివారణ మొనరించెనట. ఇది యసంగతము, నసంభవ ముకై యున్నదని పంతులవారు తెలిసికొనవలయును.

(4) "తన రాక్షసాకారము బోగొట్టిన స్వరోచి నభినందించుచు వాని శుభకార్యము నామోదించి సందనపూర్వకముగఁ గానుక లర్పిం చుచోఁ దన కన్యనే యిచ్చి కొండొక యభీష్టము వెలిపుచ్చుట యౌచిత్యమును బాటింపదు" అని పంతులవారి వాదము. ఇదియును సందర్భరహితమే. ఇందీవరాక్షుఁడు మనోరమను స్వరోచి కిచ్చి వివా హము చేయుదునని చెప్పినదానికి మనోరమ యాతంకమును గలిగింప లేదు. అందులకుఁ దనకుఁగల పరిపూర్ణాంగీకారము వినయభక్తులు మీఱఁ దెల్పినది. మనస్సు దుఃఖితమై యున్నది గావున సెచ్చెలుల బాధలు తొలగునంతకు భోగేచ్ఛ కలుగుటలేదని తెలిపినది. మనోర మకుఁ దనతండ్రియుఁ గాఁబోవునాథుఁడును నాయుర్వేదపారంగతు లని తెలియును. కావున దుఃఖనివారణోపాయమును వారాలోచింపు టకై తన మనోగతదుఃఖమును వెల్లడించినది. అది యౌచిత్యభంగ మును గలిగింపదు. అట్లు కలుగ లేదు. అదియే యౌచిత్యభంగమును గలి గించునో గర్భాధానపుగదిలో నాథుఁడు మహోత్సాహముతో సంభో గింప నుద్రేకించియున్న సమయమున నాయుత్సాహమునకు భంగము గలిగించి యారాత్రియే యరుగుటనో అడవియందున్న చెలికత్తియల బాధలు తొలగించుటకు సంభోగము నొల్లఁజాలనను టెక్కడను ననౌచిత్యమును గలిగింపదా? తండ్రి తలపెట్టిన వివాహమునకు, వివాహవిషయములోఁ దండ్రిచేసిన యేర్పాటునకు మాఱుపల్కరా దని తన మనోగతదుఃఖము నణఁచుకొనిన మనోరమ గర్భాధాన విషయములో నాథుఁడుచేసిన యేర్పాటునకు మాఱుపలుకరాదని యెంచి భర్తయభీష్టమును దీర్చినపిమ్మట తన మనోగతాభిప్రాయము ను వెలిఁబుచ్చుట సహజమునను గదా! మనోరమ యట్లుచేయలేదు గావున నది యసహజము, ననుచితము, నసహ్యాకరము నగుచున్నది.

(5) "ఆమెకు సౌఖ్యము హెచ్చుగ నున్న సమయములందెల్లఁ దన చెలులబాధలు జ్ఞప్తికివచ్చుచుండెను." అని పంతులగారి వాదము. ఇది నిర్మూలము. ఆమెకు వివాహాదిమహోత్సాహసమయములం దెప్ప డును సెచ్చెలుల బాధలు జ్ఞప్తికివచ్చినట్లు పెద్దన మనుచరిత్రమునందుఁ గాన్పింపదు సరికదా, మహోత్సాహముతో నామె యాసమయము నందు సంచరించినట్లుగూడ నాగ్రంథమువలన బోధపడుచున్నది.

(6) "రంగము మొత్తమును విచారించి, సందర్భముల నిరీ క్షించి మనోరమ యుద్దేశ్యమును గ్రహింపవలె గాని 'సమర్థుండను నతనిచే నది తీర్పించుకొనఁగలదిరైయి' యను వాక్యములందు వేశ్యాపర ముగ నర్థము చేయఁదగునే?" అని పంతులుగారి వాదము. రంగము మొత్తమును విచారించుటచేతనే మనోరమయుద్దేశము వేశ్యలక్షణ సమలంబించుట యని సత్యరతి యున్నవారికి బోధపడఁగలదు. వివాహ సమయమున భర్తమాపుల కెదురెక్కు మోహంపుఁజూపును జూచి మహోత్సాహముతోఁ దలఁబ్రాలుపోసి వివాహకృత్యములనెల్ల నానం దముతోఁ గొనసాగించి గర్భాధానపుఁగృత్యములలోఁ జుంబనాలింగ నాదిశృంగారచేష్టలకు నేనిని నాతంకము గలుగనీయక యొక్క సం భోగసమయమునందుమాత్రము తనకోర్కె ముందుగాఁ దీర్పించుకొను టకై జాలినిబుట్టించు నాతంకములఁ గల్పించుట వెలయాండ్రజిత్తుమారి తనముగాక మఱియేమగును? ఈ సందర్భముల నేనిని సరిగఁ జూడ కొనక పంతులవారు వ్రాసిన వ్రాఁత నిస్సారమును సత్యదూరము నగుచున్నది. మఱియు "గర్భాధానపుగదిలో గ్రహింపవలసిన ముఖ్య విషయము సెచ్చెలుల రోగము నివారించుటయకాని సంభోగము నరి గట్టుటగాదు." అని పంతులవారు వ్రాసిరి. ఇది యూహాతరమణీయము. గర్భాధానపుగదిలో సంభోగము సరికట్టుట ముఖ్యవిషయమని యెవ రును దలఁపలేదు. అది ముఖ్యవిషయమైన హానియే లేదు. అందు ముఖ్యమైనది గర్భాధానమని ప్రాజ్ఞులగువారికి వేఱుగఁ జెప్పనక్కఱ లేదు. దానికి సెచ్చెలులబాధలు నివారించుకొనవలెనను మనోరమో ద్దేశ మాతంకము గలిగించినది. అది వేశ్యాకృత్యమునంటి కృత్యమని పంతులవారు గ్రహించుకొనవలెను.

## మనుచరిత్రమునందలి కథానాయిక యెవరు?

మనుచరిత్రమునందలి కథానాయిక వరూధిని యని నేను దెల్పి నట్లు పంతులవారు లిఖించిరి. అట్లు నే నెక్కడను నే దెల్పియుండ

# ప్రయోగవిశేషవివరణము–నిర్వచనోత్తర రామాయణము

విద్వాన్, దువ్వూరి వెంకటరమణ శాస్త్రిగారు

ఆంధ్రవాఙ్మయమునఁ బ్రాచీనకవుల ప్రయోగవిశేషములఁ బరిశీలించుకొనుట భాషాస్వరూపజిజ్ఞాసువులకు సహజంబు. ఆ విశేషములను సాకల్యముగ నిర్దేశించుట లాక్షణికుల కర్తవ్యమయ్యును నాంధ్రలాక్షణికులు వానినెల్ల సమగ్రముగఁ బరిశీలింపకయుండ, బరిశీలించినను విస్పష్టనిర్వచనముగ నిరూపింపఁజాలంచియో వ్యాకరణములు రచించినవారగుటచే వీనివలన సిద్ధింపవలసిన ప్రయోజనము సాకల్యముగ సిద్ధింపదయ్యెను. ఇంతియగాక యివి సమగ్రములను భ్రాంతిచే వీనిలోఁ నిరూపింపఁబడని వెల్ల నసాధువే యను నొకయభిప్రాయము దేశమునఁ గొంతవఱకు నాటుకొనియుండుటంబట్టి యీయసమగ్రవ్యాకరణములవలన భాషాస్వరూపనిర్ణయమునఁ గొంతయనర్థముగూడ సంభవించుచున్నది. మఱియు నాంధ్రలాక్షణికులలోఁ జెక్కుమంది తమలక్షణములకుఁ బ్రమాణము లగు కవిప్రయోగముల నిర్దేశింపకుండుటచేఁ గొన్ని లక్షణముల ప్రామాణ్యము గొందఱకు సంశయిత మగుచుండుటయుం గలదు. ఈయనర్థములు గొంతవఱకుఁ దొలఁగుటకుఁ బ్రాచీనమహాకవుల ప్రయోగములఁ బరిశీలించి వెలువరించుట భాషాసేవకుల కర్తవ్యము.

తిక్కన నిర్వచనోత్తరరామాయణమందలి కొన్ని ప్రయోగవిశేషములు లాక్షణికులచే సంగ్రహింపఁబడినవి. మఱి కొన్నిటిని సాధింపఁగల సూత్రము లున్నను వాని కియ్యవి ప్రమాణములుగఁ జూపఁబడి యుండలేదు. కొన్ని సర్వథా యుపేక్షింపఁబడినవి. కొన్నిటి విషయమున లాక్షణికులకు మతభేదము లేర్పడినవి. వానిలోఁ బ్రధానము లని నాకుఁ దోఁచిన ప్రయోగవిశేషముల నిట వివరింపఁబూనితిని.

(1)

"......కవితావిలాసవిస్ఫురమహిమఁ దైన
నము...రాఁ బనిచి..." (నిర్వ. 1–2.)

ఆంధ్రశబ్దచింతామణిలో "అస్మద్యుష్మద్వ్యాచ్యాదేశత్వ ఇతో విభక్తిషాం తు ధర్మోత్తమమధ్యమానాం। బహుషు న మధ్యమవ దుతో నిత్యం సర్వేషు" అను సూత్రములచే నస్మద్యుష్మదర్థవిశేషణములకు 'ని, వి, ము, వు, యు, రు' అను నాగమములు నిత్యముగా విధింపఁబడినవి. వికృతివివేకమున 'ఇతో ఒస్మద్యుష్మదర్థా త్స్యాన్నాన్నా నిర్వికల్పా క్వచిత్' అని 'ని, వి' యను రెంటికిమాత్రము వైకల్పికత్వము విధింపఁబడెను. ఈ రెండు గ్రంథముల నాధారముగఁ గొని యహోబలపండితుఁడు కేకరాగమములు నిత్యము లని తలంచి 'పాండుభూవరునకుఁ గోడ లైతి విత్యాదివచనం త్వాకర మేవ' యనియు, 'కోవిదులం గారు, ఇతి కవితాపితామహోక్తి ర్విరుద్ధ్యైవ' యనియుఁ బ్రామాణికాగ్రగణ్యుల ప్రయోగముల నిందమొనరించుచుగా నిరసించియుండెను. అతఁడు పూనుకొన్నచో నీ నకారమునకు నర్థము గల్పించి యయ్యిప్రయోగముల సాధించుటకు మార్గ మిట లేకపోలేదు. ఆమార్గ మీతనికిఁ గ్రొత్తదియుఁ గాదు. ఏందుల నుపేక్షించెనో! కూచిమంచి తిమ్మకవి యిట్టిప్రయోగములఁ బరికించి తన సర్వలక్షణసారసంగ్రహమున,

"యుష్మదస్మత్పదంబులం దొనర ఘనుఁడ
వైననీవును నధికుఁడ నైననేను
ననెడుచో ఘనుఁ డైన నీ వధికుఁ డైన
నే ననంగ వుమల్ వాయు నీలకంఠ."

(సర్వ-1-అ-సంధి-152)

అని 'వు, ను'ల వైకల్పికతను నిరూపించి తిక్కనాది మహాకవుల ప్రయోగముల నెక్కొటి నుదాహరించియుండెను. కాని,

"యుష్మదర్థంబు బహువచనోక్తిఁ బలుకు
నపుడు ఘనులు ప్రసిద్ధులు నమపదముల
కలర ఘనులరు కదుఁ బ్రసిద్ధులరు మీర
నంగఁ జనుఁ గావ్యములయం దనంగదమన."

(సర్వ-1 అ-సంధి-162)

అని యుష్మద్విషయకముగ వేఱొక లక్షణపద్యము వ్రాసి బహువచనాంతోదాహరణము లన్నిటిని నాగమసహితంబులనే చూపియుంటచే నీతఁడుగూడ నీయాగమములు యుష్మద్బహువచనమున నిత్యము లనియే తలంచినట్లు తోఁచెడిని. ఇదంతయుఁ బరిశీలించి యింకను లక్ష్యశోధనము గావించి చిన్నయసూరి "ప్రథమాంతంబు లగు యుష్మదస్మద్విశేషణంబుల కేకత్వంబున వునులును, బహుత్వంబున రులును నంతాగమంబులు ప్రాయికంబుగా నగు" (బాల-కారక-33) నని సకలప్రయోగసమ్మతంబుగఁ బ్రాయికత్వమును విధించి యన్నివచనములందును గొన్నియెడల నివి రాకుండుటయుం గల

దని సూచించి కొన్ని యుదాహరణములఁ జూపియుండెను. కాని బహువచనోదాహరణముల నాగమరహితంబు లగువానిని దిమ్మకవి సంగ్రహింపకుండుటచే నట్టివాని నెల్లఁ జూపుట మిక్కిలి యావశ్యక మయ్యెను యుష్మద్బహువచనమునకు మాత్రము 'మీరలు పెద్దలు' అనుదానిని జూపి యస్మద్బహువచనోదాహరణము నేల చూపకుండెనో! దానికి..."ఏమీ మువ్వురున్ మన్ననల్ వడయంగాఁదగు నట్టివారము..."(భార-ఉద్యో-౨-౫౨)అను సోమయాజుల ప్రయోగమే కలదు. దీనింగూడ సూరి చూపియుండిన మఱింత సమంజసముగా నుండెడిది. ఈసందర్భమునఁ ద్రిలింగలక్షణశేషకర్త యయినను "తచ్ఛబ్దాంతములగు ధాతుజవిశేషణంబులమీఁద నరు చూపట్టును" (ప్రౌఢవ్యా-కారక-౨౬) అని సూత్రించి 'మీ కేయేగిరుల్ చూచినారు' అను సమచరిత్ర ప్రయోగము నుదాహరించి యుష్మద్బహువచనవిషయకమును సూరిగారి ప్రాయికత్వమును వివరించెనే కాని పయిని జూపిన యస్మద్బహువచనోదాహృతిని సంగ్రహింపఁడయ్యె. మఱియు నీతని యీ క్రొత్తలక్షణమునకు విరుద్ధ మయిన ప్రయోగము భారతమునఁ గానవచ్చెడిని.

క. "గురుఁడును నీవును మద్రే
శ్వరుఁడును గర్ణుండుఁ గృపుఁడు సౌబలుఁడు నన్
ధర యేలింపఁగ నున్నా
రరు నీకుం దగునె సంగరములోఁ గలఁగన్."

(భార-ద్రోణ-౫-౧౧౧.)

పయి పద్యమున 'ఉన్నారరు' అనునది తచ్ఛబ్దాంతధాతుజవిశేషణము కాకతీఱదు గదా! ఇట్టిప్రయోగముల నాధారముగఁ గొనియే తిమ్మకవి,

"విన్నారరు కన్నారరు
మన్నారరు నను మఁ బలుక నొప్పం గృతులన్."

(సర్వ-1-సంధి-142.)

అని విశదీకరించెను. పయిని జూపినరీతిని తిక్కనాదిమహాకవుల ప్రయోగము లీయాగమములు సార్వత్రికములు, నిత్యములు గా నని స్థాపించుచుండ నిట్టియెడ లాక్షణికుల కిన్ని మతభేదము లెందులకో? ప్రాచీనతాళపత్రగ్రంథములందలి పాఠభేదములు వీరి నిట్లు భిన్నమార్గములఁ ద్రొక్కించియుండునేమో! ఎట్లయినఁ గానిండు. ఈయాగమములు ప్రాయికములగుటయే ప్రాచీనప్రయోగతత్త్వము.

(2)

"మఘవిద్యాప్రియుఁడై దివౌకసుల సమ్మానించుఁ బ్రఖ్యాతి బా
హుఘనాటోపము మాన్పు ద్విజయలీలోత్సాహియై సజ్జనా
లఘుకార్యంబులు దీర్పనై దికవిధిశ్లాఘాదరస్వాంతుఁడై
రఘుభూపాలకుఁ జెప్ప నొప్పదె జగత్త్రాణప్రవీణాత్మకున్."

(నిర్వ-౧-౨౨.)

'యజ్ఞస్సవోఽధ్వరో యాగస్సప్తతన్తుర్మఖః క్రతుః' (నామలింగానుశాసనము) అను నీయజ్ఞపర్యాయములలోని మఖశబ్దము ఖకారఘటితముగ సంస్కృతమునఁ బ్రసిద్ధము. భానోజిదీక్షితీయము మున్నగు నామలింగానుశాసనవ్యాఖ్యలుఁగూడ దీనిని ఖకారఘటితముగనే సాధించుచున్నవి. ఇంద్రవాచకమగు 'మఘవాన్' అను దానిలోని మఘశబ్దము యజ్ఞార్థకము గా దనియు సూచించుచున్నవి. ఆప్టేనిఘంటువునఁగూడ నియ్యది ఖకారయుక్తముగనే కానవచ్చును. ఘకారయుక్తముగఁ గానరాదు. శబ్దరత్నాకరమున మఖ, మఘ యను శబ్దములు రెండును జేర్కొనఁబడినవి. రెంటికిని యజ్ఞార్థకత్వము నిరూపింపఁబడినది. ఒకదానికిని బ్రయోగము చూపఁబడియుండలేదు. ప్రసిద్ధమగు మఖశబ్దమునకుఁ జూప నక్కఱ లేకున్నను విశేషరూపమగు మఘశబ్దమునకుఁ బ్రయోగము చూపుట యావశ్యకము. ఈశబ్దము ఘకారఘటితమై యజ్ఞార్థక మగుటకుఁ బయిపద్యములోఁ బ్రాసనిబద్ధమగు ప్రయోగ మాధారముగ గ్రహింపఁదగును.

(3)

ఇంద్రజిచ్ఛబ్దమునకు, 'ఇంద్రజిత్తు, ఇంద్రజితుండు, ఇంద్రజి' అను తత్సమరూపముల నాంధ్రలాక్షణికులు సాధించియుండిరి. అందు 'ఇంద్రజి' అనునది యాధునికవ్యవహారదూరము. ప్రాచీనభాషలోనైన నీరూప మిట్లుండునా యని కొందఱు సంశయించునంతటి వికారము దాని కేర్పడినది. అద్దాని క్రింది ప్రయోగము లరయఁదగును.

౧ "ఇంద్రజి ననిలోఁ జంపి" (నిర్వ-౧-౭౧)

౨ "ఇంద్రజిచావు దలంప" (నిర్వ-౨-౧౩)

౩ "పిడుగ నింద్రజి యనుపేరుఁ
బెంపుఁ బడసె" (నిర్వ-౪-౧౭.)

(4)

"అక్కల కన్యకాత్వ మిటు లాఁడిపోవ నకారణంబ నీ
చెక్కడిమాలు వచ్చె నిది యెయ్యెడ నెమ్మెయిఁ బుట్టె..."

(నిర్వ-౨-౨౪)

అక్కటయను సంబోధనాంతమునకు 'అల' యనుశబ్ద మిటు సమప్రయుక్తమయినదని త్రిలింగలక్షణశేషకర్త సంగ్రహించెను. (ప్రౌఢ-శబ్ద-౧౫) ఈయనుప్రయోగము తెలుఁగునఁ గానరాకుంటచేనిట 'అక్కట' యనునది కవిప్రయుక్తమయి యుండునేమో యని కొందఱు తలంతురు.

(5)

"పలుకెంచి కదియఁబడి రే
త్తైఅ ద్రోసిన మోము దాఁచి తిరిగ నరుడి..."

(నిర్వ-3-౨౬.)

౩ "పాండవులం బాంచాలుర
..............................
......పేరుఁ జెంపుం
గండు స్నే నొండు లేక కార్యము దలఁపన్"
(భార-సౌప్తిక-౧-౫౮)

౪ "..............మాచి
కొండ మెల్లపనులు రండు వేగ"
(భార-మౌసల ౧౬౩)

(8)

"...రాక్షసవంశేనరుండు నిచ్చఁ గై
లాసమువోలెఁ బ్రాంశుఘనశృం బగు నాత్మనికేతరత్నమున్"
(నిర్వ-౪-౧౯)

గృహపర్యాయముగ 'నికేతన' శబ్దము ప్రసిద్ధమై యున్నది. వీతత్పర్యాయముగ 'నికేత' శబ్దమును సంస్కృతభాషలోఁ గలదు.

"శ్రితనోకర్ణనికేత మీశ్వరమ్"
(రఘువం-౭-౩౩)

"ఆఖ్యాతవాల్మీకినికేతమార్గః"
(రఘువం-౧౪-౫౭)

"శిలాశయాం తా మనికేతవాసినీమ్"
(కుమారసం-౫-౨౫)

మున్నగు ప్రయోగము లరయఁదగును. ప్రకృతపద్యమునఁ దిక్కన 'నికేత' శబ్దమును బ్రయోగించియుండెను. ఈపదము శబ్దరత్నాకరమునఁ జేర్పఁబడదయ్యె. ఆంధ్రగ్రంథములలోఁ గానరాని సంస్కృతపదముల నెన్నిటినో చేర్కొని యాంధ్రకవులు ప్రయోగించిన యిట్టి సంస్కృతపదములను పేక్షించుట యాంధ్రనిఘంటువుల కుచితముగాదు.

(9)

"అది మొదలు గాఁగ విష్ణుని
మది నిల్పి యతండ నాకు మగఁ డగు నని యి
ట్లు దపంబు సేయుచుండుదు
................................" (నిర్వ-౫-౭)

చింతామణిలో 'న వికృతిశబ్దా త్పరత స్సాంస్కృతికానాం భవన్తి గసడదవాః' అని తెలుఁగు శబ్దముమీఁది సాంస్కృతికపరుషములకు గసడదవాదేశము నిషిద్ధమైనది. ఇట నహోబలపండితుఁడు,

"పరుషా వా స్వరూపేణ ప్రథమాన్తోపరి స్థితాః
కాకా సంబోధనే వాఽపి ష్యాన్యయే కర్మధారయే
అచేతనార్థకే శబ్దే ఇతి శృఙ్గారభూషణః"

అను నథర్వణకారికలఁ జూపి 'సంస్కృతాసంస్కృతసాధారణ్యేన అర్థవిశేషే వికల్ప ఉక్తః విసుఁ గొవియాడ శక్య మవునె తాపస మందార, దాపసమందార' యని వ్యాఖ్య చేసియుండెను. దీనింబట్టి యీ యర్థవిశేషములందుఁ దెలుఁగుమీఁది సాంస్కృతికములకుఁగూడ వికల్పముగ నాదేశము రాఁదగు నని యాతఁడు దలంచినట్లు తోఁచెడిని. అథర్వణకారిక చింతామణిచే 'గసడదవాస్స్యుః ప్రథమా మాత్రాత్' అని నిత్యముగ విధింపఁబడిన యాదేశమును వికల్పించుచున్నదా లేక 'నవికృతిశబ్దాత్' అని నిషిద్ధమయిన యాదేశము నంగీకరించుచున్నదా యనువిషయము మూలపర్యాలోచనచే వెల్లుగాఁ జర్చింపఁదగినది. కేతన యాంధ్రభాషాభూషణమున వికృతిశబ్దముల మీఁది సాంస్కృతికముల కీయాదేశమును నిషేధించిన ట్లగపడదు. మఱియు నారఁడు విజ్ఞానేశ్వరీయమున,

'భూవల్లభు వేదవిదుని
దైవతమును దిట్టినతఁడు దండువు పేరన్
వేగనముల నెనిమిదిటిని
వేవేగ మె యరుసపలయు విధిసంతమునన్'
(ప్రాయశ్చిత్తకాండ)

అని ప్రయోగించియుండుటచే నీసంధి యాతనికి సమ్మత మనుటకును వీలు గలదు. అప్పకవి

"పరమాత్మ ప్రథమావిభక్తులమీఁదను దత్సమాసాంధ్రశబ్దముల మీఁదఁ గల సంస్కృతపదాదిగతపరుషంబు లెల్లెడ నిజరూపముల్ చెడక నిలుచు......................................"
(అప్ప-౫-౧౬౩)

అని యీసంధిని నిషేధించియుండెను. తిమ్మకవి సర్వలక్షణసారసంగ్రహమున 'న వికృతిశబ్దాత్' అను శబ్దశాసనసూత్రమునకు విరుద్ధములగు ప్రయోగములను నిర్వచనోత్తరరామాయణ (ప్రస్తుతప్రయోగమే) కాశీఖండవసుచరిత్రములలోనివానిని జూపి యీసంధి నంగీకరించెను. ఆంధ్రకౌముదిలో 'న వికృతిపదా దాద్యానామ్' అని దీనికి నిషేధము గలదు. చిన్నయసూరియు దీని నిషేధించెను. త్రిలింగలక్షణశేషకర్త 'కొన్నియెడలఁ దెనుఁగులమీఁది సాంస్కృతికకతపలకు గదసలు గానంబడియెడి' నని దీని నంగీకరించెను. తిక్కన, కేతన, నాచన సోమనాథుఁడు, శ్రీనాథుఁడు, రామరాజభూషణుఁడు మున్నగు సర్వలాక్షణికసమ్మతులగు ప్రామాణికులు పలువురు ప్రయోగించిన యీసంధిని క్వాచిత్కముగ నంగీకరించుటయే సమంజసము.

(10)

"..........................................వి
శ్వపతి యహీనబాహుబలసారఘనల్ మధుకైటభాదిదై
త్యపతుల కెల్లఁ ద్రుళ్ళుడఁచె నారయ విష్ణుఁ డమానసీయుఁడే"
(నిర్వ-౫-౧౨)

ఇట విశేష్యము ద్వితీయాంతముగను, విశేషణము ప్రథమాంతముగను బ్రయుక్తమగుట విశేషము.



౧. శ్రీ జి. నరసింహారావుగారు(శి) ౨. శ్రీశిష్ట్లా పూర్ణానందశర్మగారు(శి) ౩. శ్రీతిరువీధుల వెంకటేశ్వరులుగారు(శి) ౪. శ్రీ కర్లపాలెం కృష్ణ
రావుగారు(శి) ౫. శ్రీ వై. రంగనాయకులుగారు (శి) ౬. శ్రీ అవనిగడ్డ శేషయ్యగారు(శి) ౭. శ్రీ ధారా వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు(శి)

చింతామణి 'షష్ఠీవిశేషణానాం ప్రథమా స్యాత్' అని షష్ఠ్యంతవిశేషణములకు మాత్రము ప్రథమను విధించుచున్నది. 'విభావయా సుసన్తం స్యాత్తత్ర షష్ఠీవిశేషణమ్। భ్యాద్యర్థస్యాభానే తు శేషస్య నిఖిలం భవేత్' అను నథర్వణకారిక భ్యాద్యర్థవ్యవధానమున విశేషణముల విభక్తులన్నిటికిని ప్రథమను విధించెడిని. కవిసంశయవిచ్ఛేదమున

"అను నను క్రియతోఁ బాసియుఁ
దగఁ బెక్కువిభక్తులుం బ్రథమఁ జెందును భ
క్తగణవయమాన......"

(కవిసం-౧-౪౩)

అని మారకవి యనుధాతువ్యవధానము లేకున్నను విశేషణవిభక్తులన్నిటికిని ప్రథమ యగు నని నిర్ణయించెను.

"..........నృపథ
శ్లోకవయుఁ డర్జునతోఁ నను..."

(భార-ఆది-౬-౨౫)

"మాతండ్రి పరాశరసుతు
చేతం బడసితి ననుజ్ఞ..."

(భార-ఆశ్రమ-౧-౭౨)

అను నన్నయతిక్కనల ప్రయోగములు పయినిర్ణయమున కాధారములు. తిమ్మకవి యీవిషయమునఁ జింతామణి ననుసరించెను. (సర్వ-౧-విభక్తి-౪౪.) చిన్నయసూరి యథర్వణాచార్యుల ననువర్తించెను. (బాల-కారక-౨౬, ౨౭) ప్రౌఢవ్యాకరణకర్త ద్వితీయాదు లన్నిటికిని బ్రథమ యగు నని (ప్రౌఢ-కారక-౨౨) సూత్రించి ద్వితీయాతృతీయలకుఁ బ్రథమ వచ్చిన యుదాహరణములం జూపియుండెను. మఱియు నిట 'షష్ఠీవిశేషణానామ్' అను చింతామణిసూత్రము నందలి బహువచనమువలనఁ బ్రయోగబాహుళ్యము సూచిత మగుచున్న దని యహోబలపండితుఁడు వ్రాసియుండ నాబహువచనమే ద్వితీయాదులకుఁగూడఁ బ్రథమను సాధించుచున్న దని సూత్రసారస్యము నుద్ఘాటించియుండెను. అహోబలపండితునకు షష్ఠీతరంబుల ప్రథమ సాధువు గాదను నాగ్రహ ముండుటంబట్టియే 'ఆద్యుఁడు హిరణ్యగర్భునంవంతకంటె నిత్యాదికవితాపితామహాద్యుక్తిస్తు నీరూక్త్యైవ' యని నిరాకరించియుండెను. ఈతఁడు నిరాకరించిన యీప్రయోగము త్రిలింగలక్షణశేషకర్త గుర్తింపక కావలయును దనసూత్రమున కావశ్యకము లగు దీనిని లక్ష్యముగాఁ గైకొనఁడయ్యె.

(11)

"వెలి నిట్లంబుధినాథనందనులు దోర్వీర్యంబు సాలించి"

(నిర్వ-౫-౭౭)

'ప్రాయస్తు స్యాత్తిక్కమాదికవేరితః' అను చింతామణి సూత్రము నందలి ప్రాయోగ్రహణముచే నిత్యసంధి క్త్వార్థకస్థలములఁ బ్రవర్తింపదని యహోబలపండితుఁడు వివరించెను. అథర్వణాచార్యుఁడు 'క్త్వార్థతో న భవేత్సదా' యని క్త్వార్థకసంధిని సర్వథా నిషేధించెను. అప్పకవి

"వారిజాతనేత్ర క్త్వాప్రత్యయాంతార్థ
ములు వచించు దెలుఁగు పలుకులకును
వైస్వరంబు లంటుపట్టులఁ బ్రకృతిభా
వంబు గాని సంధి వాటపడదు"

(అప్పక-౫-౭౨)

అని యీసంధిని నిషేధించెను. కాని యాతని కవితలో

"...విమదుగ్ధయుగళ్ళుచరియై చుద్దాడురా కాసిగు
త్రైలిఁ గిట్టంబుగఁ బాలు ద్రావుమిష చే..."

(అప్పక-౪-౩౨౩)

అని క్త్వార్థకసంధి దొరలియున్నది. కవిసంశయవిచ్ఛేదకారుఁడు 'ఇడఁగ వచ్చుల్యప్పుపై నిత్యసంధి' (కవిసం-౧-౧౫) అని యీసంధి నంగీకరించి పెక్కులక్ష్యములఁ జూపియుండెను. వానిలోఁ గొన్ని భారతప్రయోగములును గలవు. కాని వాని కన్నిటికిఁ బాఠాంతరములు గానవచ్చెడిని. చిన్నయసూరి యీసంధిని స్పష్టముగ నిషేధించెను. ప్రౌఢవ్యాకరణమున నియ్యది యంగీకరింపఁబడెను. ఈసంధి నంగీకరించినవా రెల్లరును నీప్రకృతనిర్వచనోత్తర రామాయణపద్యమును 'వెలిచి ట్లంబుధినాథనందనుల' నుమాహృతో నుదాహరించియుండిరి. ఇం దేపాఠము తిక్కనకు సమ్మతమో నిర్ణయింప నాధారము లేదు. తాళపత్రములఁ బరిశీలించినను నీపాఠవిసంవాదము తొలంగదు.

(12)

"రాసాబసన నుస్మృత్యం
దై సెంకింపక కడంగ యాతం డింతల్
నే సెఁగదె చెడితి రిప్పలి
మీసల నుయ్యాల లూఁగి మెయిమెయిఁ గోరుల్"

(నిర్వ-౬-౧౧)

ఇట 'సెంకింపక' యను పదము సకారప్రాసమున నిబద్ధమయి యున్నది. దీనిని దద్భవముగ నంగీకరింపవలయును. 'శంకించు' అను నది దీని ప్రకృతి. శసప్రాసము దిక్కనకు సమ్మతము గాకుండుటచే దీనిని సకారయుక్తముగనే యాతఁడు ప్రయోగించె ననుట నిర్వివాదము. ఇది సకారయుక్తముగ శబ్దరత్నాకరమునఁ జూపఁబడియుండవలసినది.

మఱియు నీపద్యమున 'మీసము'లను దాని తుదివర్ణము లోపించి 'మీసలు' అనుట వేఱొకవిశేషము.

(13)

"అడరి వెంట నిక్కడక్కడ నడిఁ దిరిగిన" (నిర్వ-౬-౧౫౧)

"ఇట్లు కమలవంద యిక్కడక్కడ నడ" (నిర్వ-౮-౬౪)

"అనుమానముతోడ నిక్కడక్కడ నడివన్" (నిర్వ-౮-౧౦౦)

పయిపద్యములలో 'ఇక్కడక్కడ' అనునది 'ఇక్కడన్ + అక్కడన్' అని పదముల విభజించినచో సంధి దుర్ఘటమగును. 'సంధిస్తు ద్రుతప్రకృతస్య ప్రాయశో న భవేద్ వచః' అని యథర్వణుఁడును 'ఇఁకాదులకుఁ దప్ప ద్రుతప్రకృతికంబులకు సంధి లే' దని చిన్నయసూరియు స్పష్టపఱచిరి. విభక్తిలోపంబు గలుగుట కిట నామ్రేడితంబును లేదు. కావున నిద్యోతక సప్తమ్యర్థమునఁ బ్రయోగము వచ్చిన ట్లూహింపవలయును. ప్రౌఢవ్యాకరణకర్త జనంబులకు సప్తమ్యర్థమునఁ బ్రయోగము విధించి (ప్రౌ-కార-౩౦) యితరగ్రంథముల నుండి ప్రయోగములఁ జూపియుండెను. అభిధానమున కీప్రయోగములును బ్రమాణములు గానోపును.

(14)

"..........పయోజనూతిసం
తోషమున నాకలోకపతిఁ దోఁకొనిపోవు నెడన్..."

(నిర్వ-౯-౧౪)

సంతోషశబ్దమునుండి సంతోసము, సంతోసము, సంతసము నని మూఁడురూపము లేర్పడినవి. కవిసంశయవిచ్ఛేదమున,

"పరఁగ సంతోషశబ్దతద్భవము సేయఁ
జనును సంతోసమును సంతసం బటంచు
నిరుదెఱంగులఁ బలుకంగ నెల్లకృతుల
.............................."

అని రెండే రూపములు సంగ్రహింపఁబడినవి. "ఆరాటాదులం బ్రకృతేతరదీర్ఘంబునకు హ్రస్వంబు విభాష నగు" (బాల-ప్రకీ-౧౧) యను సూత్రమున నారాటాదిగణమున 'సంతోసము' అనుదానిం జేర్చి 'సంతొసము' అనుదానిని సూరి సాధించియుండెను. శబ్దరత్నాకర కర్త యయిరూపములు మూఁటిని జేర్కొనియు సంతోస మనురూపమునకు విధిగాఁ జూపఁదగిన ప్రయోగ మొక్కటియుం జూపఁడయ్యె. దాని కీప్రస్తుతప్రయోగము ప్రమాణముగ గ్రహింపఁదగును.

(15)

"...మదిని సరకు గొనక మఱచి యున్న
రొండను గాని దినములకున్"

(నిర్వ-౯-౬౩)

"అక్కటాదుల జడ్డకు లోపంబు విభాష నగు" (బాల-ప్రకీ-౮) యనుసూత్రమున నక్కటాదులలో, 'అన్ని, ఇన్ని, ఎన్ని, కొన్ని' యను శబ్దములఁ బఠించి, 'అని, ఇని, ఎని, కొని' యను రూపాంతరములను జిన్నయసూరి సమ్మతించియుండెను. శబ్దరత్నాకరమున నీరూపాంతరము లన్నియుఁ జేర్కొనఁబడినవి. కాని యిట్టి విశేషరూపములకు బ్రయోగప్రదర్శన మత్యావశ్యకమై యుండ, 'అని' యనుదానికిఁ దక్క శేషించినవానికిఁ బ్రయోగములు నిర్దేశింపఁబడవయ్యె. అందు, 'కొని' యనుదానికిఁ బ్రస్తుతప్రయోగ మును సేకరింపవలయును.

(16)

"...రామధరణీపతి తి
న్ననివప్ప మెఱయు వాతని
వినితిమి యిఁక కొకటి వినఁగ వేడుక యనుచున్"

(నిర్వ-౯-౯౫)

బాలవ్యాకరణముచే (క్రి-౫౮, ౫౯) వినుధాతువునకు భూతార్థకోత్తమపురుష బహువచనంబున వింటిమి, వినితిమి యను రూపము లేర్పడును. అందు వినితిమి యనుదాని ప్రయోగ మరుదుగ నుండును. ప్రాసస్థాననిబద్ధ మగు ప్రస్తుతప్రయోగము దానికిఁ బ్రమాణ మగును.

(17)

"అతని రక్షణంబున మహర్షి శమం బగ సావధానరై
యేతరుపండు లొప్పు నని యేఱి వనంబునఁ దెచ్చి యిచ్చుచున్
................................" (నిర్వ-౯-౧౦౧)

ఇందలి తరుపండు లనునోఁ గేవలసంస్కృతమునకును నాచ్ఛికమునకును సమాసము గలిగిన దని కొందఱు భ్రమింతురు. కాని యిది యట్టిసమాసము గాదు. తరువొక్క యను తత్సమశబ్దము పండు లను దానితో నిట సమసించినది. తరువులొక్క మున్నగువానిలో పువర్ణము లేకుండఁ దరువొక్క మున్నగు ప్రయోగములు భారతకాలము నుండి నేఁటిదనుకఁ బెక్కులు గానవగును. వికృతివివేకము (అజంత-౫౪) కావ్యాలంకారచూడామణి (౯-౧౦౯) సర్వలక్షణసారసంగ్రహము (౧-విభక్తి-౮౩) బాలవ్యాకరణము (తత్స-౪౯) మున్నగు పెక్కులక్షణగ్రంథము లిట్టి పువర్ణవిరహితరూపముల సాధించుచునే యున్నవి.

(18)

"సమ్మోహమున నినకులను భ్రమ
సమ్మగ సత్పుతులఁ బడయవలె నని తలఁచెన్"

(నిర్వ-౮-౮౩)

'వలయుస్' అను దానిరూపాంతరము 'వలెన్' అను దానిని, దీని వ్యతిరేకరూపముగు 'వలదు' అనుదానిని లాక్షణికులు సాధించినట్లగపడదు. క్రియాపదప్రక్రియను వివరించిన చిన్నయసూరి భారతకాలమునుండియుఁ బ్రసిద్ధములగు నీరూపముల ముఖ్యముగ సాధింపవలసియుండెను. 'వలెన్' అనునది 'వలయుస్' అనుదాని కాదేశ మని నిరూపించిన శబ్దరత్నాకరకర్త తన త్రిలింగలక్షణశేషమున దీని ప్రక్రియ నించుక పరామర్శించినను సముంజసముగా నుండదిది.

(19)

"తొమ్మనూటిమీఁదఁ గొంబదితొమ్మిది (౯౯౯)
వర్షములకు నంత వసుధపట్టె"

(సర్గ-౭-౭౮)

తొమ్మిదినూఱులమీఁద ననుటకుఁ దొమ్మనూటిమీఁద ననుట వింతప్రయోగము. సంఖ్యావాచకశబ్దప్రక్రియను సాకల్యముగ నే యాంధ్రలాక్షణికుఁడును జూపియుండలేదు.

(20)

"..........................................వా
శ్రీకరుల యాశ్రమంబునసమీపమునన్ మనశ్చ్యుత్యవిశ్చయం
బాకమలాక్షికిం దెలుపు మన్న నృపాలుడు నాజ్ఞసేసితిన్"

(సర్గ-౯-౧౫)

ఇట 'ఆశ్రమంబున సమీపమునన్' అనుచో షష్ఠీతత్పురుషంబున నగాగమము వచ్చినది. ఈయాగమంబును బ్రౌఢవ్యాకరణకర్త సమాసపరిచ్ఛేదారంభమున విధించి భారతాదులనుండి ప్రయోగములఁ జూపియుండెను. ఇంకను నిర్వచనోత్తరరామాయణప్రయోగములు మఱికొన్ని కలవి కొన్నిలక్షణములకుఁగా లాక్షణికులు గైకొనియుండిరి. వాని నన్నిటిం బరామర్శించుట యిం దనవసరము ప్రసక్తము గాదు. వాయిావ్యాసము నుపక్రమణమున నిరూపించినరీతి సంగ్రహమున ముఖ్యము లని నాకుఁ దోఁచిన ప్రయోగవిశేషములమాత్రము వివరించి యీవ్యాసము నింతటితో నుపసంహరింపఁదలంచితిని.

---

# ఆంధ్రభారత కవితా విమర్శనము

(ఆంధ్రగ్రంథమాల ౧౨-వ గ్రంథము) క్రౌను ౪౨౦ పుటలు. వెల రు. ౨-౦-౦.

గ్రంథకర్త: కోరాడ రామకృష్ణయ్యగారు, యం.ఏ. ప్రకాశకులు: ఆంధ్రగ్రంథమాల; ౭,తంబుశెట్టివీథి, చెన్నపురి.

ఈ గ్రంథమునందు విమర్శింపబడిన క్రిందివిషయములే దీని ప్రశస్తినిచాటును.

ఆంధ్రవాఙ్మయము ; భారతము:—విమర్శనపద్ధతులు ఆంధ్రవాఙ్మయయుగములు ప్రాచీన దేశకాలపరిస్థితులు, చాళుక్యులకాలమున నాంధ్రభాషాస్థితి, అహదనకరశాసనములోని తెలుఁగుభాగము, చాళుక్యభీమరాజ దీర్ఘాసి యుద్ధమల్లాది శాసనములు, శిష్టభాష, జానుదెనుఁగు, భారతరచన-ఛందస్సామగ్రి, ప్రాచీనభాషాస్వరూపము-జన్యభాషలు.

మతస్థితి—వాఙ్మయము:—భారతరచన-అవతారికలు, నన్నయవైదికదృష్టికి నిదర్శనములు, నన్నయతరువాతి కాలస్థితి, అరణ్యపర్వశేషపూరణప్రశంస, అరణ్యపర్వశేషమునందలి తిక్కన యనుకరణములు. తిక్కన భారతరచన, అద్వైతభావము, యవతారికలు, కవితావేశము.

భారతాంధ్రీకరణము—తిక్కన:—విరాటపర్వకథ, అందలివస్త్వైక్యము, పాండవప్రవేశము, శమీవృక్షముపై నాయుధనిక్షేపణము, బృహన్నలసారథిగాఁగుదురుకొనుట, విరటునికొలువు-భీముఁడు, కీచకవధ తదనంతరవిశేషములు.

తిక్కనార్యుని కళాప్రతిభలు:—విరాటపర్వము—ప్రబంధలక్షణములు, మూలకథపై తిక్కన వేసినయాంధ్రతాముద్ర, తిక్కనార్యువర్ణనలు, ప్రకృతివర్ణనలు, తిక్కనమనోవృత్తివివరణశక్తి, నాటకకళాచాతుర్యము, తిక్కనశృంగారవర్ణనలు, రసపాత్రపోషణరీతులు, నాటకీయతలు, తిక్కనార్యుని భాషాశైలులు, పూర్వోత్తరసందర్భముల పొందిక, ఉపమాలంకారప్రయోగము, సందర్భానుకూలముగ భావమును స్ఫురింపఁజేయు పదరచన, జాతీయప్రయోగనైపుణ్యము, అర్థముమాఱిన ధాతువులు, పదజాలము, కారకవిశేషములు, ఉపసంహారము.

# ఆంధ్రవాఙ్మయవికాసతత్త్వము-ఆంధ్రభారత కావ్యోత్పత్తి

కుందూరు ఈశ్వరదత్తుగారు బి. ఏ.,

ఏమానవుఁడైనను దన స్వీయచరిత్రను వ్రాయఁబూనుకొనినచోఁ దనకష్టసుఖములు, కలిమిలేములు, గుణావగుణముల నెట్లు పూసఁగ్రుచ్చినట్లు వక్కాణించునో, యారీతినే సారస్వతమును ఆయా యుగముల రాజకీయపరిస్థితులు, మతావలంబనములు, సాంఘికాచారముల మానవమనోవృత్తుల నన్నింటిని బరిస్ఫుటము గావించును. ఆయా కాలముల సారస్వతము ఆయాకాలముల స్వీయచరిత్రమని మా మనవి.

ఒకజాతి వాఙ్మయస్వరూపపరిణామతత్త్వనిరూపమున కా దేశజుల రాజకీయమతసాంఘికార్థికపరిస్థితులను, నాగరికాభివృద్ధిని కావ్యనిర్మాణసమయములను జక్కఁగా పరిశీలింపవలెను. అట్టి స్థితిగతు లెప్పు డొకరీతిగ నుండనేరవు. కాలచక్రము క్రిందుమీఁదగుచుండును. వాఙ్మయోత్పత్తిపరిణామములు తత్కాలపరిస్థితుల నాశ్రయించియుండును.

## కృతికి విచ్ఛేదము లేదు

సామ్రాజ్యములు నశించిపోవచ్చును. మతనిర్మూలనము సంస్కర్తలు గావింపవచ్చును. సాంఘికవిప్లవములు సంభవింపవచ్చును. కాని కవిలేఖిని కడ్డు లేదు. కవియుఁ గృతియుఁ గల్పాంతమువఱకు నివసించువారే. ఈవిషయమై పిన వీరభద్రకవి జైమినీభారతము ప్రథమాశ్వాసములో మనోహరముగా నిట్లభివర్ణించెను:

ఉ. ఆదట నృపసంతతులయందును నొక్కొకకాలమందు వి
చ్ఛేదము గల్గు నాఁటికిఁ జెప్ప విపర్యయ మేయుగంబున
న్లేదు కవిత్వసంతతికి నిక్కము తత్కవితా విలాసముల్
జాదులు నిష్టదైవము ప్రసాదము నా హరికీర్తనంబునన్.

ఇంకొక విశేషము: ఒక మానవుని రూపశీలములు తన జాతికుల మతముల ననుసరించియు, విద్యను బట్టియును గాక, అన్యజాతిమతకులసంపర్కములవల్లను, మనము నిర్ణయింప వలసియున్నది. అట్లే దేశముయొక్క సారస్వతము ఆదేశచరిత్ర ననుసరించియేగాక, విషయానంతరదేశసంపర్కముచేఁ గల్గిన మంచిచెడ్డల నాశ్రయించియుండును.

పైకారణముల నాదర్శముగ నుంచుకొని ప్రథమకావ్యమైన భారతోత్పత్తికిఁ గారణములైన పరిస్థితులను సమగ్రముగాఁ బరిశీలింతము. ఆకాలమునాఁటి రాజకీయమతసాంఘికపరిస్థితు లేమి?

కృతికర్త నన్నయ. కృతిభర్త చాళుక్యభూపాలుఁడైన రాజరాజు. ఆంధ్రరాజ్యలక్ష్మి పూర్వచాళుక్యరాజేంద్రుల భుజముల నాశ్రయించియుండెను. క్రీ. శ. 973 సంవత్సరప్రాంతముల రెండవ అమ్మరాజవిజయాదిత్యుని ద్రోసిరాజని, చాదపమహారాజు వేంగీరాజ్యము నాక్రమించుకొని, యిరువదిరెండేండ్లు పరిపాలించెను. అమ్మరాజసోదరుఁడైన దానార్ణవుఁడు చాదపునికడనుండి వేంగీరాజ్యమును గైవసము జేసికొనఁ బ్రయత్నించెను గాని విఫలమనోరథుఁ డయ్యెను. దానార్ణవున కిరువురు నందనులు. అందు ప్రథముఁడు మొదటి శక్తివర్మ. రెండవవాఁడు విమలాదిత్యుఁడు. శక్తివర్మ పశ్చిమచాళుక్యనృపాలుఁడైన తైలపదేవుని కుమారుఁడగు సత్యాశ్రయుని సహాయముతో నిజదేశముపై క్రీ. శ. 999 సంవత్సరప్రాంతముల దండువెడలి, చాదపుని సంహరించి స్వరాజ్యమును దన భుజాబలదర్పముచే సంపాదించుకొనెను. కాని శక్తివర్మకు కష్టపరంపరల కోర్చి సంపాదించుకొనిన పైతృకరాజ్యమును నిలువఁబెట్టుకొనుటకుఁ దలప్రాణము తోఁకకు వచ్చెను. సామంతనాయకులు రాజద్రోహులై చెలరేఁగుటచే శక్తివర్మ తన దండనాయకుఁడైన దాశిభీముని సహాయముతో విప్లవకారుల నణఁచివైచి దేశ మరాజకము గాకుండఁగ నిలిపెను. శక్తివర్మ పుత్రహీనుఁడై క్రీ. శ. 1011 సంవత్సరప్రాంతముల స్వర్గస్థుఁడు కాఁగా నతని సోదరుఁడైన విమలాదిత్యుఁడు రాజ్యారూఢుఁ డయ్యెను.

ఈవిమలాదిత్యుఁడే భారతకృతిపతియైన రాజరాజతండ్రి. ఇతఁడు తన మంత్రిశిఖామణియైన వజ్రపెగ్గడ సహాయముతో రాజ్యమందు శాంతి నెలకొల్పి దేశమును బదునొకండేండ్లు పరిపాలించెను. ఇతఁడు ముమ్మడిభీమబిరుదాంకుఁడు. మొదట శైవమతావలంబకుఁడు. తర్వాత జైనమతమును స్వీకరించెను. ఈతని భార్య చామెకాంబ జైనమతస్థురాలు. ఆకాలమున విశాఖపట్టణములోని రామతీర్థము జైనమతనిలయము. ఇచ్చట విమలాదిత్యుని జైనగురువైన త్రైలోక్య

యోగి సిద్ధాంత దేవుఁ డధిగమించు చుండెను. ఆ జైనమునులకు మహారాజు యాత్ర గావించి, అమునులకు భూరిదానములఁ జేసెను. విమలాదిత్యుఁడు రాజరాజసోదరుని కుమార్తెయైన కుందమాంబను పెండ్లాడెను. విమలాదిత్యుఁడు క్రీ. శ. 1022 సంవత్సరమునఁ గీర్తిశేషుఁ డయ్యెను.

తండ్రిమరణానంతరము రాజరాజు సింహాసనస్థుఁ డయ్యెను. ఇతఁడు విమలాదిత్యునకు కుందమాంబయందు జనించిన సుతుఁడు. విమలాదిత్యుని రాజ్యారంభమునకే పూర్వచాళుక్యుల కష్టములు గట్టెక్కెను. చోళులతో సంబంధబాంధవ్యములు గలసెను. రాజ్యమునందు శాంతి నెలకొల్పఁబడుటచే ప్రజలు సౌఖ్యమును గాంచుచుండిరి. రాజరాజు తన మేనమామయగు రాజేంద్రచోడుని కుమార్తెయగు అమ్మంగదేవిని వివాహ మాడెను. చోళచాళుక్యబాంధవ్యమువలన పూర్వచాళుక్యరాజ్యమునకు దక్షిణదిశనుండి యేమాత్రము తొందరలేకపోవుటయేగాక చోళమైత్రి పూర్వచాళుక్యరాజ్యప్రశాంతికి కారణభూత మగుచుండెను. అకాలముననే తూర్పుగాంగవంశజుఁడగు వజ్రహస్తుఁడు పూర్వచాళుక్యరాజ్యమున కుత్తరమున నున్న కళింగరాజ్యమును బహుసమర్థుఁడై పాలించుచుండెను.

## బ్రాహ్మణమతోద్ధారణము

రాజరాజు పూర్వచాళుక్యనృపశిఖామణి. ఈ పూర్వచాళుక్యుల మత మేది? ఆకాలమున నాంధ్రదేశమునఁ బ్రబలియుండిన మత మేది? ఆంధ్రదేశము జైనబౌద్ధమతముల కాలవాలమై బౌద్ధమఠాలయములతోను, జైనమునులతోను నిండియుండెను. ఆంధ్రదేశమున అమరావతి, విజయవాటిక, రామతీర్థము ఈమతములకు కేంద్రస్థానములు. పూర్వచాళుక్యనృపాలురు జైనమతావలంబులై, జైనగురువుల నాదరించి, జైనమునులకు దానముల గావించి జైనమతోద్ధారకులైరి. విమలాదిత్యుని జైనమతాభిమాన మిదివఱకే తెలిపియుంటిమి. పూర్వచాళుక్యరాజ్యారంభమున బౌద్ధజైనమతప్రాబల్యముచే నార్యమతము క్షీణించి, వైదికమతము ఆంధ్రభూమండలమున నంతరించిపోవు స్థితికి వచ్చెను. అట్టితఱి కుమారిలభట్టు జైనమతవిధ్వంసనము నొనరించివేసి వైదికమతోద్ధరణమును గావించెను. రాజరాజుకాలమునాఁటికి తెలుఁగుదేశమున వైదికమతము వ్యాప్తిచెందెను. చాళుక్యులు మొదటినుండియు బ్రాహ్మణభక్తులుగ నుండిరి. వీరి శాసనములలో పరమమాహేశ్వరుల మనియు, పరమభట్టారకుల మనియు, పరమబ్రహ్మణ్యుల మనియు వీరు చెప్పుకొనిరి. ఈ పరమబ్రహ్మణ్యబిరుదము పూర్వచాళుక్యనృపాలురకు విష్ణువర్ధనవిజయాదిత్యశక్తివర్మవిమలాదిత్యరాజరాజులకుఁ గలదు.

## రాజరాజబ్రాహ్మణమతాభిమానము

నన్నయభట్టు రాజరాజనుగూర్చి రచియించిన సంబోధనపదములవలన నీరాజన్యుని బ్రాహ్మణమతాభిమానము తెలియఁగనగును.

క. విమలాదిత్యతనూజుఁడు
విమలవిచారుఁడు సుమారవిద్యాధరుఁడు
త్తమచాళుక్యుఁడు వివిధా
గమవిహితక్రమఁడు సుహితకరుఁ డురుకాంతిన్.

సీ. ..............................
బలిమి నీయని భూమినలయపకుల
మక్కడఁగించుచు దిక్కుల దినమాజ్ఞ
జెలఁగించుచు విప్రకులము నెల్లఁ
బ్రోచుచు శరణన్న గాచుచు ధీరుల
వ్యగజన్ములకు నన్యగహమున

ఆ. జాగతరాగ్రహారము లిచ్చుచు
దేవభోగములు మహావిభూతిఁ
దవరఁజేయుచుట్లు మనుమార్గుఁడగు విష్ణు
వర్ధనుండు వంశవర్ధనుండు.

మ. ఇది యేతాక్ష పరితంబు నాయెడఁ గరం బిష్టంబులై యుండుఁ బా
యవు భూదేవకులాభిరత్వముమహీయఃప్రీతియున్ భారత
శ్రవణాసక్తియుఁ భారతీపతిపదాబ్జధ్యానపూజామహో
త్సవమున్ సంతతదానశీలతయు శశ్వత్స్నానసాంగత్యమున్.

క. అవిశ్రుతచరిత్రత
రాదేవాళిపరంపరావర్తితని
త్యోదయసత్యోదితవిమ
లాదిత్యతనూజ విక్రమాదిత్యనిభా!

క. శ్రీవాధమూర్తి విబుధని
ధానమహాదానతర్పితద్విజవర నేఁ
గీవాకపార్థనిభ యభి
మానమహార్ణవ, మహేంద్రమహిమాతిశయా!

## వర్ణాశ్రమోద్ధరణము

అట్టి బ్రాహ్మణప్రియుఁడును, బ్రాహ్మణమతాభిమానియు వర్ణాశ్రమోద్ధారణతత్పరుఁ డౌటకు లేశమైనను సందేహము లేదు గదా? అందుల్లనే రాజరా జిట్లభివర్ణింపఁబడెను:

ఉ. ఆశ్రితపోషణంబున వసంతవిలాసమునన్ మనీషివి
ద్యాశ్రమతత్త్వవిత్త్వమున దానగుణాభిరతిన్ సమస్తవ
ర్ణాశ్రమధర్మరక్షణమహామహిమన్ మహి నొప్పు సర్వలో
కాశ్రయుఁ డాదిరాజవిభుఁ డప్పకలంకచరిత్రసంపదన్.

## భారతకావ్యోత్పత్తిక్రమము

వైదికమతోద్ధరణమును, వర్ణాశ్రమధర్మపరిరక్షణము నెట్లు ప్రవర్ధమానము లగును? జైనమతప్రవిష్టు లగు ప్రజలకు ప్రబోధ మె

ట్లుండయుండును? ఆకాలమున జైనమతాచార్యులు ప్రాకృతభాషలో ప్రజలకు మతమును బోధించుచుండిరి. అన్యమత మన్యభాషయందు బోధించినచో మతవ్యాప్తి కావచ్చు నెట్లు? శుమతప్రచారము నరికట్టు, ప్రతిఘటించు మార్గము రాజరాజు గ్రహించెను. స్వమతమును స్వభాషయందె బోధింపవలెను. రాజరాజు అభిమతము భారతాంధ్రీకరణమూలముననే యగును.

ఏలనన—భారతప్రశస్తి నన్నయభట్టు వర్ణించిన విధమును జూడుడు:

"వేదవ్యాసుండు నిజతపోమహత్త్వంబునం జేసి బ్రహ్మచేత సమజ్ఞాతుండై, యష్టాదశపురాణంబులను, ధర్మశాస్త్రార్థతత్త్వంబులను, చతుర్వేదవేదాంతాభిప్రాయములను, చతుర్వర్గానుబంధబంధురకథేతిహాసంబులను, చతుర్వర్ణమహర్షి రాజవంశచరితంబులను, చతుర్వర్ణాశ్రమధర్మక్రమంబులను, చతుర్ముఖప్రముఖనిఖిలసురమునిగణపూజితుండైన శ్రీకృష్ణుని మహత్త్వంబును, పాండవాదిభారతవీరుల మహాగుణంబులను, దన విమలజ్ఞానమయంబైన వాగ్దర్పణంబునం దేర్పడ వెలుఁగుచుండ,

సీ. ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వేదాంతమనియు,
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవివృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్షణసంగ్రహ మని
యైతిహాసికు లితిహాసమనియుఁ
బరమపౌరాణికుల్ బహుపురాణసము
చ్చయంబని మహిఁ గొనియాడుచుండ

ఆ. వివిధవేదతత్త్వవేది, వేదవ్యాసుఁ
డాదిముని, పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరఁగుచుండఁ జేసె భారతంబు."

అట్టి భారతాంధ్రీకరణమె రాజరాజమనోభీష్ట మైయుండెను. అదియునుఁగాక భారతశ్రవణాసక్తివిలాసుఁడు మన రాజరాజు.

చ. విమలమతిం బురాణములు వింటి ననేకము లర్థధర్మశా
స్త్రములు తెలింగితి నుదాత్తరసాన్వితకావ్యనాటక
క్రమముల పెక్కు సూచితి జగత్పరిపూజ్యములైన యీశ్వరా
గమములయందు నిల్పితిఁ బ్రకాశముగా హృదయంబు భక్తితోన్.

వ. అయినను నాకు ననవరతంబును శ్రీ మహాభారతమునందలి యభిప్రాయంబు విన నభిలాష పెద్దయై యుండు.

మ. ఇవి యేమిట సతతంబునారయుఁ గరం బిష్టంబులై యుండుఁ, బా
యవు భూదేవకులాభివర్ణన మహీయఃప్రీతియున్ భారత
శ్రవణాసక్తియుఁ బార్వతీపతిపదాబ్జధ్యానపూజామహో
త్సవముం సంతతదానశీలతయు శశ్వత్సాధుసాంగత్యమున్.

చ. అమలసువర్ణశృంగఖురమై కపిలంబగు గోశతంబు వ
ర్తమబహువేదవిప్రులకు దానముచేసినఁ దత్ఫలంబు త
థ్యము సమకూరు భారతకథాశ్రవణాభిరతిన్ మదీయచి
త్తము వనిశంబు భారతకథాశ్రవణప్రవణంబుగావునన్.

## వంశకర్తల మహిమాతిశయము

రాజనరేంద్రుని తండ్రియగు విమలాదిత్యునకుఁ బూర్వులు వేంగీమండలమును బాలించిన ప్రాక్చాళుక్యప్రభువు లెవ్వరును దాము శీతాంశువంశీయులమని పేర్కొనకున్నను, విమలాదిత్యునినుండి పూర్వచాళుక్యనరపతులు తమ శాసనములందు చంద్రవంశజులమని వ్రాయించుకొనిరి. 'మన్నవైష్ణవులకు నామములు పెద్దయ'నునట్లు శుమూతనసాంప్రదాయమును నిలువఁబెట్టుకొనఁ దలఁచిన వీరికి తద్వంశకర్తలును, చంద్రవంశోద్భవులు నగు పాండుభూపతుల యూదంతము వెలిఁగించు భారతము గౌరవభాజన మయ్యెను. అందుచేఁ గాఁబోలుఁ రాజరాజు నన్నయభట్టు నుద్దేశించి యిట్లుపలికెను:

చ. హిమకరుదొట్టి పూరు భరత కురుప్రభుపాండుభూపతుల్
క్రమమున వంశకర్త లనఁగా మహి నొప్పిన యస్మదీయవం
శమునఁ బ్రసిద్ధులై విమలసద్గుణశోభితులైన పాండవో
త్తముల చరిత్ర నాకు సతతంబు వినంగ నభీష్ట మెంతయున్.

అట్టి భారతాంధ్రీకరణము శుభ్రాంశువంశోద్భవచాళుక్యకుల సంజాతుఁడైన నరపతికి హర్ష దాయకముగదా!

## ఆకాలమున భారతపురాణప్రశస్తి

శ్వశురగృహాభిమాన మాదిమూర్తులకు త్రిమూర్తులకే యుండె ననఁగా సామాన్యులగు మానవులకుండె నన్నచో నబ్బుర మేల? శంకరుఁడు హిమాలయమున వసించెను. విష్ణుమూర్తి పాలసముద్రమున నిల్లు కట్టుకొనెను. చాళుక్యనరేంద్రులు చోళభూపాలురతో బాంధవ్యమును గల్పుకొన్నతర్వాత చాళుక్యులకు అత్తయింటివారనిన గౌరవము మెండయ్యెను. విమలాదిత్యుఁడు కుందవాంబను వివాహమాడి, తన కుమారుఁడును, భారతకృతిపతియు నైన రాజరాజునకు మామగారైన రాజరాజు పేరిడెను. రాజరాజు తన మేనమామయైన రాజేంద్రచోడుని కుమార్తెను పరిణయమై, తనకుమారునకు మాతామహుఁడైన రాజేంద్రచోడుని నామమిడెను. రాజరాజునకు మేనమామల సాంప్రదాయ మబ్బెను. అతనికాలమున చోళమండలమున నుండెడి వేదపాఠశాలలో మహాభారతమొక పఠనీయగ్రంథముగ నుండెడిదఁట. అదియుఁగాక చాళుక్యాన్వయులె మహాభారతగ్రంథమునం దధికాదరణము కలవారైనట్లు చరిత్రవల్ల తెలియుచున్నది. తల్లియగు అమ్మంగదేవికి భారతకథాశ్రవణమనిన నిష్టమై యుండెనో ప. ఆమె పుట్టినింటివారి

రాజ్యమున నభిమానింపఁబడిన గ్రంథరాజములచే అరవసంపర్కము వల్ల రాజరాజు మాతృభాషను మఱచిపోక మాతృదేశోద్ధారకుఁడై, ఆంధ్రసారస్వతాభ్యుదయమునకుఁ గారణభూతుఁ డయ్యెను. మన మెల్లరము ధన్యులము. ఎందులకా? ద్రావిడసంపర్కముచే నెతవొందుచున్న యిప్పటి తెలుఁగువారికి తెలియదా?

## ప్రజల మనోభీష్టము

సంస్కృతమహాభారతమును జదివి బోధపఱచుకొన లేని సామాన్యజనులకు మాతృభాషయైన యాంధ్రమున నా మహాకావ్యము నన్నయతిక్కనలు తెనుఁగుఁ జేసి, ప్రజలను గృతార్థులఁ గావించిరని మడికిసింగన్నయు, సెట్టి పెద్దడయు వ్రాసిరి:

ఉ. భారతవేదవాక్యరసభారము లజ్ఞు లెఱుంగ లేక ని
స్సారమనస్కులై తిరుగుచుండఁగఁ జూచి తెనుంగుబాస సొం
పార రచించి యందఱఁ గృతార్థులఁ జేసిన పుణ్యమూర్తులన్
పారమతిన్ భజింతు ననిశంబును నన్నయతిక్కనార్యులన్.

ఉ. భాసురభారతార్థముల భంగుల నిక్క మెఱుంగ నేరమిన్
గాసటలీనచే చదివి గాథల త్రవ్వ తెనుంగువారికిన్
వ్యాసమునిప్రణీతపరమార్థము తెల్లఁగఁ జేసినట్టి యా
జ్ఞానదకల్పులన్ దలఁతు నార్యుల నన్నయతిక్కనార్యులన్.

## చాళుక్యనృపాలుర కావ్యగీతిప్రియత్వము

రాజరాజునకుఁ బూర్వము వేంగీదేశమును బాలించిన చాళుక్య మనుజాధీశులు తమశాసనములందు విద్యాకల్పతరులనియు, కవిగాయక కల్పతరులనియు వక్కాణింపఁబడిరి. నన్నయభట్టు రాజనరేంద్రుని విద్యాపోషకత్వమును, శైవత్వమును వివిధరీతుల వర్ణించెను.

క. శ్రీవనితావల్లభ వేఁ
గీవిషయాధీశ కావ్యగీతిప్రియ నా
నావిశాకకీలిత
దీవిలసద్రత్నసంఘటితపదకమలా!

క. రాజమహేంద్రకవీంద్రప
మాజనరక్షాజ రాజమార్తాండ ధరి
శ్రీజనవర చారిత్రవి
రాజితగుణరత్న రాజరాజనరేంద్రా! etc.

## అన్యభాషలలో భారతానువాదము

సంస్కృతభారతము ఇదివఱకె కన్నడభాషలో భాషాంతరీకరింపఁబడియుండెను. రాజనరేంద్రునకుఁ బూర్వము వేంగీమండల నాయకుఁడగు అరికేసరినృపాలుఁడు విక్రమార్జునవిజయమను పేర కన్నడభారతగ్రంథమును గృతినందెను. తత్కృతికర్త యరికేసరి సేనానియగు పంపాకవియనువాఁడు. ఈవిషయ మెఱింగినవాఁడగుటచేఁ గాఁబోలు

క. బహుభాషల బహువిధముల
బహుజనములవలన వినుచు భారతబద్ధ
స్పృహులగువారికి నెప్పుడు
బహుయాగంబుల ఫలంబు పరమార్థముగన్.

అని రాజరాజు మహాభారతమున వక్కాణించెను.

పైని వివరింపఁబడిన కారణముల ననుసరించి ఆంధ్రమహాజనులకు ప్రథమాంధ్రకావ్యమైన మహాభారతము లభించెను.

---

# కల్పసూత్రములు

శ్రీ క్రై. కోటేశ్వరదీక్షితులుగారు

శిక్షాకల్పోఽథవ్యాకరణం నిరుక్తం ఛందసాంచయః అను వ్యాసస్మృతివచన కల్పోక్తము నిచ్చుచున్న దనుచున్నది. 'కల్పః వ్యాకరణం ఛందో జ్యోతిషం' వేదాంగము లాఱింటిలో కల్పసూత్రము రెండవ వేదాంగముగానున్నది. అట్టి వేదాంగమగు కల్పసూత్రభాగమునుగూర్చి యిచ్చట వ్రాయుచున్నాము.

ద్విజాతులందఱు తాము నిత్యము చేయుచున్న మతాచార విషయములందు తాము ఏ వేదమునకు, సూత్రమునకు, గోత్రమునకు చెందియున్నారో, ఆ గోత్రమునకు ప్రవరఋషులెవ్వరో ఆ విషయమును సంస్మరించుచు చేయుచున్నారు— "చతుస్సాగరపర్యంతం గోబ్రాహ్మణేభ్యః శుభం భవతు; కాశ్యప, ఆవత్సార, నైధ్రువ, త్రయార్షేయ ప్రవరాన్విత కాశ్యపసగోత్రః, యజుశ్శాఖీ, తైత్తిరీయశాఖాధ్యాయీ, ఆపస్తంబసూత్రః, నారాయణశర్మా అహంభో అభివాదయే" అని చెప్పుచుందురు. గోత్రప్రవరశాఖాసూత్రనామములను తమకు సంబంధించినవి చెప్పుకొందురు. కనుక తమతమ గోత్రశాఖాసూత్రములను గూర్చి తెలిసికొనుట ద్విజులందఱకు ఆవశ్యకమని వేఱుగ చెప్ప నక్కఱలేదు.

భరతఖండమునందుగల ద్విజాతులందఱు ఋగ్యజుస్సామాథర్వములను నాలుగువేదములకు సంబంధించియున్నారు. అనగా ద్విజాతులని చెప్పబడువా రందఱు పై నాల్గువేదములలో ఏదో ఒక్క వేదమును లోకమునందు అధిక పఠనపాఠనములతో ప్రచారమొనర్చిన మహర్షి యొక్క వంశమునకు సంబంధించినవారని భావము. ఇచట వంశమనగా మాతాపితృసంబంధముగా నుండితీరవలయు ననునియమము లేదు. గురుశిష్యసంబంధముగా కూడ నుండవచ్చును. అపారమయిన విద్యాసముద్రమును ఒక్క పురుషు డీదజాలుట యశక్యమని యెంచి, యను వెల్లించిన మహర్షులు అపారమయిన వైదికవిజ్ఞానమంతయు లోకమునందు పఠనపాఠనములతో వ్యాప్తిచెందవలయునను సమూహతో కొందఱను ఋగ్వేదాధ్యాయులుగను, కొందఱను యజుర్వేదాధ్యాయులుగను, కొందఱను సామవేదాధ్యాయులుగను, కొందఱను అథర్వవేదాధ్యాయులుగను ఆదియందు నిర్ణయించి ఆయావేదమును చదువవలసినవారి సంతతికి చేరినవారలు ఆదియందు తాము చదువ వలసిన వేదమును పూర్తిగ పఠించినతరువాతనే ఇతరవేదముల పఠించవలయుననియు, తమవేదమును పఠింపక ఇతరవేదముల పఠించినచో వారు శాఖారండులని పిలువబడి సర్వధర్మకర్మలయందు బహిష్కృతులగుదురనియు శాసనముగ శాసించిరి. అట్టి శాసనకారణముల్లనే ఆర్థికముగ ఇహలోకమున బాధలు లేకపోయినను అధికముగ పఠన పాఠనములందు దేశభేదముగాని, కాలభేదముగాని లేక భరతఖండమునందంతట నాల్గువేదములకు వ్యాప్తి కలిగియుండుట గనబడుచున్నది.

ఒక్కొకశాఖకు సాధారణముగ ఒక్కొకకల్పసూత్రము ఏర్పడియున్నటుల తోచుచున్నది. ఈ కల్పసూత్రములందు స్మార్తవిభాగము, శ్రౌతవిభాగము, ధర్మవిభాగము అని మూడువిభాగము లున్నటుల తెలియవచ్చుచున్నది. స్మార్తవిభాగమునకు గృహ్యసూత్రమనియు, శ్రౌతవిభాగమునకు శ్రౌతసూత్రమనియు, ధర్మవిభాగమునకు ధర్మసూత్రమనియు వ్యవహారము విశేషించియున్నది. వివాహమయినపిదప పత్నీసహితుడయిన గృహస్థుడు హోమాదిక్రియలను కొన్నిటిని వివాహాగ్నియందు చేయవలయును. గృహ్యసూత్రమునందు చెప్పిన క్రియలలో కొన్ని ప్రతిదినము చేయవలసినవియు, కొన్ని అమావాస్యాదికములను ఆయాతిథులందు చేయవలసినవియు గలవు. గృహ్యసూత్రవిహితములగు క్రియలన్నియు ఒక్క గృహ్యాగ్నియందే చేయదగినవి కనుక ఆయగ్నియందు చేయదగిన వైదికవిధులం దుపయోగింపబడుచున్న మంత్రసమూహమునకు 'ఏకాగ్నికాండ' యను సార్థకనామము సుప్రసిద్ధము.

ఋగ్వేదమునకు ౨౧ శాఖలును, యజుర్వేదమునకు ౧౦౧ శాఖలును, సామవేదమునకు ౧౦౦౦ శాఖలును, అథర్వవేదమునకు ౯ శాఖలును గలవని వ్యాకరణ మహాభాష్యమున పతంజలి వ్రాసియున్నాడు. ఆప్రకార మిప్పుడు ఆయావేదములయొక్క శాఖలన్నియు ప్రచారమునందు లేవు. ప్రచారమునందుగల శాఖలకు సంబంధించినంతవఱకు కల్పసూత్రములను గూర్చి యిచ్చట వివరించుచున్నారము.

## ౧. ఋగ్వేదకల్పసూత్రములు

### ౧. ఆశ్వలాయనకల్పసూత్రము.

ఋగ్వేదమునకుచేరిన ఆశ్వలాయనసూత్రము ననుసరించుచున్న బ్రాహ్మణులు పంచగౌడులలోను పంచద్రావిడులలోను అధికసంఖ్య













౧. శ్రీ గరిగిపాటి వెంకటజోగయ్యగారు (శి) ౨. శ్రీ బోయిన వెంకన్నగారు (శి) ౩. శ్రీ మానేపల్లి మల్లికార్జునుడుగారు (శి)
 ౪. శ్రీ పసల కృష్ణమూర్తిగారు (శి) ౫. శ్రీ దండు గంగరాజుగారు (శి) ౬. శ్రీ విశాల వీరభద్రరావుగారు (శి)








౧. శ్రీ గాదిరాజు వెంకటేశ్వరరావుగారు (శి) ౨. శ్రీ పిరిపురపు వీరభద్రరావుగారు (శి) ౩. శ్రీ డాక్టరు శివలెంక మల్లికార్జునరావుగారు (శి)
౪. శ్రీ కోట నాగభూషణంగారు (శి) ౫. శ్రీ కాకాని వెంకటరత్నంగారు (శి) ౬. శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు (శి)

తులు గలరు. ఆంధ్రబ్రాహ్మణులలో వెలనాడు, వేగినాడు, తెలగాణ్యము మున్నగు అంతర్విభాగములందున్నూ ఋగ్వేదమునకుచేరిన ఆశ్వలాయనసూత్రము ననుసరించువార లున్నారు. ఆంధ్రబ్రాహ్మణులలో కరణకమ్మలు, నందవరీకులు అను తెగలవారు కేవలము ఆశ్వలాయనసూత్రమునకు సంబంధించినవారే. ఈకల్పసూత్రముయొక్క గృహ్యశ్రౌతవిభాగములుమాత్రము నాగరాక్షరములందు వ్యాఖ్యానసహితముగ ముద్రితములయి యున్నవి. ఆశ్వలాయనధర్మసూత్రము మాత్రము లభించుట లేదు. ఉన్నటులగూడ ప్రాచీననిబంధనగ్రంథములం దెచటను స్మరింపబడియుండ లేదు.

ఆశ్వలాయనగృహ్యసూత్రమునకు హరదత్తాచార్యకృతమగు 'అనావిల' యను వ్యాఖ్యయు, గార్గ్యనారాయణకృతమగు వృత్తియు, శ్రౌతసూత్రమునకు నారాయణకృతవృత్తియు నాగరాక్షరములందు ముద్రితము లయియున్నవి. ఇదిగాక ఈగృహ్యసూత్రమునకు జయంతస్వామి, ఆనందరాయవాజపేయ, దేవస్వామి, విష్ణుగూఢస్వామి మున్నగువారిచేత వ్రాయబడిన వ్యాఖ్యానగ్రంథములు గలవు. కుమారిలస్వామి, రఘునాథదీక్షితులు, గోపాలసుధి మున్నగువా రొనర్చిన గృహ్యసూత్రకారికలు, తిరుమలయజ్వ, నరసింహభట్టు మున్నగువారిచేత సంకలితములయిన ప్రయోగగ్రంథములు అనేకములు గలవు. 'లఘుఆశ్వలాయనస్మృతి' అను పేరుతో శ్లోకరూపముగనున్న ధర్మశాస్త్ర గ్రంథమొకటి ఆనందాశ్రమగ్రంథమాలికయందు ప్రకటితమయి యున్నది. ఇదిగాక దాదాపు ౨౦౦౦ శ్లోకములు గల 'ఆశ్వలాయనస్మృతి' యను వ్రాతకాపీ బొంబాయియూనివర్సిటీలైబ్రరీలో గలదని తెలియవచ్చుచున్నది.

### ౨. శాంఖ్యాయనగృహ్యసూత్రము ౨.

### (కౌషీతకీగృహ్యసూత్రము)

ఈ పేరుతో ఒక గృహ్యసూత్రగ్రంథము, శ్రౌతసూత్రగ్రంథము ముద్రితమయి యున్నది. ఈ సూత్రము ననుసరించు బ్రాహ్మణులు ఆంధ్రద్రావిడదేశములందుగల బ్రాహ్మణశాఖలందు గనంబడుట లేదు. మళయాళబ్రాహ్మణులందున్నూ, ఉత్తరహిందూస్థానమునందున్నూ గలరని తెలియవచ్చుచున్నది. ఈసూత్రమునకే కౌషీతకీగృహ్యసూత్రమనియు నామాంతరము గలదు. శ్రౌతసూత్రమునకు శాంఖ్యాయనశ్రౌతసూత్రమనియే ప్రసిద్ధిగాని కౌషీతకీశ్రౌతసూత్ర మను ప్రసిద్ధి లేదు. ఈ గృహ్యసూత్రమునకు బ్రహ్మదత్తకృతభాష్యము, దయాశంకరరఘునాథరామచంద్రాదులచేత రచింపబడిన వ్యాఖ్యలు, కృష్ణాజీ ద్వివేదికృతగృహ్యసూత్రపద్ధతి మున్నగు గ్రంథములు గలవు. ఈ సూత్రము ననుసరించు బ్రాహ్మణు లత్యల్పసంఖ్య గలవారగుటచేత కాబోలు, ఈగృహ్యసూత్రమునకు సంబంధించిన వ్యాఖ్యానాదిగ్రంథములలో నొక్కటియు ముద్రితము కాలేదు. ఆనర్తకృతశాంఖ్యాయనశ్రౌతసూత్రవ్యాఖ్యమాత్రము ఏషియాటిక్కుసొసైటీవారిచేత ముద్రితమయి యున్నది.

### ఋగ్వేదకల్పసూత్రములు సమాప్తము.

---

## ౨. యజుర్వేదకల్పసూత్రములు.

యజుర్వేదము కృష్ణమనియు, శుక్లమనియు ద్వివిధముగా గలదు. అందు కృష్ణయజుర్వేదకల్పసూత్రములను గుఱించి ప్రథమమున వ్రాయుచున్నాడను. కృష్ణయజుర్వేదశాఖలలో తైత్తిరీయశాఖ, మైత్రాయణీయశాఖ, చరకశాఖ అను మూడుశాఖలు, తత్సూత్రములు మాత్రమే వ్యవహారమునం దున్నటుల తెలియవచ్చుచుండుటచేత ఆశాఖలకు సంబంధించిన కల్పసూత్రములను క్రమముగ పేర్కొనుచున్నాడను.

### ౨. అ. తైత్తిరీయశాఖాకల్పసూత్రములు.

### 3. ఆపస్తంబకల్పసూత్రము ౧.

ఈయాపస్తంబకల్పసూత్రము తైత్తిరీయశాఖకు సంబంధించిన ఆరు సూత్రములలో నొకటి. ఈకల్పసూత్రముయొక్క గృహ్యశ్రౌతధర్మవిభాగములు మూడున్నూ సభాష్యములుగ ముద్రితములయి లభించుచున్నవి. భరతఖండమునం దన్నివైపుల నీసూత్రము ననుసరించు బ్రాహ్మణులు గలరు. ఆంధ్రద్రావిడబ్రాహ్మణులలో అత్యధికసంఖ్యాకులు ఆపస్తంబసూత్రము ననుసరించుచున్నారు. ఆపస్తంబసూత్రమునకు కపర్దికృతభాష్యము, హరదత్త, రుద్రదత్త, ధూర్తస్వామి, గోపాలయజ్వ మున్నగువార లొనర్చిన వ్యాఖ్యలు, కపర్ది, సుదర్శనాచార్యుడు మున్నగు వార లొనర్చిన కారికలు, తింగాభట్టు, బప్పనభట్టు మున్నగువారలు సంకలితమొనర్చిన ప్రయోగగ్రంథములు అత్యధికసంఖ్యగలవి లభించుచున్నవి. గృహ్యధర్మసూత్రములు ఆంధ్ర, ద్రావిడ, నాగరాక్షరములందుకూడ ముద్రితములయి యున్నవి. శ్రౌతసూత్రము సవ్యాఖ్యగ చాలరోజులక్రిందట నాగరాక్షరములందే ముద్రితమయియుండెను గాని ఇప్పు డాగ్రంథము లభింపదు. ఈ గృహ్యసూత్రమునకు విద్యారణ్యకృతవ్యాఖ్యకూడ నొకటి యున్నటుల తెలియవచ్చుచున్నదిగాని ఆగ్రంథ మింతవఱకు నాకు లభింప లేదు.

### ౪. సత్యాషాఢహిరణ్యకేశీయకల్పసూత్రము ౨.

ఈసూత్రము తైత్తిరీయశాఖకు సంబంధించిన కల్పసూత్రములలో నొకటి. ఈసూత్రము ననుసరించు బ్రాహ్మణులు ఆంధ్రులలో లేరు. ద్రావిడకేరళబ్రాహ్మణులలో నీసూత్రము ననుసరించు బ్రాహ్మణులు గలరు. ద్రావిడబ్రాహ్మణులలో నీసూత్రము ననుసరించు బ్రాహ్మణులకు "కేశియర్లు"అని వ్యవహారము గలదు. ఈసూత్రము ననుసరించు బ్రాహ్మణులలో పలువురు పునహానగరమునను, తత్సమీపమహారాష్ట్రి

దేశమునందును గలరు. వారిలో అధికసంఖ్యాకులు మహారాష్ట్రులు. సవ్యాఖ్యానముగ ఈ సూత్రమునకు సంబంధించిన గృహ్య ధర్మ శ్రౌతవిభాగములు పూనాలో ఆనందాశ్రమగ్రంథమాలాధిపతుల చేత ఇప్పుడే ముద్రితములయి యున్నవి. ఈధర్మసూత్రమునందు గల గ్రంథమంతయు అచ్చటచ్చట కొంచెము భేదముతో ఆపస్తంబసూత్రమునకు నకలుగా సరిపోవుచున్నది. ఈసూత్రమునందు వివాహయోగ్యయగు కన్యక "నగ్నిక"గా నుండవలయునని చెప్పబడినది. మహాదేవుడు, వాంఛేశ్వరుడు, గోపీనాథభట్టు, మాతృదత్తుడు మున్నగు వారలు చేసిన కల్పసూత్రవ్యాఖ్యలు కొంతకొంతవఱకు అచ్చటచ్చట లభించుచున్నవి. ఒక్కరేచేసిన సమగ్రకల్పసూత్రవ్యాఖ్యానము లభింపనందు వలన ఆయాభాగములకు లభించినంతవఱకు చేర్చి సమగ్రముగ వ్యాఖ్యాసహితముగ నీకల్పసూత్ర గ్రంథము నాగరాక్షరములందు ముద్రింపబడినది.

### ౫. బోధాయనకల్పసూత్రము ౩.

ఈసూత్రముకూడ తైత్తిరీయశాఖకు సంబంధించిన కల్పసూత్రములలో నొకటియే. గృహ్యధర్మశ్రౌతవిభాగములు మూడున్నూ లభించుచున్నవి. ద్రావిడులలోను,కర్ణాటకులలోను ఈసూత్రము ననుసరించు బ్రాహ్మణులు గలరు. ఆంధ్రదేశమునందు ఆదిశైవులనియు, శివద్విజులనియు అచ్చటచ్చట గనంబడుచున్న బ్రాహ్మణశాఖాబ్రాహ్మణులలో పలువురు తా మీసూత్రమునకు చెందినవార మని చెప్పుకొనుచున్నారు. ఆంధ్రదేశమునందుగల ఇతరబ్రాహ్మణశాఖలలో నీసూత్రము ననుసరించువారు గనంబడుటలేదు. సర్వవేదవ్యాఖ్యాతలును, మహర్షికల్పులును అగు శ్రీమత్సాయణమాధవాచార్యులు ఈ బోధాయనసూత్రీయు లగు బ్రాహ్మణులే. ఈ కల్పసూత్రగ్రంథము ఇతరకల్పసూత్రగ్రంథములకంటె చాలపెద్దదిగ తోచుచున్నది. నాగరాక్షరములందు మైసూరుగవర్నమెంటువారు గృహ్యధర్మవిభాగములను మూలముమాత్రమే ప్రకటించియున్నారు. శ్రౌతసూత్రము ఏషియాటిక్ సొసైటీవారిచేత ముద్రింపబడుచున్నది. గోవిందస్వామి, అష్టావక్ర, శిష్టి మున్నగువా రొనర్చిన సూత్రవ్యాఖ్యలు, కేశవస్వామి, కనకసభాపతి మున్నగువార లొనర్చిన గృహ్యకారికలు, ప్రయోగపద్ధతులు మున్నగునవి కలవుకాని అవియన్నియు అముద్రితములు. ఆపస్తంబ,హిరణ్యకేశీయగృహ్యసూత్రములందు చెప్పిన విషయములకంటె అధికవిషయము లీసూత్రమునందు చెప్పబడియున్నవి. 'అనుక్తమన్యతో గ్రాహ్యం' అను అభ్యనుజ్ఞ ననుసరించి ఆపస్తంబాదిసూత్రముల ననుసరించు బ్రాహ్మణులు తమతమసూత్రములందు చెప్పబడని స్మార్తకర్మల విషయమయి బోధాయనసూత్రమునందు చెప్పబడినవాని నాచరించుచున్నారు. ఉపనయనమునందు నాల్గవనాడు చేయునట్టి పాలాశకర్మయున్నూ,వివాహమునందు అయిదవ నాడు చేయునట్టి 'నాకబలి'కర్మయున్నూ బోధాయనసూత్రమునకు సంబంధించినవియే. ఇట్లే ఆంకురార్పణము, మహాన్యాసాభిషేకము, మృత్తికాస్నానవిధి మున్నగునవికూడ బోధాయనసూత్రప్రతిపాదితములే యని వైదికులు తలంచుచున్నారు. బోధాయనధర్మశాస్త్ర మను పేర శ్లోకబద్ధమయిన ధర్మశాస్త్రగ్రంథముకూడ ఒక్కటి లభించుచున్నది.

### ౬. భారద్వాజకల్పసూత్రము ౪.

ఈసూత్రముకూడ తైత్తిరీయశాఖకు చేరినదే. ఈ సూత్రముయొక్క గృహ్యవిభాగము మూలముమాత్రము ముద్రితమయియున్నది. శ్రౌతవిభాగము ముద్రితముకాలేదు. దాదాపు ౧౫ ప్రశ్నలవఱకు అచ్చటచ్చట లైబ్రరీలలో శ్రౌతసూత్రము లభించునటుల తెలియవచ్చుచున్నది. ధర్మసూత్రముమాత్రము ఇంతవఱకు లభించలేదు. ఈ సూత్రము ననుసరించు బ్రాహ్మణులు ద్రావిడబ్రాహ్మణులం దొకటి రెండుచోట్ల అల్పసంఖ్యాకు లున్నటులు తెలియవచ్చుచున్నది. ఈ సూత్రమునకు కపర్దిస్వామి, భాస్కరుడు, హరిహరుడు భాష్యముల నొనర్చినట్లున్నూ, భట్టరంగ డనువాతడు ప్రయోగవృత్తి రచించినట్లున్నూ తెలియవచ్చుచున్నది. ఇదిగాక 'భారద్వాజస్మృతి' యను పేరుగల ఒకశ్లోకబద్ధమగు ధర్మశాస్త్రగ్రంథముకూడ గలదని తెలియవచ్చుచున్నది.

### ౭. వైఖానసకల్పసూత్రము ౫.

ఈ సూత్రముకూడ తైత్తిరీయశాఖకు సంబంధించిన కల్పసూత్రములలో నొకటియే. గృహ్యధర్మశ్రౌతవిభాగములు మూడున్నూ లభించుచున్నవి. గృహ్యధర్మవిభాగములుమాత్రము ముద్రితములు. శ్రౌతసూత్రము అముద్రితము. ఈ సూత్రము ననుసరించు బ్రాహ్మణులను వైఖానసవైష్ణవులని యందురు. ఆంధ్రద్రావిడ కర్ణాటకదేశములందే ఈ సూత్రము ననుసరించువారు గలరు. మహారాష్ట్రులందుగాని, ఇతరదేశములందుగాని ఈసూత్రము ననుసరించు బ్రాహ్మణులు లేరు. స్మార్తబ్రాహ్మణులలోగాని మధ్వబ్రాహ్మణులలోగాని యీసూత్రము ననుసరించువారు ఆంధ్రద్రావిడకర్ణాటకబ్రాహ్మణులలో కూడ లేరు. ఈకల్పసూత్రమునకు నృసింహకృతప్రయోగదర్పణగ్రంథము గలదు. శ్రీనివాసదీక్షితీయవ్యాఖ్యానము కూడ లభించుచున్నది. ఈవైఖానసగృహ్యసూత్రమునందు ఇతరసూత్రములకువలె సూత్రాంతరసహాయ మక్కరలేదనియు, సకలవిషయములను తమసూత్రకారుడే చెప్పియున్నాడనియు, ఇతరసూత్రములకంటె ఇదియే ఈసూత్రమునందుగల విశేషము అనియు తత్సూత్రానుసారులు సగౌరవముగ చెప్పుకొందురు. ఈ గృహ్యసూత్రమునకు సంబంధించిన మంత్రము లన్నియు "వైఖానసమంత్రప్రశ్నాష్టకము" అను పేరుతో ఆంధ్రాక్షరములతో ముద్రితమయియున్నది. ఈ గృహ్యసూత్రమునందు బ్రాహ్మ, దైవ, ఆర్ష, ప్రాజాపత్య, గాంధర్వ, రాక్షస, ఆసుర, పైశాచములను అష్టవిధవివాహలక్షణములు చెప్పబడినవి. వీనిలో బ్రాహ్మణునకు దానపూర్వకములగు బ్రాహ్మ, దైవ,

ఆర్ష, ప్రాజాపత్యవివాహములే శస్తములనియు, గాంధర్వ, రాక్షస, పైశాచ, ఆసురములను నాలుగువివాహములు నింద్యములుకావున తగవనియు చెప్పబడియున్నది. బ్రాహ్మణక్షత్రియవైశ్యజాతులవారు నగ్నికయగు కన్యనుగాని, గౌరియగుకన్యను గాని పెండ్లాడవలయు ననియు నగ్నికయనగా ౮, ౯, ౧౦ సం॥ వయస్సుగల పిల్లయనియు, గౌరియనగా ౧౦ మొదలుకొని ౧౨ సం॥ లోపల వయస్సుకలిగి ఋతుమతికాని పిల్లయనియు నిర్ణయింపబడినది. ప్రథమఋతుస్నానము చేసినవెంటనే మొట్టమొదట భర్తను సంసర్గించవలయునని, ఈగృహ్యసూత్రమునందు ప్రతిపాదింపబడియున్నది. ఈ కల్పసూత్రమునకు శ్రీనివాసదీక్షితీయ వ్యాఖ్యయు, నృసింహవాజపేయికృతమగుసర్వాణమను వ్యాఖ్యయుగలవు.

౮. వాధూలకల్పసూత్రము ౬.

ఇదియు తైత్తిరీయశాఖకు సంబంధించిన కల్పసూత్రమే. ఈ సూత్రముయొక్క గృహ్యశ్రౌతవిభాగము లిప్పుడే లభించినవి. కాని ఆవ్రాతప్రతి నానాగ్రంథగోళముగా నున్నది. ఈసూత్రము ననుసరించు బ్రాహ్మణులు కేరళదేశమునం దేవాలనో ఒకరిద్దఱు గలరట. దాదాపు బోధాయనసూత్రముతో చాలవిషయములం దీసూత్రము పోలియుండునట. ప్రత్యంతరము లభించలేదు. “వాధూలస్మృతి”యను శ్లోకబద్ధ ధర్మశాస్త్రగ్రంథముకూడ ఒక్కటి లభించుచున్నది.

ఈయారు తైత్తిరీయశాఖాసూత్రములు.

౨. ఆ. మైత్రాయణీయశాఖాసూత్రములు

౯. మానవకల్పసూత్రము ౧.

మైత్రాయణీయశాఖకు సంబంధించిన కల్పసూత్రములలో నిది యొకటి. ఈ కల్పసూత్రముయొక్క గృహ్యశ్రౌతవిభాగములు మాత్ర మిపుడు లభించుచున్నవి. ధర్మవిభాగముకూడ ఉండియుండవలయుననియు ఇప్పుడు శ్లోకరూపమున మనకు లభించుచున్న మనుస్మృతికి ఆ మానవధర్మసూత్రము మూలముగా నుండియుండుననియు కొందఱు విద్వాంసులు తలంచుచున్నారు. ఈ మైత్రాయణశాఖా సంహిత ముద్రితమయి యున్నది. అష్టావక్రవ్యాఖ్యాసహితముగ మానవగృహ్యసూత్రము బరోడాయందు ముద్రితమయి యున్నది. శ్రౌతసూత్రముకూడ మూలముమాత్రము ముద్రితమయి యున్నది. ఈసూత్రము ననుసరించు బ్రాహ్మణులు బొంబాయిరాజధానిలో నాసికయందున్నూ గుజరాతుదేశమునందున్నూ గలరు. ఈ గృహ్యసూత్రమునందు “నగ్నిక”యగుకన్య వివాహయోగ్యయని చెప్పబడియున్నది. ఈ మైత్రాయణీసంహిత ముద్రితమయి లభించుచున్నది.

౧౦. వారాహకల్పసూత్రము ౨.

ఇదియు మైత్రాయణీయశాఖకు సంబంధించిన కల్పసూత్రమే. గృహ్యవిభాగముమాత్రమే ముద్రితమయియున్నది. శ్రౌతవిభాగము కూడ లభించునటుల తోచెడిని. ధర్మసూత్రవిభాగముమాత్రము లభించునటుల తోచదు. ఈసూత్రము ననుసరించు బ్రాహ్మణులు ఆంధ్రద్రావిడకర్ణాటాదిదేశములం దెచ్చటను గనంబడుటలేదు. బహుశః ఘూర్జరదేశమునం దుండవచ్చునని ఊహింపబడుచున్నది. ఈ గృహ్యసూత్రమునందు వివాహయోగ్యయగు కన్యక “అనగ్నిక”గా నుండవలయునని చెప్పబడినది.

ఈరెండు మైత్రాయణీయశాఖాసూత్రములు.

౨. ఇ. చరకశాఖాసూత్రములు

౧౧. కాఠకకల్పసూత్రము ౧.

ఇది చరకాధ్వర్యుద్వాదశశాఖలలో నొకటియగు కాఠకశాఖకు సంబంధించిన కల్పసూత్రము. దీనినే లౌగాక్షిసూత్ర మనియు వచింతురు. ఈకల్పసూత్రముయొక్క గృహ్యవిభాగము సవ్యాఖ్యగ దయానందగ్రంథమాలికయందు లాహోరులో ముద్రితమయి యున్నది. శ్రౌతవిభాగము లభించవచ్చునని తోచుచున్నది. కాని యింతవఱకు లభించలేదు. ధర్మసూత్రవిభాగ మున్నది లేనిది తెలియవచ్చుటలేదు. ఈసూత్రము ననుసరించు బ్రాహ్మణులు కాశ్మీరమునం దున్నారట. ఆంధ్రద్రవిడకర్ణాటదేశములం దెచ్చటను గనంబడుటలేదు. ఈ సూత్రమునకు దేవపాలుడు, ఆదిత్యదర్శనుడు, బ్రాహ్మణబలుడు అనువార లొనర్చిన వ్యాఖ్యానములు, గంగాధరుడు సంకలన మొనర్చిన కాఠకాహ్నికము, కాఠకగృహ్యపంచిక, కాఠకగృహ్యపరిశిష్టము మున్నగుగ్రంథములు గలవు. ఈ కాఠకగృహ్యసూత్రము లౌగాక్షికృతమనియే తెలియవచ్చుచున్నది. నిబంధనగ్రంథములం దచ్చటచ్చట లౌగాక్షిస్మృతియను పేరుతో ఆశౌచసంస్కారాదివిషయము లందు శ్లోకరూపప్రమాణవచనములు గొన్ని లభించుచున్నవి. ఈ కాఠకసంహిత నాగరాక్షరములందు ముద్రితమయి లభించుచున్నది.

ఈమూడుశాఖలు కృష్ణయజుర్వేదమునకు సంబంధించినవి.

౨. ఈ. శుక్లయజుర్వేదకల్పసూత్రములు

౧౨. కాత్యాయనకల్పసూత్రము. ౧.

కాత్యాయనకల్పసూత్రము శుక్లయజుర్వేదశాఖకు సంబంధించినది. దీనికే కాతీయసూత్రమనియు, పారస్కరసూత్రమనియు నామాంతరములుకూడ గలవు. శుక్లయజుర్వేదశాఖయొక్క ౧౫ శాఖలలో కాణ్వమాధ్యందినము లను రెండుశాఖలుమాత్రము నేడు ప్రచారమునం దున్నవి. ఈ శాఖాద్వయముయొక్క సంహితాబ్రాహ్మణగ్రంథములు రెండున్నూ కాణ్వసంహితయనియు, కాణ్వశతపథబ్రాహ్మణమనియు, మాధ్యందినసంహిత, మాధ్యందినశతపథబ్రాహ్మణమనియు వ్యవహారమునం దున్నవి. ఈ కాణ్వమాధ్యందినశాఖలు రెంటికిన్నీ కల్పసూత్రముమాత్రము కాత్యాయనసూత్రము ఒక్కటియే.

ఈ సూత్రముయొక్క గృహ్యశ్రౌతవిభాగములు ముద్రితములయి సర్వత్ర లభించుచున్నవి. ధర్మసూత్రవిభాగముమాత్రము లభించుట లేదు. ఈసూత్రము ననుసరించు బ్రాహ్మణులు పంచగౌడులందున్నూ పంచద్రావిడులందున్నూ భరతఖండమునం దంతట గలరు. ఆంధ్రద్రావిడదేశములం దీసూత్రము ననుసరించువారిని ప్రథమశాఖీయు లనియు వ్యవహరింతురు. ఈసూత్రమునకు కామదేవుడు, హరిహరుడు, కర్కుడు, భర్తృయజ్ఞుడు మున్నగువార లొనర్చిన వ్యాఖ్యానము లసంఖ్యాకములు గలవు. అట్లే గృహ్యపద్ధతులు, పరిశిష్టములు, గృహ్యకారికలు మున్నగునవికూడ చాలగలవు. కాత్యాయనస్మృతి యనియు, వృద్ధకాత్యాయనస్మృతియనియు శ్లోకబద్ధధర్మశాస్త్రగ్రంథములు లభించుచున్నవి.

## యజుర్వేద కల్పసూత్రములు సమాప్తము

---

## 3. సామవేదకల్పసూత్రములు

### అ. రాణాయనీయశాఖ

### ౧౩. ద్రాహ్యాయణకల్పసూత్రము ౧.

సామవేదముయొక్క ౧౦౦౦ శాఖలలో ఇప్పుడు ప్రచారమునందు రాణాయనీయ, కౌథుమ, జైమిని అను మూడు శాఖలు మాత్రమే కలవు. ఈ మూడు శాఖలలో రాణాయనీయశాఖకు సంబంధించినది ద్రాహ్యాయణకల్పసూత్రము. ఈ సూత్రముయొక్క గృహ్యశ్రౌతవిభాగములు లభించినవి. ముద్రితములయి ప్రచారమునం దున్నవి. ద్రాహ్యాయణగృహ్యసూత్రమునకు ఖాదిరగృహ్యసూత్రమనియు, గౌతమగృహ్యసూత్రమనియు నామాంతరము లున్నటులు తెలియవచ్చుచున్నది. గౌతమపితృమేధసూత్రమని యొకగ్రంథము ముద్రితమయియున్నది. కాని ఆగ్రంథము నాకు లభించలేదు. ముద్రితమయిన ద్రాహ్యాయణశ్రౌతము సమగ్రగ్రంథము కాదని తెలియవచ్చుచున్నది. ఈకల్పసూత్రము ననుసరించు బ్రాహ్మణులు భరతఖండమునం దంతట పంచద్రావిడులందును, పంచగౌడులందును గలరు. ద్రాహ్యాయణధర్మసూత్రము లభించలేదు. గౌతమ ధర్మసూత్రమను పేర నొక ధర్మశాస్త్రము సూత్రనిబద్ధము ప్రచారమునం దున్నది. హరదత్తాచార్యుడు, మస్కరియనువారు వ్యాఖ్యానము కూడ నొనర్చిరి. ఆంధ్రటీకాతాత్పర్యసమన్వితముగ మామిత్రులు కావ్యవ్యాకరణతీర్థ, పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిలవారు గౌతమ ధర్మసూత్రమును హరదత్తవ్యాఖ్యతో ఆంధ్రాక్షరములతో ముద్రించి యున్నారు. ఇది యీ కల్పసూత్రము ననుసరించునని తోచుచున్నది. రుద్రస్కందుడు, శ్రీనివాసుడు మున్నగువారు ద్రాహ్యాయణ గృహ్యసూత్రవ్యాఖ్యాతలు. బాలాగ్నిహోత్రియను నాతడు గృహ్యకారికలను, వినతానందనుడను నాతడు గృహ్యసూత్రప్రయోగము నొనర్చిరి. ఆంధ్రద్రావిడ దేశములం దీశాఖయే వ్యాప్తియందున్నది.

### ఆ. కౌథుమశాఖ

### ౧౪. గోభిలకల్పసూత్రము ౧.

గోభిలకల్పసూత్రము సామశాఖీయకౌథుమశాఖకు సంబంధించినది. లాట్యాయనశ్రౌతసూత్రమను పేరనున్న సూత్రగ్రంథమున్నూ, గోభిలగృహ్యసూత్రమను పేరనున్న గ్రంథమున్నూ కౌథుమశాఖకు సంబంధించినవని చెప్పుచున్నారు. ఈవిషయమయి ఇంకా విచారించవలసియున్నది. ఈ సూత్రము ననుసరించువారు విశేషించి గుజరాతునందును, ఉత్తరహిందూస్థానమునందును గలరు. ద్రావిడదేశమునందుకూడ అచ్చటచ్చట కొందఱుగలరని తెలియవచ్చుచున్నది. భట్టనారాయణుడు, యశోధరుడు, మహేశచంద్రుడు మున్నగువారు పలువురీసూత్రమునకు వ్యాఖ్యానమొనర్చిరి. సాయణాచార్యుడుకూడ యీ గృహ్యసూత్రమునకు వ్యాఖ్యానమొనర్చినటులు తెలియవచ్చుచున్నది. గోభిలసంధ్యాసూత్రము, శ్రాద్ధసూత్రము మున్నగు సూత్రగ్రంథములుకూడ గలవు. గృహ్యకారికలు, గృహ్యపద్ధతులు, గృహ్యప్రయోగములు మున్నగునవికూడ చాల గలవు. గోభిలస్మృతియను గ్రంథముకూడ గలదు. ఈ గృహ్యసూత్రమునందు "నగ్నికయగు కన్యకను వివాహమాడుట శ్రేష్ఠమని చెప్పబడియున్నది. ఈ సూత్రము సవ్యాఖ్యగ ముద్రితమయి యున్నది.

### ఇ. జైమినిశాఖ

### ౧౫. జైమినీయకల్పసూత్రము ౧.

ఇది సామవేదజైమినీయశాఖకు సంబంధించిన కల్పసూత్రము. ఈసూత్రముయొక్క గృహ్యశ్రౌతవిభాగములుమాత్రము లభించుచున్నవి. ఈసూత్రము ననుసరించువారు ద్రావిడకర్ణాటకకేరళబ్రాహ్మణులందు అత్యల్పసంఖ్యాకు లచ్చటచ్చట గనంబడుచున్నారు. శ్రీనివాసకృతవ్యాఖ్యతోడ ఈగృహ్యసూత్రము ముద్రితమయియున్నది. శ్రౌతసూత్రమునందు కొంతభాగముమాత్రమే ముద్రితమయియున్నది. ఈ జైమినీయ సామశాఖాసంహిత, బ్రాహ్మణ, ఉపనిషద్భాగములుకూడ రోమనులిపిలో విదేశమునందు ముద్రితములయియున్నవి. ఉపనిషద్బ్రాహ్మణ మొకటిమాత్రము నాగరాక్షరములతో లాహోరునందు నందవై దికగ్రంథమాలాధిపతులచేత ముద్రింపబడినది. ఈగృహ్యసూత్రమునందు వివాహయోగ్యయగు కన్యక 'అనగ్నిక'గా నుండవలయునని చెప్పబడియున్నది.

## సామసూత్రములు సమాప్తము

---

## ౪. అథర్వణవేదకల్పసూత్రములు

### ౧౬. కౌశికకల్పసూత్రము ౧.

అథర్వణవేదముయొక్క తొమ్మిది శాఖలలో ఒక్క శౌనకశాఖమాత్రము ఇప్పుడు కనంబడుచున్నది. అథర్వణవేద మనునది

కేవలము భూతోచ్చాటనమారణాదిప్రయోగములను మాత్రము తెలిపెడి మంత్రశాస్త్రమనియు, ఇతరవేదములవలె దాని ననుసరించి గృహ్యక్రియల నాచరించు బ్రాహ్మణులు లేరనియు, ఆవేదము ఇప్పుడు నామమాత్రశేషముగ నున్నదనియు తలంచువారలుకూడ మనలో కొందఱు గలరు. అది వట్టిభ్రమ. ఇతరవేదములవలెనే ఈవేదమునుకూడ అనుసరించు బ్రాహ్మణులు కలరు. ఏతద్వేదశాఖాసూత్రమునకు కౌశికసూత్రమనియు, బ్రాహ్మణమునకు గోపథబ్రాహ్మణమనియు ప్రసిద్ధి. ఈ వేదము ననుసరించు బ్రాహ్మణులు గుజరాతునందును, కాశ్మీరమునందును గలరు. కాశీక్షేత్రమునందుకూడ నీయథర్వణశాఖీయబ్రాహ్మణులను రెండుమూడుకుటుంబములవారిని చూచియున్నాను. ఆంధ్రదేశమునందు లభించిన దానశాసనలేఖలలో అథర్వవేదీయులయిన బ్రాహ్మణులలో కొందఱకు దానమొసగినట్లు చదివినట్లు జ్ఞాపక మున్నది. కాని ఎచ్చట చూచినాడనో చక్కగా స్మరణమునకు రాలేదు. బహుశః ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికయం దుండవచ్చునని ఊహించెదను. సాయణభాష్యముతోడ అథర్వవేదమును సమగ్రముగ బొంబాయిగవర్నమెంటువారు ముద్రించియున్నారు. దారిలకేశవాదికృతవ్యాఖ్యానముతోడ నీకౌశికసూత్రము ముద్రితమయియున్నది. ఇతరకల్పసూత్రములందున్న దర్శపూర్ణమాసాదివిధు లీకల్ప సూత్రమున విశేషించిలేవు. గృహ్యకర్మలు, ఆభిచారికకర్మలు, వృద్ధికర్మలు మున్నగునవియే ఇందు విశేషించిగలవు. గృహ్యప్రయోగకారికాగ్రంథాదులు కూడ గలవు. కౌశికస్మృతియను పేర ధర్మశాస్త్రము కూడ ఒకటి గలదు.

వైతానసూత్ర మను పేరు గల అథర్వవేదీయసూత్రగ్రంథ మొకటి యున్నట్లు తెలియవచ్చుచున్నది గాని ఆ గ్రంథము మాకు లభించలేదు.

## కల్పసూత్రముల సామాన్యవిచారము.

వేదములు యజ్ఞయాగాదిసత్క్రియలను లోకమునందు ప్రచార మొనర్చుటకు ఏర్పడినవని భారతీయమహర్షుల యభిప్రాయము. ఆవిషయమును చక్కగా నిరూపించుటకే యజ్ఞకల్పసూత్రము లేర్పడినవి. అధ్వర్యుడు, హోత, ఉద్గాత, బ్రహ్మ యను నలుగురు ఋత్విక్కులు యజ్ఞకార్యముల నిర్వహింతురు. వీరిలో బ్రహ్మ అందరిని కనిపెట్టి చూచుచుండును. అధ్వర్యు డొనర్పవలసిన క్రియాజాతముమాత్రమే ప్రధానముగ యజుర్వేదకల్పసూత్రములందు తెలుపబడియుండును. హోతయను ఋత్విక్కు చేయవలసిన క్రియాజాతముమాత్రమే ఋగ్వేదీయకల్పసూత్రములందు వివరింపబడియుండును. ఉద్గాతయను ఋత్విక్కు చేయవలసిన సామగానాదిక్రియాజాతముమాత్రమే సామవేదీయకల్పసూత్రములందు వివరింపబడియుండును.

యజుర్వేదీయకల్పసూత్రముల గమనికను పరిశీలింపగా కల్పసూత్రములందు ప్రథమమున దర్శపూర్ణమాసేష్టులను శ్రౌతక్రియలతో కల్పసూత్రగ్రంథము ప్రారంభమయి హవిర్యజ్ఞములు, సోమసంస్థలు, అగ్నిచయనము, రాజసూయాశ్వమేధాదివిశేషక్రతువులను చెప్పిన పిదప గృహ్యకర్మలను, ధర్మసూత్రములనుచెప్పుట పరిపాటిగా నున్నది. ఋగ్వేదీయకల్పసూత్రగ్రంథములకీసామాన్యలక్షణము పరిపోవుట లేదు. సమగ్రగ్రంథభాగము లభింపకపోవుటచేత ఆవిషయమునుగూర్చి 'ఇదమిత్థ' మని నిర్ణయింప శక్యముగాకయున్నది.

బ్రాహ్మణులు తా మాచరించుచున్న శ్రౌతస్మార్తక్రియలం దవశ్యము పఠించుచున్న ప్రవరర్షిసంస్మరణమునుగూర్చిన విషయము ఋగ్యజుర్వేదకల్పసూత్రములందు అన్నిటియందు 'ప్రవరాధ్యాయ' మనుపేర పఠింపబడియున్నది. ఔద్గాత్రసూత్రములందు (అనగా సామవేదకల్పసూత్రములందు) కూడ గలదని తెలియవచ్చుచున్నది కాని సమగ్రసామకల్పసూత్రగ్రంథములను సందర్శించు భాగ్యము లభించియుండ నందున ఇంతకంటె విశేషించి చెప్పజాలను.

---

## లభించని గృహ్యసూత్రములు

ప్రాచీనులగు వ్యాఖ్యాతలు తమ గ్రంథములం దుదాహరించినట్టియు ఇప్పుడు గ్రంథరూపమున లభించనట్టియు కొన్ని గృహ్యసూత్రములు గలవు. వాని నామములమాత్ర మిట నుదాహరించుచున్నాడను:—

౧. శాండిల్యగృహ్యసూత్రము:—ఈగృహ్యసూత్రమును ఆపస్తంబశ్రౌతసూత్రవ్యాఖ్యాతయగు రుద్రదత్తుడు ౯. ౧౧. ౨౧. సూత్రము వ్యాఖ్యానమునం దుదాహరించియున్నాడు.

౨. శాట్యాయనకల్పసూత్రము:—ఈకల్పసూత్రము మహాదేవకృతసత్యాషాఢశ్రౌతసూత్రవ్యాఖ్యయందున్ను ౬. ౫. గోపీనాథవ్యాఖ్య ౧౦. ౧౦. యందున్ను, ఖాదిరగృహ్యవ్యాఖ్యయందున్ను ప్రమాణముగ గైకొనబడినది. స్మార్తప్రాయశ్చిత్తవిషయమై శాట్యాయనసూత్రమనుపేర స్మార్తానుక్రమణికయందు చాలవచనములు ప్రమాణములుగా నుదాహరింపబడియున్నవి. ఇతరగ్రంథములందు కూడ శాట్యాయనకల్పసూత్రము ప్రమాణముగ గైకొనబడినది.

౩. జాబాలిగృహ్యము:—యజుర్వేదీయశాఖలకు సంబంధించిన గృహ్యసూత్రముగా నుండవచ్చును. మస్కరికృతగౌతమధర్మసూత్రవ్యాఖ్యయందు రెండుతావుల నీగృహ్యసూత్రవచనము లుదాహరింపబడినవి.

౪. పైంగీగృహ్యసూత్రము:—పైంగికల్ప మనుపేరు పాతంజలవ్యాకరణమహాభాష్యము (పా. సూ. ౪. ౨. ౬౬) నందు స్మరింపబడినది. గౌతమధర్మసూత్రమస్కరిభాష్యమునందు రెండుతావుల నీగృహ్యసూత్రవాక్యము లుదాహరింపబడినవి.

౫. జైజావాపగృహ్యసూత్రము:— యాజ్ఞవల్క్యస్మృతి ౧. ౨౭౫. శ్లోక. అపరార్కవ్యాఖ్యయందు జైజావాపగృహ్యసూత్రమునుండి వినాయకశాంతికి సంబంధించిన ప్రమాణవచనము లుదాహరింపబడినవి. కుమారిలభట్టుకూడ తంత్రవార్తికమునందు ౧-౩. ౧౧. పూర్వమీమాంసాసూత్రవ్యాఖ్యయం దీగృహ్యమును స్మరించెను.

౬. అథర్వణగృహ్యసూత్రము:—౧౪ అధ్యాయములు, ౧౪౧ కండికలు కలిగియున్నది. ఈ గ్రంథాంతమునందు అనధ్యాయతిథులను గూర్చి చెప్పబడియున్నది. బొంబాయి యూనివర్సిటీ లయిబ్రరీయందు వ్రాతకాపి యున్నట్టుల తెలియవచ్చుచున్నది. నీలకంఠకృత నీతిమయూఖమునం దీగృహ్యసూత్రమునుండి ప్రమాణవచన ముదాహృత మయినది.

౭. శౌనకగృహ్యసూత్రము:—యాజ్ఞవల్క్యస్మృతివ్యాఖ్యయందు విశ్వరూపునను, అపరార్కవ్యాఖ్యయందునను, హేమాద్రికృతచతుర్వర్గచింతామణియందును యీగృహ్యసూత్రము స్మరింపబడినది. ఈగృహ్యపరిశిష్టముకూడ అపరార్కమునందు స్మరింపబడినది. ఋగ్వేదశాఖలలో నిదియొకశాఖకుచేరినసూత్రము కానోపును. శౌనకోక్తబృహత్కారిక యనుపేర ఋగ్వేదసూక్తములయొక్క వినియోగాదికమును తెలుపు ౨౦ అధ్యాయముల గ్రంథము పూనా దక్కను కాలేజి లయిబ్రరీయందు గలదు. ఇండియాయందు ముద్రితమయిన ఋగ్వేదభాష్యమునందుకూడ ఆదియందు యీ శౌనకకారికలు కొన్ని చేర్చబడియున్నవి.

౮. పరాశరగృహ్యసూత్రము:—ఈపేరుతో నొక గృహ్యసూత్ర మున్నటులు మానవగృహ్యసూత్రోపోద్ఘాతమునగలదు. బికనీరు పుస్తకసూచియందు 'పరాశరగృహ్యసూత్ర' మనుపేర నొకగ్రంథనామము గనంబడుచున్నది. తంత్రవార్తికము (పూర్వమీమాంసాసూత్రభాష్యమునకు కుమారిలకృతవ్యాఖ్యానరూపగ్రంథము) నందు వేదశాఖావిభాగనామములందు "పరాశరబ్రాహ్మణము" అను పేరు గనంబడుచున్నది. ఈ గృహ్యసూత్రము బహుశః ఆ పరాశరశాఖకు చేరినదయియుండవలయును.

౯. శార్దూలగృహ్యసూత్రము:—ఈ గృహ్యసూత్రము బహుశః సామవేదమునకు సంబంధించియుండునని తోచుచున్నది.

౧౦. శ్వేతాశ్వతర గృహ్యసూత్రము:— శైవప్రచారిణీ పత్రికాసంపాదకులు తమకడ "శ్వేతాశ్వతర" గృహ్యసూత్ర మనుగ్రంథము అసమగ్రముగ గలదని చెప్పిరిగాని నేనాగ్రంథమును స్వయముగా చూడలేదు.

౧౧. నిదానసూత్రము:—ఈపేర సామవేదమునకు సంబంధించిన సూత్రగ్రంథ మొకటి గలదు. ఫుల్లసూత్రమని మఱొకసూత్రగ్రంథముకూడ లభించుచున్నది. అయినను నీరెండుసూత్రగ్రంథములు గృహ్యసూత్రముగాని, శ్రౌతసూత్రములుగాని కావని మావిశ్వాసము.

యజుశ్శాఖలలో కపిష్ఠలకఠసంహితయని యొకసంహితయు, అథర్వశాఖలలో పిప్పలాదశాఖయని యొకటియు వ్రాతప్రతులు క్రొత్తగా లభించినటులు తోచుచున్నది. అట్టి యపూర్వగ్రంథము లందుబాటులో లేనందువలన వానినిగూర్చి వ్రాయుట కవకాశము లేదు.

వసిష్ఠవిష్ణుహారీతశంఖలిఖితధర్మసూత్రము లాదియందుండె ననియు, ఇప్పుడు గనంబడుచున్న వసిష్ఠవిష్ణుహారీతశంఖలిఖిత స్మృతిగ్రంథములు ఆసూత్రగ్రంథములయొక్క అవశిష్టాంశములనియు కొందఱు తలంతురు. ఈ పేరుగల కల్పసూత్రములుకూడ ఉండియుండునని వారియూహ.

## ఉపసంహారము.

కల్పసూత్రములనుగుఱించి యిచట తెలిపిన అంశమంతయు ఆయాదేశములందు ప్రచారములోనున్న కల్పసూత్రగ్రంథములను లభించినంతవఱకు స్వయముగ చూచియు, తత్తచ్ఛాఖీయబ్రాహ్మణులను లభించినంతవఱకు విచారించియు వ్రాసియున్నాడను. వైద్యనాథీయ వర్ణాశ్రమాచారకాండయందును, స్మృతిరత్నాకరమందును కల్పసూత్రములనుగుఱించి యిట్లు చెప్పబడియున్నది:-

అగ్నివైశ్యసూత్రే-వాక్యం:—అథాఽత స్సూత్రగణా వ్యాఖ్యాస్యామః, ౧. బోధాయనం, ౨. ఆపస్తంబం, ౩, సత్యాషాఢం, ౪. ద్రాహ్యాయణం, ౫. అగస్త్యం, ౬. శాండిల్యం, ౭. ఆశ్వలాయనం, ౮. శాంభవీయం, ౯. కాత్యాయన మితి నవాని పూర్వసూత్రాణి;

౧. వైఖానసీయం, ౨. శౌనకీయం, ౩. భారద్వాజం, ౪. అగ్నివైశ్యం, ౫. జైమినీయం, ౬. వాధూలం, ౭. మాధ్యందినం, ౮. కౌండిన్యం, ౯. కౌషీతక మితి నవా న్యపరసూత్రాణి;

అష్టాదశసంఖ్యాతా శ్శరీరసంస్కారా ఇతి.

అని గలదు. ఇందుగల పూర్వసూత్రములు, అపరసూత్రము లనుపదములకుగల వాస్తవార్థ మేమో బోధపడుటలేదు. ఈ ౧౮ సూత్రములలో వ్యవహారమునం దున్న యజుర్వేదీయములగు మానవ, వారాహ, కాఠక సూత్రములున్ను, అథర్వవేదీయకౌశికసూత్రమున్ను ఏలకో పరిగ్రహింపబడలేదు. తెలిపినంతవఱకు పఠనపాఠనాదిప్రచారములలో లేని అగస్త్య, శాండిల్య, శాంభవీయములను మూడు సూత్రములు పూర్వసూత్రములందున్ను, శౌనక, అగ్నివైశ్య, మాధ్యందిన, కౌండిన్యములను నాలుగు సూత్రములు అపరసూత్రములందున్ను చెప్పబడియున్నవి. ప్రచారమునందున్న సూత్రములను వదలుటకును, ప్రచారమునందు లేనిసూత్రములను పరిగ్రహించుటకును గలకారణము

దుష్ప్రాప్యమ్ములయియున్నవి. కల్పసూత్రములకు సంబంధించిన గ్రంథములలో అధికభాగము ముద్రితమే అయియుండలేదు. ముద్రితములయిన గ్రంథములుకూడ విదేశములందు ముద్రింపబడియుండుటచేత సామాన్యజనులు భరించరానంత మూల్యముతో నున్నవి. ప్రాచీనమగు వైదికవాఙ్మయమును సంరక్షించుట యనగా మనయొక్క ప్రాచీన నాగరకతను కాపాడుకొనుటయే యగునని వేఱుగ జెప్పనక్కఱలేదు. పరిపాలకులు విదేశీయులగుటచేత వైదికవాఙ్మయవ్యాప్తికి యింతకంటె విశేషించి వారు ప్రోత్సాహము నొసగజాలరు. మతాచారధర్మసంరక్షణమునకున్నూ, తద్ధర్మబోధకున్నూ శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యులవారిచే సంస్థాపింపబడిన జగద్గురుపీఠముల నలంకరించుచున్న పీఠాధిపతులున్నూ శ్రీమంతులున్నూ అవకాశము ననుసరించి గ్రంథములను ప్రకటించుటయో, లేక చక్కగా సంస్కరించి, వ్రాయించి ప్రధాననగరములందైనను గ్రంథభాండాగారములందు అందఱకు పరిశీలనార్థము లభించునటుల సదుపాయమును చేయుటయో తమ యావశ్యకకృత్యముగా నెంచెదరుగాక! ఇట్టి జ్ఞానయజ్ఞము యజ్ఞములన్నింటికి మూలభూతమగుటచేత శ్రేష్ఠతమమనియు శ్రుతిస్మృతిధర్మపరిపాలకుడగు భగవానుడిట్టియుదారాశయమును జగద్గురుపీఠాధిపకార్యనిర్వాహకులకును, శ్రీమంతులకును కలుగజేసి వైదికవాఙ్మయ ముపేక్షించెడి అర్హులెల్లరకు లభించునటుల చేయుదురుగాకయనియు పరమేశ్వరుని ప్రార్థించుచు విషయాంతరమునందు లేఖినిని నియోగించుచున్నాము.

"లోకా స్సమస్తా స్సుఖినో భవంతు"

---

## కవి



# చోటు లేదు

దీపాల పిచ్చయ్యశాస్త్రి గారు

౧

వెనుక ముందుల నరయక వెఱ్ఱివెఱ్ఱి
గాథలను నమ్మి కాలమ్ము గడచిపోయె
నల్లనివి నీళ్లు తెల్లని వెల్ల పాలు
ననుకొను నమాయికత్వమందందయడఁగె.

౨

ఆదరము తగ్గె దంభమాహాత్మ్యమూను
పక్షపాతపు రచనల పస నశించె
రసికులకు మీ చరిత్రల విసుపుదోఁచె
పరువుగా నింతటఁ బ్రబంధపురుషులార!
కదలిపొం డెటకైనను, కవికుమారు
లొసఁగుచున్నారు మీకుఁ దిలోదకముల
నింత కెక్కుడు వచియింపనేల? మీకు
నేఁటి కావ్యప్రపంచానఁ జోటు లేదు.

౩

అకట! వినుకలి మోహమ్మునందుఁ గ్రుంగి
విరహిజనులకుఁ దప్పని విధియటంచు
మలయపవనుని దిట్టి, కోకిలముఁ దిట్టి
చందమామను నిందించి, శారికలను
కీరముల షట్పదంబుల దూఱి, యంత
శాస్త్రమును బట్టి శిశిరోపచారములను
కొఱఁతపడకుండఁ జేయించుకొనుటయందు
ఒక్కబడిలోనఁ దీరిన యక్కలార!
వలపు మెలపుల నెఱుఁగని వనితలార!
ప్రణయతత్త్వంబు నెఱుఁగని పడుచులార!
అందచందము లెఱుఁగని యబలలార!
ఉచిత మనుచిత మెఱుఁగని యో ప్రబంధ
నాయికామణులార! మీ సోయగములు
నడవడులు లోకమున కిప్డు నచ్చవయ్యె,
నయ్యె మీవర్గమున కెల్ల నంపకములు
నెమ్మదిగ లేచి సాగిపొండమ్మ, మీకు
నేఁటి కావ్య ప్రపంచానఁ జోటు లేదు.

౪

నిమ్న జాతుల కీవలె నేటిసకల
నాయకత్వము, మఱియును, నాయికతయుఁ
గాన తొలఁగుడు మీరు కులీనులార!
అట్లు చూచెద రేమిటి కయ్య? మీకు
నేఁటి కావ్య ప్రపంచానఁ జోటు లేదు.

౫

పుష్పలావికలార! మీ పున్నమాయెఁ
దరలి పొండమ్మ, మీ చమత్కారములకు
వలచి, మీ పూలమాలలు విలుచు రసికు
లేరు నీ నేఁటి కాలాన లేరు, మీకు
నేఁటి కావ్య ప్రపంచానఁ జోటు లేదు.

౬

జాతివైరాన మిగుల మచ్చరముఁ గొన్న
అయ్యలును మియ్యలును వియ్యమందు
నేకజాతీయులైన మీ కేటి పగలు? ప్రచండ
శకట రేఫము! రేఫంబు సఖ్య మెనసి
హాయిగా నుండు, మట్లు కాదనిన నీకు
నేఁటి కావ్య ప్రపంచానఁ జోటు లేదు.

౭

పలుకుబడి చక్కఁగాఁగల వర్ణములకె
తొలఁగెఁ దొల్లిటి సుస్థితి, తొలుత నుండి

తూర్పుగోదావరిజిల్లా ఉప్పు-సత్యాగ్రహోద్యమము-౧౯౩౦









౧. నాయకులు: శ్రీ కళా వెంకటరావుగారు; శ్రీ డాక్టరు బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యంగారు. ౨. ఉప్పు తయారుచేసినవారు, చొల్లంగి.
౩. సీతానగరమునుండి బయలుదేరి రాజమండ్రి ప్రవేశించుట. నాయకులు: శ్రీ బులుసు సాంబమూర్తిగారు;
శ్రీ డాక్టరు బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యంగారు. ౪. శిబిరము, పోలవరం (ఏజెన్సీ.)







నెల్లూరుజిల్లా ఉప్పు-సత్యాగ్రహదళము-నెల్లూరు

౧. నాయకులు: శ్రీ ఓరుగంటి వెంకటసుబ్బయ్యగారు. ౨. నాయకురాండ్రు: శ్రీమతి పొణకా కనకమ్మగారు, శ్రీమతి ఓరుగంటి మహాలక్ష్మమ్మగారు.

పలుకుబడి సుంతయును లేక, వారి వీరి
యండఁ బడియుండు నిన్ను నెవ్వండు నేఁడు
లెక్క-వెట్టెడు-నరసున్న! లెమ్ము నీకు
నేఁటికావ్య ప్రపంచానఁ జోటులేదు.

౮

ఎల్లవర్ణమ్ములును మైత్రినెనసి కలసి
మనుటయభివృద్ధికగుమంచిమార్గమనుచు
ప్రభులు పండితులును నొక్కి-పలుకుచుండి
రెవ్వఁడిఁక మీనియమముల నెంచి, మీకు
భిక్షనిడువాఁడు, యతులార! వెనుకముందు
లాడెదరదేల! వెడలిపొండయ్య, మీకు
నేఁటికావ్య ప్రపంచానఁ జోటులేదు.

౯

ఎచట వలసిన నచ్చటనే లభించు
పచ్చికబయళ్లు, సెలయేళ్లు, పల్లెటూళ్లు
కావలసినన్ని, మాకెప్డుఁ గానరాని
నందనంబ! సురాపగ! నాకపురమ!
వలదు మీజోలి మాకింక వలదు, మీకు
నేఁటికావ్యప్రపంచానఁ జోటులేదు.

౧౦

వ్యాకృతీ! ఇఁక నీదు నిరంకుశాధి
కారమంతయు నొకమూలఁ గట్టిపెట్టి
అణఁగిమణఁగి ప్రవర్తింపు మమ్మ కవుల
కన్నుసన్నల నెఱిఁగి; కాకున్న నీకు
నేఁటికావ్య ప్రపంచానఁ జోటులేదు.

౧౧

వస్తురూపంబుఁ జెడఁగొట్టి వాస్తవమున
కన్యథాత్వంబుఁ గల్పించు నట్టి పట్టి
మోటుదవపు టలంకృతుల్ దాఁటవలయు
నిందు మోమోటమించుక యేని లేదు
నేఁటికావ్య ప్రపంచానఁ జోటులేదు.

౧౨

ఆగ్రహింపకుఁడోయి! యిట్లంటిననుచు
తరుణమునుబట్టి, లోకవృత్తంబునరసి
పాడిమెయిఁ గావ్యసంబంధబాంధవమున
హితవు జెప్పితిఁగాని యొండేమిగాదు.

---

# నిరాశ

అప్పల వీరవెంకటజోగయ్యశాస్త్రిగారు

ఓరియెడారి, ప్రచండదినేశకిరణ
జాలసంతప్తకూటస్థసైకతంబు
కలితవాయుప్రసారసంచలితమాన
భూరిసికతాతరంగసంచారయుతము-

* * * *

ప్రళయకాలమహాకీలపటువిసీల
పుష్కలావృతమేఘముల్ పొంగికురిసి
చనిననిచ్చోట నిసుమంత జలముదొరక
దకట! యేమనిభావించి యరిగితీవు ?

* * * *

పాంథ! యేమిటఁదీరని ప్రబలతృష్ణ
నిన్ను వేధింప నచ్చోట నున్నవిజల
కూపమీక్షించి చనిచూచి పాపమంత
భగ్నహృదయంబుతోనట బాసినావు

కానితృషదీరినను నిన్ను తానువిడని
ప్రబలసందేహ మొక్కటి పాదుకొనియె
'సరయనిర్జలమౌనాతి పరిసరముల
నెటులఁదలయెత్తె పచ్చికయిట్టులనుచు'
* * * *
భవదృశాఖలమూర్ఛితపాంథవితతి-
సలిలతృష్ణాతిరేకసంజనితహృదయ
తాపమున వేగి యటకేగి కూపమందు
జలముఁ గానంగలేకవిషాదమంది,

అంత విఫలమనోరథులై నిరాశ
నేడ్చిపోయినవారి కన్నీటివలన
యీమహాసైకతస్థలి నెలమిఁ బాఱ
పెరిగె నీచిన్నికనవది యెటులఁగవేమొ?

---

# భక్తుఁడెవఁడు?

గున్నేపల్లి అక్షయలింగము గారు

ఆది శరద్రాత్రి జగమెల్ల నలముకొన్న
సాంద్రతరచంద్రికలు గవాక్షములనుండి
మురువుసూపెడు మందిరాంతరమునందు
మృదులతల్పమ్మునను నేను మేనువాల్చి
కనులుమూయఁగ నంతలోఁ గానవచ్చె
స్వచ్ఛమల్లికాగుచ్ఛసంపచ్ఛయమ్ముఁ
జూఱగొనినట్టి మైచాయసొబగుతోడ
దేవకన్యక యొకర్తు; కన్నెఱచి చూడ
నౌర! నాప్రోలనామెయొయ్యారమెసఁగ
స్వర్ణపత్రాళినద్దియో వ్రాయుచున్న
సరణిగన్పట్టె; నపుడు హస్తములుమోడ్చి
దేవి! నీలేఖనంబేమొ తెలుపుమనినఁ
బరమపావనులగు దైవభక్తిపరుల
నామములటంచుఁ బలికె; నానందమంది
యందునాపేరుకలదేమొయరయుమనుచు
నభిలషించితి, లేదులేదనియె నామె
విన్నదనమింతయును నాత్మవెడలనీక
విశ్వమానవసేవయే విధియటంచు
నెంచివర్తించు నాపేరు నిందుఁ జేర్చి
కృపవహింపవె!యనుచుఁ బ్రార్థింప; నామె
చిఱునగవెలర్ప; నట్టులే చేర్తునంచు
నింపుపొంపారఁ బలికియదృశ్యయయ్యె.
మఱునటినిశీథిని నల్లవెలుఁగుదోఁపఁ
పాండురద్యుతులొలయ నాభాసురాంగి
దర్శనమొసంగి హేమపత్రములఁ బరఁగు
గ్రంథరాజమ్ముఁ జూపఁ దద్గ్రంథమునను
భగవదర్చనమహితులై వఱలుభక్త
వరులనామముల్ గంటి; నప్పరమభక్త
సమితి నాపేరెయగ్రభాగమున మెఱయ
డెందమెనలేని యానందమొందె, నంతఁ
గనులుమిఱుమిట్లుగొల్పుక్రొక్కారుమెఱుఁగు
కాంతులొక్కటఁ బర్వె; నాకాంతులందు
లీనమై యామెయును దిరోధానమందె.
దేవునికి నెల్లగతుల సంతృప్తినించు
పావనంబైన మానవసేవకంటె
నరయఁదగు భక్తిమార్గమొండైనఁగలదె?

---

# సానుభూతి

దివాకర్ల వేంకటావధానిగారు

ఎటు పల్కించిన నట్లె పల్కెదవు నీవెల్లప్పుడుం గాక ను
త్కటమార్గంబును గోల్పి పాలకున కేతాదృఙ్మహాదాస్యలం
పటచిత్తంబును గాంచి సోదరులు నీపై ద్వేషభావమ్ముఁ బూ
నుట న్యాయెన్ గమనింపఁ బోవుకద! గంతుల్వైచుచున్ గీరమా!

చదివెద వేటి కీచదువు సార్థకమా శుకా! అర్థహీనమై
పొదలెడు నీ ప్రసంగమును బూర్ణముగా విని సంతసంబు నె
మ్మది నెవఁ డొందఁగాఁగలఁడు? మంజులగాన రసాభిషేక సం
పద చెలువొందు కోయిలల పాటివె నీవును, సిగ్గులేదొకో?

భ్రమ జనియింప స్వేచ్ఛనెడఁ బాసి పరాన్నముల న్భుజించి య
న్యమలినభాషలం జదివి యంతటఁ బోవక స్వచ్ఛమైన జా
తిమతములన్ గడంకజలధిన్ బడఁద్రోసితివేల యిట్లు శీ
ర్షము నెగుడంగనై చెడవు? చక్కనిదాన నటన్న గర్వమా?

ఒకనాఁడేనియుఁ బూర్వవైభవము నీయూహాప్రపంచంబునన్
బ్రకటంబై కనవచ్చునే? తుదకు దుర్యోగంబు సిద్ధించె నా
కకటా! యంచు విచారముం బడసి స్వేచ్ఛానందసామ్రాజ్యముం
దోకమాత్రేనిఁ జరింప నెంచెదవె యత్యుత్సాహ మింపొందఁగన్?

ఎదఁ గారుణ్యము దాల్చి భుక్తియిడు నాకే వేళ, కావేళ సం
పదకున్ తావొనరించె, స్వర్ణమయమౌ పట్టం బిదే కంఠసీ
మఁ దగుల్పంబడె, గద్దెపై నునిచి సమ్మానించెనా పోషకుం;
డిదియే సౌఖ్యముగాఁగ నున్నయది పోనిమ్మందువే కీరమా?

లోటు వహింపఁబోక ద్విజలోకములోఁ దలవంపు లేక స్వే
చ్ఛాటన మాచరింపుచు మహామహు దేవుని గొల్చు జాతికిన్
జేటును గూర్చు దుర్మతుల చేతికళంకిత మైన బిచ్చపుం
గూటికి నెట్లు పాల్పడెనొకో భవదీయమనంబు కీరమా!

ఱెక్కలు రావు పోవుటకు రేపును మాపిటులే వసింపుచో
నక్కఱ దీఱుచుండె జఠరాగ్నికి బాధ్యత తప్పిపోవు మి

మ్మక్కట పీడలే ననెదవా? తలవంచి నమస్కరింపుచుం
బ్రాకృతకర్మరీతి నొకపట్టున నీకును స్వేచ్ఛయబ్బుచో.

ఊరక సంతసించెదవదో! ననుఁ బ్రోచుచునుండెఁగాదె మా
ర్గారభయంబునుండి యని శక్తిహరించినవార లెవ్వరో
కీరమ! మాయఁజేసి పరికింపుము స్వేచ్ఛయె నీకు నున్న నీ
తీరునఁ దేఱిచూడఁ గలదే రిపువర్గము నీ మొగమ్మునన్ ?

ఉదయించె లోకమాన్యుండైన సూర్యుండు జగతి నజ్ఞానంబు సమసిపోవ
తన మహత్తరశక్తి దాఁచి మెల్లఁగ లేపుచుండెను గంధవహుండు జనుల
నదె! నిశాకరు మోమునందలి హాసముతొలఁగి వైవర్ణ్యంబు చెలఁగుచుండె
ముదము సంధిలఁగ మార్మ్రోయుచున్నవి ప్రాభాతమంగళధ్వనులు నవిగో!
'బారులైపోవుచుండి యీశ్వరుని మహిమ - శారికాదిద్విజంబులు చదువుచుండఁ
జూచి సంతసింపఁగ రాదె? కీచుమనుచు - నట్టులార్చెద వేల క్రోధాగ్నియురల?

పాప మీదాస్యమున కలవాటుపడితి - వెన్నిదినములనుండియొ యిప్పు డిట్లు
నిన్ను దూషింపఁగా నేల నీకు మొదట - నిట్టి దురవస్థ దెచ్చిన యీశువిడిచి?
దిగులు పుట్టుచునుండె నీ మొగముగనిన - సానుభూతియె యిట్లు నీదానవస్థ
నాడిపోయఁగఁ బరికొల్పె నంతెకాని - ద్వేషభావమ్ము లేదు కోపింపవలదు.

---

## స్నాతక బ్రహ్మచారి

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు

శ్రీకరంబైనట్టి లోకకళ్యాణంబు వాంఛనీయము నాకు వల్లభంబు
సచ్చిదానందసాక్షాత్కారసారంబు కాంక్షణీయము నాకు గమ్యపదము
లోకసంగ్రహశుభాలోకకర్మపథంబు సాధనీయము నాకు సమ్మతంబు
సారసారస్వతాచారప్రచారంబు రక్షణీయము నాకు రమ్యతమము
స్వార్థమిఁక నేమివలయు సర్వార్థసిద్ధి - నిర్మల జ్ఞానదీపికాధర్మమనుచు
పాఠశాలలోనుండి బయలుదేఱు - పావనుండైన స్నాతకబ్రహ్మచారి.

అనిలబంధనము ప్రాణాయామములచేత దేహబలంబు వర్ధిల్లఁజేయ
జపతపంబులు మానసము శుద్ధిసేయుచు ప్రతిభాప్రవాహవైభవముఁ బెంప
గురుపదశుశ్రూషగురుతరశ్రద్ధతో భక్తివిశ్వాసముల్ ప్రబలఁ జేయ
ఆహారనియతి సదాచారనిష్ఠతో సత్త్వసంశుద్ధిని సంతరింప
వాఙ్నియతి వాగ్విశుద్ధి సంపద ఘటింప - వృద్ధిగాంచిన త్రికరణశుద్ధితోడ
గురుకులంబుననుండి వీడ్కోలు వడయుఁ - బావనుండైన స్నాతకబ్రహ్మచారి.

భగవన్మయంబు ప్రపంచమం చెఱిఁగించి పాపదూరునిజేయు భక్తితోడ
కరతలామలకంబుగా సత్యమెల్లఁ దెల్పఁగల ఋతంభరప్రజ్ఞతోడ
సద్ధర్మనిష్ఠకై సర్వసన్న్యాసంబు సలుపఁగల్గు విరక్తి శక్తితోడ
సత్కార్య నిర్వాహ సాహసలక్ష్మిని సమకూర్పఁగల మంచి శ్రద్ధతోడ
ఆప్తవాక్యవిశ్వాససంతృప్తితోడ - యోగ్యశాంతిన్యమార్దవయుక్తితోడ
నేఁగుదెంచెడి నాచార్య గృహమునుండి - పావనుండైన స్నాతకబ్రహ్మచారి.

భక్తిలేకున్నఁ బ్రపంచమంతయుఁ దనతో సమానం బంచుఁ దోఁచుటెట్లు
జ్ఞానంబులేకున్నఁ గామనాశనముతో స్వార్థపరత్వంబు సమయుటెట్లు
వైరాగ్యసంపద వర్ధిల్లకున్నచో ధర్మరక్షణ చణ త్యాగమెట్లు
శ్రద్ధా సమేత విశ్వాసంబు లేకున్న సత్కార్యదీక్షా ప్రశాంతిమెట్లు
జ్ఞానవైరాగ్యభక్తివిశ్వాసములను - సంతరింపవలయు బ్రహ్మచారులనుచు
గురుకులసివాసమునుమాని యరుగుఁదెంచు - పావనగుణుండు స్నాతకబ్రహ్మచారి.

పాపసంసర్గంబు పరిహరణీయంబు కష్టనివారణకష్టమేల?
ధర్మసంపాదన తప్పనిపనిగాని గొప్పఁదనంబులఁ గోరనేల?
మోక్షైకనీతిను రక్షింపవలెఁగాని మెప్పులకై పడుత్రిప్పులేల?
ఆత్మనుగాంచి యాహ్లాదింపవలెఁగాని దేహవిక్రియకు భీతిల్లనేల?
భగవదారాధనంబు ప్రపంచసేవ - వ్రతముగావలెఁగాని స్వార్థరుచియేల?
అనుచు విద్యాలయమునుండి యరుగుఁదెంచుఁ-బావనుండైన స్నాతకబ్రహ్మచారి.





# దేశమా? ప్రాణమా?

ముద్దా విశ్వనాథంగారు*

పాత్రల వివరణము

ఆల్ఫ్రెడ్—ఇంగ్లాండు దేశపురాజు.

ఎల్లా—ఆల్ఫ్రెడ్ తాలూకు ఉద్యోగి.

గుబ్బా—ఒక జానపదుఁడు.

గేండలిన్—గుబ్బాభార్య.

రంగము: అథెల్నీ ద్వీపము

ఆల్ఫ్రెడ్—ఈ విజనప్రదేశ మెల్ల యెంత నిశ్చలముగను, నిశ్శబ్దముగను కన్పట్టుచున్నది! నిర్మలోదకప్రవాహము లెంత వినయవిధేయులతో పాఱుచున్నవి! ఇందావరించియున్న దట్టమగు చిట్టిపొదలు శత్రువులకు నన్నుఁ గనఁబడనీయవుగదా! క్రూరులగు 'డేను' లీ నిముషమువఱకీ నిర్జనారణ్యములఁ జొరరైరి. వారిఁక నన్ను వెంబడింపలేరని నాకు ధైర్యమున్నది. ఇప్పటి మట్టునకు నే సురక్షితుండ ననియే నమ్ముచుంటిని.

ఇచట నొకపిట్టయు నగపడకున్నదే! ఆఁకలిచే ప్రాణములు కోల్పోవవలసి వచ్చునేమో! ఓహో! భయములేదు, సన్నని నాటుదారి జాడ తెలియవచ్చుచున్నది. అదిగో, ఆ చెట్లనడుమ కొంచెము పొగకూడఁ జూపట్టుచున్నది. మెల్లగసాగి, ఈఘటము నక్కడఁ జేర్చెదను.

రంగము: కుటీరము

గేండలిన్ను లోపలనుండును—గుబ్బా బయటికి వచ్చును.

ఆ—అయ్యా! నమస్కారము. ఒక్క బీదబాటసారి కించుక ఆతిథ్యమొసంగ నిచ్చగింతురా?

గు—ఓ! ఈరోజులలో లక్షలు, కోట్లును, అతిథులు! వీరెల్లరను సత్కరించినచో, ఇల్లు నట్టేటఁ గట్టుకొనవలసినదే. సరే, రమ్ము, నాభార్య యేమనునో చూతము! (గేండలిన్నుతో)

ప్రేయసీ! నేఁడు చచ్చి సున్నమైతిని. దినమంతయు కలపకొట్టుటయే; ఒడలు చితుకఁ గొట్టినట్లైనది.

[స్వ]—

పరమేశ్వరా! ఎందుల కెత్తించితివిరా ఈజన్మము, తండ్రీ!

గేం—అదిగో, అశనమునకు తయారు, అయ్యగారు; ఇంకను అమరలేదండి. దానమ్మకడుపు బంగారము గాను! ప్రొద్దుకునుకనేలేదు, అప్పుడే ఆఁకలి పొడుచుకొని వచ్చినదా? కాసంతసేపుండుఁడు. [ప్రక్కకు చూచి]—

మీ కూడ నున్న వా రెవ్వరు?

ఆ—అమ్మా! నే నొక పథికుఁడను. ఆతిథ్యమర్థించి వచ్చితిని.

గేం—(కోపముతో)—

అమ్మ కాదు, బొమ్మ! అతిథుల నెంతమాత్రము నమ్మవలసిన కాలము కాదిది; నమ్మవలసిన యావశ్యకతయును లేదు. పరదేశస్థులు దండెత్తివచ్చినప్పటినుండియు ఉల్లాసవంతమగు ఈయింగ్లాండు మాఱిపోయినది.

* "జాన్స్టాల్ బడ్జెటు" నుండి.

ఆ—నేను మీకు క్రొత్తవాఁడనుగాని, ఆంగ్లేయదేశమునకు పరాయివాఁడనుగాను. నేను అసలైన ఆంగ్లేయుఁడను.

గేం—మఱి, పసువులను దొంగిలించి, ఇండ్లు తగులఁబెట్టి, మనుజులను మారణము చేయుచున్నారే, ఆనీచులు—దుష్టడేనులు—వారలను నీవు ద్వేషింతువా?

ఆ—వారి పేరు వినిన నాకు పరమాసహ్యము.

గేం—నిశ్చయముగ నే? (గుబ్బావంకకుఁదిరిగి)— అబ్బే! ఇతఁడు మనఃపూర్తిగఁ జెప్పినట్లు కనఁబడడు.

ఆ—త్రికరణశుద్ధిగఁ జెప్పుచున్నాను. ముమ్మాటికిని వారు నాకు పరమశత్రువులు; నామాటనమ్ము, తల్లీ!

గు—చేతిలో చేయి వేసినఁగాని విశ్వసింపఁజాలను.

ఆ—క్రిందటిసారి జరిగిన యుద్ధములో నేను ఆల్ఫ్రెడ్ గారితో నుంటిని.

గేం—ఆల్ఫ్రెడ్ మహారాజునొద్దనా? పరమేశ్వరుఁ డాయనను రక్షించుఁగాక!

గు—మా ఆల్ఫ్రెడ్ భూపాలవతంసముయొక్క గతి యేమైనదో తెలిసినదా?

ఆ—అయినచో, అతఁడు మీకు ప్రేమాస్పదుఁ డన్న మాటయే!

గు—సంశయమా? మావంటి బీదల కెంత భక్తియును రాగముండవలెనో, అంతయు మారాజుపై మా కున్నది. "మా ప్రభునకు విజయ మగుఁగాక! ఆ క్రూరములైన డేనుతోఁ జేల్లు త్వరలో నంత మొందుదురుగాక! అని మేము భగవంతుని ప్రార్థింపని క్షణము లేదు; కాని, దైవసంకల్పము వేఱుగ నున్నట్లు కాన్పించుచున్నది.

ఆ—ఆల్ఫ్రెడ్పై మీకంటె నాకుఁగల ప్రేమానుబంధము మిక్కుటము.

గు—కాని, ఆయననుగుఱించి ఏమియు తెలియలేదా?

ఆ—భూలోకము వదలెనేమో యను వదంతులు ప్రబలియున్నవి.

గు—ఎంతటి దుష్కాలము ప్రాప్తించినది! ఇంకకును ఆజగన్నాటక సూత్రధారుని యనుగ్రహమునకై వేచియుండుట దక్క మనము చేయఁగల దేమున్నది? రమ్ము, మాతోపాటు కొంచెము రొట్టెతిందువుగాని, మిక్కిలి యాఁకలితో నున్నట్లున్నావు, పాపము!

గేం—సరే, మాతోవచ్చి సత్కారముఁ బొందుము. రాజోపచారములు జరుపుదుము.

(భర్తతో)—

ప్రాణేశా! మనము వీని నాదరింప కున్నచో రౌరవాదినరకములఁ బడిపోదుము. సత్కరించుట నాకిష్టముగ నే యున్నది, కాని యుదరపోషణమునకై ఈతఁడేల శ్రమపడఁగూడదు? పని చేతనైనవాఁడుగఁ గన్పట్టుచున్నాఁడు; పిక్కవలె నున్నాఁడు.

గు—నిజమే.

(అతనితో)

మిత్రమా! నీ వేపని చేయఁగలవు?

ఆ—మీరు నాకే కార్యము నియమించినను, నెఱవేర్ప సిద్ధముగా నున్నాను. నా పొట్ట నేను స్వయంకృషిచే సంపాదించుకొనుటే నాయభిలాష.

గు—ఈకట్టెలు చక్కఁగ మోపులు కట్టుము, చూతము.

ఆ—నా కలవాటు లేదు. సరిగ కట్టలేనేమోయని సంశయము పొడముచున్నది.

గు—పోనిమ్ము, పసువులసాల కామూల కమ్మ లెగిరిపోయినవి. నేయఁగలవా?

ఆ—నేత చేతఁగాదు, బాబూ!

గేం—బుట్ట లల్లఁగలఁడేమో కనుఁగొనుఁడు. అవసరముగ నున్నవి.

ఆ—ఈ పని యెన్నఁడును నేరిచి యుండలేదు.

గు—సరే, గడ్డి మేటివేయఁగలవా?

ఆ—ఊహుఁ.

గు—ఇదేటి వింతమనుజుఁడు! అంగబలమున్నను, ఏపనియుఁ జేయనేరఁడు. కానిమ్ము, పొయిలో పుల్లలు వేయుట, బల్లలు తుడుచుటయు నైనను చేతఁగాదా?

గేం—నేను పాలుపిదుకుకొని వచ్చెదను. ఈ లోపల నీతనిని రొట్టెలు తిరుగవేయుచుండుమని చెప్పుఁడు.

గుం—తిండిసంగతి యింతలో మాట కాదు గనుక, నేను పోయి కొంతసేపు కట్టెలు కొట్టెదను.

గేం—అయ్యో! రొట్టెలు మాఁడనీయకుము; చప్పచప్పన తిరుగవేయుచుండవలెను.

ఆ—ఆజ్ఞ శిరసావహింతును.

---

ఆల్ఫ్రెడ్

[స్వ]—

నామట్టున కేమి, ఎటు లయిన నోర్చుకొందును; కాని ప్రాణతుల్యమగు నా ఇంగ్లాండు—అయ్యో! రక్తపాతపీడిత మగుచున్న నాదేశమా!—నీ కొఱకే ఈహృదయము దుర్భరపరితాపము నందుచున్నది! 'అంబరు'నది మొదలు 'ఔజ్జు'వఱకు ఒకటే రక్తప్రవాహము! తుత్తునియలైన నా యోధుల మృతకళేబరములు!—అయ్యయ్యో! నాప్రియమైన బిడ్డలు చిత్రవధ నొందిరి; మఱికొందఱు చెప్పరాని దూషణములతో ఇండ్లనుండి తఱుమఁబడిరి; పలువిధముల నవమానింపఁబడిరి. ఈశ్వరునిచే కాపరిగ నియమింపఁబడిన నేను— నిస్సహాయుఁడనై, దిక్కులేని నామందను రక్షింపఁజాలక, "కబళింపుఁడు, మ్రింగుఁడు" అని చేతులార శత్రు మృగములనోటి కందించితిని! కరుణాసాగరా! జగద్రక్షకా! ఈ దేశమును డేనుల బారినుండి రక్షించుటకు నే నసమర్థుఁడనైతినేని, విజయిగాఁ బోరుటకు మఱొకశూరుని లేవఁదీయుము. నేను ఊరు పేరులేక ఈనీచస్థితిలోనే శేషజీవితము గడపుకొందును. ఇంగ్లాండు సుఖముగ నున్నచో, నాకదియే మనశ్శాంతికరము. ఓహోహో! కఱకుదాత లుభయులు నిటు వచ్చుచున్నారు కాఁబోలు!

ప్రవేశము—

గుబ్బా—గేండలిను

గేం—కానంత ఈ కడవ దింపుఁడు. ఈ పాలును రొట్టెయు మిళితముచేసిన నెంతయో రుచిగనుండును!

కాని,—ఇదేమి, దురంతము! రొట్టెలు మాఁడి తగులఁబడిన ట్టున్నవి; చెప్పులవలె కారునలుపు గట్టినవి; ఒక్కసారియైనను తిరుగవేసినపాపమునఁ బోలేదు గదర, మొద్దా! శనివలె దాపరించితివి; ఒడలు కదలుపలేని సోమరిపోతవు!—

ఆ—అమ్మా! నిశ్చయమే, నాది తప్పే; మిక్కిలి వగచుచున్నాను. ఇఁక నీవేమనినను సార్థకముకాదు. నేను చింతానిమగ్నుఁడనై యుంటిని; క్షమింపుము.

గు—సఖి! యిటురమ్ము. అతనిని మఱేమియు తిట్టవలదు, ఊరకుండు. ప్రేమరసతరంగములలో విహరించుచున్నదేమో, అతనిమనస్సు! నేను నిన్ను మోహించుచుండిన నాఁటి తీయని తలఁపులు జ్ఞప్తికి వచ్చుచున్నవి.—

గేం—ఊహూ, జ్ఞప్తిలో నున్నవా?

గు—ఆ! ఎంతకాలమైనది! మాయమ్మ మజ్జిగ చేయుచున్నపుడు—

గేం—సరి, సరి! ఊరకుండుఁడు! మఱియు చిన్నతనము వచ్చుచున్నది. ఈ ప్రసంగము కట్టిపెట్టి భోజనము సంగతి చూడుఁడు.

ఆ—క్షీరము లెంత మధురముగ నున్నవి, తల్లీ! ఓహో! నిశ్చయముగ విందుచేసినావు.

గు—కడుపునిండ భుజింపుము, మిత్రమా!

[గేండలినుతో]—ఈతనికి బస ఎక్కడ ఏర్పాటు చేయుదము?

ఆ—నేను మీకు క్రొత్తవాఁడనుగాని, ఆంగ్లేయదేశము నకు పరాయివాఁడనుగాను. నేను అసలైన ఆంగ్లేయుఁడను.

గేం—నుత్తీ, పశువులను దొంగిలించి, ఇండ్లు తగులఁబెట్టి, మనుజులను మారణము చేయుచున్నారే, ఆనీచులు—దుష్టడేనులు—వారలను నీవు ద్వేషింతువా?

ఆ—వారిపేరు విన్న నాకు పరమాసహ్యము.

గేం—నిశ్చయముగనే? (గుబ్బావంకకుఁదిరిగి)—

అబ్బే! ఇతఁడు మనఃపూర్తిగఁ జెప్పినట్లు కనఁబడదు.

ఆ—త్రికరణశుద్ధిగఁ జెప్పుచున్నాను. ముమ్మాటికిని వారు నాకు పరమశత్రువులు; నామాటనమ్ము, తల్లీ!

గు—చేతిలో చేయి వేసినఁగాని విశ్వసింపఁజాలను.

ఆ—క్రిందటిసారి జరిగిన యుద్ధములో నేను ఆల్ఫ్రెడ్ గారితో నుంటిని.

గేం—ఆల్ఫ్రెడ్ మహారాజునొద్దనా? పరమేశ్వరుఁ డాయనను రక్షించుఁగాక!

గు—మా ఆల్ఫ్రెడ్ భూపాలవతంసముయొక్క గతి యేమైనదో తెలిసినదా?

ఆ—అయినచో, అతఁడు మీకు ప్రేమాస్పదుఁ డన్న మాటయే!

గు— సంశయమా ? మాబోఁటి బీదల కెంత భక్తి యను రాగముండవలెనో, అంతయు మారాజుపై మా కున్నది. "మాప్రభునకు విజయ మగుఁగాక! ఆ క్రూరములైన డేనుతోఁడేళ్లు త్వరలో నంత మొందు దురుగాక! అని మేము భగవంతుని ప్రార్థింపని క్షణము లేదు; కాని, దైవసంకల్పము వేఱుగ నున్నట్లు కాన్పించు చున్నది.

ఆ— ఆల్ఫ్రెడ్‌పై మీకంటె నాకుఁగల ప్రేమానుబంధము మిక్కుటము.

గు— కాని, ఆయననుగుఱించి ఏమియు తెలియలేదా ?

ఆ— భూలోకము వదలెనేమో యను వదంతులు ప్రబలియున్నవి.

గు—ఎంతటి దుష్కాలము ప్రాప్తించినది! ఇంతకును ఆజగన్నాటక సూత్రధారుని యనుగ్రహమునకై వేచియుండుట దక్క మనము చేయఁగల దేమున్నది? రమ్ము, మాతోపాటు కొంచెము రొట్టెతిందువుగాని, మిక్కిలి యాఁకలితో నున్నట్లున్నావు, పాపము!

గేం—సరే, మాతోవచ్చి సత్కారముఁ బొందుము. రాజోపచారములు జరుపుదుము.

(భర్తతో)—

ప్రాణేశా! మనము వీని నాదరింప కున్నచో రౌరవాదినరకములఁ బడిపోదుము. సత్కరించుట నాకిష్టముగనే యున్నది, కాని యుదరపోషణమునకై ఈతఁడేల శ్రమపడఁగూడదు? పని చేతనైనవాఁడుగఁ గన్పట్టుచున్నాఁడు; పిక్కవలె నున్నాఁడు.

గు—నిజమే.

(అతనితో)

మిత్రమా! నీ వేపని చేయఁగలవు?

ఆ—మీరు నాకేకార్యము నియమించినను, నెఱవేర్ప సిద్ధముగా నున్నాను. నాగొట్టె నేను స్వయంకృషిచే సంపాదించుకొనుటే నాయభిలాష.

గు—ఈకట్టెలు చక్కఁగ మోపులు కట్టుము, చూతము.

ఆ—నాకలవాటు లేదు. సరిగ కట్టలేనేమోయని సంశయము పొడముచున్నది.

గు—పోనిమ్ము, పశువులసాల కామూల కమ్మ లెగిరిపోయినవి. నేయఁగలవా ?

ఆ—నేఁత చేతఁగాదు, బాబూ!

గేం—బుట్ట లల్లఁగలఁడేమో కనుఁగొనుఁడు. అవసరముగ నున్నవి.

ఆ—ఈ పని యెన్నఁడును నేరిచి యుండలేదు.

గు—సరే, గడ్డి మేటివేయఁగలవా?

అ—ఊహుఁ.

గు—ఇదేటి వింతమనుజుఁడు! అంగబలమున్నను, ఏపనియుఁ జేయనేరఁడు. కానిమ్ము, పొయిలో పుల్లలు వేయుట, బల్లలు తుడుచుటయు నైనను చేతఁగాదా?

గేం—నేను పాలుపిదుకుకొని వచ్చెదను. ఈ లోపల నీతనిని రొట్టెలు తిరుగవేయుచుండుమని చెప్పుఁడు.

గుం—తిండిసంగతి యింతలో మాట కాదు గనుక, నేను పోయి కొంతసేపు కట్టెలు కొట్టెదను.

గేం—అయ్యో! రొట్టెలు మాఁడనీయకుము; చప్పుచప్పున తిరుగవేయుచుండవలెను.

ఆ—ఆజ్ఞ శిరసావహింతును.

---

ఆల్ఫ్రెడ్

[స్వ]—

నామట్టున కేమి, ఎటు లయిన నోర్చుకొందును; కాని ప్రాణతుల్యమగు నా ఇంగ్లాండు—అయ్యో! రక్తపాతపీడిత మగుచున్న నాదేశమా!——నీ కొఱకే ఈహృదయము దుర్భరపరితాపము నందుచున్నది! 'అంబరు'నది మొదలు 'ఔజ్ను'వఱకు ఒకటే రక్తప్రవాహము! తుత్తునియలైన నాయోధుల మృతకళేబరములు!—అయ్యయ్యో! నాప్రియమైన బిడ్డలు చిత్రవధ నొందిరి; మఱికొందఱు చెప్పరాని దూషణములతో ఇండ్లనుండి తఱుమఁబడిరి; పలువిధముల నవమానింపఁబడిరి. ఈశ్వరునిచే కాపరిగ నియమింపఁబడిన నేను—నిస్సహాయుఁడనై, దిక్కులేని నామందను రక్షింపఁజాలక, "కబళింపుఁడు, మ్రింగుఁడు" అని చేతులార శత్రుమృగములనోటి కందించితిని! కరుణాసాగరా! జగద్రక్షకా! ఈ దేశమును డేనుల బారినుండి రక్షించుటకు నే నసమర్థుఁడనైతినేని, విజయిగాఁ బోరుటకు మఱొకశూరుని లేవఁదీయుము. నేను ఊరు పేరులేక ఈ నీచస్థితిలోనే శేషజీవితము గడపుకొందును. ఇంగ్లాండు సుఖముగ నున్నచో, నాకదియే మనశ్శాంతికరము. ఓహోహో! కఱకు దాత లుభయులు నిటు వచ్చుచున్నారు కాఁబోలు!

ప్రవేశము—

గుబ్బా—గేండలిను

గేం—కానంత ఈ కడవ దింపుఁడు. ఈ పాలును రొట్టెయు మిళితముచేసిన నెంతయో రుచిగనుండును!

కాని,—ఇదేమి, దురంతము! రొట్టెలు మాఁడి తగులఁబడిన ట్లున్నవి; చెప్పులవలె కారునలుపు గట్టినవి; ఒక్కసారియైనను తిరుగవేసినపాపమునఁ బోలేదు గదర, మొద్దా! శనివలె దాపరించితివి; ఒడలు కదలవలేని సోమరిపోతవు!—

ఆ—అమ్మా! నిశ్చయమే, నాది తప్పే; మిక్కిలి వగచుచున్నాను. ఇఁక నీవేమనినను సార్థకము కాదు. నేను చింతానిమగ్నుఁడనై యుంటిని; క్షమింపుము.

గు—సఖీ! యిటురమ్ము. అతనిని మఱేమియు తిట్టవలదు, ఊరకుండు. ప్రేమరసతరంగములలో విహరించుచున్నదేమో, అతనిమనస్సు! నేను నిన్ను మోహించుచుండిన నాఁటి తీయని తలఁపులు జ్ఞప్తికి వచ్చుచున్నవి.—

గేం—ఊహూ, జ్ఞప్తిలో నున్నవా?

గు—ఆ! ఎంతకాలమైనది! మాయమ్మ మజ్జిగ చేయుచున్నపుడు—

గేం—సరి, సరి! ఊరకుండుఁడు! మఱియు చిన్నతనము వచ్చుచున్నది. ఈ ప్రసంగము కట్టిపెట్టి భోజనము సంగతి చూడుఁడు.

ఆ—క్షీరము లెంత మధురముగ నున్నవి, తల్లీ! ఓహో! నిశ్చయముగ విందుచేసినావు.

గు—కడుపునిండ భుజింపుము, మిత్రమా!

[గేండలినుతో]—ఈతనికి బస ఎక్కడ ఏర్పాటు చేయుదము?









౧. (ఎ) శ్రీ మద్దాలి సత్యనారాయణగారు (కీ) (బి) శ్రీ కోడేటి రంగాచార్యులుగారు (కీ) (సి) శ్రీవడలి జోగయ్యశాస్త్రిగారు (కీ) (డి) శ్రీ వెంపటి సదాశివబ్రహ్మంగారు(కీ) ౨. ఖద్దరుదీక్షబూనిన బెజవాడ రక్షకులు. 3. శ్రీ దుర్గా వెంకటాద్రిగారు(కీ) ౪. శ్రీ క. గోపిగారు(కీ) ౫. శ్రీ చిన్నకోట జగన్నాథగుప్తగారు (కీ). ౬. శ్రీ బి. కృష్ణమూర్తిగారు (కీ) ౭. శ్రీ భమిడిపాటి చినయజ్ఞనారాయణశర్మగారు (కీ)











౧. శ్రీ బాలసూరిపచ్చి ఆంజనేయశాస్త్రిగారు(శే) ౨.(ఎ) శ్రీ కావూరి వెంకటప్పయ్యచౌదరిగారు(శే) (బి) శ్రీ అప్పసాని సాంబయ్యచౌదరిగారు
౩. శ్రీ పెండెం వెంకటరాములుగారు(శే) ౪.(ఎ) శ్రీ చేకూరు వెంకటసుబ్బయ్యచౌదరిగారు(శే) (బి) శ్రీ శరణు పున్నయ్యగారు(శే) (సి) శ్రీ రాపర్ల
శివరామకృష్ణయ్యగారు(శే) ౫. (ఎ) పొతుకుచ్చి వెంకట్రామయ్యగారు(శే) (బి) శ్రీ టి.వి.శాస్త్రిగారు(శే) (సి) శ్రీ ముష్టి సత్యనారాయణగారు(శే)

# ప్రసిద్ధి గల నగల వర్తకులు

## నమ్మకమునకును, పనితనమునకును, ప్రఖ్యాతిగాంచినవారు

DIAMONDS




JEWELLERY

A view of the show rooms of Messrs Bapalal & Co., Madras

## వజ్రములు

మావద్ద వజ్రములు విశేషముగా నుండుటవలన, ఎవరికి కేమాదిరి కావలసినను బాగుగా పరిశీలించి, కోరుకొన్నమగుదాని నేరుకొనవచ్చును. మేలు రకపుపాటివి సాధ్యమయినంత తక్కువ ధరలకు బడయవచ్చును. ఎందుచేతననగా, మేము రొక్కపుబేరమునకు నేరుగా ఘనులను తెప్పించెదము. అందువల్ల ఏజంటు లేక కమీషనుదారు లాభములుగాని దరుమానములుగాని యిందు కలియుట లేదు.

## చిత్రవస్తువులు

మా చిత్రవస్తువులు బంగారులోను, వెండిలోను అతి సొగసైన నమూనాలు సిద్ధపరుపబడుచున్నవి. స్వచ్ఛమైన లోహమును పనివారల పని నైపుణ్యమును, మాకు పెట్టని కోట్లు. మా చిత్రవస్తువు లెందరి గృహములనో అలంకరించినవి. అయినప్పటికిని కల్తీ లేని, వెండికిని సరకు బంగారమునకును పూచీ యిచ్చెదము.

# బాపాలాల్ & కో

వజ్రముల వ్యాపారులు, నగలను చేయువారు, చైనాబజారు, మద్రాసు.

టెలిఫోను నెం 2696 రు. టెలిగ్రాం నెక్‌లేస్











౧. శ్రీ. మంగిపూడి పురుషోత్తమ శర్మగారు (శి) ౨. (ఎ) శ్రీ తూములూరు సత్యనారాయణగారు (శి)
(బి) శ్రీ అధరాపురపు శేషగిరిరావుగారు (శి) (సి) శ్రీ తూములూరి శేషగిరి శర్మగారు (శి) ౩. శ్రీ. నూరంపూడి హరిరావుగారు (శి)
౪. శ్రీ దంతులూరు నారాయణరాజుగారు (శి) ౫. శ్రీ గరికిపాటి మల్లావధానిగారు (శి) ౬. శ్రీ మల్లాది యజ్ఞనారాయణగారు (శి)
౭. శ్రీరాములు గుప్తగారు (శి) ౮. (ఎ) శ్రీ వంక సూరిశాస్త్రిగారు (శి) ౯. శ్రీ గోపాలకృష్ణయ్యగారు (శి)








౧. శ్రీ యం. వి. గిరిగారు (*) ౨. శ్రీ వింజమూర్తి అనంతాచార్యులుగారు (*) ౩. శ్రీ యన్. నాగేశ్వరరావుగారు (*)
౪. శ్రీ దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు, బౌద్ధవాఙ్మయబ్రహ్మ (*)
౫. శ్రీ వి. రామబ్రహ్మం చౌదరిగారు (*) ౬. శ్రీ కాపమాను నరసింహరావుగారు (*)

గేం—మీకు తెలియని దేమున్నది? చావడిలో నింకను క్రొత్తగడ్డి యున్నట్లున్నది.

ఆ—[స్వ]—

నాకు రాజభోగములేల ? నేనును నా సిపాయిల వలెనే శయనింతును. కటా! ఎందఱు యోధులు కటికి నేలపై శాశ్వతముగ పవ్వళించి యున్నారో కదా !

గేం—ఏ మాచప్పుడు ? గుఱ్ఱపు కదముఁవలె నున్నది. సంగతి తెలిసికొని రండు.

ఆ—పాపము శమించుచుగాక ! నన్ను గుఱించి ఈ బీద కుటుంబులు కూడ మడియవలసిన గతి వచ్చినది కాఁబోలును! నేనాయరణ్యములోనే ప్రాణత్యాగము కావించుకొనక పోయితినిగదా !

గేం—దయాసముద్రా ! మావంతునకు వచ్చినవా, కత్తి వ్రేటులు !

గు—అయ్యో ! ఇఁక నేమున్నది ? డేనులు ! డేనులు వచ్చిపడిరి ! బాబూ ! మమ్ములను చంపకుఁడు !!

ప్రవేశము—ఎల్లా

ఎ—[మోఁకఱించి]—

ఓ న్యాప్రభూ ! నారాజా ! తండ్రీ ! నిన్నుఁగన్గొను భాగ్య మబ్బినది; ధన్యుఁడను.

ఆ—[కౌఁగిలించుకొని]—

నా ఎల్లాయే ! ధీరుఁడగు నాయెల్లా యేనా !!

ఎ—రాజోత్తమా ! శుభసందేశము గొని వచ్చితి. 'కిన్విల్' కోటలో బంధింపఁబడిన మనసైన్యము గట్టి పట్టుదలతో నీవలఁ బడి, అచ్చటిడేనులను చెండాడినది. భయంకరమూర్తియగు వారి నాయకుఁడు—హుబ్బా—కొనయూపిరితో పడియున్నాఁడు.

ఆ—అట్టిపని సంభావ్యమా! ఇంకను నేను రాజుగనుండఁదగుదునా ?

ఎ—ప్రఖ్యాతవీరపురుషుఁడగు వారి నాయకశిఖామణి కూలిపోయినతోడనే వారి సైనికులు దిగులుచెంది చెల్లా చెదరైరి. ఈ తరుణమున మనవారల నడపించుటకై ఎలుగెత్తి నీ నామస్మరణ మొనరించుచున్నారు. ఇదిగో, ఈ యుత్తరములో మిగిలిన వివరము లున్నవి. [ఒక లేఖ నిచ్చును.]

గు—[ప్రక్కను]—

అయ్యో ! మనగతి యేమికానున్నదోకద ! నీకు నోటిశుద్ధి లేదు. ఎట్లు తూలనాడి వదరితివి!

గేం—ఇఁకేమున్నది ? మనకు చావు మూఁడిన దనుట నిశ్చయము. ఇంతకును, ఆయన ప్రభువని కలగంటినా యేమి ?

గు—ఈ మాత్రము కనిపట్ట లేక పోయితివి, ఎందుల కూరక ప్రేలుట ? ఆయన కేపనియుఁ చేతఁగాకుండుటయే గొప్పవాఁడనుటకు తార్కాణము.

ఆ—[ముందునకువచ్చి]—[స్వ]—

దేవా ! ఇదంతయు నీకృపశకద ! నేఁడెట్టి సువార్త తెలియవచ్చినది ! నిస్పృహాతా దేవత నెలకొనియున్న ఈ విషమపరిస్థితులలో 'ఆశ' యను వెలుఁగు ప్రసాదించితివి !

మిత్రమా !—

తిరిగి నేను సేనలో మెఱయుదునా ? ధీరులగు నా యాంగ్లేయులను నడపింతునా? విజయము వడయుదునా ? మరల నా మిత్రులు తల లెత్తుదురా ?

ఎ—రాజా ! నీకువలెనే అడవులలోను, గుహాలలోను, తల దాఁచుకొనుచు, ఇంటింటికిఁ దిరుగవలసివచ్చిన యోధులు పలువు రున్నారు. నీవు సజీవుఁడవై తిరిగి సేనాధిపత్యము వహించితి వనువార్త తెలిసినక్షణమ, అధైర్యము వీడి మరల ముందునకు వచ్చి, నీయాజ్ఞను శిరసావహింతురు.

ఆ—సరే, వారినందఱను కలసికొన మిక్కిలి తహతహ పడుచున్నాను. ఈ పట్టుననే న్యాప్రజలు కసిదీర్చుకొనవలయు, తరుణము మించనీయఁ గూడదు.

గుబ్బా—గేంకలిను
(రాజుపాదములపైఁబడి)—

మహాప్రభూ!—

గేం—మాశిరములు ఖండించెదవు కాఁబోలును, ప్రభువతంసమా! రాజా! ప్రమాణపూర్వకముగఁ జెప్పుచున్నాను, నీవు మాప్రభువని తెలియనైతిని, తండ్రీ!

గు—అమాయికురాలైన నాభార్యను క్షమింపఁడా, రాజమౌళీ! పాపము! ఆమెకు నోటితొందరయేకాని, దురుద్దేశము లేదు.

ఆ—సదయహృదయులగు దంపతులారా! క్షమించితిని. క్షమించుటయేకాదు, వందనము లర్పించుచున్నాను. నేను తిరిగి ఇంగ్లాండుదేశపు సింహాసనము నధిష్ఠించు నంతటి యదృష్టమే కల్గుచో, మీరొనంగిన యాతిథ్యమునకు యథోచితముగ మిమ్ముల బహూకరించుటయే నా మొదటికర్తవ్యము. మిమ్ములఁ గాపాడుటకే నే నిప్పుడు పోవుచుంటిని.

విశ్వాసపాత్రుండవగు నా ఎల్లా! రమ్ము, ఆయుధపాణివి గమ్ము! మఱొక్కసారి దేనులను డీకొనుటకీయాత్మ తపించుచున్నది. పంచభూతములు సాక్షులుగ నేనిదే శపథముఁ బూనుచున్నాఁడ, వినుము—"నా దేశమునకు శాంతియైన చేకూరవలెను, లేక రణరంగమున నేనసువులనైనఁ బాయవలెను; అంతవఱకు ఈనాఖడ్గము ఒఱలోనికిఁ బోదు."

---

# శృంగారమాయావిలాసము

బుక్కపట్టణపు రామానుజయ్యగారు

(ఒకచిన్నిప్రహసనము)

[ శ్రీసీతారామలక్ష్మణులు దండకారణ్యము ప్రవేశింతురు.]

రాముఁడు:— ఋషీశ్వరులారా! నమస్కారము. [అనుచు సీతాలక్ష్మణులతోడ సాష్టాంగముగాఁ బ్రణమిల్లును.]

ఋషులు :—[ఆశీర్వదించి] శ్రీరామచంద్రా! ఈదినమే సుదినము. మిమ్ముఁ జూడఁ గంటిమి. మంటిమి. మాతపములు ఫలించె. మాజన్మములు సార్థకము లయ్యె.

రాముఁడు :—మీ కెల్లరకుఁ గుశలమే కదా? ఇందు మీ తపోయాగాదులు నిర్విఘ్నముగఁ గొనసాగుచున్నవా?

ఋషులు :— అక్కటా! మాకష్టములఁగూర్చి నీతోఁ గాక మఱి యెవ్వరితో మొఱపెట్టుకొని మాదుఃఖములఁ బాపుకొనఁగలము? వినవయ్యా, ఈయరణ్యమున రాక్షసులు కడుంగడుఁ బ్రబలియున్నారు. ఆమాయావులు మా యాగాదికర్మలప్పుడు రక్తమాంసాదులు గురిసి కార్యభంగము గావింతురు. మాతపమును జెఱుతురు. ఆదుర్మార్గులబారినుండి రక్షించుభారము నీయది.

రాముఁడు :—ఇఁక మీరు భయమొందవలదు. ఇందుల రక్కసులఁ జక్కడంచి మీ కందఱకు సుఖము గూర్చెద. [అని యభయ మిచ్చును.]

[ఇది యెఱింగి కొందఱు రాక్షసులు తమ యజమానుఁ డగు ఖరునకుఁ దెలుపఁ బరుగిడుదురు.]

రాక్షసులు :—మహాప్రభూ! మనవనమునకు వింతవారెవ్వరో యిరువురు రాజకుమారు లతిదృఢకాయులాజానుబాహులు జటావల్కలధారులై ధనుర్బాణపాణులై వచ్చియున్నవారు. వారివెంట నొకచక్కని యాఁడుదియును వచ్చియున్నది. అవ్వీలు కాంద్రుడు దశరథచక్రవర్తిపుత్త్రులఁట. వారిలోఁ బెద్దవాఁడు రాముఁ డనువాఁడఁట. వానితో వెడఁగు జడదారులు మనవలని బాధలనుగూర్చి మొఱపెట్టుకొనిరి. వాఁ డది విని, "మీ రిఁక భయపడవలదు. ఇందుల రక్కసుల నుక్కడంతు" ననెను. చిత్తగింపవలయును.

[ఖరుఁడు తల యూఁచి, కనుసన్నచే వారికి సెలవొసంగి, సభలో నున్న విరాధునివంకఁ జూచును.]

విరాధుఁడు :—[లేచి] మహాప్రభూ! దేవరయాజ్ఞకు నెదురుచూచువాఁడ.

ఖరుఁడు :—ఈ వనమునకు ముగ్గురు మనుష్యులు వచ్చియున్నా రనుమాట నీవును వింటివికదా! మనుష్యులు మన కొకలెక్కయా? వారు మన కాహారభూతులు. అది యటుండనిమ్ము. నీ వచ్చోటికిఁ జని యాస్త్రీని శీఘ్రముగఁ గొనిరమ్ము.

విరాధుఁడు—చిత్తము మహాప్రభూ! [అని సెలవు పొంది త్వరితగతిని శ్రీరాములు లుండు చిత్రకూటపర్వతమునొద్దకుఁ బోవును.]

శ్రీరామచంద్రుఁడు కొండనెత్తముపైని సీతాదేవితో విహరించుచు సందుల వినోదముల నామెకుఁ జూపుచుండఁగా, విరాధుఁడు వారలఁ గాంచి, యామెసౌందర్యమున కచ్చెరువంది, యామెను ఖరునకుఁ గొనిపోవు ప్రయత్నము మాని, తానే యామె నెటకేనిఁ గొంపోవ నుద్యుక్తుఁడై, యామెను వంచించి కొనిపోవుకొఱకు రాముని వేషము ధరించి, యం దొకచోటఁ దిరుగులాడుచుండును.

[విరాధుఁడు రాక మసలుటకు ఖరుఁడు కోపము గొని, సీతను దెచ్చుటకు శూర్పణఖను బంపెను.]

శూర్పణఖ—[రాముని వేషమున నున్న విరాధునిఁ గాంచి, తా నదివఱకే రామునిఁ జూచి యాన గొని సమయము వేచియున్న దగుటచే]

తనలో — "ఏమి నా నోముఫలము! రాముఁడెన్నఁడు నిజకాంతను విడిచి యేకాంతమున నాకుఁ జిక్కునా యని యెంచియుంటిని. ఆహా! నేఁడు నా మనోరథము ఫలించె! అదె! యా రాముఁ డీవైపునకే వచ్చుచున్నవాఁడు. అతఁ డెప్పుడును సీతయందే ప్రేమ గలవాఁడు. వేఱొక స్త్రీని కన్నెత్తియైనఁ జూడఁడు. కనుక నామె రూపము నే ధరియించి, యాతని నేమఱించి యొందుల కేనిఁ గొనిపోయెద."

అంత, మాయారాముఁడును మాయాసీతయును నొక్కచో సంధింతురు. ఈ విచిత్ర ప్రదర్శనమును లోకాభిరాము లగు సీతారాములు చూచి నవ్వుకొనుచు, ముందు జరుగఁబోవు నాటకమునం దా పాత్రధారు లేమాత్ర మభినయింతురో కనుఁగొనువారై యట్టె వేడుక చూచుచుందురు.

ఆ సీతారాముల రక్షణము నిమిత్తము కొండ దిగువ మిగుల మెలఁకువతోఁ గావలి గాచుచున్న లక్ష్మణుఁడు వనప్రదేశమున నడయాడుచున్న యా మాయాదంపతులు తనదృష్టిపథమునఁ బడినంతనె, 'కొండపై నున్నవార లచ్చోటి కెప్పుడు పోయి' రని సంశయించి, మీఁదికిఁ దల యెత్తి చూచి, యచ్చట సీతారాము లుండుటను గాంచి, యెదుట గోచరించు దంపతులు కామరూపు లగు రాక్షసులే యని నిశ్చయించి మిన్నకుండెను.

మాయారాముఁడు:—ప్రేయసీ! యింతసే పెక్కడఁ గ్రుమ్మరుచుంటివి?

మాయాసీత:—మోహనాంగా! నే నొక్క చక్కని కురంగమును జూచితిని. దానిఁ బట్టి తెచ్చి యాడుకొందమని యాసించి, దానిని వెంబడించి చాలదూరము పోయితిని. అది నాచేతికిఁ జిక్కదయ్యెను. నేను నిరాశఁ జెంది యిచ్చటికి వచ్చితి.

మాయారాముఁడు:—ప్రియా! నీ వింత ప్రయాసపడ నేల? నాతో నొక్కమాట చెప్పిన, నెన్ని జింకలేని పట్టి తెచ్చి నీముందటఁ బెట్టనా? కాని, జింకమీఁద నుండు ప్రేమకూడ నాయందే యుండవలయు నని నాకోరిక. జింకను దెచ్చి యిచ్చిన, నీవు దానితో నే యెప్పుడు నాడుకొనుచుందువేమో యని, తెచ్చుటకు వెనుదీసెదను. నిన్ను విడిచిన యరనిమునము నా కొకయుగముగఁ దోఁచును. నీకు జింకమీఁది పిచ్చ, నాకు నీమీఁద....

మాయాసీత:—మనోహరా! నీమనస్సును శోధించుట కట్లు చెప్పితిని. కాని, నేనుమాత్రము నిన్నెడఁబాసి యరక్షణమైన నుండఁగలనా? నన్ను వెదకికొని వచ్చెదవో లేదో చూడఁ గోరి యీపొదరింట డాఁగి యుంటిని. ఇఁక వ్యర్థముగా నిన్నలయింపఁ గూడదని యెంచి, నీయెదుటఁ గనంబడితి.

మాయారాముఁడు:—నన్ను నీ వింతగాఁ బ్రేమించుటకు సంతసించితిని. సుందరీ! యింకనుక నిన్నెడఁబాసిన తాపము దీఱ నా కొకతియ్యనిముద్దు ననుగ్రహింపుమా! [అని ముద్దిడుకొనును.]

మాయారాముఁడు—(స్వగతము) ఇఁకను మసలరాదు. రాముఁడు సీతను గానక వెదకికొని యిచ్చటికి

వచ్చినఁ గార్యము చెడును. కనుక దీని నుపాయమున దూరమునకుఁ దోడ్కొనిపోవలయును.

(బహిరంగముగా) — ప్రాణబోఁడీ! అల్లదిగో చూడుము. తనకు మాతా కై వెలయుచున్న యాపోఁక మ్రాఁకునకు సొంపు సంపాదించుచు నొకసంపెంగ దీఁగ యల్లిబిల్లిగ నల్లుకొనియున్నది. చెంతకుఁ బోయి దాని సోయగమును గనుల పండువుగఁ గనుఁగొందము రమ్ము.

మాయాసీత — [స్వగతము]- ఈతఁడు చూపుచున్న ప్రదేశ మీతని నెత్తికొనిపోవుట కెంతయు ననుకూలించున ట్లున్నది.]

(బహిరంగముగా) — మోహనాంగా! యట్లే కానిమ్ము. రమ్ము పోదము. [ఇరువురు నచ్చోటు చేరుదురు.

మాయారాముఁడు — ఆహా! చూచితే? లతాతన్వీ! యీలతిక యెంతయల్లిబిల్లిగ నల్లుకొని పూగుత్తులతోఁ గూడి చల్లనిపిల్లతెమ్మెరలకు నల్ల లాడుచున్నది!

మాయాసీత — [తల యెత్తి చూచి] ఔనౌను. కడు వేడు కయ్యెడిని. వేడుకకాఁడా! నాకు నంపెంగ గుత్తు కోసియిచ్చెదవా? నీచేతి కది యందదు. కావున నేను వంగికొనియెద నీవు నావీఁపుపై నెక్కి కోసియిమ్ము.

మాయారాముఁడు — రమణీమణీ! నీ కోమలశరీరమునకుఁ గష్ట మిచ్చుటకు నామనం బొప్పునా? నీ మేని తీవ కందిపోవును. నేను వంగియుండెదను. నాపైని నీ వెక్కి నీకు వలసినన్ని పూవుగుత్తులఁ గోసికొనుము.

మాయాసీత —[స్వగతము] - ఇతఁడు న న్నాపరమసుకుమారిణి యగు సీతనుగా భావించి యిట్లనుచున్నాఁడు. నేను రక్కసి నని యెఱుంగఁడు. సంశయము కలిగించినఁ గార్యము చక్కఁబడదు. కనుక నేనే యీతనిపై నెక్కిన ట్లనుకరించి నాకాళ్లతో మెలఁకువగా నిఱికించి యెందుల కేని యెగిరిపోయెదఁ గాక.

(బహిరంగముగా)—మహావీరపురుషా! నీ యిష్టము చొప్పననే చేయుము.

విరాధుఁడు వంగికొనును. శూర్పణఖ ఊపిరి బిగఁబట్టి తేలికగా నెక్కును. అంతట వాఁడు త్వరలో నెత్తుకొనిపోవఁ బ్రయత్నించును. విగ్రహము భారముగా నుండుటను గ్రహించును. ఇ దేమి యో చోద్యముగా నున్న దని వాఁడు కలవరపడును. శూర్పణఖ తన కాళ్లతో నతని నిఱికించి పై కెగిరిపోవ గమకించును. అతనిమేను చిట్టెపురాయివలెఁ గదలుటలేదు. శూర్పణఖ తనబలముకొలఁదిని పైకి లేవఁ బ్రయత్నించును. సాధ్యము కాదయ్యెను. 'ఈతఁడు రాముఁడు కాఁడు. ఖరునిచే మొదటఁ బంపఁబడిన విరాధుఁడే యీరూపమున నున్నవాఁ' డని నిశ్చయించి, వెంటనే క్రిందికి దుమికెను. వాఁడును దోడుతనె లేచి నిలువఁబడి 'మనుజకాంత కింతబలమెక్కడిది? ఎవ్వతియో రక్కసి రాము నాసించి, కల్లసీత యై మెల్లమెల్లఁగ నాయొద్దకు వచ్చి యిన్నివిద్దెలు చూపె' నని నిశ్చయించెను.

[అంతట నిరువురు నొకరి నొకరు దెలిసికొనుత్వరగలవా రై యిట్లు ప్రశ్నించుకొందురు.]

విరాధుఁడు — ఓసీ! నీ వెవ్వతివి? సీతవేసమున నిట్లు పలుపోకలఁ బోయితివి.

శూర్పణఖ — ఓరీ! నీ వెవ్వఁడవు? కుహనారాముఁడవై బహుభంగుల భాషించి శృంగారవిలాసములఁ జూపితివి.

ఇంతలోన వారల కిరువురకును ఖరునిజ్ఞాపకము కలిగెను. ఖరుఁడు ఖరశాసనుఁడు; ఇంత యాలస్యమునకు మనల దండింపక విడుచునే యను దిగు లొండొరులమనంబులందు బుగులుకొనెను.

తోడుతనె యిరువురును దమతొంటిరూపములతో నిలువంబడిరి.

విరాధుఁడు — ఓసి! టక్కులాఁడి! నీ విక్కడి కేల వచ్చితివే? సీతవేసము గయికొని యెన్నెన్నివగలఁ గులికితివే! చుప్పనాతి యనుపేరు నీకే యొప్పునే!

శూర్పణఖ — ఔరా! విరాధా! మహాశూరుఁడవు పోలె బిరాన నిందులకు వచ్చి, ఖరాజ్ఞ సేయుట మాని, రామునిరూపమున నీ వేల యిటు తామసించితివి? నీ వింకను రాకుండుటకు ఖరుఁడు కినిసి సీతను దేర నన్నుఁ బంపె. అయిన దయ్యెఁ గాని, మన మురువులు, ముచ్చట లోరులుచూచి నవ్వకమునుపే, సత్వరముగ ఖరునొద్దకుఁ బోయి యేదేని బొంకి తప్పించుకొనెదము. రమ్ము, పోదము. [అని నిష్క్రమింతురు.]

పర్వతసానువుపై నున్న రామచంద్రుఁడు సీతాదేవిని జూచి "ఈబూటకపు నాటక మెటు లున్నది?" అని మందహాసముచేసి యడిగెను. సీతాదేవి నిజవల్లభునిఁజూచి "కడుఁ జోద్యముగ నున్న"దని పలికి, కడు పుబ్బ నవ్వసాగెను. అంతట రామచంద్రుఁ డాహ్నికము నెఱవేర్పంజనును. సీతాదేవి పెంపుడుజింకతో నాడుకొనఁ బోవును.

మంగళం భవతు.

---

మన దినచర్య





# దేవుని మహిమ

విద్వాన్, గరిమెళ్ల సోమన్నగారు, యం. ఏ., యల్. టి.

అక్షయదీప్తుల ననిశము వ్రేలెడి
లక్షలు కోటులు నక్షత్రంబులు
దేవుని మహిమను దెలిపెడిఁ గనుమా!
భావము నవ్విభుపయి నిడి చనుమా.

నేలయు నీరును నిప్పనిలంబును
నింగియు లోనగు నిఖిలజగంబును
దేవుని మహిమను దెలిపెడిఁ గనుమా! భా.

సర్వప్రాణుల చైతన్యదుఁ డయి
ఉర్విని దనుపుచు నోపెడి సూర్యుఁడు
దేవుని మహిమను దెలిపెడిఁ గనుమా! భా.

చంద్రునితోడను సరిగా నెగయుచు
సంద్ర మపారము సతతతరంగము
దేవుని మహిమను దెలిపెడిఁ గనుమా! భా.

చుక్కలఁ జరుగుచుఁ జుట్టుచు భూమిని
చక్కని చంద్రుఁడు చల్లఁగ వెలుఁగుచు
దేవుని మహిమను దెలిపెడిఁ గనుమా! భా.

పర్వతపంక్తుల వనముల నదులం
బర్వి చరాచరవాసం బగుధర
దేవుని మహిమను దెలిపెడిఁ గనుమా! భా.

నవరత్నంబులు నానాశిలలును
వివిధస్థలజలవిభవాస్పదములు
దేవుని మహిమను దెలిపెడిఁ గనుమా! భా.

వేలక్షల తృణవృక్షలతాదులు
కాలక్రమమునఁ గాయుచుఁ దనుపుచు
దేవుని మహిమను దెలిపెడిఁ గనుమా! భా.

కీటమృగాదులు క్రిములుం బక్షులు
కోటిశతంబులు కూటికిఁ దిరుగుచు
దేవుని మహిమను దెలిపెడిఁ గనుమా! భా.

రేయుంబవళులు ఋతువులు నేండ్లును
సాయంప్రాతస్సంధ్యలు మాఱుచు
దేవుని మహిమను దెలిపెడిఁ గనుమా! భా.

వృక్షాగ్రంబుల విహరించుచుఁ దమి
పక్షుల కులములు పాడుచు నాడుచు
దేవుని మహిమను దెలిపెడిఁ గనుమా! భా.

పూవిడ తేనెను పుష్పాడి పుర్విడ
స్థావరజంగమసహవాసంబులు
దేవుని మహిమను దెలిపెడిఁ గనుమా! భా.

చెట్టున గూఁటిని చెన్నుగఁ దీర్చుచు
పిట్టలు గ్రుడ్డులు పెట్టి పొదుగుచును
దేవుని మహిమను దెలిపెడిఁ గనుమా! భా.

పక్షులు మింటను పంక్తులు దీర్చుచు
శిశుగఁ బాఱుచుఁ జెలిమినిఁ జూపుచు
దేవుని మహిమను దెలిపెడిఁ గనుమా! భా.

నీ రాకసమున నిల్చుచు వానగ
ధారుణిఁ గురియుచుఁ దనుపుచు జీవుల
దేవుని మహిమను దెలిపెడిఁ గనుమా! భా.

అనుదిన మెల్లెడ ప్రాణులు చచ్చుట
గనుచుం స్థిరసంకల్పముఁ గొనుప్రజ
దేవుని మహిమను దెలిపెడిఁ గనుమా! భా.




# నరసింహ ప్రాదుర్భావము

మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు

వ. తొల్లి కృతయుగాది నాదిపురుషుండు దైత్యరాజ్యంబునకు యువరాజుగా నియమించిన హిరణ్యకశిపుఁడు తన యన్నయగు హిరణ్యాక్షుని యనంతరము సకలదైత్యసార్వభౌముఁడై యేలుచుఁ దన రాజ్యం బప్రతిహతంబు గావింపఁ దలపోసి యాధిపత్యం బమాత్యుల యందుంచి తపం బాచరింప నుత్సాహంబున బురంబు వెలువడి యొకపుణ్యనదిం జేరి—

పదియు నొకండు వే లయిదువందలు నేండ్లు నదీజలంబునం
గదలక యుండి యాకమలగర్భునిఁ గూరిచి లోక మెల్లఁ బె
ల్లదరఁ దపంబు చేయఁగ మహావ్రతనిష్ఠఁ బితామహుండు స
మ్మద మొదవంగ సర్వసురమండలి పేరిమి వెంబడింపఁగన్.

మదకలహంసఁ బూన్చిన విమానము నెక్కి బిఱాన వచ్చి యా
నదికడ డిగ్గి యో దనుజనాయక! నీదు తపంబు నాకు స
మ్మద మొనరించెఁ జాలు నిఁక మాను తపోవ్రతనిష్ఠ, దెల్పు నీ
మదిఁగలకోర్కి యీక్షణమ యిచ్చెద నన్న నిశాచరేంద్రుఁడున్.

పరమానందముతో నది-దరికిం జనుదెంచి భక్తితాత్పర్యములం
గరములు శిరమున మోడిచి-పరమేష్ఠికి మ్రొక్కి యిట్లు పల్కె నణఁకువన్.

సురసిద్ధసాధ్యరక్షోనాగగంధర్వమానవాదులచేత మడియకుండ
బహువిధశస్త్రాస్త్రబాణకృపాణాదిపాదపాదుల మృతిఁ బడయకుండ
నార్ష శాపంబుల నార్ద్రశుష్కపదార్థజాతఘాతంబులఁ జావకుండ
స్వర్గాంతరిక్షభూపాతాళముల దినరాత్రిసంధ్యలఁ జావు రాకయుండ
వర మొసంగుము మఱియును బంచభూత-లోకపాలరవీందుసుశ్లోకశక్తి
నాకుఁ గలుగంగ, రణభూమి నన్నుఁ జేరఁ-బరమదివ్యాస్త్రములు కూర్మివరములిమ్ము.

అని యర్థించిన నిచ్చితి-నని పల్కి విరించి యరిగె హంసవిమానం
బున నిజలోకంబున కా-య్యెడ, దేవత లంత నజుని కని రిబ్బంగిన్.

అంబుజగర్భ! నీ విడినయట్టి వరంబుల వాఁడు మమ్ము లో
కంబుల నెల్ల నుక్కణఁచుఁ గావున వానిని జంపఁగా నుపా
యంబు తలంపు మన్న, నతఁ డౌ నిది నిక్కమ కాని వాఁ డవ
శ్యంబును బొందు నీఫలము సల్పినయట్టితపంబుపేరిమిన్.









(౭) ౧. శ్రీ కోలపల్లి లక్ష్మయ్యనాయనుగారు. ౨. శ్రీ వల్లభనేని రామబ్రహ్మం చౌదరిగారు. ౩. శ్రీ జే. వి. సుబ్బారావుగారు.
౪. శ్రీ కోక నాగేంద్రరావుగారు ౫. శ్రీ అన్నవరపు సుబ్బారావుగారు. ౬. శ్రీ డాక్టరు జి. యస్. శర్మగారు. ౭. శ్రీ మల్లెల శ్రీరామమూర్తిగారు.



















(౪) ౧. శ్రీ పొణుకుపాటి వెంకటనాగభూషణంగారు. ౨. శ్రీ కానూరి రామానందచౌదరిగారు. ౩. శ్రీ అన్నె అంజయ్యచౌదరిగారు. ౪. శ్రీ పెనుమర్తి లక్ష్మీపతిశాస్త్రిగారు. ౫. శ్రీ మఠం బాలసుబ్రహ్మణ్యగుప్తగారు. ౬. శ్రీ రాయప్రోలు సత్యనారాయణగారు.

నవరించినతపముఫలం-బవసానము నొందుపిదప నాతని వెన్నుం
డవసానము నొందింపఁగ-నవతారం బెత్తు ననఁగ నమరులు వేడ్కన్.

జలజగర్భుని బొగడుచుఁ జనిరి యిండ్ల-కంత నక్కడ వరలబ్ధి కాత్మ నలరి
కఠినమానసుఁడు హిరణ్యకశిపుఁ డుగ్ర-బాహుదర్పంబు మెఱయంగ బయలుదేఱె.

పుడమిఁ గల్గిన పురంబులఁ గొల్లగొట్టించి నల్లిండ్లుఁ బీకించి పల్లియలను
గాల్పించి యాశ్రమగతులైన విప్రులు పచరించుకర్మముల్ పాడుచేసి
పాతాళమున కేగి పాపఱేని జయించి యంత నాకపురంబు నాక్రమించి
యమరుల యజ్ఞభాగములను దప్పించి యిప్పించి దనుజుల కింద్రపదవి
నాఁచికొని దైత్యవీరుల నందు నిలిపి-విబుధులను గొట్టి గృహములు వెడలఁగొట్టి
నిజపురంబున కరుదెంచె నిఖిలలోక-విజయభేరీనినాదముల్ విన్ను ముట్ట.

అప్పు డాదైత్యనాయకుఁ డమరులందు-బం దెగొనిపోఁగ మిగిలినవారు దేవ
గురుఁడు ముందఱ నడవ వైకుంఠమునకుఁ-బోయి వైకుంఠు దర్శించి మొఱ్ఱలిడుచు.

దేవర! నీదుపాదములె దిక్కుగ నమ్మినమాకు నాకమం
దేవెత కల్గఁబో దనుచు నెన్నితి మింతకుఁ గాని నర్వ సౌ
ఖ్యావహమైన యాపురమునందు వసించెడి భాగ్యరేఖలన్
మావదనంబులం దుడిచె మత్తుఁడు దైత్యవిభుండు నేఁటితో.

బోరన నాహిరణ్యకశిపుం డరుదెంచిన దాడివేఁడి యే
తీరున నోర్చి యెట్లు కడతేఱఁకయుంటిమొ చెప్పఁజాల మ
మ్మారి మసంగిన ట్లతఁడు మాపయి వచ్చుటలోఁ దలంచినన్
గారుణికోత్తమా! యిపుడు కంపము పుట్టెడు మామనంబులన్.

సురభటు లాయుధాళిఁ గొని చుట్టును గావలియుండ దిక్పతుల్
గురుఁడును నీశచీపతియుఁ గొల్వున మంతన మున్నయంత వే
పరుగున వచ్చి యొక్కకనిఁ బాదతలంబునఁ దన్ని యాసురే
శ్వరుమెడపట్టి యీడ్చె దనుజప్రభుఁ డయ్యది యాదిగా నటన్.

పాలనలేని దీనులకుఁ బట్టినదుర్గతి పట్టి యష్టది
క్పాలకు లష్టకష్టములపాల్పడి రన్యుల కష్టపాటు లిం
కేల వచింప? దేవతల కెల్ల శిరోమణి యాసురేంద్రుఁ డా
పాలసుబారికిం బడినపాటులు నోట వచించునట్టివే?

సురపురి కెట్టిచేటు మును చూడఁగ లే దిఁకఁ జూడఁబోము మ
త్సరమున వచ్చు నయ్యసురదాడికిఁ దాళఁగలేక వేల్పులె
వ్వరికిని వారెయై యమరభావము నెంచక జీవితాశఁ గా
తరులయి పాఱిపోయిరి యథాయథలై సుతదారదూరులై.

సురతాపసస్నానశుచులైన మిన్నేటి రేవు లన్నియుఁ జాకిరేవులయ్యె
స్నాతానులిప్త నిష్ఠాగరిష్ఠార్ఘసోపానముల్ చేపలబండలయ్యె
బ్రహ్మవేత్తలకు నావాసంబులగు తీర్థశాలలు గుఱ్ఱాలసాలలయ్యె
నగ్నికుండంబు లాయుశ్వంబులకుఁ బెట్టు గుగ్గిళ్ల నుడికించు గుంటలయ్యె
కల్పతరుసుందరానందకందనంద-నంబు దైత్యులచేతుల నల్లియయ్యెఁ
జెప్పెడి దిఁకేమి ? సురపురి చెన్ను దొఱఁగి-పాడుపడిపోయినట్లుండెఁ బరమపురుష!

సురవారాంగన లాతని-వరవుడు లై రమరభటులు బానిసలై రీ
శ్వర! యొక్క నమస్కారము-సురపురి కిందుంచి మమ్ముఁ జూడుము కరుణన్.

వ. అని పలుతెఱంగులఁ గుయ్యిడుచుఁ దమపడినపాట్లెల్ల విన్నవింప నప్పరమాత్ముఁడు నిజకృపాపాంగవీక్షాసుధారసధారల వారి హృదయాగ్నిఁ జల్లార్చి మీ కభయం బొసంగితి నే నిదె బయలువెడలి యామదోన్మత్తుని సకలబలంబులతోఁ బరిమార్చి మీ యభిమతంబు సమకూర్చెద మీరు నాకంబున కరిగి సుఖం బుండుఁ డని వారిం బనిచి—

అరిగి హిమాలయంబునకు నప్పుడ తాను సురారిపొందున
వ్వరములు వేఱు చేయు నదుపాయము నాత్మఁ దలంచి కోటిభా
స్కరశతకోటిపావకులకన్నను మిన్నయి తేజరిల్లు సుం
దరనరసింహరూపమును దాలిచి యాఖలుప్రోలి తెన్నునన్.

పరమోంకారసహాయుఁడై చని పురోభాగంబునం గాంచె నం
బరవీథీవలమాన కేతుశిఖరప్రాసాదమేరుక్ష్మా
ధరపాదాయితదుర్గమావరణమధ్యప్రోన్నతాట్టాలకో
పరిసంచారిభటాళిరక్షితము దేవద్వేషిదుర్గం బటన్.

ఆకోటలోపల నర్కచంద్రోపలభర్మసంఘటితంబు పంచయోజ
నోన్నతంబును శతయోజనవిస్తీర్ణ మధ్యర్ధశతయోజనాయతంబు
కామచారము విశ్వకర్మనిర్మితమును గాంచనద్వారకుడ్యాంచితంబు
కనకరత్నాసందికాస్థిత దేవగంధర్వదానవదైత్యనరగణంబు.

రత్నమయసాలభంజికారంజితంబు-వివిధపుష్పలతాతరువేష్టితంబు
సకలలోకైకరామణీయకపదంబు-నైన యాస్థానమండపం బరసి యందు.

గంధర్వులు విపంచికాశ్రుతి మేళగించినపాట వీనులఁ దనుపుచుండ
నూర్వశీరంభాతిలోత్తమాదులు నృత్యకలఁ గన్నులకు హాయి గొలుపుచుండ
బందీకృతామరపంకజనేత్రలు వింజామరంబులు వీచుచుండ
సురయక్షకిన్నరాసురవందిమాగధుల్ సంస్తుతిపాఠముల్ చదువుచుండ
హైమసింహాసనాసీనుఁ డైనయట్టి-కవచకుండలరమణీయగాత్రు దివ్య
రత్నమకుటాభిరాము హిరణ్యకశిపుఁ-గాంచి యాతని మోల సాక్షాత్కరించె.

ముందఱవచ్చి నిల్చిన సమున్నతవక్షము శంఖచంద్రికా
కుందనిభాంగముం జలితకుంచితదీర్ఘసటంబు నైన యా
సుందరనారసింహమును జూచి నిశాచరరాజు నిక్క మే
నెందును జూడలేదు మును పిట్టిమృగం బని విస్మయంపడెన్.

కనుఁగొన శాంతమై నివ్రుఱుగప్పిన నిప్పయి, లోఁ దలంపఁగా
ననితరవార్యమైన విలయాంతకతేజమునై చెలంగు నా
ఘననరసింహరూపమును గాంచి సభాసదులైన దైత్యులున్
మనము గలంగ జేనివదనంబునఁ జూడ్కి నిగిడ్చి రత్తఱిన్.

నరసింహాకృతి వచ్చిన-పరమేశ్వరుతత్త్వ మరసి భయసంభ్రమసం
భరితుండై ప్రహ్లాదుఁడు-హిరణ్యకశిపుఁ దండ్రిఁ జూచి యిట్లని పలికెన్.

దనుజవరేణ్య! నీవు పెడదారిని బోయి విచిత్రజంతుభా
వనఁ గనుచున్న యీ పరమపావనమూర్తి సమస్తదైత్యమ
ర్దనము తలంచి యిట్టు లవతారము నెత్తిన విష్ణుమూర్తి నా
మనమునఁ దట్టుచున్న దనుమానము మానుము నీకుఁ జూపెదన్.

ఈమహనీయరూపమున నెల్ల నదీనదసింధుశైలభూ
వ్యోమరసాతలంబులు తపోధనమానవదానవామర
స్తోమము తారకాగ్నిశశిసూర్యసమీరదిశావితాననా
నామృగపక్షికీటకగణంబులు గానఁగవచ్చుఁ జూడుమీ!

ఎల్ల దైత్యులతోఁ గూడి యీవు నిలని-నోటఁ గన్పట్టుచున్నావు, నానటిమీఁద
వెలయుచున్నారు శూలియు నలువ యింక-సందియం బేల? సచ్చిదానందుఁ డితఁడు.

[ఆంధ్రభవిష్యపర్వములోనిది.]

---

## సాటిలేని ముద్దు

వెదురుమూడి వెంకటకృష్ణారావు గారు

జాతిముత్యము ముద్దు, వజ్రమణిముద్దు
మల్లెలవి ముద్దు మఱి చందమామ ముద్దు
వసుధ నికసాటిలేని మువ్వంపుముద్దు
ప్రేయసీప్రియుల్ రచియించు తీయముద్దు.

---

# ఏది ప్రేమ?

ఊటుకూరు సత్యనారాయణరావు బహద్దరుగారు, జమీందారు

౧

"నీ కేంతెలుసే? పసికటాల్లి. నీకు ప్రేమంటే వకటి తెలుసా ?"

ముసలమ్మ సణుక్కుంది.

"ఏంతెలియందే యింతకాలము గడిచిందా? ఈనాటికి మీరు కలిగి సంఘము, ఆచారాలు మంట్లో గలుపుతున్నారు."

"కాలం గడవటాని కేంలే? అది అనంతమైంది. అవి మీకోసం గడవలేదు. దాని స్వభావమది. అంతమాత్రం చేత—అయితే మీకాలోజుల్లో చదువు......"అని చిరునవ్వులో యేమో చెప్ప బోతుంది మాధురి.

"ఆ! ఈచదువు లొచ్చే ముఖ్యంగా యింతచేసినై. ఊరక వుండి యేమిచేస్తావని మీనాన్న స్కూలులో వేశాడు. అంతకుముందు నీ వితండవాదా లెక్కడివి? చదువేపోకాని నీయీడుకు నీవు ప్రేమ, గీమ అంటూ అప్పుడే మొదలెట్టావు. నామటుకు నేను మీ నాన్న పుట్టేవఱకు మీ తాతయ్యను కన్నెత్తిచూడ లేదు. పలకరించ లేదు.

"తాతయ్యా? ఆయన.....చేలు...ఎడ్లు..............."

మాధురి కూలీకూలీ నవ్వటం మొదలెట్టింది. గొంతు సవరించుకోని ఏమో చెప్పబోయి మళ్లీ నవ్వింది.

ముసలమ్మకు కోపం పైబడివచ్చింది. అయితే చిన్నతనంనుంచి పెంచిన ప్రేమవల్ల అప్రసంగా లేమీ లెక్కచేయలేదు. మాధురికి పదిహేనేండ్లు దాటినై. తెనుగులో చాలాపరిచయం సంపాదించింది. ఇంగ్లీషుకూడ తెలుసు. ఆమె మాట్లాడుతూంటే యెంతో విమర్శనాదృష్టి కనుబడుతుంది. న్యాయంముందు సంఘాన్ని, ఆచారాల్ని గమనించదు. ఎప్పుడూ నూతనాభిప్రాయాలు, నూతనమైన మార్గాలు, సత్యాన్వేషపిపాస ఆమెను ఆవరించివుంటయి. ఉదయం యేడుగంటలు కొట్టారు. కాఫీ తీసుకుంటేనేకాని సుదర్శనంస్కూలుకు పోడు. ఆతనిప్పుడు ఇంటర్మీడియేట్ చదువుతున్నాడు. ప్రపంచవ్యవహారాల గొడవ వచ్చిందంటే అవ్వాళ స్కూలుకు శెలవే. ఎదుటివాడు వోపికస్థుడైతే యెంతోకాలపు శెలవులుకూడ అప్పుడే వస్తయి. శ్యామల్‌ను కమ్మని ఉదయానవే కబురంపాడు. అతడు వస్తాడనే నిరీక్షణలో ఈరోజు కాఫీకి పొద్దెక్కింది.

"అన్నాయి! కాఫీ తేనా ?"

మధురంగా లోపల్నుంచి వినపడ్డది. ఆమె మాధురి.

"కొంచెము౦డు; శ్యామల్ వస్తాడు. అంతా వక్కసారే"అన్నాడు సుదర్శనం.

శ్యామల్ క్రొత్తగా డాక్టరీప్రాక్టీసు ప్రారంభించాడు. కొంచెం కలిగినవాడు. వివేకంకూడా వుంది. కేవలం ప్రజోపయోగమే ఉద్దేశించి ఈపని జేస్తున్నాడు. ఇచ్చినా, యివ్వకపోయినా బాధలేదు. పీర్లందరిది ఒకటేవూరు. సుదర్శనమంటే శ్యామల్‌కు చాలా అభిమానం. ఐతే సుదర్శనం సంస్కర్త. అప్పుడప్పుడు వివాదపడే అభ్యాసం వారి కుంది. దాని పర్యవసాన మెట్లా మారినా వారి మిత్రత్వానికిమాత్ర మేంబాధ లేదు.

"డియర్ సుదర్శనం!"

"అదుగో వచ్చాడు. నీకేం అభ్యంతరం? రావచ్చు" అన్నాడు ఆతురతతో సుదర్శనం.

ఒకగదిలో సుండ్రటిబల్ల వకటి వేసుంది. దానిచుట్టూ దంతపు పనిచేసిన కుర్చీలు. సిల్కుకర్టెన్ వకటి ద్వారమునకు పక్కగా త్రోయబడి వుంది. శ్యామల్ వచ్చాడు లోపలికి.

శ్యా—ఇవ్వాళ శెలవే నమకుంటా

సు—చదువుల్లోకన్నా మిత్రుల్ను కలుసుకోటంలో చాలా వుపయోగం కనపడేనాకు శెలవలె అమూల్యంగా ఉన్నయి.

శ్యా—ఏం కబుర్లు ?

'మాట్లాడుదాం' అన్నాడు సుదర్శనం.

మాధురి ఫలహారాలు తెచ్చి బల్లమీద పెట్టింది. కప్పుల్లో కాఫీ ఆరుతోంది.

"మధూ! నువుకూడా కూచో" సుదర్శనం అన్నాడు. అంతా కలిసి ఫలహారాలుచేసి కాఫీ తీసుకుంటున్నారు. డాక్టరుకు సుదర్శ

వంలో కలిసిన యీమార్పు, సంస్కరణాభిలాష చాలా ఆనందం గొలిపినై. సుదర్శనంకోసం వచ్చినప్పుడొకసారి శ్యామల్ మాధురిని చూశాడు. కాని మాట్లాడలేదు. ఆమె చాలా చదువుకుందని, ముద్దుగా గీతాలల్లుతుందని విన్నాడు. కాని అవకాశమే చిక్కలేదు ప్రసంగానికి. లక్ష్మీవిలాసములైన ఆకండ్లు ఏ అవ్యక్తప్రపంచయాత్రో చేస్తున్నట్లు కనబడుతై. ఆ ముంగురులకు మొహంమీద వ్రాలుతూవుండటమే ఒకఆట. కాఫీ రుచ్యంగానే వుంది. కాని ఎఱ్ఱగా పలుచగా వున్న ఆమె పెదవులకు వేడిగా తగుల్తావుంటె శ్యామల్ హృదయం కొట్టుకుంది. చైనాసిల్కు రవికలోనుండి దీర్ఘములైన ఆమె బాహువుల సౌష్ఠవం, మెరుపు, ఒక్కటా, ఆమెశరీర మంతా గులాబితోటల్లే వుంది. కప్పు క్రిందపెట్టింది. గాజులు చేతుల్లో పడ్డై. ఇట్లేమాస్తూవుంటె సుదర్శన మేమన్నా అనుకొంటా డేమోనని బలంగా దృష్టి సుదర్శనంవైపు తిప్పాడు.

సు—శ్యామల్! ఏమని నిన్న సనాతనధర్మసభవారు తీర్మానించారు?

"విధవావివాహాలు నిషేధాలు. అట్లా చేసుకున్నవాళ్లెల్లా సంఘంలోంచి బహిష్కరించా"లని.

"ఇంతేనా?"

"ఇంకా చాలా వున్నై. ముఖ్యవిషయంమాత్ర మిదే."

మాధురి పెదిమలపై మందహాసం తొలుకాడింది. కాని కళ్లల్లో కెంపుజీరలు తేలినై.

"మేంగూడా వినొచ్చా!" అన్నది మాధురి.

శ్యామల్ నవ్వుకండ్లతో "తప్పకుండా" అన్నాడు.

"నీ అభిప్రాయమేమిటి శ్యామల్?"

"నాఅభిప్రాయమే అడుగుతే వాండ్లంతా మనుష్యులు కారంటా. కనక నీకభ్యంతరముంటే చెప్పు. బాగుంటుంది."

"తొందరపడకు. వాండ్ల తీర్మానానికి గూడా అర్థం వుంటుంది. స్త్రీలోకాన్ని పవిత్రవంతం చేయాలని ఈవిధంగా చేసియుంటారు."

"బలవంతంగానా?" అన్నది మాధురి ఈర్ష్యతో. శ్యామల్ మాధురివేపు తిరిగి "లేదు, వారిస్వాతంత్ర్యం అట్లా వుపయోగించుకున్నారు." అన్నాడు.

సు—భర్త గతింపగా నిరాలంబమైన జీవనం, తమ యోగ్యత, శక్తివల్లనే గడుపుకొనుట వారిజాతి గర్వింపవలసిన విషయం కాదా?

మాధు—అట్లా అనటానికన్నా పురుషులు తమ వుపయోగం కోసం ఇంత మహాకార్యం చేస్తున్నారంటే వివాదపోతుందేం?

"అది మాకవమానం కాదు?" శ్యామల్ మెల్లగా అన్నాడు.

మాధు—అవమానంరాకుండా అపకారం చేతామనా? అది చాలా దుస్సాధ్యమైన పని.

శ్యామల్—ఈ ఆచారం ఎప్పుడో భీష్ముణ్ణి అంబ వేధించుకు తిన్నరోజుల్లో బహుశా పుట్టివుంటుంది. సంఘంలోనుంచి బహిష్కారం కూడానా? దేశకాలముల ననుసరించి నీతిస్వాతంత్ర్యాలు నశించకుండేకొఱకు ఒకసంఘమని, నియమమని పెట్టారు. కాని జాతిపురోవృద్ధి, స్వేచ్ఛ, ఆనందాలు వేరుతో పెకల్చి శాశ్వతఘోరదుఃఖాగ్నిలో వ్రేల్చటానికి గాదు. ఇట్లాచేయటాని కేప్రత్యేకవ్యక్తులకును రాగిరేకులపైన ఎవ్వరు చెక్కించి యివ్వలేదు.

మాధురి ప్రతిరక్తనాళంలోనుంచి స్వేచ్ఛానందాలు పొంగులెత్తినై. "సనాతనధర్మప్రచారం చాలా తగ్గింది మనదేశంలో. కాని వాండ్లల్లో పట్టుదలమాత్రం తగ్గలేదు. వయస్సుతోగూడా పెరుగుతూంది వాండ్లకు. మధూ! మీ అభిప్రాయాల్లో మీకు విశ్వాస ముండవచ్చు. కానివారి నెట్లు తప్పంటావు?" అన్నాడు ఆలోచనతో సుదర్శనం.

శ్యామల్—ఎందుకనగూడదు? వారికి విశ్వాస ముండవచ్చు. ఒకవిషయాన్ని వ్యాఖ్యానికి వదుల్తే సాధారణంగా అందరికి వొకేరీతి తోస్తుంది.

సు—స్త్రీల వ్యక్తిస్వాతంత్ర్యం అరికట్టడం పాపమనే తోస్తుంది నాకూను. ఆబాధ్యత వారికే వదులితే బాగుండేది. ఇట్లా బహిష్కారరూపమైన శాసనంచేయడంమాత్రం వారి నిరంకుశత్వం, అనాగరికత వెల్లడిస్తుంది.

'మధూ!' అని ముసలమ్మ పిలిచింది.

మాధు—చదువుకోటానికైనా ఒకనిషేధం వుండేది వెనక. ఇప్పటికి చాలావఱకు అమలులో పెట్టుతూనే వున్నారు కొంతమంది పెద్దకుటుంబాలవారు.

సుదర్శనం ఆమాటకు సమ్మతించలేదు. "అది నే నెప్పుడు ఒప్పుకోను" అన్నాడు.

"చదువుకున్న భార్యరావాల్నని నీకోరిక లే! అందుకోసం నువొప్పుకోవు" అన్నాడు శ్యామల్.

'మధూ!' మళ్లీ పిలుపు.

'ఇదేం గొడవ'అంటూ లేచిపోయింది. కుచ్చిళ్లు కాళ్లలో తొక్కుంది. శ్యామల్, సుదర్శనం ఏదో మాట్లాడుకున్నారు. 'ఆఫీసుకు వేళైంది. మళ్లీ సావకాశంగా మాట్లాడుకుందాం. సాయంత్రము పార్కుదగ్గర కలు'అనిచెప్పి శ్యామల్ వెళ్లాడు ఆలోచనతో.

౨

శ్యామల్ వక్తృత్వం, రూపం చూసినదగ్గరనుంచి మాధురికి అతనిపై ఒకవిధమైన ప్రేమ, అభిమానం మొలకెత్తి పెరుగుతున్నయి.

వివాహంయొక్క అర్థం తెలియంది మాధురి పెండ్లిచేసుకోటం పాప మనుకుంది. పెండ్లి అనే పేరుతో లోకంలో చాలా హత్యలు జరుగుతున్నై. వివేకంలేకుండా పెరిగిన పెద్దవాండ్ల చేతుల్లో తరతరాల్నుంచి ఈ మహోదయమే వివాహవిధిని శాసిస్తోంది. అభిప్రాయం మంచిదైనా ఆచరణలోని కొచ్చేవరకు చాలా వికృతరూపం దాలుస్తోంది. దైన్యమైపోయిన మనజాతిని చూచి ఒక్క అశ్రువైనా విడిచే సంస్కర్త లేడు. పిపీలికాదిబ్రహ్మపర్యంతంగల సర్వభూతాల్లో మహావిద్యుత్ప్రవాహంలాను అనుక్షణం కదుల్తాన్న ప్రేమయొక్క సూత్రంగా వివాహం నిశ్చయింపబడ్డది. అది రానురాను సంకుచితమై అవసరంకొరకు స్వార్థపరంగా ఉపయోగించుకు నేరీతిగా దిగింది. ఈ అభిప్రాయం మాధురిమస్తిష్కంలో కదిలేవరకు 'మానవప్రపంచ మెంత కృత్రిమమైపోయింది. ప్రేమలేని యీలోకం పాడుపడ్డది' అని ఒక్క నిశ్వాసం విడిచింది. ఇంతలో ఏదోచప్పుడైంది. క్రింద ఏవో ఏరి తింటూన్న చిన్నపక్షి ఒకటి చెట్టుమీద కెగిరింది. వదులుగా ముడి వేసుకున్న జుట్టు పక్షికాలుతగిలి చంపమీద పడ్డది.

'మీ జీవితమె ధన్యమైంది' దాన్ని చూస్తు అన్నది. విశ్వవ్యాపక మైనప్రేమ అప్పుడామె కళ్లల్లో నిండివుంది. శ్యామల్ కు మాధురితో పరిచయం, చనువు ఎక్కువైంది. ఇంచుమించుగా యిరువురి అభిప్రాయాలు ఒక్కటేనని చెప్పాలి. అవకాశం కలిగినప్పుడెల్లా ఒకరినొకరు కలవడం, ఏదోగోష్టిలో ప్రొద్దులు పుచ్చడం మామూలయింది. ఆవూళ్లో వున్నమిత్రు లందరిలో శ్యామలే చాలావివేకం, ఉత్సాహం గలవాడని మాధురినమ్మకం. తరుచు శ్యామల్ ను సందర్శించడం మాధురికి చాలాయిష్టం. ఇలా వివాహంలేకుండా చనువుల్లో తేల్తావుంటె ఆవూళ్లో అందరికి బాధగానేవుంది. లోకం వెర్రిది. పాపం! వాండ్ల క్రూరమైన విమర్శనలకు గురికాకుండా తప్పలేదు. మేరువుకంటె స్థైర్యంతో తన్ను ద్వేషించేవార్ని గూడా ప్రేమిస్తూ, జీవితమంతా సౌందర్యానందాల నిలయంగా జేసుకుంటూన్నది మాధురి. స్వార్థపరమై, కామోన్మత్తమై, దురాశాద్వేషయుతమై యున్న లోకదృష్టి ప్రేమస్వరూపాన్ని ఎట్లా చూస్తుంది? నిరాడంబరమును, ప్రేమపూరితమును నైన హృదయాన్ని చూడాలంటె ఈదృష్టి చాలదు. దివ్యదృష్టి కావాలి.

శ్యామల్ కొన్ని క్రీపరు తీగలుతెచ్చి వెనగ్గా నిల్చొని మాధురి జుట్లో చుట్టాడు. ఆమెయేదో ఆలోచిస్తోంది.

శ్యామల్ తెలియనట్టే ముందుకు వచ్చాడు. "నీ ఆలోచన నాకు తెలుసు. తీగలుచుట్టుకున్న ఆజుట్లో పువ్వు పెట్టుకుందామని కదూ! నేచెప్పనా ?"

మాధురి ఆశ్చర్యంతో మందహాసంజేస్తూ ముడివిడుపుకుంది.

మా—ఇట్లా చెయ్యడం తప్పుకాదు?

శ్యా—పూలేమి తురమకుండా వదిలెయ్యడమా ?

మా—కోమలంగా పెరిగి అల్లుకుంటూన్నతీగ తెంపి చుట్టితే దానిశోభ తగ్గలే?

శ్యా—లేదు. ఎక్కువైంది. అంతకుముందు దాని అందం సహజంగానే వుంది. ఇప్పుడో మేఘాల్లోంచి లతలు ప్రాకులాడుతూన్నట్టుంది. ఇది విచిత్రమైన ఒక అపూర్వసృష్టి. నీముడి మేఘశకలంలా వుంది. ప్రేమతో వర్షించి పెంచుకున్న లతాసౌకుమార్యం చూసి మేఘము ముద్దెట్టుకుంటున్నట్టుంది.

మా—డాక్టరుకు రసవివేకంగూడావా ?

శ్యా—మీకవిత్వంలో ఊహించి రసాన్ని సృష్టిస్తారు.

డాక్టరు కొత్తమార్గం కనిపెడదామని కోపిమాస్తున్నాడు.

మాధురి నవ్వు ఆపలేకపోయింది. పెదిమలు దాటిపోయింది నవ్వు. ఆమె నున్ననిచంపలు కొంచెం కదులాడినై.

"ఓరి పిండ్లబండతనం, ఊహించలేకపోతే కోసి పాడుచేస్తారా ? పిండ్ల కొత్తమార్గం ఎవరన్న నేర్పుతుంటారేమో ? శ్యామల్ ! నుహ్వీవృత్తి మాను. నాకేం బావుణ్లేదు.

"నువ్వు చెప్పింతరువాతనా యింకా. మధూ ! నువు నన్ను ప్రేమిస్తున్నావా ?"

"నీకు తెలీటం లేదు ?"

"నువు చెప్పు"

"నేనెందుకు చెప్పాలి ?

శ్యామల్ దీనంగా కూరుకున్నాడు.

"నీవు నన్ను గాఢంగా ప్రేమిస్తే నేను నిన్ను ప్రేమించినట్టు కాదూ శ్యామల్ !".

"ఎట్లా, నీ కావుద్దేశమే లేకపోతే ?"

"లేకపోతే నాదురదృష్టం. నీకేం లోపం ?"

ఈమాటతో శ్యామల్ పూర్తిగా క్రుంగిపోయినాడు. నిరాశ, నిస్పృహ అంతా ఆవరించినై. దీర్ఘ నిశ్వాసం ఒకటివిడిచి లేచాడు.

"శ్యామల్ ! వెళతావా యేం ?" అన్నది మాధురి.

"ఇవ్వాళ చాలా అస్వస్థతగా వుంది యెందాలనో. వెళతా"

మాధురి ఎదురుగావచ్చి రెండుచేతులు భుజంమీద వేసి నిలుచుంది. శ్యామల్ కండ్లల్లో చూస్తోంది.

"కోపం వచ్చిందా ?"

"లేదు"

"అప్పుడే యేం పోకపోతే"

"సుదర్శన మేమన్నా అనుకుంటాడు మనం ఇట్లావుంటె"

చేతులు తీసింది.

"రేపు వస్తా చదువుకుందాం" అమితమైన ఉత్సాహంతో, ప్రేమతో అన్నది మాధురి.

శ్యామల్ ధైర్యం తెచ్చుకున్నాడు. ఎంతో నిగూఢమై అగాధంగావున్న ఆమె ప్రేమ అర్థమే కావటం లేదు. రెండునిమిషా లాలోచిస్తూ నిలుచున్నాడు."

"నువు రాకూడదు?

"సరే" అన్నది.

3

పార్కులోకి సాయంత్రము చాలామంది వచ్చారు. ఏవో ఆటలు, ప్రసంగాలు; పార్కంతా కోలాహలంగా వుంది. జలయంత్రంచుట్టు కొంతమంది పల్లెవాండ్లు మూగి ఆవిచిత్రం చూశిపోతూన్నారు. ఎవరో వ్రాసుకుంటున్నాడు కుర్రాడు ఒడ్డుమీద. నీటి కుండలో తిరిగే బా తోటి రెక్కలార్చింది. కాయితాలు తడిసినై. లేచిపోయినాడు. పారసీకపు స్త్రీ అల్లే వుంది ఒక ఆవిడ. మీసాలు కొరుక్కోపోయిన బట్టతల క్రాపింగు జెంటిల్ మెన్ చెవులో ఏవో చెప్తూ లైబ్రరీ కేసి పోతున్నాడు.

ఈగొడవేమీ పట్టలేదు సుదర్శనానికి. ఏదో ఆలోచిస్తూ పచ్చికమీద కూచున్నాడు. ఎత్తులపై ఎత్తులు వేస్తున్నాడు శ్యామల్.

"నీమాటలు నాకేం అర్థంకావడంలేదు. ఒక ప్రియురాలుంటుంది. ఆమెను గాఢంగా ప్రేమిస్తాము. మనోవాక్కాయాలతో ప్రేమిస్తాము. ఈవృష్టి ఒకప్పుడు మారిపోతే ఏమంటారు?" అన్నాడు సుదర్శనం.

"ఏమంటారు, దాన్నిగూడా ప్రేమే అంటారు"

"కాదు. బుద్ధి వ్యభిచరించిం దంటారు"

"శ్యామల్! ఉండు నే వస్తున్నా" అంటూ మాధురి లైబ్రరీలోనుంచి సుదర్శనం శ్యామల్ మాట్లాడుకునే చోటుకే వచ్చింది. ఆమె తెల్ల నిదుస్తులు ధరించుకొనుంది. చేతిలో ఒకపుస్తకం వుంది. అది "ఆర్యుల వివాహాలు-వారి నాగరికత" అనే పుస్తకం.

శ్యా—ఏమో అన్నావు సుదర్శనం?

సు—బుద్ధి వ్యభిచరించిం దంటారు.

శ్యా—అంటే.

సు—ఒకచోట నిశ్చితమైన ప్రేమ శాశ్వతంగా నుండకుండా ఇంకొకరిపై ప్రసరించటం.

శ్యా—అది స్వభావం

నీ వింకా అర్థమయ్యేట్టు మాట్లాట్టంలేదు. అన్నాయ! నే చెప్తా విను. ప్రేమతత్వం చాలా విశాలమైంది. ఈ విశ్వమంతా ప్రేమమయమే. ఇందు ప్రేమించగూడని వస్తువే లేదు. ప్రేమలో సర్వపాపాలు నశించిపోతై. ఒకదేశము నింకొకదేశము, ఒకజాతి నింకొకజాతి, ఒకవ్యక్తి నింకొకవ్యక్తి, ఒకమనుష్యు డొకజంతువును, ఒకజంతు వొకవృక్షమును, ప్రేమించుకూ ఇట్లా సర్వం ప్రేమయొక్క ఆధారంచేతనే సృష్టివ్యాపారం నిరంతరాయంగా జరుగుతున్నదని తెలుపుతున్నయి. అది ఒక నియమంలో బంధింపబడి వుండేదికాదు. దాని నెవ్వరు అరికట్టలేరు. దాని కత్యంతదృఢతరమైన పక్షములున్నై. కొండగుహల్లోనుంచి, జీమూతబంధురమైన సముద్రగర్భములోనుంచి, ఎంత దాచినా పెకల్చుకొని ప్రేమ స్వేచ్ఛావిహారం చేస్తుంది.

సుద—దానికి నీతితో సంబంధమే లేదా?

మాధు—నీతంటే?

సుదర్శనం తీక్ష్ణంగా చూశాడు. ఇది నానాటికి వృద్ధిఅయితూన్న యౌవనోద్వేగంవల్ల హిందూపావిత్ర్యాన్ని నాశనంజేసే ఆలోచనలు చేస్తున్నది. ప్రేమకు ఈవిరుద్ధవ్యాఖ్యానా లేంటి? చదువుకుంటె మంచిజ్ఞానం వస్తుంది. దేశంయొక్క అభ్యుదయంకోసం కృషిచేస్తుంది అని అనుకొన్నాను. తరువాత తన మనోవాక్కాయాల కర్హుడైన వరుణ్ణి ప్రేమిస్తుం దనుకొన్నాను. స్వాతంత్ర్యం స్త్రీలకిందుకొఅకే వద్దన్నారు పెనక. ఇక చేశేదేముంది? అని విచారించటం మొదలెట్టాడు.

శ్యామల్ ముందుకు వచ్చాడు. 'నేచెపుతా' అన్నది మాధురి. "కొంచెం అభిప్రాయంలో భేదం. జాగ్రత్తగా గమనించు. రాగద్వేష విరహితమై, సర్వవిశ్వశాంతియే ఆశయంగా వుండే ప్రేమతత్వానికి నీతి యేమిటి? అది అంతా నీతికాదా?"

"మధూ! ఆస్వేచ్ఛ ఇష్టంవచ్చిన ట్లల్లా ఉపయోగించుకునే వాండ్లు ఆయనమాట్లాడిన నీతికి అర్థంచెప్పాలి, నువుకాదు" అన్నాడు శ్యామల్.

గంభీరమైన సుదర్శనం హృదయంలో పెద్దసంక్షోభం ఆరంభమైంది. అగాధమై, అగమ్యమై యున్న మాధురిప్రేమతత్వంలో అతనితల తిరిగిపోయింది. ఆమెమాటలే అతని కర్థంకావేదు. తా ననుకొన్నరీతిగా మాధురిప్రేమతత్వ మంత సంకుచితమైనది కాదు అని అతనికి తోచింది. సుదర్శనం తనతో పాటు సంఘాన్నిగూడా తయారుచేయా లంటాడు. అందాకా వ్యక్తిముం దంజ వేయగూడదని, దానివలన ఏమీ కలుగదని అతనిమతం. ఎంతో సంస్కారం కావలెనంటుంది అతని హృదయం. కాని అతని అభిప్రాయాలు అత ననుకొనే మార్పులకేమీసహాయం జెయ్యలేకుండా వున్నయి. అసలది మార్గమున్నకాదు. ఆలోచనతో సుదర్శనం లేచాడు. "మీ రనే తత్వం న్యాయంగా వున్నట్టు నాహృదయం వప్పుకోటంలేదు. అయినా, నావిధాన మేంటో తెలపటానికి ప్రయత్నిస్తా" అంటూ సాగిపోయినాడు,

పగలల్లా ఎండవేడిమిచే కాగిపోయిన నేలమీదనుంచి వచ్చే గాలి నీళ్లకుండలోపడి చల్లనై ఆపచ్చికపైన వీచేసరకు మరింత చల్లగా కొట్టింది. లిల్లీ పూలు వికసిస్తున్నాయి. మాధురి ఆపూలకేసి పోతూంది. చురుకుగా, గర్వంగా పోతూన్న ఆగమనంలో సమీరుడు అడ్డపడి దుస్తులు అల్లరిచేస్తుంటె శ్యామల్ కు కోపంవచ్చింది. పార్కులోంచి అంతా వెళ్లి పోయినారు. కొంతదూరంనడిచి మాధురి వెనక్కుచూసింది. శ్యామల్ యథాస్థానంలోనే వున్నాడు.

"వస్తా, అక్కడనే వుండు శ్యామల్ !" అన్నది.

శ్యామల్ పరధ్యానంగా తలయూపాడు. శ్యామల్ ప్రేమలో రాగ మున్నది. అసలు అనురాగంలేంది ప్రేమ రేమిటి? ప్రేమే ప్రధానమైన కామంగూడా ప్రేమలో కలసివుంటుంది. కామంలేకపోతే ప్రేమ అనేదే వుండదు. కోరిక లేనివాండ్లు ప్రేమించడ మెందుకు? కనక తప్పకుండా ప్రేమలో కామ ముంది. ప్రేమంటే ఆమెకింకా అనుభవం లేదు" అనుకుంటూవున్నాడు.

౭

శ్యామల్ యింటివద్దలేడు. ఆప్రాంతాల కితనే ప్రశస్తమైన డాక్టరు. దగ్గరపల్లెలో ఎవరికో చాలా జబ్బుగా ఉందని తీసుకెళ్లారు. రే పుదయానికిగ్గాని రాడు. ఆయనయిల్లు పెద్దభవనంకాదు. కాని కొద్దిలో చాలాఅందంగా, వీలుగా తయారుచేయించుకొన్నాడు. స్నానానికి, ఆఫీసుకు, చదువుకోటానికి ప్రత్యేకంగా గదు లున్నాయి. స్నేహితు లెవరితోనైన మాట్లాట్టానికి, కులాసాగా తిరగటానికి దక్షిణపువైపు వరాండాముందు మంచివి ఆగ్రాప్రాంతాలనుంచి తెప్పించిన క్రోటన్సు, చైనాబాక్సులా, నైట్ క్వీను, పారిజాతం, అన్నీ వున్నయి. మధురమైన ప్రకృతిసందేశం రసోపాసకులకే వినిపిస్తుంది.

సుదర్శనం తరచు శ్యామల్ యింటికి వస్తూవుంటాడు. అతని కిప్పుడు క్రిస్టమసు శెలవులు. శెలవల్లో అతని కేం చదువుకోటం అభ్యాసంలేదు. సూక్ష్మగ్రాహిగనక చదవకున్నా క్లాసుల్లో సరిగ్గా మార్కులు వస్తూనేవుండేవి. శ్యామల్ ఉన్నాడేమోనని తిన్నగా అక్కడికి ప్రయాణమైనాడు. తలుపులు తీసే ఉన్నయి. ఎవరో దాసి మనిషి పని సవరిస్తోంది.

"డాక్టరుగా రున్నారా ?" అని అడిగాడు.

"లేరు. లోపలికిరా. సుదర్శనమా వచ్చింది" అంటూ కోమల తువ్వాల మడుతూన్న విసంగానేలేచి రెండడుగు లేసింది. ఆమె అప్పుడే అభ్యంజనం చేసింది. పసరుపోయిన ఆకండ్లు కొంచెం ఎరుపుగావుండటంచూస్తే, నిద్రలేక ప్రియుడి బాహువుల్లో గడిపిన పరిశ్రాంత సౌందర్యం తొలుకుతూన్నట్టుంది.

"మాధురి రావటంలేదు మాయింటికి? "

"నేవచ్చా కానూ?"

"మీ డాక్టరుగారికోసం వచ్చావాయు"

"జబ్బులొచ్చేవాండ్లకు డాక్టరుగాని నాకూ డాక్టరే! సరేగాని, ఎన్నాళ్లుంతా వీతువ్వాల ? "

"మీవాదాలన్నీ కట్టుబడేలోగా కాకపోతుందా?"

"అయితే అతననే మాటలకేమైన అర్థముంది? ప్రేమ చంచలమైందే అంటావా ? "

"వారు పురుషులు, స్వతంత్రులు"

"కోమలా! నువు పూర్వకాలందానివి. నీకేం తెలియదు. ప్రస్తుత స్థితినిబట్టి మార్పు అవసరమైనా, సంఘాన్నే వేరుతో పెకిల్చే అభిప్రాయాల్లో న్యాయంలేదు. అది క్రమంగా రావాలి. "

సుదర్శనం కోమలను డాక్టరుకన్నా ఎక్కువగా ప్రేమిస్తున్నాడు. కోమల ప్రవర్తన, మాటలు అన్నీ అతని కిష్టం. ఎక్కువ అంద శాలి కాకున్న, సమున్నతమైన ఆకారం, కొంచెం చామనిచాయ వంగు, ఆకండలు, వంపులు, ఆమె ఆరోగ్యాన్ని తెలుపుతున్నై. భారమైన ఆ మెజుట్టు, మెరిసే కండ్లు, సాత్విక తేజస్సు అతనికి చాలా యిష్టం. శాంత గంభీరమైన ఆమెవక్షస్థలముపైన అతని హృదయ మెన్నిసార్లో కలలు కన్నది. మారులోంచి బల్లి వకటి ఆమెభుజంమీద దూకింది. తువ్వాల అక్కడ పడేసి లేచింది. తొందరగా పోయి సుదర్శనం దాన్ని దులిపాడు. బల్లి క్రిందబడి పరుగెత్తిపోయింది. కోమల సుదర్శనంవేపు తీక్ష్ణంగా చూసింది. ఆకళ్లల్లో లజ్జావమానాలు పొంగులెత్తినై. అక్కడనుంచిలేచి యింట్లోకి పోయింది. సుదర్శనం భయావేశంతో కంపించి పోయినాడు. ఏమీ మాట్లాళ్లేదు. ఒకఅడుగుకూడా ముందుకువేయలేదు. మెల్లగాలేచి వరాండాదాటి యింటికి బయలుదేరాడు.

"ఆమె యిట్లా చూస్తుందా? ఆనేత్రా లంత క్రూరంగా మారిన రేం? కరుణామోహనంగావుండే ఆకళ్లల్లో ఎంతగాంభీర్యం నిండుకొనుంది? సుదర్శనంజీవితం యికవృథా కావలసిందేనా? సౌఖ్యమే లేదా? ఆశావినశమైన యీహృదయం విస్మృతిపథంలో పడిపోయింది. సరే, ఈసంగతి ఆమె శ్యామల్ తో చెపుతుందేమో! ఎంతో చనవుగా తిరుగుతూవున్న నేను నామిత్రుడి కెంతద్రోహం చేశాను? ఎంత మిత్రుడైనా శ్యామల్ నన్ను క్షమిస్తాడా? నిరాశాహతుడై పోవటమేకాకుండా అంతులేని అవమానంతో నశించిపోవాలి సొచ్చింది. నాప్రవర్తనాన్ని గురించి ఎంతో తృప్తి వహించే మాధురి ఏమనుకుంటుంది?" ఇట్లా వితర్కించుకుంటూ సుదర్శనం తనమేడ్లో రెండో అంతస్థుమీద గదిలో ఘోరంగా ఊపిరివిడుస్తున్నాడు. ఒళ్లంతా చే డెక్కింది.

మర్నాడు ఉదయానికి డాక్టరు యింటికి వచ్చాడు. ముందుగా వస్తున్నానని శ్యామల్ మనిషిని పంపాడు. కోమల వంటచేసుకొని



పడమటి కృష్ణాజిల్లా ఉప్పుసత్యాగ్రహదళము - బెజవాడ
౧. నాయకుడు: శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు.




పడమటి కృష్ణాజిల్లా ఉప్పుసత్యాగ్రహదళము

౧. మొదటిదళము బెజవాడనుండి బయలుదేరుట. నాయకుడు: శ్రీ గంపలగూడెం కుమారరాజాగారు.

౨. రెండవదళము బెజవాడనుండి బందరుకు బయలుదేరుట. నాయకుడు: శ్రీ డాక్టరు వి. హనుమంతరావుగారు.

సిద్ధంగా వుంది. శ్యామల్ భోజనంచేస్తూ—, "మాధురి, సుదర్శనం ఊళ్లోనే వున్నారా?" అన్నాడు. "ఉన్నా"రన్నది కోమల. సుదర్శనంమాట మళ్లీ జ్ఞాపక మొచ్చింది కోమలకు. కళ్లలో నీళ్లు తిరిగినై. 'నేను చాలాఘోరంగా అతన్ని అనాదరించాను. బల్లి పాటుకు నేను భయపడుతుంటే దులిపాడు. అది వక పెద్దతప్పా? ఇంట్లో తల్లి మళ్లీ వచ్చేవరకు అత పక్కడ లేడు. నన్నెట్లా అర్థంచేశాడో! అతని మాధురికి కాదు; నాకు సోదరుడు. అటువంటి చనవుతో యిన్నాళ్లనుంచి మాయింటికొచ్చేవాణ్ణి ఎన్నటికి తిరిగిచూడరావంత అన్యాయంగా ప్రవర్తించాను.' తాను చేసిన అన్యాయాన్ని గురించి చాలా పశ్చాత్తాపపడుతోందికోమల. ఎట్లాగైనా అతన్ని ప్రసన్నంజేసుకోవాలి. తన అపరాధం మరచిపొమ్మని కోరాలె. ఈసంగతి భర్తతో ఏమనిచెపుతుంది? అట్లా చెప్పొచ్చునా? ఈ మనోభారం, వ్యాకులత ఎట్లా తీరుతుంది? పదిరోజు లైంది. సుదర్శనం రావటమే లేదు శ్యామల్ యింటివైపు. ఇంటర్ మీడియేటు పరీక్ష దగ్గరికొచ్చింది. వంట్లో ఏమీ స్వాస్థ్యం లేదు. పుస్తకాల మీదికి దృష్టి సారించటంలేదు. కోమల భర్త వ్రాసుకొంటూంటే వెళ్లి దగ్గర నిల్చుంది ఏమో చెప్పాలని.

శ్యా—అవతలికి పో.

కో—ఇదేమిటి ఇవ్వాళ?

శ్యా—ఏమీ లేదు, కొంచె మాగిరా.

కో—మీయిష్టం వచ్చినప్పుడా?

శ్యా—(విసుగుతో) ఔను.

కో—(మందహాసముచేస్తూ) ఎంచాత?

శ్యా—వాక్కు. చెపుతుంటే.

కో—ఇదేదో కొత్తపద్ధతిలా వుంది—అకేసు నయంలే?

శ్యామల్ కాగితం బల్లమీద పారేసి విసుగుతో "నువ్వు పోయి నయంచెయ్యి"అన్నాడు.

"బాగానే వుంది"అని నవ్వుతో కోమల యింట్లోకి పోయింది. ఎదో వుత్తరం వ్రాసి మడిచి కవర్లో పెట్టి బంట్రోతునుపిలిచి మాధురి కిచ్చిరమ్మని పంపాడు. తానుగూడా లోపలికి పోయినాడు. దక్షిణపు వరాండాలో సుదర్శనంకూచున్న చోటనే కూచోని, కోమల అతని చదువు, ప్రవర్తన, తలుచుకొని తన అవివేకాన్ని నిందించుకుంటూ విచారపడుతూన్నది. కోమల ముగ్ధ. తనజీవితంలో ఎన్నడు శ్యామల్ తప్ప ఇతరవ్యక్తిని ప్రేమించలేదు. చిన్నతనంనుంచి శ్యామల్ తో ఆడుకొని, ఒకచోట తిని పెరిగింది. శ్యామల్ తల్లి మేనరికమని, తల్లి లేనిదని తన యింట్లోనే వుంచుకొని కొడుకన్నా యెక్కువ గారాబంగా పెంచింది. ఆమెవున్నన్నాళ్లు అది అత్తవారిల్లనే స్పృహే లేకుండా తిరిగింది. కోమల భర్తగూడా చాలా అనురాగంగా కోరిన వెల్లాతెస్తూ క్రమంగా డాక్టరీపాసయి మంచిపలుకుబడి, వివేకం సంపాదించి, కోమలను చాలా గౌరవంగా, ప్రాణతుల్యంగా చూస్తూవుండేవాడు. శ్యామలునితల్లి పోయిన మార్చి నెలలో కాలంజేసింది. అప్పటినుంచి కోమలయే యింటివ్యవహారాలన్నీ తానే స్వయంగా చూసుకుంటూ జాగ్రత్తగా భర్తయే దైవంగా నడుచుకుంటూన్నది.

ప్రేమ చంచలమైంది కాదని, ఒకచోట నిశ్చితమై ఏకాగ్రమై వప్పుడది క్రమంగా వృద్ధిపొందుతుంది గాని శాశ్వతమై, క్షణికమై మెరిపించే తాత్కాలికభౌతిక నాట్యం ప్రేమను చలింపజేయలేదని ఆమె నమ్మకం. ఎందరో నవమన్మథాకారులు, విజ్ఞానవంతులు, ఆమె దృష్టిలో సోదరులుగా మన్నింపబడ్డారు. అట్టి వారిని చూచినప్పుడల్లా భర్తమీద ప్రేమ, భక్తి, మరింత ఉత్తేజితమయ్యేవి. ఎందుకంటే ప్రపంచములోని అద్భుతత్వమంతా అతనిలో ఉపాసిస్తున్నది. శ్యామల్ ఇంతలోకే వచ్చాడు. కోమల లేచినిలుచుంది. నిశ్చేష్టత్వమైన ఆమెశరీరంకేసి చూస్తున్నాడు. ఆమె ఏమాట్లాడలేదు. శ్యామల్ గూడా మాట్లాడవద్దనే అనుకున్నాడు. అయినునిమిషా లయ్యేవరకు ఆగలేక పోయినాడు. ఏసమయంలో ఎట్లా ప్రేమించాలో శ్యామల్ కు బాగాతెలుసు. అందులో కోమల తన ఆబాల్యకృతజ్ఞతకు పాత్రమైన ప్రవర్తన గలది. తన్ను మహాభోగినిగా జేసిన విశేషయోగాలు. ఆమె యేస్థితిలోవున్నా శ్యామల్ కు ప్రేమార్హయే.

శ్యా—ఏంవచ్చా విందాక?

కో—పనిలేక.

శ్యా—అడుగుతుంటే యింతే.

కో—అసలు మీకు ప్రేమతెలీదు.

శ్యా—ఓహో! నీకన్నా యీప్రేమతత్వంబోధిం చావేశించింది? ఎదో రాసుకుంటూంటే ఆమాట లేంటి?

కో—ఎదో చెప్పదామని వస్తే 'అవతలికిపో' అనొచ్చు.

శ్యామల్ బలిష్ఠంగావున్న ఆమె బాహువుదగ్గర శిరస్సుంచి "చెపుదూ చంపక" అన్నాడు.

కోమల భర్త కళ్లల్లోకి చూస్తూ

"సుదర్శనం సుస్తీగావున్నాట్ట. తెలిసిందా?" అన్నది.

శ్యా—ఇవ్వాళనేగా రావటం. వెళదా మనుకొన్నా. వెళ్లలేదు.

కో—అతనికి పరీక్షలు దగ్గరకొచ్చినై పాపం!

"ఇదేనా నువుచెపుతానని వచ్చింది?" అన్నాడు శ్యామల్.

"వెళ్లి చూసి మందిచ్చిరండి"

శ్యామల్ కండ్లల్లో రేఖలు ఎఱ్ఱనయినై. 'ఈమె యిట్లాచెపుతుందేం? తనకేం సంబంధం' అని కోపంతో లేచిపోయినాడు.

## ౫

అప్పుడే వానకురిసి వెలిసింది. పొగడచెట్టు క్రిందుగా పోయేవాగు జాలులో ఇందాకా పొంగువారిన ప్రవాహం ఆగిపోయింది. అది తొలకరించిన మొదటివాన. తెల్లని ఆ ఇసుక అంతా, జాలులో తరంగాలు చిత్రించుకుంది. భూమిలోనుంచి బయలుదేరే కమ్మనివాసనలో వానదెబ్బకు రాలిపోయిన గులాబీరేకుల్లోంచి రేగే మాధుర్యం ప్రకృతి గాంభీర్యం ప్రస్ఫుటం జేసింది. మెల్లగా గాలివీచినపుడల్లా అశోకంలోనుంచి బిందువులు రాలుతున్నాయి. ఆకాశం నెమ్మదిగా ఉరిమింది. కాని అది వానకోసం కాదు. శ్యామలుడు నిర్వేదంతో ఒక్క నిట్టూర్పు విడిచాడు. "మధూ! మనోహరమైన ఈదృశ్యం వర్షంవల్ల ఎంత బీభత్సమైంది. పాపం ప్రయాసపడిరావుగాదా!" అనుకుంటూ లేచాడు. మేఘాలన్నీ విడిపోయినై. ఒక్క మేఘశకలంమాత్రం అంతులేకండా పరుగెత్తుతోంది. జాబిల్లి పరుగెత్తిపోయ్యే మేఘంలోంచి తొంగిచూశాడు. వనమంతా ఆనందమయమై పోయింది. చెట్లమీద నీటిబిందువులపైన వెన్నెలకాంతిపడి వనమంతా ముత్యాలతో రణాలుగట్టి యలంకరించినట్లైంది.

ఎవరో తొట్రుపాటుతో వస్తున్నారు. ఆమెచీరంతా తడిసింది పాపం! తలపైని నీలపు ముసుగు. ఆముఖంమీద చంద్రకిరణాలు ప్రసరిస్తూవుంటే కండ్లు తళతళ మెరిసినై. ఆమెమొహంమీది సన్ననినీటిబొట్లు అక్కడక్కడ యింకా ఆరనేలేదు. తల అంతగా చెదరలేదు. కాని ముంగురులు కొన్ని వానకు తడిసి అతుక్కుంటె గాలికి కొన్ని రేగి కొట్టుకొంటున్నవి.

బలిష్ఠమై మెరిసే ఆమెశరీరసౌష్ఠవం ప్రకృతిశోభను మరపించింది. శ్యామల్ పొగడచెట్టు కిందికొచ్చేవరకు ఆమె వెనగ్గా ఆగిపోయింది. అనుక్షణం నిరీక్షించే శ్యామల్‌కు మాధురి వచ్చిందేమోనని పించింది. వెనక్కు తిరిగాడు. హృదయం పొంగివచ్చింది.

పొగడచెట్టునుంచి పూలు రాలినై. "మధూ! మధూ! నాకొరకెంత బాధ?" అన్నాడు.

"నీకొఱకుగాదు, అందరికోసం" అన్నది. కండ్లవెంట జలజలా నీళ్లు కారినై.

శ్యామల్ ఉద్వేగంతో మాధురిని దగ్గరకు తీసుకొని "అయ్యో! బట్టలన్నీ తడిసినై. ఏమిటి అట్లా అంటావు?" అని ఆశ్చర్యంగా ప్రశ్నించాడు.

మాధురి వస్తుందనే ఆతోట్లో డాబాకింద రెండుపక్కలు సిద్ధంచేయించాడు. రెండువేపుల కిటికీల్లోంచి చల్లటిగాలి వీస్తోంది. ఆతోట్లో అప్పుడప్పుడు సమావేశం అవుతూ, ఇష్టాగోష్ఠిగా పొద్దుపుచ్చుకుంటూ, చదువుకుంటూ ఉంటారు. వాండ్ల బట్టలు, పుస్తకాలు అన్నీ ఆరూములో పక్కనే వుంటయి.

మాధురితండ్రి తహసీల్దారుపనిలో వుండేటప్పుడీతోట చవుకగా అమ్మకాని కొన్తే తీసుకున్నాడు. ఆయన దానిమీద ఆదాయంకూడా తీసేవాడు. కాని సుదర్శనం ఆవ్యవహారాలు చూస్తున్న దగ్గరనుంచి ఆదాయంకోసం పెనగులాడక అంతా మాధురివిలాసంకోసమే దాన్ని వదిలేశాడు.

శ్యా—ముందు లోపలి కెళ్లి బట్టలేసుకో, మాట్లాడుదాం.

మాధురిలోపలికి పోయి బట్టలు వేసుకుంది. తెల్లని చీర, జరీపనిచేసిన వదులైన చైనా సిల్కు రవిక. మాలతీపూలు జారిపోతున్నయి ఆజుట్లోంచి. ఆమె బయటికి వచ్చింది.

"సుదర్శన మేమన్నా అన్నాడా?"

ఆమె మాట్లాళ్లేదు. నిశ్వాసభారంచేత సుందరమైన ఆమె వక్షస్థలం కంపించిపోయింది.

శ్యా—ఏం చెప్పు. నాతో చెప్పటానికేం అభ్యంతరం? వేసవరితోటి అననుగా.

మా—మా అన్నయ్య యింత క్రూరుడని నాకు తెలియదు.

"సుదర్శనమా?" అని తనమంచం దగ్గర కీడ్చుకున్నాడు శ్యామల్.

మా—నా ప్రవర్తన మతనికర్థమే కాలేదు. నన్ను చాలా అనుమానంగా చూస్తున్నాడు. నావల్ల తనకు సంఘంలో చాలా అవమానంగా వుందిట.

శ్యా—సంఘం? సంఘం న్యాయాన్నే విమర్శిస్తుందా? సంఘం నిజంగా గుడ్డిది. ఏవాడో అవసరపడి నిర్మించుకొన్న తత్వం ఈనాడు సరిపడక దేశమంతా పాడయిపోతున్నా, ఆచారంకొరకు వ్యక్తులను, తన్మూలకంగా జాతినంతా నిర్వీర్యంజేస్తున్నది సంఘం. ఈయన సంస్కారప్రియుడుగా మరి.!

మా—ఇంతకాలం పెండ్లి లేకుండా వుండటం ఏమిటని మా ముసలమ్మ ఒకటే గోల. అన్నయ్యకుగూడా నామీద వేరు భావం కలిగింది. ఇంట్లోవుండటం చాలా కష్టముగా వుంది.

శ్యా—నీకుమాత్రం ఎందుకు స్వాతంత్ర్యం లేదు యింట్లో వుండటానికి? నీకేం కష్టం? నాదగ్గర కొచ్చేయి. నిన్ను కళ్లో పెట్టి పూజించుకుంటాను.

మాధురి ఏదో ఆలోచనతో చూస్తోంది. శ్యామల్ ఆమె హృదయావేగం మాప్పటానికి యత్నిస్తున్నాడు. వివాహం స్త్రీ నిర్బంధంగా ఎందుకు చేసుకోవాలో మాధురికి అర్థంకాలేదు. వివాహం చేసుకోని వాళ్లంతా నీతిబాహ్యులేనా? పెండ్లిపేరుతో జరిగే ఘోరాలు సామ్యంగాపెట్టుకుంటే ఇది ఎంత పవిత్రమైందో లోకానికి తెలీదు. వివాహం ఒకవిధంగా ప్రేమయొక్క సంకుచితరూపం గావచ్చు.

ప్రపంచాన్నంతా ప్రేమించటం పెళ్లిచేసుకున్న వాళ్లకు తెలీదు. ఒకరినొకరు ప్రేమించుకోటంతోటే వారిబాధ్యతలు తీరిపోతై. మిగతా లోకమంతా వారి ఆదరణకు పాత్రం కాదు. సర్వం ద్వేషమయంగానే తోస్తుంది. ఇట్లాంటి ఆదర్శంతో జరిగే పెండ్లిండ్ల వల్ల లోకాని కేం ప్రయోజన ముంది? అందున అభిప్రాయ భేదాలు, అన్యోన్య అసహనం ప్రబలి ఒకరిపైనొకరు పశుత్వంగా సంచరించడం, ఇంత అన్యాయం, అవినీతి పాకిపోయినై. ఇంకా సంఘాన్ని పట్టుకొని వ్రేలాడాలంటే వివేకంగల ఏపురుషుడు, ఏస్త్రీ ఒప్పుకొంటారు? మాధురికి పదహారేండ్లు వచ్చినయి. ఏకాగ్రమైన ప్రవర్తన గలది. మానవుడు లోకంలో జీవించియుండాలంటే ప్రేమించడమే నేర్చుకోవాలి. శరీరంలోని అన్ని కోశముల్లోంచి ద్వేషం నశించి పోవాలి. ఆ ప్రేమ సృష్టిలో విద్యుత్ప్రవాహంలాగు అనుక్షణం కదుల్తోంది. అన్ని భూతాల్లోకన్నా మానవుడు వివేకంగలవాడు గనుకనే దాని సరియైన స్వరూపం చూస్తాడు. ఆమహాసత్యం లోకానికి చూపిస్తాడు. ఇట్లా ఈసత్యంగ్రహించి ఉపాసించడానికి సంఘంవల్ల నిరోధం కలుగుతే, అవలీలగా సంఘాన్ని త్రోసివేసి వ్యక్తిమయం దంజ వేయవచ్చు. ఇది మాధురిమతం.

శ్యా—మధూ! ఏమి టాలోచిస్తున్నావు?

"నే వెళతా" అని లేచింది. వెంటే శ్యామల్ బయలుదేరాడు. ఊరికే వెంతో ఆనందంగా గడపా లనుకున్నాడు. పాపం మాధురి మనస్సేమీ ప్రశస్తంగా లేదు.

పున్నాగంశాఖలు క్రిందికే పాకి ఉన్నయి. ఒకశాఖమీద చేయివేసుకుని చంద్రుడికేసి ఊరికె చూస్తూనిల్చుంది. శ్యామల్ ఎదురుగా నిల్చొని భుజంమీద చెయివేసి, "నీవు వెళ్లొద్దిప్పుడు, ఇంతవిచారంతో "అన్నాడు. మధుముఖంలోని, కళ్లల్లోని అమృతమంతా తాగుతూన్న ట్లున్నయి శ్యామల్ నేత్రాలు. ఆమె యేం మాట్లాడ్లేదు. గాలికి తలమీదముసుగు లేచిపోయింది. శ్యామల్ సర్దుతూ-

"నాసేవ నీకిష్టంలేదుకదూ!" అని అన్నాడు.

మధుబొమలు ముడివడ్డయి. తిన్నగా అతనికేసి చూసింది. "నువ్వు నాకెందుకు సేవచెయ్యాలె శ్యామల్, నీచిన్న చేతుల్తోటి? నేనొప్పుకుంటానా?"

క్రమంగా మాధురి తన ఆలోచనలన్నీ వెనక్కుతోసేసింది ఏదో సమాధానంచెప్పి.

శ్యా—నీ వట్లా వుంటావుగాని క్షణం నిన్ను చూడకపోయినా బతక లేను.

మా—అయ్యో! నావల్ల ఎంతబాధ నీకు?

మాధురి అతనిచంపలు దయతో నిమిరింది.

"నామీద ఎందుకింత ప్రేమ నీకు?"

శ్యామల్ ఏంమాట్లాడకుండా తల వంచుకున్నాడు.

శ్యా—ఎం దుకంటే—నీవు మాధురివి గనుక.

మా—నిజంగా?

శ్యా—నీవు నాదానివి కావాలని, నీ అమృతమయములైన కళ్లు ఎప్పుడూ చూస్తూ వుండాలనీ నా ఆకాంక్ష.

మా—అది ఎట్లా సిద్ధిస్తుంది?

శ్యా—నావిశ్వాసంచేత—నా నిరతిశయమైన ప్రేమచేత.

మా—నీప్రేమపైన నీకు నమ్మక ముందా?

శ్యా—ఆఁ.

మా—అట్లయితే నేనెప్పుడూ నీయెదుట ఎందుకు శ్యామల్?

మాధురిహృదయంలోంచి అపారమైన ప్రేమతరంగాలు పొంగులు పారినై. ఒక్కసారి శ్యామల్ కళ్లల్లోకి దీనంగా చూసి అన్నది.

"నేనంతా నీదాన్నైపోతే సృష్టిని నేను ద్వేషించినదాన్ని కాదు? నాకు విశాలమైన హృదయమే లేదన్నమాట. అగమ్యంగా జరిగిపోతూన్న సృష్టిలోని నిత్యవ్యాపారం నాకెట్లా తెలుస్తుంది? నా కనుభవం ఎట్లా కలుగుతుంది?"

శ్యా—అదంతా నా కవసరంలేదు. నీవు నా క్కావాలె. నిన్నే చూస్తూఉండాలి. నన్నే మిచేసినా సరే. నాజీవనం, సౌఖ్యం అంతా అప్పుడే వుంటయి.

మా—ప్రేమగలవాడికి అపారమైన ప్రేమావేశంలో వ్యక్తి లేకపోతేమాత్రం ఏంబాధ?

శ్యా—అదికాదు. ప్రేమవున్నా వ్యక్తికూడా అవసరం. అది దేహధర్మంచేత కలుగుతుంది. అది అనివార్యంకూడాను.

మాధురికి కొంచెం మీమాటలో ఆలోచన కలిగింది. "ఔను, దేహానికి, మనస్సుకు అటువంటి సంబంధ ముంది. నిర్గుణమై సర్వవ్యాపకంగా వుండే ఆత్మకు నామరూపాత్మకమైన భిన్నసృష్టి కలగడంచేతనే తానని, పరుడని భేదభావం ఏర్పడుతున్నది. అందులో వివేకంగలవాండ్లుమాత్రం ఆత్మయొక్క ఈసృష్టిక్రమరహస్యం తెలుసుకొని లోకమంతా ప్రేమపూర్ణమైన, భేదమేలేని ఒకే చిన్మయానందమని నిత్యముక్తులై సంచరిస్తారు." అని మాధురి వితర్కించుకొని

"అయినా అది యింకా పక్వదశ కాదంటాను" అన్నది.

శ్యా—ఔను, దేహం ఉన్నంతవరకు కాలేదనేచెప్పాలి.

మా—దేహ మేం ఆటంకం చేయదు. అది కాకుండా దేహం తన అభిప్రాయాన్ని వెల్లడించటాని కొకసాధనంగాకూడా వుంటుంది అనుకుంటాను.

శ్యామల్ ధోరణి నేం పైకెక్కనీయటం లేదు మాధురి. మాధురి సామర్థ్యం, ఆమె ప్రేమయొక్క తత్వం క్రమంగా తెలుస్తున్నయి. ఎవరో వేదాంతులుచెప్పేమాటలుగాని యివి సామాన్యంగా లోకం దీనిని వప్పుకోదు. అయితే యీనాడం రోజుకురోజు నూత్నవికాసాన్ని పొందేరోజుల్లో ఇట్లామాట్లాడ్డం చాలా ఆశ్చర్యంగా దోచింది అతనికి.

చాలా పొద్దుపోయింది. ఇక యింటికి పోలేక మాధురి పకళయ్య మీద, శ్యామల్ పకళయ్యమీద పడుకున్నారు. చంద్రుడికి రాత్రల్లా వారిని కాపలాచెయ్యడమే సరిపోయింది. కిటికీలోంచి పాకుతూవచ్చి తీగలు మాధురికి ఆవెన్నెలతీక్ష్ణం తగలకుండా చేస్తున్నయి. శ్యామల్ ఊరక మసల్తున్నాడు. ఇందాకటినుంచి మాట్లాడిన మాటలన్నీ అనుక్షణం ఎదుట నిలుస్తున్నయి. చివరకు నిద్రపట్టింది. తెల్లవారుజామైంది. కొంచెం ఈదురుగాలి వేస్తోంది. తెల్లవార్లు మేలుకొన్నందువల్ల శశాంకుడు బడలిపోయి పడమరగా తూల్తున్నాడు. మసకవెల్తురు తీగల సందుల్లోంచి మాధురిమీదపడి కొత్తరకంగా చిత్రిస్తున్నది. మాధురి కండ్లు నుసులుకుంది. లేచికూచుంది వళ్లు విరుస్తో. చల్లంగా కొట్టింది గాలి. శాలువతీసుకొని వేసుకుంది. శ్యామల్ నిద్రపోతున్నాడు. అతని కనుబొమ్మలేవో ఆలోచన చేస్తున్నట్లుగా వంపుతిరిగేవున్నై.

మాధురికి శ్యామల్ ను చూస్తే చాలా జాలేసింది. పాపం! ఈతడు నన్ను ప్రేమించాడు. నేను తనదాన్నైపోవాలని అతని కోరిక. నేను తనమాధురినైతే ఇక ప్రపంచమే అవసరంలేదు. ఈ వెర్రిలో పాపం కోమలను వదలేస్తాడేమోకూడా. ఇది కామంతోగూడిన ప్రేమ. అందుకోసమనే ఒకదానికన్నా ఒకటి అందంగా కనబడినప్పుడల్లా మారిపోతూంటుంది. సౌందర్యం ప్రేమయొక్క కవచం దొంగిలించిందొకనాడు. అదివేసుకొని, దుర్బలహృదయాలన్నీ ధ్వంసంచేస్తున్నది. సౌందర్యం జడమైంది. ప్రేమ జీవంగలది. ప్రేమలేని సౌందర్యం భయంకరమైందికూడాను. కనుక సౌందర్యం ప్రేమకాదు. ప్రేమే సౌందర్యం. అది నిశ్చితమైనప్పుడే సౌందర్యాన్ని కాంక్షింపదు. ఆ ప్రేమ ఎంత వృద్ధిఅయితే, ఎంతప్రేమించగలిగితే అంతసౌందర్యం కానుపిస్తుంది. అప్పుడు ఒకశత్రువు, ఒకవికారి, ఒకక్రూరమైన జంతువు, అంతా సౌందర్యమయమే. అప్పుడు సౌందర్య మెక్కణ్ణో వుందని దానికోసం పాకులాడాలసిన అగత్యం తప్పిపోతుంది.

అయితే ఈభౌతికసౌందర్యానికికూడా ప్రాధాన్య ముంది. ఒకవస్తువు అందంగా కనబడితేనేగాని దానిదగ్గరకు పోదు. అప్పుడుగాని ప్రేమించడం ప్రారంభంకాదు. అప్పుడే ఆరహస్యం తెలియటాని కారంభం. క్రమంగా ఆప్రేమను అర్థంచేసుకొని పక్వదశకు తెచ్చుకున్న ప్రేమతో ఈజగత్తునంతా ప్రేమించవచ్చు. తనప్రేమలో కామం వుంటే, అది స్వార్థపరమై, సంకుచితమై అక్కడనే నిల్చిపోతుంది. కామాన్ని అధిగమించి స్వచ్ఛతను, సమత్వంను అలవరించుకొన్నప్పు డది విశ్వవ్యాపకమై మహోపకారం జేస్తుంది.

ఇక కామం నశించడ మెట్లా? ప్రేమిస్తేనేగాని కామం నశించదు. అందుకొరకే గృహస్థాశ్రమం మహాఋషులుకూడా అంగీకరించారు. ఆహా! గృహస్థాశ్రమం ఎంతపవిత్రాదర్శముగలది! ప్రేమస్వరూపాన్ని చూడటానికి ఈ ఆశ్రమం చాలా సహాయం జేస్తుంది. అది స్త్రీపురుషుల జన్మజన్మాంతరసంస్కారంచేత ఏర్పడుతుం దంటారు. ఏదిఎట్లావున్నా, మనుష్యప్రయత్నం చేత, భౌతికసాధనోపాయాలచేత సిద్ధించే దాంపత్యంకన్నా పైనచెప్పిందే ఉత్తమమైంది. అట్లాంటి దాంపత్యమే సిద్ధిస్తే అందు ప్రదర్శింపబడే కామమే ప్రేమ అవుతుంది. ప్రేమే కామ మవుతుంది. అప్పుడు అవస్థాభేదమేకాని అర్థభేద ముండదు. అప్పుడు ప్రపంచంలో జరిగే మానవజంతుసముదాయాల యోగక్షేమం కొఱకు పనిజేస్తూవున్న యేమహాసంస్థనైనా మొత్తంగా అవ్యక్తి ప్రేమించడానికి తగిన హృదయదార్ఢ్యం కలిగివుంటుంది. అట్టిలోకకళ్యాణంకోసం భౌతికభోగాలను, ప్రియమైన తన విశిష్టవస్తుజాలమును, ఒక్కసారి ఆమహాప్రపంచప్రేమ యజ్ఞానలంలో హోమంచేయగలుగుతాడు. ఆత్మార్పణంచేయటానికైన అభ్యంతరం వుండదు." ఇట్టి ఉత్తమదాంపత్యసిద్ధికోసం మాధురి నిరీక్షిస్తున్నది. ఇందుకొరకే ఆమె వివాహంచేసుకోలేదు. శ్యామల్ ను పెండ్లాడాలంటే ఆమె హృదయం వప్పుకోటంలేదు. ఇంతకుముందే వివాహితుడైన శ్యామల్ లో కావలసినంత మార్పు కాలేదు. అతని జీవితసౌధం ఏపునాదులపైన నిర్మింపబడ్డదో ఇంకా ఆమెకు తెలీదు. మాధురిఅభిప్రాయప్రకారం వివాహితుణ్ణికూడా ప్రేమించవచ్చు. అత డంగీకరించకపోతే ఆప్రేమ యింకో పునీతమార్గాన్నే అన్వేషింపవచ్చు. శ్యామల్ యింకా లేవలేదు. తెల్లవారకముందే మాధురి తన యింటికి పోయింది.

## ౬

గ్రామంలోవున్న బ్రాహ్మణసంఘంలో రహస్యంగా జరుగుతూవున్న ఆలోచనలన్నీ బహిర్గతమైనై. నిన్న సుదర్శనాన్ని పిలిపించి మందలించారు మాధురిప్రవర్తనాన్నిగురించి. "నీతిబాహ్యమైన యీప్రచారం, నడవడి ముందు చాలాకష్టాలకు కారణ మౌతై" అని చెప్పినారు. వాండ్ల కుటుంబాన్నంతా బ్రాహ్మల్లోంచి బహిష్కరించటానికి తీవ్రప్రయత్నాలు జరిగినై. తండ్రి సంపాదించిన గౌరవప్రతిష్ఠలుచూచి యింతకాలం ఓర్చారు. కొంతమంది అసలు యిట్లాంటివ్యక్తి మనవూళ్లో వుండటం చాలా అగౌరవమని, రహస్యంగా, ఎక్కణ్ణో మాధురిని చంపాలని యత్నం జేస్తున్నారు.

క్రమంగా యీవార్తలన్నీ సుదర్శనానికి తెలియవచ్చినై. శరీరాస్వాస్థ్యము, తీరని ఈవ్యాకులంలో సుదర్శనం మేధస్సంతా కరిగిపోయింది. కోమల తనదికాదని దుఃఖిస్తాడా? ప్రియమైన చెల్లెలు, ఉదారస్వభావం గలది, తన తల్లిదండ్రులు గతించినప్పటినుంచి ఒక్కచోటనే ఎడబాయకుండావుండి తనతోపాటు స్కూల్లోకూడా తిరుగాడిన ఆస్నేహం, వాత్సల్యం తోసివేస్తాడా? పరిస్థితులన్నీ సర్వనాశనంగా మారిపోతూన్నై.

ఇహనైనా వివాహాని కొప్పుకుంటే సుదర్శనం వాళ్లందరితో చెప్పి ఏం ప్రమాదం లేకుండా చేయగలుగుతాడు. ఒకరు చెప్పే దేముంది? ఆమెమతం ఆమెది. సుదర్శనం మాధురితో మాట్లాట్టంగూడా లేదు. చాలాద్వేషంగా చూస్తున్నాడు. తనమూలకంగా పరువుభంగం. తరతరాల్నుంచి వస్తూన్న కులమర్యాదంతా నశించిపోతూన్నది. సంఘమంతా త్రిప్పింది ఒకరుచేస్తే ఏమవుతుంది?

కోమల తన్ను ప్రేమించలేదు. ఇక బతకడ మెట్లా ఆమె తన్ను మన్నిస్తుందని? రహస్యంగానైన ఆమె తన ప్రేమను జూపిస్తే అతనికి బాధలేదు. సుదర్శనానికి ప్రపంచంలో ఎవరినీ భార్యగా పొందాలనే అభిలాషే లేదు తన అభిప్రాయం మార్చుకోటానికైనా. కోమలతప్ప తన జీవితానందానికి ఆధారమే లేదు. అట్లాంటి కోమల తన హృదయం కనుక్కోలేదు. శాశ్వతనరకంలో పడేసింది తన జీవితమంతా. తుదకు సుదర్శనం తన మరణశయ్యమీదనైన ఆమె ప్రేమించిందని విని పునర్జన్మభారం తగ్గించుకుంటాడు. కోమలబాహువులు, ఆమన్నని చెంపలు, అపరిష్కృతంగా వున్న ఆనాటి జుట్టు, కండ్లు ఎన్నడు అతనికొరకు ప్రసన్నమౌతయి. “అది హాస్యంగా జేసిన ప్రదర్శనం, దీనికింత బాధపడుతావేం?” అని ఆచేతుల్తో, ఆమణికంకణ క్రీలకు మెఱుగుపెట్టు ఆలేతచేతుల్తో వెనకాల్నుంచి కళ్లుమూసినా అతని జీవిత మంతా తరించిపోతుంది. సుదర్శనం ఎన్నోసార్లు భగవంతుణ్ణికూర్చి ప్రార్థించాడు ఆమెబాహువుల్లో తన మరణం కల్పించమని.

సాత్వికమైన, కళంకరహితమైన సుదర్శనం ప్రేమావేశంలో కోమలకు భర్తవున్నాడనే స్మృతికూడా లేదు. తానే భర్తనని తనలో తానుగర్వించుకునేవాడు. ఎన్నోసార్లు కోమల కుత్తరం వ్రాయాలని ఆలోచించాడు. ఏదో వ్రాశాడు. చింపివేశాడు. శ్యామల్ కు చూపిస్తుందేమో ఆవుత్తరం, నిజంగా ఆనాటిచూపుల్లో క్రూరత్వమే వుంటే. ఏమైనా కానీయమని ఒకవుత్తరం వ్రాసి పంపాడు.

“నీకొఱకు జీవితమైనా చాలిస్తాను. నీవు లేకమాత్రం బతకలేను. అయితే నాసంగతేం శ్యామల్ కు చెప్పకు. నాకలం ఇంతకన్నా యేం వ్రాయలేదు. నీదృష్టిలో ఇది తప్పైతే నన్ను క్షమించి పూర్ణంగానే నన్ను మరచిపో.”

ఈవుత్తరం ప్రమాదవశాత్తు శ్యామల్ చేతుల్లోకి వచ్చింది. కోమల స్నానంజేస్తూ మల్లెపందిరిఆకుల్లో పెట్టి మరచిపోయింది. ఆమె చింపివేశా ననుకుంది.

ఏంచేస్తాడు? ఇంత ఘోరం జరుగుతున్నదని తెలిసేటఱకు ఉన్మాద మెత్తింది శ్యామల్ కు.

తన భార్యను, కోమలను సుదర్శనం వలచాడా? ఇది యెప్పుడైనా సంభవమేనా? ఒకరు వలచి ప్రేమించిన వ్యక్తిని ఇంకొకడు తేరిచూస్తాడా? ఎంతపాపం! ఎంతసాహసం! తాను మాట్లాడే నీతికిదేనా అర్థం! తన సంస్కార మంతా పరస్త్రీచేలాకర్షణంతో ప్రారంభ మౌతుందా? ఎంతమిత్రుడైనా సరే, వాణ్ణి క్షమించరాదు. నా సంసారం భంగంచేసేవాణ్ణి క్షమించను. తన మిత్రుడని యింటికి చేరనిచ్చినందువల్ల ఇంత మూడింది.

ఇది కోమలతప్పు. దాని మెఱుపుల్లో వాడు తగుల్కున్నాడు. లేకపోతే సుదర్శన మట్లాంటివాడు కాడు. స్త్రీలది చంచలమైన స్వభావం. ఈ అవిశ్వాస మంతా కోమలదగ్గరనుంచే ఆరంభమైంది. మాధురి నాతో మాట్లాడుతున్నదని ఉడికిందికావాలె. కోమల వరాండాలో నిద్రపోతోంది. రాత్రి రెండు యామాలు దాటినై. శ్యామల్ కు నిద్రపట్టలేదు. కోమల సుదర్శనం జ్వరాన్ని గురించి పడే పశ్చాత్తాపం, పదిరోజుల్నుంచి తమయింటికి రావటంలేదని తనను వెళ్లి కనుక్కొమ్మని నిర్బంధించడం, ఇదంతా అతని అనుమానాన్ని బలపరిచినై. సుదర్శన మెట్లా జ్వరంతో కృశిస్తున్నాడో యిక్కడ కోమల ఉత్సాహంగూడా అట్లాగే తగ్గిపోతూండటం జ్ఞాపకమొచ్చి శ్యామల్ కంపించిపోయినాడు.

భర్త రెండురోజులనుంచి తనతో సరిగ్గా ప్రవర్తించటం లేదని, సుదర్శనాని కెంత అన్యాయం చేశానని కోమల నిర్వేదంతో గడుపుతున్నది. “అట్లా రాశాడేం సుదర్శనం! ఆవుత్తరం నాకేం బోధపడ్లేదు. అతనికేదో నామీద వేరే అభిప్రాయం కలిగింది. అయ్యో! యిదేం అన్యాయం! అతని అభిప్రాయాన్ని మరల్చడ మెట్లా? నిష్కారణంగా చచ్చిపోతాడే! ఎట్లా యీఘోరం మాన్పడం? ఈమహావ్యథతో, చెప్పటానికి వీలులేని యీవికృతావస్థలో ఊరక శయ్యమీద దొర్లుతూంది కోమల. తన కర్తవ్య మేంటి? ఇప్పుడేమి చెయ్యాలె? శ్యామల్ కాకుండా రెండో వ్యక్తిని ఆమె హృదయం ఎట్లా ప్రేమిస్తుంది? తన ప్రియమైన శ్యామల్, తన్నెంతో గౌరవంగా చూస్తూ కోరినవెల్లా తెచ్చి యిచ్చే శ్యామల్, తనఅమూల్యమైన యౌవనాన్నంతా కరిగించుకొని తాగుతున్న శ్యామల్ ను వదుల్తుందా? సుదర్శనం హత్యచేసుకోవడం చూస్తుందా? బ్రతుకెల్లా బ్రహ్మచారియై, చదువంతా వృథాపుచ్చి, తన మేడ, ఆస్తి, సంపత్తు అంతా త్యాగంజేసి సన్యాసియై, బేలయై కృశించి జీర్ణించిపోతాడు తాను నిరాకరిస్తే. శ్యామల్ కన్నా కోమలది క్లిష్టావస్థ.

ఏమైనాసరే, శ్యామల్ తనభార్య నిద్రపోతునట్టు ఆవిధంగానే లేవకుండా నొక్కిచంపెయ్యాలని దృఢసంకల్పం జేసుకున్నాడు. పక్కదిగి కోమలమంచందగ్గరకు తారాడుతాడు. కోమలముఖం జూసి ఆగిపోయినాడు. నిద్రపోతూన్న ఆమెమొహంలో, కళ్లల్లో ఎంతో విశ్వాసం రాజ్యంచేస్తున్నది. నిద్రపోతున్న ఆకనుబొమ్మలు తనకోసమే నిరీక్షిస్తున్నట్టు తోచింది. శ్యామల్ పెదిమలు తను నంటుకోటంలేదని కావాలె ఆమె మెరుగైన చంపలు చనువుతో కదిలి నట్టనిపించింది. నిశ్వాసభారంచేత బాగా నిద్ర పట్టలే దవ్వాళ. ఎడమవైపు మళ్లింది. నిద్రలో స్పృహలేకపోయినా ఆమె చేయి తల్లో

పూలుసద్దుకుంది. శ్యామల్ పెద్దనిట్టూర్పు విడిచాడు. కళ్లవెంట బొటబొట నీళ్లురాలైన్. చేతు లాళ్లేదు. వెనక్కి పోయినాడు.

౨

సుదర్శనానికి జబ్బు జాస్తీఅయింది. జీవించడంకూడా దుర్లభమ నేస్థితిలో వున్నాడు. ఒకసారి శ్యామల్‌ను చూడా లనిపించింది సుదర్శనానికి. ఆకబురువిని శ్యామల్ పరుగెత్తాడు. మళ్లీం తొందర లేదు అని అతనికి ధైర్యంతోచింది. ఒకసారి కింకోసారి రావాలంటే శ్యామల్ హృదయం వప్పుకోటం లేదు. ఆయనమనస్సులో చాలా సంక్షోభం జరుగుతోంది. ఆరోజల్లా భోజనం లేదు. రోగుల్నికూడా చూట్టాని కెళ్ళలేదు. తనరూములోనే కూచోని ఉన్నాడు. కోమలకు కూడా భోజనం లేదు. భర్తను సమీపించడానికి ధైర్యం లేదు. కారణం తెలియరాకుండా వుంది. తన ముఖం చూశినప్పుడింకా క్రోధం, దుఃఖం ఆవరిస్తున్నట్లు కనుపించింది. రాత్రిజరిగిన ఈవికృతఘట్టం ఆమెకు తెలియనేతెలియదు. ఆమెమరణ మెంత చేరువలో ఉన్నదో ఆమె కేం తెలియదు.

మాధురి రెండుమూడుసార్లు వర్తమానంచేసింది శ్యామల్‌ను వచ్చి మాట్లాడి వెళ్ళవలసిందని. ఊళ్లో ద్రోహులు తన్ను హత్య జెయ్యా లనుకుంటున్న సంగతి మాధురికికూడా తెలిసింది. ఈవిషయం శ్యామల్‌తో మాట్లాడుదా మనుకుంది. అతను రాకపోతే చివరకు తానే శ్యామల్ యింటికి బయలుదేరింది. శ్యామల్ గదిలోనే కూచోవున్నాడు. మాధురి వచ్చింది.

"శ్యామల్!" అన్నది.

శ్యా—వస్తున్నా.

ఎదురుగా వచ్చాడు శ్యామల్. ఇద్దరు రూములో కూచున్నారు.

మా—అట్లా వున్నావేం యివ్వాళ?

క్రోధంతో పొంగిపోయిన ఆ యెర్రనికళ్లల్లోంచి బొటబొట కన్నీళ్లు రాలినై. తన ప్రకృతావస్థ వెల్లడికాకుండా గంభీరంగా "ఏమీ లే"దన్నాడు.

మా—నీక ళ్లట్లా వున్నా యేం శ్యామల్? ఒక్కసారి యిట్లారా. నాదగ్గరకు రా. మాధురినిచూస్తే ఉత్సాహంతో వుండేవాడివి. నేనేమన్నా నీలేతహృదయాన్ని నొప్పించానా?

శ్యా—లేదు. ఎప్పుడు లేదు. నీవల్లనే నేనింకా ప్రపంచంలో జీవిస్తున్నాను.

అని మాధురిచేతులు తన వక్షస్థలంమీదికి చేర్చుకున్నాడు.

మా—మాశావా ఈపూరిస్థితి? రహస్యంగా ఈ రాత్రికో, రేపో కొంతమంది నన్ను చంపెయ్యాలని తిరుగుతున్నారుట.

శ్యామల్ వికృతంగా చూస్తూ.

"వాండ్ల కేమొచ్చింది? నీవల్ల వాండ్ల కేంబాధ? ప్రపంచానికి సంఘబాహుళ్యమే కావాలెగాని న్యాయంతో పనిలేదు. వెధవ ఆచారంకోఅకు ఎంతమంది బలి కావాలిపొచ్చింది! శ్యామల్ జీవించి యుండగా అంతపని జరుగనిస్తాడా? ముందు శ్యామల్ వధింపబడందే మాధురికంఠం, ఆసుందరకేశభారంచేత వంపుదిరిగినకంఠం-మణిభూషణాది హారాలుకూడా భౌతికభోగాలని నిరాకరించి ప్రకృతిల తొపువ్వ మాలికల నలంకరించు నీకంఠం-స్పృశింపగల కూళ యెవ్వడు?" అంటూ ఆవేశంతో లేచాడు.

మాధురి తన ఆపద నంతా మరచిపోయింది. మహారణ్యరూపమైన ఆగ్రామంలో ఈమాత్రపు వివేక మున్నవాడు, మాధు రంటే ప్రేమించేవాడు శ్యామ లొక్కడే. మాధురి శరీరం, బాహువులు, వక్షస్థలం ధైర్యంతో పొంగినై. శ్యామల్ హృదయంలో జరిగే బీభత్సోన్మాదం, కొత్తదనం మలచుకొన్న మాధురి యౌవనవికాసంలో నక్కిపోయింది.

భర్త భోజనంలేకుండా వున్నాడని, అసలు విషయమే తెలియక కాగిపోతోంది కోమల. ఈదారుణమంతా ఎందుకు జరుగుతున్నది? పునీతురాలైన కోమల అకారణంగా యీవిషమావస్థలో ఎందుకు మగ్గిపోవాలె? అంత మహాపరాధం ఆమె యేంజేసింది? ప్రపంచానికున్న విశ్వాసమైన, అనుక్షణం తెలుసుకుంటూన్న, ప్రేమిస్తూన్న తలమీద పూవువలె ఎంచుకుంటూన్న భర్తకు లేకపోయింది ఈనాటికి. కాళ్లమీదనైనాబడి అతన్ని భోజనానికి బ్రతిమాల్దా మనుకుంది. కోమల గదిముందరికి వెళ్లింది. ఆమె యింకా లోపలికి పోనేలేదు. "వెళ్ళిపో, అవతలికి"అని శ్యామల్ గర్జించాడు ఘోరంగా. ఒక్కకేకవేసి కోమల క్రింద పడిపోయింది. మాధురి కేమీ అర్థంకా లేదు దాని తత్వం. వెంటనే పోయి ఆమెను లేవదీసి వరాండాలో మంచంమీద చేర్చింది.

చైతన్యమే నశించిన ట్లుంది ఆమెకు. నెమ్మదిగా శైత్యోపచారాలు చేసింది. ఆమె తేరుకున్నది. మాధురి శ్యామల్‌వద్దకు వెళ్ళి "అట్లా చేయటం చాలా పాపం. కోమల చాలా విధేయురాలు. ఆమె పవిత్రమైన వ్యక్తి. ఆమెదగ్గర నేర్చుకోవాలసిన విషయాలుకూడా చాలా వున్నయి." అని మందలించింది. తన అవస్థను చెప్పుకొనుట కది సమయము గాలేదు. మాధురి వెళ్లిపోయింది.

తరువాత శ్యామల్ లోపలికి వెళ్లాడు. కోమల అతని పాదాలమీదబడి వెక్కివెక్కి ఏడ్వటం మొదలుపెట్టింది. "నేనేమైన అవిధేయతగా ప్రవర్తించానా? క్షమించండి. మీకోమల మీకోసం అగ్నిలో దురుకమన్నా సిద్ధంగా వుంది" అని యేడ్చింది. శ్యామల్ కాలు విదిల్చివేశాడు. ఆమె అవతల పడ్డది. అక్కడినుంచి లేచిపోయినాడు శ్యామల్.

## ౨

తనభర్తలో హఠాత్తుగా యింత మార్పెందుకు కలిగింది? ఇదంతా, ఎవరు ప్రేరేపించారు? మాధురి ఇట్లా చేసిందా? లేదు. మాధురి చాలా మంచిది. కోమలంటే మాధురికి చాలాభక్తి. కోమలను రోజు కొక్కసారైన కలిసి మాట్లాడేది. కోమల దృఢసంకల్పం, వినిర్మలమైన ఆమె ప్రేమ, శాంతము, మాధురికి చాలా గౌరవ పాత్రంగా వుండేవి. కోమలకు మాధురిపైన ఏమీ అనుమానం లేదు. తన శీలమునుగురించి గొప్పనమ్మకం గలిగిన ఆమెకు ఉత్తరం విషయం స్మృతికే రావటంలేదు. శ్యామల్ కెవరన్నా ఆపత్తు తెచ్చిపెడుతూంటే ఇట్లా ఆవేశపడుతున్నాడేమో ననుకుంది. అయితే తనేం జేసింది? కోమల కేమీ బోధపడటం లేదు.

సుదర్శనాన్ని యిట్లా ఆదరించినప్పటినుండి ఆమె కిన్ని అవస్థలు తటస్థించినై. నిజంలో, చనువుగా వచ్చేవాణ్ణి, చిన్నతనంనుంచి తన గౌరవాదరణలకు పాత్రమైనవాణ్ణి వేరుభావంతో చూచినదాని కేగతి యైన న్యాయమే అనుకుంటూంది. సుదర్శనాన్ని చూడక చాలారోజులైంది. అతనికి జబ్బు ఎక్కువగా వుందని తెలిసింది. అతన్ని చూశామనుకొని కోమల బండిచేసుకుని తిన్నగా సుదర్శనం మేడదగ్గరికొచ్చింది.

మాధురి సగౌరవంగా వచ్చి ఆమెను తీసుకోవెళ్లి సుదర్శనం దగ్గరికి చేర్చింది. అతని మంచందగ్గర ఒక కుర్చీ వేసుంది. సుదర్శనం ఆమెను దాంట్లో కూచోమని సంజ్ఞచేశాడు. సవిచారంగా కోమల దాంట్లో కూచుంది.

కో—సుదర్శనం! ఎట్లా వుంది నీవంట్లో?

సుదర్శనం ఏమీచెప్పలేక కళ్లనిండా నీళ్లుతెచ్చుకున్నాడు. అతని స్థితిచూచి కోమల దుఃఖం కంఠంలోనే దిగమ్రింగింది.

కో—నీవు యింతకాలంనుంచి మా యింటికి రానందుచేత యిల్లంతా విషాదచ్ఛాయలలముకున్నయి. ఎన్నడు చనువుతో మందహాసంజేస్తు వాదిస్తూ గంటలకొద్ది గడుపుతావో!

సుదర్శనం గద్గదంతో "కోమలా! నన్ను క్షమించు. నేను నీపట్ల చాలాద్రోహిని. నీమనస్సెంతో నొప్పించాను.

కోమల దీర్ఘమైన నిశ్వాసం విడిచింది. ఆనిశ్వాసంలో సుదర్శనం జీవితమంతా సన్నిహితమై కుంచుకొనిపోతున్నట్లనిపించింది.

కో:—నేనందుకోసమే వచ్చాను. నా అనాదరణ మనస్సులోనుంచి తీసివెయ్యి నాసుదర్శనా! పవిత్రమైన నీహృదయంలో నన్ను శపించకు. మన హృదయాలు భిన్నభిన్నమై నమార్గాలు శాశ్వతంగా నిల్చిపోయినై. నన్ను పూర్తిగా మరచిపో. నే నీప్రపంచమున జన్మించనే లేదు. నీవు నన్ను చూడనే లేదు. నీయభిలాష తెలిసింది. నాకిపు డేమి కర్తవ్యం తోచటం లేదు. నీవు సన్యాసివై, నీసర్వవైభవాలు విడిచి, జీర్ణించి, నశించడం నేను చూడలేను. నీకొఱకు ఈదేహానికి యిక స్వస్తి జెప్పిస్తా. ఈశరీరం, ఒకపవిత్రమైన, నిష్కల్మషమైన ప్రేమోపాసకుని బలిగా పరిగ్రహింపదు. తానే ఆమహావ్యక్తి వికృతావస్థలో ఆత్మార్పణం జేస్తుంది.

సుస్నిగ్ధమైన ఆమెచెక్కిళ్లు బొమ్మపుల్లలమయ్యి లైపోయినై.

సుదర్శనానికి ఇక జీవితంతో అవసరం తీరిపోయింది. గుండె రాయి అయిపోయింది.

సు—'కోమలా! ఇట్లారా. ఒక్కసారి నీచేయి నాహృదయం మీద పెట్టు. నాజీవితం చాలిస్తాను.' అన్నాడు అవ్యక్తంగాను, అస్పష్టంగాను.

కోమల తొట్రుపాటుతో, భయంతో సుదర్శనం హృదయంపైన చేయివేసింది. సుదర్శనం తనచేతుల్లో ఆమెచేయి అదుముకున్నాడు.

మాధురి ముందు కలుపుకోరావాలని వెళ్లింది యింకా రాలేదు.

శ్యామల్ బజారునుంచి యింటికి వెళ్లాడు. ఇంట్లో కోమల లేదు. దాసీని ప్రశ్నించాడు. సుదర్శనంమేడకు బండిమీద వెళ్లారని చెప్పింది. ఇంట్లో అంతా వెతుక్కుని తొట్రుపాటుతో ఒకకత్తిని గుప్తం చేసుకున్నాడు. కోమలతో కాపురంజేసిన ఆయింటిలో యిక పాదం పెట్టదలచుకోలేదు. ఆయింటితో, కోమలతో ఆనాడే ఋణం తీరిపోయింది. భోజనంలేదు. జుట్టంతా దుమ్ముకొట్టివుంది. కాలినడకతో తూలుతూ బయలుదేరినాడు. శ్యామల్ ను ఇంతమోసం చేయటం, ప్రాణమంతా తనదిగా జేసికొన్న నన్నా యీఘోరం. అంటూ సుదర్శనంయింటికి వచ్చాడు.

ఇల్లంతా శాంతంగావుంది. సుదర్శనం పడుకోనున్న గదిదగ్గరకు వెళ్లాడు. ఏముంది? అతని పిచ్చి మస్తిష్కమంతా ఆవరించింది. సుదర్శనం హృదయంమీద కోమలచెయ్యి. తనచేతుల్తో అదుముకొని కండ్లు మూసుకొని వున్నాడు సుదర్శనం. శ్యామల్ వికృతంగా కేకలువేసి బొబ్బరించాడు.

"దురాత్మురాలా! ఇంత విశ్వాసఘాతకురాల వని అనుకోలేదు. నీ ఆలోచనలు—యత్నాలు—" అంటూ కోమలమీదబడి కంఠమంతా నులిమేస్తున్నాడు. ఆ మహాసాధ్వి కంఠంలో ఏదో ప్రార్థనము నలిగిపోయింది. జేబులోంచి కత్తి తీశాడు. ప్రమాదం! ప్రమాదం! మెడలోని విద్యుద్దీపాలన్నీ ఒక్కసారి ఆరిపోయినై క్రరంటునిల్చి. మేడంతా పెద్దఅల్లకల్లోలంగా వుంది. ప్రతిధ్వనించిపోతోంది. ఎవరో అడ్డంగా వచ్చారు. "ఇది మహాపాపం. ఎందు కింతవెర్రి?" అని కత్తి పట్టుకోబోయినారు. ఒందునిమిషాల్లోమళ్లీ దీపాలన్నీ వెలిగినై.

ఏముంది? చేతుల్నిండా నెత్తురే. ఒళ్లంతా నెత్తురే. శ్యామల్ బాహువుల్లో మాధురి మెడ తెగి వ్రేలాడుతూంది. శ్యామల్ పెద్దకేక వేసి ఏడుస్తూకూలిపోయినాడు. కోమల మాధురికాళ్లమీదబడి జీవితం చాలించింది. ఈ విశ్వప్రళయమంతా సుదర్శనం మరణశయ్యమీద తేలకండ్లతో పరికిస్తున్నాడు.

---

# కాళ్ల చప్పుడు

వెంపటి నాగభూషణంగారు

౧

అప్పుడప్పుడు వినబడేది—కాళ్ల చప్పుడు. పగ లేమీ వినబడేదికాదు. రాత్రిళ్లే చప్పు డవుతూండేది,—ఎవరో గబగబా బంగాళాతోటలోంచి నడిచివచ్చి మెట్లెక్కుతున్నట్టుగా. ఆదుర్దాతో తలుపు తెరిచి చూచేది, ఆ అమ్మాయి. కాని ఎన్నిమారులుచూచినా మోసమే. ఎవ్వరూ కనబడేవారు గాదు. "చిత్రంగా వుందే—" అని వూర్కునేది.

ఎంత ధైర్యంగా వున్నా పగటిపూట ఆవిషయం తల్చుకుంటే గుండె తల్లడిల్లేది. బంగళాకంతకు తను, ఒక ముసలమ్మ తప్ప ఎవ్వరూ లేరు. ముసలమ్మకు తన ధోరణేమో, తనేమో తప్ప యితరవిషయాలు అర్థంకావు; వాటినిగూర్చి విచారించడుగూడాను. అందుచేత ఆ అమ్మాయి వొంటరిగానే ఉన్నట్టు భావించేది. అందులో పగలంతా ఎట్లాగో అట్లా కాలయాప నవుతుంది. కాని రాత్రి వొంటరిగా పడుకుంటే ఎన్నోఆలోచనలు తోస్తాయి. ఎన్నోవిషయాలు జ్ఞప్తికి వస్తాయి. ఎన్నోభావాలు పొడచూపుతై. అవి అట్లావుండగా, అప్పుడప్పుడు—కాళ్లచప్పుడు. చూచేసరికి ఎవ్వరూ ఉండరు. ఇక ఆ అమ్మాయి అపరిమితమైన భయం చెందేదంటే అసంభవ మేమీ లేదు.

కాని కొన్నాళ్ల కది అలవాటైపోయింది—కాళ్ల చప్పుడు. ఆ అమ్మాయికి రాత్రిపూటలందు కలిగే అనుభవాలలో అదొకటైంది. అయినా కొన్నాళ్లదాకా అర్థం చేసుకోలేదు. చివరకు గ్రహించింది—తన వొంటరితనాన్ని పారద్రోలి, కాపలాయుండేటందుకు అతను రాత్రులందు ఆయాప్రాంతాల తారుమారాడుతున్నా కాబోలని. బ్రతికున్నపుడు అత నామెను ఎంతగానో ప్రేమించేవాడు. ఎంతగానో ఆదరించేవాడు. పంచప్రాణాలు ఆమెమీద ఆధారంచేసుకుని జీవించాడు. ఆ అమ్మాయిని తన హృదయరాజ్ఞిగ గౌరవించేవాడు. అట్లా చేసేవాడంటే ఆశ్చర్య మేమీ లేదు;—అత నొక కవి; ఆనందవాటికలో స్వైరవిహారంచేస్తూ రమ్యగీతిక లాలపించే కవి. అందుచేత అత నా అమ్మాయిని మల్లెపువ్వల్లే చూచుకొనేవాడంటే, అ దతని స్వలాభానికే అయివుంటుంది. ఆ అమ్మాయి నొక మంచి గంధపు మంజూషగా భావించేవాడు. ఆమెను చూచి ఉత్సాహంపొందేవాడు.

ఆవిధంగా ఆఅమ్మాయి అతని భావోత్కర్షానికి మూలకారణమైనదంటే, ఆవిడదికూడా కొంతప్రయత్నం వున్నదన్నమాటే. అతని వుద్దేశ్యం గమనించి, అతనికి వ్యుత్పన్నురాలుగా వుండాలని ప్రయత్నించేది. ఏవిధంగా సంచరిస్తే అతని మనోవీథిలో భావవీచికలు వీచేవో ఆ విధంగానే సంచరించేది ఆపిల్ల.

అట్లా ఒకరిలో ఒకరు విలీనమైపోయి రాయంచలల్లే జీవితపథాల్లో విహారంచేసేవారు. స్వచ్ఛమైనప్రేమ వారిది; నిర్మలమైన వాత్సల్యం వారిది;

* * *

౨

అనుకోనిదే తటస్థించింది ఆపద. కల్లోనైనా వారనుకోలేదు అట్లా జరుగుతుందని. తెలిసివుంటే ఏంచేసే











౧. శ్రీ తోట నరసయ్యగారు (కీ) ౨. శ్రీ పాలడుగు సుబ్బారావుగారు (కీ) 3. శ్రీ ముట్నూరి కృష్ణారావుగారు (కీ)
౪. శ్రీ వారణాసి వెంకటాచలంగారు ౫. శ్రీ పిన్నమనేని వీరయ్యచౌదరిగారు.















౧. శ్రీ జనస్వామి నారాయణగారు (శ) ౨. శ్రీ కన్నిగంటి కోటిసూర్యంగారు (శ) ౩. శ్రీ మన్యం నమశ్శివయ్యగారు (శ) ౪. శ్రీపొలేపెద్ది రామమూర్తిగారు (ఏ) ౪. మంచిభట్ల ప్రభాకరశాస్త్రిగారు (ఏ) ౫. శ్రీ కొల్లి సుబ్బయ్యగారు(శ) ౬. శ్రీ ఏలేశ్వరపు ఆంజనేయులుగారు(శ) ౭. శ్రీ చల్లా రాఘవయ్యగారు(శ) ౮. శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు(శ) ౯. శ్రీ సూరపనేని వెంకటరత్నం చౌదరిగారు(శ) ౧౦. శ్రీ డా. ఏ. బి. నాగేశ్వరరావుగారు(శ) ౧౧. శ్రీ కై. సుబ్రహ్మణ్యంగారు(శ) ౧౨. శ్రీ వక్కలంక సుబ్బరావుగారు(శ) ౧౩. శ్రీ దేవులపల్లి సూర్యనారాయణమూర్తిగారు(శ)

వారో మన మూహించలేం. కాని పర్యవసాన మేమిటంటే—అతను ఆకస్మికంగా చనిపోయినాడు. అంతటి కవి, అంతటి ప్రియుడు, మరణించాడు. అతను, ఆఅమ్మాయి కలిసి సంతోషంతో నిర్మించే ఆనందమాల పూర్తిగాక మునుపే పెరిగిపోయింది.

తనలో ఒకభాగం విడిపోయినట్లుగా విలపించింది. అంతా శూన్యంగా కన్పించింది—ఆఅమ్మాయికి. భావి జీవితమంతా పెద్ద వారాన్నిధిరూపం ధాల్చి ఆమెముందు కన్పించింది.

ఇక ఆఅమ్మాయికి మరోలోకం లేదు; మరోఆసక్తి లేదు; మరోధోరణిలేదు; అంతా గతించిన ప్రియుని స్మరణలో నమసిపోయింది. ఎప్పుడూ అతన్నిగూర్చి విచారించేది; కళ్లు చిల్లిపడ్డాయేమో యన్నట్లుగా ఏడ్చేది; విధిని నిందించేది; దేవుణ్ణి దూరేది. ఒకప్పుడు తనంతటి అదృష్టవంతురాలు, సౌఖ్యవంతురాలు లేదని ఆనందించింది. ఇప్పుడంతా మాయమైపోయింది. ఒక్కతే జీవితం గడపాలిసివచ్చింది. అది ఆమెకు భయం.

అదీగాకుండా, అంత పెద్దబంగళాకు ఆమె ఒక్కతే. ఊరికి దూరంగావుండి, శాంతవాతావరణ ముంటేనే గాని కవితాధోరణి రా దనే నమ్మికతో అతను ఊరికి బయట అందమైన బంగాళా కట్టించాడు. దాన్ని అందంగా అలంకరించాడు. అందులో తను, ఆఅమ్మాయి అందంగా కాలం గడిపేవారు. అందులోనే యిప్పు డా అమ్మాయి వొంటరిగా వుండవలసివచ్చేసరికి కష్టమైంది. కొంత ధైర్యం తెచ్చుకుని ఉంటూంటే అప్పుడప్పుడు రాత్రిసమయాల్లో కాళ్లచప్పుడు వినబడేది. తనప్రియుడు తనని చూడ్డానికో, తనకు తోడుండడానికో వస్తున్నా డని సమన్వయంచేసుకొని ఆ చప్పుడికి అలవాటుపడ్డది ఆ అమ్మాయి.

ఇదంతా యింట్లోవుండే ముసలమ్మకు లేశమైనా తెలియదు. * * *

3

కాలం జరిగిపోయింది. ఉషస్సులు, ఉగాదులు తరలిపోయినై. బంగాళాలోని చెట్లు యథాప్రకారంగానే చిగురుస్తున్నై. మామూలుగానే సూర్యుడు తన బంగారు కాంతితో బంగాళాని ముంచివేస్తున్నాడు.

అంతకంతకు అతన్నిగూర్చి తలపోయడమే తగ్గించింది. ఇంకా కొన్ని నెలలు జరిగినతర్వాత స్మరించడమే మానేసింది. తన మామూలుధోరణిప్రకారం సంగీతం, సాహిత్యం కృషిజేసేది. రాత్రి అడుగులచప్పుడు వినిపించేదికాదు. ఆ అమ్మాయిదృష్టిలో అది అంతరించింది. అతనే అంతరించినప్పుడు, యిక అదా మిగిలేది?

* * *

కేవలం చిన్నపిల్ల ఆ అమ్మాయి. పద్దెనిమిదేండ్లు నిండాలేవు. దురదృష్టంవల్ల జీవనభారం విరుచుకు మీద బడ్డదిగాని లేకపోతే ఆనందప్రేంఖలో ఊగుతుండవలసిన పిల్ల.

ఆనాడు లోపలంతా ఉక్కగావుండడంచేత కాస్త చల్లగాలి పోసుకుందామని బంగాళా ముందుతోటలో పచారుచేస్తోంది. వెన్నెలకెరటాలు తోటనంతా ముంచివేస్తున్నై. నడుస్తూ ఆమె చంద్రకాంతపువ్వులు చెండు గ్రుచ్చుతోంది......తటాలున తల పైకెత్తి చూచింది... గేటు తెరచినట్టుగా శబ్దమైంది. నిదానించి చూచింది...

"......వున్నాడా?" అన్నాడు ఆ వచ్చినతను.

ఆఅమ్మాయి తెల్లబోయింది.

"......వున్నాడా?" అన్నా డతను మళ్లీ.........తెల్లనిసూటు వేసుకున్నాడు. చేతులో చిన్న పోర్టుమాంటో వుంది. నడుస్తూ బంగాళావరాండా మెట్లు సమీపించాడు.

"కూర్చోండి"......అని ఆ అమ్మాయి కొంచెం వెనక్కి వెళ్లింది.

పోర్టుమాంటో ప్రక్కనపెట్టి, సోఫాలో కూర్చుని సిగరెట్ ముట్టిస్తూ "క్షమించండి" అన్నాడు.

"పరవాలేదు. ఎక్కడినుంచి రావడం? ఎందుకు.........?"

"నేను, అతను చిన్నప్పటినుంచి స్నేహితులం. నేను అతనిపెళ్లికికూడా వచ్చాను, మీకు జ్ఞాపకంలేదూ?

అప్పుడే చూచా మిమ్మల్ని. మళ్లీ చూడలేదు. అతను మాత్రం ఏడాదిక్రింద కాంగ్రెస్‌లో కనబడ్డాడు. ఇప్పుడీ వూరు పనుండివచ్చి, యితనుండగా మరోకచోటబసచేయడమెందుకని సరాసరి యిక్కడికే వచ్చాను......ఏంజేస్తున్నాడు. బయిటికివెళ్లాడా?" అన్నాడు ఒక్కగుక్కలో.

ఆ అమ్మాయి చలించింది. పూర్వమంతా ఒక్కమారు తళుక్కుమని మెరసింది, ఆమె హృద్వీథిలో. ఏమీ చెప్పలేక నిలబడిపోయింది. ఇంతలో నిప్పుపుల్లగీసి రిస్టువాచివంక చూచాడు అతను. ఆ కాంతిలో అతని ముఖం తళతళ్లాడింది. కళ్లకు పాన్సునేజోడు వుంది. పాతికేళ్లుండవచ్చు నతనికి.

"లోపలికి వెళ్లి విశ్రమించవచ్చు. ప్రయాణం బడలిక......" అన్నది.

"అత నేడీ, యిప్పుడు వస్తాడా?"

"అదిగో అల్లా వెళ్లవచ్చు. ఆగదిలోకి పదండి..."

అతని కేమీ అర్థమైందికాదు. అతనిమాట ఎన్నిమారులు అడిగినా తటస్థంగావుండి మాట మార్చివేస్తోంది. ఆమె అతనిభార్యని అతనికి గుర్తుంది. సరే ననుకొని యింట్లోకి ప్రవేశించాడు. హాల్లో పెద్ద లామింగ్టనులైటు వెలుగుతోంది. కుర్చీలు, సోఫాలు, బల్లలు అన్ని పూలతో నిండివున్నాయి. ఆహాలు దాటి లోపలిహాల్లో ప్రవేశించి కుడివైపునున్న గది జేరాడు. లోపల వాషింగ్టనులాంపు ఉన్నది. గదిఅంతా సువాసనమయం. ఒకప్రక్కను దోమతెర దిగవేసిన పందిరిమంచం ఉన్నది. మధ్య చిన్న టీపాయ్‌మీద రాధాకృష్ణులు రాతివిగ్రహం ఉన్నది.

సూటువిప్పి, పైజామస్ తొడుక్కున్నాడు మిత్రుడు. ఎదురుగావున్న అద్దంలో చూసుకుంటూండగా ఆ అమ్మాయి ప్రవేశించింది. తెల్లని సిల్కుచీర కట్టుకుంది. బోడీస్ తొడుక్కుంది. సంచీజడవేసి చివర రిబ్బనుతో కట్టేసింది. మెళ్లో ఒక్క లాంగ్ చైన్‌మాత్రం వున్నది. దీపంకాంతిలో ఆమెముఖం మెరసింది. మిత్రుడు వెనక్కు తిరిగి చూచాడు. పూర్వం ఆమెను పెండ్లికిచూచినదానికీ యిప్పటికీ చాలా వ్యత్యాసం వున్నది. నిలువెల్ల చూచాడు.

ఇంతలో ముసలమ్మ 'టీ' ట్రే తెచ్చి అక్కడ బల్లమీదపెట్టి వెళ్లిపోయింది. రెండుకుర్చీలు దగ్గరగా లాగింది ఆ అమ్మాయి. ఒకదాంట్లో తను కూర్చుంది. రెండోదాంట్లో అతన్ని కూర్చోమన్నది. అతను కూర్చున్నాడు.

"పుచ్చుకోండి" అని అన్నది చిరునవ్వుతో

"అత నేడీ?"

"పుచ్చుకోండి, చల్లారిపోతుంది"

"అతను......?"

"వస్తారు, కానీండి"

ఇద్దరూ టీ పూర్తిచేశారు, ఒకరివంక ఒకరు చూచుకుంటూ.

"మిమ్మన్ని చూసి రెండేండ్లయింది..." అన్నాడు మెల్లగా.

ఆమె సిగ్గుపడ్డది. బుగ్గలు ఎర్రబారినై. "కావచ్చు" అన్నది కోమలంగా.

"అప్పు డింత అందం......"

"అయితే మీరు ఏమి చేస్తూంటారు?"

"మొన్ననే ప్రాక్టీసు పెట్టాను, మద్రాసులో"

"మద్రాసులోనా?"

"అవును. బీచి అది హాయిగా వుంటుంది."

"అవును, నిజమే. ఎవరోరుంటున్నారు, అక్కడ?"

"ప్రస్తుతం నేను, వంటవాడు, పెండ్లిఅయేదాకా!" అన్నాడు చిరునవ్వుతో.

ఆమె నవ్వింది.

ముసలమ్మ వచ్చి భోజనానికి రమ్మంది. ఇద్దరూ లేచివెళ్లారు.

* * *

భోజనంచేస్తూ "అత నేడీ?" అన్నాడు.

"వస్తారులెండి, కానీండి" అన్నది ఆ అమ్మాయి.

* * *

రాత్రి గడచిపోయింది. తెల్లవారి కాఫీ త్రాగుతూ "అత నేడీ?" అన్నాడు.

"వస్తారు, కానీండి" అన్నది మామూలుగా.

* * *

౪

అతిథిమిత్రుడు వచ్చి నాలుగురోజు లైంది. "అత నేడీ" అని అడుగుతూనే ఉన్నాడు. "వస్తారు లెండి" అని ప్రత్యుత్తరమిస్తూనే ఉన్నది.

"చాలా వింతగా ఉన్న దే" అనుకునేవా డతడు.

ఆమె అట్లాగే అనుకునేది.

* * *

సాయంకాలం 'టీ' త్రాగి యిద్దరూ గదిలోనే కూర్చున్నారు. వరాండాలోనికి తెరుచుకున్న ద్వారానికి లేసుతెర వ్రేలాడుతోంది. బయట అంతచీకటిగా లేకపోయినా, లోపల చాలాచీకటిగా వున్నది. అయినా, దీపం మాట వారిద్దరిలో ఒక్కరూ అనుకోలేదు. ఏదో ఆలోచనలో బడ్డారు. తటాలున అన్నది ఆఅమ్మాయి:"మరి, మరి, మీకు వొంటరిగావుండడం కష్టంగాలేదూ, మెడ్రాసులో?"

అట్లా అడుగుతుందని అత డనుకోలేదు. ఏమి చెప్పడానికీ తోచిందికాదు; అయినా చెప్పకతప్పదు.

"నిజమే. ఉంటుంది. ఆ అనుభవం ప్రస్తుతం మీకుకూడా వున్నట్టుందే?" అన్నాడు సమాధానంగా.

"అయితే యిద్దరం కలిసి వొంటరితనాన్ని......"

గభాలున గదిలో ప్రవేశించి గాలికెరటం ఆ మాటల్ని చెదరివేసింది.

"ఏమిటి, అంటారు?" అన్నాడు.

"ఇద్దరం కలిసి.........చప్పుడు, చప్పుడు...... వచ్చాడు, వచ్చాడు."......అని అవ్యక్తంగా కేకలేస్తూ భయంతో అతన్ని గట్టిగాపట్టుకుంది.

అతని కేమీ తోచిందికాదు. శరణార్థి యైన ఆ అమ్మాయిని అతను కౌగిట్లో గట్టిగా దాచిపెట్టి— "భయంలేదు. ఏదోచప్పుడు. ఏమీలేదు." అన్నాడు.

"కాళ్లచప్పుడు, కాళ్లచప్పుడు. వచ్చాడు, వచ్చాడు." అన్నది రుద్ధస్వరముతో.

అతను నాలుగువైపులా చూచాడు. నాలుగు మూలలా పరికించాడు. ఎవ్వరూ లేరు. కాళ్లూలేవు; చప్పుడూ లేదు.

"ఎవ్వరూ లేరు. వీథిలో పొయ్యేవాళ్ల కాళ్ల చప్పుడు, బహుశః. భయం లేదు." అంటూ ఆమెభుజాన్ని నిమిరాడు.

ఆమె తల అతని వక్షస్థలంమీద ఆనుకుంది. చేత్తో కళ్లుమూసుకున్నది.

ఇంతలో ముసలమ్మ లైటు తెచ్చి అక్కడ పెట్టి వెళ్లిపోయింది. వీళ్లని గమనించనేలేదు.

లైటువెల్తురు చూచి ఆ అమ్మాయి గభాలున అతని కౌగిట్లోంచి లేచి పెడముఖం పెట్టి నిలబడ్డది. వెండ్రుకలన్నీ చెదరినై. చీర నలిగింది.

"ఎవ్వరూ లేరు. చూడు" అంటూ అత నామె చెయ్యి పట్టుకుని వరాండాలోకి పోయి చూచాడు. ఎవ్వరూ లేరు. ఆమె కళ్లల్లో బెదు రింకా తగ్గలేదు.

ఆ అమ్మాయి వరాండా పిట్టగోడ నానుకుని నిల్చున్నది. అత నామెప్రక్కగా నిలబడ్డాడు. మెట్లదగ్గరున్న ద్రాక్షపందిరిలోనుంచి వెన్నెల వారిమీద పడుతోంది.

"ఎందు కంతభయం......ఎవరు వచ్చారని?"

"అతను. అతను......" అంటూ అతని చేతిని గట్టిగా పట్టుకుంది. తిరిగి బెదిరిపోతుందేమోనని అత డామెను రెండుచేతుల్తో పట్టుకున్నాడు. ఆఅమ్మాయిగూడా తన రెండుచేతుల్తో అతన్ని పెనవైచింది. మరి అయిదునిమిషాలవరకు అదే పోజు.

* * *

ఆ అమ్మాయికి యిక కాళ్లచప్పుడూ వినబడలేదు.

* * *

# సావిత్రీ సతీత్వము

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

౧

మన దేశమునందు సావిత్రీచరిత్రము నెఱుఁగనివారు లేరు. పిల్ల లాడెడి ఆటపాటలు, పామరు లాడెడి వీథినాటకములు, హరిదాసులు జరిపెడు హరికథాకాలక్షేపములు, విద్యాధికు లాడెడి ఆంగరంగవైభవోపేతములగు సుప్రసిద్ధనాటకములు, సినిమాలోని మూగబొమ్మలు, వేయేల - ప్రజారంజకమగు ప్రతికాలక్షేపమునందును సావిత్రీచరిత్రము చర్వితచర్వణముగా ప్రజలచే గౌరవింపబడుచునే యున్నది. ఈవిధముగా నవ్యక్తులగు బాలబాలిక లాడెడి ఖేలనములు మొదలుకొని కళాప్రవీణుల నాట్యపరిషత్తులవఱకును నెల్లరచే పూజ్యతమముగా నెన్నబడుచున్న ఈ సావిత్రి చరిత్రమునందు గల విశేష మేమి? ఆమె పాతివ్రత్యమహిమచే దండధరుని దర్శించి పెనిమిటి జీవములను గొనివచ్చుటయేనా? ప్రజలకు పరిచితమగు విషయ మిదియేకాని సావిత్రీచరిత్రమును పరిశీలించినచో నింతకంటె నధిక విషయములుగూడ కలవు. ఏవ్యక్తి జీవితమునందైనను మనుజుల నధికముగా నాకర్షించునది యావ్యక్తియొక్క అపూర్వత్యాగమే. త్యాగముకంటె ప్రజాహృదయము చూఱగొనగల విషయము మానవజీవితములో వేఱొండు లేదు. అట్టిత్యాగము సావిత్రిజీవితమునందు మిక్కిలి పిన్నవయస్సుననే ప్రదర్శితమైనది. మఱియు అవివాహితలు, వివాహితలు, పూర్వసువాసినులునని ముత్తెగలుగా నున్న స్త్రీజాతి కంతకును నాదర్శనీయములగు విషయములు పెక్కులుగూడ నామె చరిత్రమునందు గలవు. ఆవిషయము లెట్టివో, భారతములోని సావిత్రీచరిత్రముతో పరిచయము కలుగఁజేసికొనుచు నించుక పరికింతము.

మద్రదేశాధీశ్వరుండైన అశ్వపతియను రాజేంద్రుడు పదునెనిమిదేడులు సావిత్రీదేవినిగూర్చి తపంబుచేయ జనించిన తనయ సావిత్రి. ఇట్టి కలుగకకలుగక కలిగిన బిడ్డను తలిదండ్రు లెంత గారాబముగా పెంచుదురో చెప్పవలయునా? సాధారణముగా గారాబముచేసిన పిల్లలు చదువురాని మంకుపిల్ల లగుదురు. కాని సావిత్రి కట్లు విద్యావినయములకు కొఱతగాలేదు. సర్వవిషయములలో అసదృశ యనిపించుకొనినది. తమ కొమార్తె మంచి విద్యాబుద్ధులుకలది కావలయుననిన తలిదండ్రుల కామె తొలుత సంతసముకూర్చెను. కాని తరువాత విచారకారణ మయ్యెను. ఏలనన, ఇంత మంచిబాలకు తగినవరుడు దొరకవలయునుగదా! లేకున్న ఆమె విద్యావినయములు అడవిగాచిన వెన్నెలయేగదా! కావుననే

"కోరి జనపతి దనహార్మ్యసూతు జూచి
గుణవయోరూపముల కనుగూలుడైన
భర్త నెమ్మెయి దీనికి బడయువాడ
నొక్కొ యనియెందు దడవుచుండె"

౨

ఇట్లుండ నొక్కనాడు నారదమహర్షి అశ్వపతిగృహంబున కరుదెంచి యారాజేంద్రునిచే సత్కృతుండై యుచితప్రసంగము చేయుచున్నాడు. ఆసమయంబున రాకుమారియగు సావిత్రి నెచ్చెలిపిండుతో వచ్చి తండ్రికి మ్రొక్కినది. మహారాజగు అశ్వపతి కాపుత్రికామణిపై ప్రగాఢవాత్సల్యము. కాన పాదముల కెరగిన కొమార్తెను ప్రేమంబున లేవనెత్తి తల నిమురుచు, వెన్ను నిమురుచు ప్రక్కను కూర్చుండబెట్టుకొనినాడు. వివాహయోగ్యయైన కన్యను గాంచినప్పుడే బాల కెక్కుడైన దగిన వరుని జూచితివా యని ప్రశ్నించుట సాధారణమేగదా! అటులనే నారదమహర్షి వివాహయోగ్యయైయున్న సావిత్రి నరసి "ఇక్కన్నియం దగిన వరున కొసంగక యిల్లేల యునిచినాడ" వని యశ్వపతిని ప్రశ్నించినాడు. అందులకు జవాబుగా అశ్వపతి తానక్కడక్కడ విచారించిన సంబంధముల నేకరువుపెట్టలేదు. మఱియు కన్యకు స్వాతంత్ర్య మిచ్చినంతనే కులమును, విద్యయు చూడక ఎవడు చక్కనివాడుగా నున్న, వానినే వరించునని యీకాలపు పూర్వాచారపరాయణులవలె భయపడి విపరీతవాదమునుగూడ నేయలేదు. విద్యావినయసంపన్నయగు తన కుమారి యనురూపవరుని వరింపజాలునని యాయనకు దెలియును. కాన నారదమౌని సమక్షమున నాతడు సావిత్రిం గని

---

"తల్లి ! నీగుణరూపవృత్తముల కెందు
దగిన వరు నీవ యిమ్ముగ దడవి నెమ్మి
నీమనస్సునకెక్కిన నృపకుమారు
గోరి వరియింపు మిదియ నాకును బ్రియంబు"

అని యింపుమీర బల్కినాడు. చూడుడు అశ్వపతి ఉచితజ్ఞత! 'నీగుణరూపవృత్తములకు దగిన నృపకుమారు నీవ విచారించుకొనుము,' అనినాడు. 'నీగుణరూపవృత్తముల' కనుటచేనీవుమంచి గుణవంతురాలవు గనుక అట్టి గుణవంతునే విచారించుకొనుమనియు, 'నృపకుమారు' డను

టచే అత డితరకులజుడు కాగూడదనియు, తండ్రి తన యభిప్రాయమును వెల్లడించినాడు. ఇదియొకవిధముగా భావగర్భితమైన సలహో. అంతకంటె విపరీతాధికారమును తనతలపై వేసికొనలేదు. తండ్రియైనవాడు కన్యాక్షేమార్థి గనుక యుచితానుచితములను మృదులముగా తెలియజెప్పవలయునుగాని కన్యయనగా తనయింటగల జడవస్తుసముదాయములలో నొకటియనియు, తనసొత్తయిన ఆపదార్థమును తా నేవిధముననైన నిరంకుశముగా వెచ్చపెట్టవచ్చుననియు సావిత్రితండ్రి భావింపలేదు. అహో! నేటి తలిదండ్రులకును నాటి తలిదండ్రులకును ఎంతవ్యత్యాసము!

తండ్రి యిట్లు చెప్పగనే కన్యకాసహజమైన బిడియము విడుచక సావిత్రి నావరించినది. కాని వరనిర్ణయభారమును ఉచితజ్ఞుడగు తండ్రి తనపైనే యిడుటచే సావిత్రి సిగ్గునించుక దొలగించుకొని తాను వరించిన నృపకుమారుని నామధేయ మెఱిగించి యాతని తండ్రియగు సాళ్వభూపతి వైరిహృతరాజ్యుండును విగతనేత్రుడును నై భార్యాపుత్రసహితంబుగా కాననంబున వసించుచున్నాడనియు, అయినను నే నాతనినే వరియింతుననియు దృఢంబుగా బల్కినది. కుమార్తెయొక్క అభిప్రాయము తెలియగనే మద్రభూవరుడు నారదుని వంకజూచి, "సంయమిచంద్రమా! మాసావిత్రి చెప్పిన చిన్నవాడు మంచివాడేనా?" అనినాడు. తత్క్షణమే నారదుడు, "రాజేంద్రా! మీసావిత్రి వరించిన రాకుమారుడు ద్యుమత్సేనుని తనయుడైన చిత్రాశ్వుడనువాడు. నిత్యసత్యవాదియగుటచే సత్యవంతుడను ప్రసిద్ధుడైనాడు. ఆతని విద్యాగుణరూపశీలవిశేషంబు లసదృశములు" అని నారదుడు చెప్పుచుండగనే అశ్వపతిమోము వింతగా వికసించినది. సావిత్రిసంతసము మేరలుమీఱినది. కాని సత్యవంతునిగూర్చి చెప్పుట నారదున కింకను పూర్తిగాలేదు. కాన తుదివాక్యముగా నాత డిట్లు పల్కినాడు: "వానియందు గీడు నొక్కటి గలదు. నేడుమొదలుగా నొక్కసంవత్సరంబునకు మృతిబొందు. ఇది నీకు జెప్పవలయుటజేసి చెప్పితిని". అశ్వపతి గుండె లవిసిపోయినవి. ఆయువు కొంతయుకాని వానియం దెన్ని యోగ్యత లున్న నేమి? అట్టియల్లుని గోరెడి మామ యెందైన నుండునా? కాన కూతుమొగంబు జూచి, "తల్లీ! ఇమ్మహాత్ముండు దేవరహస్యంబు లెఱుంగు. ఈతని వచనం బమోఘంబు. నీకు నట్టివరుం డేల? ఒండొక్కవరుని వెదకికొమ్ము" అని పల్కినాడు అశ్వపతి.

దేవరహస్యవేదియగు నారదమౌని తానువరించిన నృపకుమారునకు ఒక్కవత్సరంబుకన్న నెక్కువాయువు లేదనుచున్నాడు. అట్టి ఆయుర్విహీనుని వరింపనేల? వేఱొకని వరింపుమని తండ్రి హితము గఱపుచున్నాడు. తన మనంబో, ఇదివఱకే సత్యవంతునియందు లగ్నమైనది. తా నిప్పు డేమి చేయవలయును? సావిత్రి కిది యగ్నిపరీక్ష. సత్యవంతుడు రాజ్యచ్యుతుడై దారిద్ర్య మనుభవించుచు కాననంబున వసించుచున్నాడు. విద్యావినయసంపన్నుడగు నాతనియందుగల దారిద్ర్య మామె లెక్కసేయలేదు. కాని, ఏరాజకుమారుడు గుణరూపవిద్యావిశేషంబుల నసమానుడని తాను వరింప నెంచెనో, ఆతనితోడి సాంగత్యము తన కొక్కవత్సరమైనను లేదని నారదమౌని దృఢంబుగా బలుకుచున్నప్పు డేమిచేయనగును? ఆతనిని పెండ్లాడుట వైధవ్యమును కొనితెచ్చుకొనుటగాని వేఱొండు కాదుగదా! చూచిచూచి దుర్భరమైన వైధవ్యావస్థ తలపై వేసికొను టెట్లు? కాని యీ భవిష్యదాపదలను తలంచి సావిత్రి భీతురాలు కాలేదు. తనమనం బిదివఱకే సత్యవంతునకు సమర్పింపబడియుండుటచే బాహ్యతంత్రమగు వైవాహికక్రియ జరుగకున్నను తా నాతనిని పెండ్లాడినట్టులే. అట్టిచో నాతడు విగతజీవు డయ్యెనేని తాను భర్తను గోల్పోయినట్టులే. అట్టిచో వివాహతంత్రము జరుగకుండ నాపిన ఫలమేమి? మనోదత్తవాగ్దత్తక్రియాదత్తములలో నుత్కృష్టమైనది మనోదత్తమే. కాన తనచే వరింపబడిన రాకుమారుని జీవిత మత్యల్పమని తెలిసియు మఱొకని వరించుటకై యత్నింపక సావిత్రి తండ్రిం గని,

"వినుము మనోవాక్కాయము
లన మూడు దెఱంగులందు నంతఃకరణం
బనఘ ప్రధానము గావున
మనమున నైకొన్నభర్త మానందగునే!

కాన సత్యవంతుం డెట్టివాడైన నగుంగాని రాజా నింక నొరుల వరియింపను" అని పల్కినది. త్రికరణములందును శ్రేష్ఠమైన మనంబునకు సావిత్రి యిచ్చిన ప్రాధాన్యము ప్రశంసనీయమైనది. అది తండ్రికి గూడ ధర్మయుక్తముగనే తోచినందున కాదనజాలకపోయినాడు. కాని అల్పాయుష్కుడగు వరుని దలంచిన మనస్సు తల్లడమందుచున్నది. కాన నేమియు దోచక మద్రేశుడు 'కన్యనిశ్చిత మిట్లున్నది; వరుని యాయు వట్లున్నది. ఇక చేయవలసిన దేమి?' అని ప్రశ్నించినట్లుగా నారదునివంక జూచినాడు. నారదుడుమాత్ర మేమిచెప్పగలడు? ధర్మయుక్తమైన సావిత్రి వచనంబులు ధర్మవిదుండగు నారదుడుమాత్రము కాదనగలడా? కాన సావిత్రిని ప్రశంసించుచు,

"గానముల ప్రోక నీ యనుగుగూతురు దీనితలంపు మాన్పగా
మనకు నశక్య మింక ననుమానము లేల నరేంద్ర యింతి జ
య్యన నృపబాలకి కిమ్ము కమలాననచేసిన పుణ్యగౌరవం
బునవయినం బ్రియుండు పరిపూర్ణచిరాయురుపేతుడయ్యెడున్.

ఆమెచేసిన సుకృతము మంచిదైన నతడే బాగుండును. ఇచ్చివేయు"మని నారదుడు ఆమె అదృష్టమును ఆమెనెత్తిమీదనే వేసి వెళ్లిపోయినాడు. అశ్వపతియు కొమార్తెయిష్టప్రకారము వర్తించుట కనుమతించినాడు.

అహో! అశ్వపతి ఓర్పు, నేర్పు, ఔదార్యము! ఎంత సంస్తవనీయములో కనుడు! బాలిక వివాహవిషయములో కన్యకంటె తన కెక్కువ బాధ్యత లేదని యాతడు క్రియారూపముగా జూపుచున్నాడు.

తొలుత కొమార్తెకు వివాహవిషయములో సంపూర్ణమైనస్వాతంత్ర్య మిచ్చినాడు. ఆమె వరించిన రాకుమారుడు దైవికముగ రాజ్యవిహీనుడును దరిద్రుడును నైనాడు. దానికిని తండ్రి యాక్షేపింపలేదు. తరువాత యాతడైనను అల్పాయుష్మంతుడుగా డని నారదునివలన తెలిసినది. అప్పుడుమాత్రము 'అమ్మాయీ! వేఱొకని వరించగూడదా?' అని మాటమాత్రముగా తన అభిప్రాయమును తెలియబఱచినాడుకాని నిశ్చితచిత్తముగల సావిత్రి తన యభిప్రాయము వెల్లడించిన వెనుక ఆయన మరల మాటలాడలేదు. చూడుడు, ఎంత ఉచితజ్ఞుడో! ఇట్టిసందర్భముననే సంయుక్తజనకుడగు జయచంద్రుడు తన కహితుడగు పృథ్వీరాజును సంయుక్త వరింపగా నందులకు గినిసి యామెను పరిపరివిధముల నవమానించి తుదకు కూతు, నల్లుని నాశమొనర్చి, తానును జచ్చి, ఉభయకుటుంబములను నాశ మొనర్చెను. ఇప్పటి మనకాలపు జనకులు ప్రభుత్వదండనకు వెఱచియో, ప్రజలకు వెఱచియో అట్టి హత్యాక్రియలు జరుపకున్నను, కూతురుచెవి మెలివేసి మఱొకనికి తప్పక యిచ్చివైతురు. అయినను ఆబాధగూడ వారికి లేదు లెండు! వారికి కొమార్తె నడుగవలసిన పనియే లేదు. ఒకవేళ అడిగినను సావిత్రివలె విద్యావివేకములు లేని పసిబాలలుగదా ఈకాలపు పెండ్లికూతుండ్రు! వారి కేమి తెలియును? సరి, ఇక ప్రస్తుతాంశమునకు బోవుదము.

## ౩

సావిత్రిని సత్యవంతున కిచ్చుటకు అశ్వపతి నిశ్చయించినాడు. కాని పెండ్లియెచ్చట? నారలు గట్టి కూరలశనంబుగ నుగ్రవనంబులో నున్న యాద్యుమత్సేనమహారాజు కుమారుని వివాహమునుగూర్చి కలనైన తలంచియుండలేదు. భగవంతుడు పెట్టిన పెండ్లిగడియ వచ్చినప్పు డొకరి యత్నములేకనే పెండ్లిం డ్లగుచుండును. శుభముహూర్తము తానే చూచుకొని, ఉభయమంగళసూత్రములు తానే చేయించుకొని, పెండ్లికి కావలసిన సర్వసంభారములు, మంగళవాద్యములు తానే తీసికొని, పెండ్లికొమార్తెను, పెండ్లిపెద్దలను వెంటనిడికొని శాల్వాపహృతరాజ్యుండును, విగతనేత్రుండును నై కాననంబున తపస్స్థితి నున్న యాద్యుమత్సేనునికడకు తానే వచ్చినాడు మద్రేశుడైన అశ్వపతి.

ఆకోలాహలంబు విని సంభ్రమంబుకెంది ఆసందడి యేమియని యోచించుచున్నాడు ద్యుమత్సేనుడు. ఇంతలో అశ్వపతి యాతని సన్నిధికివచ్చి కొమార్తచే యాద్యుమత్సేనమహారాజునకు నమస్కారంబు సేయించి, 'నాపుత్రికయైన సావిత్రిని నీకుమారున కిచ్చి పరిణయంబుసేయ నాయత్తుడనై వచ్చితి' నని తా నేతెంచిన కారణము చెప్పినాడు. మఱియు 'నీకొమరుడైన సత్యవంతుడును, నాకొమరితయైన సావిత్రియు సాటిలేని గుణవంతులు, సమానరూపవంతులు; ఒకరి కొకరు తగుదురు. కాన ఈవివాహమునకు మీరు తప్పక అనుమతింపవలయు'నని తనయభిప్రాయమును అత డడుగకుండనే అసందిగ్ధముగ వివరించినాడు. ఆమాట వినగనే ద్యుమత్సేనునకు కడు భయ మైనది.

సావిత్రి కడుసుకుమారి; గోముగా పెరిగినబాల. తలిదండ్రు లతిప్రేమంబున లాలించుచుండ, అసంఖ్యాకదాసదాసీజనంబులు సమస్తోపచారంబులు సల్పుచుండ మహావైభవోపేతంబులగు రాజభోగంబుల ననుభవించుచున్న రాజపుత్రి. ఎండ కన్నెఱుగని యాసుకుమారకన్యకారత్నము తమకు కోడలినిగా జేసికొనినచో నట్టడవిలోని యీపర్ణకుటీరమునందు తమతోబాటు కాయగసురులు దినుచు నుండజాలునా? ఇట్టి సందేహంబు లనేకంబులు మనంబున గలుగుటచే "సుకుమారియగు మీపుత్రికారత్నము మాతోబాటు టీవనవాసక్లేశముల నోర్వగలదా?" అనినాడు ద్యుమత్సేనుడు. శంకాసంకలితంబులగు నప్పలుకులకు కొమార్తె యోగ్యతయందు పరమవిశ్వాసముగల మద్రపతి తత్క్షణమే యిట్లు ప్రత్యుత్తర మొసంగినాడు:

"కలిమియు లేమియుఁ గ్రమము గా వచ్చెడివచో తెలంగుచుం
గలుగుచు నుండు ధీరుల ప్రకారమె లెస్సగ నింతపట్టునే
తెలియును జెప్పెదన్ వసుమతీశ్వర విన్నయనంగ నేరనే
కొలదియు గాదు ధీరమతి గూతురు శేర్కొనజాలు చెంపునన్".

మఱియు,

నీతోడ వియ్యమందం
జేతోగతి నాసజేసి చెచ్చెరనిట్లే
నేతెంచితి మత్ప్రార్థన
బ్రాతిగ జేకొనక యునికి పాడియె నీకున్"

అని ప్రార్థించి నిష్ఠురము లాడినాడు, ఇక కాదను టెట్లు?

## ౪

సావిత్రీసత్యవంతుల వివాహము మహావైభవముతో జరిగినది. కూతునకును, అల్లునకును వస్త్రాభరణాదు లనేకంబులు బహుమానంబులుగా నొసంగి సావిత్రి తలిదండ్రులు తమ దేశంబునకు వెడలినారు. కాని వనవాసినియగు సావిత్రికి వస్త్రాలంకారము లేల? ఆ చీనిచీనాంబరములు, ఆమణిమయాభరణములు, ఆరాజభోగములు, ఆనవరతాన్నములు క్షణములో పరిత్యజించి వల్కలాజినవసనయై వదలక అధికభక్తి భర్తృశుశ్రూషాపరత నున్నది సావిత్రి అకోడలు గావించెడి సముచితోపచారములకును, వినయప్రవర్తనమునకును పరితృప్తమానసులై యానందసాగరమున నోలలాడుచున్నారు అత్తమామలు. పుడమిపై నడుగిడియెఱుగని యారాకుమారి మృదులపాదములు ఆశ్రమప్రాంగణమునందలి కఱకు టిసుకపై నడచుటచే నెఱ్ఱగ కందుచున్నవి. జలకలశంబులు గొనివచ్చుటచే యామె భుజాగ్రంబులు నొచ్చుచున్నవి. స్థలభాండపారిశుద్ధ్యకృత్యంబులచే పల్లవసదృశంబులగు నామె కరంబు లరుణంబు లగుచున్నవి. కాని సావిత్రికి మనంబుననైని యసంతృప్తి లేదు, విచారము లేదు. పితృమందిరమున సమస్తరాజభోగంబు లనుభవించుతఱి యెట్టియుత్సాహము, ఎట్టి యానందము ఆమె మోముపై తాండవించుచుండెనో, అట్టియుల్లాసమే యిప్పుడును. మనుజుని కష్టసుఖము

లకు తావలము సేయునది మనస్సుగాని కలిమిలేములుగావు. పరితృప్తమైన మనస్సునకు సుందరకౌశేయములైన నొక్కటే; వల్కలాజినములైన నొక్కటే. నవరసాన్నములైన నొక్కటే; కందమూలములైన నొక్కటే. రాజమందిరములైన నొక్కటే; పర్ణకుటీరములైన నొక్కటే. సావిత్రి యట్టి పరితుష్టచిత్తయగుటచేతనే సుఖమారియయ్యె, వనవాస మామె కానందమునే గూర్చినది.

## ౫

ఎన్ని పనులు చేయుచున్నను, ఏవిధముగా వసించుచున్నను, నారదుడు చెప్పిన గండప్రదినము నేమఱక సావిత్రి లెక్కించుచునే యున్నది. సరిగా గడువుకాలము నాల్గుదినములలోనికి వచ్చినది. పరమనిష్ఠతో భగవతిని ప్రార్థించుటయే కర్తవ్యమని నిశ్చయించుకొనినది. కాని మనోవాక్కాయముల స్రుక్కింపక యెట్టివారికైన భగవద్భక్తి లభ్యపడునుగదా! కాన సావిత్రి త్రిరాత్రోపవాసవ్రతమునకు బూనినది. సావిత్రి యుపవాసవ్రత మామెయం దత్యంతవాత్సల్యముగల మామగారి మనంబును సంచలింపజేసినది. కాన "అమ్మా! ఇట్టి కఠినవ్రతంబునకేల బూనితి" వని ప్రేమంబున ప్రశ్నించినాడు. కొమరునిపై తన యత్తమామలకుగల వాత్సల్యము సావిత్రికి తెలియును. వారికతడే జీవము. అట్టి వారిప్రాణములకు ప్రాణమైన కుమారుని మృత్యువర్తమానమును వారి కెఱిగించినచో వారప్పుడే యసువులను వీడరా? కాన తన ఉపవాసవ్రతకారణమును వారి కెఱిగింపక "నావ్రతభారంబునకు మీరు చింతింపవలదు. పరమశుభములు గోరి నేను దీనిని బూనితి" నని ప్రత్యుత్తర మొసగినది.

ఉపవాసవ్రతదినములు మూడును గడచిపోయినవి. నాల్గవదినము వచ్చినది. ఆదినమే తన వైదుపతనమును తుదముట్టించు దుర్దినము, నాడు సావిత్రి మిక్కిలి వేకువనే లేచినది. కాని మనస్సులో తుదిలేని సొద. కాలు సాగదు. అత్యంతమైన తొట్రుపాటు. కాని ఆమనస్సులోని వేదన నొక్కింతయైన నితరుల కెఱిగించుట వీలులేదు. ఎంత బాధయైన మనంబుననే ఇముడ్చుకొనవలయును. క్షమాశీలయగు సావిత్రి యాకష్టము నించుకేని బయల్పడకుండ నెప్పటియట్టులు ప్రాతఃకృత్యములను నిర్వర్తించి యత్తమామలకును, భర్తకును వలయు సపర్యలు గావించినది. మరల దేవీపూజకు సన్నాహపడుచున్నది. కాని మనస్సులోని యారాటముమాత్ర ముడుగుజాడ లేదు. ఏయాపద రానున్నదో, ఆయాపదను తొలగించెడు చల్లని యూరటవాక్యము కొఱ కామెమనస్సు పరితపించుచున్నది. కాని కష్ట మిట్టిదని చెప్పిన గదా, దాని కెవ్వరైన పరిహారముగాని, ధైర్యముగాని చెప్పుదురు! తనయాపద నొరుల కెఱిగింపరానిదిగా నున్నది గదా! ఇక నామె నోదార్పువచనంబు లాడువా రెవ్వరు? నిత్యము అత్తమామలకును, ఆశ్రమవాసులగు తక్కిన పెద్దలకును నమస్కరించుట సావిత్రికి వాడుక. ఆదినమును వారికి నమస్కరించినది. వారెల్లరు సౌభాగ్యవర్ధనంబుగ దీవించినారు. క్షుధాపీడితునకు రుచ్యాహారమువలె నా పెద్దలయాశీర్వచన మామె కెంతయో ఆప్యాయముగా నుండెను. కాన నాడు పెద్దలగు వారికెల్ల పదింబదిగ మ్రొక్కి, వారిచే పలుమారు 'సౌభాగ్యవతీభవ' యనిపించుకొనినది. 'ఇంతమంది పెద్దల యాశీర్వచనము పొల్లువోవునా? నాసౌభాగ్యమునకు మోసము వాటిల్లునా?' అని తనమనంబున తానే సంతుష్టి నందినది. త్రిరాత్రోపవాసవ్రతము పూర్తియగుటచే నాల్గవనాడు పారణము సేయుమని మామగారు సావిత్రికి జెప్పిరి, "నే నీదినము సూర్యాస్తమయమైన వెనుకగాని భుజింపరాదు. నేను వ్రతారంభమున చేసికొనిన నియమ మిది" అని సావిత్రి వాక్రుచ్చినది.

## ౬

తలిదండ్రుల అగ్నిహోత్రాదికంబులకు సమిత్కుశాదులను, పూజలకు పత్రపుష్పంబులను, ఆహారంబునకు ఫలమూలాదులను తెచ్చుట మునికుమారుల వంతు. సత్యవంతుడుగూడ ప్రాతరనుష్ఠానంబులు దీఱగనే నిత్య మదియే పని చేయును. కాన నాడును త్రాడు, చిక్కము, గరిడి, గొడ్డలి మున్నగు వస్తువులు తీసికొని యడవికి బయలుదేరినాడు. నాడు భర్త నొకక్షణమైనను విడనాడుటకు సావిత్రి కిష్టము లేదు. కాన తానుగూడ భర్తతో బాటడవి కేగదలంచినది. ముందుగా మగని నడిగినది. "సావిత్రీ! మూడుదినములనుండి యుపవాసముచేసి మిక్కిలి శ్రమగొనియున్నావు. కోరకకోరక నేడడవిమీద గోరి కేల? ఈదినము మానుము, ఱేపు తప్పక తీసికొనివెళ్లెద" నని నాడు సత్యవంతుడు. "మీరుపోబోయెడి యరణ్యము కడు సుందరముగా నుండునట! దానిని చూడవలయునని నాకు మిక్కిలి కుతూహలముగా నున్నది. ఉపవాసపు బడలిక నా కీమాత్రము లేదు. నా కెట్టులైన ఆయడవిని చూపరా? నాచనవు దీర్పరా?" అని పెనిమిటిని వేడికొనినది సావిత్రి. ఇక ప్రేయసికోరికను నిరాకరించుటకు చిత్రాశ్వునకు బుద్ధిపుట్టలేదు. కాన "అటులయిన మాతలిదండ్రులకు జెప్పి వెళ్లుదము ర" మ్మని భార్యను వారికడకు గొనిపోయినాడు. సతీపతు లిరువురు వారి పాదంబులకు బ్రణమిల్లిన వెనుక సావిత్రి తనకోరిక నత్తమామల కెఱిగించినది. ఎన్నడును, ఏదియు నడుగుట యెఱుగని సావిత్రి నేడు కాననంబును చూడ గోరుటవలన వారును కాదనలేదు.

## ౭

"సావిత్రీ! ఇదిగో! ఈ కమలాకరంబున రాజహంస లెట్లు విహారంబు సలుపుచున్నవో చూచితివా! అహో! ఈ ఫలవృక్షంబున ఆకులే గానవచ్చుట లేదు; ఎటుచూచిన పండ్లు, కాయలే. ఇదిగో! ఈతీగ నెల్లెడలను విరబూచిన పువ్వులలోని మకరందము త్రావి యీ తేటితండము లెట్లు ఝుంకారము సేయుచున్నవో కనుము! ఇదిగో! యిటునిటు, దోరపండ్లను తెగతినిన యాచిలుక లెట్లు రొదసేయుచున్నవో!" అని అరణ్యముజూడ నేతెంచిన ప్రేయసికి వేడ్కలు జూపుచున్నాడు సత్యవంతుడు, కాని సావిత్రి కాతనిపలుకులు చెవి

దూరుచుండే లేదు. ఆవిషిన సౌందర్య మంతకంటె కన్నులకు పొడకట్టుట లేదు. చూపినవాని కాపేక్షయు లేదు; చూపనివానికి విచారము లేదు, ఆతడు చెప్పెడుమాటలకు, చూచెడువస్తువునకుగూడ ఒక్కటే అర్థము లేని "ఊ! ఊ!". ఆమె రెండుకన్నులు పెనిమిటిముఖముమీద; ఆమె చిత్తమంతయు రాగల యాపదమీద.

సత్యవంతుడు పండ్లుకోసి గరిడి నింపినాడు. కుశలుకొన్ని త్రుంచి కట్టకట్టినాడు. ఇక కాష్ఠఖండనంబు సేయవలయును. ఒకఎండు మానును చూచి కొట్టుటకై గొడ్డలిని చివ్వన పైకెత్తినాడు. కాని వ్రేటు పడలేదు. చేతులు చచ్చుకొనిపోయినవి. గొడ్డలి నేలబడినది. ముఖమున కళ దప్పినది. ఆయాసము పుట్టినది. పాపము! సత్యవంతునికి రావలసిన యాపద రానేవచ్చినది.

> "ఒడలుపళెంబుగాదు భ్రమ నొందినయట్లు మనంబు దూలెడిం
> గడుశిరంబు శూలవిశిఖప్రకరంబున నొంచినట్టిన
> య్యొడు నిలువంగనోర్వ నోక యుంచుకసేపు శ్రమంబుదీఱని
> యొడ శయనింతు"

నని సత్యవంతుడు వచ్చి సావిత్రితొడలపై శిరంబుమోపి వ్రాలినాడు. ఏప్రాణేశ్వరుని యసువుల నిలుప దాను మహావ్రతము సలుపుచున్నదో, ఆప్రాణేశ్వరుడు తన కన్నులయెదుటనే, తనతొడలమీదనే వ్రాలి, సోలి నిశ్చేతనుడైనాడు. ఇక చేయవలసిన దేమి? ఆభయంకరగహనంబున నిక దిక్కెవ్వరు? తన జన్మదాయినియైన భగవతియనుగ్రహ మేమైనది? తన సుకృతవిశేషంబుచేతనైన విభుండు పరిపూర్ణ చిరాయురుపేతుడయ్యెడు నని యూహించిన నారదమునితలంపు లేమయ్యె? ప్రొద్దుప్రొద్దుననే లేచి తాను పాదంబులకు బ్రణమిల్ల సౌభాగ్యవర్ధనంబుగ దీవించిన పెద్దల యమోఘాశీర్వచనంబుల ప్రభావం బేమాయె? పరమభక్తితాత్పర్యంబులతో తాను నోచిననోములెల్ల వ్యర్థమై తనకట్టియాపద తప్పకపోయిన నిక వ్రతాదికంబు లొనర్చిన ఫలమేమి? అనిహతాశంబును, శోకదందహ్యమానంబును నగు చిత్తంబున వితర్కించుచు, వెఱ్ఱిచూపులు చూచుచు అట్టే కూర్చున్నది సావిత్రి.

౮

ఎవరియేడ్పు లెట్లున్న నేమి? దండవిధాయి యయినవాడు తన పనిని తాను చక్కబెట్టుకొనవలయునుగదా! విసిగిగాని, జాలిబూనిగాని తనపనియందు ప్రమత్తుడై చరించిన బ్రహ్మదేవు డూరకొనునా? మంచిహోదాగల ఉద్యోగము పోగొట్టుకొనినచో మరల యెన్నిపాట్లు పడినను వచ్చునా? ఈకటికియుద్యోగముపై కన్నువేసియున్నవారు తత్క్షణమే వచ్చి తన్నుకపోరా? కాబట్టి దేవతా-మేజస్ట్రీటైన యమధర్మమహారాజులుంగారు గొప్పవారిని బట్టుటకు గొప్పయుద్యోగియే వచ్చునట్లు పుణ్యాత్ముడైన సత్యవంతునిప్రాణముల గొనిపోవుటకు ప్రధానాధికారియయిన తానే స్వయముగా వచ్చినాడు. నల్లని కాటుకవంటి బలిష్ఠశరీరము, భయంకరమైన తెల్లనికోరలు, కణకణలాడెడి నిప్పుకణికలవంటి ఉజ్జ్వలములయిన కన్నులు, పచ్చని కట్టుపుట్టము, భయంకరమైన వదనము, హస్తంబున నిఖిలప్రాణిచయభీతిదంబగు పాశంబు, ఉద్యోగమునకు దగిన యాకృతి, ఆకృతికి దగిన యుద్యోగము గలిగి జగజ్జనసంత్రాసకరుండైన జముండు సత్యవంతుని జీవహరణార్థంబై యాతని సమీపించినాడు. చేసినయత్నము విఫలమై పోయినది. తన ప్రియపతియైన సత్యవంతుడు విగతజీవుడైన తరువాత తా నింకను బ్రదికినను నొక్కటే, బ్రదుకకున్నను నొక్కటే. జీవములకు జీవమైన జీవితేశ్వరుడు పోయిన వెనుక నామె కింక జీవములపై నాస యేమున్నది? కాలుని కన్నులార చూచినది. భర్తృజీవమును గొనిపోవుట గమనించినది. అధికారియైనవాడు కన్నులబడినప్పుడు, ఆతని వెటరించుటకు జాలనప్పుడు ఆతని యనుగ్రహమునకై యత్నించుట తుదియత్నముగదా! కాన సావిత్రి తనతొడపైనున్న భర్తృశిరంబు క్రిందనిడి, చయ్యన లేచి యాతనికి నమస్కరించి "బాబూ! తమ రెవ్వరు? ఎందునిమిత్తమై యిందులకు విజయముచేసితి"రని వినయంబున ప్రశ్నించినది. "అమ్మా, నేను కాలుడను. పుణ్యాత్ముండగు నీభర్త జీవమును గొనిపోవుటకై వచ్చినాడ" నని మెత్తబడినచిత్తంబుతో ప్రత్యుత్తరంబొసగి, సత్యవంతుని జీవమును పాశబద్ధంబు గావించి యముండు నిజదిశాభిముఖుండై సత్వరమే వెడలిపోవుచున్నాడు. సావిత్రి కేమియు దోచదు. చేతులు వడవడ వణకుచున్నవి. గుండెలు తటతట కొట్టుకొనుచున్నవి. కాళ్లు తడబడుచున్నవి. భర్తను గొనిపోవుచున్న దేవతామూర్తి దృష్టిపథమునుండి తొలగిపోవుచున్నాడు. ఎటులైన నాతనికాళ్ల వ్రేళ్లంబడి, వేడి విభుని జీవమును రక్షించుకొనవలయునని మనంబున వెల్లారాటము. పాపము! సావిత్రి ఆధర్మమూర్తి నొక్కింత ప్రార్థించి మాడవలయు నను కోరికతో ప్రాణేశ్వరు శరీరం బొకచో దాచి యముని వెంబడించినది.

సావిత్రి తన్ను వెంటాడివచ్చుటను యముడు చూచి, "బాలా, నీవేల నావెంట వచ్చుచున్నావు? ఇకముందు త్రోవ నీకగమ్యము. నిలువుము" అనినాడు.

> " పతులెందు జనిన నచటికి
> సతులకు జనవలదె నీ ప్రసాదమునను మ
> త్పతిభక్తికతమునను సం
> తతగతి నాకరుగరాని చోటులు గలవే!

అంతియేకాదు. "సకలమార్గములందును ధర్మమార్గంబు ప్రధానంబు. అట్టి ధర్మంబున కాధారము సజ్జను లని వినుదుము. అట్టి సజ్జనదర్శనం బెప్పుడు వృథగాదుగావున సజ్జనశేఖరుండ వగుదువు నీకైన సందర్శనంబునం బరమశుభంబులం బొందక యేను రిక్తజనంబులతెఱంగున నెట్లు మగుడుదు" నని సావిత్రి జముని ధర్మయుక్తంబుగా బ్రశ్నించినది. సావిత్రి ధీవిశేషం బసమానము. అటు లాతనికి ధర్మమార్గం బుపదేశించుచు నాతని యనుగ్రహముపై విశ్వాసమును సూచించుచున్నది. ఇట్లు తన



గుంటూరుజిల్లా ఉప్పుసత్యాగ్రహుల దళము - గుంటూరు

౧. నాయకుడు: శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణపంతులుగారు. శ్రీ బులుసు సాంబమూర్తిగారికి స్వాగతము చెప్పుటకు రైలుస్టేషనుకుపోవుచున్నారు.

౨. ఊరేగింపు. నాయకుడు: శ్రీ యన్. వి. యల్. నరసింహారావు పంతులుగారు, మునిసిపల్ చేర్‌మెను.















౧. గంజాంజిల్లా ఉప్పుసత్యాగ్రహము మొదటిదళము-బరంపురము: నాయకుడు: శ్రీ యన్. యస్. సోమయాజులుగారు, బి. ఏ., బి. యల్.
౨. విశాఖపట్టణము ఉప్పుసత్యాగ్రహము. ౩. గంజాముజిల్లా ఉప్పుసత్యాగ్రహము-బరంపురమున ఊరేగింపు.
౪. విశాఖపట్టణము-ఉప్పుసత్యాగ్రహము. ౫. విశాఖపట్టణము-ఉప్పు తయారుచేయుట. నాయకులు: శ్రీ తెన్నేటి విశ్వనాథంగారు, శ్రీమంగిపూడి రామచంద్రశాస్త్రిలుగారు. ౬. విశాఖపట్టణము- ఉప్పుసత్యాగ్రహము.

పతీధర్మమును ప్రకటించుచు, తన పతిభక్తిని వెల్లడించుచు, తనకు సాధ్యముకానిది లేదని తన ప్రభావమును వివరించుచున్నది. ధర్మ్యంబులును, పకరుణంబులును నగు సావిత్రివచనంబులు విని యామె కేనేని యుపకారంబు సేయక ముందుకు సాగిపోవ కాల్లాడక యముడు "బాలా, ధర్మయుక్తంబులైన నీవచనంబులకు మెచ్చితిని. కాన నీభర్తజీవము దక్క నొక్క వరం బిచ్చెద, వేడు" మనినాడు. తనయభీష్టమైన భర్తజీవితమును యముం డెడగా నుంచి వరం బిచ్చెద ననినందులకు సావిత్రి యాతనియందసంతృప్తచిత్త కాలేదు; అవిశ్వాసమును జూపలేదు. ఆతని చిత్తానుసారముగా వర్తించుటవలననే యాతని యనుగ్రహమును సంపాదింపనగునని యామె అభిప్రాయము. కాన ఆత డిచ్చిన వరంబు నుపయోగించుకొనుటకు సావిత్రి నిశ్చయించినది. అయిన తాను కోరవలసిన వరం బెద్ది? అందును తాను పతీధర్మంబు మీఱరాదు. సాధ్వీమణులకు భర్తకు తరువాత సేవ్యులైనవారు అత్తమామలు. కాన నయనవిహీనుండై యల్లాడెడి తనమామగారు లబ్ధనయనుడగునట్లు వరంబు కోరినది. "అటులనే యగుగాక!" అని ప్రేతపతి సావిత్రికోరిన వరం బొసంగి తనత్రోవ బట్టినాడు. సావిత్రియు మరల నాతనిని వెంబడించి నడచుచు

"ఎడపక వాఙ్మనఃక్రియల నెరికి హింసయొనర్పబూన రె
య్యెడలను దీనులం గరుణ యేర్పడ బ్రోవన మాట రిచ్చుచో
గడమవడంగ నీ కెదిరి కాంక్షితముల్ దుదిముట్టదీర్తు రె
క్కుడుమదిగూర్తు రాశ్రితుల కుర్వినమిన్నియు నార్యధర్మముల్
నీవెఱుగని దెయ్యది
దేవోత్తమ, ధర్మగతుల తెఱగెల్లభవ
ద్భావాధీనముగుటగా
నే వెలసితి వీవు ధర్మదేవత యనగాన్

సమబుద్ధితోడ ఆయాజీవుల కర్మంబునకు దగిన ఫలమును సమకూర్చుటచే నీవు సమవర్తియని పేరుగాంచితివి. భూతముల యమించుటచే యముడ వనంబడితివి. కల్మషముల శమింపజేయుటచే శమనుడ వైతివి." అని యాప్రేతపతిని పెక్కుభంగుల స్తుతించినది. ఈమాటు సావిత్రి ఆర్యధర్మముల నుగ్గడించుచు ఆశ్రితవాత్సల్యమును నిరూపించినది. మనోవాక్కర్మంబుల నెరికిని హింసయొనర్పరా దనినది. దీనులను బ్రోవవలయు నన్నది. ఒకరి యభీష్టమేదైన నీడేర్పదలంచినచో నది పూర్తిగా నీర్పవలయునుగాని కొఱతలు పెట్టరా దనినది. నీ వీ ధర్మమూర్తివై నప్పుడు నీకు దెలియని ధర్మగతు లేమున్న వనినది. మనోజ్ఞమైన యీసంభాషణంబులు యమునకు సంతసముగూర్చినవి. కాన "హృషితాంగకే పెనను గల్మషరహితంబులైన నీసమంజసభణితులుగ" అని మెచ్చి "ఇంకొక వరము వేడు" మనినాడు. వైరులచే నపహరింపబడిన మామగారిరాజ్యము మరల నాతనికి ప్రాపించుట ద్వితీయవరముగా సావిత్రి కోరినది. అటులనే యని వైవస్వతుడు ముం దడుగువైచినాడు. సావిత్రి యాతని వెంట నడచుచునేయున్నది. సావిత్రి తన్ననుగమించివచ్చుట యమునకు చరణశృంఖలముగానున్నది. మరల ఆగి, "బాలా! ఇక నీవు రావలదు. ఇకముందు మార్గమంతయు దుర్గమంబైనది. నీవటువచ్చు నెలవు లేదు. రాజాలవు." అనినాడు.

"ధర్మాత్ములు దమసలిపెడు
ధర్మక్రియ దప్ప రెట్టి దశలందును నెా
షర్మిరయు దాపము బుట్టవు
ధార్మికహృదయముల బ్రక్రమధర్మాత్మస్థా!

ధార్మికహృదయులకు తాపమోహము లుండునా? మోహావేశులగు వారు ధర్మానుష్ఠానము సేయగలరా? పాతివ్రత్యమునల్పెడు నాకు పతి ననుగమించుట ధర్మమైయుండగా మార్గము సుఖమైనదిగాదని యాతని ననుగమించుట మానితినేని ధర్మమార్గము తప్పినదానను గానా? కాన నాస్వధర్మమైన పత్యనుగమనంబు నెవ్విధంబుననైన, నెట్టిదుష్కరపథంబులందైన మానజాలను." అని సావిత్రి పలికినది, జీవులను శాసించుటయందును, శిక్షించుటయందును వజ్రహృదయుడై ప్రవర్తించెడి దండధరుని చిత్తము సావిత్రిమృదులవచనంబులచే నవనీతసదృశమై కరగి ఆమె దెస కప్రయత్నముగా నాకృష్టంబగుచున్నది. ఆమె ధర్మవాక్యంబులనెడి దిక్కములో పిట్టవలె చిక్కువడిపోవుచున్నాడు యముడు. ప్రకటధర్మని శేషతత్పరయగు నాసాధ్వీమణికి మఱియొక వరమీయ ధర్మునిచిత్తము కుతూహలత జూపినది. "బాలా! ఇంకొక వరం బొసగెదను. నీభర్తజీవముదక్క నేదైన గోరుకొ" మ్మనినాడు. మామగారి క్షేమలాభంబులకై రెండు వరంబులు బడసినది. ఇక తన జన్మమునకు కారకులైన తలిదండ్రులకుగూడ నేదేని వరలాభంబు గలుగజేయుట తనధర్మము. అపుత్త్రకులైనవారికి పుత్రలాభంబుకంటె ఘనమైన వరం బెద్ది? కాన అపుత్రకుండైన తనతండ్రికి పుత్త్రశతలాభంబు ననుగ్రహింపుమని యంతకుని వేడినది. "సరే, నీకోరిన వరంబిచ్చితి నింక వెనుకకు మరలుము. నేడు నీవు చాలాదూరము నడచివచ్చితివి. చాల డస్సియున్నావు. ఇకనైన నీవు నిలుచుట మంచిది." అనినాడు శమనుడు.

"వాకుదప్పి యెక్కడిది మనంబు భర్తృ
చరణపంకజసక్తమై కరము భక్తి
నలరుచున్నది పతులకు ననృ మెట్టి
దియును ధర్మమె భర్తృసంశ్రయమెగాక!"

అని సావిత్రి యమునకు బ్రత్యుత్తర మొసగినది. కావలసిన వరము చేకూరలేదు. అవిమయమై ధర్మున కింకను జయగలుగలేదు. ఇప్పటికే తాను బహుదూరము నడచి వచ్చినది. ఇక నడువవలసినమార్గము కఠినకంటకశిలాపరివృతంబగు దుర్గమప్రదేశము. తాను సుకుమారియగు రాజపుత్త్రి. ఎన్నడును నెట్టికష్టములను ననుభవించియుండనిది. మనస్సులో దుర్భరంబగు పరిభవయోగవ్యథ. ఆపైని త్రిరాత్రోపవాసవ్రతముచే మిక్కిలి నీరసించియున్నది. కేవలము సతీధర్మప్రేరితమైన భర్తృ

నాతనికి సంతుష్టియేగాని కన్నులువచ్చి కొమరుడు కనుపింపకున్న నాతని కేమి సంతోషము? చెప్పవలసినదేమి? ఆతలిదండ్రుల రోదనంబున కంతు లేదు. అర్ధరాత్రమైనది. సావిత్రీసత్యవంతుల జాడ గానరాదు. ఆకస్మికంబుగా ద్యుమత్సేనుని కన్నులు వచ్చుటయు, నిత్యము సంజపడకనే యింటికేతెంచు సత్యవంతుడు నిశీథంబునకైన నింటికి రాకుండుటయు గని సమీపాశ్రమవాసులైన తాపసు లెల్లరు విస్మితచిత్తులై సత్యవంతుని యాగమనంబునకై పలుదెసల వరయుచు వృద్ధుల నోదార్చుచున్నారు.

ఇంతలో సావిత్రీసత్యవంతు లాశ్రమంబునకు జేరుకొనినారు. వారిని జూడగనే వృద్ధుల దుఃఖాశ్రువు లానందబాష్పంబులుగా మారి సత్యవంతుని మూర్ధము నభిషేకించినవి. తరువరి "నాయనా! ఇంతరాత్రి వఱకు నడవి నేమిచేయుచుంటి" వని తలిదండ్రు లడిగినారు. తా నడవికేగి నదిమొదలు కాష్ఠదళనంబునేయబోయి వివశుడై పడిపోవునంతవఱకు చెప్పి తరువాత నేమైనదో నాకెఱుక లేదనినాడు సత్యవంతుడు. సమయోచితముగా తరువాత వృత్తాంతమును పూర్వోత్తరసందర్భములతో మేళవించి తన వివాహమునకు పూర్వమే నారదమౌని సత్యవంతుని గండమునుగూర్చిచెప్పుటయు, చెప్పినను తా నాతనినే వరించి యాతడు మృతిజెందుదినంబును మనంబున లెక్కిడుకొనుచుండుటయు, తా నందులకే యుపవాసవ్రతము బూనుటయు, నా డెల్ల యాతని వందులకే తాను వెంటాడి తిరుగుటయు, తరువాత నాతడు విగతజీవుడగుటయు వివరించి సావిత్రి యనంతరము తాను యముని దర్శించినవిధము, ఆతనిచే దాబడసినవరములు సర్వము చెప్పినది. ఆహా! అప్పు డా యత్తమామలకు గల్గిన యానందము వివరించుటకు సాధ్యముగాదు. కావుననే వారిర్వు రొక్కమాఱుగా

"ఆపత్సముద్రమగ్న•
లై పోయెడు నస్మదన్వయము పెంపెసగం
దేపయయి కడవబెట్టిన
నీపుణ్యచరిత్ర కీర్తనీయము తల్లీ!"

అని ప్రేమాతిశయంబుగా శ్లాఘించినారు. జమునివరములు రెం డప్పుడే సఫలమైనపుడు తక్కినవిమాత్రము తొలంపోవునా? శమనుని వరప్రభావంబున ద్యుమత్సేనునివైరి హతుండగుటయు, పూర్వప్రభునియందు భక్తిగల సాళ్వదేశప్రజలు పట్టపుటేనుగుతో ద్యుమత్సేను డున్నకాననంబున కరుదెంచి యాతని నచ్చటనే పట్టాభిషిక్తుం గావించి పుత్రయుక్తుండగు నాతని పట్టపుటేనుగుపై నెక్కించి మహావైభవంబున నగరంబునకు గొనిపోవుట మఱుదినంబుననే జరిగినది.

"తనమగని నత్తమామల
జననీజనకులను దమ్ము సకలకులంబుల్
ఘనముగ సముద్ధరించెను
జనవర సావిత్రి దక్కుచరితము కంటే!"

అని మహాసాధ్వియగు సావిత్రిచరిత్రమును మార్కండేయమహాముని యుధిష్ఠిరునకు వివరించు నెపంబున లోకంబునకు జాటినాడు.

## ౧౦

తపస్వినియగు సావిత్రి చరిత్రము ముగిసినది. అవివాహితయై వరాన్వేషణారంభమునుండి గతించినభర్తను బ్రదికించుకొని ఆశ్రమంబునకు జేరువఱకును సావిత్రివర్తనము స్త్రీల కాదర్శమైనదే. అందును బాలికల వివాహవయస్సును పెంపుజేయ నెంచు నిక్కాలమున సావిత్రి వివాహసందర్భమునందలి వృత్తాంతము కన్నెలును, వారిజనకులును గమనింపదగినవి. అవివాహితలగు బాలికల విషయమున తలిదండ్రులకు గల బాధ్యతయెంత? కన్య వరునియందు జూడవలసిన లక్షణము లెవ్వి? గుణవతియగు బాలిక వివాహవిషయమున వాఙ్మనఃక్రియలలో దేనికి ప్రాధాన్య మీయదగును? మనఃస్ఫూర్తిగా వరించిన భర్తయందు స్త్రీ యెట్టిప్రేమభావమును గలిగియుండవలయును? దైవికములగు నాపదలందు ధర్మపత్నియగు స్త్రీ యెట్టిధైర్యసాహసములు చూపవగును? ఇట్టి గణనీయములగు విషయములు పెక్కులు సావిత్రి జీవితమునందు బహునిపుణముగా పరిష్కరింపబడి ఆదర్శనీయములై తనరారుచున్నవి.

సావిత్రి దండధరునితో ప్రసంగించుట ఆమెజీవితమునందలి మతియొక ఘట్టములోని ఆదర్శభాగము. మనంబు భర్తృవియోగదుఃఖంబుచే సంతప్తమగుచున్నను కలంకజెందక, తొట్రుపాటులేక, ధర్మంబు మీఱక సమయోచితముగా మృదుమధురమనోజ్ఞసల్లాపంబులచే శమనుని చిత్తంబు రంజింపజేసి తన పతిజీవంబు గొనివచ్చినసావిత్రి వాక్కౌశలము స్త్రీలెల్లరు నేర్చుకొనదగినది.

నిర్మలమైనమనస్సు, ఆమనశ్శుద్ధికి దగి సత్యధర్మనిరతమైన వాక్కు, ఆమనోవాక్కులకు దగిన వినీతవర్తనము ఈవిధముగా మనోవాక్కర్మంబు లొక్కటిగా తనజీవితమునందు ప్రవర్తించి త్రికరణశుద్ధి యొక్క ప్రాశస్త్యమును సావిత్రి నిరూపించినది. ఆంధ్రనారీమణు లెల్లరు పరమపవిత్రురాలగు సావిత్రి చరిత్రమును పలుమాఱు పఠించి, అందలి నియమనీతిధర్మాదులను గ్రహించి, అలవర్చుకొని కృతార్థచరితలయ్యెదరుగాక!



## అనుమానమే పెనుభూతము

క్రొత్తపల్లి సూర్యరావుగారు

పురమను పేరె గాని జనముం బరికించిన గ్రామకత్యలో
దొరలును, విత్తవత్తను నెదుర్కొనుఁబట్టణముల్, ద్విజాదికు
ల్పరువుఁ బ్రతిష్ఠలం బొదలి భ్రాతృసమానత నేకమార్గనం
చరణము నొంద నొక్కపుడు చాలఁగ శ్రీపుర మొప్పెఁ దూర్పునన్.

పేరె శ్రీపురంబు వేఱె చెప్పఁగ నేల, సర్వసంపదలకు స్థాన మనుచు
రాజధాని జయపురంబు దానికి ధన, ధాన్యధర్మవిభవధాని యద్ది

తఱికిఁ దగినవాన తానుగాఁ గురియును, చెప్పవలవ దొరులు, చేలకోఁత
లపుడు వాన మాను, నధికవర్షంబైన, డెక్కమెత్తచినుకు టొక్కమనదు.

లోకాలోకముఁ బోల్గిరు ల్వ్రపయముల్ లోఁగొన్నవకారణం
బేకా తక్కిన దేశవాసులకు లోపింపంగఁ దద్దృష్టి ; వ
ర్షాకాలంబున వాగుఁలడ్డుకొను, వ్యాఘ్రంబు ల్దిను స్సర్వదా
చేకాసుల్గొని దారిఁ బోవిడక హింసింత్రెందు దొంగల్గదుల్.

జలదుర్గస్థలదుర్గం-బులు దస్యువ్యాఘ్రదుర్గములు తద్గ్రామం
బులకుఁ బెనుగాపుగానం- దలిసిరిఁ బరుఁ డానపడఁగఁ బావున్నదొకో

నియతకాలమందునేగాని కాంతల- కిల్లువెడల నాజ్ఞ నీయ రచట
నన్య దేశ్యులం దనాదివాసులు గొందఁ- ఱాచరింత్రు ఘోష మానియతికి.

అట్టిదేశమునకు నంచున నున్నది- శ్రీపురంబు కొండచేరువగను
గొండదాఁటఁగా మఱొండు దేశము పర-రాజవిద్వరాది ప్రబల మచట.

ప్రాంతీయరాజ్యములకుం- గొంత యనర్థము నహించుకొనవలయుం ద
త్ప్రాంతప్రభుత్వమచ్చట- నుంతురు సైన్యాదికము సముత్సాహమునన్.

కోటలోనిసొమ్ము బైటికివచ్చుట- కెంతకష్టమగునొ యంతకంటెఁ
బర్వతములనడిమి వస్తుపుకష్టము- బైటిచూళ్ల కేఁగ వలయునన్న.

ఇనుపతాళ్లవంట పెనునక్కలుండును- విస్తరాకుదిండ్లు వెదురుగడలు
రాజభోగములగు ప్రాసంగులును మొదల్- ధాన్యరాసు లచటఁ దగ్గు ధరలు.

కొండదేశమగుటఁ గొనువారు నమ్మెదు- వారు మార్గకష్టవర్గమునకు
వెఱచిరారు తెగువ వెడలినవారికిఁ- బోఁక కొక్కుపుట్టెఁ డాఁక కబ్బు.

మన్నెమునకుఁబోయి మాడదెచ్చిన నేమి- లాభమగును వైద్యులకు వరాలు
వెచ్చపెట్టవలయు విధమగునం దేగి- వచ్చువర్తకులకు బాధ మెండు.

జలమును దోయిటం గొనిన జాఱదు క్రిందికి వ్రేళ్ళ సందులం
జలజలఁ జిక్కనోట నొకజామయినప్పుడుగాని సూర్యకాం
తులు గనరావు ప్రొద్దునను దొంగలు బెబ్బులు లుష్ణరోగముల్
దలఁచిన నెట్టివర్తకుఁడు ధైర్యముగాఁ జను నట్టిచోటికిన్.

విషములోనిక్రిముల విధమున నుందురా- పట్టుప్రజలు బైటిబాంధవంబు
చేయువార లరుదు చేసిర యేనియు- గుడికి మేఁకపోతు వదువువారె.

ఎవరైనం బలుకష్టముల్పడుచు నం దేతెంచిన న్వారికిన్
నవిశేషం బగుగౌరవంబు ప్రభువు ల్సంసారులుం జూపుచున్
సవరిం ద్రచ్చుటఁ గాఁపురంబునకు వాసస్థానముల్, భూముల్గన్
వ్యవసాయం బొనరింప, బాలుర నుపాధ్యాయత్వముం జేయఁగన్.

అనపడియె నొక్కఁ డార్యాపురావాసి- కష్టములకు నోర్వఁ గలుగుసుఖము
లేమి కాఁపురంబుతో మిడుకఁగ నేల- పోయి యుంద మచట హాయి ననుచు.

తానుఁ దల్లి క్రొత్తగాను వచ్చిన భార్య- వరుస బైలుదేఱి బండిమీఁదఁ
బదిదినంబులకును బహుకష్టములువడి- చేరె శ్రీపురంబు చెప్పనేల.

పరిచయంబుచేసి పదిమందిపెద్దల- తోడ నెట్టుకొనియె దూడదుడికి
కొంపగోడి భూమిబుట్టలు గడియించె- గాజుకాయఁబోలెఁ గాచుకొనుచు.

ఆతనిభార్య రూపవతియై పతిసేవయు దీనపోషణం
బేతనవృత్తి యత్తసెలవే తనకృత్యముగా మెలంగు, వి
ద్యాతిశయంబునం బురుషుఁ డచ్చుటఁ గావ్యకథావినోదముల్
ఖ్యాతిగఁ జేసి తెచ్చునది యత్తకుఁ జూపి యొనర్చుభద్రమున్.

కాసువీసమేర్చి గడియించికొనిప్రాఁత- యప్పుదీర్చివైచి యాత్మపత్ని
కాభరణములును మహార్ఘవస్త్రంబులు- గొనుచుఁ బడినపాట్లు వెనుకఁబడిన.

ప్రాఁతకాఁపువోలె బ్రదుకుచున్నాఁ డందు- వైరివిరహితముగ భయరహితము
గాఁగఁ గొన్నియేండ్లు గడచినపిమ్మటఁ- గొండవేఁకి పట్టుకొనియె నతని.

కుదుపువచ్చెనేని గుబగుబ నిల్లెత్తు- త్రుల్లిపడును మూఁడు దుప్పటములు
ముసుఁగువెట్టుకొనియు మూల్గుచు నొక్కింత- ప్రొద్దుగడపి లేచిపోవుచుండు.

ఊఁచపాట్ల, లోఁతులోచనంబులు, వ్రేలుఁ- జెవులు మెఱుఁగుఁగాళ్లుఁ జేతివడఁకు
నుక్కినయును జూడ వెక్కసంబగు వాని- ప్రస్తుతంపురీతిఁ బ్రకటపఱుప.

ఒకనాఁ డుష్ణమువచ్చి కుంపటికడన్ హుహ్హుహ్హాహూ యంచునూ
రక కూర్చుండెను వానిసేవకయి భార్యారత్నముం దల్లియున్
వికలత్వంబున నుండి ప్రాచిపనియు న్నీర్నిప్పుమా టింతయే
నొకరుం జూడరు ప్రొద్దుజామయిన నష్టాక్కామె తానిట్లనున్.

నిత్య మున్నయదియె నేఁడేమి క్రొత్త మీ- రేల లేచి పనుల కేఁగరేమి
బావినీరుగాద పాతాళముననుండి- తోడవలయు లెమ్ము కోడలమ్మ!

అనిన నత్తపలుకు నమ్మాయి వేవేగఁ- జెలువునీరు దెమ్ము చేఁదలేవు
చేఁద మోటిదమ్మొ, శీఘ్రముగావత్తు- వనిన మంచిదనియె నామెగూడ.

బిందె బుజమునఁ బెట్టి యాసుందరాంగి- యిల్లు వెడలెను ప్రొద్దెక్క- నెంతలేదు
చిటికెలో వచ్చి మీకింత చేసిపెట్టు- దాన నని పతితోఁ జెప్పి త్వరితముగను.

మిన్నుఁజూచెను మ్రొక్కెను మిహిరునకును- దేవ! యారోగ్యమిమ్ము నా దైవమునకు
నెట్టులో యిందు సుఖముగా నెట్టుచున్న-వారి మము దైవ మోర్వక బాధపఱుచు.

ఘనబలఁగంబు వీడి యీయడవులందుఁ-బడియు సుఖియించుచుంటిమి పదుగురకును
మెచ్చుగాఁ గన్నుగుట్టెనే మీ కభాగ్య- దేవతలు! మఱచిపొందు మాదిక్కు-రాక.

ఇట్లు తలఁచికొనుచు నేఁగెను గోనేటి- గట్టుమీఁది కెవరుఁ గానఁబడరు
బిందెనెత్తనైన; భీతి లో జనియించె- వెలఁదు లిల్లువెడలు వేళమించ.

చింతుట్టదీసి యిసుక ర- వంత కదంబించి బిందె యటునిటు దోమం
గొంతుకగూర్చున్నది య-ల్లంతను బొడగనియె నొక్క-యాశ్వికు నెదుటన్.

పడఁతి నిర్ఘాతపాతంబువలెను నశ్వ- ధాటి చెవిఁబడ గుండెలుగూఁటదప్పి
నిలువునీరుగ నిలుచుండె నీళ్ల రేవు- లోనగుఱ్ఱము డగ్గఱెఁ దానుఁగూడ.

కాతుగుఱ్ఱము విప్పఁడు త్రావనీఁడు- నీరు, రొట్టెలఁదినఁడు మానినినిజూచి
పుట్టెఁ గాదామర జనించె బులుపుదిగ్గి- కట్టివైచె నమాంతముగాఁగఁ దురగ
పృష్ఠమునఁ దానునెక్కి- రివ్వననుబోయెఁ-బోయెమానిని పెనుమూర్ఛ పోయెగుఱ్ఱ
మెగువుకొండలలోయకు నెగిరినట్లు- రాదు రాదని యింటిలో రమణి యత్త
పతియుఁ గలగుండు వడిరి విభ్రాంతులగుచు- నిరుగుపొరుగులవారితో నిందునందు
వెదకి నీరాకరముచెంత బిందెఁ జూచి- నీటఁ బడి చచ్చె ననుచును నిశ్చయించి
యేడ్చి సరిపెట్టుకొనిరి వేయేలనింకఁ- బలువురును బలువిధములఁ బలికిరపుడు.
పులి పగటిపూఁట రాదు మొ- సలి సలిలములోన డిగక సాధింపదు, నీ
కలశము దోముచు నున్నది- తొలువఁగలే దెట్లుచొచ్చెఁ దొయ్యలి నీటన్.
అని యెన్నెన్నియొ రీతులం దలఁచి రేమయ్యె న్సరోజాక్షి యం
చనఁ బ్రత్యక్షముగాదె పాఠకులకున్ వ్యర్థప్రయాసంబులం

గనలే కందలు నేడ్చి నీళ్లు విడువంగా నాశ్వికాధ్యక్షునిం
టను బల్వంతయె నాతనంబా పడునుండంబోయె రోగంబునన్.

ఎవరితోడఁ జెప్పు నెవ్వరు దిక్కామె- కేమి చేయఁగలదు వృథగఁ బోయెఁ
గులము బలము మానగుణములతోపాటు- మ్లేచ్ఛు నింటి కట్టి యచ్ఛహృదయ.

కంటికిఁ గడవెడు నీళ్లకు- నింటను బతియత్తయేడ్చి రేస్చి మరణముం
గొంట నిజమనుచుఁ జేసెఁ జి-రంటికిఁ బలె నపరకర్మ రమణుఁడు భక్తిన్.

దుఃఖభారముననో దుర్దశతొలఁగుట- చేతనో క్రమముగ శీతలజ్వ
రంబు గట్టువడియె నంబుజలోచన- మగని కదియుఁ గొంతమంచిగాదె!

దీర్ఘరోగి మగఁడు దినదినగండంబు- వెనుకముందు నెట్లు తనకుఁ జిక్కు
గలుగునొక్క సుతులు గల్గరు పొమ్మని- బలిమిఁజచ్చెననుచుఁ బలికికొనిరి.

రోగము, రొట్ట, కోపము, విరోధము, కోటరమందుఁ గష్టమా
రాగవిహీనుఁడా మగఁడు, ప్రాభవలోపము, తిండిలేద తా
నేగునె యొంటి నెందయిన నింతి విరుద్ధము, నింపుప్రాణముం
బోఁగనినందునన్ గతిత భూతముగుం బరికించి చూచినన్.

అనుచు సరుగుపొరుగు నంగన లాడుకో- వారినోట వారివారినోట
నత్తచెవులఁ బడియె ననుమాన హేతువై- యంతరంగబాధ కాదివోడఁగ.

అంతటినుండి చీఁకటిని నవ్వలి కివ్వలి కేగ భీతిలుం
జింతఁగఁ బుత్రు పాన్పునకుఁ జేరిచి తానుబరుండు, నిద్రలోఁ
గాంతునో యేమొ కాంతనని కన్నులు మూయదు నిద్రపట్టినన్
గొంతుక పట్టెనంచు నిదిగోఁ బయిఁ బడ్డది యంచు భ్రాంతిలున్.

భీతి ముదిరిముదిరి బిత్తరిచీరలు- నగలుపెట్టుపెట్ట నాకుఁజూడ
దుఃఖమగుర యిచటఁ దొలఁగించి యట్టుక- పైని వేయుమనుచుఁ బల్కుచుండు.

తిండి దినదు తిన్నదియు జీర్ణమునకురా- దనుచు నిద్రపట్టదనుచు నాఁడు
నాఁటనత్త మిగుల నరముల ప్రోగయి- బైలుపడిచె లోనిభావ మపుడు.

అమ్మ! యెన్నఁడులేదు నీ వట్టులనకు- చచ్చిసాధించుచున్నది సవతిపోరు
గలుగమానును, నే నన్యకాంతఁ గొనను- నన్నుఁ జంపెదవా? నీవు నన్నుఁజంపు.

అనుచు వాదించుకొనుచుండు రనుదినంబు - పెద్దయనుమానముండుటఁ బెద్దదగుట
భ్రాంతిలోఁబడి నా కొడ ల్వడఁకుననుచుఁ- నదిగో నెదురుగ నిలుచుండె ననును దల్లి.

ప్రొయ్యి రాఁజనీదు పోనీదు నూతికి- నొక్కచోటివస్తు వొక్కచోటఁ
దీసిదాఁచు నన్నుఁ దిరుగనీ దింటిలో- బ్రదుకలేను దీనిబ్రదుకుగాల!

బ్రదుకనేల దీనిబ్రదుకుగాల్చిరి, తిట్ట- కమ్మదానిఁ దిట్టకమ్మ! తిట్టు
దున శిఖండిఁ గట్టి తుపాకివేయింతుఁ- ద్రవ్వి పాఁతవలయు దానిఁబట్టి.

పోనిమ్మా! పోనిత్తున- దానిని నీసాను దింపెదను; పోనిమ్మా!
పోనీను చెప్పదెబ్బల- తో నూరేగింతు పీడుదునె రక్కసిన్.

పరికె బ్రుమ్మగ్గువాఁడు పద్మము వేయును- బిందినాదమునను బ్రేవుజంచె
ములను దాల్చి దీనిమూలము గనుఁగొందుఁ- బోర నీవు దానిఁ బాగడవల్దు.

నిన్న దానిమొగము నిప్పులలోఁబెట్ట- బట్ట గాల్చివైచె బావిలోన
నీళ్లు చేఁదుచుండ నిలనీక కాళ్లలో- కితకితలను బెట్టి క్రిందఁద్రోసె.

నన్ను విడిచిపొమ్ము నాతోడ నీకేమి- కోకలిత్తుఁ బెక్కు రూకలిత్తు
ననిన నిన్ను గంగయందున స్నానంబు- చేయఁజూచి విడిచివేయఁగలను.

నీమేలుకొఱకె నిన్నున్- బాములఁ బెట్టెదను జచ్చి స్వర్గమునందే
నేమి సుఖంతును మీరలు- పామరులై యింటిలోనె పాఁతుకొనంగన్.

నీవునుఁ గొడుకును వెడలుఁడు- పావననదులకును దేవభవనమ్ములకుం
బోవుఁడు సేవింపుఁడు మీ-తో వచ్చెద నంతనుండి తొలఁగెద నిన్నున్.

అనుచుఁ బలికె నింక నాలస్యమేటికి- శని వదల్చుకొందమనుచుఁ గొడుకు
లేవఁదీసివచ్చి యావిశాఖపురంబు- వీథిలోన నడుచువేళయందు.

ఆశ్వికుఁడు ప్రాంతమర్గసైన్యాధిపత్య- మునను మెప్పొంది వైశాఖపురమునకును
మార్పబడి పెద్దపనిమీఁద మగువతోడ- నొక్కమేడను వసియించి యుండె నందు.
పనిగలిగిపోయెఁ బారుగూరు వనితయొకత- జాలగట్టలలోనుండి సంధ్యవేళ
రాజమార్గంబునంబోవు రమణుఁగనియెఁ- దల్లితో నేగువానిఁ దాత్పర్యమునను.
శ్రీపురమునుండి వచ్చిన చిన్ననాఁటి- మగనిఁ బరిచారికను బంపి తెగువతోడఁ
దనసమీపంబునకుఁ బిల్చి తగవునడపి- యెవ్వఁడవు నీవు న న్నెపుడేనిఁజూచి
యుంటివా యనఁబెదరుచు నూరకుండెఁ- దురకబూబమ్మ వేసము తోఁపరాక
యెన్నఁడును జూడలేదనియెను నతండు- ఎందుఁబోయెద వనియె, నాయింతిచచ్చి
తల్లిఁ బెనుభూతమై పట్టియిల్లువెడలఁ- గొట్టెఁ దీర్థాటనము సేయఁగోరినాము.

పిలువు మీయమ్మ ననియె, రప్పించె నామె- నన్నెఱుంగుదువా యన నిన్నెఱుంగఁ
జూచినట్టులు లేదు నన్ జూచినావొ? నీదుకోడల నన్నొక నీచుఁడిట్లు
చేసి చెఱచెను; మీసేవచేయుటకును- భాగ్యమిపుడబ్బె మరలఁ జావంగలేదు
పొందు హాయిగనుండుఁడు పుచ్చుకొనుఁడు-కొంతధనమిచ్చెదనుమీకుఁగుక్కముట్టు
కొన్నకుండనుకొందు మొక్కలిపెమీకుఁ-బొందుదయ్యములును లేవుభూతములును
లేని పెక్కడనుండి మీపైనిఁబడునుఁ- బొంచి యనుమానమే పెనుభూతమగును
త్వరగఁ బొం డింక నాతఁడు వచ్చెనేని- మ్రింగివైచును నన్నును మిమ్ముఁగూడ
ననిన ధనమును గొని మెచ్చి యరిగి రవల- దుఃఖమును సంతసంబును దొలఁకుచుండ
దయ్యమును భూతమును బోయెఁ దల్లివిడిచి- శ్రీయుమారమణునిదయ శ్రీపురంబుఁ
జేరి రొక కొన్నియాత్రలు చేసికొన్న- పిదప సద్భుతమంది రీ వింతఁ జెప్ప
విన్నవారలు దొలుదొల్తగన్నవార లౌర- యనుమానమెంతటి దనుచు వారు.

---



**అందమైన ఆకారముగల గడియారములు - విలాసవతులగు స్త్రీలకు.**

మీ భార్యకు లేక పుత్రికకు "వెస్ట్ ఎండ్" వారి గడియారము అత్యంతోపయోగమే గాక మిగుల శృంగారముగా నుండును.

ఈ పైన చిత్రింపబడిన 8 నాజూకైన గడియారములు, ఆధారపడి యుండతగినవనిన్ని, పెక్కు సంవత్సరములు సరియైనకాలమును చూపెడివనిన్ని పూచీ యివ్వబడినది.

వాటివెలలు క్రింద వరుసగా (పైనుంచి క్రిందకు) పొందుపరచబడినవి.

| స్క్వేర్ "బి" (పైది) | | స్క్వేర్ "డి" (మధ్యది) | | స్క్వేర్ "యఫ్" (క్రిందిది) | |
|---|---|---|---|---|---|
| స్టర్లింగ్ సిల్వర్ | రు. 38/- | స్టర్లింగ్ సిల్వర్ | రు. 38/- | స్టర్లింగ్ సిల్వర్ | రు. 38/- |
| 9 కారెట్ బంగారు | ,, 62/- | 9 కారెట్ బంగారు | ,, 68/- | 9 కారెట్ బంగారు | ,, 60/- |
| 14 ,, బంగారు | ,, 72/- | 14 ,, బంగారు | ,, 80/- | 14 ,, బంగారు | ,, 70/- |
| 18 ,, బంగారు | ,, 82/- | 18 ,, బంగారు | ,, 92/- | 18 ,, బంగారు | ,, 80/- |

ఇంకను చిన్న సైజు గడియారములు మీకు కావలసినచో, "మినియేచర్" గడియారములలోనొకదాని మీరు కోరు కొనవచ్చును. ఈ గడియారముల చిత్రములతో పూర్తి వివరములను దెలుపు మా పెద్దక్యాటలాగు నుచితముగా కోరువారికంపెదము.

వెస్ట్ యెండ్ వాచ్ కంపెని, బొంబాయి & కలకత్తా.

# West End Watch Co.

BOMBAY CALCUTTA

ఆది

పాండురంగ

# భక్తవిజయము

ఐదు భాగములు

కోయిల్ ధనాల దేవరాజ దాసులవారిచే

రచియింపఁబడినది

రాయల్ సైజులో మొత్తం 880 పుటలు గలది. గ్లేసు కాగితముపై ముద్రింపఁబడి కాలికో బైండు చేయఁబడి 21 ఆఫ్ టోన్ పటములు చేర్చబడ్డది.

వెల రూ. 6-0-0] [పోస్టేజి ప్రత్యేకము.



భక్తవిజయము చదువక మునుపు.



భక్తవిజయము చదివిన పిదప

ఈభక్తవిజయగ్రంథము మహారాష్ట్రదేశంబునం దవతరించిన మహామహిమఁగల జ్ఞానులగు కవీశ్వరులచే రచింపఁబడిన మహాభక్తుల చరిత్రముల నన్నిటిని గైకొని సకల జనులకును సులభముగ బోధపడునట్లు తెనుఁగున వచనముగా వ్రాయఁబడినది. ఈభక్తుల చరిత్రములలో నొక్కొక భక్తుని చరిత్రమును ఒక్కొకవిధమైన విషయమును దెలియఁజేయును. ఇందు సంస్కృతభాషలోని అత్యుత్తమమైన భగవద్గీత, పాండవగీత, ముకుందమాల, భాగవతము, విష్ణుపురాణము మొదలగు గ్రంథములనుండి యనేక ఉదాహరణము లుదహరింపఁబడి యున్నవి. ఎట్టివారికిని, ఏస్థితియందుండువారికిని యీపుస్తకము మహోపకారియగును. ఎట్లు? భక్తియేకదా ప్రాధాన్యము. కావున భక్తిలేనివానికిని, వివేకికిని, అవివేకికిని నీతి, జ్ఞానము, ధర్మాధర్మ వివేచనము, సన్మార్గ దుర్మార్గలక్షణమును బోధించుటంబట్టి యిది సకలమైనవారికిని పఠనమాత్రము చేతనే పరమప్రయోజనము నొసంగును. ఈపుస్తకమును జదువువారికి మనశ్శాంతికలుగును. ఇట్టి పురుషార్థసాధనమైన యీమహా గ్రంథమును జదివినయెడల, పుణ్యపాప వివేచనము విస్పష్టముగాఁ దెలియఁబడును. కాన, మనోబలము లేనివారుకూడ సులభముగా సన్మార్గమునందుఁ బ్రవేశించుటకును, దుర్మార్గమునందుఁ బ్రవేశింపకుండుటకును ఇదియొక రాజశాసనమువలెనున్నది. మఱియు, అనేక స్త్రీలు దైవభక్తియు, పతిభక్తియు, ఆచార్యభక్తియు గలవారై యున్నారు. అట్టి ఉత్తమస్త్రీల చరిత్రములు దీనియందుండుటచేత, స్త్రీలుకూడ నీగ్రంథమును జదివిరేని భూలోకమునందు సరస్వతీ పార్వతులవంటి శ్రేష్ఠ గుణములు గలవారై, తాము కన్న బిడ్డలను మహామతులుగఁ జేయఁగలవారై, సకల జనులచేతను కొనియాడఁబడువారై, మంచి వివేకము నొందినవారై మెలఁగుచుందురు.

**ఆదిత్యాగరాజస్వామి కీర్తనలు:**—విష్ణు, శివసంబంధ కీర్తనములు 600 ఉన్నవి. మంచి కాలికో బైండు చేయబడియున్నది. స్వాములవారి చరిత్రయున్ను వారియొక్క ఫోటోయున్ను ఉన్నవి. వెల రు. 3-0-0

**శ్రీత్యాగరాయహృదయము:**—588 పుటలుగల 3 సంపుటములుగ మంచి గ్లేజు కాగితముపై ముద్రింపబడి మేలుబైండు చేయబడియున్నది. ఇందలివిషయములు:—మహనీయులగు శ్రీత్యాగరాజ అయ్యగారిచే రచియింపబడిన కీర్తనములలో, 225 కీర్తనములను ఏర్పఱచి వానికి అవతారిక, మూలము, ప్రతిపదార్థము, విశేషార్థము, రాగలక్షణము, స్వర, సాహిత్యములును వ్రాయబడి యున్నవి. 3 సంపుటములు సెట్టు 1-కి ధర రు. 10. సంపుటము 1-కి రు. 4.

**ఆది సంగీతసుధాంబుధి:**—ఇందు సంగీతలక్షణములును, ప్రథమాభ్యాసపద్ధతులును, వాడుకయందున్న అనేక రాగముల ఆరోహణాదిక్రమములును, త్యాగయ్య, దీక్షితులు, శ్యామాశాస్త్రులు, ఘనం సీనయ్య, కన్నకుడి కృష్ణయ్య, సుబ్రహ్మణ్యయ్య, గోవిందసామయ్య, గర్భపురివాసులు, పురందరవిఠలు, నారాయణతీర్థులు, తిరుఁగంబాడి, పంచనాథయ్య, సదాశివరావు మొదలగు సుమారు 85 పూర్వ ప్రసిద్ధ వాగ్గేయకారకవిరచితంబులైన వర్ణములు, కీర్తనలు, జావళ్లు మొదలగునవియును, తత్కాలరుచ్యమైన హిందూస్తానీలు, పార్శీలు, ఇంగ్లీషునోటులు, తిల్లానాలు మొదలగు (Delicious Miscellany) లలిత మిశ్రములును, స్వరములతో నున్నవి. ఇంతియేగాక, హార్మోనియం, పటములును అమర్చబడియున్నవి. మంచి గ్లేజు కాగితములో ముద్రితమై, మేలుబైండు చేయబడినది. వెల 3-0-0.

ఎమ్. ఆది అండు కంపెని, సంగీత పుస్తకవ్యాపారులు, హెడ్ ఆఫీసు, అప్పాబిల్డింగ్సు,

బ్రాంచి 39, చిన్నతంబివీధి, మద్రాసు. 11/286 ఎస్ప్లనేడ్, మద్రాసు.



# వింత విశాలాక్షి

అద్దంపూడి అన్నపూర్ణమ్మగారు

విశాలాక్షికి యేది చూచినా భయమే, అందుచేత పిల్లలందరూ దాన్ని ఆడించేవారు. ఎలకనిచూస్తే భయం; పిల్లినిచూస్తేభయం; కుక్కనిచూస్తేభయం; చుంచునిచూస్తేభయం; చిమ్మెటనిచూస్తేకూడా భయం; అంతకంటేనూ బొద్దింకనుచూస్తే చాలా అపరిమితంగా భయం. బొద్దింకపేరుచెప్పితేనే హడలిపోయి, ఉన్నట్టుండి వులిక్కిపడును. పేరుచెప్పితేనే వులిక్కిపడినప్పుడు, దాన్ని చూస్తే యెంతభయమో మీకే తెలియగలదు. దీపాలు పెట్టే సమయం అయిందంటే యెక్కడకూ ఒక్కర్తే వెళ్లదు. తనఇంట్లోనే ధారాళంగా మనం అంతా తిరిగేట్టు తిరుగదు. విశాలాక్షి ఇంతభయపడుతుందని వాళ్ల ఇంట్లో అందరికీ అదిఅంటే పంచప్రాణాలూను. అయితే యెన్నియేళ్లువచ్చినా ఈ భయంపోలేదు గదా అని అప్పుడప్పుడు కసురుకుంటూ వుండేవారు.

విశాలాక్షికి సుమారు పాతికేళ్లుంటాయి. మంచి అందమయింది. పాటలూ పద్యాలూ కుట్టుపనులూ, మంచి చదువూ అన్నీవచ్చును. భారతభాగవతాలు అన్నీ గడగడ చదువుతుంది. ఆ చదివేటప్పుడు తడుముకోడం కూడా వుండదు. మంచి తెలివితేటలు గలది. ఎవళ్లు యేపనిచేసినా అది చూచి తక్షణం ఆపనిచేస్తుంది. అన్నింటిలోనూ తెలివితేటలేకాని, దానికున్న పిచ్చి ఈ బొద్దింకని చూస్తే భయపడడమే. విశాలాక్షి భర్తకి చాలా డబ్బూ, భూమీపుట్రా అన్నీ వున్నాయి. ఆయనకూడా మంచిమనిషే. ఆయనపేరు గంగాధరరావు. విశాలాక్షి ఈ అల్పజంతువుల కన్నిటికీ భయపడుతుంది గదా అని అప్పుడప్పుడు మనస్సులో కష్టపడేవాడు.

విశాలాక్షి ఒక్కొక్కదినం పొద్దుపోక పక్కింటికి వెళ్లేది. అక్కడ కూచుని కాలక్షేపానికి యేవో మాట్లాడుకుంటూ వుండేవారు. ఆవిడకూ విశాలాక్షికీ చాలా స్నేహం. ఆవిడ పేరు రామమ్మ. ఎక్కడకేనా వెళ్లాలంటే ఇద్దరూ వెళ్లేవారు. రామమ్మకు పదేళ్లకూతురు ఒకత్తె వుంది; దానిపేరు పార్వతి. ఆ పిల్లకు పరిహాసం అంటే చాలాఇష్టం. విశాలాక్షిఅంటే దానికి చాలా ఆశ్చర్యం, అలక్ష్యమున్నూ. దాన్నిచూస్తే సరి అదుగో బొద్దింక, ఇదిగో బొద్దింక అని దాన్ని హడలపెడుతుంది. విశాలాక్షి నిజమే అనుకుని కూచున్న మనిషి లేచి బట్టంతా దులుపుకుని వెర్రిమొఖంపెట్టి "నే నింటికిపోతాను" అనును. అప్పుడు రామమ్మ పార్వతిని నాలుగూ తిట్టి దానిని అవతలకి పొమ్మనిచెప్పి విశాలాక్షితోటి "ఎందుకమ్మా నీకంతభయం, మేమంతా లేమూ? నిన్ను మాత్రం అది మింగేసునా, లేకపోతే కరిచేసునా? ఏమిటి, ఇంకా చిన్నతనమేనా పాతికేళ్లొచ్చి? బొద్దింకని చూసి భయపడితే అంతా నవ్వరూ? పార్వతికీ నీకూ యెంతతేడా వుందోచూడూ! అదుగో బొద్దింక, ఇదిగో బొద్దింక అని అది అనడం, నువ్వు భయపడడమూనా?" అని అప్పుడప్పుడు కూకలేస్తూవుండేది. ఎవళ్ళెంత చెప్పినా యేం

చేసినా విశాలాక్షికి మాత్రం ఆ భయంపోలేదు. అది యేలాపోతుంది చిన్నప్పటినుంచీ వున్నది?

ఈలా వుంటూవుండగా గంగాధరరావు మేనమామ కొడుక్కి పెళ్ళొచ్చింది. ఆ పెళ్లికి గంగాధరరావునీ ఆయనభార్య విశాలాక్షినీకూడా తప్పకుండా రమ్మని జాబు వ్రాసినారు. అదికాక వాళ్లు స్వయంగాకూడావచ్చి పిలిచేరు. వెళ్లకపోతే యేలాతప్పుతుంది? విశాలాక్షికి వెళ్లాలనిలేదు. మరెందుకూకాదు, తనకున్న భయంవల్లనే. గంగాధరరావు వెళ్లకతప్పదన్నాడు. సరి అని యేలాగయితేనేమి, ప్రయాణం అయ్యేరు. విశాలాక్షి బట్టలన్నీ తనకూ ఆయనకూ పెట్టెల్లో సర్దింది. పెట్టుకునే నగలు పెట్టుకుంది. కొన్ని భద్రంగా పెట్టెలోపెట్టి దాచుకుంది. ఇంట్లో అన్నీ తాళాలువేసి బయలుదేరి నాలుగురోజులు పెళ్లుందనగానే వెళ్ళేరు.

గంగాధరరావు మేనమామపేరు వెంకట్రామయ్య. ఆయనకు ఒకేకొడుకు; లేకలేకపుట్టేడు. ఆయనకుకూడా చాలా డబ్బుంది. పెళ్లి చాలా బాగాచేద్దామని యేర్పాట్లుచేస్తూ వున్నాడు. ఆయనకు బంధువులు చాలామంది వున్నారు. బంధువులనందరినీ నాలుగురోజులు ముందరనే రమ్మనిచెప్పి వుత్తరాలు వ్రాయించారు. వెంకట్రామయ్య వున్నవూరు పెద్దపట్నం. ఆయనఇల్లు పెద్దబంగాళా; దానిలో పెద్దతోట; ఆ తోటలో అన్నిరకాల పూవులూ వేసి చాలా బాగాపెంచేడు. అంత పెద్దఇల్లు వుండికూడా చాలదేమోఅని వాళ్ల ఇంటి పక్కనున్న ఇల్లు ఒకటికూడా పెళ్లికోసరం తీసుకున్నాడు. పెళ్లికి చుట్టాలందరూ వచ్చేరు. ఇల్లంతా రంగులతోటీ, పూవులతోటీ, కాగితపు బుట్టలతోటీ, పాదిరసపుగుండ్లతోటీ అలంకారం చేసేరు. రేపు పెళ్లిఅనగా ఈ వేళటికి రావలసిన చుట్టాలందరూవచ్చేరు. గంగాధరరావూ విశాలాక్షీకూడా వచ్చేరు. ఆ పెళ్లిల్లు చూడ్డానికి చాలా వినోదంగాను, అద్భుతంగానూ కలకల్లాడుతూ వుంది. ఎంతచూచినా ఇంకాచూడాలని బుద్ధేగాని ఇవతలకు వద్దామన్నమాట వుండదు.

పెళ్లినాడు మేళాలు తాళాలు భోగంవాళ్లూ అందరూ వచ్చేరు. పెళ్లిఅయింది. ఆపెళ్లికి అందరూ శృంగారాలుచేసుకొని రకరకాలుగావచ్చేరు. ఆ వూరు వూరంతా వీళ్ల ఇంటికేవచ్చేరు. బ్రాహ్మలందరికీ కాసులూ అరకాసులూ వరహాలూ రూపాయలే కాని అంతకుతక్కువ సంభావనలు పంచిపెట్టలేదు. బీదలకందరికీ అన్నంపెట్టి గుడ్డలులేనివాళ్లకు గుడ్డలుఇచ్చి, "నాలుగురోజులూ మీరందరూ మాఇంటికేరండి" అని బీదలకందరికీ వంటవాళ్లనిపెట్టి వండించి నాలుగురోజులూ పప్పు పిండివంటలతోటి భోజనాలు పెట్టడానికి వెంకట్రామయ్య యేర్పాటు చేసేడు.

ఆపెళ్లి నాలుగు రోజులూ బంతులాడించేవాళ్లూ, నలుగులు పెట్టేవాళ్లు, పాటకచ్చేరీలుచూసేవాళ్లు, భోగంఆటలు చూసేవాళ్లూ ఇలాగ ఆ వూరు వూరంతా వైభవంగా వుంది. వెంకట్రామయ్య కొడుక్కి పెళ్లి బాగాచేస్తున్నాడని వచ్చినవాళ్లందరూ పొగడుతూ వున్నారు.

విశాలాక్షిమాత్రం మధ్యాహ్నమంతా సందడిగానే తిరిగేది. సాయంకాలం ఆరుగంటలయేసరికి పదిమందీ యెక్కడవుంటే అక్కడేవుండి, వాళ్ల చుట్టుచుట్టూ తిరిగి ఈలాగేవుండేది. వాళ్లంతా వెడుతూవుంటే "నేనూ వస్తానుండండి" అని వాళ్ల వెనకనే వెళ్ళేది. అక్కడకూడా దీని శత్రువులే యెక్కువ. అక్కడక్కడ బొద్దింకలు ఇల్లంతా పాకుతూవుండేవి. రాత్రి పదిగంటలయేసరికి ఇల్లంతా యెగరడం ఆరంభించేవి. అప్పుడు విశాలాక్షికి గుండెల్లో ప్రాణంవుండేదికాదు. అక్కడెక్కడో యెగురుతూందంటే తెయ్యిమని గంతులేసేది. ఆ పెళ్లికొచ్చిన వాళ్లందరికీ ఇదొక వింతగా వుండేది. అక్కడ పాటలూ ఆటలూ వినేవారు కొందరూ, విశాలాక్షిని వేడుక చూసేవారు కొందరూ - ఇలాగుండేది. గంగాధరరావు దగ్గరకు వెళ్లి "నేను రానంటే రమ్మన్నారు." అని విసుక్కునేది విశాలాక్షి. "పెళ్లికొచ్చింది చాలు, నాఅవస్థాచాలు" అని వూరికే విచారపడేది. పాపం దానికి

రాత్రిఅంతా నిద్దర లేదు. ఒక పెద్దహాల్లో అందరూ ఒక చోటైై అరవైమంది ఆడవాళ్లు పడుక్కునేవారు. వాళ్లందరి మధ్యకీపోయి పడుక్కునేది. అలాపడుక్కుంటె కూడా ఉండి ఉండి వులిక్కిపడేది. ఆ రీతిగా పెళ్లి నాలుగు రోజులూ గడిచేయి. అయిదోరోజు రాత్రికూడా రోజూ పడుక్కున్నట్టే విశాలాక్షి అందరిమధ్యనూ పడుక్కుంది. ఈ నాలుగురోజులూ నిద్రలేక పోయినందువల్ల ఆ వేళ పడుక్కున్న తోడనే నిద్దరట్టిపోయింది విశాలాక్షికి.

ఆ రాత్రి సుమారు ఒంటిగం టయివుంటుంది. అందరూ మంచినిద్దర్లు పోతూవున్నారు. "దొంగ, దొంగ" అని కేకలు వినపడ్డాయి. అందరూ గుంపులు గుంపులుగా లేచి పరుగెత్తేవాళ్లు, "పట్టుకోండి, పట్టుకోండి" అని కేక లేసేవాళ్లూ, పెట్టెలు తాళాలు తెరిచి చూసుకొనేవాళ్లు, కోట్లు వెతుక్కునేవాళ్లూ, చొక్కాలు వెతుక్కునే వాళ్లూ, జేబులు తడుముకొనేవాళ్లూ, వాళ్ల వాళ్ల డబ్బు సరిగా వుందా లేదా అని అడిగేవాళ్లూ, ఆడవాళ్లనూ పిల్లలనూ చూసుకొనేవాళ్లూ, వాళ్ల నగలు సరిగా వున్నాయా లేదా అని అడిగేవాళ్లూ, ఈలా అల్ల కల్లోలంగావుంది. పావుగంటయ్యేసరికి నగలూ, పెట్టెలూ యేమీ పోలేదు. అని తీర్మానం చేసుకొని "యే వేపునుంచి కేకలు వినపడ్డాయి?" అని అడిగి అందరూ విశాలాక్షి పడుకున్న హాలని తెలిసికొని, అక్కడకు ఆడవాళ్లూ మొగ వాళ్లూ పిల్లలూ అందరూ పరుగెత్తుకొని వెడుతూవున్నారు. ఇక్కడ వున్న వాళ్లంతా "ఎందుకమ్మా?" అని అంటూ వున్నారు. అప్పుడు విశాలాక్షి తనపక్కనున్న ఒక ఆమెను గట్టిగా పట్టుకొని "దొంగ, దొంగ" అని కళ్లుమూసుకొని కేక లేస్తూంది. ఆ పక్కనున్నావిడ "నేను కాదు మా అక్క, నేను కాదు మాఅక్క. నన్ను విడిచిపెట్టు. నా ప్రాణాలు పోతున్నాయి." అని కేక లేస్తూంది. వీళ్లిద్దరూ ఈవిధంగా కనబడ్డారు.

అక్కడ వున్న వాళ్లంతా ఇదేమి చెప్మా అని ఆశ్చర్యపడిపోయి, "ఏమిటిది?" అని విశాలాక్షి పట్టుకున్నావిడను అడిగేరు. అడిగితే ఆవిడ "నేనుకాదు. మా అక్క" అని చెప్పింది.

చెప్పితే, "ఏమిటి మీ అక్క?" అని అడిగేరు అక్కడ వున్న వాళ్లంతాను.

"మా అక్క సుబ్బమ్మగారి అడ్డిగ దొంగిలించింది. కాని నేనుకాదు. నన్ను విడిచిపెట్టమనండి. మా అక్కను అడిగి ఇప్పిస్తాను." అన్నది.

అక్కడ అందరికీ ఆశ్చర్యం అయిపోయింది. ఆ సమయంలో సుబ్బమ్మ అక్కడనేవుంది కాబట్టి, "అవును, అవును. నా అడ్డిగపోయింది. తెల్లవారినుంచీ వెతికి, వెతికి అందరినీ అడిగి నా ప్రాణం విసిగిపోయింది. ఈ ముండా తీసిందీ" అని సుబ్బమ్మ అన్నది. సరి అని విశాలాక్షిని విడిచిపెట్టమని చెప్పినా ఇంకా విశాలాక్షి కళ్లుమూసుకునే కేకలేస్తూంది. అప్పుడు వాళ్లందరూ విశాలాక్షి చేతులు గట్టిగాలాగి కళ్లుతుడిచి "నీవు యేలాగు కనిపెట్టేవు, సుబ్బమ్మగారి అడ్డిగ ఈవిడ అక్క దొంగిలించిందని?" అని అందరూ కలసి విశాలాక్షిని అడిగేరు.

విశాలాక్షి "నాకేమీ తెలియదు. నాకు బొద్దింకలు మొగురుతూన్నట్టూనూ, అప్పుడు దొంగలొచ్చినట్టూనూ, కలొచ్చింది. అలాగ కలొస్తే నాకు భయంవేసి, యేమీ తోచక ఈవిడను గట్టిగాపట్టుకున్నాను.? కాని వేరేమీ నాకు తెలియదు." అని చెప్పింది. అప్పుడు సుబ్బమ్మ చాలా సంతోషపడింది. మిగత వాళ్లందరూ ఆశ్చర్యపడి, నిర్ఘాంతపడి చూస్తూవున్నారు.



# విశ్రాంతి

కీ. శే. పెనుమర్తి వెంకటరత్నముగారు.

ఎంత మాధుర్యపరసీమ యీ త్రియామ!
 విరియఁబూచిన చంద్రికావీథులందు
సృష్టి, శాంతిలశర్వరీస్మితమనోజ్ఞ
పరమపరమునిమూర్తిలోపల శయించె!

అణువు మొదలు సమస్తభూతాంతరముల
కప్పురపు వెన్నెల కిసాళికమ్మఁదనము
తావులూర, నానందచింతావిచలిత
విశ్వజీవనశాంతు లావిర్భవించె!

ఒకటిరెండు మొగిళ్లు తద్వ్యోమరంగ
విహరణానందమునఁ బరువెత్తిపోయె!
క్షీరసాగరకౌముదీసారమందు
అమృతధాముడు మాధుకుంభముల గురిసె.

విరహవిహ్వలకామినీతరుణిమంబు
ఎంతవాడెరా, ఈచంద్రికాంతరమున
ఎంతప్రణయామృతమ్ము వాహినులుగట్టి
ముంచుకొన్నదో స్వర్గభూములనుగూడ!

* * *

ఈదృశానేకభావోర్మికాదపీయ
మైన హృదయంపుతాపము మ్లానమొంద
ఒకనిమేషము! జీవవాయూర్ధ్వమూతి
భీషణశ్రుతి నాకు విన్పించలేదు.

---

# నా స్థితి

బసవరాజు వేంకట అప్పారావుగారు, బి. ఏ., బి. యల్.

వెన్నెలరాత్రిళ్లు వేగించలేక
 చుక్కలసొబగుల్లు చూడగాలేక,
తలవాల్చి నాస్థితి దలచికుంగేను,
కుళ్లికుళ్లిలోన కుమిలిపోయేను!

రాజులలో కవిరాజునౌ నేను
పాడుగుహలో నేడు పారాడనాయె,
కోకిలలందు పుంస్కోకిల నేను
గొంతునొక్కుకు మూలకూరుచొన్నాను!

అమృతహస్తా, చిల్కు మమృతబిందొకటి
గొంతెండిపోయిన కోయిలనోట!
కొయ్యబారినమేన కోరికలీన
రిక్క, పెట్టవె కాస్త చక్కిలిగింత!

---








౧. శ్రీ డా. జొన్నలగడ్డ మల్లపరాజుగారు ౨. శ్రీ ఆకెళ్ల ప్రకాశంగారు ౩. శ్రీ దువ్వూరి వెంకటేశ్వరులుగారు
౪. శ్రీ నడింపల్లి సుబ్బరాజుగారు ౫. శ్రీరావు వెంకటరావుగారు ౬. శ్రీ దిగుమర్తి సాంబశివరావుగారు.








౧. శ్రీ కలిదిండి సుందరరామరాజుగారు (కీ) ౨. శ్రీ టి. వి. రాజుగారు (కీ) 3. శ్రీ కడియాల సూర్యారావుగారు (కీ)
౪. శ్రీ కడియాల రామరావుగారు (కీ) ౫. శ్రీ కొవ్వలి విశ్వనాథంగారు (కీ) ౬. శ్రీ గెడా రఘునాయకులుగారు (కీ)











౧. శ్రీమతి లక్ష్మీనారాయణ నాయర్‌గారు, బి. ఏ. ౨. శ్రీమతి ఏణాక్షి రామారావుగారు, యం. ఏ.,
౩. శ్రీమతి మండి మహారాణిగారు. ౪. శ్రీమతి ఆనందరావుసతిగారు. ౫. శ్రీమతి వెంకటరత్నమ్మగారు.









౧. శ్రీమతి డా. లక్ష్మీదేవిగారు. ౨. చెన్ననగర స్త్రీమహాసభ. ౩. శ్రీమతి శొంఠి రామమూర్తి సతీమణిగారు.
౪. ౧౯౩౦-వ సంవత్సరమున చెన్నపుర విశ్వవిద్యాలయమున పట్టభద్రులయిన స్త్రీలు.

# నాటకములు—నాట్యకళ

పోపూరి నరసింహశాస్త్రి గారు

ధ్వనులే కావ్యములై వెలసినవి. మరికొంతకాలమునకు నాగరికత కారణముగ మానవసంఘమున మిన్నయగువాఁడు రాజుగ నేర్పడుటయు, తక్కుజన మంతయు వాని చెప్పుచేఁతలకు లోఁబడి మెలఁగుటయు నీలోనగు కట్టుబాట్లేర్పడినవి. ఈ నియమముల మూలముననే రానురాను సంఘమున విద్యాబుద్ధు లెక్కుడు కాఁదొడంగినవి. ఇట్లగుట నింకఁ గొంతకాలమునకు సంఘమున నందఱును సామాన్యముగ చదివి జ్ఞానవంతులే కాఁదొడంగిరి. నాఁడు చదివి జ్ఞానవంతులగు వారిసంఖ్య ఎక్కుడుగను, అట్లు కానివారి సంఖ్య చాల కొలఁదిగను ఉండియుండెడిది. పిమ్మటఁ జాలకాలము వఱకును దేశమం దెల్లెడల క్షామాదులచే నగు చింతలు లేక సుఖులై కాలమును వెళ్లఁదీయుచుండిరి. తరువాత కాలధర్మముచే నేమి, సాంఘికనియమములు సడలుటచే నేమి ఏలిక లున్మత్తులై క్రిందువాఁదులు గానక ప్రజాసంరక్షణాదుల యెడ కేవలము వైముఖ్యమును జూపుచు స్వార్థపరాయణత్వాదిదుష్టగుణభూయిష్ఠులు గా నారంభించిరి. ఆతఱిని దృశ్యకావ్యము లారంభమునందినవి. అనఁగా ప్రజాసంరక్షణాదులయందు విముఖులగు నెకిమీడులను ఉదాత్తగుణోపేతులును, ప్రాచీనులును నగు రాజులు మొదలగువారి చరితములను వారి కండ్లకుఁ గట్టినట్లు చూపి సత్పథమునకుఁ ద్రిప్పవచ్చు నను నూహపై సంఘమునందలి మతిమంతులు కొందఱు పై 'దృశ్యకావ్యము'లఁ గావింపఁ దొరఁకొనిరి. దీనినిబట్టి చూడఁగా వీని ముఖ్యోద్దేశములు రెండని తేలుచున్నది: నీతిదాయకములై యుండుట యొకటి. ఆనందదాయకములై యుండుట రెండు. ఇతఃప్రాచీనములగు 'శ్రవ్యకావ్యము' లీ 'దృశ్యముల' వలెనే నీతిదాయకములు, నానందదాయకములైనను వస్తుతః దృశ్యములందలి ప్రవృత్తి శ్రవ్యములందు లేకపోవుటయే వీని యుత్పత్తికిఁ గారణము గాఁజాలి యున్నది. ఇంకను దృశ్యములం దా నీతిదాయకత్వము, నీతిబోధకత్వము శ్రవ్యములందుకంటె సాక్షాత్తు పరిదృశ్యమానము లౌటకూడ కారణమై యుండవచ్చును.

కాని మరికొందఱు నాటకములలో శ్రవ్యములలోకన్న నుత్తేజకత్వము నుద్బోధకత్వము కలదనియు సంఘములు చప్పఁబడియుండుటఁ జూచి సహింపలేనివారు కొందఱు ముందుహరికథల రూపమునను, తర్వాత నీనాటకముల రూపమునను కొలఁదికొలఁది విపరిణామములతోఁ గావ్యముల రచించుచు వానికి తత్తదుచితనామముల నిడిరనియుఁ జెప్పుదురు.

మరికొందఱు పై నాటకములు కేవల మానందైక ప్రయోజనము లైనవనియు వినుటకు ప్రీతైన వానికన్న సాక్షాత్పరిదృశ్యమానము లగువానియందు ఝటితి యానంద ముత్పన్నమగుననియు, కావున నాస్వభావము నెఱిఁగిన మేధావంతులు వానినిఁ జేయ మొదలిడిరనియు, కావుననే 'కావ్యేషు నాటకం రమ్యం' ఇత్యాద్యాభియుక్తోక్తులు పుట్టినవనియుఁ జెప్పుచున్నారు. ఇంతకు నేదియెట్లున్నను నాటకములందు నీతియు నానందమును ముఖ్యము లనుటలో నెవ్వరికి నెట్టి యభ్యంతరము నుండదు.

### నాటకనియమములు

ఇఁక నిట్టి నాటకములలో పంచసంధులు ముఖ ప్రతిముఖాదు లుండవలయు ననియు, నాన్ద్యాముఖాదులు నియతము లనియు, నాయికానాయకులు ప్రఖ్యాతగుణో పేతులై యుండవలయు ననియు, శృఙ్గారవీరాన్యతర మంగి గను, ఇతరములు యథాసందర్భముగ ఒకటిగాని, రెండు గాని, మూఁడుగాని అంగములుగ నుండవచ్చుననియు, విరుద్ధరససమావేశ మొనర్పకుండుట తప్పనిసరి యనియు నీలోనగు నింకకొన్ని నియమములను ప్రాపంచికానుభవ మును బట్టియేమి, సందర్భౌచితినిబట్టియేమి, ప్రాచీనులు భరతాదు లేర్పరించిరి. అట్లు కావించుటలో కాల పరిస్థితుల ననుసరించికూడ కొన్నిటినిఁ గావించియుండిరి. అట్లగుట నిప్పటి కాలపరిస్థితులఁబట్టి నియమములలోఁ గొన్ని తొలఁగింపవలసినవే యైనను చాలవఱకు నియత ముగఁ బాటింపవలసినవే యైయున్నవి. మచ్చునకు: నాంది నియత మనిరి పూర్వులు; అనావశ్యకమనిరి అర్వాచీ నులు. ఏది పాటింపఁదగినది? మానవకార్యమునకు ప్రతిదానికిని దైవశక్తి ప్రధానమని యొప్పుకొనవలెను గదా! అట్లే ఈ యభినయరూపకార్యారంభమునఁగూడ దైవసాహాయ్య మవశ్యాపేక్షణీయము గావున దైవభజ నాదికము లేక దైవసాహాయ్యలబ్ధి దుర్లభము గావున దైవప్రార్థనారూపమగు నాందిని నాటకములలోఁ జొనిపిరి. దీనికి కాలపరిస్థితిఁబట్టి గాని, మరియే యితరమగు కారణముచేఁ గాని విరోధము లేనప్పుడు దీనినేల తొలఁ గింపవలయును? ఇట్టివే యింకనుఁ గొన్ని కలవు.

### పంచసంధు లావశ్యకములు

ఒకకథను గాని, మరియొక వ్యాసమును గాని వ్రాయునెడఁ బ్రమాదములు పెక్కులు గలుగవచ్చును. కావున నాకథనుగాని, వ్యాసమునుగాని హృదయమున బాగుగ నిర్ధరించుకొని దానిని సరిగ విభాగించుకొని కల గాపులగము కాకుండ వ్రాయుట సంప్రదాయము. కావు ననే విమర్శకులు వ్యాసాదులలో విషయవిభాగము ముఖ్యమని కొట్టుకొనుట. ఈరీతినే నాటకమునకై కథను గూర్చునపు డైదువిధముల విభజించుటకు సామాన్యముగ వీలగునని పూర్వలాక్షణికులు విమర్శించి తెలిసికొని నియ మించిరి. కావున వానినిఁ బాటించుచు వ్రాసినచో, లేక రచించినచో వ్రాయువారికేమి, వినువారికేమి, ఏయే సందర్భమున నేయే కథలు కలిసినవో, ప్రధానకథాభాగ మునకును వానికిని గల సంబంధ మెట్టిదో, తత్కథాంశము లెంతవఱకు సమకూరినవో ఈ మున్నగున వన్నియు స్పష్ట ముగఁ దెలియుట కవకాశ ముండును. శక్తిగలవాఁడు పాటింపక వ్రాయఁజనదా? అన్న నది యిసుకనుండి తైలమును దీయ సాహసించుటయే. ఇటీవలి నాటకరచ యిత లిట్లు పొరబడినవి పెక్కులు గలవు. ఆ పంచసం ధ్యాదులఁ బాటింపని యధునాతననాటకములలో కార్య కారణాదులు సరిగా లేవనియే నిశ్చయింపనగునేమో? ఇట్టి యీ నియమములను, ఈవిధులను మార్చవచ్చునా? కాక లౌకికవిప్రతిపత్తులుగాని, శాస్త్రీయదోషములుగాని లేని ప్రాచీనవిధులను దొలఁగించుటలో గుఱికి సరియగు కారణము మృగ్యముగాన నట్లొనరించుట పొల్లేయగును. ఇట్లని యన్నింటి నిట్లాచరింప, లేక యనుసరింప నవసరము లేదు. ప్రాచీననియమములలో తొలఁగింపవలసినవి గూడ గలవు. వీరశృంగారాన్యతరమే యంగి కావలయునన్న యాలంకారికనియమమున లౌకికవిప్రతిపత్తులు కన్పట్టు చున్నవి. చూడుఁడు, ఆలంకారికులే శృంగారాదినవరస ములలో ప్రతియొక రసమునకును వాసనారూపమగు స్థాయి రసికునిహృదయములో నుండుననియు, నాయా రసమునకు సంబంధించిన విభావాదులు సందృశ్యమాన ములైనతఱి నాయాస్థాయి యుద్బుద్ధత నొంది రస రూపేణ పరిణమించుననియుఁ జెప్పియున్నారు. కాని యంద అన్నిరసములవల్లఁ గలుగు నానందము ననుభవింప లేమికి నారసస్థాయి (వాసనయని చెప్పఁబడునది) వాని హృదయమున లేకుంటయే యని గూడ చెప్పియున్నారు. యుక్తము. వీతరాగుఁడగు నొక్కని యెదుట సంపూర్ణాంగ సమన్వితమగు శృంగారప్రదర్శన మెంత నేర్పరియగు నటుఁడు కొనసాగించినను తజ్జనితానందరసాస్వాదనశక్తి

యాతనికిఁ గలుగునా? ఇట్లే కరుణ యననేమో యెఱుఁగని కఠోరహృదయుని మ్రోల కరుణరసమును వెల్లివిరియు నుత్తరరామచరితాదు లెంత నటునిచే నభినయింపఁబడినను ఏమైనను లాభముండునా?

ఇట్లే రచయితలందును రుచిభేద ముండును. కావుననే రచయితకు రుచించినరీతి నారచయిత రచించును. ఇట్లుండ వీరి శృంగారాన్యతరమే యుండవలెనని నియమ మెట్లు? తదితరరసములలోమాత్ర మేల కూర్చరాదు? ముఖ్యముగ నాటకమునకు రసమేగదా కొలికిపూస! దానిని ఒక్కఁడు హాస్యమున చేకూర్చును. మఱొక్కఁడు శృంగారరసమున నమకూర్చును. వేఱొక్కఁడు కరుణరసమున. ఇంకొక్కఁడు హాస్యమున. ఈ విషయమున శాస్త్రము ననుసరించిగాని లోకముననుసరించిగాని విప్రతిపత్తి యెట్టిదియుఁ గానుపించుటలేదు. అట్లు లేనిదానికీ నియమ మేల? ఈనిర్బంధ మేల? ఈ సంకోచ మేల? ఈ వ్యవధి యేల?

అదియునుంగాక సులక్షణకవితాశైలియు సంపూర్ణలోకానుభవమును గలిగి నాటకరచనాసమర్థుఁడగువాఁడు శృంగారవీరములం దభిరుచిలేనివాఁడు నాటకప్రపంచమున నోరు మూసికొనవలసినదేనా? వాని కందు తావే లేదా? అన్యాయము. 'శ్రవ్యకావ్యములలో వారి ప్రతిభఁ జూపుకొనరాదా?' అన్న చెఱకు ఇష్టమైన వానిని ఉప్పతినఁగూడదా యనునట్లే. అట్టి నియమము పెట్టినను ఆఁగఁజాలదు. మన తొల్లింటి యాలంకారిక పండితతల్లజులు ఎంత లేనిపోని యర్థములను ముడివెట్టి గ్రంథమునంతను తలక్రిందుగావించి నేఁటిదనుకను విసువు విరామములులేక నొక్కిపెట్టిన కరుణవిప్రలంభమని వాదించుచున్నను అం దారస మావిర్భవించునా? అంధుఁడొక్కఁడు, ఆ ముటేనుఁగు చెవిఁదడవి యావల నేనుఁగు చేటవలెనుండుననఁ జెల్లివచ్చునా? పోనిమ్ము. ఇట్టి నియమ ముండినచో ప్రతివారునుగూడవానిలోనే వ్రాయుచుందురు. అని యేదే నతుకులమారి సమాధానమును చెప్పఁజూచినను, భవభూతిని "ఏకో రసః కరుణఏవ నిమిత్తభేదాత్ భిన్నః పృథక్ పృథగివాఽఽశ్రయతే వివర్తాన్" అని ఘంటాపథముగా వాదించుకవిని ఇంద ఆలంకారికులును విరుద్ధముగా నిలచి జుట్లుజుట్లు ముడివెట్టి నేఁటివఱకు హోరాహోరిగఁ బోట్లాడునట్లు చేసియును వారిచేతనే "ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే" అని జగదేకసంవిదితంబగు గొప్పప్రథనుగాంచి మించిన పండితుని శృంగారమున వ్రాయుమని ప్రేరేచినచో కరుణకరవాలమున సాముచేసినట్లు శృంగారపల్లవమును చినుగకుండ పెన్పొందింపఁగలఁడా? అట్లు లేదని యూరకొమ్మంట ధర్మమా? అట్లే యాతఁ డూరకుండినచో మన కీయపూర్వగ్రంథసందర్భసంగ్రథితసరసకరుణరస సహావాస మెట్లలవడును? అట్లే వీతరాగుని అపూర్వకవితాధారాసంభారపరిశోభితుని షడ్గుణాదులను పాత్రలక్రింద మార్చి కల్పించి వానిచేతనే యపూర్వశోభను గల్పించి శృంగారమును నిరసించి చక్కఁగ ముముక్షుమార్గమును కరతలామలకముగఁ జేయుచు శాంతరసము మేరువుపూసగఁ ప్రబోధచంద్రోదయమును వ్రాసిన కృష్ణమిశ్రుని వీరరసమున వెల్లివిరియుచు న్ననట్లు చేయఁగలఁడా? అన లట్లనఁ జెల్లునా? షట్ఛాస్త్రములఁ జదివిన పండితప్రకాండుని "'సర్వాధారః కాలః'అని గలదు. అట్టి కాలజ్ఞానము జ్యోతిషమునఁగాని గల్గదు. అట్టి యా జ్యోతిషము రాక మీ కెన్ని వచ్చినను,ఏమున్నను మీ పాండిత్యము బగ్గియే" అన్నట్లు గాదా? అందుచే వెనుకఁ జెప్పఁబడిన వానివలె విప్రతిపత్తులు లేనివిషయములలో బాగుగ నాలోచించి స్వతంత్రింపనగును. ఇట్లగుట కొన్ని కొన్ని పాటింపవలసిన వగును. కొన్ని కొన్ని తొలఁగింపవలసిన వగును. అట్లని యన్నింటిని తొలఁగింపనురాదు; అన్నిఁటిని పాటింపను రాదు. తొల్లింటివారుగూడ తమ తమ గ్రంథములయందు ఈ విషయమును సూచించియేయున్నారు. ధనంజయాదులు నాటకలక్షణాదులను నుడివి సాధ్యమగునంతవఱకు ప్రతిపత్త్యనుసారేణ లక్షణములను పాటించుచుండవలయునని చెప్పియున్నారు. విప్రతిపత్తు లున్నయెడలఁ బాటింపనక్కఱలేదని దీనిచే సూచితమగుట లేదా?

## రసవిచారము

రస మనుదానినిగుఱించి మనప్రాచీనులు వారి వారి యూహాల ననుసరించి యూ యూయిరీతులఁ జెప్పియున్నారు. అందు నటునకు రసానుభవము కలదా? లేదా? అని చర్చించునెడ చాలమంది సామాజికునకే రసాస్వాదనశక్తి యుండును గాని నటున కించుకమాత్ర ముండదని నుడువుచు తదవష్టంభకముగఁ గొన్నికొన్ని యుక్తులఁ జూపుకొనియున్నారు. ఒక్క తొల్లింటి యాచార్యుఁడు మాత్రము తనకీ టన్నివంకలకు దిఱుగునట్లు చెప్పియుండె నట! విచారింపఁగా నప్పటి రంగానుభవమును బట్టియు, స్వీయానుభవమును బట్టియు వా రట్లు నిర్ణయించియుండు రు. నాయనుభవమును బట్టియు, ఇప్పటిరీతుల ననుసరించియు భిన్నములుగాఁ దోఁచినవాని నిందు తెలియపఱచుకొనుచున్నాను:

పూర్వులు 'రస్యతే స్వాద్యతే అనేనేతి రసః' అనుభవింపఁ బడుచున్నది రస మని నుడివియున్నారు.

"విభావై రనుభావైశ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః,
ఆనీయమానః స్వాద్యత్వం స్థాయీభావో రసః స్మృతః."

విభావానుభావసాత్త్వికవ్యభిచారిభావసమ్మేళనమున స్వాద్యత్వమును (అనఁగా రసరూపేణ పరిణతిని) పొందింపఁబడు స్థాయియే (వాసనాత్మకముగ హృదయమున నుండునది) రసమని చెప్పఁబడును. విభావ మనునది రెండు విధములు: ఉద్దీపనమని ఆలంబనమని. ఆలంబన మన నాయికానాయకులు; ఉద్దీపన మన కోకిలారావాదులు. అనుభావములు కటాక్షాదులు. స్వేదరోమాంచాదులు సాత్త్వికములు. గ్లాన్యాదులు వ్యభిచారులు.

ఈ వీని సమ్మేళనముననే గదా రసనిష్పత్తి? అనఁగా ప్రతిమానవుని మనసునను వాసనారూపమగు 'స్థాయి' యను పదార్థ ముండుననియు, నేయే రసాత్మక కావ్యసందర్శనవేళ నా యాయిస్థాయి యాయాయి భావములచే నుద్బుద్ధతనుఁ బొంది యానందాత్మకమగు రసముగాఁ బరిణమించుననియుఁ జెప్పుచున్నారు. ఇట్టి రస మెవ్వరెవ్వరికిఁ గలుగవచ్చును? అనునది విచారణీయము. మొత్తమున కీ రస మనుదానితో నెట్లో యొకట్లు నేకో యొక కొంత సంబంధముగలవారు ముప్వురు. (1) అనుకార్యుఁడు (నటునిచే ననుకరింపఁబడు రామాదులు) (2) నటుఁడు (3) సామాజికుఁడు. ఈ పై ముప్వురిలో ననుకార్యునకు రస ముండకపోవుట నిర్వివాదాంశమే. ఏలనన,

"రస స్స ఏవ స్వాద్యత్వా ద్రసికస్యైవ వర్తనాత్;
నానుకార్యస్య వృత్తత్వాత్ కావ్యస్యాతత్పరత్వతః."

'రసః సఏవ'-కావ్యములం దాయాయి స్థాయీభావములచే నుపనిబద్ధమైనదే రసము. 'స్వాద్యత్వాత్' అనునది దానికిఁ గారణము. అనుభవింపఁదగినది కావ్యోపనిబద్ధమైనదే యగుటవలన దానికే రసమని పేరు. కాని అనుకార్యవర్తి యగుదానికి రసమని పేరులేదు. 'రస్యతే స్వాద్యతే; రసః' అని గదా దానిమూలము! అనుకార్యవర్తియగునది యిప్పు డనుభూత మగుచున్నది గాదుకదా! అట్టిదానిని (అనుకార్యవర్తియగు భావాదికమును) చూచుటచే ప్రేక్షకుల మనఃఫలకంబుల జాలి మొదలగునవి ఉత్పన్నమగునుగాని మరియేరసము నుద్భవింపదు. ఇది యెవ్వరికిఁ గల్గునన్న 'రసికస్యైవ'=రసికునికే, దీనికిఁ గారణము? 'వర్తనాత్'=ఇప్పుడుండుటవలన. 'నానుకార్యస్య=అనుకార్యునకు లేదు. 'వృత్తత్వాత్'=జరిగిపోయినదౌటవలన, 'కావ్యస్యాతత్పరత్వతశ్చ'=కావ్యము వృత్తరసపరము గాకపోవుటచేతను. ఒకవేళ నదిగూడ రసమే యని యొప్పిదమైనచో నిపుడు వర్తమానమున మనకు అనుభూతమగున దేది? అట్లుగాక రెండును రసములే యైనచో వర్తమానానుభూతమగు దీనికిని, భూతకాలస్థితమగు దానికిని భేదమేమి? అది యెట్టిది? ఇది యెట్టిది? అను నీలోనగు సందేహము లుత్పన్నములగును. కాన దేనికో యొకదానికే 'రస'మను నామము నిడవలెను. అట్లే యొక్కదానికే రసమను నామమిడుటలో దేని కీవలెనను విచారణయందు నటనిష్ఠమైనదానికే-అనఁగా నటుని యభినయానంతరమున నుత్పన్నమగుదానికే నా నామము తగుననిరి. కావ్యమందున్న రసమునుగూర్చి గదా మనము విచారించుచున్నది! కావ్య మెప్పుడును

వృత్తరసపరము గాఁజాలదు. వృత్తరసపరమే యైనయెడల నద్దానఁ బ్రయోజనం బేమి? దానివలన మనకుఁ గలుగు నానందమేమి? కావుననే మన సామాన్యానుభవములో భీకరమృగాదులనుగాని, జుగుప్సాకరములగు వస్తువులను గాని, చక్కని యువతీమణినిగాని చూచునప్పుడు గలుగు నాయాభావములు భయానకరసముగాఁగాని, భీభత్సరసముగాఁగాని, శృంగారరసముగాఁగాని పరిణమింపఁజాలవు. అట్లు పరిణమింపఁజాలమికి అప్పుడు మనకుఁ గలుగు భావములచే కావ్యఘటితభావశ్రవణముచేతవలె నానందము, లేక రసము ఉత్పన్నముగాకపోవుటయే కారణము.

కాని పై శ్లోకమున 'రసికస్యైవ'యనుటవల్ల రసికునకు- అనఁగా సామాజికునకు మాత్రమే యని సూచన యని వచించుచు "యదాకదాఽపి నటస్యాఽపి రసనిష్పత్తిస్తదా సోఽపి సామాజికసంజ్ఞయైవ వ్యవహర్తవ్య ఇతి"-ఒకవేళ నటునకు రసనిష్పత్తియగునెడ నాతఁడును సామాజికుఁడనియే యనఁదగు నని నుడువుచున్నారు. దీనివిషయమున నాయనుయానము: పైరీతిని నటునకు రసనిష్పత్తి యగుచో తద్గతశోకాదులలో రామాదులవలె నాతఁడు విలీనుఁడై యా యాహావభావాదులను మన కాయాచోట్ల సరిగఁ జూపఁగలఁడా? లోకమునందు నిజముగా శోకవంతుఁడుగాని, ఒక నాయికయం దనురక్తుఁడైనవాఁడు గాని చూచువారలకు రసనిష్పత్తిని గలుగఁజేయఁ జాలుచున్నారా? అట్లే నటకుఁడును చేయఁజాలఁడు. మఱియును సత్యముగ రసమున విలీనుఁడైన నేరసమున విలీనుఁడగునో, ఆ రసస్వభావము ననుసరించి 'నేను శోకించుచున్నాను, సంతోషించుచున్నాను, కోపించుచున్నాను.' అనుజ్ఞానము ఏ యింతయు లేకయే యేడ్వవలయును, సంతోషించవలయును, కోపింపవలయును. అట్లే యేడ్చుచు, సంతోషించుచుఁ, గోపించుచు నభినయించినచో నెవ్వఁడేని సామాన్యముగ నేడ్చుచు, సంతోషించుచుఁ, గోపించుచున్నపుడేమాత్రము మనకురస ముత్పన్నమగుచున్నదో యామాత్రమే యప్పుడు నుత్పన్నమగును. అనఁగ నేరసము నుత్పన్నము గాదనుట. అని నుడువుచున్నారు.

అగును, సామాన్యముగ ఏడ్పు, నేడ్పువల్ల సంతోషించు, సంతోషమువల్ల కోపించు, కోపమువల్లను రసముత్పన్నము గా దన్నంతమాత్రమున నటుఁడు రసవిలీనుఁడై యభినయించుపట్లఁ గూడ రస ముత్పన్నము గాదనరాదు. మనము మామూలుగఁ జూచువస్తువును జూచినప్పుడువలెఁగాక నొక వింతవస్తువును జూచునెడ నానందమొందు గలుగుట లేదా? అట్లానందము గలుగుటకుఁ గారణ మేమి? ఆవస్తువున నున్న విచిత్రతయే. ఏతావతా ఈ నూత్నవస్తువునందు ఆకర్షణశక్తి యొకటి గల దని యూహింపవలసియున్నది. అట్టి యాకర్షణశక్తిలేమి నీ రెండవవస్తు వానందము నొడఁగూర్పలేదు. తావతా ప్రపంచమునం దుత్పన్నములైనవేగదా రెండును? పైఁగా రెండును వస్తువులేగదా? రెండవది మాత్రము మనకే మానందమును గలుగఁజేయును అనవచ్చునా?

అట్లే యీ రసవిషయమునఁ గూడ ననుగమించుకొనవలయును. లోకమున నొకని యేడ్పున రససిద్ధి లేదు గాన నటునియేడ్పునను నది లేదనుట యుక్తమా? పై వింతవస్తువునందువలెనే కావ్యోపనిబద్ధమై నటునిచే నభినయించఁబడుచున్నపుడు వాఁ డారసమందు విలీనుఁడైనను కాకపోయినను మనకు రసోత్పత్తియగునెడ నాయభినయపూర్వకంబగు రసమునం దాకర్షకస్వభావము గలిగినట్టియు లౌకికవిభిన్నమైనట్టియు నొకశక్తియున్నదని యొప్పికొనవలదా? మన యొక్కొకతఱి నటుఁడు పూర్తిగ విలీనుఁడై యభినయమ్మొనరించుచున్నను రసోత్పత్తి యగుట కాంచుటలేదా? అది మన కనుభవవిరుద్ధమా? ఏతావతా విభావాదులచేఁ గూర్పఁబడినదైన లోకవృత్తము నాటకరూపమున తన్మయస్థితి గల్గిన నటునిచే నభినయింపఁబడినను దానియం దాశక్తి గలదనియు, మామూలుగ లోకములోనివానియందు లేదనియు నొప్పుకొనవలయును.

ఇంకొకటి. నటునకు రససిద్ధి లేదనుటలో వారు చెప్పు రెండవ కారణము నింత పరిశీలింతము. నటుఁడు

పూర్తిగ రసమునందు విలీనుఁడై యభినయించుపట్ల తత్తదున్మాదాదులందు నైక్యమును బొంది యభినయచాతురిని సరిగఁ జూపలేఁడని. ఇది సర్వత్ర నిక్కమయనుటకు వీలులేదు. ఒకపని బాగుగ చేతనైనమనుజుఁడు దానియందు మనసు నేకాంతముగ నుంచియే చేయనక్కఱలేదు. అవయవముల కాపని యలవడియుంటవలన వ్యక్తిగతప్రయత్నమేమాత్రమును లేకుండఁగనే వానియంతట నవియే యాపనిని నిర్వర్తింపఁగలవు. అట్లే యభినయవిద్యను చక్కఁగ నేర్చినవాఁడు ఆయా యవయవచాలనము మొదలగు వానిని సమయానుకూలముగ నతుకునట్లు, అభ్యాసపాటవమున మనసు స్వవశమున లేనప్పుడును చేయుచు రసము నుత్పాదింపఁ జేయఁగలఁడు. అప్పుడును నటుఁడు రసమునందు విలీనుఁడుగాక, అభినయించునపు డెట్టి రసము, ఎట్టియానందము మనకుఁ గల్గునో వాఁడు విలీనుఁడై యభినయించునపుడును అట్టిరసమే యుత్పన్నమగుచున్నదిగదా? ఇట్లగుటచే నా కొలఁదిసేపుమాత్రము ఆతఁడు నటుఁ డేలకాఁడు? సామాజికుఁ డెట్లగుచున్నాఁడు?

మఱొకటి. మనము సాధారణముగ వినుచున్నాము. లోకమున తనకు బాగుగ నలిగిన, అభ్యాసమైన లేక అలవాటుపడిన బాటయందు నిద్రించుచు కొందఱు నడచుచుందు రని. అట్లుచూచుచున్నాముగూడ. దానికిఁ గారణ మేమి? బాగుగ నాబాట వానికి గుర్తుపడియుండుటయే. అట్లు నిమీలితనేత్రుఁడై నడచుచున్నను వాఁడు దారితప్పఁడు. అయినను, ఆనిద్రించుచు నడచుచున్నంతవఱకు వాని నున్మత్తుఁ డనియందుమా? అట్లే బాగుగ నాట్యపథమున నడువ నలవడిన నటకుఁడు- నాట్యసరణిని కాలానుగుణ్యేన అభ్యసించిననటకుఁడు, నాట్యదేవతను మనసార పూజించి యుపాసించి సిద్ధిగన్న నటకుఁడు సామాజికునివలెనే తద్గతరసమును గ్రోలుచు నట్లు గ్రోలక యభినయించు నటునివలెనే రసము నుత్పాదింపఁజేసి సామాజికుల నందఱిని యారసవాహినులం దోలలాడింపఁగలఁడు.

అనుభవము గల నటకులు కొందఱు చెప్పుచున్నారు: “నటుఁడు రసభావాదులలో పూర్తిగ విలీనుఁడు కాఁజాలఁడు. వాఁడు విలీనుఁడౌచు మఱల వెన్వెంటనే యౌచిత్యాదుల నాలోచించుకొనుచు నీరీతిగ నభినయింపవలెను. దాదాపు వీనియవస్థ నేలఁగొట్టఁబడిన బంతివంటిదని చెప్పుచున్నారు. బంతి కొట్టఁబడి గాలిలోని కెగిరి తరువాత నెట్లు క్రిందఁబడుచున్నదో యట్లే నటుఁ డాయను కార్యసిలోని కెగిరి మరల మరల క్రిందఁబడుచున్నాఁడు. అట్లులేనియెడల రసభంగము గలుగఁగలదు. కావున వాఁ డెంత రసవిలీనుఁడైనను కొంత బాహ్యప్రపంచ జ్ఞానముగూడ నాసమయమున నుండవలయును”. ఇది కేవలము వారి వారి యనుభవమే యైనచో దీని ముందు మన సమాధానములు సాగవు.

నాటకముల పరిస్థితియిది. నాటకములకును నాట్యకళకును సంపూర్ణమగు సంబంధము గలదు. కావున నాట్యమును తత్కళను గూర్చి యించుక విచారింతము. నాట్యమనఁగా నటించుట, అభినయించుట యీలోనగు పదము లెవ్వియైనను దానికి సరిపడును. భావానుగుణముగ కరచరణాద్యవయవ సంచాలన మొనరించుచుఁ జేయు క్రియకే నాట్యమని పేరు. తాళము, లయ మొదలగున వన్నియునుగూడ దీని కంగములు. ఆలంకారికు లిం కేమేమో నృత్తనృత్యములకు భేదముఁగల్పించి చెప్పిరిగాని అది యంతయు నిట ననావశ్యకము. సామాన్యముగ నాట్యమనఁగా తత్తత్పాత్రోచితరీతిని, తత్తద్భావానుగుణసరణిని కరచరణాద్యవయవసంచాలన మొనర్చుచు నభినయించుటయే యని చెప్పనగును.

నాట్యము కళయా?

నాట్యము కళయా యని యందురు కొందఱు. సామాన్యముగ చిత్రలేఖనము, సంగీతము, కవిత్వము కళలని వ్యవహరించుచుందురు మనపెద్దలు. కాని కళయన నాయుద్దేశమేమన, ఏది కొంతయైన పూర్వజన్మవాసన లేక లభింపదో యది కళ; ఏది యొకానొకవ్యక్తికి అత్యంతము కృషిలేక

స్వతస్సిద్ధముగ, ప్రకృతిసిద్ధముగ దానియంత టది యబ్బునో అది కళ; ఏది దైవికముగ నబ్బునో యదికళ; సంగీతము, చిత్రలేఖనము, కవిత్వము, నాట్యము, ఈ మున్నగున వన్నియు నట్లు జన్మతః అబ్బవలసిన వే. బలవంతముగ కృషిఁజేసి తెచ్చుకొన్నను వారు ప్రకృతిసిద్ధముగు కళాపరిచితి కలవారు కానేరరు. ఇట్టివారు ప్రతి కళలోను కలరు. నేఁడు పత్రికలలో వెలువడుచున్న కవులందఱును తత్కళను గుర్తెఱింగిన వారేనా? నేఁటిగాయకులందఱును గానకళను తెలిసినవారేనా? నేఁటిచిత్రలేఖకులందఱును చిత్రలేఖనము నభ్యసించినవారేనా? కావున నేదియో మారుమూల లోకప్రతీతి ననుసరించి నాట్యము కళ గాదనుట వేఱిడితనము. ఇదియును వానివలె జన్మత, యలవడవలసిన దేగాని వేరుగాదు. ఏకోపమునుగాని, ఏశృంగారమునుగాని, ఏకరుణమునుగాని, మఱేయితరమునుగాని స్వాభావికముగ ప్రకృతిసిద్ధముగ నలువురికి నచ్చునట్లుగఁ జూపింపవలయునన్న సామాన్యమా? ఎరువు సొమ్ము ఎరువుసొమ్మే.

నాట్యమున గాన మవసరమా ?

దీనిని గుఱించి యనేకు లనేకరీతుల వాదాడుచున్నారు. అసలు నాటకములలో గాన మనావశ్యకమని కొందఱు; తగినంత యుండవలెనని కొందఱు; బాగుగ నుండవలెనని కొందఱు. పై వానికి కారణములు: నాటకమున జరిగిన కథను సత్యముగఁ జూపుట ఆనాఁడు రామపాత్రగాని, మరి యేరాధపాత్రగాని యిట్లు గానమొనర్చి యుండెనా? నాటకమున రసము వెల్లివిరియవలయునే! అట్లు వెల్లివిరియవలెనన్న గానము దాని కభ్యంతరము గాదా? ప్రకృతిసిద్ధముగ నానాఁడు జరిగిన కథను నీవాడుచుంటివి. ఆనాఁటిపాత్ర గానమొనర్చి యుండలేదు. నీవు గానమొనర్చుచుంటివి. ఇది విరుద్ధముగాదా? అని యందురు. ఈవిషయమున నాకొక సందియము. వాఁడెట్లు మాట్లాడెనో, ఎట్లు నడచెనో, ఏమిచేసెనో, అదియే యట్లే చేయవలయునన్న సాగివచ్చునా? ఈ గ్రాంథికరూపవచనము నాపాత్ర సంభాషించియుండెనా? కావున ప్రకృతిసిద్ధముగా ననుటలో కొంత వ్యవధి గలదు. కొంత నియమము గలదు. దానికి నటులయొక్కయు, సహృదయులయొక్కయు హృదయములే నిర్ణాయకస్థానములు. ఔచిత్యభంగము కలుగకుండ, రసచ్యుతి రాకుండ, భావప్రభ పడకుండ నెంతవఱకుండునో, అట్లుండవలెనన్న నేమేమి చేయనగునో యాలోచించి నటింపవలయును. అంతవఱకు నటునకు స్వాతంత్ర్య మీయవలయును. వారన్న నియమమున నైనచో నాటకమున పద్యములే యుండఁగూడదన్నచో నదునైన సాగదేమో? అని నేను తలఁచుచున్నాను పై విప్రతిపత్తులవల్ల. కాని రవీంద్రనాథ ఠాకూరు మొదలగువారి యాంగ్లీకరణములను కొన్నిటిని కొన్నికొన్ని పత్రికలలో చూచితిని. నాటకములలో సీనరీ మొదలగున వేమియు నుండఁగూడదనియు, గానము సామాన్యముగా నుండకుండుటయే మంచిదనియు, ఈ పైపై మెఱుగులు నటుని శక్తి నంతయు మ్రింగివేయుననియు, ఏపరికరములును లేక నిరాడంబరముగ నటించి యెవరు సామాజికులను తన్మయులను గావింపఁగలుగుదురో వారే నటకులనియు వారి ప్రతిభయే ప్రశంసనీయమనియు నుడివియుండిరి. ఇట్లు మనకు ఆదర్శములు గూడ గలవు. ఆరిపోవు దీపప్రభవలె నింకను మిణుకు మిణుకు మని అచ్చటచ్చట తలలెత్తుచున్న కూచిపూడి భాగవతసమాజములు, ఇంకను ఇతరవీథినాటకసమాజములు మొదలైనవి. నాగరికత నాట్యప్రపంచమున యింకను బాగుగ తలయెత్తని సుమా రిరువదిముప్పదిసంవత్సరములక్రిందమాట చెప్పలేనుగాని నేఁటి పరిస్థితినిఁబట్టి వానినిఁ జూచినచో 'రాజును జూచిన కన్నులతో మొగనిఁజూచిన మొట్టబుద్ధియయ్యె' నన్న ట్లగునేమో? అనుభవమును బట్టిచూచిన నట్లు గన్పట్టుచున్నది.

ఇఁక గానము పూర్తిగ గావలయుననువారు. నాటకమనఁగా సంతోషమునకును, కొంతవఱకు కాలక్షేపమునకు నని వారి యుద్దేశము. నాటకమన నేమియో, అయ్యది యెందుల కుత్పన్నమయ్యెనో, దాని యుద్దేశమేమో మొదలు తుద తెలియదు. ఊఱక పాడిన వారికి

సంతోషము. లేనిచో విసువు. నాటకోద్దేశమే తెలియని వీరిమతము నవలోకించవలసిన పని మనకేల? ఇప్పు డీపిల్లలతో కొనసాగింపఁబడుచున్న బాలమిత్రసభ మొదలగున వన్నియు నిట్లే యుద్దేశపడుచున్నవి. ఆసమాజములలోని నటకులు గానముమీఁదనే కేవల మాధారపడియుందురుగాని రసభావాదులకై ప్రయత్నమైన చేయరు. చేయవలయునని వారికి తెలియదు. అట్లాయధినేత చేయింపఁడు. తలఁచి చూచిన సామాజికులలోఁ గూడ నట్టి దుర్బలులే యేర్పడుచున్నారేమో? లేనిచో వారి యాట లట్లేల సాగును? అభ్యాసపాటవములు నశించినవి.

కేవలసాంఘికనాటకములలో "కన్యాశుల్కము" మొదలగువానిలో గాన మక్కరలేదు. శాకుంతలమున స్వల్పముగను, విక్రమోర్వశీయమున విపులముగను కాళిదాసు గానమును జొనిపినాఁడు. లాక్షణికులు నాట్యమునకు గానమునుగూడ సహాయకళగా నిరూపించియున్నారు. పద్యమున నున్న సహజగానమునకు గానము నెచ్చెలి. అది భావుకులకు రసవ్యంజకమగునెడల దానిని విడనాడవలయునని వివదించుట సమంజసము కానేరదుగదా?

తగినంతగాన ముండవలయును

గానము భావము నుద్దీపింపఁజేయునదిగా నుండవలయునుగాని భావమును మ్రింగివైచు న ట్లుండఁగూడదు. ఇపుడు నాటకములలో పాడఁబడుగానమున భావము ఆకసమున మిణుకుమిణుకు మని వెలుఁగు చుక్కలవలె ప్రకాశించుచున్నది. నాట్యప్రపంచమున భావము రాజ్యమేలవలసినదానికి బదులు గానమే రాజ్య మేలుచున్నది. అంతయు తలక్రిందై తారుమారైనది. కావున నెంతవరకు గానముండుట యుక్తమో, ఎట్లున్న నౌచిత్యభంగము గలుగదో అంతమాత్రముండుటయు పాడియగును.

నాట్యమందిరము

నాట్యమందిరము ప్రాణము గల దివ్యక్షేత్రము వంటిది. దివ్యక్షేత్రము తైర్థికులకు సుఖమును జేకూర్చునట్లే నాట్యమందిర మను దివ్యక్షేత్రము సామాజికులకానందమును జేకూర్చును. నీచునిమొదలు జ్ఞానివఱకు, దరిద్రుఁడాది ధరాపాలునివఱకు, భోగకాంతనుండి కులకాంతవఱకును గల ప్రవర్తనములను వేరువేరుగా జూపి 'హేయమిది, ఉపాదేయమిది' అని నిగూఢముగా నిరూపించును; రహస్యముగా బోధించును.

యువకుఁడగుట, సాధువైయుండుట, చదువుగలవాఁడైయుండుట, శాసకుఁడు దృఢిష్ఠుఁడు బలిష్ఠుఁడునైయుండుట ఈలోనగునవన్నియు మానుషానందములు. మానుషానందముగూడ రసానందమునకు వాచకొనును. కావున మానుషానందాతీతమగు రసానందకందరమగు నాట్యమందిరము నెవ్వ రీదులాడనిచ్ఛగింపరు? నాట్యమందిరమున ప్రేక్షకుల లౌకికానంద మలౌకికానందముగా మారును. ఆతఁడపుడు ఏమిచేయుచుండెనో, ఎందుండెనో వానికే తెలియదు. ఇట్టిది సావలంబనసమాధివంటిదఁట.

నటులును, సహృదయులును కేవల మలౌకికానందప్రవాహమున జలకముల నాడుచుందురు. ఒక నిముషమున నెంతమార్పు! ఎంతవిచిత్రము! ఎంతమాయ! సుఖపర్వతశిఖరాగ్రమునకుఁ గొంపోవు నీ నాట్యమందిర మెంత పవిత్రము?

పూర్వము నాట్యమందిరములును, నాటకసమాజములును నొక్కనిచే కొనసాగింపఁబడుచుండెడివఁట! అప్పుడప్పు డేయుత్సవసందర్భములలోనో తలుపులు తెఱువఁబడుచుండెడివి. కావున నప్పటి ప్రదర్శనములు చాల ప్రశాంతితో సాగిపోవుచుండెడివి.

ఇప్పుడో, సార్వజనీనమై, వీలయినపుడెల్ల వీలయినరేట్లలో తెఱువఁబడుచుండుటచే వానిగౌరవము తగ్గినది. ఇట్టివిధానమువలన పూర్తిగ నష్టముగలదు. ప్రతివానికిని నటునిపై హక్కుగలిగియుండుటచే వాని కేమాత్ర మెట్టి యసౌకర్యము గలిగినను నటునికి గౌరవహానినిఁ గలుగఁజేయుచున్నాఁడు. సంతసముగలిగెనా, తందనా లాడును. కలుగకపోయెనా, వేలకువేలు ఋణమిచ్చినవానివలె నల్లరి చేయును. ఈవిధానము నటునికిఁగల గౌరవాదరణములను

తగ్గించుచున్నడి. సతతప్రదర్శనమువలన ప్రతిపదతారళ్య మును, సౌందర్యమును, జీవమును, శక్తిని, కుంచించుకొని జడత్వమును, మోటుదనమును నటునకుఁ గలుగుచున్నవి. వీని ననుసరించి విసువు నాపాదించుచున్నది.

నటునకు విశ్రాంతి ముఖ్యము. ఆతనిచూపులు ఇది యదియనక ప్రపంచమున సర్వవస్తుసంచయములోను లీన ము గావలయును. ప్రదర్శనప్రదర్శనమునకు మధ్యను నూత్నభావములు వానిలో నెన్నెన్నియో యంకురింపవల యును. దానికి కాలవ్యవధి ముఖ్యము. అట్లు తగినవిశ్రాంతియే లేనియెడల నటుఁడు కొలఁదికాలముననే జీవచ్ఛవ మగును. ఎంతపాటవము గలిగిన నటుఁడైనను ఒకే రూపక మును రెండుమూఁడుసార్లు వెన్వెంటఁ బ్రదర్శించెనేని నాల్గవసారియే సహృదయుని నాతఁ డాకర్షించలేఁడు. తనపై సామాజికులకు మొదటఁ గలిగిన యభిప్రాయము లను నిలువఁబెట్టికొనుటకును, నూత్నరూపము నొందుట కును నటునకు కాలము కామధేనువే.

ప్రసాధనమందిరము (Green Room)

ప్రసాధనమందిరమును చాల పవిత్రముగ నుంచ వలయును. ఇప్పటి ప్రసాధనమందిరములు కేవలము చుట్టలు మొదలైనవానితో నిండియుండును. ఆ ప్రసాధ నమందిరమున కితరులను చొరనీయఁగూడదు. ఆప్రసా ధనసమయమున నున్న గుట్టుమట్లు ప్రేక్షకునకు తెలిసి నచో తేలికయగును నటుఁడన్నను, నాట్యమన్నను. వైద్యుఁడు కడుపునొప్పి కిచ్చునది జీలకఱ్ఱమందే; కాని రోగి కది జీలకఱ్ఱయనియే తెలిసిన నామందు జీలకఱ్ఱ మందే యగును. కావున రహస్యమున నంతయు నిమిడి యున్నది. ప్రసాధనమందిరమున నుండు ప్రసాధకులును, నటకులును ఏకోదరులవలె, మిత్రులవలె కలిసిమెలసి యుండనగును. ఇట్లున్న ప్రసాధనమందిరముకంటె పవిత్ర మైనది మరి ప్రపంచమున నేది కలదు?

నటుఁడు

నటుఁడుత్తముఁడై యుండవలయును. సర్వసద్గుణ ముల కాటపట్టైనవాఁడుగా నుండవలయును. తనపాత్ర మును బాగుగ నభ్యసించుట, నిలకడగలిగియుండుట యను నీ మున్నగునవి ముఖ్యములు.

నాటకకవికిని నటునకును చాల సంబంధముగలదు. నాటకమునందు కవి నిర్మించిన పాత్రకు జీవమునుపోయ వలసినవాఁడు నటుఁడు.

అతఁడు కవినిర్మితమగు పాత్రకు తనప్రా ణములను తాకట్టుపెట్టి, తన యస్తిత్వమునుసైతము దానికే దానమిచ్చునంతటి దాత. అట్టి సమయమున వాని మానసకాసార మెంత నిర్మలముగ ప్రవహిం చుచుండునో ఎఱుఁగ నెవరి కగును? వాచకుని (Prompter) వాక్యమును విన్నంతనే నేలను కొట్టఁ బడినబంతివలె లేచి అనుకార్యునియందు లీనమై వాని సుఖదుఃఖములను మోసికొని మఱలివచ్చి అవన్నియుఁ దనవిగాఁ దలంచుకొని ప్రేక్షకులను నవ్వి నవ్వించి, యేడ్చి యేడ్పించి వారిహృదయములను తన సేవకులఁజేసికొనును. కవిరాజుల తర్వాత నటరాజులదే కదా రాజ్యము! కవిప్రతిభను సంపూర్ణముగ గ్రహింపఁగలవాఁడు నటుఁడే. కవిపాత్రలకు వన్నెపెట్టఁగల దర్పణము నటుఁడే. కవిని వివరించఁగల వ్యాఖ్యానము నటుఁడే. నటకుఁడనఁగా మనుజుల వివిధప్రకృతు లొక్కచో చూపింపఁబడఁగలందు లకు సర్వప్రకృతులకు ప్రతినిధిగా బ్రహ్మచే సృష్టింపఁ బడిన బొమ్మవంటివాఁడు. నటుని ప్రపంచమునం దానం దముతప్ప వేరొండు కన్పట్టదు. సృష్టికి ప్రతిసృష్టిఁజేయఁ గలవాఁడు నటుఁడు. దుఃఖమును సంతోషముగా మార్చఁగలవాఁడు నటుఁడు. ధర్మము నధర్మముగా మార్చఁగలవాఁడు నటుఁడు. సత్యము నసత్యముఁజేయఁ గలవాఁడు నటుఁడు. సీతయేడ్చుటనుచూచి యేడ్చువా రెందఱు లేరు? హరిశ్చంద్రుఁడు దుఃఖించుచుండ అశ్రువుల నెందఱు విడువరు? చారుదత్తుని దుఃఖము నెందఱు పంచుకొనఁజూడరు? అం దేమి సుఖము గలదో? నటుఁ డన కవివలన నేర్పఱుపఁబడిన పోతవిగ్రహముగాఁడు. అతఁడు తన సూక్ష్మపరిశీలనముచే లౌకికము నలౌకికముగా మార్చుకొనును. లోకవేషభాషాదులలో, నడవడికలలో

తనకుఁ బనిగలదానిని గ్రహించి హంస పనికిరానినీరమును విడిచినట్లు విడువఁగలఁడు. అతఁడెంత పనికిమాలిన వేషమును ధరించినను, అది యుత్తమోత్తమ మగును. అన్నిటియందును అద్భుతము నావహింపఁ జేయఁగలవాఁడు నటుఁడు. దాదాపు నటుని గారడీఁడని చెప్పవచ్చును. ఏనటుఁడొనర్చినపనిని లోక మనుకరింపఁ బ్రయత్నించునో, వాని నటనము చరమసీమను పొందిన దగును. వాని నడకలలో నడకలు, చూపులలో చూపులు లీనమైపోవును ఇతరమనుజులవి.

కాని ప్రస్తుతము మన కగుపడుచున్న నటకుల దురభ్యాసములవల్లను, తెలివిమాలినతనమువల్లను నాట్యకళ మృతకళయై యున్నది. ప్రతినటకుఁడును కేవలము జీవికకొఱకే దాని నభ్యసించుచున్నాఁడు. జీవికకొఱకు గాని, కీర్తికొఱకుగాని దాని నభ్యసింపఁగూడదు. విచారింపఁగా నటుని జీవితమంతటి యొడుదుడుకుజీవిత మింకొకటి లేదు. నేఁటియుగమున చాలమంది పిన్నవయసువారు చదువుసంధ్యలను వీడి యెవ్వరినో, ఏపెద్దనటకునినో చూచి నాట్యకళయందు శీఘ్రముగఁ బేరుప్రఖ్యాతులఁ బడయనగునని తలఁచి పులినిఁజూచి నక్క వాతవెట్టుకొన్న చందమున దానిలోఁ బ్రవేశించి కొఱమాలినవారై పోవుచున్నారు. చదువునకు నాట్యమునకు సంబంధము లేదని వారి యుద్దేశము. దానంత వెరిశితనమింక నొకటి కలదా? జీవితోద్దేశములను ఎఱుఁగనివాఁడు నటుఁడు కాఁజాలఁడు. అట్టివాని జీవితము కొన్ని రాత్రులలో, అందును కొన్నిఘంటలు మాత్రమే. ఇంచుమించుగా నతనికి సూర్యభగవానుని దర్శన ముండ దన వచ్చును. కావున నే

ఉ. నీతలపైని దివ్యతపనీయకిరీట మెసంగదా
ఘాతముఁ జెందు నీబుజము, కంచుకిలోనుగ నీదు సేవక
వ్రాతము 'దేవ' యంచనదు వచ్చును; ఓఁడిపోదావ? ఆటత
ర్వాత మధీరసంబెకదరా! వినులున్నట! నీదుసెమ్మెయిస్.

అని చెప్పఁబడినది. కావున నుచితరీతి నుండెనా, నటునియంతటి యాదర్శప్రాయుఁడు లేఁడు. వానియంతటి యుత్తముఁడు లేఁడు. వానియంతటి జ్ఞాని లేఁడు. కొంచెము దారితప్పినా, వానిజన్మవంటి నీచజన్మ యింక నొకటి యుండఁబోదు. భూమిపై సంచరించు క్రిమికీటకాదులకంటెను నధముఁడు వాఁడే. కావున నటుని జీవితము కత్తిపై సామువంటిది. అన్నము మానవజీవితమునకు మూలము. అదియే కొంచెము హెచ్చైన మానవజీవితభంజనమునకు మూలము. కొన్నికొన్ని వస్తువులలో మంచిచెడ్డలు రెండు నిమిడియుండును. చెడుగు గూడ గలదుగదా యని దానిని పరిత్యజింతుమా? మన కుపయుక్తమగురీతిని చెడుగు బైటికి రాకుండునట్లు వాడుకొందుము. విషము ప్రాణహానికరము. అదియే యొకప్పుడు ప్రాణదాయక మగుచున్నది. కావున నటకు లందఱును కాపథచారులై తమజీవితములను కళంకపంకీభూతములనుగాఁ గావించుకొని నాట్యకళను గూడ నీచస్థితికి తేఁజూడక, ఉత్తమగుణముల నలవఱుచుకొని యాదర్శప్రాయులై తామున్నతిని బొంది నాట్యకళకును ఔన్నత్యమును జేకూర్తురుగాక!

ఇఁక కొంచెము మాత్రము చెప్పి విరమించెదను.

నేఁటి నటకుల యాశయములు

అధునాతనసుప్రసిద్ధనటకులు కొందఱును, నాట్యకళాభిమానులు కొందఱును నూతనత్వస్థాపకులమనియో, వైలక్షణ్యభావకులమనియో యభిప్రాయపడుచు రంగమును కొంత దుఃస్థితికి మార్చుచున్నారు.

మగవారికి లజ్జాదిభావములు స్వాభావికములు గావనియు, అట్లగుట మగవారు స్త్రీ పాత్రముల ధరించుపట్ల నాలజ్జాదులు సువ్యక్తములు గాఁజాలవనియు, అథవా, ఏరీతిగనో కొంత వ్యక్తీకరింపఁ గలిగినను ప్రకృతులు ప్రకృతులే వికృతులు వికృతులే యనియు, ఆకారణమున స్త్రీలే స్త్రీపాత్రములను, పురుషులే పురుషపాత్రములను ధరించుట న్యాయమనియు వాక్రుచ్చుటయేగాక యట్లాచరించున ట్లాచరింపఁ జేయుచున్నారు. ఇట్టిదానిచే రసము సువ్యక్తముకాదు సరిగదా? మీఁదుమిక్కిలి రసభంజకము గూడ నగును.

ఇప్పుడీబయలు వెడలు సమాజములలో రెండు రకము లుత్తమములని నాయభిమతము. ఏకకుటుంబమునందలి పురుషులు, స్త్రీలు కలసి రంగమున నభినయించుట మొదటిరకము. మామూలుగ పురుషులు కలసి యభినయించుట రెండవది.

ఈ పై రెండు నిట్లుండ పురుషులవలెనే స్త్రీలు కూడ స్వచ్ఛందముగ (అన్యపురుషులతో నన్యస్త్రీలు) పాత్రముల ధరించవచ్చునని యీమన యధునాతనపండిత ప్రకాండుల మతి.

నాటకమనఁగా సామాన్యముగ ననుభవమున జరిగిపోయిన నొక ప్రసిద్ధకథాత్మకము, లేక కల్పితకథాత్మకము. అట్లు జరిగిపోయినదాని నిప్పుడు సత్యముగ జరుగుచున్నట్లు చూపవలయును. ఇంచుమించు మిథ్యాత్మకము నమిథ్యాత్మకముగ వ్యక్తపఱచుటయందు పరిణమించుచున్నది.

స్త్రీలు స్త్రీపాత్రముల ధరించిన లజ్జాదిభావములు సువ్యక్తములగుననియు, రసధుని యనాటంకముగా స్రవించుననియుఁగదా! నాట్యరంగమునం దిప్పుడు పాత్రధారులై యుండి యింతయో యంతయో శాస్త్రానుగుణ్యమునను, లోకానుగుణ్యమునను అభినయింపఁగలరని పేరెన్నికఁగన్న నటకులు కన్పఱచెడి యాయా హావభావాదుల నే స్త్రీ యే పురుషుని పజ్జ నభినయించుచున్నది? మనకండ్ల యెదుట నాయికానాయకులకు సంభాషణ జరుగునెడ వారికగు హావభావాదులవల్ల రంగమునందు కన్పట్టిన వానివల్లవలె నానంద ముత్పన్న మగుచున్నదా? అయ్యది రసమని యనఁబడుచున్నదా? లేదు. ఎందుచేత? ఉభయమునకును భేదముండుటవల్ల. అట్లే రంగమునందలి హావభావాదులును మన సామాన్యవనితల హావభావాదులును దూరబాంధవ్యము గలవి. అందుచేత వారు రంగమునకు దిగినను వాని నభ్యసింపవలసినవారే యగుదురు. అట్టి యెడఁ బైవా రభిప్రాయ పడినట్లు అది ప్రకృతిసిద్ధముగఁ గన్పట్టు టెట్లు?

దానివలన నగు నష్టము

స్త్రీలకుఁ బురుషసాన్నిధ్యము గలిగినపుడు, పురుషులకు స్త్రీసాన్నిధ్యము గలిగినపుడు వికృతికిఁ బాలగుట ప్రకృతియనుట సర్వవిదితమే గదా? 'వికారహేతౌ సతి విక్రియంతే యేషాం న చేతాంసి త ఏవ ధీరాః' అన్నట్టి యే మహామహులమాటో మనము చెప్పలేముగాని పైనిది సర్వసామాన్యము, అట్లు చలించుటవల్ల కలుగు నితరనష్టములను ప్రత్యక్షముగ నానోట నుడువఁబనిలేదు. అవి సర్వజనవిదితములే గూడ నై యుండవచ్చును.

ప్రకృతము ఒక స్త్రీ స్త్రీపాత్రమును ధరించి పరపురుషునికడ నభినయించుచున్నదనుకొనుఁడు. వారిద్దఱు నాయికానాయకులు. ఆలింగనాదు లావశ్యకములు. చలింపకుండునా చిత్తము? అట్లు వికృతచిత్తులే యగు వారు సరిగ నెట్లభినయించఁగలరు? ఒకవేళఁ బైయుక్తికి శక్తులగు వారే ధరింతు రనుకొందము. అత్తఱిని లోకమునకైన వెఱువవలదా?

చూడుఁడు, ప్రహ్లాదమున్నగు వీరరసప్రధానములగు నాటకములందు పరస్త్రీపరపురుషులు లీలావతీహిరణ్యకశ్యపపాత్రల ధరించి యభినయించునపుడు ఎన్నియసందర్భములు కలుగును? విషాదులచే ప్రహ్లాదుని హరినామస్మరణము మానకున్నందున చంపయత్నించుచుండ హిరణ్యకశ్యపుని బ్రతిమాలుచు, ఆప్రయత్నము నుండి తన నాథుని వారింపఁ దివురుచు నెంతకును ఫలము గానక ప్రహ్లాదుని నక్కునఁ జేర్చుకొనియుండును. లీలావతి కోపముచే హిరణ్యకశిపుఁడు వానిని లాగికొనఁజూచును. కోపాభిభూతచేతస్కుఁడగుట ఒడలెఱుంగఁడు. అట్టి యప్పు డేవతకమునందో చేయిదగిలినచో సామాజికుల కేరసము కల్గును? రససువ్యక్తతయన్న నిట్టిదేనా? అయ్యది ప్రమాదముననే జరుగుగాక, మరెట్లైన జరుగుగాక, అంత బాహిరముగ జఱుగుట యుక్తమగునా? అసభ్యము దానికంటె వేఱొండుండునా? లేదా కోపోపహతచిత్తుఁడైనను లీలావతిపట్ల శాంతుఁడు కావలయును.

ఇట్లైనను రసభంగమేగదా? ఇట్టినాటకముల నేననేకములను చూచియుంటిని. అందు మొన్న మొన్న నొకసుప్రసిద్ధ నటకులు స్త్రీలచే నభియింపఁజేసిరి స్త్రీపాత్రములను. వానిలో ప్రహ్లాదయొక్కటి. దానికి నేను నొకప్రేక్షకుఁడనైతిని. వారు చాల సుప్రసిద్ధనటకులని ప్రథ. ప్రహ్లాదుని లాగిపోఁడువఁబోవునపుడు లీలావతియడ్డురా నెంత కోపావేశుఁడైయున్నను పరమశాంతుఁ డయ్యెడివాఁడు. ముఖవికాసములు శాంతికనుకూలముగ నుండుటయే అట్టిదానిని తెలియఁజేయుచున్నది. వారే పురుషునిచే లీలావతివేయించి యభినయించిన ప్రదర్శనములకును వీనికిని గూడ పోయిచూచితిని. నాకుమటుకు మొదటిదానికంటె రెండవది చాల యసభ్యముగా కన్పట్టినది. చాలమంది యితరప్రేక్షకులవల్లను నట్లే వినియుంటిని. అట్లాయనగా రెంత జాగ్రత్తగా మెలఁగినను రావలసిన లేఁతమాట రానేవచ్చినది. పొరబాటున నాయన హస్తాఘాతము ప్రహ్లాదునిపై తగులవలసినది లీలావతీవక్షముపై తగిలెను. దుఃఖము నంతదనుక నభినయించుచున్న లీలావతి సిగ్గు నభినయించెను. నలువురిలో నిట్లయ్యెఁగాదా యని వందురఁజొచ్చెను. ఇట్టిదానిని జూచి యీ నూతనత్వాభిలాషులే ఏవగించుకొనిరి. పైకిమాత్ర మెవ్వ రేమియు మాటాడలేదు. పెద్దలతప్పులు బైటకు వచ్చునా?

విచిత్రము! వీరిట్లు వాదించుచు భరతాదులు గూడ దీనికంగీకరించిరని నుడువుచున్నారు. అది యసత్యము. మనము పైనను కొన్న శ్లోకకుటుంబీకుల విషయమేగాని యది పరస్త్రీపరపురుషుల విషయముగాదు. అతఁడైనను దాని నంత ప్రధానముగఁ జెప్పినట్లు లేదు. కంఠమార్దవము స్వాభావికముగ వారి కలవడియుండును గాన వారే ధరించినబాగని చెప్పిన ట్లున్నది. వీ రనుకొనినట్లు లజ్జాదులు సరిగా సువ్యక్తములు కాఁజాలవనిగాని, వారే ధరించుటవల్ల నింతకంటె రసస్ఫూర్తి యెక్కుడుగా నగుననిగాని వా రూహించి చెప్పినట్లు లేదు.

ఇట్టి దురూహాలకును, దురభ్యాసములకును లోనై పెద్దలకు ఈకళయం దసూయ జనించునట్లు చేయుచున్నారు కొందఱు నటకులు. పంక్తిబాహ్యు లనిపించుచున్నారు. కావున నటకులందఱును ఇట్టివానినిఁ దొలఁగింపఁ జూతురుగాక!

సహృదయులగు జనులుగూడ కొందఱు అన లీకళయందే యట్టి దురభ్యాసములకు తావుగలదని పొరబడుచున్నారు. నటకుల లోపమును కళయం దాపాదించుట పాడియా? లెస్సయా? ఇంకనైన ప్రపంచమున నట్టి యభిప్రాయము మట్టగుఁగాక! ఇంతయేల? మన హిందూదేశమందేగాక సమస్తదేశములందును సమస్తదేశీయులచేతను నన్నింటఁ బెద్దగా నెంచఁబడుచున్న సంస్కృతభాషయందుఁగూడ మతిమంతులకు నాకళ కొన్నివందల సంవత్సరములనుండి నేఁటిదాక శ్లాఘాపూర్వకోద్ఘాటనమునకుఁ దా విచ్చియున్నది. ఇతరమగు నేకళకు దీనివంటితావు గలదు? అంతంతటి మహాశయులు సైతమంతటి యాదరముతో దానియందుఁ బ్రవర్తించుటకుఁ గారణ మేమి? అంత నిందాపాత్రమే యైన వారుమాత్రము దానియం దంతటి యాదరాతిశయములను జూపుదురా? కేవలము మునియే! ఆభరతుఁడు పొరబడునా? కావున నిట్టినిందల కెంతమాత్ర మది తావలముగాదనియు మిక్కిలి యుత్కృష్టమైనదై యున్నదనియు నామనవి. ఏనింద దాని కాపాదింపఁబడినను అయ్యది నటకుల దౌరాత్మ్యమని యెంచుటయు పాడి.






# సావిత్రీ మృత్యుదేవతోపాలంభము

తాడూరి లక్ష్మీనరసింహారావు పంతులుగారు

మృత్యువా యేలమ్మ యీరీతి నివ్వ
డత్యుదగ్రతవచ్చి యకట! మాయింటఁ
జొచ్చి నాముద్దులసుతుఁ బసిబాలు
బొచ్చెంబు లెఱుఁగని పుణ్యాలవాలు
నెట్టిదో పాపంబు పృథివిలోఁ బుణ్య
మెట్టిదో యెఱుఁగక మెసఁగెడు బాలు
నొకచెంపఁ బాలును నొకచెంప నీరుఁ
బ్రకటంబుగా రాఁగ వర్తించు బాలు
నాఁడుది యిది మఱి యవనిలో మగఁడు
వీఁడంచు నెఱుఁగక వెలసెడు బాలుఁ
దనచదువేమొకో తానేమొ గాని
మనమున నెఱుఁగక మనియెడు బాలు
వెలయంగఁ గలిగిన వేయియేండ్లకును
నిలలోన నాలుగేం డ్లెడలిన బాలు
మ్రింగితి వేలమ్మ మృత్యువా! నీకు
మ్రింగంగఁ దగువారు పృథ్విలో లేర?
మెత్తనివారిని మేదినిఁ జూడ
నొత్త బుద్ధి యటంచు నొప్పగా వినమె?
పరభామలంగూడి పాపంబు చేసి
తిరుగ సిగ్గును లేని ధీయుతుల్ గల్గ
దొంగతనముచేసి దొరవోలె మిగులఁ
బొంగుచుఁ దిరుగాడు పూరుషుల్ గల్గఁ
గల్లలు నిక్కముల్గా నాడుచుండి
పిల్లిమీఁద నెలుకఁ బిల్లిని నెలుక
మీఁద నెక్కించుచు మెలపుతోడుతను
మేదినిమీఁదను మెలఁగువారుండ
భువి నేటినిం దాఁటి పొందేది తెప్ప
దవులంగఁ బెట్టెడు ధన్యాత్ము లుండఁ
జెట్టుమీఁదికిని నెచ్చెలిని నెక్కించి
యట్టె నిచ్చెన తీయునట్టివా రుండ
నధికార కారణంబైనట్టి గర్వ
మధిగతంబుగ నంధులైనవా రుండ
నధికార కారణంబైనట్టి గర్వ
మధిగతంబుగఁ దుచ్ఛులైనవా రుండ
నధికార కారణంబైనట్టి గర్వ
మధిగతంబుగఁ గ్రూరులైనవా రుండఁ
గటకటా! లంచముల్ గైకొని సభల
నటమటమ్ముగ సాక్ష్యమాడువా రుండఁ
గటకటా! లంచముల్ గైకొని సభల
నటమటమ్ముగ వాదమాడువా రుండఁ
గటకటా! లంచముల్ గైకొని సభల
నటమటమ్ముగఁ దీర్పు నధికారు లుండ
నేలమ్మ వారల నిలలోన విడిచి
తేలమ్మ నాబాలు నిట్టె మ్రింగితివి?
కర మొడ్డుపొడవును గలవారి విడిచి
హరి హరీ! పసికూనహరియించి తేల?
పసికూన హరియింపఁ బాపమే కాక
పసిగ నీయాఁకలి చచ్చెనే చెపుమ?
భయపడితే వారి భయదరూపంబు
భయదమౌ హృదయంబు పరికించి నీవు?
దుష్టున కుండుము దూరం బటన్న
సుష్ఠువాక్యదనంబి చూడవో వారి?
నీకంటెఁ గ్రూరులు నిజము లేరంద్రు
లోకంబులోన నాలోచించి చూడ
నేనిప్డు చెప్పిన యీఖలు లెల్ల
సూనృతం బెక్కుడు సువ్వె నీకంటె.

గడుసుదనంబొకో కడు వెఱ్ఱితనమొ
వడి నిట్టు లోమృత్యువా చేసి తేల?
కర మిట్లు సర్వాధికారంబు నీకు
హరి యిచ్చినాఁ డొకో యకట నీగుణము
నరయక! యోదేవి యరయక గుణము
ధర నధికారంబు తగ దేరికీయ.

అరయక గుణ మొక్క టైనను బదవి
నరుల కొసంగుట నాగరకత్వ
మెక్కటైన కొలంది నిస్సిరో వేగ
మెక్కడో చున్న దదే మొకో వింత.

గ్రంథంబు లొక కొన్ని కంఠపాఠంబు
లంధుల గతిఁ జేసి యక్కటా యందు
ముక్కున నిడికొని మూఁడు ముక్కలను
నిక్కినిక్కి పడుచు నిట్టతాడిఁ బలె
నకట! పరీక్షలయందును దేలి
వికటమానట్లుగా వేషముల్ వేసి
తనరెడువారు విద్యావంతు లనుచు
మనమున నెంచుచు మన్నన చేసి
పృథ్విలో నధికార మీఁ జొచ్చినారు
పృథ్వీశు లొకకొంద ఱీకాలమందు.

అట్టిదానవె మృత్యువా నీవుసుమ్మి
యిట్టిదేవిద్య నా మృత్యువా, వినుమ
యిదిమంచి, యిదిచెడ్డ, యిది సూనృతంబు,
నిది కల్ల, యిది దైవ, మిది పౌరుషంబ
టం చెఱుంగు వైరు లార్వుర గెల్చి
మంచిగంధపుఁ బాత్రమధ్యమం దొక్క
పదమును రెండవపద మగ్నినుంచి
పదిలంబుగాఁగ నిమ్నతపాతమున
నెవ్వారు వ్యవహార మిలఁ జేయువార
లవ్వారు సువ్వె విద్యావంతు లవని.
అంతెకా కోయమ్మ యంతకురాల
యింతలు సేసెడు నీయట్టివార
లవని విద్యావంతురాండ్రురే? యీప
దవి నీకు నలబ్రహ్మ తా నేల యిచ్చె?
ఇచ్చెఁ బో తా నిచ్చె డిందాఁక నిన్నుఁ
బెచ్చుపెరుగనిచ్చెఁ బేర్మితో నేల?
నిన్ను దప్పింపగ నేరఁడే తాను?
నిన్నేల తప్పించు? నీవేగి తనదు
పయిఁబడుదు వటంచు భయపడుఁ జుమ్మి
భయముకా కది వాని భక్తి యా నటవె?
విద్దియ గలవారి వేగ దప్పింపఁ
దద్దయు నేర్చిన ధన్యుఁడు వాఁడు
ముదిమది దప్పిన మూఁడు గుణంబు
లదిర యొక్క వటన్న యామాట వినమె?
తన పెద్దపదవియుఁ దన పెద్దపేరుఁ
గని మనంబునఁ బెద్ద గర్వించినాఁడు
అత్తయు నొకకోడలను నట్టిమాట
చిత్తగింపకయుండ సిగ్గేల లేదొ?
తాను సేవకుఁడను తథ్యంపు మాట
మానసంబునను నుంపండు గర్వించి.



# శ్రీపదభక్తి

అనంతపంతుల రామలింగస్వామిగారు

అమరాధీశ్వరభాసమానమకుటోద్యద్రత్నరాజిప్రభా
శ్రమమై, తాపసమానసప్రసవపూజాభాజనంబై, వియ
ద్విమలద్వీపవతీభవైకపదమై వెల్గొందు నీపాదయు
గ్మము నేనొత్తెద, ముద్దులాడెద, మహాత్మా! సత్యనారాయణా!

అల కాళీయుని మూర్ధరంగమున నాట్యప్రక్రియన్ సల్పి, యా
బలిరాజేంద్రుని శీర్షభాగమున శశ్వత్కీర్తిఁ గ్రీడించి, త
త్ఫలరూపాక్షయమోక్షలక్ష్మి నిడి యవ్వారిన్ దయం బ్రోచు నీ
లలితాంఘ్రిద్వయి నాశ్రయింతు శ్రితపాలా! సత్యనారాయణా!

భరతుం డేపదభక్తుఁడై మనియె, నేపాదంబు పాషాణమున్
దరుణీరత్నముగా నొనర్పఁదగె, నుద్యద్భక్తియుక్తిన్ గుహుం
డరుదా నేపదపాంసువుల్ గడిగెనో యానాఁడు, నేఁడట్టి నీ
చరణద్వంద్వము నాశ్రయింతు జగదీశా! సత్యనారాయణా!

తన గారాబపుఁ జిన్నికన్నె నిడి యుద్వాహంబుఁ గావించు వే
ళను రత్నాకరుఁ డేపదాంబుజము నుల్లాసంబున న్గడిగెనో
వనితారత్నము లక్ష్మి యేపదము సంభావించునో యట్టి నీ
కనదంఘ్రిద్వయి నాశ్రయింతు సకలేశా! సత్యనారాయణా!

చిరమై, సుస్మరణీయమై, విబుధసంసేవ్యంబునై, భవ్యమై
పరమామ్నాయనినాదసంజనకదీవ్యద్రత్నమంజీరమై,
నిరతశ్రీదమునై, భవాబ్ధితరియై, నిష్పన్నమై యొప్పు నీ
చరణద్వంద్వముఁ దాల్తు నౌదలఁ బరేశా! సత్యనారాయణా!

---

# తెనాలిరామకృష్ణకవి

నేలటూరి వెంకటరమణయ్యగారు, యమ్. ఏ., పి-హెచ్. డీ.

ఈ కవియొక్క కాలమును దిగ్గంతులవంటి పండితులు సకారణముగ నిర్ణయించియున్నారు. వీరిలో ముఖ్యులు బ్ర॥ శ్రీ, మానవల్లి రామకృష్ణకవిగారు. వీరు ౧౯౧౮ వ సం॥ర ఉగాదిసంచికలో తెనాలికవు లనుశీర్షిక గలవ్యాసమున తెనాలిరామకృష్ణుని కాలమును చక్కగ జర్చించినారు:

"రామకృష్ణకవి కృష్ణరాయలసభలో నూత్నయౌవనము జెల్లించి తిరుమలరాయల రాజ్యకాలమునకు వృద్ధుడై ఘటికాచల మాహాత్మ్యకృతిలో జీవడకుచుండును" "కందర్పకేతువిలాసము చిట్టమంత్రి కంకితముగా రచింపబడినది. ఈ చిట్టమంత్రి నాదెండ్ల యప్పనగోపనలకు సన్నిహితజ్ఞాతియు, సమకాలికుడును అగు 'చిట్టరసు' అనునతడే యైనయెడల నాకృతియు 1545 ప్రాంతమున రచింపబడి యుండవలయు." "పాండురంగకృతి రచనాకాలము 1564 అగుచున్నది."

కవిగారి సిద్ధాంతములకు బ్ర॥ శ్రీ, వే. ప్రభాకర శాస్త్రిగారు మెరుగువెట్టిరి. ఉద్భటారాధ్యచరిత్రకు వీరు వ్రాసిన ఉపోద్ఘాతములో పైవిషయమునే కడు నేర్పుతో పరిశీలించి మానవల్లి రామకృష్ణకవిగారి సిద్ధాంతములను బలపరిచిరినారు:

"తెనాలి రామలింగకవి యించు మించుగా క్రీ 1525 ఉద్భట చరిత్రమును, మఱి ముప్పదియేండ్లకు పాండురంగమాహాత్మ్యమును రచించియుండునని చెప్ప నొప్పుచున్నది" "పాండురంగ మాహాత్మ్య రచనాకాలము క్రీ. శ 1565 ఇంచుమించుగా నగునని యేర్పడుచున్నది." (భారతి సం. ౫, పుట ౧౬).

ఈ యిద్దరు పండితుల సిద్ధాంతము లివి:—

(1) తెనాలిరామకృష్ణకవి కృష్ణరాయలసభలో నూత్నయౌవనము జెల్లించెను.

(2) క్రీ. శ 1525 లో ఉద్భటారాధ్యచరిత్రను రచించెను.

(3) క్రీ. శ 1545 ప్రాంతమున కందర్పకేతువిలాసమును రచించి యుండవచ్చును.

(4) పాండురంగమాహాత్మ్యమును క్రీ 1564-65 ప్రాంతమున రచియించెను.

(5) ఘటికాచలమాహాత్మ్యమును తిరుమలరాయల కాలమున వ్రాసెను.

పైసిద్ధాంతములను బలపఱచు నూతనాధారములు కొన్ని నాకు లభ్యమగుటచేత ఈ చిన్నవ్యాసమును వ్రాయ నుద్యమించుచున్నాను.

కథలు :— వీటినిగూర్చి శ్రీప్రభాకరశాస్త్రిల వారు యిట్లు వ్రాయుచున్నారు:

"తెనాలిరామలింగని కథలని దక్షిణహిందూ దేశమెల్లఁ బ్రఖ్యాతికెక్కి పెక్కుకథలున్నవి. వానిగూర్చి మన మేమియు చెప్ప జాలము. అతడు హాస్యచతురుడై యుండవచ్చును. నిజముగా కొన్ని కథ లాతనికి సంబంధించినవే కావచ్చును. లోకులు మఱియు నసేకాద్భుతకథ లాతని కలకు నగిలించియుందురు. పెక్కుకథలు శ్రీ కృష్ణదేవరాయల గోష్ఠిలో జరిగినవిగా వినవచ్చును." (భారతి సం. ౫ పుట ౧౧)

ఇచ్చట రెండు కథలను బేర్కొనుచున్నాను;—

౧ "రాయలవారు గుఱ్ఱపుపిల్లలను దూరదేశములనుండి తెప్పించి యింటికొక్కటి చంతున బంపి వాని మేతకు నెలకు మూడువరహాల చొప్పున నిచ్చుచు కొంతకాలమైన పిదప నొక్కనాడు గుఱ్ఱములను బరీక్షించుటకై నగరికి తెమ్మని ప్రజల నాజ్ఞాపించిరి. రాయలవారన్ని హయములను గని సంతోషించి, "రామలింగని గుఱ్ఱమేది?" అని



శ్రీ గద్దె రంగయ్యనాయుడుగారు (ఆ)



శ్రీ విశ్వనా[illegible]డు (ఆ)



శ్రీ డా. పి. యస్. భాష్యంశెట్టిగారు (ఆ)



శ్రీ కీరం వెంకటసుబ్బారావుగారు (ఆ)



శ్రీ వడ్డుల వెంకటగిరిరావుగారు (ఆ)



శ్రీ జమదగ్ని నాయకరుగారు (ఆ)




శ్రీ నాగమూరు వీరరాఘవశ్రేష్ఠిగారు ([illegible])




శ్రీ కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తిగారు ([illegible])



శ్రీ చెరుకువాడ వెంకటనరసింహంగారు ([illegible])



శ్రీ మాగంటి బాపినీడుగారు ([illegible])

యనుగ చెంతనున్న రామలింగడు, "ప్రభో! అందరు పెంచునట్టిది కాదు నాగుఱ్ఱము. మిగుల మదించినందున దాని నిచటకు దెచ్చుటకు నాకు సాధ్యముకాలేదు. సందియము కలదేని తమ యాశ్వికులలో గడ దీరిన మేటి నొక్కని నంపి దెప్పించిచూడుడు" డన రాయలవారు దమ గుఱ్ఱపు పటాలపు నాయకుడగు మహమ్మదీయునొకని నతని వెంట బంపిరి. రామలింగడు అందఱియట్లు తన గుఱ్ఱమును జాగ్రత్తగ కాపాడక యొక యిరుకుగదియందు మూసియుంచి వేళ కింతకసవును నాగోడఃకుంపలి యొకరంధ్రమున బడవేయుచు నాదారినే జలమును బోయుచుండుటచే నా యశ్వము విశ్వము సెంతమాత్రము సెఱుంగక కేవలము క్షుద్బాధ ననుభవించుచుండెను. రామలింగడు దాడీసాయబును దీసుకొనిపోయి యారంధ్రమునుదెరచి లోపల త్రొంగిచూడు మనగా చీకటిగాఢమునుబచే సాయబు రంధ్రమున తల దూర్చినంతనే యాగర్భాతురపు తురగము సాయబుదాడీ కసవని తలచి పెరికివైవ సాయబు, "అల్లాకే! అల్లాకే!" అని యేడ్చుచు మొఱపెట్టుకొనగా రాయలవారు తామే యచటికివచ్చి గుఱ్ఱమును వెలుపలికి దెచ్చిచూడగా నది నిలువజాలని యొకబక్కగుఱ్ఱముగా నుంటగని కోపమున "రామ లింగా! దీనినేల యిటులజంపితి" వనగా నతడు, "ప్రభో! దీని నిటు లనే యుంచునప్పుడే మనుజుల కాపదలు గలిగింప నిక జక్కగ బోషింతునేని యిదియెట్లులుండునో? దేవరవారే దెలిసికొందురు గాక" యని బలుక రాయలవారు రామలింగని యాగాత్మ్యమునకు నవ్వుచు వెడలిరి." తెనాలిరామలింగని కథలు: జయశంకర్ అందుకో.(పుటలు ౨౬-౨౭).

కృష్ణరాయలు దన సామంత ప్రభువులకు, దొర లకు, సరదార్లకు గుఱ్ఱములనుబెంచుట కిచ్చువాడని పోర్చుగీసు ప్రయాణీకుడగు దురాతి బర్బోసా వ్రాయుచున్నాడు:

"రాయలకడ ౨౦,౦౦౦ లకంటె నెక్కువగుఱ్ఱములు కలవు. అం దొక్కొకటియు ౪౦౦ మొదలు ౬౦౦ హూణవరాల విలువగలది. స్వోపయోగార్థమునకై యుంచుకొనువానిని ౯౦౦ లేక ౧౦౦౦ హూణవరాల నిచ్చి కొనుచున్నాడు. వీనిని పోషించుటకై రాయలు తనకు లోనైన సామంతరాజులకు అప్పగించుచున్నాడు. వారు నిరంతరము (తమయొద్దనున్న గుఱ్ఱములకు సంబంధించిన) లెక్కలు చెప్పుచుండవలయును. (తన్నుగొలుచు) దొరలకు గూడ నిట్లే గుఱ్ఱముల నొప్పగించుచున్నాడు. ప్రతి సర్దారునికి స్వారిచేయుటకై యొకగుఱ్ఱమును, (మాలీసుచేయుటకు) గుఱ్ఱపువానిని, చాకిరి చేయుటకు బానిసస్త్రీని, నఖరుకు తగినట్లు నెలజీతముచొప్పున నాలుగైదు వరహాలను (పైకమును) ఇచ్చుచున్నాడు. ఇంతే కాక, ప్రతిదినమును ఏనుగులకును, గుఱ్ఱములకును దాణా తయారు చేయు వంటసాలలనుండి గుఱ్ఱమునకును, గుఱ్ఱపువానికిని గావలయు నాహారపదార్థములను సరఫరా చేయించుచున్నాడు...ఎవ్వరి వశమునయున్న గుఱ్ఱమైనను క్షీణించుచున్నయెడల వానికడనుండి యా యశ్వమును దీసుకొని, దానికంటె యధమమగు దానిని యిచ్చుచున్నాడు." (The Book of Durate Burbosa Vol. P.210.)

దురాతి బర్బోసా వర్ణించిన రాయల అశ్వసంరక్షణవిధానమును, తెనాలిరామలింగడుబెంచిన గుఱ్ఱపు కథతో బోల్చిచూచిన కథలోనివిషయ మవిశ్వసనీయము కాదని తోచకపోదు. అయినప్పటికిని రామలింగడు రాయల సమకాలికుడని రుజువుసేయుటకు ఇది తగిన సాక్ష్యము కాదు. మఱొకకథను దిలకింతము:—

"ఒకానొక దినమున రాయల యాస్థానమునకు శ్రీకాళహస్తి పురాణమును రచియించిన ధూర్జటికవి మిక్కిలి రసవంతమయిన యొక పక్కి వ్రాసి తానికిజూపి బహుమతినంద విజయనగరమున కేతెంచి యాదినమొక పాఱునింట భుజియించి విజయనగరమున గల విశేషములన్నియు కనుగొని యారేయిగడపి ఉషఃకాలముననే స్నాన సంధ్యానుష్ఠానములను నిర్వర్తించుకొని భువనవిజయమున రాజాదులు కొలువుదీరియున్న సమయమున ప్రత్యక్షధూర్జటినలె సభకునేగి రాయనిచేత తగుమర్యాదలంది ఒక యుచితాసనమున గూర్చుండి తా రచియించిన పొత్తమును రాజాజ్ఞ త్రయ్యచే సభ్యులకు వినిపించి శ్రోతలానందుల చేసెను. కాని వికటకవి మాత్రము సంతోషింపడయ్యె. అయ్యను చేయునది లేక సమయము వేచియుండగా, రాయలు సభ్యులంగాంచి,

చ. స్తుతిమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కులకేల గల్గెనీ
యతులితమాధురీమహిమ—

అని సమస్యాపూరణము చేయుమనెను. దాని కొక్కరును సమర్థులు కాకపోయిరి. అంత రామకృష్ణుడులేచి, "అయ్యా! పక్షముదినములు నాకు సెలవొసంగితిరేని నాకారణము నూహించి విన్నవించెదను" అని సెలవుగైకొని అవా డెల్లరు సభచాలించి వారివారి గృహముల కేగిరి. ధూర్జటిమాత్రము చెంతనున్న వారాంగనాగృహప్రవేశమొనరించి దానితో ముచ్చటించుచుండెను. వెంటనే మఱుగుగా రామలింగము పోయి, "స్వామీ! నమస్కారము" అనెను. ధూర్జటి గుండె గతుక్కు మన "ఏమోయి! రామలింగమా" యనెను. "అయ్యా! నేను సమయముగాకుండ వచ్చినందుకు నాతప్పు సైరింపు"డని వెడలిపోయి మరు నాడు ఆస్థానములో ధూర్జటి మొదలయిన కవులును, రాయలాదిగా గల రాజులును ఉండగా వికటకవి "పుడమితేడా! మీరు మొన్న ప్రశ్నించిన సమస్య పూర్తిచేయుదు"నని యిట్లు చదివెను:

చ. స్తుతిమతియైన యాంధ్రకవి ధూర్జటిపల్కులకేల కల్గెనీ
యతులితమాధురీమహిమ! హా! తెలిసెన్ భువనైకమోహనో
ద్ధత సుకుమార వారవనితా జనితాఘనతాపహారి సం
తతమధురాధరోదిత సుధారసధారల గ్రోలుటంజుమీ.

అనగానే ధూర్జటికవి సిగ్గుచే తలవంచుకొని భువనవిజయమును వీడి పోయెను. (తెనాలిరామలింగని కథలు: జయశంకర్ అందుకో, పుటలు ౫౨-౫౫)

కాళహస్తిమాహాత్మ్యరచయితయగు ధూర్జటిని గూర్చి కృష్ణదేవరాయలు పైసమస్యనిచ్చినది నిజమగుట కొకసాక్షిగలదు. అతడు ధూర్జటికి పౌత్రుడగు కుమార ధూర్జటియే. కృష్ణరాయవిజయమున నతడు దన్ను గూర్చి తత్కృతిభర్తయగు యార్వీటి చినవెంకటరాజు చెప్పినట్లు వ్రాసుకొనియున్నాడు.

చ. స్తుతిమతియైన యాంధ్రకవి ధూర్జటిపల్కుల కేలగల్గెనో
యతులితమాధురీమహిమ నామునుమీ పెద తాతచాల స
న్నుతిగనె కృష్ణరాయల మనోజ్ఞ సభన్...”

ఇందువల్ల సభలో కృష్ణరాయలు ధూర్జటికవిని గురించి సమస్యనిచ్చుట నిశ్చయమని తేలుచున్నదిగదా! అట్లు సమస్యనిచ్చిన రాయలసభలోని కవులందరు పూరింపకుండిరా? రాజిచ్చిన సమస్యకు పూరణము రాకపోవునా? చిరకాలమునుండియును ఈసమస్యను పూరించినది తెనాలిరామకృష్ణుడన్న ప్రతీతికలదు. మఱి యెవ్వరును పైసమస్యను పూరించినట్లగపడదు. రామకృష్ణు డీసమస్యను పూరించుట నిజమగునేని అతడు రాయలకు సమకాలికుడు కాకపోవు టెట్లు? ఉద్భటారాధ్యచరిత్రను రామలింగడు నాదెండ్లగోపామాత్యుని కడ ప్రధానోద్యోగియగు యూరెదేచ మంత్రి కంకితమునొసంగెను. ఈగ్రంథమును రామలింగకవి క్రీ. శ 1525 లో వ్రాసియుండుననియు, రామలింగకవియే వైష్ణవము పుచ్చుకొన్న పిమ్మట రామకృష్ణనామమును ధరించెననియు శ్రీ ప్రభాకరశాస్త్రిగారు సకారణముగ నిర్ణయముచేసియున్నారు. కావున రామకృష్ణుడు రాయల సమకాలికుడని పై రెండుకథలవల్ల తేలిన విషయము ఉద్భటారాధ్యచరిత్రమువల్ల సంరక్షితమగుచున్నది.

ఈ సందర్భమున శ్రీ మానవల్లికవిగారు చెప్పిన విషయ మొక్కటి గమనింపవలసియున్నది. కందర్పకేతువిలాసమను గ్రంథమును రామలింగకవి నాదెండ్ల యప్పనగోపనలకు సన్నిహితజ్ఞాతియు సమకాలికుడు నగు చిటరసు కంకితముచేసెననియు, తద్గ్రంథము 1545 ప్రాంతమున విరచింపబడినదనియు చెప్పియున్నారు. ఇందుకు ఆధారము లెవ్వియో !

కృష్ణరాయల సమకాలికుడగు చిట్టమర సాకడు కలడు. ఇతడు సాళువతిమ్మరసుయొక్క రాజ్యభారధురంధరుడట. పెద్దకాకానిలో అతని శాసన మొకటి శకం ౧౪౪౦ బహుధాన్య (L. R. 57. PP 222-27.) అనగా క్రీ. శ. 1518 నాటిది కలదు. కవిగారు చెప్పిన చిట్టమరసు ఇతడే యగునా? అగునేని రెంటూరివంశజుడగు నీచిట్టమరసు నాదెండ్లవారికి సన్నిహితజ్ఞాతి యగు టెట్లు? కందర్పకేతువిలాసము క్రీ. శ 1545 ప్రాంతమున వ్రాయబడెననుట కాధారము లెవ్వి?

పాండురంగమాహాత్మ్యము:—దీనిని క్రీ. శ 1564 లో వ్రాసెనని రామకృష్ణకవిగారును, క్రీ. శ 1565 లో నని ప్రభాకరశాస్త్రులవారును జెప్పియున్నారు. ఈగ్రంథము విరూరి వేదాద్రిమంత్రికి అంకిత మీయబడినది. ఇతడు మంగయగురువరాజు కుమారుడు పెదసంగరాజు కడ వ్రాయసకాడు. విరూరి వేదాద్రిమంత్రి కాలమును నిర్ణయించుటకు దగిన శాసనము లెవ్వియు గానరావు. అయినప్పటికిని మనకు మంగయగురువరాజు శాసన మొకటి లభించినది. ఇతడు చోళవంశజుడగు క్షత్రియుడు ప్రస్తుతము కడపమండలములోని అనిమెల సంగమేశ్వర స్వామిభక్తుడు:—

శుభమస్తు

“నమస్తుంగశిరశ్చుంబిచంద్రచామరచారవే
త్రైలోక్యనగరారంభమూలస్తంభాయ శంభవే.”

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౪౬౫ అగునేటి శోభకృతునామ సంవత్సర భాద్రపద శుద్ధ ౩ సోమవారం శ్రీ మద్రాజాధిరాజరాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీ వీరసదాశివదేవ మహారాయలు విద్యానగరమందు వజ్రసింహాసనారూఢులై పృథ్వీ సామ్రాజ్యంచేయు చున్నుండగాను కాశ్యప గోత్రం ఆపస్తంభ సూత్రంయాజుశ్శాఖాధ్యాయులైన సూర్యవంశోద్భవులైన శ్రీమన్మహామండలేశ్వర బొమ్మరాజుంగారి పౌత్రులయిన మంగరాజుగారి పుత్రులయిన గురువయ దేవచోడ మహారాజులుంగారు తుంగభద్రా తీరమందు శ్రీవిరూపాక్షదేవుని సన్నిధిని రంగరాజు రామరాజుగారి మూలాన శ్రీసదాశివ దేవ మహారాయలచేత రెండు తాంమ్రశాసనాలుపుచ్చుకొని శ్రీమద్దేవాది దేవదేవతాసార్వభౌమసచ్చిదానంద పరిపూర్ణ సప్తర్షివరదులైన అని మెలసంగమేశ్వరదేవునికి. వోబు

శంమయ తింమంమయ అనేదేవుళ్లు యిద్దరున్ను, పెద్దసంగరాజు, చినసంగరాజు, తింమరాజు, రుద్రరాజు, బసవరాజు, పెదచిటిరాజు, చినచిటిరాజు, బొజ్జసంగరాజు, పాపసంగరాజు అనే తొంమ్మండ్రు కుమారులు సమీపస్థులయివుండగాను అఘనాశిని పాపఘ్ని సంగమ స్థానాన శివరాత్రి పుణ్యకాలమందు సహిరణ్యోదక దానధారాపూర్వకంగా ధారపోసియిచ్చిన గ్రామాలు" (15-3-6).

ఇందువల్ల మంగయగురువరాజు శకం ౧౪౬౫ అనగా క్రీ. శ. 1543 లో అనిమెలప్రాంతమున ప్రభుత్వము సేయుచుండెననియు, అతనికి వోబళంమయ తింమంమయ యను నిరువురు భార్యలును, పెద్దసంగరాజు, చినసంగరాజు, తింమరాజు, రుద్రరాజు, బసవరాజు, పెదచిటిరాజు, చినచిటిరాజు, బొజ్జసంగరాజు, పాపసంగరాజు అనుపుత్రులు తొమ్మండుగురు కలరనియు విశదమగుచున్నది. విరూరి వేదాద్రిమంత్రి కొలిచిన ప్రభువగు పెద్దసంగరాజు, మంగయగురువరాజు ప్రథమపుత్రుడనియు తెలియుచున్నది. క్రీ. శ. 1543 లో అనగా పైశాసనకాలమున మంగయగురువరాజు వృద్ధుడని అనిమెలకైఫియ్యతునందు వ్రాయబడియున్నది. కావున నతని ప్రథమపుత్రుడగు పెదసంగరాజప్పటికి ఇరువదేండ్ల ప్రాయమువాడై యుండవచ్చును. అట్లగునేని అతడు క్రీ. శ. 1523 ప్రాంతమున బుట్టియుండవచ్చును. పెదసంగరాజు వ్రాయసకాడగు విరూరి వేదాద్రిమంత్రియు క్రీ. శ 1543 ప్రాంతమువాడగును. అతడు కృతినందిన పాండురంగమాహాత్మ్యము 1543-1550 ల మధ్యకాలమున విరచింపబడి యుండవచ్చు ననుటలో అసంగతమేమియు కానరాదు. కాని పాండురంగమాహాత్మ్యము 1570 కి పూర్వము రచింప బడలేదేమో యని సంశయించుటకు గొంత యవకాశము కలదు. పాండురంగ మాహాత్మ్యము, చతుర్థాశ్వాసము 242 పద్యము ఈ సందర్భమున గమనింపదగినది:

క. గిరికానువ_ర్తబుద్ధి ను
పరిచరునిం బోలె నొక్క_ పన్నగ మొకనా,
డురునడిసెచ్చట నుండియు
మురమర్దను దివ్యభవనమున కేతెంచెన్.

ఈపద్యమున రామరాజభూషణకృతమగు వసుచరిత్రను పాండురంగకవి ప్రస్తావించినాడు. ఇందువల్ల రామకృష్ణునకు రామరాజభూషణుని కవిత్వముపై నుండు అభిమానము దెలియుట యట్లుండ పాండురంగ మాహాత్మ్యము వసుచరిత్రకు బిమ్మట విరచింపబడెనని తెల్లమగుచున్నది. వసుచరిత్రరచనాకాలము క్రీ. శ 1570 లో నని యీమధ్య నిర్ణయము సేయబడినది. క్రీ. శ 1570 లో విరచింపబడిన వసుచరిత్రను పేర్కొను పాండురంగ మాహాత్మ్యము తత్పూర్వమెట్లు వ్రాయబడియుండును? కావున పాండురంగమాహాత్మ్యరచనా కాలము క్రీ. శ 1570 కి తరువాతనే యని తలచుట సమంజసము.

---

# కళింగదేశము

సాహిత్యవిద్యాప్రవీణ, బులుసు వేంకటరమణయ్యగారు

శ్రీమంతమై సమస్తసంపదలకు నిలయమై, భూమికి రత్నగర్భయను పేరుగల్గుటకుఁ గారణభూతమై యున్నివిషయములందును ఖండాంతరవాసుల కన్నులకు మిఱుమిట్లు గొల్పి వారి నాకర్షించిన మన విశాలభారత సామ్రాజ్యముయొక్క భూతభాగ్యోన్నతి నొకపరి సంస్మరించిరేని, వర్తమానయుగమునందే భారతదేశమున కౌన్నత్యమును, నాగరకతయును గల్గుసూచనలు కన్పడుచున్నవనుకొను కొందఱు పాశ్చాత్యనాగరకతావాసనావాసితాంతఃకరణుల తలఁపుల త్రుప్పు తొలఁగిపోకపోదు. పంచమవేదమగు మహాభారతమునందలి,

"అతిక్రాన్తసుఖాః కాలాః ప్రత్యుపస్థితదారుణాః,
శ్వఃశ్వః పాపీయదివసా పృథివీ గతయౌవనా."

అను వ్యాససూక్తినొకపరి చెవియొగ్గిరేని ప్రాచీనకాలపు టౌన్నత్యము మఱి కలుగఁజాలదనికూడఁ జెప్పవచ్చును. మన ప్రాచీనులు నశ్వరములగు నైహికవిషయములందుఁ బరిశ్రమింప నిచ్చపోడమక కేవలపారలౌకికసాధనమునందే యుద్యోగించుటచే ప్రత్యేకించి ప్రాచీననిబద్ధములగు దేశచరిత్రములు మన కంతగా లభింపకున్నవి. చరిత్రలభియింపనంతమాత్రమున దేశము గొడ్డుపోయినదని భ్రమించుట యన్యాయము. రామాయణమహాభారతాది మహాగ్రంథములందలి మహాపురుషుల దృష్టిలో, నాధునికులగు రాజుల యొక్కయు, వారిదేశముల యొక్కయుఁ జరిత్రములు గ్రంథస్థము చేయునంతటి ఘనమైనవిగా వారికిఁ దోఁచకపోవుటచేఁగూడ వారు చరిత్రగ్రంథములను వ్రాసి యుండలేదని మన మూహింపవచ్చును. కాని గ్రంథాంతరములందుఁ బ్రసంగవశమున వారొనర్చిన ప్రస్తావనలను లెస్సగా గమనించినచోఁ బ్రాచీనదేశచరిత్రములును, రాజులచరిత్రమును దేటతెల్లము కాకపోదు.

హర్షవర్ధనుని యాస్థానమున నుండిన బాణుఁడును, కల్హణుఁడు, బిల్హణుఁడు మొదలగువారును, వారు రాజుల నాశ్రయించి యుండుటచే వారికోరిక ననుసరించి రాజచరిత్రములు వ్రాసియున్నారు. కాని వానియం దతిశయోక్తులు మెండుగఁ గలవనియు, తమ రాజుల చరిత్రములు వ్రాయునపుడు కవి యెంతటి స్వతంత్రుఁడైనను సుగుణముల నుగ్గడించుటయేకాని దుర్గుణములను, బరాజయములను, శత్రురాజుల యథార్థస్థితిని వర్ణింపఁడనియుఁ గాన నీగ్రంథములందలి చరిత్రమంతటి విశ్వాసపాత్రము కాఁజాల దని కొందఱు పాశ్చాత్యపండితులయొక్కయు, వారిననుసరించిన భారతీయవిమర్శకులయొక్కయు సిద్ధాంతము. కాని ప్రత్యేకించి రాజుల చరిత్రములను వ్రాయక ప్రస్తావనావిషయముగ గ్రంథాంతరములం దుట్టంకించిన వానిలో నట్టివిశ్వాసమునకుఁ దావుండదని నాతలంపు. మఱియుఁ బ్రత్యేకముగఁ జరిత్రగ్రంథములను వ్రాసిన వారుకూడఁ జరిత్రాంశములఁ ద్రోసిపుచ్చి యతిశయోక్తులతోడనే తమకృత్యము నెఱవేఱెనని యనుకొనిరని నేననుకొనను. ముందు నేను నిరూపించు విషయములఁ బట్టి వారును నిష్పక్షపాతబుద్ధితో లిఖించిరని తెలియఁగలదు.

నేనిపుడు వ్రాయుచోలఁదిపాటి కళింగదేశవృత్తాంతము ప్రాచీన వాఙ్మయమున గ్రంథాంతరములనుండి సంగ్రహించిన కొలఁదివిషయములపై నే యాధారపడి యున్నది. కాని యధునాతనవిమర్శనలపై నాధారపడి యుండలేదు. వ్రాసిన విషయముకూడఁ జాల స్వల్పము. కాన విమర్శకులు కినిసి దాడి వెడలకుందురుగాక!

కళింగదేశము చాల పురాతనమైనది. తొలుత నుండియు నన్ని విషయములయందునుఁ జాల ప్రసిద్ధికెక్కియున్నది. ఆ దేశసౌభాగ్య మిపుడు విశాలభూతలమందును జలధియందును నణఁగిపోయి నామమాత్రావశిష్టమై యున్నది. ఒకపరి క్రీస్తుశక ప్రారంభపరిసరములకు దృష్టిని నిగిడించి క్రమక్రమముగఁ జూచినచో నాదేశపు భూతపూర్వభాగ్యోదయము గోచరింపకపోదు. ఇందుఁ గళింగదేశపు సనాతనగౌరవమును గాపాడనెంచి విషయోపక్రమముచేయనెంచుటచేఁ దద్దేశముయొక్క వ్యాపకమగు దక్షిణాపథప్రాశస్త్య మెుకించుక యెఱుంగుట ప్రకృతోపయోగకారి కాకపోదు.

i దక్షిణాపథప్రాశస్త్యము

ఎవరైనను దేశములవిషయమై ప్రస్తావించినపుడు తమదేశముత్కృష్టమైనదనియుఁ దక్కిన దేశములంతకంటె హీనములైనవనియుఁ బలుకుచుందురు. కానిన్యాయమును నిరూపింపఁ దలఁచినవారుమాత్రమట్లుకాక యథార్థమునే లిఖింతురు. ఈరీతి మనప్రాచీనులలో ముఖ్యముగఁ గలదు. ఉత్తరాపథమునఁ బాటలీపుత్రమున నివసించి మౌర్యసామ్రాజ్యమును స్థాపించిన చాణక్యుఁడు (కౌటిల్యుఁడు) తనయర్థశాస్త్రమున దేశప్రాశస్త్యమును దెల్పుచు.

"స్థలపథేఽపి హైమవతో దక్షిణాపథాచ్ఛ్రేయాన్, హస్త్యశ్వగంధదంతాజినరూప్యసువర్ణపణ్యాస్సారవత్తరాః ఇత్యాచార్యాః. నఇతి కౌటిల్యః. కంబలాజినాశ్వపణ్యవర్జాః శంఖవజ్రమణిముక్తాసువర్ణపణ్యాశ్చ ప్రభూతతరాః దక్షిణాపథే.

—కౌటిలీయార్థశాస్త్రము, పేజి 298.

అని దక్షిణాపథప్రాశస్త్యమునుగూడ వర్ణించియున్నాఁడు. భరతముని తన నాట్యశాస్త్రమునందు,

"చతుర్విధా ప్రవృత్తిశ్చ ప్రోక్తా నాట్యప్రయోగతః,
ఆవన్తీ దాక్షిణాత్యా చ పాంచాలీ చౌఢ్రమాగధీ.

* * * నాట్యస్య మయా చతుర్విధత్వమభిహితం భారతీ సాత్వతీ కైశిక్యారభటీచేతి, వృత్తిసంశ్రితే ష్వేషు ప్రయోగేషు అభిరతా దేశాః యతః ప్రవృత్తిచతుష్టయ మభినిర్వృత్తం ప్రయోగశ్చోత్పాదితః, తత్ర దాక్షిణాత్యాస్తావత్ బహునృత్తగీతవాద్యాః కైశికీప్రాయాః చతురమధుర లలితాంగాభినయాశ్చ."

—నాట్యశాస్త్రము, కాశీముద్రితపుస్తకము 135 పేజి.

అని దక్షిణాపథప్రాముఖ్యము నుగ్గడించియున్నాఁడు. దండి వైదర్భిగౌడీరీతులలో గౌడీరీతికంటె దక్షిణాపథమందలి విదర్భదేశపురీతికే ప్రాధాన్యము నొసంగియున్నాఁడు. వృత్తులలోఁ బ్రధానమైనది కైశికీవృత్తి. అది దక్షిణదేశపువృత్తి. రాజశేఖరుఁడును దీని నిట్లు నిర్వచించెను:

"తతశ్చ దక్షిణాం దిశమాససాద. × × × × × × × తత్రాభియుంజానాత మామే యాతి సమానం పూర్వేణ, సా దాక్షిణాత్యా ప్రవృత్తిః. × × × × తామనురక్తమనాః సయన్నేపథ్యః సారస్వతే య ఆసీదితి సమానం పూర్వేణ. సాపియద్విచిత్రనృత్తగీతవాద్యవిలాసాదిక మావిర్భావయామాస సా కైశికీ ప్రవృత్తిస్తాం తే మునయ ఇతి సమానం పూర్వేణ"

—కావ్యమీమాంస. (గైక్వాడు) పేజి 97.

ii కళింగదేశము దక్షిణాపథములోనిదే.

ఇంతవఱకు దక్షిణాపథప్రాశస్త్యము నిరూపింపఁబడినది. ఇఁక కళింగము దక్షిణాపథములోనిదే యని నిరూపించినచో దానిప్రాశస్త్యము వేఱుగఁ జెప్పవలసిన యవసర ముండదు.

i "మహేంద్రో మలయః సహ్యో మేకలః పలపింజరః,
ఏతేషు సంశ్రితా దేశాః స జ్ఞేయో దక్షిణాపథః
కోశలాస్తోశలాశ్చైవ కళింగా ఏవ గోశలాః,
ద్రావిడాంధ్రమహారాష్ట్రా వైణ్యా వై వానవాసజాః.
దక్షిణస్య సముద్రస్య తథా వింధ్యస్య చాన్తరే
యే దేశాస్తేషుయుంజీత దాక్షిణాత్యాంతు నిత్యశః.

—చూ. నాట్యశాస్త్రము, కాశీముద్రితప్రతి, 135 పేజి.

ii ఆగ్నేయ్యాం దిశి కోశల కళింగవంగోపవంగా జఠరాంగాః,
శౌలికవిదర్భవత్సాంధ్ర చేదికాశ్చోర్ధ్వకంఠాశ్చ.

—బృహత్సంహిత 14వ అధ్యాయము.

ఆగ్నేయదిక్కు-ప్రాగ్దక్షిణముల నడుమనున్నది కాన నిది దక్షిణాపథముకొంతయు, తూర్పుకొంతయుఁ గలిసినది కాన వంగాంగాదులు తూర్పుదేశములనియు,కళింగాంధ్రాదులు దక్షిణదేశము లనియు నూహింపవచ్చును.

iii "తతశ్చ స దక్షిణాం,దిశమాససాద యత్ర మలయమే కలకుంతలకేరలపాలమంజర మహారాష్ట్రగంగకళింగాదయో జనపదాః.
—కావ్యమీమాంస (గైక్వాడు.) పేజి 9.

(IV) Southern India comprised the whole of the Peninsula from Nasik on the west, and Ganjam on the east, to Cape Kumari (Comerin) on the south including the Modern districts of Birar add Telingana, Maharastra and the Konkan, with the separate states of Haidarabad, Mysore and Travancore, or very nearly the whole of the Peninsula to the south of the Narbada and Mahanadi rivers.'

[Cunningham's "The Ancient Geography of India," p.p. 11—12.]

v వంగాలౌహిత్యాత్పూర్వేణ. అంగా మహానద్యాః పూర్వేణ. కళింగా గౌడవిషయాద్దక్షిణేన + + +

[వాత్స్యాయనకామసూత్రముల పైగల జయమంగళుని వ్యాఖ్య నందలి దేశవిభాగవిషయ.]

iii కళింగదేశప్రత్యేకప్రాశస్త్యము.

కళింగదేశముయొక్క ప్రత్యేకప్రాశస్త్యమును గుర్తించుటకుఁ గావలసిన గ్రంథములు ప్రస్తుతము నాకు లభింపలేదు. ఆ విషయమై ప్రయత్నించి మున్ముందు తెలుపఁగల కుతూహలముమాత్రము కలదు. కాని లభించిన కొంచెపుసంగతిని తెలియఁజేతును.

దక్షిణాపథమునఁగల దేశములలోఁ గళింగము చాల ఉత్కృష్టమైనది. ఉదారులును, సత్ప్రవర్తకులును అగు మహారాజులు దీనిని పాలించిరి. ఒక ప్రాచీనమహాకవి కళింగప్రభు ని ట్లుగ్గడించెను.

i ఆయూర్దానమహోత్సవస్య వినతక్షోణీభృతాం మూర్తిమాన్
విశ్వాసో, నయనోత్సవో మృగదృశాం, కీర్తేః ప్రకాశః పరః,
ఆనందః కవితాకృతి స్సుమనసాం, వీరశ్రియో జీవితం,
ధర్మస్యైవ నికేతనం, విజయతే వీరః కళింగేశ్వరః.

ii మహాకవి కాళిదాసుఁడు తన రఘువంశమున రఘుమహారాజుగారి దండయాత్రను వర్ణించు సందర్భమునఁ దొలుత తూర్పుదిక్కునకు బయలుదేరెనని వరించెను.

"స యయౌ ప్రథమం ప్రాచీం తుల్యః ప్రాచీనబర్హిషా,
అహితాననిలోద్ధూతై స్తర్జయన్నివ కేతుభిః.
—రఘువంశము 4వ సర్గ.

అట్లువెళ్లి యచ్చటచ్చటనున్న రాజులను జయించెనుగాని వారు ప్రసిద్ధులుకాకపోవుటచే వారిపేర్లు చెప్పఁబడియుండకపోయెను. మఱియుఁ దూర్పుదేశమందలి దిగ్విజయమును సూక్ష్మముగఁ గాళిదాసు,

"తాళీతాళీవనభ్రాంతైః స్సేనాఖ్యైః బహుధా నృపైః,
తస్యాసీ దుల్బణో మార్గః పాదపైరివ దంతినః."
---రఘు. 4-వ సర్గ.

అనివర్ణించెనుగాని వివరించి చెప్పలేదు. అవసరములేదని యతనితలంపై యుండవచ్చును. ఇట్లు తూర్పునగల రాజులను జయించి సముద్రప్రాంతమున కేఁగిన రఘుమహారాజునకు సుహ్మదేశీయులతో యుద్ధమే యవసరము లేకపోయినది. వారే శరణు చొచ్చిరి.

"అనమ్రాణాం సముద్ధర్తు స్తస్మాత్సింధురయాదివ,
ఆత్మా సంరక్షితః సుహ్మైః వృత్తి మాశ్రిత్య వైతసీమ్."
—రఘు. 4-వ సర్గ.

ఆపిదప వంగదేశీయులతోఁ జిన్నపోరాటముకలిగినట్లు

"వంగానుత్ఖాయ తరసా నేతా నౌసాధనోద్యతాన్,
నిచఖాన జయస్తంభాన్ గంగాస్రోతోన్తరేషు సః".
—రఘు. 4-వ సర్గ.

అను పద్యమునుబట్టి యూహింపవచ్చును. వంగదేశీయులు శీఘ్రముగఁ జెల్లగింపఁ బడుటచే వారితోడి యుద్ధమునందు శ్రమకలుగలేదనియు, జయస్తంభముల నాటుటను దానింబట్టి పోరాటము మాత్రము కలిగెననియు నిశ్చయింపవచ్చును. ఆపిదప,

"స తీర్త్వా కపిశాం సైన్యైః బద్ధద్విరదసేతుభిః,
ఉత్కలాదర్శితపథః కళింగాభిముఖో యయౌ."
—రఘు. 4-వ సర్గ.

అను దానినిబట్టి యోఢ్రులతోఁ బోరాటము కలుగలేదనియుఁ గలిగినచోఁ జిన్నయుద్ధము తటస్థించి వెంటనే

వారు లొంగిపోయి యతనికిఁ బరిచర్యలొనర్చుచు నతని దయాదాక్షిణ్యములకై నిరీక్షించుచుఁ గళింగరాజ్యము నకు మార్గమునఁ జూప చోపుదారులైరనియు నూహింప వచ్చును. దీనింబట్టి రఘుమహారాజుద్దేశించుకొనిన రాజ్య ము కళింగరాజ్యమనియు, దానికొఱకు వెతకుకొని యతఁడు వచ్చుచున్నాఁడనియు, (అనఁగా పాశ్చాత్త్యు లకు హిందూదేశమెట్లు అన్వేషణీయమైనదో కళింగము రఘుమహారాజునకట్లే గవేషణీయమైన దనియు,) అతని ప్రతాపాతిశయమున కదియే యుచితమైన తావనియు నూహింపవచ్చును.

"స ప్రతాపం మహేంద్రస్య మూర్ధ్ని తీక్ష్ణం న్యవేశయత్,
అంకుశం ద్విరదస్యేవ యన్తా గంభీరవేదినః.

—రఘు. 4-వ సర్గ.

పైశ్లోకమునుబట్టి రఘుమహారాజు కళింగరాజును జయిం చుట విషయమై తన సామర్థ్యమునంతటిని వినియోగింప వలసివచ్చెనని విశదమగుచున్నది.

"ప్రతిజగ్రాహ కాలింగ స్తమస్త్రైర్గజసాధనః,
పక్షచ్ఛేదోద్యతం శక్రం శిలావర్షీ వ పర్వతః.
ద్విషాం విషహ్య కాకుత్స్థ స్తత్ర నారాచదుర్దినమ్,
సన్మంగలస్నాత ఇవ ప్రతిపేదే జయశ్రియమ్."

—రఘు. 4-వ సర్గ.

ఈశ్లోకములంబట్టి కళింగరాజప్రతాపమును, రఘుమహా రాజు పొందిన యాయాసమును, కష్టమును తేటతెల్లము కాఁగలవు. ఆ పిదప రఘుమహారాజు పాండ్యదేశము వఱకుఁ బోయెను. ఈలోపుగ మఱి యేవర్ణనమును లేదు. పాండ్యదేశము కావేరినది దాఁటిన పిదపఁ గలదని యీ రఘువంశమునుబట్టియే తెలియుచున్నది. కానఁ దూర్పు తీరమునఁగల రాజులందఱిలోఁ గళింగప్రభువే యుత్తముఁడు నజయ్యుఁడు నని యెఱుఁగవచ్చును.

మఱియు వంగదేశీయులు రఘుమహారాజునకు దాసానుదాసులయినట్లు

"ఆపాదపద్మప్రణతాః కలభా ఇవ తే రఘుమ్,
ఫలైస్సంవర్ధయామాసు రుత్ఖాతప్రతిరోపితాః."

—రఘు. 4-వ సర్గ.

అను శ్లోకమునుబట్టి తెలియఁగలదు. ఆరీతినే యుత్కళు లును లొంగిపోయినట్లు "ఉత్కలాదర్శితపథః" అను శ్లోకమునుబట్టి తెలియుచున్నదని యిదివఱకే నిరూపింపఁ బడినది. కాని కళింగరాజట్లు నమ్రుఁడై పోయినట్లు వర్ణింపఁబడలేదు.

"గృహీతప్రతిముక్తస్య స ధర్మవిజయీ నృపః,
శ్రియం మహేంద్రనాథస్య జహార న తు మేదినీమ్."

రఘు. 4-వ సర్గ.

ఈ పైశ్లోకము కళింగాధీశుని దైన్యమునుగాని, దాసానుదాసత్వమునుగాని చెప్పఁజాలదు.

iii విద్యానాథుఁడు తన యలంకార శాస్త్రమునఁ త్రిలింగదేశాధీశ్వరుఁడగు ప్రతాపరుద్రదేవుని దండ యాత్రలను వర్ణించు సమయమున,

"ద్వితీ—అథయువరాజాజ్ఞయా ప్రథమం మాఘవనీం దిశం ప్రచలితాని సైన్యాని. × × × ×.

మంత్రిణః—తత స్తతః?

ద్వితీ—అనంతరం సేనాగ్రగైరేవ పౌరస్త్యాన్ క్షుద్రక్షత్రి యాన్ విజిత్య సార్వపథీనే నాటోపేన పటీయసి తస్మిన్ మహతి బలే ప్రచలతి

యుద్ధాయ సమసహ్యన్త కళింగాః స్ఫుటపౌరుషాః,
మాద్యద్ద్విపఘటోద్దామసంభ్రమాడంబరోద్ధతాః.
తైస్సార్ధ మాంధ్రచమూపతీనాం పరాక్రమధనే మహత్యాయోధనే".

అని వర్ణించెను. దీనింబట్టి కళింగదేశీయుల పౌరు షము వ్యక్తపడఁగలదు. మఱియు నందే దక్షిణదిక్కున నతని దండయాత్రను వర్ణించుచు

"అనంతరం పాండ్యప్రముఖాన్ దాక్షిణాత్యాన్ క్షితీశ్వరాన్ శరణముపగతాన్ కాకతీయవీరరుద్రః స్వచమూపతినిర్విశేషం సంభావ్య తైస్సహ ప్రతీచీం దిశం ప్రచలితః"

దీనినిబట్టిచూడఁ గళింగులు పాండ్యులవలె దాసాను దాసులై వెంటనంటిరాలేదనియుఁ దూర్పు దేశవిషయమున నొక్క కళింగులతోడి పోరాటనేవర్ణించుటచేతఁ దక్కిన వంత లెక్కలో నివి కావనియు నూహింపవలయును. మఱియు ప్రతాపరుద్రపదాతి పౌరుషమును వర్ణించునపుడు

"శకే గూర్జర జర్జరోఽసి? సమరే లంపాక కిం కంపసే?
వంగ త్వంగసి కిం? ముధా బలరజః కాణోఽసి కిం కోంకణ?
హూణ! ప్రాణపరాయణో భవ! మహారాష్ట్రాపరాష్ట్రోస్యమీ
యోద్ధారో వయమిత్యకీర్తిభిభవస్త్వం ద్రుతం మా భృద్భటాః".

అని యాయా దేశపువారిని "శకే" అనుసంబోధనాదులచే చాలహీనముగ వర్ణించియున్నను, అందు కళింగులు తమస్మృతిపథమున నున్నను వారి నానీచసంబోధనమునఁ జేర్పఁ నలేదు. అది గౌరవమును దెలుపదా?

యుద్ధవిశేషములను సూక్ష్మముగఁ దెలుపుచు మూఁడువృత్తములనుఁజెప్పుచు "అంగాః సంగరభీరవః సమభవన్" అని ప్రారంభించి యన్ని దేశములవారిని దూ, చా-తప్పకుండఁ జేర్చఁని "కృతయశోభంగాః కళింగా అపి," అని కళింగులను జివఱఁ జెప్పెను. వేయేల? తుదకుఁ గళింగులుకూడ లొంగిపోవలసివచ్చెను. అని చెప్పినపుడు వారి యాధిక్యము విశదముకాఁగలదు. తక్కిన యందరిని సమరభీరువులని, పలాయమానులని, వ్యర్థభుజాయుధులనిచెప్పుచు, కళింగులకుఁగూడ మచ్చవచ్చెనని (కృతయశోభంగాః—వారి కీర్తిని భంగముచేసికొనినవారు, అని) చెప్పఁబడినది.

ప్రతాపరుద్రుని పట్టాభిషేకసమయమున నాహ్వానింపఁబడిన రాజుల నాయారీతిగానుండవలెనని నియమించుచుఁ ప్రతీహారి యిట్లనెను.

"కాళింగాత్రనిషీద, కోంకణప తే దూరే భవాం గేశ్వర,
ప్రాన్తం సంశ్రయ, మాలవేంద్ర శనకైః సౌవీరాయనం ప్రాపయ,
పాండ్యాగ్రే భవ, సేవణక్షితిప తే పశ్చాద్ధ్వ వాఙ్వైన వః
స్వామీ కాకతివీరరుద్రనృపతిః సర్వాన్ క్రమా దీక్షతే".

ఇచటఁగూర్చుండుటకు స్థానములభించినదొక్క కళింగాధీశ్వరునకే. మిమ్ములనందరిని రాజక్రమముగాఁ జూచుననుటచేఁ దొలుదొల్త కళింగాధీశునే చూడవలసియున్నది. కళింగునికి గౌరవమునాపాదించుటలో నీ యుదాహరణములు చాలును.

iv కళింగదేశమునుగూర్చిన తప్పుటభిప్రాయములు

కళింగ దేశమింతయుచ్చైః స్థితియందుండి ప్రాచీనకాలమునుండియుఁ బరువు,ప్రతిష్ఠసంపాదించికొనియున్నను కళింగదేశము గొరరానిదనియు, అచటనివసించుట యంతకంటెను దప్పనియు నొకచెడువాడుకయున్నది. ఈవాడుక యిప్పటి వ్యవహారమున నున్నదో లేదో కాని కొన్ని గ్రంథములనుబట్టియు, శ్రీవిక్రమదేవవర్మగారు వ్రాసిన "కళింగ దేశ వృత్తాంతము" (చూ. ఆ.సా.పరిషత్పత్రిక 16 సం) వలనను దెలియవచ్చుచున్నది. "కలిం=కలహంగచ్ఛన్తీతి కలింగాః"అను వ్యుత్పత్తినిబట్టి కాళింగులెల్ల పుడును దెబ్బలాడుకొనుటయే స్వభావముగాఁ గలవారని తెలిసికొనవచ్చుననియు, "కళింగదేశః సంప్రోక్తో వామమార్గపరాయణః" అని దీనినిబట్టి యాచారశూన్యమైన దనియు నూహింపవచ్చుననియు, "నాహం కళింగాన వాత్సః, నాహం కళింగాన్ జగామ" అను సిద్ధాంతకౌముదిలోని వచనములంబట్టి యాదేశమునకుఁ బోవుటయు, నివసించుటయుఁగూడఁ జాలదోషమని యనుకొనవలయు ననియుఁ గొందఱి కొందఱి యభిప్రాయమైయున్నది.

v ఆ యభిప్రాయములకు సమాధానము.

ఈయభిప్రాయములెట్లు సంభవించినవో, అందులకుఁదగిన కారణమేమో నిశ్చయింప దుర్ఘటము. మన ప్రాచీనులు దేశవిషయములఁ దెలియపఱచు నపుడన్నిటి నొక్కరీతిగనే వర్ణించినట్లును, గళింగమునుగూడ న్యూనభావమునఁజూడక గౌరవభావముతోడనే జూచినట్లును మీఁది విషయములంబట్టి తెలియుచునేయున్నది.

కాని రాజశేఖరుఁడు తనకావ్యమీమాంసయందు దేశవిభాగాది విషయమునఁజెప్పిన

"పూర్వాపరయోః సముద్రయోః హిమవద్వింధ్యయోశ్చాన్తరమార్యావర్తః. తస్మింశ్చాతుర్వర్ణ్యం చాతురాశ్రమ్యం చ. తన్మూలశ్చ సదాచారః. తత్రత్యో వ్యవహారః ప్రాయేణ కవీనామ్".

ఈ విషయమును బట్టి యార్యావర్తము దాటిన పిదప దేశమంతయు ననాచారభూయిష్ఠమైనదని ప్రాచీనుల యాశయమని మనమూహింపవచ్చును. కావుననే దక్షిణాపథమునఁ గళింగదేశమే యార్యావర్తబహిర్భూతమగు మొదటిదేశమగుటచే దాని కీచెడువాడుక కలిగెనని యూహింపవచ్చును. ఈమీఁదిన్యాయమునుబట్టి యార్యా




శ్రీ డా. బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యంగారు (కీ)




శ్రీ వీరమాణిక్యంగారు (కీ)




శ్రీ వేము వెంకటదుర్గా మల్లికార్జున శర్మగారు (కీ)




శ్రీ వేముల రామమూర్తి గుప్తగారు (కీ)



శ్రీ తిన్నగిరి కృష్ణమూర్తిగారు (కీ)



శ్రీ వల్లూరి పాపయ్యచౌదరిగారు (కీ)




శ్రీ టి. ప్రకాశం పంతులుగారు (౧)



శ్రీ కొల్లిపర సూరయ్యచౌదరిగారు (౧)



శ్రీ ఆక్కమాంబ గోవిందాచార్యులుగారు (౧)



శ్రీ బాబు రాజేంద్రప్రసాద్‌గారు (౧)

వర్తబహిఃఖ్యాతములగు దేశము లన్నింటికి నీవాడుక కలిగియుండవలసినదే కాని యేల కలుగలేదో నిశ్చయించుట దుర్ఘటమే.

ఇంకొకసంగతి. కళింగదేశపు టుత్తరభాగము కేవలపర్వతప్రదేశము. ఆప్రదేశమునందును, దక్షిణాంత ప్రదేశములందును సామాన్యముగఁ గోదులు, సవరలు మొదలగు కోయజాతివారును, ఇంచుమించు వారిని బోలి యనాచారప్రవృత్తిగలిగినవారును నివసించుచుండుటచే నార్యావర్తనివాసులగు నార్యులు కళింగదేశము రాఁదలంచినచోఁ దప్పక వారిపరిచయమే కలుగవలసియుండుటం బట్టి వారివలెనే యందఱునుందు రని కొందఱార్యు లీవ్యవహారమును గల్పించియుండనోపుదురు. మఱియు నీతప్పు టభిప్రాయము తప్పక యప్పటివారికుండెడిదని నిర్ధారణ చేయుటకుఁగూడఁ దగినంతయాధారము కన్పింపదు. ఆధుని కవిమర్శకశిరోమణులు చాలమంది చాలయాధారములు చూపించి కళింగదేశపు టౌన్నత్యమునే వేవిధములనుప న్యసించుచున్నారు.

---

అవసరములేని ఆర్భాటము (ఒక జర్మను చిత్రము ననుసరించి)






# కాకతీయ రాజులు

శ్రీ శేషాద్రిరమణకవులు

కాకతీయరాజు లాంధ్రులకుఁ జిరస్మరణీయులు. ఏనాఁడో విస్మృతమైన యాంధ్రసామ్రాజ్యమును బునరుద్ధరించి చెదరిన యాంధ్రదేశమును గేంద్రీకరించి లలితకళలఁ బునరుద్ధరించిన యాంధ్రభూపతులగు కాకతీయుల చరితామృతము తనివితీఱఁ గ్రోల నేయాంధ్రుఁ డుత్సాహపడఁడు.

చరిత్రపరిశోధనమునఁ దీవ్రకృషి జరుపఁబడు నీ సమయమునఁ గూడఁ గాకతీయుల చరిత్రమునుగూర్చి సరియగు పరిశోధనము జరుగలేదు. నిజాముదొరతనమువారి పరిపాలనమునందున్న యాంధ్రదేశమునందలి శిలాతామ్రశాసనము లింకను బ్రకటితములు కాలేదు. వాటి సారస్వతవికాసము దెలుపు గ్రంథరాజము లింక నుపలబ్ధములు కాలేదు. అజ్ఞాతవాఙ్మయమున మఱుగుపడియున్న కాకతీయరాజుల చరిత్రము నకుఁ బ్రాచులువేయు చరిత్రజిజ్ఞాసుల యుపయోగమునకై సందిగ్ధము లగు నంశములను గొన్నింటినిమాత్ర మిపుడు సమన్వయించెదము.

## కాకతీయుల యాచారములు

కాకతీయులలో రాజ్యస్థాపకుఁడు మహామండలేశ్వర ప్రోలరాజు. ఈతనిభార్య ముప్పమ. చరిత్రకారు లీతని జైనుఁడని వ్యవహరించిరి గాని యది సత్యమని తోఁపదు. ఈతఁడొనరించిన శైవప్రతిష్ఠలఁ దెలుపు శాసనము ఇనుగుర్తిగ్రామమునఁగలదు. ఆర్షమతమునందును జైనమతమునందును నీతనికి సమానగౌరవభావముకలదు. మొదటినుండియుఁ గాకతీయరాజులు పశ్చిమచాళుక్యులకడ సేనానాయకులుగ నున్నకతన వారివలెనే వరాహలాంఛనులైరి. కావునే కాకతీయుల శాసనములలో వరాహస్తుతియు వరాహముద్రయు జెప్పఁబడినది. ప్రోలరాజు సంగరమున సుండరాజు నోడించి వానియురమున వరాహముద్ర వేసినటుల అనుమకొండశాసనమునఁ గలదు. వరాహాంకములనుట కిదియొ తార్కాణము. *

ప్రోలరాజుకాలమున కాకతమ్మదేవాలయములు ఆంధ్రదేశమునఁ బెక్కులుగలవు. పదమూఁడవ శతాబ్దమువాఁటికిఁ గాకతమ్మగుడి ఓరుగంటిలోనున్నటులఁ గ్రీడాభిరామమునలనఁ దెలియును. కాకతమ్మ కథను గొల్లలుచెప్పుదురు. అందామె పార్వతి యవతారాంతరముగఁ జెప్పఁబడినది. మెదకుమండలములో అల్లాదుర్గముచెంత నొకగుట్టపై కాకతమ్మగుడి కలదు. విగ్రహములు భిన్నమైనకతన కాకతిదేవిస్వరూపము గుర్తింప నవకాశము చిక్కలేదు. ఒరంగల్లులో కాకతమ్మబావి కలదు. బహుశః కాకతీదేవియాలయ మాప్రాంతమునయుండి యవన దౌర్జన్యముచే నశించియుండుననియు నూహింపనగును. ప్రోలరాజు శాసనములలోఁ బ్రధానమైనది పద్మాక్షీదేవళమునందలిది. అందలిలిపి చాళుక్యరాజుల యాంధ్రలిపిని బోలియున్నది. వర్ణములు వ్రేటునగలేవు. పశ్చిమచాళుక్యులకడ నితఁడు విశేషకాలము శిక్షితుఁడగుటయే యిందులకుఁ గారణముకానోపు. ఈయనకుఁ బ్రత్యర్థులుగ తైలపదేవుఁడు, గోవిందరాజు, సుండరాజు, జగద్దేవుఁడు హనుమకొండశాసనమునఁ జెప్పఁబడిరి. వీరలగూర్చిన వివరములు మున్నొకచో సవిస్తరముగ వ్రాసియుంటిమి. అనుమకొండ రాజధానిగ నుండఁదగిన తావుగాదని ప్రోలరాజు రామారణ్యత్రిపాదులవారి ప్రోత్సాహముచే ఒరంగల్లు అను పురరాజమునుగట్టింప నారంభించెను. ఈతనికాలమునఁ బూర్తికాలేదు. ప్రోలరాజునకుఁ జరిత్రమునఁ బ్రసిద్ధులగు కుమారు లిద్దఱు. మొదటివాఁడు రుద్రదేవచక్రవర్తి; రెండవవాఁడు మహాదేవ రాయలు.

## రుద్రదేవుని చరిత్రము

తండ్రియగు ప్రోలరాజుకాలమున ననుగ్రహపూర్వకముగ విడువఁబడిన తైలపదేవుని రుద్రభూపతి తెగటార్చెను. మైళిగిదేవుని జయించి పొలవాసరాజ్యము గైకొనెను. దొమ్మరాజును వధించెను. చోడోదయుని జంపెను. భీమరాజును సంహరించెను. ఈ ప్రత్యర్థి రాజుల చరిత్రము చరిత్రకారుల కింకను స్పష్టముగాఁ దెలియలేదు.

మైళిగిదేవుఁడు కరీమునగరుజిల్లాలోని జాగిత్యాలతాలూకాకు జేరిన పొలవాస రాజధానిగఁజేసికొని గోదావరి ప్రాంతమంతయుఁ బాలించిన

* కాకతీయులు వరాహలాంఛనులనుటకు
శ్రీమత్కాకతివంశస్య యోవిభుర్వీరలాంఛనమ్ । తద్గుణర్వసుధోద్ధార వరాహస్సప్రణాతుచః. కుందవరశాసనము.

రాజు. ఈతఁడు నెలకొల్పిన ధర్మములఁదెలుపు శాసనములు కాళేశ్వ రము, మంథెన, ధర్మపురిప్రాంతములలోఁగలవు. పశ్చిమచాళుక్యులకు రాజప్రతినిధిగ నీతని పూర్వు లుండిరి. రుద్రదేవునికాలమున నీతఁడు రాజ్యము గోల్పోయెను. అంతతో నీతనికుటుంబ మంతరించెను.

రుద్రదేవుని ప్రత్యర్థులలో మేడరాజొకఁడు. ఈ మేడరాజు ప్రోలరాజుకాలమునందుఁగూడఁ బ్రసిద్ధుఁడై యుండి ప్రతిఘటించి నిలిచిన ధీరుఁడు. ఈయన మంత్రియగు నాగదేవరాజు స్థాపించిన గోవిందాపురము (పాకాలతాలూకా) శాసనమువలన మాధవవర్మవంశమున దుర్గరాజు జనించెననియు నతనికి మేడరాజు జగ్గరాజు పుట్టిరనియు కలదు. రుద్రదేవుని ప్రత్యర్థియగు నీ మేడరాజు క్షత్రియవంశజాతుఁడు. వీరి మంత్రియగు నాగదేవరాజు శా. శ ౧౦౮౪ ప్లవసంవత్సర ఫాల్గున శుద్ధ ౩ న (క్రీ శ ౧౧౬౨) పార్శ్వజినేశ్వరాలయము స్థాపించి భూదానముగావించెను. ఆ శాసనారంభమున జినదేవపాదస్మరణ మీ క్రిందివిధముగాఁ గలదు —

శ్లో॥ శ్రీమన్నశేంద్ర మకుటోజ్వలరత్నభూపా
నాగేంద్రహస్తనరసీరుహకర్ణపూరా
విద్యాధరేంద్ర రచితోత్తమకుంకుమాశ్రీ
భూయాత్ శుభాయ జినదేవపదాంబుజశ్రీః

మేడరాజుకూడ జైనుఁడని విశ్వసింపవచ్చును. ఈతని శాసనములకొఱకింకను నన్వేషింపవలసియున్నది.

రుద్రదేవుని ప్రత్యర్థులలో ఉదయచోడుఁ డొకఁడు. ఇతఁడే చోడోదయుఁడని శాసనములలోఁ జేర్కొనఁబడెను. ఉదయచోడుఁడు నల్లగొండచెంతనున్న పానుగల్లు పాలించుప్రభువు. మల్లికార్జునపండితారాధ్యులవారికి సమకాలికుఁడు. ఈతని శాసనము లిపుడు పానుగంటిలోఁ గనిపించకున్నను ఉదయసముద్రమను తటాక మీతని కీర్తిచిహ్నముగానున్నది. ఉదయావనీశుని మంత్రియగు గోవిందప్రధాని శాసనములు పానుగంటిలోఁ గలవు. రుద్రదేవుఁ డీరాజ్యమును లోఁగొనినవెంటనే తంత్రపాలు మల్లినాయకుఁడు ఛాయాసోమేశ్వరాలయమున నొకశాసనము స్థాపించెను. అందు ఉదయాదిత్యసముద్రమను తటాకప్రశంస గలదు. శా శ ౧౧౦౯ ప్రభవసంవత్సర అధిక జ్యేష్ఠ ౧౫ లు నాఁటి శార్ఙ్గపాణిరాయలశాసనమున ఉదయసముద్రప్రశంసగలదు. శా॥ శ ౧౮౯౩ సంవత్సరమునాఁటి నయిదుసాదాతు నయదుశాహోమీరు వేయించిన తెనుఁగుశాసనమున ఉదయసముద్రప్రశంస గలదు. ఈ యుదయసముద్రము ఉదయాదిత్యుఁడు, ఉదయచోడుఁడు అను నామములు గల పానుగంటిపాలకునిచే స్థాపింపఁబడినది గాన రుద్రదేవుని ప్రత్యర్థియగు ఉదయచోడుఁడు నల్లగొండచెంత గల పానుగల్లువాసియనుట స్పష్టము. పండితారాధ్యచరిత్రము గూడ నీయంశమును స్థాపించుచున్నది.

కాకతీయరుద్రునకుఁ బ్రబలప్రత్యర్థి భీమరాజు. ఈతఁడు దురాత్ముఁడు. సోదరుఁడగు గోకర్ణుని నీతఁడు చంపినటుల అనుమకొండశాసనములో స్పష్టముగాఁ గలదు.

"భీమేన భీమనకుశేన కుశేనహీనో
గ్రస్తో మమార గృహమూషకవత్ క్షణేన
మార్జారడింభకవరేణ మహాన్ధకారే
గోకర్ణ నామభుజగో భువి శూరమానీ

భీమరాజను భయంకరమగు ముంగిసచే శూరుఁడగు గోకర్ణుఁడను పాము అంధకారమునఁ బిల్లిచే నెలుక చంపఁబడినటులఁ జంపఁబడెను."

భీమరాజు భ్రాతృహంతయనువంశమును "హంతా భ్రాతృవరస్య భోజనవిధౌ" అను శాసనశ్లోకభాగము బలపఱచుచున్నది. గోకర్ణుఁడు, భీమరాజు ఏకగర్భజనితులు. భీమరాజు స్వలాభపరాయణుఁడై తమ్ముఁడగు గోకర్ణునితోఁ గపటస్నేహముకల్పించి మోసముగ వధించి యంతతోఁ దృప్తుఁడయ్యెను.

భీమరాజుగోకర్ణుల వృత్తాంతము అమరాబాదుతాలూకాలోని మామిళ్లపల్లి నృసింహాలయమునందుఁ గలదు. అం దీక్రిందివిధముగా వంశవృక్షముగలదు. సూర్యవంశమున కలియుగకర్ణుఁడగు గోకర్ణు జనించి ప్రతిష్ఠ నార్జించి సంగరరంగమున మరణించెను. ఆయనకుమారుఁ డుదయాదిత్యుఁడు. ఈతఁడు చోడవంశతిలకుఁడు. ఈయనకుమారులే భీమరాజు, గోకర్ణుఁడు. వీరిరువురిఐకమత్యము శాసనమున నీ క్రిందరీతిగాఁ బ్రశంస గావింపఁబడెను.

శ్లో. అథ తత్కృతినక్షత్ర గణప్రగుణచేతసౌ,
భీమగోకర్ణభూపాలౌ సూర్యచంద్రావివోదితౌ.

శ్లో. నిస్సీమప్రేమబుద్ధేన సమానసుఖయోద్వయోః
ఐకాత్మ్యం మన్యతేలోకా యథాపురమురద్విషోః.

రుద్రదేవుని శాసనమువలనఁ దేలనియంశము లీశాసనమువలనఁ దేలినవి. గోకర్ణుఁడు, భీమరాజు అన్నదమ్ములు. భీమరాజు వధించినది తమ్ముఁడగు గోకర్ణునే. లోకప్రతారణమునకై భీమరాజు తనతమ్మునితో నఖండస్నేహముగ నున్నటులఁ జెప్పుకొనెను. భీమరాజు తైలపదేవుని రాజ్యము హరించెను. సవతితల్లితో దుస్సాంగత్య మొనరించెను. తమ్ముని జంపెను. అందులకనియే రుద్రదేవుఁ డీతని సాధింపఁ బట్టుపట్టెను. భీమరాజు అఖండపౌరుషశాలి. అఖండరాజ్యలక్ష్మీసంపన్నుఁడు. ఆతని జయింప రుద్రదేవుఁ డపరిమితబలముతో దండయాత్రకేగి రాజధానియగు వర్ధమానపురమును ముట్టడించెను. భీమరాజు పరిజనముతోఁ బారిపోవ రుద్రదేవుఁడు శక్తికొలఁది తఱిమి ఉదయచోడునిరాజ్యము వర్ధమానపురము గైకొని తనప్రతినిధిగా నచట మల్యాలగుండ నాయకుని నియమించెను. ఈ వర్ధమానపురము నిపుడు వడ్డమాని యని వ్యవహరించుచున్నారు. ఈ చరిత్రస్థలము మహబూబు నగరమం

డలములో నాగరకర్నూలుతాలూకాలో నున్నది. రుద్రదేవుని యత్యద్భుతవీరజీవిత మీ జీర్ణనగరముగాంచిన కొంతవఱకు బోధకాఁ గలదు. ఛందోగ్రంథము వ్రాసిన గోకర్ణుఁ డీభీమరాజుతమ్ముఁడు కాఁడని యూఁ దదన్యుఁడనియు మాతలంపు.

రుద్రదేవుని ప్రత్యర్థియగు ఉదయచోడుఁడు కందూరుపాలకుఁడును జటుచర్ల శాసనమును వేయించినవాఁడును నగు నుదయచోడుఁడు గాఁడు. రుద్రదేవుని శాసనమునకు నితని కందూరిశాసనమునకు ౨౬ దినములె వ్యవధిగానను బూర్వోక్తుఁడగు నీ యుదయచోడుఁ డొకవేళ భీమరాజుగోకర్ణుల తండ్రియైనఁ గావచ్చును. లేదా పానుగంటి యుదయాదిత్యుఁడు కావచ్చును. మహబూబు నగరమండలమున చోడరాజుల శాసనములు పెక్కులుగలవు. వాని నన్నింటిని సమన్వయించినగాని యీయంశము నిశ్చితముకాదు.

## రుద్రదేవుని కళాకౌశలము

అనుమకొండలో నీతఁడొక యపూర్వశిల్పరమణీయమగు త్రికూటాలయమును గట్టించెను. ఆలయమున కెదురుగా సహస్రస్తంభమండపము గట్టించెను. ఆలయమునందలి లతావేల్లనములు స్త్రీపురుషవిగ్రహముల విధము, పురాణకథాప్రతిమల విలాసము మాచి తీరవలసినది. మహమ్మదీయుల కుఠారఘాతములకాగి పూర్వప్రశస్తి చిహ్నములునిలుపుకొన్న యీ సుందరాలయము శిల్పకళోపాసకులకు ధ్యేయముగనున్నది. ఇందె రుద్రదేవుని సంపూర్ణ విజయములదెలుపు రామేశ్వరదీక్షితరచితమగు శాసనరాజము గలదు. రుద్రదేవునికాలమునుండి యాంధ్రలిపి కొకనూతనవికాసము వచ్చినదనుట కీశాసనలిపియె తార్కాణకాఁగలదు. నీతిసారమను గ్రంథము నీతఁడు రచించినటులఁ గొందఱు వ్రాసిరి. అది ప్రతాపరుద్రనరపాలకృతమని చెప్పఁబడినదిగానఁ గర్తృత్వ మితని కారోపించుట ప్రమాదము. కాని రుద్రదేవుఁడు వైదుషీభూషణుఁడు, సారస్వతతంత్రజ్ఞుఁడు ననుట కాధారములు అనుమకొండశాసనమున లేక పోలేదు.

నానాశాస్త్రవిచారణైకచతురుఁడు, బ్రాహ్మీవిలాసాశ్రయుఁడనువిశేషణము లీతని సర్వతోముఖసాహిత్యసంపదకు నిదర్శనములు. పిత్రనంతర మితఁడు ఒరంగల్లు రాజధానిగాఁ జేసికొనెను. శైవులకును, బౌద్ధులకును, జైనులకును దనరాజధానియం దనుకూలములుగనుండు నాలయరాజములను బెక్కింటిని నిర్మింపఁజేసెను. ద్వారములపై గజలక్ష్మీవిగ్రహములఁ బాదుకొల్పి మరుభూమియనందగు దుర్గమధ్యప్రదేశమునందు నగాధములు నపరిశోష్యజలములు నగు కూపరాజములను బెక్కింటిని ద్రవ్వించి తన దిగ్విజయచిహ్నములుగఁ బెక్కు జయస్తంభముల నాటించెను. నాఁటికూపములలో నిప్పటికిని కాకతమ్మబావి, గడియారములబావి, దేవతలబావి, అక్కచెల్లెండ్రబావులు దర్శనీయములుగా నున్నవి. శోభనాలబావియను రాజకుటుంబినుల క్రీడాసరసు చాలవఱకు నశించినది. ఒరంగల్లుకోటలోని నాలుగు శిలాద్వారములును ఐనకోటలలోని శిలాద్వారములు రుద్రదేవునికాలమున నెలకొల్పఁబడినవె. ఎడతెగని సంగరయాత్రలతో దిన మొకయుగముగా గడపుచు సామ్రాజ్యక్షేమమునకుఁ బాటుపడుచు ఆంధ్రశిల్పములకుఁ జేరెన్నికగాంచిన దేవాలయముల నిర్మించిన రుద్రదేవుఁడు ఆంధ్రులకుఁ జిరస్మరణీయుఁడు. రుద్రదేవుఁడు నామిరెడ్డి, కాట్రెడ్డి, చేతరాజు, బల్లాలుఁడు మున్నగు సేనానాయకుల తోడ్పాటుతో రాజ్యమేలుచు ప్రోలరాజు కట్టింప నారంభించిన నూళ్న దుర్గము పూర్తిచేసి అనుమకొండనుండి ఒరంగల్లునకు రాజధానిని మార్చెను. ఒరంగల్లునకు కాకతిపురమనియు, ఆంధ్రనగరమనియు, ఏకశిలానగరమనియు నాకాలమున వ్యవహారనామములుగలవు. కుందాంబిక స్థాపించిన కుందవరశాసనములో ఒరంగంటిని రుద్రదేవుఁడు రాజధానిగఁ జేసెనని కలదు. వ్రెక్కంటి గాహిచరావు శాసనమునఁగూడ నీయంశము స్పష్టముగాఁగలదు. శివతత్త్వసారావతారికలో నీయంశముచెప్పఁబడినది. ఒరంగల్లున కపూర్వప్రశస్తియు మహైశ్వర్యసంపదయు నీరుద్రదేవుని కాలమునుండియే యేర్పడియుండును.

రుద్రదేవునకు నితనితండ్రియగు ప్రోలరాజునకును సమకాలికుఁడుగ నుండిన తైలపదేవుని చరిత్రము గ్రహింపఁదగిన శాసనములు కొన్ని నిజామురాష్ట్రమున లభించినవి. తైలపదేవుఁడు కోడూరు పాలించు ప్రభువు. ఇతఁడు చాళుక్యుఁడు. బూదుపూరునెక్కొండలలో నితనిశాసనములు గలవు. అవి చాళుక్యశకము 46 లోనివిగాన కీ. శ. 1124 ప్రాంతమున తైలపదేవుఁడను కాకతీయసామ్రాజ్యప్రత్యర్థి కోడూరు రాజ్యము పాలించుచుండెననుట సత్యము. రుద్రదేవుఁడు తైలపదేవుని రాజ్యము భీమచోడునిరాజ్యము తనసామ్రాజ్యములోఁ గలుపుకొని యాంధ్రసామ్రాజ్యము విస్తరింపఁజేసెను.

## ఆకాలపుఁ బరిస్థితులు

రుద్రదేవుని కాలమున ఆంధ్రదేశపరిస్థితు లల్లకల్లోలముగా నుండెను. సుప్రసిద్ధములగు జైనక్షేత్రములు వైదికాలయములుగా మార్పఁబడెను. బసవేశ్వరుఁ డాకాలమున విజృంభించి వీరశైవమతము నెలకొల్పి బిజ్జలుని సామ్రాజ్యము కూలఁద్రోచెను. మల్లికార్జునపండితారాధ్యులు వీరశైవమతము నుద్ధరింపఁ దీవ్రకృషి గావింపసాగిరి. రుద్రదేవుఁ డీకాలమున శైవమతము నాదరించి జైనులనొత్తిడిచేయసాగెను. ఆకాలముననే చాళుక్యరాజధానులలో నొకటియుఁ బ్రసిద్ధజైనక్షేత్రములలో నొకటియు నగు కొలనుపాక శైవక్షేత్రముగా మార్పఁబడెను. ప్రచారకులకు నెలవుగానున్న మఠములన్నియు జైనులనుండి తొలంగింపఁబడి వీరశైవుల కొసంగఁబడెను. పలువురు కాకతీయసామ్రాజ్యము గూలద్రోయ యత్నించుటకు ప్రధానహేతువు రుద్రదేవుఁడు జైనవిద్రోహియనియే. రుద్రదేవునికాలమున నాంధ్రదేశమున జైనమతము సన్నగిల్ల నారంభించెననియు అర్హమతస్థులు జైనాలయములను గొలఁదిగ సంస్కరించి వైదికాలయములుగా మార్చిరనియు నిశ్చయించుటకుఁ గొన్నికొన్ని యాధారములందందు నేఁటికిని గోచరించుచున్నవి.

## రుద్రదేవుని యంతము

విశాలాంధ్రదేశమున కధిపతియై యప్రతిహతపరాక్రమముతో చిరకాలము రాజ్యమేలి రుద్రదేవుడు రాజ్యతృష్ణాధురంధరుఁడగు మహాదేవరాయ లనుతమ్మునిచేఁ జంపఁబడెను. భ్రాతృహంతకుఁడగు నీతఁడు రాజ్యమునకువచ్చుటకుఁ బౌరు లంగీకరింప లేదు. కుమారుఁడగు గణపతిదేవుఁడె తండ్రియుండఁగ రాజయ్యెను. రుద్రదేవుని యనంతరము రాజ్యమల్లకల్లోలమైనట్లు రామప్పగుడులలోని శాసనమునందుఁ గలదు. అపుడు రుద్రసేనాని శీర్ణాంధ్రసామ్రాజ్యమును బునరుద్ధరించెనని యాశాసనమునందలి శ్లోకమువలన గ్రహింపనగును. రుద్రదేవుని మంత్రి నర్గను పరిపాలనవిశేషములు కుటుంబస్థితులు కాలగర్భమునఁబడి నేఁటికి విస్మృతములైనవి. నేఁటివఱకు సుస్థిరముగా నెలకొనిన ఆంధ్రవ్యక్తిత్వమునకు రుద్రదేవుని మహత్తరరాజ్యనిర్మాణమె ప్రధానహేతువనుట మఱువరానియంశము. కుందాంబికాశాసనమునందు రుద్రదేవునియనంతరము మహాదేవరాయలు రాజ్యమేలినట్లుకలదు.

"తస్మాదనంతరం తస్య మహాదేవో మహీపతిః,
అనుజో మనుజాకారమహాదేవో మహీ మధాత్"

మహాదేవరాయలు బయ్యలదేవివల్లభుఁడు. ఈ దంపతుల పుత్రుఁడే శాంతిస్థాపకుఁడును ధర్మనిర్ణేతయు సత్ప్రభుఁడు నగు గణపతిదేవ చక్రవర్తి.

## గణపతిదేవుఁడు

గణపతిదేవుఁడు రాజ్యమునకువచ్చునాఁటి కాంధ్రసామ్రాజ్యమునకుఁ దూర్పుదిక్కున సముద్రము, దక్షిణమున శ్రీశైలము, పశ్చిమమున కళ్యాణపురము, ఉత్తరమున మాల్యవంతము సరిహద్దులుగా నుండెను. ఈమధ్యభాగమున నున్న రాజులందఱు వంశీకులై కాకతీయరాజ్యమునకుఁ బన్నుఁజెల్లించుచుండిరి. విశాలమగువాంధ్రదేశమున నాతని కత్తి కెదురులేకుండెను. గణపతిదేవుఁడు గౌడదేశమునందలి రాఢామండలములోని పూర్వగ్రామవాసియు ధర్మశంభుని కుమారుఁడును నగు విశ్వేశ్వరశివాచార్యులయొద్దఁ జిన్మయదీక్షఁబడసెను. అనంతరము గణపతిదేవుఁడు తనరాజ్యమునిండ శివాలయములు గట్టించుటయేగాక శైవుల కండగానుండి జైనబౌద్ధమతములు రూపుమాపుటలో మిగులఁ గృషిచేసెను. విశ్వేశ్వరశివదేశికుఁడు నిజామురాష్ట్రమునఁ బ్రసిద్ధక్షేత్రమును త్రిలింగస్థానములలో నొకటియు నగు కాళేశ్వరమున ఉపలమఠమును, మంత్రకూటమున శైవమఠమును స్థాపించెను. ఈ దేశికులు గణపతిదేవునికేగాక మాళవప్రభువునకుఁ గాలచురినృపాలురకు దీక్షాప్రదాతగనుండుటయే గాక రాజ్యాంగవేత్తయై కాకతీయసామ్రాజ్యాభ్యున్నతికిఁగూడ సర్వంకషముగాఁ దోడ్పడెను. అందులకనియేకానోపు గణపతిదేవుఁడు తా నీశివదేశికుని పుత్రుఁడనని కంఠోక్తిగాఁ జెప్పుకొనెను. మందడముశాసనములోని విధముజూడ నీవిశ్వేశ్వరశివదేశికుఁ డఖండరాజ్యతంత్రకుశలుఁడనియు గణపతిదేవుని శైవమతప్రచారమునకు నీయనయే కారకుఁడనియు నూహింపనగును. ఈయన ప్రోత్సాహమున గణపతిదేవుని యాస్థానమునఁ దిక్కనసోమయాజి యాదరసత్కారము లొందియుండును.

గణపతిదేవుఁడు ఆంధ్రసామ్రాజ్యమును సుభిక్షముగావించెను. ఈయనకాలముననే రామప్పచెఱువును రుద్రసేనానియు, పాకాలచెఱువు జగదాళముమ్మడినాయకుఁడును, నామసముద్రమును నామిరెడ్డియు, ఎఱుకసముద్రము ఎఱ్ఱక్కసానమ్మయు, చౌండసేనాని చౌండసముద్రము నిటులే సేనానాయకు లొక్కొక్కరు దమపేర నఖండములగు తటాకములు నెలకొల్పిరి. గణపతిదేవుఁడు పాకాల సమీపమున గణపుర మనుగ్రామమును గట్టించి యపూర్వశిల్పాభిరామములగు రెండుదేవళములు నిర్మింపఁజేసి తనపేర విశాలతరమగు నొకతటాకము నెలకొల్పెను. ఇంతయేల, నిజామురాష్ట్రములోని విశాలతరతటాకములును, మనోహరశిల్పములగు దేవళములు చాలవఱకు గణపతిదేవుని కాలములోనివనుట యతిశయోక్తి కాదు. ప్రోలరాజు రాజ్యస్థాపనమునకై జీవితము వ్యయము గావించెను. రుద్రదేవుఁడు రాజ్యము విస్తృతమొనర్చుటలో జీవితము వెచ్చించెను. గణపతిదేవుఁడు పితృదత్తరాజ్యము నిష్కంటకము గావించుటయే పరమార్థముగఁ బెట్టుకొనుటయేగాక ఓరుగల్లుదుర్గమునకు ఱాతికోటఁగట్టించి ప్రతిపక్షులగు దేవగిరియాదవులు, చోళులు, చాళుక్యులు తనయాజ్ఞాబద్ధులగునటులఁ గట్టడి గావించెను.

గణపతిదేవుని కాలమున ఓరుగంటిలో స్వయంభూదేవాలయము అపూర్వశిల్పవిన్యాసములతో నద్భుతకరముగాఁ గట్టఁబడెను. కాకతీయుల కీయీశ్వరుఁడే యిలవేల్పు. ఆదర్శప్రాయమై యాంధ్రదేశమునకు మకుటరూపముగా నున్న యీ దివ్యసుందరాలయము పదమూఁడవ శతాబ్దమునఁ బూర్తిగా రూపుమాపఁబడినది. ఈ మహత్తరశిల్పచిహ్నములు ఓరుగల్లుకోట పునరుద్ధరించు తరుణమునను, మందిరములు గట్టునపుడును యవనులు యథేష్టముగా నుపయోగించుకొనిరి. ఈదైవతప్రశంస విశేషముగాఁ బ్రతాపరుద్రీయమునఁగలదు. ఇష్టదైవతమగు నీస్వయంభూదేవునకుఁ గాకతీయరాజులు సమస్తవైభవములు సమర్పించిరి. ఆంధ్రదేశమున నింతటి యాలయము లేదనిపించిరి. ఐనఁ ఫలమేమి యవనాటోపమునఁ బ్రక్షమాహుతి యయ్యెను.

ఇపు డీయాలయస్థలమున నాఁటి విగ్రహశకలములు నంది విగ్రహములు దర్శనీయములుగా నున్నవి. ఈకాలముననఁ గల్పింపఁబడిన యాలయములలో పిల్లలమఱ్ఱి నామిరెడ్డిదేవాలయములు పాలెముపట్టులోని రుద్రసేనాని దేవాలయము, కొడిశాలలోని రుద్రరెడ్డి దేవళము, కొండిపర్తిలోని చౌండసేనానికాటచమూపతుల దేవళములు ప్రశస్తతరములు. ఈకాలముననఁ బతిసేనానాయకుఁడును

శక్తికొలఁది దేశకల్యాణమునకై పాటుపడి దుర్గములు నిర్మించియుఁ దటాకముల నెలకొల్పియు దేవళములఁ బ్రతిష్ఠించియు నాంధ్రదేశమునం దంతటను అగ్రహారములను స్థిరవసతుల నెలకొల్పిరి. సామిరెడ్డి, చేతిరెడ్డి కామిరెడ్డి ప్రముఖులు నల్లగొండ మండలమునను, రుద్రసేనాని, గణపతినాయకుఁడు, బొప్పనాయకుఁడు మానుకోటసీమయందును కాటసేనాపతి, చౌండసేనాధీశ్వరుఁడు కొండిపర్తిసీమయందును బల్లాలుఁడు, గదాధరుఁడు కొలనుపాక ప్రాంతములందును గొయ్యరాహుత్తు, బయ్యరాహుత్తు గాహిచరావు మెదకు సీమయందును రాజప్రతినిధులుగా నుండియు, సేనానాయకులుగ నుండియు గణపతిదేవపాదపద్మోపజీవులమని చెప్పుకొని స్వామిభక్తి వెల్లడించిరి. ప్రజావిశ్వాసముల నీవిధముగాఁ జూరగొని సర్వసమ్మతముగాఁ జిరకాలము రాజ్యమేలి కృతార్థుఁడైన సార్థకజీవులలో గణపతిదేవుఁ డగ్రగణ్యుఁడు. ఆంధ్రదేశమునందలి ప్రతిప్రసిద్ధ స్థలమునను గణపతిదేవుని కీర్తిచిహ్నము లేకపోలేదు. చేబ్రోలు త్రిపురాంతకము, కాళేశ్వరము, శ్రీశైలము, వాడపల్లి, ఏలేశ్వరము, అలంపురి, మున్నగు ప్రసిద్ధక్షేత్రములలో గణపతిదేవుని శాసనములు పెక్కులు గలవు.

## గణపతిదేవుని సేనానాయకులు

జయపరసంసుఁడు దేవగిరియాదవుల విజృంభణము నడంచి యంతతోఁ దృప్తినొందక కొందఱు మహారాష్ట్రుల వెంటఁగొని యాంధ్రదేశమునఁ దనకుఁ బ్రతినిధులుగా నెలకొల్పి వారలకు బిరుదము లొసఁగి గౌరవించెను. సామ్రాజ్యస్థలాధిపతియగు శార్ఙ్గపాణి దేవుఁడు, త్రిక్కుంటిపాలకులగు కల్యాణాదులు, అద్దంకిపాలకుఁడగు మాధవనాయకుఁడు మున్నగువారలు ప్రముఖులు క్రమముగా వీరి వంశజులు ఆంధ్రులలోఁ గలసిపోయిరి. గణపతిదేవుని కాలమున సమస్తవర్ణములవారును ఆంధ్రదేశమునెడను గణపతిదేవుని యెడ భక్తిమానించి రాజ్యక్షేమమునకుఁ బాటుపడియుండిరి. గణపతిదేవునికడ విశ్వేశ్వరశివదేశికులును, వాణసవంశజుఁడును మొలుగూరు దుర్గాధిపతియు నగు నన్నయ్య మంత్రి గంగయసాహిణి, సామంత భోజుఁడు, చెన్నాప్రగడగణపామాత్యుఁడు, మున్నగువార లమాత్యపదవి నధిష్ఠించి యవసరసమయములలో దండనాయకత్వము వహించి యాంధ్రసామ్రాజ్యక్షేమమునకు సర్వంకషముగఁ గృషిచేసిరి. ఇందులూరి సోమమంత్రి యను నియోగివీరుఁడు గణపతిదేవుని కడఁ జిరకాలము మంత్రిగానుండి రాజ్యక్షేమమునకై భయంకరసంగరముల యందుఁ బాల్గొని ఓరుగంటికిఁ దూర్పుభాగమునందున్న విశాలాంధ్రదేశమంతయు లోఁగొని గౌతమీతీరమున వసించి ప్రతినిధిపదవి జయప్రదముగ నిర్వహించెను. మల్యాలవంశజులు, రేచర్లవంశజులు, పల్యానివంశజులు, విర్యాలవంశజులు విశేషించి ఓరుగల్లుప్రాంతములలో సామ్రాజ్యరక్షణమునకు నియోగింపఁబడినట్లు కనిపించుచున్నారు. ఒకానొకశాసనమున "రేచర్ల గోత్రం తే ష్వేకం కాకతీయనృపార్పితమ్" అని యుంటచేఁ జిరకాలమునుండి కాకతీయులకు రేచర్లగోత్రీయులకుఁ బాలకపాల్యసంబంధము కలదని తెలియుచున్నది. రేచర్లగోత్రీయులు కాకతిప్రోలరాజుకంటె ముందు కాలమునుండి కాకతీయులకుఁ బ్రతినిధులుగ నుండిరనియు నందు బ్రహ్మయసేనాని యను ప్రముఖుఁడు కాంచీరాజలక్ష్మిని కాకతిరాజునకుఁ గైవసము గావించెననియు రామప్పగుడుల చెంతగల రుద్రసేనానిశాసనమునఁ గలదు. నాటనుండి యీవంశజులు వృద్ధినొంది గణపతిదేవుని కాలమున నాంధ్రదేశమునందలి యన్ని భాగములలోఁ బ్రతినిధులుగనుండి స్వామిభక్తి ప్రకటించి యసామాన్యయశము నార్జించిరి.

## గణపతిదేవునినాఁటి విద్వాంసులు

ప్రతాపరుద్రీయనాటకప్రకరణములవలన నాకాలమున నెందఱో ప్రసిద్ధవిద్వాంసు లున్నటులఁ దెలియుచున్నది. గణపతిదేవుని సోదరియగు కుందలాంబ కుందవరమున నొక శాసనము స్థాపించుచు సామంతకూరుఁడను గణపతిదేవుఁ డొకశాసనము ప్రకటించుచుఁ బ్రతిగ్రహీతలగు పండితుల నామములఁ జేర్కొనెను. వీరలు గాక అభినవమయూరకవి, దామోదరకవి, నాగదేవుఁడు, బాలభారతి, మైలారసూరి, మార్కండేయపురాణకర్తయగు మారయ, కుమారసంభవకర్తయగు నన్నెచోడుఁడు, (వార్ధకావస్థలో) పాలకురికి సోమనాథుఁడు, చక్రపాణి రంగనాథుఁడు, కేతన, తిక్కన సోమయాజి, రంగనాథరామాయణప్రణేతయగు కోనబుద్ధారెడ్డి, నీతిశాస్త్రముక్తావళి వ్రాసిన భద్రభూపాలుఁడు మున్నగు ప్రసిద్ధకవులు గణపతిదేవచక్రవర్తికి సమకాలికులుగనుండి వాఙ్మయము సేవించి ధన్యులైరి. వీరల కావ్యరచనమునకు గణపతిదేవుని సత్పరిపాలనమె కేలూఁత నొసంగెననుట మఱువరాని యంశము. శివదేవయ్య పరతత్త్వరసాయనము రచించెనని గ్రంథాంతరములలోఁ గలదు. ఈతఁడు గణపతిదేవునికిఁ జన్మయదీక్ష నొసంగిన విశ్వేశ్వరశివదేశికుఁడె కానోపు. ఏలయన నీయాచార్యుఁడు బాల్యముననె గణపతిదేవుని యాదరసత్కారముల నొంది రుద్రమదేవికాలమునఁ గూడ నుండెఁ గాన ప్రతాపరుద్రచక్రవర్తి జనన మీయన రెఱుఁగును. గ్రంథసాధనములు లభించునంతవఱకు నీయనయే పరతత్త్వరసాయనకర్తయని విశ్వసించుట ప్రమాదము కాఁబోదు.

## గణపతిదేవుని పరిపాలనము

క్రీ. శ ౧౧౯౯ మొదలుకొని ౧౨౬౧ వఱకీయన రాజ్యము పరిపాలించినటులఁ గలదు. స్థానికచరిత్రములందును నిటులె గలదు గాని రుద్రమదేవి రుద్రదేవుఁ డనుపేరుతో స్థాపించిన శాసనములు ఈమధ్యకాలమునకుఁ జెందినవి కొన్ని యిటీవలిపరిశోధనమున బయటపడినవి. అవి గణపతిదేవుని రాజ్యపాలనకాలమున రుద్రమదేవి రుద్రదేవుఁడని వ్యవహరించుచు వేయించినవి కానోపును. గణపతి

దేవుఁ డాకాలమున రాజ్యవ్యవస్థల సాక్షిమాత్రుఁడై తిలకించుచు శైవాచారరహస్యముల నెఱుఁగుచు వానప్రస్థాశ్రమమువఁగాలము గడుపుచుండెనని యూహింప వచ్చును. గణపతిదేవుని తోఁబుట్టువగు కుందలదేవి నతవాటిరాజుల కీయఁబడుటచేఁ గలిగిన బాంధవ్యము కాకతీయసామ్రాజ్యమునకు బలకరమయ్యెను. ఈకుందాంబకు నతవాటి రుద్రరాజుతో జరిగిన వివాహాదికము ఈయమ నెలకొల్పిన కుందవరపు శిలాశాసనమున నీక్రిందివిధముగాఁ బ్రశంసింపఁ బడియున్నది.

శ్లో. పరాయ సర్వంశవరాయ దాతు
మేవా మనేనాన్నచివైరమంస్త,
శ్రీనాతవాటీ నరనాథ వంశం
తత్కాకతీశస్య కులానురూపం.

శ్లో. శ్రీకాకతీశవంశేన తదేవ విమలం కులం,
అకలంకయితుం స్థానే స్వర్ణే సన్మణిసంగమః.

శ్లో. ...రుద్రనృపతే రదాన్మహాదేవనృపః
కుందల మహాదేవీం.

దీనింబట్టిచూడ మహాదేవరాయలకు ముందు దుర్జయవంశజులగు నతవాటిరాజులకుఁ గాకతీయులకు సంబంధబాంధవ్యములు లేవనియు మహాదేవరాయలు కులశీలగౌరవాదులు విచారించి మంత్రుల యాలోచనము ననుసరించి యారుద్రదేవునితో బంధుత్వము నెఱపుకొనెనని యూహించుట కీశ్లోకములు తోడ్పడుచున్నవి. ఇనుగుర్తిలోని నాగరలిపి శాసనములో బుద్ధరాజునకు ముప్పాంబకుఁగుమారుఁడగు నీరుద్రదేవుఁడు గణపతిదేవుని సోదరియు బయ్యాంబామహాదేవరాయల పుత్రియగు మైలాహ్వయమహాదేవిని పెండ్లాడినటులఁ గలదు. కుందలదేవియే మునునూరుశాసనములో కుండాంబయని చెప్పఁబడినది. మైలాహ్వయదేవియే మైలాంబయనుపేరుతో రుద్రదేవుని భార్యయనియు సంతానవతియనియు అమరావతిశాసనమునందును త్రిపురాంతకశాసనమునను జెప్పఁబడెను. కుందలదేవి మైలాంబిక యొకతెయో భిన్నలో నిరూపింప వీలుకాలేదు. ఎట్లయినను ఈనూతనసంబంధము నతవాటివారితోఁ గాకతీయులకు మహాదేవరాయల కాలములో జరిగిన దనుట సత్యము. నతవాటిసీమ పాలకులగు రుద్రదేవుని వంశజు లంతటితోఁ గాకతీయుల కంకితులై సాగివంశజుల వలె ఆంధ్రసామ్రాజ్యవృద్ధికిఁ బాటుపడియుందురు.*



## గణపతిదేవుని పరిపాలనము

గణపతిదేవుఁడు ప్రజాహితముగఁ బరిపాలించిన రాజులలోఁ బ్రథమగణ్యుఁడు. ఆకాలమున జైనులకు బౌద్ధులకు నీయన కొంచెముగనో గొప్పగనో యొత్తిడి గలిగించినమాట సత్యదూరము కాదు అంతమాత్రమున నీతఁడు ప్రజారంజకుఁడుగాఁ దన వీలుండదు. విద్యానాథుఁడు గణపతిదేవుని మానుషశంభువని ప్రశంసించెను.† కొన్ని శాసనములలో గణపతిదేవుఁడు సప్తమచక్రవర్తియనియు శివావతారమనియుఁ బ్రజాపాలనచతురుఁడనియు సత్యహరిశ్చంద్రుఁడనియుఁ బేర్కొనఁబడెను. ఈయన ఓరుగంటిచెంతఁగల కోనేటివద్ద వేయించిన శాసనస్తంభమువలన వర్తకమునకెంత సౌకర్యములు గలుగఁజేసినదియుఁ దేటతెల్లము కాఁగలదు. గణపతిదేవుఁడు గణపేశ్వర మను ప్రసిద్ధక్షేత్రరాజమును గట్టించి యందు బహుసంఖ్యాకులగు విద్వాంసుల నుంచెను. ఆగణపేశ్వరదైవతము ప్రభావమున కాకతీయకులదైవతమగు స్వయంభూనాథున కనురూపుఁడని ప్రతాపరుద్రీయనాటకప్రకరణమునందుఁగలదు. ఈదివ్యక్షేత్రమునుగూర్చిన వివరములు స్థానికచరిత్రమునందు విపులముగఁగలవు. ఇతరదేశాగతవర్తకులవలన వచ్చు సుంకములను గణపతిదేవుఁ డీదేవాలయములకే కట్టడిగావించెను. ఆపన్నులు గూడఁ జాల సులభముగ నుంట నీతని సత్పరిపాలనమునకుఁ దార్కాణము. కర్పూరమున వీసెకు రెండు చిన్నములు, కస్తూరి నూఱు చిన్నములకు రెండు చిన్నములు, పట్టునూలియందుఁ దులమునకుఁ జిన్నము, దంతము, దూనూరిపట్టు పచ్చ పట్టందుకోటబాదిక, చందనము, ముత్యము, రుద్రాక్ష, గాణబూస మొదలుగాఁగల మణిబండారములం దెల్లను మాడకు వీసము...ఇట్లు పన్నులు వ్యాపారవృద్ధికరముగా విధింపఁబడుటయే గణపతినృపాలుని ప్రశస్తపాలనమునకుఁ దార్కాణము.

## గణపతిదేవుని వంశము

గణపతిదేవుని భార్య సోమదేవియని ప్రతాపరుద్రీయమున స్పష్టముగాఁ జెప్పఁబడినది.

“సైవోమాచేతి నిర్దిష్టా సోమాచేతి ప్రథా మగాత్,
తవమాతా శివా సాక్షా ద్దేవో గణపతిః పితా.”

ఈయనకు కుందలదేవి, మైలాంబ యను నిరువురు సోదరీరత్నములుగలరు. శాసనాంతరములవలన గణపతిదేవునకుఁ జిన్నచోడుని కుమార్తెలగు నారాంబపేరాంబలు కూడ భార్యలని కలదు. పట్టపు

* ఆంధ్రుల చరిత్రమున సాగివంశమునకుఁ జెందిన గొంకదోరపరాజు పేర్కొనఁబడెను. శాసనములలో నాతని ప్రశంస “త్యాగాంక దోరాధిపః” అనిగలదు. త్యాగము చిహ్నముగాఁగల దోరపరాజని యట భావము. గొంకదోరపరాజనుట ప్రమాదము కానోపు.

† ......పరమ మాహేశ్వర శ్రీస్వయంభూనాథ దేవదివ్య శ్రీపాదపద్మారాధక ప్రత్యక్ష ప్రమథగణావతార లాడచోడకటకదూఱకాఱమన్నియ వేంటకాఱ, కటనప్రచండ బలమూర్తి గండ విభవ దేవేంద్ర సత్యహరిశ్చంద్ర చతుస్సముద్ర పరమ దిక్స్ఫురితకీర్తి సప్తమచక్రవర్తి ఉపమన్యుప్రముఖాది సకలభక్త జనానంద కారణ వైరిసంహరణ ఆదిరాజచారు చరిత్ర సుజనైకమిత్ర సుస్థిరనిజ రాజాన్వయ నామాది సమస్త ప్రశస్తి సహితం శ్రీకాకతీయగణపతి దేవరాజులు......

రాణిమాత్రము సోమదేవియనుట నిస్సందేహము. ఈమెయందు గణపతిదేవునకు రుద్రమదేవియను పుత్రికయు గణపాంబయను పుత్రికయు జనన మొందిరి. రుద్రమదేవి చాళుక్యవంశజాతుఁడగు వీరభద్రునకును గణపాంబ ధరణికోటపాలకుఁడగు కోటబేతరాజున కొసఁగి పరిణయము గావింపఁబడెను. రుద్రమదేవి బాల్యావస్థనుండియును రుద్రదేవుఁడను వ్యవహారనామముతో రాజ్యవ్యవస్థలఁ దిలకించుచుండెను. గణపతిదేవుఁడు రుద్రమదేవిని పుత్రభావముతోఁ జూచుచు తనయులు లేరన్న కొఱంతదలంపక కాలము గడిపెను. గణపతిదేవుఁడు రుద్రమదేవిని పుత్రుఁడని వ్యవహరించినటులఁ బ్రతాపరుద్రీయమునందలి యీక్రింది పంక్తు లాధారములు కాఁగలవు.

"అన్యథా కథ మీశ్వరప్రసాదాదృతే నిరంకుశం స్త్రీవ్యక్తివిశేషస్య లోకాధిపత్యం? ఏవం మానుషశంభునా గణపతిమహారాజేన అభ్యంతరస్యాఽనుభవమహిమ్నః సదృశమత్రపుత్ర ఇతివ్యవహారః కృతః"

(ఈశ్వరుని దయరేని. లేకపోయినయెడల ఒక యాఁడుదాని కడ్డుకలేని లోకపాలన మెట్లు చేయఁగలదు? ఈవిధముననే మనుజశివుఁడగు గణపతిమహారాజు అంతరంగరహస్యవేత్తయై కొడుకని వ్యవహరించుట తగియున్నది.)

కొందఱు రుద్రమదేవి బాల్యమున మగవాఁడుగ వ్యవహరింపఁబడుటచే నొక కన్యనిచ్చి పెండ్లిచేసిరని యేమో వ్రాసిరి. రుద్రమదేవిని గణపతిదేవుఁడు పుత్రియనియె వ్యవహరించెను. సమకాలికశాసనములలో స్త్రీగనే వ్యవహరింపఁబడెను. రాజ్యవ్యవస్థలయందు మాత్రము రుద్రదేవుఁడని వ్యవహరించియుండు ననుట వాస్తవము. రుద్రమదేవి చాళుక్యవీరభద్రున కొసఁగి పరిణయము గావింపఁబడుటయు నామెకు ముమ్మడాంబ, రుయ్యాంబ యను నిరువురు తనయలు గలుగుటయుఁ బ్రసిద్ధమైయుండ "రుద్రమదేవిని గణపతిదేవుఁడు పురుషుఁడని వ్యవహరించి లోకమును నమ్మించుటకుఁ గన్యనొకతెం దెచ్చి పెండ్లి తంతునడిపెననియుఁ బ్రసాదాదిత్యుఁడు, రుద్రమదేవిని ఖండించెననియుఁ గల కట్టుకథల విశ్వసింపఁబనిలేదు. గణపతిదేవుని పుత్రికారత్నము లిరువురును రాజనీతికుశలురాండ్రు కావున గణపతిదేవుని యనంతరము కాకతీయసామ్రాజ్యమును రుద్రమదేవియు ధరణికోటరాజ్యమును భర్తకనంతరమును లోకోత్తరముగాఁబరిపాలించి స్త్రీలయందు సామాన్యముగాఁ గానరాని యసామాన్యపరిపాలనకౌశలమును బ్రకటించిరి.

## గణపతిదేవుని మహత్త్వము

అఖండశివనిష్ఠాగరిష్ఠుఁడగుటచే నీతని దైవాంశసంభూతునిగ లోకులు విశ్వసించి పితృభావముతో వర్తించిరి. కాంచీమండలము వఱకు నొకమాఱు దండయాత్రసేగి యఖండవిజయసంపన్నుఁడై రాజధాని చేరెను. రాజ్యమేలిన యఱువదిసంవత్సరములలో నీతఁడు పరాజయ మెఱుంగఁడు. ఆంధ్రసామ్రాజ్య మీతని కాలమున సర్వవైభవసంపూర్ణమై దినదినాభివృద్ధితో నఖండప్రశస్తి గడించె ననుట సత్యము. గణపతిదేవుఁడు సూర్యవంశజుఁడని పాకాలశాసనమునందుఁ జెప్పఁబడెను. చంద్రవంశజుఁడును జాళుక్యుఁడును నగు వీరభద్రునికిఁ సమార్తియగు రుద్రమదేవి నొసంగెను. అంతమాత్రమున గణపతిదేవుఁడు క్షత్రియుఁడనుట కవకాశము లేదు. చతుర్థవంశజులని చెప్పుకొన్న రాజకుటుంబములతో సంబంధబాంధవ్యములు కనిపించుట యీతని క్షత్రియత్వమునకు విరోధము. కాకతీయులు తాము క్షత్రియేతరుల మని చెప్పికొనినటుల శాసనాధారములు గలవు. అనుమకొండ శాసనములో నున్న రుద్రదేవుని "క్షుద్రక్షత్రకులోన్నతిక్షయకృతః" అనువిశేషణము, ప్రతాపరుద్రీయములోని ప్రతాపరుద్రుని విశేషణములగు "క్షుద్రక్షత్రియపక్షశిక్షణవిధా", "సోమార్కాభిజనం తిమవ్యజయతి శ్రీకాకతీయాన్వయం", "అర్కేందుకులప్రశస్తిమస్పృజన్యం కాకతీయేశ్వరం", "సూర్యసోమాన్వయామాత్య మహత్త్వాఽద్యాధరీకృతా" అనునవి కాకతీయవంశము సూర్యచంద్రవంశములకు భిన్నమైనదనియు, క్షత్రియేతరమనియు విశ్వసింప నవకాశము నొసంగుచున్నవి.

క్రీ. శ 1260 ప్రాంతమున నీవీరవతంసుఁడు ఆంధ్రలోకము పారలోకాంబురాశిని ముంచి దివఁగతుఁడయ్యెను. పితృసన్నిధిని పరిపాలనరహస్యముల గఱచిన యఖండశేముషీధురంధరురాలగు రుద్రమదేవి చిరకాలము రాజ్యమేలి పితృయశమునకు వన్నెపెట్టెను. గణపతిదేవునితోఁ గాకతీయవంశ మంతరించెనని చెప్పవచ్చును. రుద్రమదేవి చాళుక్యరాజుల ఇంటికోడలుగావున నాయమను కాకతీయరాజ్ఞియన వీలులేదు. ఆయమ పుత్రియగు ముమ్మడమ్మయుఁ గాకతీయుల కొసంగఁబడినది కాదు. ఆయమ భర్తయగు మహాదేవరాయలు కాకతీయేతరుఁడనుట స్పష్టము. ఈపరిస్థితులలో సామంతులు, ఆస్థానకవులు, విద్వాంసులు రుద్రమదేవిని ప్రతాపరుద్రుని కాకతీయవంశజు లనుటకుఁ గారణము మృగ్యము. కాకతీయసామ్రాజ్యమును బాలించుచున్న కతన కాకతీయప్రభువు లనుపించుకొందురు గాని రుద్రమదేవి, ప్రతాపరుద్రుఁడు కాకతీయవంశజు లనిపించుకొనుట పొసఁగదు.

కాకతీయసామ్రాజ్యము మహామండలేశ్వర ప్రోలరాజుతో నారంభమై గణపతిదేవునితో విచ్ఛిన్నమైనది. అన్యగోత్రీయ యగు రుద్రమదేవికతనఁ బెంపొంది ప్రతాపరుద్రదేవునికాలము నంతరించినది. ప్రోలరాజును రుద్రదేవుఁడు చంపుట రుద్రదేవుని మహాదేవరాయలు చంపుట మున్నగు నత్యాచారములచే నీకుటుంబము మధ్యమధ్య రాజకీయవిప్లవములకు లోనయ్యెను. రుద్రదేవచక్రవర్తిని మహాదేవరాయలు వధించిన పిదప భ్రాతృహంతకుఁడని యాతనిరాజ్యమునకు సేనాపతులు రానీయక పోయిరి. ఈయవకాశమును బురస్కరించుకొని ప్రత్యర్థిరాజులు కాకతీయసామ్రాజ్యమును నాశనముగావించి స్వవశము గావించుకొనఁగా రేచర్లరుద్రసేనాని సామ్రాజ్యము నుద్ధరించినటుల రామప్పగుడిశాసనమునందు స్పష్టముగాఁగలదు. ఇంకొకమాఱు కాక

టెలెగ్రాం "మెడికేటడ్" స్థాపితము 1900

# డాక్టర్ జీ. బీ. గారి మెడికేటెడ్ నశ్యము


రిజిష్టర్డ్ ట్రేడ్ మార్క్

మీ ఉద్యోగమేమి? ఉపాధ్యాయులా? పండితులా? అటవీ పాలకులా? యక్సైజ్ ఉద్యోగీయులా? వ్యవసాయదారులా? వర్తకులా? ఇంజనీయరులా? డ్రాఫ్ట్స్ మన్‌లా? లేక చదరంగ క్రీడా విలాసులా?

మీ కపరిమితాయాసము కలిగినను లేక మీ మెదడు పనిచేయజాలకపోయినను, డాక్టర్ జీ. బీ. గారి నశ్యము యొక్క చిటికెడుమాత్రమే మీకు కావలసినది. అది తలనొప్పిని పోగొట్టి మెదడుకు చురుకుదనమును కలుగజేసి ఆనందమును చేకూర్చును.

తలనొప్పి, నాడీవ్యాధి, గండమాల, నేత్రవ్యాధులు, ముక్కు, మెదడు వీటికి గలుగు జబ్బులకు అద్వితీయమైనది. పొడుము పీల్చువారి కందరికి ఆదాయముతో కూడిన వరప్రసాదిని.



4 అణాలు

## వెల సీసా 1-కి 4 అణాలు మాత్రమే.

## ఒక సీసాను పరీక్షించిన నమ్మకము కలుగును

---

డాక్టరు జీ. బీ. గారి నశ్యమును వాడి,
ఉల్లాసము గల మీ చురుకుదనమును కాపాడుకొనుడు.

ఈ క్రింది విలాసమునకు వ్రాయుడు:—

# గురుబసవ అండ్ కంపెని లిమిటెడ్.,

నశ్యమును తయారు చేయుటలో పేరెన్నిక గలవారు.

## తపాలుపెట్టె నెం 510, పార్కుటవున్, మదరాసు.

మానేజింగ్ డైరెక్టరు:—ఎస్. సి. నాగి శెట్టియారు.



శ్రీ నరసింహదేవర సత్యనారాయణగారు (లే)




శ్రీ మల్లాది రామమూర్తి శాస్త్రిగారు (లే)



శ్రీ మల్లిమడుగుల జగన్నాధరావుగారు (లే)




శ్రీ రావూరు రంగరావుగారు (లే)



శ్రీ పట్టాభి రాములుగుప్తగారు (కి)



శ్రీ తల్లావజ్ఝల శివశంకరశాస్త్రిగారు (కి)



శ్రీ జి. వి. పున్నయ్యశాస్త్రిగారు (కి)



శ్రీ కళా వెంకట్రావుగారు (కి)



శ్రీ పురాణం సూరిశాస్త్రిగారు (కి)



శ్రీ భట్టిప్రోలు సూర్యప్రకాశరావుగారు (కి)

యసామ్రాజ్యమునఁ బురుషసంతతి లేకపోవుటచే విరియాల కామసాని తన కుమారుని నొసంగి కాకతీయరాజ్యము నిలిపినటుల గూడూరుశిలా శాసనములోని యీక్రిందిపద్యములవలనఁ దెలియవచ్చును:

చ. అనుపమదుర్జయాన్వయసుధాబ్ధిన నేకులు రాజనందనుల్
పనిన బోలంది వెన్నడను సంభవుడయ్యె నతిప్రసిద్ధుడై
వినుతవిరోధిమండళిక వెన్నడు వెన్నడ వోలె వానికిన్
ఘనుడను నెఱ్ఱ భూపతి జగద్విదితుం డుదయించె గీర్తితోన్.

ఉ. భావితకీర్తి వాతనికి బాండవమధ్యమ భీముడో యనం
గా విరియాల భీమ నృపకుస్మరుడై యుదయించె వానికిన్
భూవినుతుండు మండళిక భూషణుడెఱ్ఱనరేంద్రు డుత్తమ
శ్రీవినుతుండు బంధుజనసేవ్యుడు దానుదయించె నున్నతిన్.

చ. అతడనిఁబొట్టచేత వసుధాధిపుఁ జేకొని వాని వైరి మ
చ్ఛిత్రమున జంపి యాకొలవిదేశమునందు బ్రతిష్ఠ నేసి త
త్తనయు సమేతు డోడగలి......యము బిట్టిణ గద్యవంబున
ప్రతియుఁడు వానితో మొగడు పర్నియు పంద్రడు నెఱ్ఱ కాపుడై.

చ. అరుసమనట్టి ఎఱ్ఱనృపు నంగన కామమసాని మే
ల్గరదని బేత భూవిభుని గాకతివల్లభుఁ జేసి వానితో
బరగగ జేతిశెట్టి ఘను బల్లవరాయని నాగిచొచ్చె భా
స్కరవిభ చక్రవర్తిగనికాకతివిల్పుట కోటిసేయదే.

చ. కారకకాలుడై పడు పెగాడయ నాయకు జంపి నూరడ
వ్వేలుపుగొండ రవ్వ నృపువేలుపు గొండననిల్పి వానిచే
మేలుగమూడ ముప్పయిని మేలుగ నేరడు బోడిపాడునుం
పేలుగ బేకుమావిడ్లు మేలుగ రెండయె రాజసంగడై.

ఈశాసనశిలపయి చాళుక్యరాజగు సోమేశ్వరుని శాసన మొక ప్రక్కగలదు. వేఱొకవైపు విరియాలవంశజులగు సూర విభుఁడు, వానికొడుకు బేతన, కోడలు ఎఱ్జమాంబికల ప్రశంసయు ఈదంపతులకొడుకు మల్లనపేరు గలదు. కన్నడపద్యమయమగు నీశాసనభాగమున శతాబ్దము లేదు. ఇంకొకవైపు చాళుక్యసోమే శ్వరుని సంబంధియగు నిమ్మభీముని శాసనముగలదు. ఇవియన్నియుఁ బదునొకండవ శతాబ్దమునాఁటివని లిపివలన నెఱుఁగవగును. వీని సమ కాలికమునగు ఉదాహృతపద్యశాసనము పదియవ శతాబ్దములోనిది కావచ్చును. ఆకాలమునఁగల దుర్జయవంశము, అందుఁ బ్రసిద్ధులగు ఎఱ్ఱ భూపతి, విరియాలభీముఁడు జనించుటయు, విరియాలభీముఁడు బొట్టబేతరాజును జంపి కొలవిదేశము గైకొనుటయు, ఎఱ్ఱభూపతి భార్య కామమసాని పల్లవరాయని విజృంభణమాపి, తనకరదనిచే (బేతరాజుచే) కాకతీయవంశము నుద్ధరింపఁజేయుటయుఁ జరిత్రమునకు క్రొత్తయంశములు. శాసనస్థాంశముల బలపటు పనింకఁగొన్ని సాధ నాంతరములు గావలసియున్నది. బేతభూపతి కాకతీయవల్లభు నెట్లు చేసెనో కామసాని పూర్వోత్తరములెవ్వియో బేతభూపతి కాకతీయ రాజులలో నేపేరఁబరఁగెనో భావిపరిశోధనమునఁగాని తేలదు. ఇది గణపతిదేవుని కాలపు శాసనముగావను విరియాలవంశ మాకాలమునఁ బ్రసిద్ధముగ నున్నందునను గణపతిదేవున కీయంశమే మైన యన్వ యించునేమో యని మాయనుమానము.

## పరిశిష్టము

సూర్యుఁ డస్తమించినంతనే అంధకారము జగము నాక్రమింపదు. మనోహరసాంధ్యమరీచు లాకాలమున నేత్రపర్వ మొనర్చును. సాంధ్య రాగతమస్సమ్మేళనము నయనానందకరముగ నుండును. అటులే గణ పతిదేవ భాస్కరుఁ డస్తమింపఁగనే ఆంధ్రదేశ మంధకారబంధురము కాలేదు. రుద్రమదేవిపరాక్రమము దిశలకేయెండవలె లోకానందకరముగ నుండెను. తేజస్తమోఘట్టనమె ప్రతాపరుద్రునికి యవనులకు జరిగిన సంగరము. అంతతో ఆంధ్రసామ్రాజ్యభానుఁడు అవశిష్టదీధితుల నాక ర్షించుకొని చిరకాలమున నిశాగర్భమున నిమిడి విద్యానగరసమీపస్థ మగు ఋష్యమూకగిరిపై నుదయించెను. ఇది ప్రసంగాంతరము.

గణపతిదేవుఁడు నిర్మించిన యాలయములు నశించినవి. ఆతఁడు నెలకొల్పిన తటాకములు మహారణ్యగర్భితములైనవి. ఆనాఁటికీర్తిచిహ్నములు యవనపదాఘాతములకుఁ దాళజాలక భూ గర్భగతములైనవి. ఐననేమి గణపతిదేవుని యాంధ్రవ్యాప్తిత్వపున రభ్యుదయదీక్ష కాలగర్భమును జీల్చుకొని యాంధ్రదేశమును ఆంధ్ర వాఙ్మయమును నలంకరించు శుభకాల మాసన్నమైనది. ఈశుభావసర మున మాటువడిన పశ్చిమాంధ్ర దేశమునందలి (నిజామురాష్ట్రములోని) శాసనసముదయమును సేకరింపఁగలిగితిమేని ఆంధ్రసామ్రాజ్యచరిత్రము భవిష్యత్సోదరసంతతి కర్పింపఁగలుగుదుము. సందిగ్ధములగు చరిత్రగ్రం థులు విచ్చిపోవును. ఆంధ్రసోదరులు కాకతీయసామ్రాజ్యచరిత్రమునకు సేవజేయుట జాతీయసేవయగుకొనఁదగును. ఆక్రాంతపరిపాలనవశమున భిన్నములుగనున్న బ్రిటిషునిజాము దేశములయందలి ఆంధ్రదేశమున కవి నాభావమగు సంబంధ మేర్పడును.* పరిశోధకయువకుల శుభాగమము నకు అభ్యుదయాకాంక్షితమగు నిజామురాష్ట్ర మపేక్షించుచున్నది.

తే. అడఁగిపోయిన కాకతీయాంధ్రచరిత
మంతరించునె యాంధ్రు లున్నంతవఱకుఁ
బ్రశిథిలాంధ్రశరీరాస్థిపంజరమున
రాజకుండునె పూర్వపరాక్రమాగ్ని!

* చరిత్రకారులు స్థానికుల ప్రవాదముల పైనను, జరిత్రానుభవము శాసనపఠనాభ్యాసము లేని ప్రజలపైనను ఆధారపడుటచేఁ జరిత్రాంశ ములు తారుమారగుచున్నవి. కొండిపర్తిదుర్గాధిపతి యగుచౌండసేనానిని ఆతఁడు స్థాపించిన చౌండసముద్రమును భాండసేనాని భాండసముద్ర మనుట యొక్క తారాకాణము. ఈవ్యాసమున సూచించిన శాసనములు చాలవఱకుఁ బ్రకటింపఁబడనివి. వీని మాతృకలు కొన్ని మాయొద్దఁగలవు.



# దేవేంద్రవర్మ

శ్రీ శ్రీ శ్రీ గోపీనాథ హరిచందన జగద్దేవు రాజాబహద్దూరు గారు

ఉదయాదిత్యుని ఒక శాసనము కంబకాయ గ్రామములో దొరికినది. ఈ యుదయాదిత్యుడు మహామాండలికుడైన ధర్మఖేడియొక్క పుత్రుడు. ఇతడు కాదంబవంశస్థుడు. ఈ శాసనమును శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, 1927 సం॥ నవంబరు భారతిలో ప్రకటించిరి.*

ఈ తామ్రఫలకము చదువుటలో కొంచెము పొరపాటు గలదు. ఏమనగా సోమశేఖర శర్మగారు 'సహస్రైక శతద్వయాధిక' అనగా 1102 శకాబ్దమని చదివినారు. ఇది సరియైన సంవత్సరము కాదు. కారణ మేమనగా కళింగనగరమున ఈ శాసన మొసంగబడినట్లు వ్రాయబడిన సంగతి తామ్రశాసనములో నుండుటచేత మహారాజాధిరాజు దేవేంద్రవర్మ కళింగేశ్వరుడని తెలిసినప్పటికి వారి ముఖ్యరాజధాని కళింగనగరము కాదు. కారణ మేమనగా సదరుశాసనమున సంవత్సరము వ్రాయుస్థలమున, "దంతపురే ప్రవతితాః" అని వ్రాయబడుట చేత. ఈ సంవత్సరమున గంగవంశీయులగు రాజులు దంతపురములో నివసించియున్నారు. అందుచే దంతపురము రాజధాని గాని కళింగనగరము కాదు. ఇంతేగాక గంగవంశీయులు ప్రతిసంవత్సరము భాద్రపదశుద్ధద్వాదశిరోజున గొప్ప యుత్సవమును నేటివరకు వైదికవిధానమున నిష్టదేవతయగు మాణికేశ్వరిదేవి సన్నిధానమున జరుపుచున్నారు. సదరు ఇష్టదేవత ముఖ్యరాజధానియందు తప్ప తదితరస్థలములయం దుంచబడదు.

గంగవంశావతంసుడగు చోడగంగదేవు నగరికటకమందు రాజత్వము చేయుచున్నకాలమున దేవేంద్రవర్మ యను నామముగల మరియొకరాజు దంతపురములో రాజత్వము చేయుచుండెను. ఇందుకు నిదర్శనము గోదావరిజిల్లా రామచంద్రపురం తాలూకా ద్రాక్షారామమున గల శిలాలిపిలో "భస్మీకృత్య కళింగదేశ మఖిలం నిర్జిత్య గంగం రణే భంక్త్వాంకోశలఖండపాలనివహైః దేవేంద్రవర్మాదికాః, వీరః పల్లవరాజ ఇత్యభిహితో రాజేంద్రచోడప్రభోః కీర్త్యుత్తంభ మిహోఢ్రసంధిషు జయస్తంభం శుభం న్యక్షిపత్." అని కలదు. చోడవంశీయుడగు రాజేంద్ర చోళదేవుయొక్క సేనాపతి పల్లవరాయుడను వీరుడు తన ప్రభువుయొక్క ఆదేశానుసారముగా యెప్పుడు కళింగమును జయించుటకు తూర్పుదిక్కునకు బయల్వెడలెనో అప్పుడు కోశలఖండపాలులతో గంగవంశీయుడగు దేవేంద్రవర్మను జయించి ఓఢ్రదేశసంధిస్థలమందు జయస్తంభమును నాటించెను. ఈ పల్లవరాయుడు రాజేంద్రచోళుని మనమడగు చోడగంగదేవుని కాపాడుటకు గాను యీప్రాంతములకు వచ్చుట సర్వజనవిదితము. ఈ చోడగంగదేవు 999-1069 శకాబ్దము వరకు, అనగా 1077-1147 క్రీస్తాబ్దమువరకు రాజ్యము చేసెను.

దేవేంద్రవర్మ అనంతరము అతని పుత్రుడు మహేంద్రవర్మ దంతపురాధీశుడాయెను. నైషధకావ్యగ్రంథకర్త శ్రీహర్షుడు నిజకావ్యములో దమయంతీ స్వయం

* శాసనఫలకమందలి విషయసారము ఇదివరలో భారతియందే ప్రకటింబడియున్నందున మరల ప్రకటింప మానితిమి. —సంపాదకుడు.

వరమును వర్ణించుపట్ల కళింగాధీశుడగు మాహేంద్రవర్మను వర్ణించియున్నాడు. చోడగంగదేవునకు సాహసాంకయను పేరుకూడా ఉన్నట్లు ద్రాక్షారామశిలాలిపివలన తెలియుచున్నది. శ్రీ హర్ష కవి తన నైషధకావ్యములో 22-వ సర్గ ఆఖరు శ్లోకమందు తాను సాహసాంకచరితమును వ్రాసినట్లు తెలియపరచియున్నాడు. ఇందువలన శ్రీహర్ష కవి, చోడగంగదేవు, అనంతవర్మ, అతని పుత్రుడు మాహేంద్రవర్మ ఒక్క కాలపువారే యని స్పష్టమగుచున్నది.

చోడగంగదేవుని యొక్క బాల్యసమయమున కళింగదంతపురములో దేవేంద్రవర్మ రాజ్యము చేయుచున్నసంగతి నిజమగు కారణమున పై తామ్రశాసన కాలము శర్మగారు నిర్ణయించినది సరియైనదికాదు. మేము ఈ శాసనమును సరిగా చదివి స్థిరపరిచినది యేమనగా ఆ ఫలకమందు యీప్రకారముగా కాలనిర్ణయమై యున్నది. "శకాబ్దానహస్రమే కోన్నత్రయాధిక" అనగా, 1021 శకాబ్దమున దేవేంద్రవర్మ దంతపురములో నుండెను. ఈ కాలములోనె దేవేంద్రవర్మయొక్క మరియొక తామ్రఫలకము దొరికినది. దానిలో గాంగేయవంశప్రవర్ధమానవిజయరాజ్యసంవత్సరములు 397 అని యున్నది. ఇందువలన గంగవంశరాజత్వ సంవత్సరములు 624 శకాబ్దము మొదలు ప్రారంభింపబడినట్లు స్పష్టమగుచున్నది. వీరి యొక్క విశుద్ధవంశావళి యిట్లు వ్రాయబడినది:—



# రాజ్యార్పణము

వైశాఖి (కవితాసమితి)

రాయగడదుర్గమున మహారాష్ట్రవీర
కేసరి శివాజి మాతృసంక్లేశ ముడుప
నల భవాని పాదాంబుజధ్యానమగ్న
మానసమ్మున విశ్వమే మరచియుండె.

అంత నాతని చెవి సోక ప్రాంగణమున
"జయముజయమగురఘువీర జయముజయ"మ
టన్న రామదాసుని కరుణార్ద్రరవము
తడబడి యతండు శోకసంతప్తుడయ్యె.

సంగరమ్మున వైరికుంజరకవోష్ణ
రక్తధారల జిమ్ము వీరప్రతాప
శాలి కనుగవ నశ్రుల దేల రాల్చె
బిచ్చమని వచ్చు సన్యాసి పిలుపు వినిన?

తీవ్రగమనమ్ముతోడ నశేషవినయ
వినమితోత్తమాంగుండయి వెలికి వచ్చి
నిలిచె రామదాసుని పాదనీరజముల
మ్రోల నారాజమణి వీరపుంగవుండు.

"ఈమహారాష్ట్రరాజ్యదివ్యేందిరకు న
ధీశుడవు నీవ కావె సుధీప్రపూర్ణ!
బిచ్చమెత్తెద వేల నిర్వేదవృత్తి
వీథివీథుల దుర్గమవిపినములను?"

అని వచించి శివాజి యాతని కరముల
విజయపత్రాళి నిడె "ఇదే బిచ్చ"మనుచు,
కనుగొనల హర్షభరజలకణము లెడల
స్వామి నిశ్చలహృదియు విస్మయము నంద.

మోవి దరహాసచంద్రిక మొలకలెత్త
నయనయుగళిని సుప్రసన్నత నటింప
పలుకు పలుకున సుధయె చిప్పిలుచు నుండ
స్వామి మెలమెల్ల నతనితో, "భళిర! మేలు
నీదు పూర్ణభక్తికి శివా! మోద మయ్యె.

కాని, సన్న్యాసులకు మాకు కలుము లేల?
జానెడంత పొట్టకును రాజ్యమ్ము లేల?
బిచ్చకులకు బిచ్చమె కాక పెంపు లేల?
వలదు పరిగ్రహింపుమో వత్స!" అనిన,
పాదముల వ్రాలి యారాజు పలికె నిట్లు:
"ఒసగినది నే గ్రహింపగా నోప దేవ!
నీదె సకలమ్ము నన్ను మన్నింపుమయ్య!"
ఎంత తెలిపిన వినడయ్యె పృథ్వినేత.

క్షణనిమీలితనయనుడై స్వామి పలికె:
"సకలమును స్వీకరించితి సరియె; కాని
ఈవు మాయాజ్ఞ శిరసా వహింపవలయు.

ఈసకలరాజ్యమునకు నీవే కుమార!
ప్రతినిధిగ మాకు పాలింపవలయు వినుము."
వల్లెయని రాజు స్వామికి వందన మిడి
చనియె శుద్ధాంతమునకు హర్షమున దోగి.

అదె మొదలు మహారాష్ట్రరాజ్యమ్ముపైన
తవిలి యెగిరె కాషాయపతాకచయము
యవనపరిపంథిజనహృదయములు వ్రీల
ప్రాభవమున స్వాతంత్ర్యదేవత వెలుంగ.

---



అఖిలభారతజాతీయమహాసభా కార్యనిర్వాహక సంఘసభ్యులు-అలహాబాదు (కారాగారమునుండి విడుదలబడినవారు)



















మహాత్ముని ఉప్పుసత్యాగ్రహము-దండియాత్ర, సూరతు మకాము (4-5-30)

౧. పతేదారుఆశ్రమమునకు మహాత్ముడు వచ్చుచుండుట ౨. పతేదారుల సమావేశమునకు మహాత్ముడు పోవుచుండుట 3. సూరతు వీధిలో మహాత్ముడు ౪. స్త్రీలసభలో మహాత్ముడు ఉపన్యసించుచుండుట ౫. పై యుపన్యాససమయమున మరియొకదృశ్యము ౬. పై ఉపన్యాససమయమున ఇంకొకదృశ్యము.



# యథార్థజ్ఞానము

బుర్రా శేషాచలంగారు

భగవంతునిచే సృజింపబడిన జంతుజాలమున కంతయు మానవజన్మ ముత్తమము. అది జన్మాంతరసుకృత పరిపాకవిశేషముచేత కలుగవలసిన దేగాని మఱియొకదాని వలన గలుగునది గాదు. అట్టి దుర్లభమయిన జన్మ మొక వేళ లభించినను యథార్థజ్ఞానము పట్టుపడకపోయిన నది వ్యర్థమైపోవును. కాబట్టి మానవుల కందరికిని యథార్థజ్ఞానమత్యావశ్యకమై యున్నది. దేహేంద్రియాది ప్రపంచమున కంతకును విలక్షణమైయున్న యాత్మస్వరూపమును దెలిసికొనుటయే యథార్థజ్ఞాన మనబడును. దేహేంద్రియాదిప్రపంచమంతయు అప్రకాశ్యమై, అనిత్యమై, అశుద్ధమై, ఆద్యంతసహితమై, దృశ్యమై, దుఃఖమయమై,జడమై, వికారమై, పరిచ్ఛిన్నమై, కార్యమై, సంకల్పమై, గుణయుతమై, సావయవమై, సజాతీయవిజాతీయస్వగతభేదసహితమై యుండును. సమష్టివ్యష్టిరూపమైన శరీరత్రయమే అనాత్మ యనబడును. ఆత్మ నిత్యమై, శుద్ధమై,సత్తై, సుఖమై, దృక్కై, నిర్వికారమై, స్వప్రకాశమై, నిస్సంకల్పమై, నిరాధారమై, నిరవయవమై, సుప్రకాశమై, ఆద్యంతరహితమై, సజాతీయవిజాతీయస్వగతభేదరహితమై, నిర్గుణమై యుండును. శరీరత్రయమునందు పంచీకృతపంచమహాభూతములవలన కలిగి ప్రారబ్ధకర్మాధీనమై జీవులయొక్క కర్మముల కనుగుణముగా సంభవించు నానావిధసుఖదుఃఖముల కాశ్రయమై యున్నదే స్థూలదేహ మనియు, అపంచీకృతపంచమహాభూతములవలన కలిగి జ్ఞానేంద్రియకర్మేంద్రియపంచప్రాణమనోబుద్ధులతో గూడుకొన్నదే సూక్ష్మశరీరమనియు, స్థూలసూక్ష, శరీరములకు హేతుభూతమై, ఆద్యమై, అనిర్వాచ్యమై జడమై, మోహాత్మకమై, ఆత్మాశ్రితమై, జగదుత్పత్తికి మూలకారణమై యున్న యజ్ఞానమే కారణశరీరమనియు చెప్పబడును. ఈ శరీరత్రయము పంచకోశాత్మకమై యుండును. ఈ పంచకోశములకు వ్యతిరిక్తమైనదే ఆత్మ యని వేదములు చెప్పుచున్నవి.

కాబట్టి పంచకోశములయొక్క స్వరూపమును మొదట విచారించి తెలుసుకొనవలయును. ఆ కోశములు అన్నమయమనియు, ప్రాణమయమనియు, మనోమయమనియు, విజ్ఞానమయమనియు, ఆనందమయమనియు నయిదువిధములుగా నుండును. వానిలో అన్నమయము వలన నుత్పన్నమగు శుక్లశోణితములవలన జన్యమై, మరల నన్నముచేత నభివృద్ధినొందుచు స్తంభము వలె స్థూలమై, కరచరణాద్యవయవములు కలిగి షడ్భావవికారములతోగూడి షట్కోశాత్మకమైయున్న స్థూలశరీరమే అన్నమయకోశ మనబడును. కర్మేంద్రియము లయిదును, ప్రాణాదు లయిదును ప్రాణమయకోశ మనబడును. జ్ఞానేంద్రియము లయిదును మనస్సునుగూడి మనోమయకోశ మనబడును. జ్ఞానేంద్రియ

ము లయిదును బుద్ధియునుగూడి విజ్ఞానమయకోశ మనబడును. ప్రియమోదప్రమోదములను వృత్తులు కలిగి జగదుత్పత్తికి మూలకారణమై అనాదియగు అజ్ఞానమే ఆనందమయకోశ మనబడును. ప్రియమనగా ఇష్టవస్తు దర్శనమువల్ల కలిగెడు సంతోషము. మోదమనగా తత్పదార్థలాభముచేత కలిగెడు సంతోషము. ప్రమోదమనగా తదనుభవమువలన కలిగెడు సంతోషము. ఒర ఖడ్గమును, చింతగుల్ల చింతపండును, గవుసెన వీణను, పసిరికాయ పురుగును, కవచము దేహమును మూసికొని యున్నలాగున అవి అయిదును ఆత్మను దెలియనీయక మూసికొనియుండును. కనుకనే అవి కోశములని వ్యవహరింపబడుచున్నవి. ఇవియొర మొదలగు వస్తువులవలె పరిచ్ఛిన్నములును, సమానసత్తాకములును గాక ఆత్మసత్తచే ఉపజీవించుచు దోచెడివే యయ్యును సూర్యసత్తచేతనే ఉపజీవించుచు దోచెడి మేఘము సూర్యుని మరుగుపరచునట్టును, అగ్నిసత్తచేతనే యుపజీవించుచు దోచెడి ధూమము అగ్నిని మరుగుపరచునట్టును, రజ్జుసత్తచేతనే యుపజీవించుచు దోచెడి సర్పము రజ్జువును మరుగుపరచునట్టును, మృత్తిక యొక్క సత్తచేతనే ఉపజీవించుచు దోచెడి ఘటము మృత్తికను మరుగుపరచునట్టును, స్వర్ణసత్తచేతనే యుపజీవించుచు దోచెడి యాభరణము స్వర్ణమును మరుగుపరచునట్టును ఆత్మను మరుగుపరచుచుండును. అయినను, ఒర, కత్తి మొదలగునవి కూడి ఒక్కటిగా వ్యవహరింపబడినను పరస్పరభిన్నములై యున్నట్టు పంచకోశముల తోడి యోగము పరస్పరాధ్యాసమువలన ప్రాప్తించినను కాలత్రయమునందును వానికి యాత్మ వ్యతిరిక్తముగానే యుండును.

పరస్పరాధ్యాస మనగా ఒకపదార్థమునందలి ధర్మము మరియొక పదార్థమునందు దోచుట. ఎట్లన, తాను జీవుడనుట జీవమువలన కలిగిన యధ్యాసము. తాను పుట్టి పెరిగియుండి వృద్ధినొంది క్షీణించి పోవుచున్నాననుట వికారమువలన కలిగిన యధ్యాసము. తాను పురుషుడు, వనిత, నపుంసకుడు ననుకొనుట యంగమువలన కలిగిన యధ్యాసము. ఇట్లే వర్ణమువలన కలిగిన యధ్యాసము, ఆశ్రమమువలన కలిగిన యధ్యాసము, నామమువలన కలిగిన యధ్యాసము మొదలగునవి. ఈయధ్యాసములవలన జీవత్వాదికములయిన అన్నమయకోశము ఆత్మయందును, సచ్చిదానందలక్షణాదికములయిన ఆత్మధర్మములు స్థూలముగా గనుబడుచున్న అన్నమయకోశమునందును దోచుచున్నవి. కనుక అన్నమయకోశమునకును, ఆత్మకును సంబంధము కలిగినది. నేను ఆకలిగొన్నవాడను, దప్పిగొన్నవాడను, శక్తివంతుడను, పరాక్రమవంతుడను, దాతను, ప్రవక్తను, మూగవాడను, కుంటివాడను, గూనువాడను అను నివి మొదలగు ప్రాణమయకోశధర్మము లెల్లను విలక్షణమైన యాత్మయందును, ఆత్మధర్మములైన సచ్చిదానందలక్షణములు ప్రాణము చక్కగా దోచుచున్నదని ప్రాణమయకోశమునందును దోచుచుండుటవలన అన్యోన్యాధ్యాసమువలన ఆత్మకును ప్రాణకోశమునకును సంబంధము గలిగినది. నేను సంకల్పము గలవాడను, వికల్పము గలవాడను, మోహముగలవాడను, శోకముగలవాడను, ద్వేషముగలవాడను, క్రోధముగలవాడను, వినువాడను, చెవిటివాడను, గ్రుడ్డివాడను, భ్రష్టుడను ఇవి మొదలగు మనోమయకోశసంబంధము లగు సంకల్పాదిధర్మము లెల్లను ఆత్మయందును, ఆత్మధర్మము లెల్లను మనస్సు చక్కగా దోచుచున్నదని మనోమయకోశమునందును దోచుచున్నందున ఆత్మకును మనోమయకోశమునకును పరస్పరాధ్యాసమువలన సంబంధము కలిగినది. నేను కర్తను, బుద్ధిమంతుడను, యోగసాధకుడను, పండితుడను అను మొదలగు విజ్ఞానమయకోశధర్మము లెల్లను ఆత్మయందును, ఆత్మధర్మము లెల్లను బుద్ధి చక్కగా దోచుచున్నదని విజ్ఞానమయకోశమునందును దోచుటవలన ఆత్మకును విజ్ఞానమయకోశమునకును పరస్పరాధ్యాసమువలన సంబంధము కలిగినది. నేను భోక్తను, సంతుష్టిలేనివాడను, సుఖిని, దుఃఖిని, సాత్వికుడను, రాజసుడను, తామసుడను అను మొదలగు ఆనందమయకోశధర్మము లెల్ల ఆత్మ

యందును, ఆత్మధర్మములగు సచ్చిదానందలక్షణము లెల్లను జ్ఞానము చక్కగా దోచుచున్నదని ఆనందమయ కోశమునందును దోచుచున్నందున ఆనందమయకోశమునకును, ఆత్మకును పరస్పరాధ్యాసమువలన సంబంధము కలిగినది.

కాబట్టి నా యావుదూడ, నా కుమారుడని తనతో సంబంధింపబడి దోచెడు పశ్వాదులు తాను కానట్లు, నా శరీరము, నా ప్రాణము, నా మనస్సు, నా బుద్ధి, నా యజ్ఞానమని తనకు సంబంధపడి తోచుచున్న పంచకోశములును తాను కాదనియు, వానికి విలక్షణముగానున్న యాత్మయే తాననియు నెరుగవలసినది.

పశువు బలసినదనియు, దూడ చిక్కిపోయినదనియు, చిన్నవాడు దుర్మార్గుడనియు, చెప్పినట్టు వినడనియు, పిల్లది మూఢురాలుగానున్న దనియు, దండించిన పొరుగింటికి పోవుచున్న దనియు, నా బిడ్డలు, నా సొమ్ము, నా యిల్లు, నా వాకిలి, నా మేడయనియు, నా భార్య గృహస్వాతంత్ర్యము వహింపలేదనియు, నాకు హితమైనపని యొక్కటియైనను చేయలేదనియు చెప్పెడిలాగున అన్నమయకోశసంబంధములయిన జీవత్వాదివికారములును, ప్రాణమయకోశసంబంధములయిన క్షుత్పిపాసాదివికారములును, మనోమయకోశసంబంధములయిన సంకల్పాది వికారములును, విజ్ఞానమయకోశసంబంధములయిన కర్తృత్వాదివికారములును, ఆనందమయకోశసంబంధములయిన భోక్తృత్వాది వికారములును గలుగుచున్నవి. కాని యవి సాక్షిమాత్రముగా వెలయుచున్న తన్ను కాలత్రయమునందును స్పృశింపలేవు.

ఈ పంచకోశములతో చేరియున్న యాత్మను ప్రత్యేకపరచుట యేలాగున సాధ్యమగుననిన, అధ్యయన సమయమునందు పురుషులచేత నుచ్చరింపబడిన సహజ శబ్దములను విభజింప వలను పడకపోయినను వివేకయుక్తమగు బుద్ధిచేత ఇది యిట్టివాని శబ్దము, ఇది యిట్టివాని శబ్దము అని కనిపెట్టునట్టును, జలములతో కూడియున్న వేడిమిని ప్రత్యేకపరుప శక్యము కాకపోయినను త్వగింద్రియముచేత స్పృశించి బుద్ధిచేత జలమున వేడిమిని గ్రహించినట్టును, గోడయందు వ్రాయబడిన చిత్రమునందలి శ్వేతనీలపీతాదిరూపములను వేరుపరుప శక్యము కాకపోయినను నయనేంద్రియముచేత కనుగొని బుద్ధిచేత ఇదిగోడ, ఇదిచిత్రము, ఇది తెలుపు, ఇదినలుపు, అని యెరిగినట్టును, జలముతో చేరియున్న లవణాదిరసములను విభజింప నలవిగాక పోయినను రసనేంద్రియముచేత ననుభవించి ఇదియుప్పు, ఇదిపులుసు, ఇదితీపి, ఇది కారము, ఇది వగరు, ఇది చేదని తెలిసికొన్నట్టును, బట్టలను పట్టియున్న పరిమళములను వేరు పరుపగాకపోయినను ఘ్రాణేంద్రియముచేత ఆఘ్రాణముచేసి బుద్ధిచేత ఇది సుగంధము, ఇది దుర్గంధము అని గ్రహించినట్టును పంచకోశములతో గూడుకొని యున్న యాత్మ ప్రత్యేకపరుప గష్టముగా నున్నను వివేకయుక్తమగు బుద్ధిచేత ఆత్మస్వరూప మిట్టిదనియు, పంచకోశస్వరూప మిట్టిదనియు చక్కగా విచారించిన పక్షమున పంచకోశములతోడి సంబంధము ఆత్మకు నెంతమాత్రము లేదనుట విశదముగా తెలియవచ్చును. అయినను రజ్జువునందు ఆరోపింపబడిన సర్పము రజ్జువునకంటె వ్యతిరిక్తము కానట్లు, ఆత్మయందారోపింపబడిన పంచకోశములు అధిష్ఠానభూతమైన ఆత్మకంటె అన్యములు కావు. ఎండమావులను కనుగొని జలభ్రాంతి నొందిన పురుషుడు ఆ జలమునందు స్నానపానాదిక్రియలు నిర్వర్తింపదలచి తుదకు విచారజ్ఞానముచేత తనకు గనబడినవిజలములు గావనియు, ఎండమావులనియు నిశ్చయముగా దెలిసికొన్నను జలప్రవృత్తిమాత్రము తొలగిపోనట్టు ఆత్మయం దారోపింపబడిన పంచకోశములు అధిష్ఠానమైన ఆత్మకంటె అన్యములుకావని తెలిసికొన్నను పంచకోశ ప్రవృత్తిమాత్రము తొలగనేరదు.

మృత్తికయం దారోపింపబడిన ఘటము మృత్తికయేగాని వేరుకాదని తెలిసికొన్నను ఘటాదిప్రవృత్తియు, తద్వ్యవహారములును మరల గలిగినట్టును, స్వర్ణము

నం దారోపింపబడిన కటకమకుటాదికములైన యాభరణములు స్వర్ణముకంటె అన్యములుకావని దృఢముగా తెలిసికొన్నను ఆభరణప్రవృత్తియు, తద్వ్యవహారములును మరల గలిగినట్టును, ఆత్మయం దారోపింపబడిన పంచకోశములు అధిష్ఠానమైన ఆత్మకంటె అన్యములుకావని తెలిసికొన్నను పంచకోశప్రవృత్తియు, తద్వ్యవహారములును మరల గలుగుచుండును. ఘటాదికములయిన మృద్వస్తువులు నామాంతరముల వ్యవహరింపబడుచున్నను మృత్తికకంటె వ్యతిరిక్తములయినవి కావని బుద్ధిమంతులకు తెలియవచ్చునట్టు పంచకోశములు వ్యవహారసిద్ధములై యున్నను ఆత్మకంటె వ్యతిరిక్తములుకావని బుద్ధిమంతులకు తెలియవచ్చును.

ఈప్రకారముగా విచారించి తెలిసికొనుటయే పంచకోశవిలక్షణ జ్ఞానమనియు, ఈజ్ఞానమువలననే అవస్థాత్రయమునందు ఆత్మ అనుస్యూతమైయున్నదనియు పంచకోశములుమాత్రము అవస్థాత్రయమునందు అనుస్యూతములయి యుండలేదనియు, వ్యావృత్తములయిన పంచకోశములు స్ఫురించుచు వ్యవహారప్రవృత్తములయినను ఆత్మకంటె అన్యములు గాలేవనియు దృఢముగా తెలియవచ్చును. ఇట్లు తెలిసికొన్నవాడు నిస్సంశయముగా కృతార్థుడై జీవన్ముక్తుడగును.

ఓమ్ శాన్తి శ్శాన్తి శ్శాన్తిః.

హరిః ఓం తత్సత్.





# ఆత్మార్పణము

మండరేముల వేంకటశాస్త్రిగారు, బి. ఏ., యల్. టి.

శ్రీకల్యాణగుణాలవాలుఁడనుచున్ జిత్సౌఖ్యసద్రూపకుం
డాకారప్రవికారదూరుఁడనుచున్ వ్యాసాంబరీషాదిభ
క్తైకప్రాప్యుఁడటంచు నిర్గుణుఁడు నిర్వ్యాపారుఁడంచున్ బుధా
నీకంబుల్ నినుఁగూర్చి పల్కునుడులన్ వింటిన్ సదాయీశ్వరా!

ఈమాటల మర్మం బది యేమోయని తడవి తెల్లమెడలను నిజమా
నీమాడ్కి నననఁగనామది కేమియు స్ఫురియింపదయ్యె నిదమిత్థముగన్.

శాంత మొదవక జ్ఞాన తేజంబు లేదు, జ్ఞాన తేజము లేక మోక్షంబు లేదు
స్వాంతమది శుద్ధమైనను శాంత మొదవు భక్తునకునైన వేదాంతపరునకైన.
కావున పనివడి స్వాంతం బేవిధి పరిశుద్ధి నొందు నిరవుగ నరుఁ డా
త్రోవను గనుఁగొనవలయును ధీవిలసితబుద్ధి మెఱయఁ ద్రికరణశుద్ధిన్.

మనుజులకు బంధమోక్షములను ఘటింపఁజాలు కారణమది మానసంబె తలఁప
మానసము నెట్లు మోక్షమార్గాన నిలుపఁగలను, దైవమ! యాగతిఁ దెలియఁ జేయు.

చదివితి నేఁ బురాణముల శాస్త్రములన్; ఘనతర్కశాస్త్రకో
విదు లొనరించు వాదముల వింటి; సవిస్తరరీతి యోగ వి
ద్యదెయని సద్గురుల్ దెలుప నౌనని నేర్చితిఁ గొంతవట్టు; నె
మ్మది పరిశుద్ధ మౌవిధమమాత్ర మొకింతయుఁ దోఁప దక్కటా!

జపతపంబులుఁ దీర్థసంచారవిధియు దాననిరతియు జ్ఞానవిజ్ఞానగతులుఁ
జిత్తశుద్ధినిఁగూర్ప వినీ! యిఁకెట్లు మనము పరిశుద్ధమౌ దేవ! మహితభావ!.

ఏమి యొనర్పఁజాలుదు నహీనకృపామహిమాభిరాము ని
న్నేమని యాశ్రయింతుఁ బరహింసనతత్పరచిత్తవృత్తిఁ బ్ర
జ్ఞామయు నిన్ను నెట్లు గనఁ జాలుదు మోహపరీతబుద్ధి నేఁ
బామరుఁడన్ భవచ్చరణపద్మయుగమ్మును నూత యీఁగదే!

శబరి యెంగిలిపండ్ల నొసంగ మెసవి విదురుకడ సామాన్యంపు విందుఁగుడిచి
భక్తపరతంత్రుఁడ వటన్న వాసిఁగాంచి మించు నిను భక్తిమీర సేవించువాఁడ.

యజ్ఞయాగాదిక మొనర్చియార్యులెల్ల కాంక్షసేసిన స్వర్గసుఖంబు లొల్ల;
సుఖములం దెల్ల మేటియౌ సుఖముగాదె భక్తవత్సల నీపాదపద్మసేవ!

కామంబు నీపాదకమలసేవనమందె క్రోధంబు నీశత్రుకోటియందె
లోభంబు నీముఖాలోకనక్రియయందె మోహంబు నీజ్ఞానమూర్తియందె
మదము నీభక్తిసామ్రాజ్యానుభవమందె మాత్సర్య మనఘ! నీమహిమయందె
తామసగుణము నీప్రేమరూపమునందె జడత నీనామసంస్మరణమందె
నిలిపి మానసవృత్తు లన్నియును బాసియు నేను నీవును దక్క వేఱేమిలేని
యవ్యయానందవారాశి ననవరతము-మునిఁగి తేలెద నీకృపామూర్తిఁ గనుచు.

ప్రాణికోటుల హృదయాంతరాళములను విమలచైతన్యమూర్తివై వెలయుదనిన
నెవరు శత్రులు, మిత్రులిం కెవరు నాకు సర్వపరిపూర్ణమైన యిజ్జగమునందు?

ఎల్లరకు హితముఁగూర్పఁగ నెంతు నెపుడుదయయు సత్యంబులోనుగాఁదలఁతు నెపుడు
సంఘసేవ యొనర్తుఁ గర్జముగ నెపుడు నిరుపమానందరసమునఁ బరగు దెపుడు.

మనసునకు శాంత మొదవెడి యనువుఁదెలిపి భక్తిబీజము నామదిఁ బాదుకొలిపి
యీమనోనిశ్చయము నిల్చు నిరవుసలిపి యరయు మియ్యదె దేవ యాత్మార్పణంబు!

---

# తురీయసమాధి

ఉమర్ అలీషాకవి గారు

*గీతము

సురటరాగము - ఆదితాళము

౧

కోరి వినుము తత్త్వచరితము జేరి
నిజధర్మ మిది మదిని మీరి
పారమార్థికచ్యుతుఁడు శరీరి
మాయతో ప్రపంచము జీరి

సారహీనసంసృతిలోన జారి
ప్రకృతిలోఁ బడి
వైరిషట్కములకుఁ జిక్కి నరుఁడై
దారపుత్రులో యనుచు మూర్ఖుఁడై వారి
హిత మరయుచు పరము కరిగెడు
దారేమి నారయక అవిద్యను॥ కోరి॥

---

* ఇది అధ్యాత్మరామాయణకీర్తనలలో "చేరివిహనె శౌరిచరితము గోరి, సుకుమారగిరివరశిమారి" అను వరుసలోఁ బదవలెను.

౨

మట్టివంటి తనువు
స్థిరమని
పట్టి ప్రేమ విడవు దీని
గుట్టు తెలియలేవు దేహము
వట్టిరోగముల నెలవు ఇది
పుట్టి మెఱుపురీతిఁ దోఁచిపోవును
ఇట్టి మాయమగుచు నొక్క త్రుటియే
పట్టదు నిక్కము నిజరూప మెఱుఁగలే
నట్టి నరుఁ డధోగతినిఁ బడి వి
రాట్టయిన యాత్మను వివిధగతి
గిట్ట భవసముద్రమున నిడి
మట్టై చని తిరిగి మర్త్యుఁడై
పుట్టును యథాస్థితి నింద్రియముల
తట్టు జేరు తన్ను తా నెవండను యోగదీక్ష
నెట్టియు విషయవిరతి
పట్టి స్వప్రకాశభ్రష్టుఁడౌ తుద
ముట్టన్ జనఁడు జీవుఁడ హారియయి॥ కోరి॥

౩

కాలవశముచేత కర్మ
కలాపభీతచేతసుఁడవై
తేలలేక పాతకాంబుధి
మునిఁగిపోయితివి ప్రేతవై
తేలి పూర్వజన్మములను గని
బేలవై విచారపడి వెఱచి తే
లీల నిజపదనము జని గురుని గని
కీలెఱింగి చూపుఁ దెలిసి గుణమి
థ్యాలాలనము ద్రుంచి శమదమ
శీలాన్వితుఁడ వగుదు వందే
ఫాలాగ్రంబున వేణునాద
మాలాపనంబు సేయు చక్రి య
నాలోచితమనస్క లీలహాస్య
మాలోకనే సేయ రిదె తపసు
మాలికలను ద్రిప్పకొనిన మనసు
మాలిన్యరహితము గాదిదె తెఱవు॥ కోరి॥

౪

మందబుద్ధి గాక ఇంద్రియ
బంధములను జోఱక మోహా
స్పందితుండ వగుచు చెడక క
డింది విషయవిహ్వలుఁడు కాక
అందరాని యమనస్కపదము మొద
లంది తృప్తిఁబొంది తాను తానై
యుండు నందు నొక్కరీతి వెలిఁగి బ్రహ్మ
నందపదవి గని చిత్ప్రకాశుఁడు వి
నిందాత్మకుఁడు పూర్ణుఁ డగుణుఁడు
వందితుండు నిగమనుతుఁడు స
నందానేకఋషులపోలిక
నంది జడతఁ బాసియుండు న
మందదివ్యసుఖము నొందు జన్మల
నందఁబోఁడు యథేచ్ఛగాఁ దిరుగు
సందియంబు లేదు ముక్తి విధ మిల
కుందకను కృతార్థుఁడై చనుము॥ కోరి॥

౫

ఆదియందు నీవె ఆయ
నాదియందు నీవె యిటుపై
యాదిమధ్యలయుఁడు నీవె
నాదమై యనంతమహిమా
పాదుఁడై తనువుగలిగిన పోయిన
బాధితుండుగాక శిథిలఘోరప్ర
మాదహా యవస్థ లుడిగి జ్ఞానో
పాధికుఁడవగుచు స్వప్రకాశమతి
మోదావహమునైన తన్మయ
సాధకమున నగుపడెదు పద
చ్ఛేదంబైన ప్రతిపదార్థము

భేదబుద్ధి తానుగాగ వి
వాదమణఁచి యంతరాత్మ "సోహం"
పాదద్వయము జపముసేయ కృత
సాధకుండు జ్ఞానమూర్తి మెచ్చట
పాదముంచు నచట స్వారాజ్యమగు॥ కోరి॥

౬

పంచభూతమయుఁడు ఈశ్వరుఁ
డంచు తెలియు నరుఁడు తానదె
యంచు చెప్పఁగలఁడు తనతాఁ
గాంచియే ముఱియు నతఁడు వీ
క్షించు నీ యజాండభాండము
మంచుబిందువో యన పరికించు న
మంచితమగు చరాచరము వెదన
ర్తించి మేఘములలోన మెఱసి వ
ర్షించి నదీసలిలమై పర
తెంచి కుసుమసౌరభముల
పొంచి, ఉడుకోటిలోపల న
టించి రవియై రవికాంతులను
మించి యొక్క అణువై భువి కవత
రించి కోకిలంబునయి వనములు ధ్వ
నించ పాటపాడి తాని సకల మ
టంచు నెంచు విశ్వరూపముగ ॥ కోరి ॥

౭

ఈరహస్య మిందు దెలిసిన
వారె యోగులందు ముఖ్యులు
ధీరు లిందునందు
వెలుఁగుచు పలుకుచుందు రందందు
ఈదారి నెనసి దిన్వ్యది వ్వెను ముట్టి
దారుణమైన తమ స్సుప్రకాశమైన
తీరున పవిత్రుఁడు హరి ప్రణవా
కారుఁడైన ఆళైలపీ గురుఁ
డేరాద్ధాంత మంత ఉ
దారలీపాకవి కొసంగె భక్తి
కారంభవిదూరులకును సం
సారాగ్ని నిమగ్నులకుఁ దెలియ
నేరదిది యమేయదివ్య
స్ఫారంబైన సువిచారము తేంద్రి
యోరుసంస్కారచారువేదాంతతత్వార్థవి
ద్యారాజపదము బొందుమట ॥ కోరి ॥

---

# నెహ్రూ నివేదిక

(ఆంధ్రానువాదము)

'నెహ్రూ కమిటి' వారు తయారుచేసిన నూతనరాజ్యాంగవిధానమును తెలిసికొన గోరు ప్రతి ఆంధ్రుడును దీనిని చదివితీరవలెను. శైలి సులభము. కొలదిప్రతులుమాత్రమే మిగిలియున్నవి. **వెల 1-0-0 మాత్రమే. తపాలాఖర్చులు ప్రత్యేకము**

మేనేజరు, ఆంధ్రపత్రికా కార్యాలయము, పోస్టుబాక్సు నెం. 212, మద్రాసు.
















౧. శ్రీ ముత్తరాజు గోపాలరావుగారు (శి) ౨. శ్రీ వెన్నెలకంటి రాఘవయ్యగారు, బి. ఏ., బి. యల్. (శి)
౩. శ్రీ ఓరుగంటి వెంకటసుబ్బయ్యగారు (శి) ౪. శ్రీ గండవరపు హనుమారెడ్డిగారు (శి) ౫. శ్రీ బొమ్మా శేషురెడ్డిగారు (శి)









౧. (ఎ) శ్రీ పట్టం కోటిరెడ్డిగారు(శి) (బి) శ్రీ బండి శేషరెడ్డిగారు(శి) (సి) శ్రీ సుబ్రహ్మణ్యం శ్రేష్ఠిగారు(శి) (డి) శ్రీ బండివెంకటరమణారెడ్డిగారు(శి) ౨. (ఎ) శ్రీ బత్తెన రామకృష్ణారెడ్డిగారు(శి) (బి) శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు(శి) (సి) శ్రీ బొమ్మా శేషరెడ్డిగారు(శి) (డి) శ్రీ లేబూరి సుబ్బరామరెడ్డిగారు(శి) (ఇ) శ్రీ దువ్వూరి బలరామరెడ్డిగారు(శి) 3. (ఎ) శ్రీ మేనకూరి సీతారామరెడ్డిగారు(శి) (బి) శ్రీ ఓరుగంటి వెంకటసుబ్బయ్యగారు(శి) (సి) శ్రీ రాళ్లపల్లి రామసుబ్బయ్యగారు(శి) ౪. నెల్లూరుజిల్లా ఉప్పుసత్యాగ్రహము మొదటిదళము (ఉప్పు చేయుట) మైపాడు. నాయకుడు: శ్రీ బి.గోపాలరెడ్డిగారు



# విత్తనమువృద్ధిచేయుట

మండపాటి సత్యనారాయణరాజుగారు

విత్తుకొలది మొక్క
మొక్కకొలది పంట
పంటకొలది రాబడి

ప్రపంచకమందు మనుష్యులు చెట్లనుపెంచుట మొదలిడినప్పటినుండి వాటిని తమ ఉపయోగము కొరకై అనేకవిధముల వృద్ధిచేయుచున్నారు. క్రొత్త జాతిని కల్పించుటయందు మాత్రము శ్రద్ధవహింపక అట్టి పని దైవాధీనమని యూరకున్నారు. ఇటీవల అమెరికా మొదలైన దేశములలో క్రొత్తజాతులు లేక మంచిజాతులు ఉత్పత్తిచేసి అపారమైన వృద్ధిని బడసిరి. మంచిజాతులను వృద్ధిచేయుటవలన మానవుని కోరికలు సఫలమగున ట్లుండెను. మరియు పైరులను వృద్ధిచేయుటకు ఈదిగువ పద్ధతు లవసరము :—

1 ఉన్నజాతులనుండి మంచిజాతులను ఏర్చుట.

2 కావలసిన జాతులను మొక్కల సంయోగము వలన (Crossing) సృష్టించుట.

మనము సామాన్యముగా సాగుచేయు ప్రతిరకముల విత్తనములలోను కొన్నిరకములు కలసియుండును. మొట్టమొదట ఒకేరకముగా ఉన్నను అవి క్రమముగా సంక్రమించి కల్తీరకము లనేకములు బయలుదేరుచున్నవి. అట్లు బయలుదేరుటయేగాక ఒకేమాదిరి సేద్యమునందు ఒకేచోట గల పైరునందు పలుమార్పు లుండుట చూచుచున్నాము. కొన్ని హెచ్చుగా పెరుగును; కొన్ని ఒకరంగుగను, మరికొన్ని మరియొక రంగుగను పెరుగును. ఇట్లు అనేకతరహాలు కాన్పించును. కొన్ని వేగిరము కోతకు వచ్చును. మరికొన్ని ఆలస్యముగా కోతకు వచ్చును. ఇట్టి విభేదములవలన పంటలు నశించుచున్నవి. ఇట్టి భేదములను సామాన్యరయితు నయితము తెలుసుకొనుచున్నాడు. కాని అట్టి రకములనుండి మంచిరకములను ఏర్చుకొనుటకు శక్తిమంతుడై యుండలేదు. కాని కల్తీరకమును సాధ్యమైనంతవరకు మార్చి మరియొకరకమును మార్చుచుండును. అట్టివి సంగ్రహించినప్పుడుకూడ కొన్ని లోపము లుండుట తటస్థించుచున్నది. వాటిని సవరించుటకు తగినంత జ్ఞానసంపత్తి కలిగియుండుట ఆవశ్యకము. పట్టుదల, ఓరిమి, మొదలగు సామాన్యగుణములుగల రైతులు నయితము దీనిని సాధించవచ్చును. మనము మంచివిత్తనములను సంగ్రహించ దలచినచో నీదిగువ విషయములను జాగరూకతతో గమనించవలెను. మనదగ్గరనున్న రకమును ఒకమడిలో పైరుచేసి మంచిగుణములు కలిగిన కొన్నిమొక్కలను ఏర్చవలెను. మనకు అవసరమైన గుణములు కలిగియున్నచో దానివిత్తనములను సంగ్రహించి తిరుగ పైరుచేసి దానినుండి విత్తులను వృద్ధిచేయవచ్చును. అట్లుకానిచో మనకు అవసరమైన మంచిగుణములు రెండు తరహాలమొక్కలలో ఒకదానియందు కొన్ని, మరియొకదానియందుకొన్ని యున్నప్పుడు సదరు రెంటియందలి మంచిగుణములు ఒకదానియం దావిర్భవించునట్లు చేయవలసియున్నది. అట్లుచేయుటకు సదరు రెండురకములను పైరుచేసి వాటిసంయోగమువలన సమకూర్చవచ్చును.

ఒక మొక్కపుష్పములోని పురుషభాగమును రెండవమొక్క పువ్వునందలి స్త్రీభాగమం దుంచవలెను. ఇట్లు చేసినమొక్కలకు ఏసంపర్కము లేకుండా గుడ్డ సంచులతో మూయవలెను. ఇట్లుచేయుటవలన పైరెండు మొక్కలకు సంకరజాతి మరియొకరకము బయలుదేరును. అనేకవిషయములలో వేర్వేరుగుణములు కలిగియుండు రెండు వివిధజాతి మొక్కలకు సంయోగము కలిగినపుడు వాటినుండి పుట్టు క్రొత్తమొక్కలకు వాటి తలిదండ్రుల కుండు గుణములు అన్నియు అంకురదశయం దుండును. అటువంటి సంకరజాతిమొక్కలకు ఇతరజాతిమొక్కల సంపర్కము లేకుండునట్లుచేయవలెను. వాటినితిరిగి పైరుచేసినయెడల వాటినుండి పుట్టినవి చాలభేదము కలిగియుండును.

ఈ రెండవతరము మొక్కలలో వాటి తలిదండ్రులకుండిన గుణములు వేర్వేరువిధముగా ఉండును. ఇటువంటి మొక్కలలో వేటికైనను వాటితల్లియొక్క గుణములైనను, తండ్రియొక్క గుణములైనను ఉండవచ్చును. కొన్నిటిలో వాటి తలిదండ్రులిద్దరి గుణములుండవచ్చును. మరియు వాటిలోన క్రొత్తగా క్రొత్త గుణములుకూడ ఉండవచ్చును. అటువంటి మొక్కలలో ప్రతిదానినుండి వచ్చిన విత్తనములను వేర్వేరుగా విత్తినచో వాటికిపుట్టిన మొక్కలలో కొన్ని మంచిగుణములు కలిగియుండును. ఇటువంటి మంచిమొక్కలనుండి విత్తనములను ఏర్చి సాగుచేయుచుండవలెను. కొంతకాలమునకు మనముకోరు మంచిగుణములుగల మొక్కలను అభివృద్ధిచేయవచ్చును. వ్యవసాయదారులు తమ బుద్ధికుశలతను వినియోగించుటకు ప్రయత్నించినచో మిక్కిలి అద్భుతములైన పనులను చేయుటకు సమర్థులు కాగలరు. ఇట్టిపని యసాధ్యమని తలంపక ప్రతిరైతున్ను విత్తనములను సంగ్రహించుటకొరకు ప్రత్యేకముగా ఉంచుకొని పరిశోధనలుగావించి మంచివిత్తులను వృద్ధిచేసుకొనుటకు ప్రయత్నించవలెను.

విత్తనములను మార్చుట

విత్తనములందలి మూలపదార్థములు, ఋతుధర్మములనుబట్టియు, గాలిపాటునుబట్టియు మారుచుండును. సరియైన ఎరువులు వేయకపోవుటచేతను, ఒకేపైరును ఒకే స్థలమందు పలుమారులు సాగుచేయుచుండుటవలనను కూడ పంటలు క్రమముగా క్షీణించును. రైతులు సామాన్యముగా తమ పొలములలో పండిన పంటలనుండియే తిరిగి విత్తులను ప్రత్యేకించి ఉపయోగించుచుందురు. ఇందులకు కారణము వారి పొలములలో పండిన పంటయందే ఎక్కువ అభిమానము, తక్కినచోట్ల విత్తనమునందు నమ్మికలేకపోవుట,ధరలు హెచ్చుగానుండుట,సులభముగా సమయమునకు దొరకకుండుట. ఈక్రింది కారణములు తటస్థించినపుడు విత్తనములను తప్పకమార్చుటఆవశ్యకము:

1 కారణము తెలియక పంటలుతగ్గినట్లు కపించుట.

2 వాడుకగా ఉపయోగించు విత్తనములైనను ఏమాత్రము జబ్బుకలిగినట్లుతోచుట.

3 ఋతుధర్మములకు అనుకూలించక పోవుట.

విత్తనములను సంగ్రహించుట.

విత్తుకొలది మొక్క యని చెప్పు వాడుకను బట్టి మంచి వంగడమునకుజెందిన విత్తనములైనను వాటిని చెడకుండ భద్రపరచుట ఆవశ్యకము. మంచివిత్తనములను సంగ్రహించుటయందు నీదిగువ విషయములను గమనించవలసియున్నది.

1 మంచి వంగడముగా ఉండుట.

2 ఏపుగాపెరిగినమొక్కలనుండివిత్తనములనేర్చుట.

3 విత్తనములు బలముగా ఉండుట.

4 విత్తనము బరువుగాను, మంచిరంగునుకలిగియును ఉండుట.

5 కంకిధాన్యములైనచో కంకిమధ్యగింజలనుఏరుట.

6 మొదటపండిన మొక్కలనుండి విత్తనములను సంగ్రహించుట.

7 బాగుగా ఎరువువేసినచేనులో విత్తనములేరుట.

8 ఏరినవిత్తుగాని, చేనుగాని తక్కిన పంటతో కలపక ప్రత్యేకించి ముక్కకుండా జాగ్రత్తచేయుట.

# దొరవు నీ వయ్యెదవురా!

తురగా వేంకటరామయ్య గారు

౧

పరమశివుడే తండ్రిరా! ఈ
ప్రకృతిసుందరి తల్లిరా!
పాడియావులు పంటపొలములు
భాగ్యములు రాజ్యములు రా
దున్నరా ఈ భరతభూమిని
తొలుకరించిన పుణ్యభూమిని
కఱువులేని స్వర్గరాజ్యపు
దొరవు నీ వయ్యెదవురా!

౨

కాలమే తలక్రిందుగానీ
కాలయాముడే తేలుకోనీ
నీవు నీ గోవులును శాశ్వత
జీవులై యుండేరు గదరా!
దున్నరా......
దొరవు నీ వయ్యెదవురా!

౩

పాడునేలే లేదురా నీ
భావమే బీడాయెరా
పరిమళించే తోటపెంచీ
పరమశివు నాడింపరా!
దున్నరా......
దొరవు నీ వయ్యెదవురా!

౪

గాలివెలుగులు జూడరా మే
ఘాలవర్షము నడుగరా
సూర్యచంద్రుల గమనలీలా
శోభలను దిలకింపరా!
దున్నరా......
దొరవు నీ వయ్యెదవురా!

౫

ఏటిలంకల మేతమేసీ
పూతగిల్లిన జోడుగిత్తల
పైడినాగటి కఱ్ఱులో జీ
వాల జీవిత ముండెనోరా
దున్నరా......
దొరవు నీ వయ్యెదవురా!

౬

పైరులను గాచేటి సుందరి
ప్రకృతితో వెలిగేనురా ఆ
మేడలో వర్తించు సానికే
కూడుగుడ్డలు దూరమగురా!
దున్నరా......
దొరవు నీ వయ్యెదవురా!

౭

ఆలుమగలూ జోడు గూడీ
ఆడుకొంటూ పాడుకొంటూ
జీవకాంతుల వెలుగుసన్య
శ్రీలలో విహరించెదరురా!
దున్నరా......
దొరవు నీ వయ్యెదవురా!

౮

శుభదమగు "రాట్నంపు" శ్రుతితో
సుందరీమణి పాడుచుంటే
పొంగుతూ ఆడేటి బిడ్డలే
భూములన్నీ యేలెదరురా!
దున్నరా......
దొరవు నీ వయ్యెదవురా!

౯

కత్తి కలములు బోయెరా నీ
కష్టమే గెలిచేనురా
ప్రకృతిపురుషుల ప్రతినిధులు మీ
ప్రభుతయే నిత్యమ్మురా!
దున్నరా ఈ భరతభూమిని
తొలుకరించిన పుణ్యభూమిని
కఱువులేని స్వర్గరాజ్యపు
దొరవు నీ వయ్యెదవురా!

# తృణకణము

కవితావినోద, అల్లంశెట్టి అప్పయ్యగారు

జగతి జన్మించు మానవసముదయంబు
నన్నిరీతులఁ బోషించుచున్నయట్టి
యఖిలగోగణములకు నాహారమవయి
ప్రణుతి కెక్కితి వీవెగా తృణకణంబ!

నిన్ను మెసవెడు జంతువుల్ నిశ్చయముగ
సాధురీతిని వర్తింపఁజాలుచుంట
నీప్రశస్తికి మిగుల వన్నియుపొసంగె
గణితబహుకార్యకరణంబ! తృణకణంబ!

తొలినమస్కృతులందు నాదొడ్డవేల్పు
గజముఖునిఁ బూజ సల్ప యోగ్యమగు వస్తు
జాలముల ముఖ్యతమవయి గ్రాలునిన్ను
గణుతి సేయంగఁ దరమౌనె తృణకణంబ!

ఎన్నిపూలున్నఁ బత్రంబులెన్ని యున్న
గఱికపూజల మెచ్చు నాగజముఖుండు
ఏమినోముల నోచితో యిట్టిఫలిత
మెట్లు నీకబ్బెనో కదా తృణకణంబ!

నీచరిత్రంబు కడువర్ణనీయ మయ్యె
జనములకు రోగశాంతి కౌషధములందు
నిను సమేళ మొనర్పఁగా ననువుపడెడ
వనుపమానసన్మహిమంబ! తృణకణంబ!

నీవు వెలయుచునుండెడు తావులందు
మున్ను శ్రీకృష్ణుఁడు చరించియున్నకతన
సకలకల్యాణనిధివంచు సంతతంబు
నినుఁ బ్రశంసింపఁదగుఁగదా తృణకణంబ!

ఈవు పూజింపఁబడురీతి నెన్న కెపుడు
జనులు నినుఁగ్రుమ్మకొనిపోవు జాడలందు
మొలువ వింతటి సుజ్ఞానకలితమార్గ
మనితరసుసాధమౌగదా తృణకణంబ!

ఏది లభియింప జనుఁడు ప్రహృష్టలీల
ద్రవ్యవంతుండగుచు భువిఁ దనరునట్టి
మరకతము నిన్ గ్రహించె నెమ్మాడ్కినైన
హేళనము నీకుఁ గలదోటు తృణకణంబ!

జలధివలయితధారణీచక్రమందు
నీవులేనిప్రదేశంబు నీరులేని
కొలనుగతి నాశలెల్లనుఁ గ్రుంకఁజేసి
హీనభావంబుఁగా దోఁచు తృణకణంబ!

ఆదికవికావ్యపేటికయందు నొకట
నెఱుకపఱిచె నీ మాహాత్మ్యమెపుడు రాము
చేత బ్రహ్మాస్త్రముగ విలసిల్లితపుడె
వినుతిఁగాంచితి లోకాన తృణకణంబ!

ఒక్కయెడ మేరుభూధరం బున్నయటుల
నినుఁదలఁచి తృప్తిఁగాంతురు జనములొకట
నినుఁదృణీకార మొనరింప నీకుదానఁ
జనదు నీరసభావంబు తృణకణంబ!

నిను దహింపఁగఁ జాలకగ్నియుఁ, బెకల్పఁ
జాలక సమీరణుండు విస్మయముఁ జెంది
రనుచుఁ దొలిపల్కులెలమి వాకొనిరె నీవ
రెట్టి ప్రఖ్యాతచరితవో తృణకణంబ!

పుడమిదేవత కొక పట్టుపుట్టమయ్యె
జలధి; సౌవర్ణబహులతా విలసితమగు
దివ్యకంచుకముగ నీవు తేజరిలుచు
జనుల మురిపించుచుందువో తృణకణంబ!

ఉన్నతోన్నత గతి నందియున్న నీదు
లలితకోమలగాత్రవల్లరి స్పృశించు
మారుతకిశోరునం దభిమాన మునిచి
వినయవైశద్యవమ్యేదు తృణకణంబ!

నీవు గల్గుటచేఁ బశునిచయమునకు
స్వాదుదుగ్ధంబు లభియించె జనుల మనుప
త్వత్కృతజ్ఞత మఱచునంతకును మించు
హీనగుణ మొందు గల్గునే తృణకణంబ!

ఏది న్యాయము మనుజునం దేది సుగుణ
మీవు గల్గు ప్రదేశంబు లెక్కడయిన
నచట నరికట్టు పొలమున కందునైన
జనన మందెదు మేల్ సేయఁ దృణకణంబ!

నీవు బహుభంగులను తపోనిష్ఠఁ బూని
పరుల కుపకారివగుచు సర్వస్వ మెలమి
ధారవోసి స్వలాభానుసారపదవి
ననుభవింప వదేలోకో తృణకణంబ!

విమలకంకణరాజముల్ వేడ్కఁ దాల్చి
పెంపు వడయుచు నీ యభివృద్ధికొఱకు
నీవ యత్నించుకొందువు నిన్నుఁ బెంప
ననువుపడ వేరికైనను దృణకణంబ!

కర్కశలవిత్ర మూని నిష్కరణముగను
నిను శిరశ్ఛేద మొనరింప ననయవగుచు
సంతసముఁ గూర్చి మఱునాఁటి కంతకంటె
దివ్యతరశోభఁ గ్రాలెదు తృణకణంబ!

వసుధ నవ్యయమును స్వయంభవమునైన
దివ్యశక్తి వటంచు నిర్దిష్ట రీతి
నిన్నుఁ గొనియాడఁ దగుఁగదా నిఖిలజగము
లెలమి నిను నాశ్రయించుటఁ దృణకణంబ!

పరులకై నీదు విభవ మర్పణ మొనర్చి
పెంపుఁ జెందెదు నీప్రజ్ఞ పృథివిఁ గల్గు
నరుల కించుక గలదె యొన్నటికి నయిన
నణఁగఁజాలదు నీపూన్కి తృణకణంబ!

అస్వతంత్రతచే నింట నణఁగుకంటె
స్వేచ్ఛనడయంగ నిట్లు తపించి, త్యాగ
శీలతం జూపి ఫలసిద్ధిఁ జెందఁ దలఁచె
దేమొ నీసాహసం బహో తృణకణంబ!

అన్యులకుఁగాక హేయమైయున్న బ్రతుకు
బ్రతికియుం జచ్చి చెడియెడు గతిగ నెంచి
యీ నిరాడంబరాకృతి నూనినావొ
కనుఁగొనఁగరాదు నీమాయ తృణకణంబ!

సృష్టిలోఁగల్గు నుపకారశీలమతులు
నీ గుణంబులఁగని తాము నేర్చికొనఁగ
మున్ను భగవానుఁడు సృజింపఁబోలునిన్ను
ఘనతర స్నేహముగ్ధంబ! తృణకణంబ!

ఆదినుండియు గురుతరంబగు ప్రతిష్ఠ
వెలయుకతమున నీచాయ వివిధగతులఁ
జిత్రకారులు వేడ్కరచించుకొంద
ననుదినముఁ జూపుచుందురు తృణకణంబ!

నీర మించుక గైకొని నిన్ను మెసవు
నట్టిపశుబల మీ జగద్వ్యాప్తిఁబరగ
శక్తియుక్తులు నీలోన సంక్రమించె
నని వచింపఁగనౌగదా తృణకణంబ!

పుడమికి ననంతనామంబు పొసఁగుచుండు
నీకుఁ దన్నామధేయంబుదెగడె నటుల
నీయనంతాకృతి జగాన నిండియుండ
నెనగలదె నీకు వేఱొండు తృణకణంబ!

―――



# హితమితాహారము

కామఋషి. మృత్యుంజయవర్మ గారు

అఖిలచరాచరజీవకోటికి జీవనాధారము ఆహారము. సర్వప్రాణులకు ఆహారనిద్రామైథునము లను మూడు కర్మములు స్వాభావికానుభూతములు. సకలస్థావరజంగమములకు సుఖదుఃఖాదిద్వంద్వములు నైసర్గికములు. ఆహారనిద్రామైథునములను మూడు కర్మములకు సుఖదుఃఖాదిద్వంద్వములు ప్రయోజనములు. అందు సుఖ మనుసరణీయము నిహపరసాధకమును. అదియే ఆనందము. ఆనందము రెండు విధములు: భౌతికానందము, మానసికానందము. ఈ భౌతికశరీర సౌఖ్యము భౌతికానందము; మానసికసౌఖ్యము మానసికానందము. ఆనందమనగా బాహ్యాభ్యంతరములయందు అంతర్వ్యాపిగానుండు సూక్ష్మరూపమైన సుఖశక్తి (Force). ఇది నిర్వికారము, సర్వవ్యాపి, సూక్ష్మము. ఇది మనస్సునకే తెలియును. మనస్సు విషయాసక్తమైనప్పుడు దుఃఖరూపమైన శక్తి కలుగును. నిర్విషయాసక్తమైనప్పుడు సుఖరూపమైన ఆనందశక్తి కలుగును. దుఃఖమే నరకము, ఆనందమే స్వర్గము. ప్రతిప్రాణియు ఆనందశక్తితో కూడినప్పుడు నేను సుఖవంతుడను, ఆరోగ్యవంతుడను అని తలంచుటకు అర్హుడగుచున్నాడు. ఈలోకములో నెవడు నీరోగి? ఎవడు భోగి? ఎవడు యోగి? నిరతిశయానందరూపమైన స్వతంత్రసుఖశక్తితో గూడిన వ్యక్తియే నీరోగి, భోగి, యోగి యగును. భౌతికమానసికశక్తులయొక్క నిరతిశయానందసౌఖ్యానుభవమే నీరోగము, భోగము, యోగము అగును. భౌతికశక్తి శారీరకము; మానసికశక్తి ఆత్మీయము. భౌతికశక్తియొక్క వృద్ధిక్షయములు పూర్వోక్తములగు నాహారనిద్రామైథునములయొక్క క్రమాక్రమప్రవృత్తులనుబట్టి యుండును. క్రమాహారమువలన శారీరకశక్తియొక్క వృద్ధియు, అక్రమాహారమువలన శారీరకశక్తియొక్క క్షయమును కలుగును. ఇట్లే ఆహారాదిత్రయమునకును గల్గును. క్రమమనగా జీవులకు స్వాభావికాహారముయొక్క పరిశీలనము. పిపీలికాదిసర్వజీవులకు పోషణశక్తిగలది ఆహారము. ఇది యొకేవిధమైనదిగా నుండదు. వివిధసృష్టికి వివిధములుగా నుండును. అవి దేశకాలపాత్రముల ననుసరించి వివిధరీతులుగా విభజింపబడియున్నవి. పక్షుల కేవిధము, పశువుల కీయావిధము అను విభేదమే క్రమాహారము. ఒకజాతి జీవియొక్క ఆహారము వేరొకజాతికి సరిపడదు. అట్లు మారినచో నక్రమాహార మగును. అందువలన ఆయాజీవులు శారీరకశక్తిని కోల్పోయి నశించిపోవును. ప్రతిజీవియొక్క ఆహారాదికము క్రమపరచు శక్తి సృష్టిలోనే స్వాభావికముగా నుండుటవలన పశుపక్ష్యాదులు, క్రిమికీటకాదులు, క్రమము తప్పక కేవలభౌతికశక్తిలోనై జీవించుచున్నవి. ఇట్లే మానవుడును జీవించుచున్నాడు. కాని, మానవునకు విమర్శనాశక్తితో గూడిన బుద్ధి యొక్కటిమాత్ర మధికముగా నున్నది. అందువలన ప్రతిమానవుడు ఆహారమును క్రమపరచుకొనుటకు, అక్రమపరచుకొనుటకు గూడ నియుక్తుడు కాగలడు. పశుపక్ష్యాదులలో నిర్ణీతప్రవృత్తియే కలదు గనుక అవి క్రమమును దప్పజాలవు. గోమహిషాదులు తినెడి గడ్డిని చిలుక మొదలగు పక్షులు తినజాలవు. చిలుక మొదలగు పక్షులు తిను ఫలాదులను పశువులు తిననేరవు. అట్లుతినినచో వానికి అక్రమప్రకృతివలన నాశముకలుగును. కొన్నిచెట్లు మంచినీటివలన, కొన్ని యుప్పునీటివలన జీవించును. పశుపక్ష్యాదులవలెనే తరులతాగుల్మములు మాంసమత్స్యశాకాహారములకు సహించి జీవించునవిగ నున్నవి; పరస్పరవ్యతిరేకాహారములచే నశించుచున్నవి. కొబ్బరిచెట్టు బియ్యము, అన్నము, వానికడుగు, గంజి మొదలగు స్పర్శవలన వెంటనే చనిపోవుచున్నది. దానిమ్మ, అంజూరా, ద్రాక్ష మొదలగునవి మాంసమత్స్యసారము (ఎరువుల) వలన పోషింపబడుచున్నవి. ఇట్లే ప్రకృతివిభేదమును బట్టి సర్వజీవులు క్రమాక్రమాహారాదికమువలన జీవించుట, నశించుట జరుగుచుండును. నిద్రావిషయమునగూడ క్రమాక్రమము లున్నవి. కొన్నిజీవులు పగటిభాగమున నిద్రించి రాత్రిభాగమున మేల్కొనును. కొన్ని రాత్రిభాగమున నిద్రించి పగటిభాగమున మేల్కొనును. అట్టివానికి క్రమము తప్పించిన భౌతికశక్తి తగ్గి నశించును. ఇట్లే మిథునకర్మలో ఋతుధర్మము నెప్పుడు అతిక్రమింపక యుండును. ఋతుకాలమనగా నొకానొక శరత్కాల మనిగాని, ఈచిత్తకార్తియని గాని నిర్దేశింపరాదు. అట్టి కాలనియమము సాముదాయకావస్థకు సరిపెట్టుకొన్నను దేశకాలపాత్రములకు సరిపడియుండును. ప్రతివ్యక్తియు తమతమ భౌతికశక్తి ననుసరించి శారీరక ఋతుధర్మము ప్రవర్తించునప్పుడే మిథునకర్మంబున కర్హంబులగు నను సిద్ధాంతమే మృగపశుపక్ష్యాదులయందు ముఖ్య

ముగా గమనింపదగినది. అట్టిధర్మమును మానవుడు పరిశీలింపక భౌతిక శక్తిని తద్ద్వారా మానసిక (ఆత్మ) శక్తిని గోల్పోయి దుఃఖభాజనమైన నరకమును బొందుచున్నాడు. అనగా శరీరబలము, ఆత్మబలము లేక నశించుచున్నాడు. ఇట్టి క్రమప్రవృత్తియే ధర్మమని వ్యవహరింపబడును. అదియే సృష్టిక్రమాగతధర్మము. దీని నెఱింగిన వాడె ధర్మవిదుడు. ఇట్లు స్వధర్మ పరధర్మంబు లెఱింగిన మానవుడు అక్రమాహారనిద్రాదుల సేవించి స్వశక్తి లేక ఆత్మబలమును గోల్పోజాలడు. ఆహారనిద్రాదులు సర్వప్రాణులకు సర్వసామాన్యకృత్యములు. అవి యొకదానికంటె నొకటి కనిష్ఠములు. అన్నింటిలో నాహారనిద్రలావశ్యకములు, అవిలంఘ్యములునై యున్నవి. అందు బొత్తిగా నుల్లంఘింపరానిది ఆహారమై యున్నది. ఆహారమువలననే ప్రతిప్రాణికి జీవశక్తి కలుగుచున్నది. ఆహారము లేక యేప్రాణియు జీవింపజాలదు. పశుపక్ష్యాదులు, స్థావరములు, తమతమ జాఠరాగ్నికి వలసినంతమాత్రమే భుజించి జీర్ణించుకొని, తమతమ ఓజస్తేజోబలంబులను పెంపొందించుకొనుచు నాయురారోగ్యములం బొందుచున్నవి. సమస్తజీవజంతువులకు ఆహారవిషయమున కాలనియమము కలదు. కాలాతిక్రమణము వలన ఆహారము పచనముగాక యనేకరోగముల కాస్పదమై జీవశక్తిని తగ్గించును. జాఠరాగ్నియొక్క శక్తికి మించిన అపరిమితపరిమాణము వలన ప్రకృతిశక్తికి లోపము సంభవించును. ఏయేప్రాణికి యేయేవిధమగు ఆహార మెంత అవసరమో క్రమాగతధర్మము ననుసరించి, భుజించి నిర్ణీతకాలమువరకు ఆరోగ్యవంతముగా నాయాప్రాణులు జీవించును. అట్లే మానవుడును నిర్ణీతకాలమువరకు ఆరోగ్యవంతుడై జీవించుటకు యేవిధమైన ఆహార మెంత పరిమాణ మవసరమో గ్రహించి భుజింపవలయును. నియమాతిక్రమణమువలన జన్మతః నిర్ణీతమైన ఆయువునకే లోపము కలుగును. ప్రతిజీవికి నిర్ణీతమైన ఆయువు కలదు. అందు ముఖ్యముగా మానవునకు యుగధర్మము ననుసరించి శతాయుఃపరిమాణము గణింపబడుచున్నది. అందులో పూర్వజన్మసంస్కారమును బట్టి యొక్కొక్క మానవునికి పుణ్యపాపఫలానుభోగ్యమగు నాయుష్కాలము సాముదాయికపరిమితికి తగ్గిగాని, హెచ్చిగాని యుండును. మానవుడు బుద్ధిపూర్వకముగా నీయాహారాదిత్రయమును నియమాతిక్రమణముగా సేవించిన జీవింపదగిన కాలమునకే లోపముకలిగి యకాలమరణము నొందుచున్నాడు. కావున బుద్ధిమంతుడగు మానవుడు ఆహారాదిత్రయమును క్రమనియమానుసరణము సేవించి ఆయురారోగ్యములం బొందవలయును. "ఆహారముకొరకు మానవుడు జీవింపవలయునా? లేక, జీవించుట కొరకుమాత్రమే ఆహారమువలయునా?" అను విషయము ముఖ్యముగా విమర్శింపదగినది. శ్రీస్వామి వివేకానంద "జీవించుటకొరకుమాత్రమే భుజించుట శ్రేయస్కరము" అని యుపదేశించెను. ఇందెంతయో అర్థమున్నది. క్షుత్తు (ఆకలి) ప్రతిప్రాణికి అవిలంఘ్యమైనది. అది తీర్చుకొనుటకు మాత్రమే ఆహారము వలయును గాని, జిహ్వాచాపల్యము తీర్చుకొనుటకు నియమాతిక్రమణముగా భుజించుట తగదు. అత్యాహారమువలన ఆయుర్బలములు క్షీణించును. అత్యాహారమువలన సర్వేంద్రియములు చలించును. మితాహారమువలన సర్వేంద్రియనియమమును, దాన ఆత్మశక్తియు కలుగును. కర్మేంద్రియపంచకము, జ్ఞానేంద్రియపంచకము, ఈసర్వేంద్రియాధిష్ఠానదైవతమగు మనస్సును మితాహారవిహారములవలన నియమింపబడి పారిశుద్ధ్యము నొందుచున్నవి. అనగా మితాహారవిహారముల వలన మనోనియమము కలుగును. అందువలన సర్వేంద్రియచాపల్యము నివర్తించును. అందువలన నింద్రియాతీతమైన ఆత్మశక్తి ప్రస్ఫురించును. కనుక మనోనియమము నలవరచుకొనుటకు ఆహారవిహారముల నియమపరచుకొనుట విధినియమము అనగా—విషయమును, విషయేచ్ఛను ఒక హద్దులోనుంచుట. దానినే "మిత" మని చెప్పుదురు. ప్రకృతిసిద్ధమగు పరిమాణము "మితము." ప్రకృతి విరుద్ధమగు పరిమాణము "అమిత" మగును. ఎవని జఠరాగ్ని నిరాయాసముగా నెంత పరిమాణము జీర్ణించుకొన గల్గునో ఆపరిమాణము మితసంజ్ఞ గలదియగుచున్నది. అంత కేమాత్రము మించిన అమితాహారమగును. సర్వసామాన్యమున కొకవిధమగు నాహారమనిగాని, ఒకే పరిమాణమని గాని నిర్దేశింపరాదు. దేశకాలముల ననుసరించి పాత్రత యేర్పడును. కొన్ని దేశములయందు గోధుమ, కొన్ని ప్రదేశములయందు జొన్న, కొన్ని చోట్ల శాలి (వరి) ఆహారములుగా నున్నవి. ఏయేదేశస్థులు ఏయే విధములగు నాహారములను ఏయేవిధములుగా నుపయోగించుకొనుచున్నారో ఆయాపద్ధతియే "హిత" మని చెప్పబడును. అట్టిదేశకాలానుగుణమైన ఆహారమే "హితాహార" మని తెలియవలయును. అట్టి హితాహారము మితముగా భుజించుటయే "హితమితాశన" మని పిలువబడును. హితమితాశనమువలన నాయురారోగ్యము లతిశయించును.

గీ. తపమునను బ్రహ్మచర్యవ్రతమున హితమి
తాశనమున రసాయనాభ్యాసమునను
బెరుగు నాయు వాక్రియలపై నరుడు ప్రీతి
గలుగుటయు బూర్వభవకృతకర్మఫలము.

—భా. శాంతి. ౫ ఆశ్వాసము.

ఆయురారోగ్యప్రదమైన హితమితాశనము నలవరచుకొనువాడె నిరోగి. వాడే భోగి; వాడె యోగి. ఈకాలమున దేశకాలపాత్రములకు వ్యతిరిక్తమైన కాఫీ మొదలగు అక్రమాహారములు, అకాలభోజనములు, నానారోగజననకారణంబులై ఆయుర్బలక్షయముల నిచ్చుచున్నవి. హితమితాభ్యాసమువలన ఆలస్యనిద్రాదులు క్షయించి జవసత్వంబు లభివృద్ధిగాంచును. అమితాహారనిద్రలవలన మేదస్సు (క్రొవ్వు) పెరిగి స్థౌల్యరోగము కలుగును. మరియు బద్ధకము, అలసట, బరువు, నిర్వ్యాపారత్వము, గమననిరోధము, ఆయాసము, ప్రాణసంచలనము, అనహిష్ణుత ఎన్నిసారు లెంత తినినను నీరసముగానేయుండుట, ఆకలిని భరింపలేక పోవుట, నిరంతరము ఆహారమునందే దృష్టి, ప్రతిక్షణము

వివిధరుచుల నభిరుచించు చుండుట (జిహ్వాచాపల్యము) మనోబుద్ధి చిత్తాహంకారములకు వికల్పావస్థయు (వైమనస్యము)ను, సర్వేంద్రియ సంచలనము మొదలగు ననేక ప్రవృత్తులు కలిగి ఆయుర్బలములు విషమ సంకలితంబు లగును. హితమితాశనమువలన చురుకుదనంబును, శరీరము తేలికగా నుండుటయు, అగ్నిదీప్తియు, స్థౌల్యహరణంబును, కార్య కౌశల్యమును గలుగును.

"అతిభుక్త మభుక్తంవా వర్జయిత్వాప్రయత్నతః."

అత్యాహారము, నిరాహారము ప్రయత్నపూర్వకముగా వర్జింప దగినవి. అనుయాజ్ఞవల్క్యవచనమువలన హితమితాశనమే శ్రేయస్కరముగా తెలియదగినది. మరియు శ్రీకృష్ణభగవానులు గీతాశాస్త్రమున అర్జునునకు

శ్లో. యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు,
యుక్తస్వప్నావబోధస్య యోగోభవతిదుఃఖహా.

శ్లో. నాత్యశ్నతస్తుయోగోఽస్తి నచైకాంత మనశ్నతః,
నచాఽతిస్వప్నశీలస్య జాగ్రతోనైవచాఽర్జున.

అని యుపదేశించెను. యుక్తాహారవిహారములును, యుక్తకర్మాచరణంబును, యుక్తనిద్రయు, యుక్తజాగ్రదవస్థయు గలిగినవానికి యోగము దుఃఖహారంబగును. ఇక్కడ యుక్తమనగా దేశకాల పాత్రానుసరణము మితపరిమాణము. యుక్తాహారవిహారములు అనుటలో యుక్త=చాలినంత లేక తగినంత — అనగా అలవాటుగా తినెడి ఆహారము వ్యక్తి యొక్క క్షున్నివారణమునిమిత్తము చాలినంత లేక జఠరాగ్నికి తగినంత యుక్తాహారమగు చున్నది. మరియు యోగసిద్ధి కొరకు అత్యాహారము, అనాహారము, అతినిద్ర, అతిజాగరణము వర్జనీయముగా చెప్పబడినది. మరియు,

"భయంక్రోధమథాఽలస్య మతిస్వప్నాతిజాగరం,
అత్యాహారమనాహారం నిత్యంయోగీవివర్జయేత్."

అని అమృతనాదోపనిషత్తునందును, "బ్రహ్మచారీ మితాహారో యోగీ యోగపరాయణః" అని ధ్యానబిందూపనిషత్తునందును, "లఘ్వాహారో జితేంద్రియః." అని నారదపరివ్రాజకోపనిషత్తునందును చెప్పబడెను. ఇట్లమితాహారము యోగవిఘ్నకరంబనియు, మితాహారము యోగవృద్ధికరంబనియు తెలియవలయును. యోగశక్తి కలుగుటకు నీరోగి కావలయును. ఆయురారోగ్యములుండినగాని యోగి కాజాలడు. "శరీరమాద్యంఖలు ధర్మసాధనం" అను న్యాయముచేత శరీరమే సర్వధర్మములకు మూలసాధనమగును. "జీవన్ ధర్మమవాప్నుయాత్" (బ్రతికితేమేని ధర్మము నాచరింతుము) "ఆత్మానం సతతం రక్షేత్." (తాను తన్నెల్లప్పుడు రక్షించుకొనవలయును) అను న్యాయములచేత శరీరమును ఆరోగ్యవంతముగా నుండునట్లు సంరక్షించు కొనవలయును. అట్లు సంరక్షించుకొనుటకు హితమితాహారవిహారములే సాధనములుగా గ్రహింపవలయును. లేనివాడు లేకయేడ్చుచుండగా నున్నవాడు తినలేక యేడ్చుటేల? భగవంతుడు ప్రాణులను ఇష్టానుసారము తినుటకు విహరించుటకు సృష్టించెను గదా? అని సమర్థించుకొని సర్వకాలసర్వావస్థలయందు నత్యాహారవిహారంబుల సేవించుట మానవధర్మము కాదు గనుక ప్రతిమానవుడు హితమితాహార విహారంబుల నభ్యసించి యాయురారోగ్యములం బొందవలయును. "ఉపవాసాదికాయక్లేశాంశ్చ వర్జయేత్" అని యోగతత్వోపనిషత్తునందును,

"అభోజనా దజీర్ణాతిభోజనా ద్విషమాశనాత్,
అసాత్మ్యగురు శీతాతి రూక్షదుష్ట భోజనాత్.
దేశకాలర్తు వైషమ్యా ద్వేగానాంచ విధారణాత్.
దుష్యత్యగ్నిః సదుష్టోఽన్నం నతత్పచతిలఘ్వపి.

అని చరకసంహితయందును చెప్పబడినది. అత్యాహారనిరాహారములు రోగకారణంబులగును. దీపనాగ్ని అసాత్మ్యగురుశీతాదిదుష్టభోజనములవలన దేశకాలర్తు వైషమ్యమువలన దూషితంబై అన్నపాచన శక్తిని కోలుపోవుచున్నది. కనుక హితమితాహారము సర్వవిధముల శ్రేయస్కరమగును. "బలాయుషీ హ్యాహారాయత్తే." (ఆయుర్బలంబులు ఆహారాధీనంబులై యుండును.) అనుచరకవచనమువలన హితమితాహారవిహారంబులు ఆయుర్బలవర్ధకములై నవిగా నెరుంగదగును.

మితాహారముగా పరిగణించుట కొక విధానము —

"ద్వా వంశౌ పూరయే దన్నై స్తోయేనైకం ప్రపూరయేత్,"

"స వాదౌ సలిలం పేయం భోజనే పాన మాచరేత్,
అర్ధాహారేణ భుంజీత తృతీయం వ్యంజనేనతు
చతుర్థం తోయపానేన పూర్ణాహారస్య జాయతే."

అని హారీతసంహితయందు వివరింపబడెను. సగము ఆకలితో నుండుట బలహీనము. నిత్యోపవాసము ఆయుఃక్షీణము. ఆకలితీరునంత (జఠరాగ్నికి సరిపోగల) ఆహారము ఆయుర్బలవర్ధకము. మితిమించిన ఆహారము ఆయుర్బలక్షయకారణము. కేవలజలపానముచే మందాగ్ని కలుగును గనుక భోజనాత్పూర్వము జలపానము కూడదు. భోజనకాలమందే నీరు త్రాగవలయును. ఆకలిని నాల్గుభాగములు చేయగా రెండుభాగము లాహారముచేతను, ఒకభాగము కూరలు పచ్చడులు మొదలగు నన్నసాధనములచేతను, మరియొక భాగము జలముచేతను ఆకలిని తీర్చికొనిన పూర్ణాహారమగును. అనగా కోష్ఠపూరణము నిమిత్తము అర్ధభాగము (మొత్తములో సగము) అనగా రెండుభాగములు ఆహారము (అన్నము)ను, మూడవభాగము కూరలు మొదలగు వ్యంజనములును, నాల్గవభాగము జలమును గ్రహింపవలయును. ఇట్లు కోష్ఠమును పూరించుటచేత తృప్తిగలుగును. ఇది పూర్ణాహారమగును. అనగా భుజించిన ఆహారము మితపరిమాణమునకు వచ్చును. ఆకలి దీరును. మరియు కొందరు "అర్ధభక్తోదకము"ను వచించిరి. అనగా సగము అన్నము సగము నీరు అగును. అన్నపరిమాణము సగము భుజించిన వెనుక తృప్తిదీరు





౧. బెజవాడ ఉప్పుసత్యాగ్రహము, స్త్రీదళము ఊరేగింపు. నాయకురాలు : శ్రీమతి అయ్యదేవర దుర్గాంబగారు.
౨. కాకినాడ ఉప్పుసత్యాగ్రహము, స్త్రీదళము ఉప్పుతయారుచేయుట. నాయకురాలు : వేదాంతం కమలాదేవిగారు.













౧. శ్రీమతి తాయారమ్మగారు (కీ) ౨. శ్రీమతి వడ్డిపర్తి శకుంతలాదేవిగారు (కీ) ౩. శ్రీమతి జయంతి సూరమ్మగారు (కీ)
౪. శ్రీమతిశృంగారకవి లక్ష్మీనరసమ్మగారు (కీ) ౫. శ్రీమతి వేదాంతం కమలాదేవిగారు, బి. ఏ.(కీ) ౬. శ్రీమతి ముల్పూరి చుక్కమ్మగారు(కీ)

నంత జలపానము చేయగా మొత్తమువిూద అన్నపరిమాణము మిత సంజ్ఞకలది యగుచున్నది.

"అల్పమృష్టాశనాభ్యాంచ చతుర్థాంశావశేషకం
తస్మాద్యోగానుసన్యేన భోజనం మితభోజనమ్.

అని దర్శనోపనిషత్తునందు చెప్పబడినది. అల్పమృష్టాన్నము నాల్గుభాగములలో నాల్గవభాగము శేషించునట్లు భుజించుట మితభోజనమగును. అనగా నాల్గుభాగములలో నొకభాగము విడిచిపెట్టి మూడు భాగములే గ్రహించుట. మరియు యోగచూడామణ్యుపనిషత్తులో

"సుస్నిగ్ధమధురాహార శ్చతుర్థాంశవివర్జితః,
భుంజతే శివసంప్రీత్యా మితాహార స్స ఉచ్యతే."

నాల్గవభాగమువిడిచి భుజించుట మితాహారమగును. మాంసాహారులు, శాకాహారులు, మిశ్రాహారులు, పక్వాహారులు, అపక్వాహారులు హితము, మితము విచారించి భుజించు నభ్యాసమువలన ఆయురారోగ్యములం బొందుదురు. మాంసాహారము శ్రేయస్కరమా? శాకాహారము శ్రేయస్కరమా? లేక పక్వాహారము శ్రేయస్కరమా? అపక్వాహారము శ్రేయస్కరమా? అను విషయములు ప్రత్యేకవ్యాసమున చర్చింప దలచి యిప్పుడిందు కుండలీకరించుచున్నాము. పశుపక్ష్యాదులకును మానవులకును జాఠరాగ్ని విభేదమునను సరించి పక్వాపక్వాహారములు నిర్ణీతము కాదగినవి. దేశకాలపాత్రముల ననుసరించి కొన్ని పక్వములు, కొన్ని అర్ధపక్వములు, కొన్ని అపక్వములుగూడ గ్రాహ్యములే యగును. కేవలము అపక్వాహారమువిూదనే జీవించుట శ్రేయస్కరమను వాదమునకంటె ప్రత్యేకరోగనివారణకొఱకు మాత్రమే అపక్వాహారముయొక్క ఆవశ్యకత గ్రహించుట శ్రేయస్కరమని తలచెదను. ఏప్రాణికి తనతన జాఠరాగ్నికి వలసినంత దేశకాలానుగుణముగ నాహారము అవశ్యకమో అదియే హితమితాశనము.

---

పట్టణములలో దేహపరిశ్రమకు వీలులేదని విచారించవద్దు





# మకరధ్వజము

చీమలకొండ సూర్యనారాయణశాస్త్రిగారు

మన దేశమున "మకరధ్వజము" అను పేరుతోను, ఈ పేరునకు కొన్ని విశేషణములను గలిపియు ఆయుర్వేదవైద్యులు కొంతకాలమునుండి విస్తారముగ ప్రకటనలను జేయుచున్నారు. మొట్టమొదట "మకరధ్వజము" అనుపేరును వెల్లడిచేసినవారు కలకత్తానివాసులగు కవిరాజ, నగేంద్రనాథ సేనుగారు. వీరు ప్రచురణను ప్రారంభించిన చాలకాలమువరకును ఆంధ్రదేశవిఖ్యాతవైద్యులైనను మకరధ్వజము నెట్లు తయారుచేయవలయునో యని సంకోచించుచుండిరనిన నతిశయోక్తి గానేరదు. వారి ప్రచురణపుస్తకములయందు జూపించిన పాశ్చాత్యయంత్రముల విగ్రహములవలననే ఆంధ్రవైద్యులు భ్రమకు లోనగుట తటస్థించినది. వారు తులము రు 80 ల చొ॥న ప్రథమము నుండి యిప్పటివరకును నొకేధరకు విక్రయించుచున్నారు. పిమ్మట క్రమముగ మకరధ్వజముయొక్క ప్రకటనలు విస్తరించి పెక్కురు వైద్యులు పెక్కురీతుల ధరలను బ్రకటించుచు రానురాను ఇప్పటికి హిందూదేశవైద్యులు తులమును నాలుగురూపాయీల కిచ్చుచున్నారు. ఇట్టి తక్కువధరకు మొట్టమొదట ఇచ్చినవారు ఢక్కానివాసులగు శక్తిఔషధాలయాధిపతులు. ప్రస్తుతము మనకు జర్మనీదేశము మకరధ్వజమును తులమును రెండురూపాయీలకే పంపుచున్నది. ఢక్కావారు తులమును నాలుగురూపాయీల కిచ్చుటతోడనే ఆంధ్రదేశమున దీనినిగూర్చి విశేషముగ విమర్శనలను జేయుటకు వైద్యులు మొదలిడిరి. ఇదియునుగాక శక్తిఔషధాలయాధిపతులు వారి ప్రకటనయందు దీనిని వారెట్లు చేయుచున్నారో వివరముగ వ్రాసి "దీనిని మకరధ్వజము గాదని రుజువుచేసినవారికి రు 500 బహుమతి యిచ్చెద" మని గూడ బ్రకటించిరి. ఇంతవరకును దీనిని గాదనువా రొక్కరును గానరైరి.

ఇట్టిస్థితిలో వైద్యసోదరులు ఈయౌషధరాజముయొక్క నిజస్థితి యెట్టిదని విచారించి నిర్ధారించుట ముఖ్యమను సంగతి నిశ్చయము.

ఇట్టి యౌషధమునుగూర్చి గలుగు విచికిత్స యెట్టిదనగా, తులము రెండుమొదలు యెనుబది రూప్యములవరకు ఖరీదుండుటకు గారణమేమి? ఇట్టి వ్యత్యాసముగు ధరలు గలిగి ఒకేపేరుతో ప్రచారములోనున్న యౌషధ మేకమేనా? విభిన్నమా? శాస్త్రమందీపేరుగల యౌషధము లెన్ని రకములుగ నున్నవి? వాటివాటికి ప్రత్యేకభేదములుగాని, విభిన్నగుణములుగాని యేమైనగలవా? సర్వవ్యాధిహరణక్షమ మెట్లయినది? అను సంశయంబు లుత్పన్నంబులగుట స్వాభావికము.

నాకు తెలిసినంతవరకు శాస్త్రానుసారముగ నీక్రింద చర్చించెదను. కావున వైద్యసోదరుల నెల్లరను సావకాశముగ చిత్తగించ గోరెదను.

కలకత్తా నివాసులగు కవిరాజులుగాని, ఢక్కానివాసులగు వైద్యసంఘములవారుగాని, ఆంధ్రదేశమందలి కొందరు వైద్యులుగాని ప్రచురించుచున్న మకరధ్వజ మనునది ఇసుకమాదిరిగ పొడిగ నుండు రససిందూరభేదము. నగేంద్రనాథ సేనుగారు పండిన గాజుకుప్పెలతోనే మకరధ్వజమును బంపుచున్నారు. ఆ కుప్పెకు పైభాగమున నంటియున్న సిందూరరూపరసమే మకరధ్వజము. మరికొందరు "మకరధ్వజ" లేక "చంద్రోదయ" యోగమున జెప్పబడిన అనుపానవస్తువులను జేర్చి నూరిన పిష్టినిగాని, దానిని మాత్రల రూపమునగాని బంపుచున్నారు.

ఆయుర్వేదమున "మకరధ్వజము", "చంద్రోదయము", "షడ్గుణబలిజారితమకరధ్వజము", "సిద్ధమకరధ్వజము" నను పేరులతో కొలదిమార్పులతో గూడిన ఒకే యౌషధయోగము గానిపించుచున్నది. మరియు నాంధ్రదేశమున ప్రచారములోనున్న వైద్యచింతామణి, బసవరాజీయము అను గ్రంథములయందు ఫలశ్రుతియందు మాత్రము కొద్ది విభేదముగలిగి మకరధ్వజముతో సర్వవిధముల సమానమగు-సమానమేగాదు అభేదమగు-యోగమొకటి "చంద్రోదయ" మను పేరుతో విరాజిల్లుచున్నది. బసవరాజీయమున చంద్రోదయయోగమునకు చిట్టచివర "తంత్రాంతరే ప్రసిద్ధోఽయం మకరధ్వజనామతః" అని స్పష్టముగనే అభేదము నిరూపించబడినది. పూర్వగ్రంథములలోను, ఇటీవలి గ్రంథములలోనుగూడ మకరధ్వజమునకును, చంద్రోదయమునకును అభేదము చెప్పబడియుండుట యథార్థము. దీనిని సరిగ జూడక పోవుటచేతనే విచికిత్సకు కారణమైనది.

మకరధ్వజ మనుపేరుతో శాస్త్రమందు రెండుయోగములు మాత్రము పైవాటికన్నిటికి విలక్షణమైనవి గనుపించుచున్నవి. మనకు ప్రచారములోనున్న మకరధ్వజమునకు మాత్రము ఈయోగములు సంబంధించవు.

కావున క్రమముగ మకరధ్వజ మనుపేరుతో శాస్త్రమందు చెప్పబడిన యోగముల నన్నిటిని ఈక్రింద వ్రాయుదును:

## భైషజ్యరత్నావళి—జ్వరాధికారము

### మకరధ్వజము—షడ్గుణబలిజారితమకరధ్వజము

1\. శ్లో. పలమేకం సువర్ణస్య రసేంద్రస్య పలాష్టకం,
రసస్య ద్విగుణం గంధం కజ్జలీకృత్య యత్నతః.
కుమారికారసై ర్భావ్యం కాచపాత్రే నిధాపయేత్,
వాలుయంత్రే చ సంస్థాప్య క్రమశ స్త్రిదినంపచేత్.
స్వాంగశీతం సమాదాయ పుష్పారుణరజస్సమమ్,
యవమాత్రం ప్రదాతవ్య మహీవల్లీ దళై స్సహ.
రసస్య షడ్గుణైర్గంధైః పూర్వవత్కజ్జలీకృతే,
భావితేపాచితే సమ్యక్ షడ్గుణో బలిజారితః.
విధివ త్సేవితో హ్యేష ముహూర్తమపి జీవయేత్,
వీతదభ్యాసత శ్చైవ జరామరణనాశనమ్,
అనుపానవి శేషేణ కరోతి వివిధా న్గుణాన్.
జ్వరం త్రిదోషజం ఘోరం మందాగ్ని శ్చ మరోచకం,
అన్యాంశ్చ వివిధా న్రోగాన్ నాశయేన్నాత్ర సంశయః.
కరోత్యగ్నిం బలం పుంసాం వలీపలితనాశనః,
మేధాయుఃకాంతిజననః కామోద్దీపనకృ న్మహాన్.
భాస్వత్యోతి ర్యథాభాతి కాచే నీలాదికే శుభే,
తథాఽనుపానభేదేన క్రియావా న్మకరధ్వజః.

ఈ యోగమున అనుపానవస్తువులను ఇతరయోగములలో చెప్ప బడినరీతిని చెప్పక ఆయావ్యాధిశమనములగు ననుపానములతో వాడుకొనవలయునని చెప్పబడినది. దీనియందు స్వర్ణము 1 భాగము, రసము 8 భాగములు, గంధకము 16 భాగములు చేర్చి బాగుగ నూరి, కలబంద రసముచే భావనచేసి గాజుకుప్పెలలో బెట్టి మూడుదినములు మంద మధ్యగాఢాగ్నులచే వండి స్వాంగశీతలమున కుప్పెలనుదీసి అందుండు పుష్పారుణరజస్సమమగు నౌషధము (మకరధ్వజము)ను గ్రహించి అనుపానభేదములచే నుపయోగించిన సమస్తవ్యాధులను నశించుటయేగాక ఆసన్నమరణావస్థనుగూడ తప్పించి జరామరణములు లేకుండ జేయునని చెప్పబడినది. ఈ యోగమందే గంధకభాగమును రసమునకు రెండురెట్లకు బదులు ఆరురెట్లు చేర్చి వండినచో సిద్ధించు ద్రవ్యమునకు "షడ్గుణ బలిజారిత మకరధ్వజ" మనిపేరు.

### చంద్రోదయము

2\. శ్లో. పలంమృదు స్వర్ణదళం రసేంద్రాత్పలాష్టకం షోడశ గంధకస్య,
శోణై స్సుకార్పాసభవప్రసూనై స్సర్వం విమర్ద్యాఽథకుమారికాద్భిః.
తత్కాచకుంభేనిహితంసుగాఢే మృత్కర్పటీభిర్ద్వివసత్రయంచ,
పచేత్క్రమాగ్నౌ సికతాఖ్యయంత్రే తతో రజః పల్లవరాగరమ్యమ్.
నిగృహ్యచైతస్యపలంపలాని చత్వారికర్పూరరజ స్తథైవ
జాతీఫలంశోషణ మింద్రపుష్పం కస్తూరికాయా ఇహశాణమేకం
చంద్రోదయోఽయంకథితోస్యమాషోభుక్తోఽహివల్లీదళమధ్యవర్తీ
మదోన్మదానాం ప్రమదాశతానాంగర్వాధికత్వంశ్లథయత్యకాండే
ఘృతంఘనీభూతమతీవదుగ్ధం మృదూని మాంసాని సమండకాని
మాషాన్నపిష్టాని భవంతి పథ్యాన్యానందదాయీన్యపరాణిచాఽత్ర
వలీపలితనాశన స్తనుభృతాం వయ స్తంభనః
సమ స్తగదఖండనః ప్రచురరోగపంచాననః
గృహేఽపి గృహభూపతి ర్భవతి యస్యచంద్రోదయః
సపంచశరదర్పితో మృగదృశాం భవే ద్వల్లభః.

ఈ యోగమునందు మొదటియోగమున చెప్పబడిన విధముననే భాగములు చెప్పబడినవి. మర్దనవిధానమునమాత్రము శోణకార్పాస పుష్పములచేగూడ మర్దించవలయునని అధికము చెప్పబడినది. మొదటి యోగమున రెట్టింపు గంధకము గలుపగా సిద్ధించునదియును, ఈ యోగమువలన సిద్ధించునదియు నగు నౌషధరాజ మొక్కటే కాని ఔషధమం దేమియు గలుపకనే తమలపాకులతో సేవించవలయునని మొదటియోగమందును, ఔషధము పలమునకు నాలుగు రెట్లు పచ్చకర్పూరము, జాజికాయ, మిరియములు, లవంగములు గలపి నాలుగు రెట్లును, కస్తూరి శాణప్రమాణమును గలిపి బాగుగనూరిన పిష్టిని తమల పాకులతో సేవించవలయుననియును భేదమును జెప్పుచు, పేరిననెయ్యి, పాలు, మృదువగు మాంసము, మండము, మాషపిష్టము మొదలగు సంతోషజనకములగు నాహారములను సేవించవలయుననియు విశేషముగ నియ్యది ధ్వజభంగమున నుపయోగించునని చెప్పబడినది.

### మకరధ్వజము

3\. శ్లో. స్వర్ణాద ష్టగుణం సూతం మర్దయే త్త్రిగంధకమ్
ర క్తకార్పాసకుసుమైఃకుమార్యశ్చిర్వమర్దయేత్
శుష్కం కాచఘటే రుద్ధ్వా వాలుకాయంత్రగం పచేత్
భస్మకుర్యా ద్రసేంద్రస్య నవార్కకిరణోపమమ్
భాగోస్యభాగాశ్చత్వారః కర్పూరస్య సుశోభనాః
లవంగం మరిచం జాతీఫలం కర్పూర మాత్రయా
మేలయేన్మృగనాభించ గద్యాణకమితంతతః
శ్లక్ష్ణపిష్టో రసో నామజాయతే మకరధ్వజః
వల్లం వల్లద్వయంవాఽథ తాంబూలీదలసంయుతమ్

భక్షయేన్మధురంస్నిగ్ధం మృదుమాంస మహారలమ్
శృతశీతంసితాయుక్తందుగ్ధంగో భవమాజ్యకమ్
మధ్యాహ్నం పిష్ట మపరం మద్యాని వివిధానిచ
కరోత్యగ్నింబలం పుంసాం వలీపలితనాశనః
మేధాయుఃకాంతిజననః కామోద్దీపనకృన్మహాక్
అభ్యాసా త్స్వధక స్త్రీణాంశతం గచ్ఛతి నిత్యశః
రతికాలేరతాంతేచ పునస్సేవ్యో రసాయనః
కృత్రిమంస్థావరవిషంజంగమం విషవారిచ
సవికారాయుభవతి సాధకానాంచ వత్సరాత్
మృత్యుంజయో యథాఽభ్యాసాన్మృత్యుంజయతిదేహినామ్
తథాఽయంసాధకేంద్రస్య జరామరణనాశనమ్.

ఈ యోగమున మర్దనాదికము, అనుపానవస్తువులు, వంట అన్నియును రెండవ యోగమగు చంద్రోదయయోగమున చెప్పబడిన విధమునసే చెప్పబడినవి. ఆ చంద్రోదయయోగమున అనుపానవస్తువులతో గలిపి నూరిన పిష్టికి చంద్రోదయ మనియును, ఈ యోగమున అట్టిపిష్టికే మకరధ్వజమనియును నామకరణము చేయబడినది. తక్కిన ఫలశ్రుతియందు స్వల్పవిభేదమువాత్రమే గలదు. వస్తుసమ్మేళనమున గంధకము రసమునకు మూడురెట్లు చెప్పబడినది. దీనిని రతికాలమందును, రతాంతమందునుగూడ సేవించవలయునని చెప్పుటచే వాజీకరణమున నెక్కువగ నుపయోగించును.

## రసేంద్రచింతామణి

### చంద్రోదయము, మకరధ్వజము

4. శ్లో. "పలంమృదు స్వర్ణదలం" అని ప్రారంభించి ఔషధనిష్పత్తి పూర్తివరకును రెండవ యోగమగు చంద్రోదయయోగమే వ్రాయబడి పిమ్మట ఫలశ్రుతియందు రెండవ యోగముకంటె విశేషముగ మూడవ యోగమందు వ్రాయబడినదే యీయోగమందు గూడ వ్రాయబడినది. చిట్టచివరున చిన్నవ్యాఖ్యానము గూడ యీక్రింద వ్రాసిన విధమున వ్రాయబడియున్నది: "ఇంద్రపుష్పం = లవంగం, ఉక్తపరిమాణ ముపలక్షణం. దాక్షిణాత్యాః శోణకార్పాసపుష్ప ద్రవమేవ గృహ్ణంతి. అన్యే నిర్వ్యూఢం పుష్పైరేవ యావదార్ద్రత్వం మర్దయంతి. ఉభయథైవ నిష్పత్తే రదోషః, శాస్త్రాంతరేఽస్య మకరధ్వజో నామ". ఇచ్చట స్పష్టముగ నాంధ్రలోకమున చిరకాలముగ వాడుకయందుగల చంద్రోదయమే మకరధ్వజమని చెప్పబడియున్నది.

## రసరత్నాకరము

### చంద్రోదయము

5. శ్లో. "పలంమృదుస్వర్ణదళం" అని ప్రారంభించి స్వల్పయోగమునే వ్రాసి చిట్టచివరగల వ్యాఖ్యానమును "ఇంద్రపుష్పం లవంగం స్యాత్కార్పాసకుసుమద్రవం, తంత్రాంతరే ప్రసిద్ధోఽయం మకరధ్వజనామతః." అని శ్లోకరూపమున వ్రాసినాడు. ఇచ్చటగూడ చంద్రోదయమకరధ్వజములకు అభేదమే.

## యోగరత్నాకరము

### చంద్రోదయము

6. శ్లో. "పలం మృదుస్వర్ణదళం" అని ప్రారంభించి సర్వమును రెండవ యోగప్రకారమే వ్రాసినాడు. కాని "తతోరసః పల్లవాగరమ్యః సౌవర్ణ మేత త్సకలామయఘ్నం, సర్వేషు యోగేషుచ యోజనీయం."—

ఈ యోగప్రకారము వంటను జేయగా సిద్ధించునది సువర్ణమయమగు రసమనియును నయ్యది చిగురుటాకువంటి వర్ణమును గలిగియుండుననియును, దీనిని సమస్తయోగములయందును జేర్చుకొనవచ్చుననియును చెప్పబడియున్నది. పిమ్మట ఈరసమందు అనుపానవస్తువులను జేర్చి నూరిన పిష్టికే చంద్రోదయమను పేరు నిచ్చినాడు.

### సిద్ధ మకరధ్వజము

7. శ్లో. పలమానంరసం సమ్యగ్బహుసంస్కారసంస్కృతం
తథాపలద్వయంగంధం శుద్ధంహేమద్వికార్షికం
కైలాసాచలసంభూతే సుదృఢేవసుచిక్కణే
శోణప్రస్తరజేఖల్వే సర్వంసంస్థాప్యమిశ్రయేత్
మర్దయేన్మత్నతోవైద్యో యామానష్టానిరంతరం
రక్తకార్పాసపుష్పస్య శ్వేతాంకోటఫలస్యచ
కుమార్యాశ్చరసైస్సమ్య గ్భావయిత్వాప్రుథక్పృథక్
స్థాపయిత్వాకాచకూపీమధ్యేసర్వంప్రయత్నతః
రక్తాంగసాలసరలఖదిరశ్రీఫలోద్భవాం
కాష్ఠేనాఽన్యతిమేనైవ నీరసేనప్రతాపయేత్
మృదునాఽనలయోగేన ప్రాగ్యామద్వితయంపచేత్
పునర్యామద్వయంపాచ్యం మధ్యతాపేనవహ్నినా
అగ్నినాప్రఖరేణైవ తతోయామద్వయంపచేత్
భూయోమందాగ్నినాపాచ్య మవశిష్టద్వియామకం
స్వాంగశీతముద్ధృత్య నవమాతదలోపమం
భంగురంలోహితంపిష్టే దాడింబకుసుమోపమం
తతోఽవతార్యగంధేన ద్విగుణేనవిమర్దయేత్
భావయేత్పూర్వవద్భూయః పాచయేచ్చప్రయత్నతః
ఏవంవారద్వయంకుర్యా త్సమ్యగౌషధసిద్ధయే
సన్నిపాతంజ్వరంఘోరం మందాగ్నిత్వమరోచకం
ఆమశూలంకటీశూలం వ్యాధ్మాలంపక్తిశూలకం
కాసంశ్వాసంచయక్ష్మాణం శూలంకుష్ఠకు శేవతః

గలోత్థానాం త్రివృద్ధించ తథాఽతీసారమేవచ
శ్లీపదంకఫవాతోత్థం చిరజంతులజంతథా
నాడీవ్రణంవ్రణంఘోరం గుదామయభగందరౌ
వాయుంబహువిధంహంతి ధ్వజభంగంవిశేషతః
సేవనాదస్యనశ్యంతి సర్వేరోగా నసంశయః
కరోత్యగ్నింబలంవీర్యం వలీపలితనాశనః
విధివత్సేవితోహ్యేష ముహూర్తమపిశీలయేత్
స్వేచ్ఛాచారవిహారోఽపి నకదాచిద్విపద్యతే
మేధాయుఃకాంతిజననః కామోద్దీపనకృన్మహాన్
వృద్ధోఽపితరుణస్పర్ధీ స్త్రీషుచాఽపివృషాయతే
సేవనాదస్యసప్తాహాత్ గచ్ఛంతి ప్రమదాశతం
త్రైలోక్యశుభదం శ్రీమ దేతదేవ మహౌషధం
మృత్యుంజయోయథాఽభ్యాసా న్మృత్యుం జయతి దేహినాం
తథాఽయంసాధకేంద్రస్య జరామరణనాశనః
స్వయంత్రైలోక్యనాథేన త్రైలోక్యహిత మిచ్ఛతా
సమర్పితోఽయంసిద్ధేభ్యః కరుణార్ద్రేణచైయతః
అతోఽయంభువనేఖ్యాతః శ్రీసిద్ధమకరధ్వజః
భాస్వాన్యథాతమోహంతి కేసరీకరిణంయథా
తూలపంఘుం యథావహ్నిః తథారోగా నసౌ హరేత్.

ఈయోగమందు స్వర్ణమునకు రెట్టింపు మాత్రమే బహుసంస్కారసంస్కృతమగు రసమును జేర్చవలయుననియును, ఊడుగు పండ్ల రసముచే గూడ భావనను జేయవలయుననియు, ఎనిమిది జాములలోనే వంటను ముగించి తిరిగి ఔషధమందు గంధకమును గలుపుచు మరి రెండుమారులుగూడ పైవిధముననే భావనాదికము, పాచనమును జేయవలయుననియును, అట్లు చేయగా సిద్ధించిన రససిందూరమునకే సిద్ధమకరధ్వజమని పేరనియును జెప్పబడినది. ప్రక్రియాభేదము, భాగభేదము, ఫలశ్రుతి-వీటియందు కొలది మార్పు. ఇంతియేగాని ఇయ్యదియు పైయోగముల మాదిరిదే.

ఈయేడు యోగములు గాక మరి రెండు యోగములు మకరధ్వజమను పేరుతో గలవు. వాటినిగూడ వ్రాయుదును:

## మకరధ్వజము

8. శ్లో. సిందూరంహేమలోహంచ దేవపుష్పం సచంద్రకం
జాతీఫలం మృగమదం చైకత్ర పరిమర్దయేత్
పర్ణాంభసా తతఃకుర్యా ద్వటికాంవల్లసమ్మితాం
సేవితాచ్ఛాగపయసా ప్రమేహాన్ స్తత్కృతాన్హరేత్
క్లైబ్యంధాతుక్షయంకాసం జీర్ణంచవిషమజ్వరం
రసోఽయంక్షపయేత్తూర్ణం మకరధ్వజసంజ్ఞకః.

దీనియందు స్వర్ణభస్మము, లోహభస్మము, సిందూరము వీటి మూటి సమూహమున మిరియములను దీసివేసిన మకరధ్వజ (చంద్రోదయ) మందలి అనుపాన వస్తువులు జేర్చబడినవి. ఇయ్యది మనము వాడుచుండు మకరధ్వజముగాదు.

## రసరత్నాకరము-రసాయన ఖండము

## మకరధ్వజము

9. శ్లో. వజ్రహేమార్కసూతాభ్ర లోహభస్మక్రమోత్తరం
సర్వంకన్యాద్రవైర్మర్ద్యం శాల్మల్యాశ్చద్రవైస్త్ర్యహం
తద్గృహ్యాకాచకుప్యాంతః వాలుకాయాంత్ర్యహంపచేత్
తత్కల్కంముశలీక్వాథై ర్వజ్రార్కక్షీరసంయుతైః
దినైకంమర్దయేత్ఖల్వే రుధ్వాతద్భూధరేపుటేత్
యామా దుద్ధృత్య సంచూర్ణ్యంసితాకృష్ణాత్రిజాతకైః
సమైస్సమంవిమిశ్రాఽథ మాషైకంభక్షయేత్సదా
మాగధీముశలీయష్టీవానరీబీజకర్షమం
చూర్ణంసితాజ్యగోక్షీరైః పలార్ధంపాయయేదను
కామినీనాంసహస్రైకం రమమాణోనముహ్యతి
సేవనాద్దృఢకాయస్స్యాత్ రసోఽయం మకరధ్వజః.

ఈ యోగముగూడ ప్రకృత విచికిత్సలోనిదిగాదు. ఈకడపటి రెండు యోగములుగాక మిగిలిన యేడు యోగములలో మూడవ యోగమందు గంధకము రసమునకు మూడురెట్లు గలపబడినది. ఏడవ యోగమందు భాగములన్నియు భిన్నములే. వంటగూడ భిన్నమేకాని ఔషధము మాత్రము తక్కిన యోగముల మాదిరిదే సిద్ధించును. "త్రిగుణే గంధకే జీర్ణే కామినీదర్పనాశనః" అని జెప్పబడుటచే వాజీకరణమునకొరకు జెప్పబడిన మూడవ యోగమందు గంధకమును మూడురెట్లు గలుపుట యుక్తమే. సిద్ధమకరధ్వజ యోగమున మూడువంటలు చెప్పుటచే షడ్గుణగంధకము జారణకాగలదు. ఈవిధముననే షడ్గుణబలిజారిత మకరధ్వజమునుగూడ షడ్గుణగంధకమును గలిపి యేకముగ ఒకవంటనే గాని, సిద్ధమకరధ్వజము మాదిరిగ మూడువంటలను గాని జేయవచ్చును. ఈయౌషధమునకు ఇట్టి ప్రభావముగలుగుటకు గల కారణమేమో శాస్త్రప్రమాణములవలన స్థిరపరచుట ఆవశ్యకము. కావున దానినిగురించియే యిందు వ్రాయుదును.

"యస్యరోగస్యయోయోగ స్తేనైవ సహ యోజితః,
రసేంద్రోహరతేవ్యాధీన్ నరకుంజరవాజినాం."

రసము యోగవాహియగుటచే ఆయావ్యాధులకు జెప్పబడిన ఔషధయోగములలో విధిప్రకారము సిద్ధముజేయబడిన రసమును గలిపిన ఆయా వ్యాధులను తప్పక పోకడచును. ఇట్లు జెప్పుటచే రససంస్కారాదులు ముఖ్యమనుట నిశ్చయము.

సాధారణముగ నౌషధాదులయం దుపయోగించు పారదమునకు నైసర్గికౌపాధికదోషములు హరించుటకును, వ్యాధిహరణక్షమము కొరకును రసశాస్త్రములందు స్వేదన, మర్దన, మూర్ఛన, ఉత్థాపన, పాతన (ఊర్ధ్వపాతన అధఃపాతన తిర్యక్పాతనములు) బోధన, నియమన, సందీపన, అనువాసన ములను తొమ్మిది సంస్కారములను రసమునకు జేయవలయునని కొందరును, దీపనాంతము వరకు యెనిమిదింటిని జేయవలయునని మరికొందరును జెప్పిరి. ఇట్లు సంస్కారములను జేసినచో మొదట బెట్టిన రసములో యెనిమిదవ నంశము మిగులు ననిరి. ఎట్లనగా, రస రత్నాకరమున—

"స్వేదనాదినవకర్మసంస్కృత స్స్వష్టకంచుకవివర్జితో భవేత్
అష్టమాంశఅవశిష్యతేతదా శుద్ధసూతఇతికథ్యతేబుధైః" — అని

ఇకరసాయనము కొరకు రసమును జేయునప్పుడు పదునెనిమిది సంస్కారములు కొందరును, అనువాసనమునుగూడ జెప్పినవారు పందొమ్మిది సంస్కారములును జేయవలయునని జెప్పిరి.

"సూతస్యాష్టౌచసంస్కారాః కథితా దేహకర్మణి,
తథాచదశకర్మాణి దేహలోహకరాణిహి"

ఔషధాదులయం దుపయోగించు రసమునకు యెనిమిది సంస్కారములును దేహలోహకరముకొరకు మిగిలిన పదిసంస్కారములును జేయవలయును.

రసమునకు ఇన్ని సంస్కారములను జేయ నసమర్థులకొరకు మరియొక ప్రక్రియ జెప్పబడినది:

1. "అథవా దరదాకృష్టం స్విన్నం లవణాంబుభిస్తు డోలాయాం
రస మాదాయ యథేచ్ఛం కర్తవ్యస్తేనభైషజోయోగః"
2. "అథవా గ్రాహయే త్సూతం దరదా త్తన్నిగద్యతే,
కంచుకైర్నాగవంగాద్యై ర్విముక్తో రసకర్మణి
హింగుళాకృష్టసూతస్తు జీర్ణ గంధసమోగుణైః."
3. "నింబూరసేనసంపిష్టా త్ప్రిహరందరదాద్ధృథం,
ఊర్ధ్వపాతనయంత్రేణ సంగ్రాహోఽనిర్మలోరసః"
4. "అఖిలశోధనకేణచవై యథా సకలకంచుకదోషవివర్జితః,
బహులదోషహారోఽపిభవే త్తథా భవతిశుద్ధతమో దరదోద్భవః"
5. "హింగుళా దుద్ధృతస్సూతో భవేద్వా దోషవర్జితః"
6. "యథాషడ్గుణగంధేన జారితోరసరాజకః,
దరదాకర్షితస్సూతో గుణైరేవంవిధో భవేత్."

రసమునకు గంధకజారణాంతములగు సంస్కారములను జేయ నక్కరలేకయే పైన వ్రాసినప్రకారము దరదమునుండి ఊర్ధ్వపాతనమువలన రసమును గ్రహించిన షడ్గుణగంధకజారితరసముతో సమానమగురసము సిద్ధించునని చెప్పబడినది.

దరదాకృష్టరసముగాక రసమునే గ్రహించి స్వేదనాదినవసంస్కారములను జేసినచో అట్టిరసమునకు షడ్గుణగంధకజారణను తప్పక జేయవలయుననియు అట్లు జేయబడని రసమునకు రోగహరణము శక్తిగలుగదనియును జెప్పబడినది. రసమాధవమం దిట్లు గలదు:

"గంధకజారణారహిత స్సంశుద్ధోఽపిరసోయోగేషునయోజ్యః గదహంత్రిత్వశక్త్యనుదయాత్."

"రసగుణబలిజారణం వినాఽయం నఖిలు రుజాం హరణక్షమో రసేంద్రః"

రసము శుద్ధమైనదైనను గంధకజారణ జేయబడనిచో రోగహరణసామర్థ్యము గలుగదు గావున యోగములయందు పయోగించగూడదు.

రసమునకు ఆరురెట్ల గంధకమును జారణము జేయనిచో రసము రోగములను బోగొట్టజాలదు.

గంధకజారణాఫల మీక్రిందివిధమున శివాగమమున గలదు:

1. "తుల్యేతుగంధకేజీర్ణే శుద్ధాచ్ఛతగుణోరసః,
ద్విగుణేగంధకేజీర్ణే సర్వథా సర్వకుష్ఠహా.
త్రిగుణేగంధకేజీర్ణే సర్వజాడ్యవినాశనః,
చతుర్గుణేతత్రజీర్ణే వలీపలితనాశనః.
గంధేపంచగుణేజీర్ణే క్షయక్షయకరోరసః,
షడ్గుణేగంధకేజీర్ణే సర్వరోగహరోరసః"—

2. మతభేదము—
"సమేగంధేతురోగఘ్నో ద్విగుణే రాజయక్ష్మనుత్
జీర్ణేతుత్రిగుణేగంధే కామినీదర్పనాశనః,
చతుర్గుణేతు తేజస్వీ సర్వశాస్త్రవిశారదః
భవేత్పంచగుణేసిద్ధః షడ్గుణే మృత్యుజి ద్భవేత్."—

ఇట్టి శాస్త్రము ననుసరించియే పూర్వమునుండియు నాంధ్రదేశమున "షడ్గుణము" అనుపేరుతో రసమునకు ఆరురెట్ల గంధకమును గలిపి వాలుకాయంత్రమున మందమధ్యగాఢాగ్నులచే క్రమముగ మూడుదినములు వండి స్వాంగశీతలమున సిందూరరూపమున కుప్పెకు పైభాగమున నంటియుండు రసమును గ్రహించుటయు, అట్టిరసమును బహుసులభముగ అనుపానభేదములచే అనేకవ్యాధులయందు వాడుచుండుటయును ప్రసిద్ధమే. రసమునకు షడ్గుణగంధకజారణను జేయుటచేతనే ఆయౌషధమునకు షడ్గుణమని పేరువచ్చినది.

హింగుళాకృష్టరసము గంధజారితరసముతో సమానగుణములు గలదని పూర్వము జెప్పిన శాస్త్రము ననుసరించియే మనవారు యోగములయందు హింగుళోత్థితరసము నుపయోగించుచున్నారు.

కాని మన ముపయోగించు హింగుళము కృత్రిమముగాని-అకృత్రిమము గాదు. ఆవిధానమునంతను చివర వ్రాయుదును.

అష్టాదశసంస్కారములు జేయబడిన రసమును క్షేత్రీకరణ పూర్వకముగ శరీరక్రామణ (సేవన)ము జేసినచో జరామృత్యువులు గలుగనేరవని జెప్పిన మాధవాచార్యులవారు,

"యది కేవలం రోగఘ్నేచ్ఛాచే త్స్వేదనాదిదీపనాంతైస్సంస్కారైః రసం సంశోధ్యప్రోక్తవిధినా గంధకేన మూర్ఛయిత్వా మాత్రయాపథ్యయోగేన సంసేవ్యో యావదారోగ్యం."

రసాయనముకొరకుగాక కేవల రోగహరణముకొరకు రసమును సేవించవలసినచో స్వేదనాదిదీపనాంతములగు సంస్కారములను జేసినపిమ్మట షడ్గుణగంధకజారణవిధి ననుసరించి రసమును మూర్ఛనొందించి ('అవ్యభిచరితవ్యాధిఘాతకత్వం మూర్ఛనా' రసమునకు తప్పక వ్యాధులను హరించుశక్తి గలుగుటయే మూర్ఛన యనబడును. రసమునకు ఆరురెట్లు గంధకమును గలిపి గాజుకుప్పెలలోబోసి విధిప్రకారము వాలుకాయంత్రమున వండినచో కుప్పెల పైభాగమున నంటియుండు సిందూరరూపరసమే మూర్ఛితరస మనబడును. దీనికే మన ఆంధ్రదేశమున షడ్గుణమనిపేరు) దేశకాలబలాదుల ననుసరించి ప్రమాణానుసరణిని భక్షించి పథ్యము నాచరించుచు ఆరోగ్యము గలుగువరకును సేవించవలయునని జెప్పిరి. ఇట్టి షడ్గుణమును తిరిగి యూర్ధ్వపాతమున వండిన జారితరసము సిద్ధించును. గంధకజారణావిధాన మనేకరీతులుగ నున్నది. భూధరయంత్రము, కచ్ఛపయంత్రము, వాలుకాయంత్రము మొదలగు వాటివలన జారణను జేయుదురు. వాటినన్నిటి నిచ్చటవ్రాయుట విస్తరభీతిచే మానితిని.

"ఆరోటకమంతరేణ హింగుల గంధకాభ్యాంపిష్టాభ్యామపి సిందూర రసస్సంపాద్యః"

"యది రససిందూరం స్యాత్తదోర్ధ్వపాతనేన హింగుళవన్ని ష్కాసయేత్"

శుద్ధరసము లేనిచో హింగుళమును, గంధకమును గలిపి పిష్టినిజేసి దానివలన వాలుకాయంత్రముచే సిందూరమును జేయవలయును.

రససిందూరము సిద్ధించినపిమ్మట హింగుళమువలన పాతనాయంత్రముచే రసమును గ్రహించినట్లె సిందూరమువలనగూడ రసమును గ్రహించవలయును. అని చెప్పినందున సుగమోపాయమును మాత్రమే పైనవ్రాసినాడను. గురూపదేశ మెట్టిదనగా—

"అథరసాదౌ పాకావలేహగుటికామార్గాదౌవా రసయోగే విహితే యథావచనం సంశుద్ధో మూర్ఛితో గంధజీర్ణో హేమాదిజీర్ణోవా మృతోఽమృతో వా రసో యోజ్యఇతి గురుసంకేతః" అని.

ఇట్లుచెప్పబడుటచే షడ్గుణగంధకజారణను జేయబడని రసమును ఔషధాదులయం దుపయోగించగూడదనుట స్పష్టము. మరియు—

"అథరసాయనగుణేచ్ఛాచే ద్గంధకజారణోత్తరం హేమాభ్రసత్వాది యథావిధినం గంధకజారణోత్థితే రసే ప్రోక్తవిధివాసంసాధ్య, జార్య, మారణవిధినా హత్వా మాత్రయా క్షేత్రీకరణపూర్వకం పథ్యయోగేన మండలావధి, షణ్మాసం, వర్షైకం, ద్వివర్షం, త్రివర్షంవా సంసేవ్యః, తదా తదుక్తఫల మాప్నోతి. యావజ్జీవం సేవ్యోవా సంపత్తిశ్చేత్. యద్వాయథావకాశం పౌనఃపున్యేవసంసేవ్యః"

రసాయనము(యజ్జరావ్యాధినాశి తద్రసాయనం)ను జేసుకొనునెడల విధిప్రకారము స్వేదనాదినవకర్మసంస్కృతమగు రసమునకు షడ్గుణగంధకజారణముజేసి తన ఐశ్వర్యమునకు తగురీతిని బంగారము, అభ్రకసత్వము మొదలగువాటిని ఆ గంధజారితోత్థితరసమున జారణావిధానమున జీర్ణింపజేసి అట్టిరసమును మారణవిధానమున ఊర్ధ్వభస్మగగాని, తలభస్మగగాని జేసి రసభక్షణ కనువగురీతిని క్షేత్రీకరణమును జేసుకొనిన శరీరముగలవాడై విధిప్రకారము పథ్యము నాచరించుచు నలువదిదినములుగాని, ఆరుమాసములుగాని, ఒక వత్సరముగాని, రెండు వత్సరములుగాని, మూడువత్సరములుగాని సేవించవలయును. ఇట్లుజేసిన రసాయనయోగోక్తఫలములను బొందును. లక్ష్మీకటాక్షమున్నచో యావజ్జీవము సేవింపవచ్చును. లేనిచో తనకు అనుగునపు డెల్లను తిరిగి తిరిగి సేవించవచ్చును.

మన కిచ్చట చర్చలోనున్న "మకరధ్వజము" రసాయనము గాని వేరుగాదు. దీనియందు జేర్చు రసము గంధజారితమైనది గావలయును. అట్టిరసమునకు స్వర్ణమును జారణజేసి దానిచే యోగోక్తము గభాగములను గల్పించి యథావిధిగ రసాయనమును తయారుజేసినచో యోగోక్తఫలముల నిచ్చును.

మనవారు జేయుచుండు మకరధ్వజమున స్వర్ణము జీర్ణమగుట లేదు. బంగారము, రసము, గంధకము ఈమూటిని యోగోక్తముగ గలిపి విధిప్రకారము మర్దనాదికమునుజేసి, గాజుకుప్పెలలోబోసి, వాలుకాయంత్రమున వండినచో గంధక మెగిరిపోవును. బంగారము కుప్పెకు అడుగుభాగమున నిలుచును. రసము కుప్పెకుపైభాగమున నంటుకొనును. పైభాగమున నంటియుండు రసము సిందూరరూపమున నుండును. దీనినే మకరధ్వజమని కొందరును, దీనియందు కొన్ని యోగములలో జెప్పినరీతిని అనుపానవస్తువులనుగూడ గలిపి నూరినపిష్టిని మకరధ్వజమనియు, ఈ సిందూరమును, అడుగుననిల్చిన స్వర్ణమును, అనుపానవస్తువులనుగూడ గలిపి నూరిన పిష్టిని చంద్రోదయమనియు, మరికొందరును వాడుచున్నారు.

రసమును ఊర్ధ్వభస్మముగ గాని, తలభస్మగగాని జేయుటకు ముందు రసమునకు స్వర్ణజారణమును తప్పక జేయవలయును.

"అజీర్ణంతు అబీజంతుసూతకం యస్తుఘాతయేత్,
బ్రహ్మహా స దురాచారీ మమద్రోహీ మహేశ్వరి"

గంధకజారణచేయబడనట్టియు, స్వర్ణజారితము గానట్టియు రసమును రెవడు మారణముజేయునో అట్టివాడు బ్రహ్మహత్య జేసిన పాపమును బొందును. వాడు దురాచారి, శివద్రోహియు నగును. అని మహేశ్వరుడు పార్వతితో జెప్పినట్లు శివాగమమున గలదు.

"గంధకజారణ మాదౌకుర్యాదథజారణం సువర్ణస్య"

"రసగుణబలిజారణం వినా౽యంనఖలురుజాంహరణక్షమోరసేంద్రః సజలదకలధౌతపాకహీనస్స్వఫ్రళేతి రసాయనతామితి ప్రతిజ్ఞా"

"రసస్తు పాదాంశసువర్ణజీర్ణః పిష్టీకృతో గంధకయోగతశ్చ
తుల్యాంశగంధైః పుటితఃక్రమేణ నిర్బీజనామాసకలామయఘ్నః"

"బీజీకృతైః రక్తకసత్వహేమతారార్కకాంతైః పరిజారితోయః
హత స్తతష్షడ్గుణగంధకేన సబీజబద్ధో విపులప్రభావః"—

రసాయనమును జేయునప్పుడు గంధకజారణానంతరమున స్వర్ణజారణమును జేయవలయునని జెప్పినదానిని దృఢపరచుటకే యీ పైనవ్రాసినది వ్రాయుటకు కారణమైనది.

"శుద్ధం స్వర్ణం చ రౌప్యంచ బీజ మిత్యభిధీయతే"

శుద్ధములగు స్వర్ణరజతములకు బీజమని పేరు. గంధకజారణోత్తరమున స్వర్ణజారణమును జేసినచో రసము ముఖముగలదై సర్వలోహములను భక్షించుశక్తి గలదగును గావున ముఖకరణముకొరకు స్వర్ణజారణమును తప్పక జేయవలయును. జారణము సముఖమనియు, నిర్ముఖమనియు రెండువిధములు. రసమందు భాగప్రకారము బీజమునుగలిపి జారణనుజేయుట నిర్ముఖజారణము, రసమందు అరువదినాల్గవ భాగము శుద్ధస్వర్ణమునుగలిపి జారణజేసిన సముఖజారణము ననబడును. ఇట్లు సముఖజారణమును జేసినచో రసము ముఖముగలదై లోహాదులను భక్షించుశక్తి గలదగును.

దీని కనువాదము:

"సముఖా నిర్ముఖాచేతి జారణా ద్వివిధా పునః
నిర్ముఖా జారణాప్రోక్తా బీజాదానేన భాగతః
చతుష్షష్ట్యంశతో బీజప్రక్షేపో ముఖ ముచ్యతే
ఏవంకృతే రసో గ్రాసలోలుపో ముఖవాన్ భవేత్.

కఠినాన్యపిలోహాని క్షమోభవతి భక్షితుం
ఇయంహిసముఖా ప్రోక్తాచారణా మృగచారిణా"

—రసవాగ్భటము.

యోగోక్తములగు భాగముల ప్రకారము రసమందు బీజమును గలుపుట నిర్ముఖజారణ మనబడును. సముఖజారణావిధాన మెట్లనగా,

"చతుష్షష్ట్యంశకః పూర్వోద్వాత్రింశాంశోద్వితీయకః
తృతీయష్షోడశాంశస్తు చతుర్థో౽ష్టాంశఏవచ."

మొట్టమొదట రసమునకు 64 వ భాగము స్వర్ణమును ముందు జెప్పబోవురీతిని జారణమునుజేసి ఆ స్వర్ణము రసమందు జీర్ణమైనదని తెలుసుకొనిన పిమ్మట తిరిగి 32 వ వంతుస్వర్ణమును జారణచేయవలయును. ఇట్లే 16 వ వంతును పిమ్మట 8 వ వంతును స్వర్ణమును రసమందు జారణము చేయవలయును. ఇట్లుచేసినచో రసములో నాల్గవభాగము స్వర్ణమును జీర్ణింపజేయవలయునని పైనవ్రాసిన శాస్త్రానుసారముగ కొంచెముతక్కువగ నాల్గవవంతు స్వర్ణము జారితమగును. (తులము రసమునకు కాని తక్కువ పావలాయెత్తుస్వర్ణము జారితమగును)

"అన్యత్తు దుర్ఘరత్వాన్న లిఖితం" అని స్పష్టముగ రసమాధవమున జెప్పియుండుటచేతను, తాను గురుముఖమున స్వయముగ జేసి జూచిన దానినే వ్రాసినానని మాధవాచార్యులు జెప్పియున్నందునను రసమందు స్వర్ణము పాదాంశముకంటె యెక్కువ జీర్ణముగాదని నిశ్చయముగ నమ్మవలయును.

రసమందు స్వర్ణమును జీర్ణింపజేయు టెట్లనగా,

"చతుష్షష్ట్యంశకం హేమపత్రం మాయూరమాయునా
విలిప్తం తప్తఖల్వస్థే రసే దత్వా విమర్దయేత్
దినం జంబీరతోయేన గ్రాసే గ్రాసేత్వయం విధిః
శనైస్సంస్వేదయేదూర్ధ్వభజ్ఞేబధ్వాసపటుకాంజికే
భాండకే త్రిదినంయావత్ జీర్ణ స్వర్ణంసముద్ధరేత్
అధిక స్తోలిత శ్చేత్స్యాత్పున స్స్వేద్యస్సమావధి
ద్వాత్రింశత్షోడశాష్టాంశక్రమేణవసు జారయేత్"

నెమలిచేదుచే పూతపెట్టబడిన అతిమృదువులగు బంగారురేకులను రసమునకు 64 వ భాగమును గ్రహించి వీటిని తప్తఖల్వస్థమగు రసమున గలిపి ఒకదినమంతయు నిమ్మపండ్లరసముచే మర్దించిన యీ రసమును భూర్జపత్రములయందు బంధించి సైంధవలవణముతో గూడిన కాంజికమందు మూడుదినములు స్వేదనముజేసి జీర్ణస్వర్ణమగు ఆరసమును దీసితూచినచో గ్రాసమానము హరించి రస ప్రమాణము మాత్రమే తూగవలయును. అట్లుగాక రసప్రమాణముకంటె హెచ్చుతూనికవచ్చినచో స్వర్ణమంతయు రసగర్భమున పూర్ణముగ జీర్ణముగాలేదని గుర్తెరింగి పూర్ణముగ స్వర్ణము జీర్ణమై రసముమాత్రమే తూనికయందు మిగులువరకును పైప్రకారమే స్వేదకర్మము జేయవలయును. ఇట్లు ప్రథమగ్రాసము పూర్ణముగ జీర్ణమైనచో రసమునకు ముఖముగలిగి సమస్తలోహములను సులభముగ భక్షించును. కావున ప్రథమగ్రాసజీర్ణానంతరమున 32 వ వంతును, 16 వ వంతును, 8 వ వంతును స్వర్ణమును పైప్రకారమే రసమందు క్రమముగ జీర్ణింపజేయవలయును.

ఇటుల స్వర్ణమును జీర్ణింపజేసిన రసముతో నౌషధములను జేసినచో యోగోక్తఫలముల తప్పక నివ్వగలవు. గాని చేయవలసిన
















౧. శ్రీమతి దుగ్గిరాల కమలావతిగారు(కి) ౨. (ఎ) శ్రీమతి తూము రాఘూరావుపంతులుగారిసతి(కి) (బి) శ్రీమతి చేబియ్యం సోమయ్యగారిసతి(కి)
౩. శ్రీమతి పాదర్తి సుందరమ్మగారు (కి) ౪. శ్రీమతి కోటమర్తి కనకమహాలక్ష్మమ్మగారు (కి) ౫. శ్రీమతి పి. సుభద్రమ్మగారు (కి)











౧. (ఎ) శ్రీమతి తూముల చంద్రమ్మగారు (కీ) (బి) శ్రీమతి తూముల దుర్గాంబగారు (కీ) (సి) శ్రీమతి కలిదిండి సీతాయమ్మగారు (కీ)
౨. (ఎ) శ్రీమతి జి. తాయారమ్మగారు (కీ) (బి) శ్రీమతి పొణకా కనకమ్మగారు (కీ) (సి) శ్రీమతి ఓరుగంటి మహాలక్ష్మమ్మగారు (కీ)
౩. శ్రీమతి తల్లాప్రగడ విశ్వసుందరమ్మగారు (కీ). ౪. శ్రీమతి కొవ్వలి కనకమ్మగారు ౫. శ్రీమతి సరళాదేవిగారు.

సంస్కారముల నన్నిటిని జేయకనే యౌషధములలో రసమునువాడిన చేసిన శ్రమకు తగినఫలమే గలుగును.

స్వర్ణ జారణను జేయకనే జేయబడుచుండు "షడ్గుణ" మని మనవారు వాడెడి గంధజారితరససిందూరమున కెట్టి గుణములు జెప్పబడినవో జూడుడు.

"అపహరతి రోగబృందం దృఢయతికాయం మహద్బలంకురుతే,
శుక్రశతాని చ సూతే సిందూరాఖ్యోరసః పుంసాం."

మరియు,

"స్మరసాత్మ్యయూనాం నాగదగహనదావానలశిఖా
పరంపుంస్త్వే జో బలరుచిరతావల్లి ముదిరః
అపి ప్రౌఢస్త్రీణాం మహంలబలహారీ నిధువనే
రససిందూరాఖ్యస్సకలరసరాజో విజయతే"

కేవల షడ్గుణమునకే యిట్టి శక్తి గలుగుచుండగా స్వర్ణ జారిత రసముతో జేయబడిన మకరధ్వజము (చంద్రోదయము) యోగోక్త ఫలముల నిచ్చుననుటలో అతిశయోక్తి లేదు.

పైన వ్రాసిన విధమున రసమందు స్వర్ణమును జీర్ణింపజేసి దానితో మకరధ్వజ-(చంద్రోదయ)-మును జేసినచో తులమునకు ఎనుబది రూప్యములు గాదుగదా నూరురూప్యము లిచ్చినను అశ్రమకు గిట్టదు. కవిరాజెట్టి రసముచే జేయుచుండిరో? తక్కినవారంపరును స్వర్ణమును దీసివేసిన సిందూరమునే వాడుచున్నారు. కొందరు ఒకవంటను, కొందరు మూడువంటలను జేయుచున్నారు. వీటిలో ఒక్కవంట చేయబడిన దానికంటె మూడువంటలు కాబడినది గంధక మెక్కువ జీర్ణమగుటచే యెక్కువ ఫలకారిగ గనబడుచున్నది. రసగంధకసమ్మేళనముచే జేయబడిన సిందూరముకంటె స్వర్ణము జీర్ణముగాకపోయినను స్వర్ణమును గూడగలిపి జేయబడిన యౌషధ మెక్కువ ఫలకారిగ నున్నది.

సిద్ధమకరధ్వజమున రసమునకు సగము భాగము స్వర్ణమును గలుపవలయునని యున్నది. దీనియందు జేర్చురసము బహుసంస్కారసంస్కృతమైనది గావలయును. అట్టి సంస్కారములలో రసమునకు అభ్రకసత్వమును జారణజేసి పక్షచ్ఛేదమును తప్పక జేసి యుండుట గూడ జేరి యుండనిచో దీనియందలి స్వర్ణముగూడ విడిపోవునుగాని రసమందు జీర్ణముగానేరదు. మొత్తము పాదాంశముమాత్రమే నాలుగు గ్రాసములుగా యివ్వవలయునని జెప్పి "అన్యత్తుదుర్జరత్వాన్న లిఖితి"మని స్పష్టముగ జెప్పియుండుటచే స్వర్ణము జీర్ణమగునేమోయని భ్రమపడ నక్కరలేదు.

అభ్రకసత్వజారణముజేసి రసపక్షచ్ఛేదనమును జేసినచో ఆరసముచే జేయబడు నౌషధము కుప్పెయొక్క పైభాగమం దంటుకొనక క్రిందిభాగమందె యుండును. ఎందుచే ననగా,

"బంధనంతు స్వాభావికద్రవత్వే సతి వహ్నినా అనుడ్డీయమానత్వం"

బంధనమనగా స్వభావమగు ద్రవత్వముతో గూడియుండి వహ్నియందుంచిన పైకెగరక నిలిచియుండుట. అట్టి రసమునకే బద్ధరసమని పేరు. అయ్యది అభ్రకసత్వజారణను వినా సిద్ధించనేరదు. ఆవిధానమునంతను నిచ్చట వ్రాయుటకంటె శాస్త్రమందు జూచుకొనుటయే యుత్తమమని వ్రాయమానినాడను. అట్టి బద్ధరసమందు బంగారును సగము గలిపినను విడిపోక రసముతో మిళితమై యుండును.

"లోహం సూతయుతం దోషాం స్త్యజేత్ సూతశ్చ లోహయుక్"

లోహౌషధములయందు రసమును గలిపిన దోషరహితమగు లోహౌషధము సిద్ధించుననియు, రసౌషధములయందు లోహమును గలిపిన నిర్దుష్టరసౌషధము సిద్ధించుననియు జెప్పబడుటచే రసమందు స్వర్ణము జీర్ణముగాకపోయినను రసము నిర్దుష్టమైనదగును గావున అట్టి రసము స్వర్ణమునుగలపని రసముకంటె యెక్కువ ఫలకారి కాగలదు. పాశ్చాత్యరసాయనశాస్త్రజ్ఞులు రసమున స్వర్ణమెప్పటికిని జీర్ణముగాదనియు, గంధకముతో గలిపి వండునప్పుడు రసమెగిరి స్వర్ణభాగమున విడుచుననియు జెప్పుదురు. వీరికి మన రసశాస్త్రమున రసమునకు జెప్పబడిన సంస్కారములు మెండలైనవి తెలియవేమో? ఈవ్యాసము దిద్దిన ప్రమాణవాక్యము లెట్టివనగా,

"అశ్రౌమంబహువిదుషాం ముఖాదపశ్యం
శాస్త్రేషు స్థిత మకృతం నతల్లిఖామి,
యత్కర్మవ్యరచయదగ్రతోగురూణాం
ప్రౌఢానాం తదిహ వదామి వీతశంకః"

నేను పెక్కురు పండితులవలన వినినదానివిగాని, శాస్త్రములయందు జూచినదానినిగాని స్వయముగ జేసిజూడకనే దీనియందు వ్రాయలేను. పరిపూర్ణులగు గురువుల సముఖమున నేను జేసిజూచిన దానినే యాగ్రంథమున నిస్సంశయముగ వ్రాయుచున్నాను. అని గ్రంథకర్త రసమాధనమున ప్రతిజ్ఞను జేసియుండుటచే ఇదివరకు జెప్పిన స్వర్ణజారణాదు లన్నియు యథార్థమైనవే యనియు, పాశ్చాత్యమతము మన కసమ్మతమనియు జెప్పుట స్వభావమే.

ఇంతవరకు చర్చించిన యీచర్చయొక్క ఫలితాంశమేమనగా మన కిచ్చట చర్చలోనున్న మకరధ్వజమును మూడురీతులుగ జేయవచ్చునని ధ్రువపడుచున్నది.

1. నిర్ముఖజారణావిధానమున జెప్పబడిన విధముగ భాగముల ప్రకారము బంగారము, రసము, గంధకము మూటిని గలిపి యోగోక్తములుగ మర్దనభావనాదికముజేసి మందమధ్యగాఢాగ్నులచే మూడు దినములువండి స్వాంగశీతలమున దీసినప్పుడు కుప్పెపైభాగమున నంటియుండు సిందూరమే మకరధ్వజము. దీనియందు స్వర్ణము విడిపోవును. ఇయ్యదియే తులము రెండురూపాయిలు మొదలు వారివారి యిష్టము వచ్చినట్టుగ ఖరీదులు వేయబడినదియు, మనవారు విస్తారముగ వాడు

చుండునదియును, మరియును రసమునకు ఆరురెట్లు గంధకమును మూడు సమానభాగములుగ మూడుసార్లు రసమున గలిపి పై ప్రకారమే మూడునంటులు జేసినదానిని "షడ్గుణబలిజారిత మకరధ్వజ"మను చున్నారు.

2. సముఖజారణావిధముగ రసమందు బంగారమును పాదాంశ మును జీర్ణింపజేసి అట్టిరసములో యోగోక్తమర్దనాదిపాకాంతవిధు లను జేసినచో అయ్యదియును కుప్పెకు పైభాగముననే సిందూరరూ పమునకుండును గాని కుప్పెకు అడుగుభాగమున స్వర్ణము రసములో వేరైయుండక పై సిందూరించిన రసమందే లీనమైయుండును. దీనికి రెండుబదిరూపాయిలు కాదుగదా నూరైనను యివ్వనచ్చును.

3. రసమునకు షడ్గుణబలిజారణానంతరమున అభ్రకసత్వ మును విధిప్రకారముగ జీర్ణింపజేసి పిమ్మట స్వర్ణమును జారణజేసి యోగోక్తముగ మర్దనాదికమునుజేసి పాకమునుజేసిన కుప్పెకు అడుగు భాగముననే రస స్వర్ణములు రెండును సిందూరించి యుండును గాని కుప్పెపైకి యెగుర వేరదు.

ఈపైన వ్రాసిన మూడువిధములలో ఒకదానికంటె నొకటి ఉత్తరోత్తరముగ అనేకరెట్లు గుణముల నెక్కువగ నిచ్చును.

మొదటిది వ్యాధిహరణమందును, రెండవది రసాయనమం దును, మూడవది జీవలోహకరణమందును ఉపకరించును.

ఇట్లు నాకు తెలిసినంతవరకును మకరధ్వజమునుగూర్చి వ్రాసి నాడను గావున సహృదయులై సావకాశముగ బరిశీలించి తప్పులున్న తెలుప పండితలోకమును గోరుచున్నాడను.

ఇక హింగుళమునుగూర్చి కొంత చెప్పవలసియున్నది. అయ్యది యే మకరధ్వజమీమాంసకంటెనుగూడ ప్రస్తుతకాలమున నెక్కువ మీమాంస్యమని దీనిని చూచినవా రనకపోరని నావిశ్వాసము. రసశా స్త్రములయందు హింగుళశబ్దముకంటె దరదశబ్దమునే హెచ్చుగ వాడి నారు. రసము భూమియందు కూపములలోను, మట్టిలోను గూడ దొరు కును. కూపములలోని దానిని రసరూపముగనే గ్రహించవచ్చును. దానికి స్వేదనాదినవకర్మలును జెప్పబడినవి. మట్టినుంచి యూర్ధ్వ పాతనమున రసమును గ్రహించినచో స్వేదనాదినవసంస్కారములను గంధజారణమును గూడ బొందిన రసముతో సమానమగు రసము సిద్ధించును.

హిమాలయపర్వతములకు పశ్చిమదిగ్భాగమున గిరీంద్రమను పేరుగల పర్వత మున్నదనియు, ఆపర్వతమందు రసకూపముగలదనియు రసాహరణముకొరకు రూపయౌవనసంపన్నురాలగు కన్యక అలంక రించుకొని, అశ్వారూఢయై రసకూపమును తొంగిచూడగనే ఆరసము ఆచిన్నదానిని హరించు తలంపున పైకిపొంగి పారలి పర్వతమునకు చుట్టును ద్వాదశయోజనముల విస్తారమగు భూమినిండ బడి ఆమట్టి లో కలసిపోయినదనియు, ఆ మట్టిని పాతనాయంత్రమున వండినచో దోషవర్జితమైనట్టియు, స్వయంభువమగు రసము సిద్ధించుననియును "రసప్రకాశ సుధాకర"మున రసోత్పత్తి వర్ణనమున జెప్పబడినది ఇచ్చట మనకు కావలసినది యీకథ యెంతమట్టుకు నిజము, ఎంతవరకు నమ్మతగినది అనికాదు, మట్టినుండి రసమును గ్రహించుటయే. ఇయ్యది యే దరదదేశము కావచ్చును. ఇట్టికథయే రసవాగ్భటమునగూడ గలదు. కథను విడిచి దరదమును గురించిన దానిని మాత్రము వ్రాయు దును.

"పతితోదరదే దేశే గౌరవాద్వహ్నినిక్షిప్తః, సరసోభూతలే లీనః తత్తద్దేశనివాసినః, తాంమృదంపాతనాయంత్రే క్షిప్త్వానూతం హరంతిచ"

ఈశ్వరునిచే వహ్నిముఖమం దుంచబడిన రసము (శివవీర్యము) బరువువలన దరదదేశమందు బడిపోయి ఆదేశమందలి మట్టిలో లీనమై పోయినది. ఆయా దేశస్థులు రసము లీనమై యున్న దరదదేశమంది లి యా (దరదమును) మట్టినితెచ్చి పాతనాయంత్రమువలన రసమును దీసుకొందురు. ఇచ్చట స్పష్టముగనే దరదశబ్దమునకు దరద దేశమందలి రసము లీనమైనట్టి మట్టియని చెప్పుటయే సర సముగ గనపట్టుచున్నది. ఇయ్యది అకృత్రిమదరదము.

మనకిప్పుడు హింగుళమను పేరుతో వాడబడు దరదాపరపర్యా యముగల ఇంగిలీకము కృత్రిమముగాని అకృత్రిమముగాదు. అకృత్రి మహింగుళము నుండి దీయబడిన రసమే స్వేదనాదినవసంస్కారము లను, గంధజారణమును బొందిన రసముతో సమానమైనదిగాని కృత్రి మహింగుళాకృష్టరస మట్టిదిగాదు. కృత్రిమహింగుళ విధాన మెట్లనగా, రసపద్ధతియందు:

"అశుద్ధపారదంభాగం చతుర్భాగంచ గంధకం, ఉత్క్షిప్త్వా లోహపాత్రే క్షణం మృద్వగ్నినా పచేత్, తస్మిన్మనశ్శిలాచూర్ణం పారదా ద్దశమాంశకం, క్షిప్త్వాచాల్యమయోదర్వ్యా హ్యావతార్యం సుశీతలం, తతస్తుఖండశః కృత్వాకాచకూప్యాం నిరుధ్యచ, వస్త్ర మృత్తికయాసమ్యక్కాచకూపీం ప్రలేపయేత్, సర్వతోఒంగులమా నేన ఛాయాశుష్కం చకారయేత్, వాలుకాయంత్రగర్భేతు దినం మృద్వగ్నినా పచేత్, క్రమవృద్ధాగ్నినా పశ్చాత్పచేద్దినపంచకం, సప్తాహోత్థసముద్ధృత్య హింగులస్స్యాన్మనోహరః"—

ఇట్లు హింగుళవిధానము జెప్పబడినది. ఈకృత్రిమహింగుళము కొరకు గలిపినరసము అశుద్ధమైనదని కంఠోక్తిగ జెప్పబడియేయున్నది. ఇట్టి హింగుళమునుండి గ్రహించినరసమే శుద్ధమైనదనుచో నియమ వాంతసంస్కారములను గంధజారణనుజేసి శ్రమపడుటకంటె అశు ద్ధరసముచే హింగుళమునుజేసి పిమ్మట పాతనాయంత్రమువలన రస మును గ్రహించుట సులభముగదా! కావున రసశాస్త్రమందు యీ

కింటికిని భేదమున్నదా? లేదా? అని విచారించుట అవసరము. మరియు అట్టి కృత్రిమహింగుళోత్కృష్టరసమే శుద్ధమైనదగునో రసశుద్ధి కొరకు చెప్పబడిన సంస్కారములన్నియు వ్యర్థములేయగును. మకరధ్వజనర్చయందు హింగుళోత్కృష్టరసము శుద్ధమైనదని చెప్పినప్పుడు ఆరుమతములను జూపితిని. వారిలో ఐదుగురు దరదశబ్దమునే వాడినారు. ఒక్కరుమాత్రమే హింగుళశబ్దమును వాడినారు. ఆహింగుళశబ్దమునకు గూడ దరదమే యర్థమగునుగాని కృత్రిమహింగుళము గానేరదు. దరదపర్యాయపదములలో హింగుళముగూడ నొక పదమగుటచే దరదపర్యాయపదముగానే అచ్చటగూడ హింగుళశబ్దము వాడబడినది. దరదపర్యాయపదములు—

" హింగుళం దరదం మ్లేఛం హింగుల శ్చూర్ణపారదం
సురంగం రసగర్భంచ బర్బరం రక్తమప్యథ"

ఇచ్చటగల, దరదమ్లేఛబర్బరశబ్దములు దేశవాచకములు. మ్లేచ్ఛదేశము హిమవంతమునకు పశ్చిమ దిగ్భాగమున గలదనుట నిశ్చయము గావున రసవాగ్భటరసప్రకాశసుధాకరాదులయందు చెప్పబడిన దేశ మయ్యదియే. ఆ దేశమందలి రసగర్భమగు మట్టియే దరదము. దీనికి హింగుళ మను పర్యాయపద ముండుటచేతనే రానురాను కృత్రిమాకృత్రిమభేదము నశించి హింగుళమన్నను, దరదమన్నను, వేయేల, దరదపర్యాయపద మెచ్చట వచ్చినను కృత్రిమహింగుళమే వాడబడుచున్నది.

కృత్రిమాకృత్రిమహింగుళములకు గుణములు గూడ వేరువేరుగనే రసగ్రంథములయందు గలవు. అకృత్రిమహింగుళమును గురించి రసవాగ్భటమున నిట్లు గలదు:

" హింగుళ స్సర్వదోషఘ్నో దీపనోఽతిరసాయనః
సర్వరోగహరో వృష్యో జారణాయాఽతిశస్యతే"

" దరదః పాతనాయంత్రే పాతితశ్చ జలాశ్రయే
తత్సత్త్వం సూతసంకాశం జాయతే నాఽత్రసంశయ"—

జారణావిధానమున నెక్కువగ యుపయోగించుననియును, దీని నుండి సూతతుల్యమగు సత్త్వమును పాతనాయంత్రమువలన దీయవచ్చుననియు నున్నది.

రసమాధవమున—

"తిక్తంకషాయం కటుహింగులం స్యాన్నేత్రామయఘ్నం కఫపిత్తహారి, హృల్లాసకుష్ఠజ్వరకామలాశ్చ ప్లీహామవాతౌచ గరం నిహంతి" అనియును చెప్పబడినది. మరియును రసమాధవమున అకృత్రిమదరదమునకు మారణవిధిగూడ యీ విధముగ గలదు:

"హింగులం తనువస్త్రకంచుకగతం కృత్వాఘటరంజనకందమధ్యస్థం కృత్వా, మృదాసంవేష్ట్య, పుటపాకవిధానేన దశవనోపలైః పుటేత్. ఏవంశత పుటాని; తతశ్శతపుటాన్యేవంచవన్యంతాకస్య, తతశ్శతపుటాన్యేవం మందారపలస్య, తతశ్శతపుటాన్యేవ మింద్రవారుణికాఫలస్య, తతశ్శతపుటాన్యేవ మమ్లవేతసఫలస్య, జాతసిద్ధో తశ్చాఽత్యరుణవర్ణో భవతి. రక్తికైకామస్యపర్ణఖండేన త్రిగంధాదిసువర్ణద్రవైర్యథాలాభం భక్షయేత్. ద్విగుణాగ్నిర్ద్విగుణాకామః కాసశ్వాసజ్వరక్షయాదినాశశ్చ" ఇట్లు విశేషముగ చెప్పి పిమ్మట,

" తిక్తోష్ణం హింగులం దివ్యం రసగంధసముద్భవం
మేహకుష్ఠ హారం రుచ్యం బల్యం మేధాగ్నివర్ధనం"

రసగంధసముద్భవమగు కృత్రిమహింగుళగుణముల నీ పైరీతిగ చెప్పినాడు. ఇచ్చట రెండురకములగు హింగుళము గలదనియు, అందొకటి అకృత్రిమము, మరొకటి కృత్రిమమనియును స్పష్టముగ నే చెప్పబడినది. గావున హింగుళోత్కృష్టరసమనిన అకృత్రిమదరదమునుండి పాతనాయంత్రమువలన సత్త్వరూపముగ వచ్చురసమును గ్రహించవలయునే గాని కృత్రిమహింగుళమునుండి రసముదీసి వాడరాదనుట నిశ్చయము. ప్రస్తుతము అకృత్రిమహింగుళము దొరుకుటలేదు గావున రసమును దెచ్చి అనువాసనాంతములగు తొమ్మిది సంస్కారములచే శుద్ధిపరచి పిమ్మట గంధకజారణజేసి ఔషధాదులయందు వాడుకొనుట యుత్తమము.

ఈ వ్యాసమందు గుణములేమైనయున్నచో వాటిని గ్రహించి దోషములను నాకెరింగించుటకు సహృదయపక్షపాతులగు పండితులను సవినయముగ గోరుచు యింతటితో విరమించుచున్నాను.

ఇతిశివమ్.



# "అత్తవారింటి కనుపుట"

బొడ్డు బాపిరాజు గారు

కంటికి ఱెప్పవోలె నినుఁ గన్నది యాదిగఁ బెంచినార మ
న్నింట సమర్థుఁడౌ మగఁడు నీదు సదృష్టమునన్ లభించె నే
తెంట మెఱుంగరాక ధనధాన్యములన్ దులఁదూఁగుచుండి మా
కంటికిఁ జల్వలం బిడుచు కాఁపురమున్ గయిసేయు మమ్మరో!

పట్టి! "సుశీల, సాధ్వి, హితవర్తన" యంచు జనుల్వచింప నె
ప్పట్టున నత్తమామలకు బత్తి సపర్యలు సేయుచుండి బల్
దిట్టతనానఁ గాఁపురము దిద్దుచు నీదగు పుట్టినింటికిన్,
మెట్టినయింటికిన్ జిరము మేటియశమ్మును దెమ్ము పుత్రికా!

తల్లీ! యిన్నిదినాలనుండి నిను నత్యంతంబు గారాముతో
నల్లారుం గడుముద్దుగా నడుగుటే యాలస్య మౌనట్లు నీ
కుల్లంబైనవి గూర్చినార మిఁక నయ్యోగ్యుం బతిం గూడి మా
కుల్లాసంబుగ బిడ్డలం గని సతం బొప్పారుమా సాధ్వివై!

అత్తమామలయెడ బత్తి గల్గి మెలంగు సవతులయందు మాత్సరము విడువు
బావలఁ గడుగౌరవంబునఁ బొడఁగాంచు మఱఁదులయందు నాదరము నెఱపు
ఆఁడుబిడ్డల కెప్పు డణఁకువతో నుండు సఖులయందున మైత్రి సంఘటింపు
పరిజనమ్ములఁ బ్రేమభావమ్మునను మించు కలచుట్టములఁ బ్రీతి గారవింపు
కలిమి గల దంచు గర్వింపవలవదెపుడు-విభుఁడు ప్రేమించెనని విఱ్ఱవీఁగఁ జనదు
తరుణులకు నీదుచరిత మాదర్శమగుచు-వెలయఁ బ్రఖ్యాతిఁ గని మాకుఁ బేరు దెమ్మ!

చదివితివి గ్రంథములు చాల మది నెఱింగి-మగని కనుగుణమగురీతి మసలుమమ్మ!
ఏమొ? కన్నప్రాణమగుట నింతసేపు-చెప్పితిని కాని నీకొరుల్ జెప్పవలెనె?

నెమ్మది నిట్టులాడు జననీవచనమ్ముల నాలకించి లోఁ
గ్రమ్మిన బెంగచే నెలుఁగు జూపడ నేత్రయుగంబు బాష్పపూ
రమ్ములఁ జిమ్మఁ బయ్యెదచెఱంగున నద్దుచుఁ దల్లిఁ జేరి నె
య్యమ్మునఁ గౌఁగిలించి వగనాఁగక నాపురు మంచు నేడ్చినన్.

"ఊఱడిలు మింకనాతల్లి! యూఱడిల్లు-మెటులు కనులుబ్బెనో చూడు మెఱ్ఱఁబడియె!"
అనుచు నోదార్పఁ బెంపొందు నశ్రుజలము-నిద్దపుం జెక్కుటద్దాల నిండిపారలె.

బిట్టు వాపోవుచున్నట్టి పట్టిఁ గాంచి-యుప్పతిల్లెడు చింత పై కుబుకనీక
తనకుఁ దా ధైర్యమును దెచ్చుకొని కుమారి-వైపు గన్గొని యిట్లని పలికె నాపె.

ఎందుకే బెంగఁ గొనఁగ? నెంతేని ప్రీతి-నరయఁగలవారు వారు మేమడప దడప
వచ్చి చూచిపోయెదము రావలయునన్నఁ-జదువురాని దానవటె? కానంతయుత్త
రమును వ్రాయఁదీసికొనివత్తుముగ దమ్మ!- నేనో మీనాయనయొ వచ్చి నెమ్మిగలుగఁ
జిన్నదానవె? మొన్న నీచెలిమికత్తె-యైన రాధమ్మ యత్తింటి కరుగునపుడు
నీవలెనె యేడ్చినదె? చాలు! నేఁడో రేపో-కాఁపురము సేయఁగా నత్తగారియింటి
కరుగకయె తప్పునా? యన్ని యెఱిఁగినావు

మక్కువఁగల్గి నీమగఁడు మన్ననఁ జేసెడి నత్తగారు పెం
పెక్కిన ప్రేమతో నరయ నింటిపనుల్ సవరింప సేవకుల్
పెక్కురు నుండి రేకొఱఁత లేక ననారతమున్ సుఖింపనా
నిక్కడికంటె నక్కడనె యెంతయు నా వచనమ్ము నమ్ముమా!

నా రతనాలతల్లిరో! మనమ్మున నిట్లడలంగ నేల నె
వ్వారును జూడఁబోరు నినువంటిచెలిన్ విభుఁ జేరనేఁగుచోఁ
దోరపునెమ్మి నుండ వలదో యిఁకఁజాలు నవెన్నొ సంగతుల్
నేరిచినట్టిదాన విది నేరవటమ్మ కుమారికామణీ!

కలకాలంబు మనోహరుం గలసి విఖ్యాతంబులౌ ధర్మముల్
సలుపంగాఁ దగునన్న మాట చదువుల్ రానట్టివారే మదిన్
దెలియంగా నినుఁబోలె నన్నియును నెంతే నేర్చు కాంతామణుల్
దెలియన్ లేరె? విచారము న్విడిచి తెల్విం బూనుమా తల్లిరో!

తల్లియుఁ దండ్రియున్ గురుఁడు దైవము చుట్టము స్నేహితుండుఁ దా
నెల్లయు భర్తయే యని గణించి పతివ్రతయౌచు వానిదా
నుల్లము రంజిల న్సలుపుచున్న నిహమ్ము పరమ్ము రెండునున్
గొల్ల గొనం దగుంగదవె కూఁతుర పుట్టుకకున్ ఫలంబుగా!

వచ్చుచున్నది సంక్రాంతిపండుగయును-నాఁటి కాతని నినుఁ బదినాళ్ల పాటు
తోడుకొనివచ్చి యుంచుకొందుముగదమ్మ!-మాను మిఁకనీదు బెంగ నామాటవినుము

తలనొప్పి యన నమృతాంజనమును దెచ్చి యెవ్వారు రుద్దుదు రిఁకపైన?
చెలులతోఁ గూడి బొమ్మలపెండ్లి గావించి పేరంటమున కేరు పిలుతు రింక?
వల దన్న మానక బలవంతమున సిగ పువ్వులు ముడుచువా రెవ్వ రింక?
ఒకపూఁట భుజియింపకున్న నోట్టులు పెట్టి బతిమాలువార లెవ్వరిఁకపైన?

పనులకును సాయపడుదు రెవ్వ రిఁకమీఁద-అమ్మ! నాకుమాత్రము విచారమ్ములేదె?
కాని, నీవంటిదానను గానె మునుపు?-నాకు నిది యత్తవారిల్లెకా కుమారి!

అనుచు నోదార్చి నీతివాక్యములఁ దెలిపి- అక్కునంజేర్చి లాలించి యాత్మవిభుని
ప్రేమ వర్ధిల్లు మనుచు దీవెనలు సేసి-అత్తవారింటి కనుప నాయత్తపఱచె

*    *    *    *    *

మగనిఁగన నౌనటన్న సంబరము గొంత-ముందునకుఁ ద్రోయఁ గడలేని పుట్టినింటి
ప్రేమ వెనుకకులాఁగ నాకోమలిమది-వింతయుయ్యాల లూఁగె నొకింత సేపు.

*    *    *    *    *

"ఇప్పు డత్తవారి ల్లని చెప్పుచుండెఁ-గొంత కాలము సనినయనంతరమ్మ
బిడ్డపాపలఁగాంచి యీదొడ్డరాలు-నదియె మాయిల్లటంచుఁ దా ననఁగఁ బోదొ?

కనమే యీమమతలు మన-వనజేక్షణ విభునిఁగూడి వసియించెడిచో
మనమాట తలఁపు గల్గునె?"-యనివేళాకోళ మాడి రంతట సకియల్

చెలులమాటకు లోలోన సిగ్గుఁ జెంది-యన్నదమ్ములఁ జెల్లెండ్రఁ గన్నవారిఁ
బాయఁగావలెనను బెంగ పాయకునికి-ముదము విడి బండినెక్కె నాముద్దరాలు.

భద్రమనిచెప్పి యొక కొంతవఱకు బండి-వెనుక నేతెంచి యుత్తరమును మఱవక
వ్రాయుమని కనుకొలకుల బాష్పకణము-లురల నేనుందునని చెప్పి మరలె నాపె
కడుపులోపలఁ జేపెట్టి కలఁచినట్టు-లగుచు బిడ్డను బాసి యాయమ్మ మోము
తెల్లవో నింటఁబడి దురపిల్లఁ జొచ్చె-వేఱులై మేరమీఱి కన్నీరు పాఱ
కన్న కూఁతురు చిన్నియలెన్నుకొనుచు

సదమలంబగు మాతృవాత్సల్యమునకు-సరయఁ బదునాల్గుభువనమ్ములందుఁగూడఁ
దుల్యమైన పదార్థంబు దొరకుటరిది-యనుచు ముమ్మాటికిం జెప్పనగును గాదె !!!



# వారప్రవృత్తినిర్ణయము

నూరి రామసుబ్బరాయశాస్త్రిగారు

౧

"ఉదయా దుదయం వారం" అను వాక్యము ననుసరించి సూర్యోదయమునుండి సూర్యోదయపర్యంత మగు కాలము సావనదిన (Solar day) మని చెప్పఁబడుచున్నది. అనఁగా సూర్యోదయద్వయాంతర కాల మగు షష్టిసావనఘటీప్రమాణకాల మొక్కదిన మనఁబడుచున్నది. పాశ్చాత్యాచారమునందు నర్ధరాత్రము నుండియే వాసరారంభమనియుఁ దత్సమయమునుండియే క్రొత్తతేదీ ప్రారంభమనియు స్వీకరింపఁబడుచున్నది. ఈ విషయమునందుఁ గల శాస్త్రప్రమాణమును వివరించుచున్నాను.

అనాద్యనంతమగు కాలముయొక్క ప్రవృత్తి బ్రహ్మగుప్తసిద్ధాంతమునందు

శ్లో. చైత్రసితాదే రుదయా ద్భానో ర్దినమాసవర్ష యుగకల్పాః,
సృష్ట్యాదౌ లంకాయాం సమం ప్రవృత్తా దినేఽర్కస్య.

చైత్రశుద్ధపాడ్యమీ రవి వాసరమునందు లంకాపురమున సూర్యోదయమగు సమయమున సృష్టి యారంభమగుటచేఁ దత్సమయమునుండియే దినమాసవర్ష యుగకల్పము లారంభమయ్యె నని చెప్పఁబడినది. వాసిష్ఠాది సిద్ధాంతములందును లంకాపురోదయసమయముననే సృష్ట్యారంభమని చెప్పఁబడినది. సౌరమతమునందు లంకార్ధరాత్రకాలమున సృష్ట్యారంభమని చెప్పఁబడినది.

విష్ణుధర్మోత్తరపురాణాంతర్గతమగు బ్రహ్మసిద్ధాంతమునందు భగవద్భృగు సంవాదమున భగవద్వాక్యము:—

"లంకాయామర్కోదయే చైత్రశుక్లప్రతిపదారంభే అర్కదినాదావశ్విన్యాదౌ కింస్తుఘ్నాదౌ రాత్ర్యాదౌ కాలవృత్తిః"

అని లంకోదయకాలమునుండియే కాలప్రవృత్తి యని చెప్పఁబడినది. ఇదియే బ్రహ్మగుప్తభాస్కరాద్యాచార్యులచేతను స్వీకరింపఁ బడినది. సృష్ట్యారంభమున లంకాదేశమున నుదయమయ్యెనని చెప్పఁబడుటచేఁ దత్సమయముననే సర్వదేశములందును వాసరారంభమని యర్థము. ఇట్లే శ్రీపత్యాచార్యులచేతను

శ్లో. సృష్టేర్ముఖే ధ్వాంతమయే హి విశ్వే
గ్రహేషు సృష్టేష్వినపూర్వకేషు,
దినప్రవృత్తి స్తదధీశ్వరస్య
వారస్య తస్మా దుదయా త్ప్రవృత్తిః.

అంధకారబంధురమై యున్న ప్రపంచమునందు సృష్ట్యారంభమున రవ్యాదిగ్రహములు రేవతీయోగతారాసన్నములైయుండఁగా దినప్రవృత్తియయ్యెను. తదుదయమునుండియే వారాధిపత్యమును ప్రవృత్తియయ్యెనని చెప్పఁబడినది. కావున నిష్టదినమున లంకాపురోదయకాలముననే దేశముననే సమయమగునో యాదేశముననాసమయమునుండియే వారము ప్రారంభ మగుచున్నది. వారప్రవృత్తివిజ్ఞానము వృద్ధవసిష్ఠ సిద్ధాంతము నందు

శ్లో. ప్రభాకరస్యోద్గమనాత్పరే హ్య
ద్వారప్రవృత్తి ర్దశకంధరస్య,
చరార్ధదేశాంతరనాడికాభి
రూర్ధ్వం తథాఽధోప్యపరత్ర తస్మాత్.

దశకంధరుని పట్టణమగు లంకాపురమున సూర్యోదయమగు సమయమునుండి వారము ప్రారంభమగును. తదితర దేశములందు చరార్ధ దేశాంతర నాడికలచే సూర్యోదయమునకుఁ బూర్వముగఁగాని, పరముగఁ గాని వారప్రవృత్తి యగుచున్నదని చెప్పఁబడినది.

౨

దేశాంతర చరఘటీవిజ్ఞానము శ్రీ కాళిదాసవిరచితజ్యోతిర్విదాభరణమునం దిట్లు కలదు:—

శ్లో. లంకోజ్జయిన్యాదిపలరాజవిలంబిసూత్రం యామ్యోత్తరం విషద
తత్స్వపురాంతరం యత్, దేశాంతరం పలముఖం స్వమృణం
క్రమాత్ స్యాత్ ప్రాక్పశ్చిమే చరమహార్ద్యుదళావశిష్టమ్.

లంక, ఉజ్జయిని మొదలగుపట్టణములనుండి మేరువులమీఁదుగాఁ బోవుసూత్రము (Longitude) యామ్యోత్తరవృత్త మనఁబడుచున్నది. ఈవృత్తమునందలి మరికొన్నిపట్టణములు శ్రీపత్యాచార్యులచే—

శ్లో. లంకాకుమారీ నగరీచకాంచీ పానాటమద్రిశ్చ సితష్టదాస్యః,
శ్రీపర్ణగల్మంచ పురీతతశ్చ మాహిష్మతీచోజ్జయినీ ప్రసిద్ధా.
స్యాద్వాత్సగుల్మోఽస్మాన్నగరం సురమ్యంతతః పురంపట్ట శివాభిధానం,
శ్రీగర్గరాటంచ సరోహితార్ష్ణం స్థానేశ్వరం శీతగిరి స్సుమేరుః.
ఇతీవయామ్యోత్తరగాంధరాయాం రేఖామిమాం గోలవిదో వదంతి,
అన్యాని రేఖాస్థితిభాంసి లోకే జ్ఞేయాని తత్స్థైః స్ఫుటభేదనాని.

ఇట్లు యామ్యోత్తరవృత్తమునందలి కొన్ని దేశములు పేర్కొనఁబడినవి. తద్వృత్తమునం దన్యపురములు గోళజ్ఞులచేఁ దెలిసికొనఁ దగియున్నవి. పాశ్చాత్యులు గోళశాస్త్రమునందు గ్రీనిచ్ (Greenvich) ౦° Longitude యామ్యోత్తరవృత్తస్థ మని గ్రహించినరీతిని, లంకోజ్జయిన్యాదిపురగతవృత్తమే ౦° యామ్యోత్తరవృత్తమని (Longitude) సూర్య సిద్ధాంతములందు గ్రహింపఁబడినది. అగు లంకాపురము భూమధ్య రేఖా (Equator) స్థ మని స్వీకరింపఁబడినది. ఈలంకోజ్జయిన్యాదిపురగతయామ్యోత్తరవృత్తమునుండి ప్రాక్పశ్చిమములం దుండు దేశముల యంతరములగు యోజనములు దేశాంతర యోజనము లనఁబడుచున్నవి. ఆ దేశాంతర యోజనములే విషదముగ- అనఁగాఁ ద్రిచరణప్రమాణముగ - దేశాంతరవిఘటికలగును. యామ్యోత్తరవృత్తప్రాగ్దేశముల సూర్యోదయకాలమునం దీదేశాంతరవినాడికలఁగలుపుటయుఁ బశ్చిమదేశములందుఁ దీసివేయుటయుఁ జేయవలయును. విషువద్దినార్ధమగు ౧౫ ఘటికలకును నిష్టదినార్ధప్రమాణమునకును గల యంతరము చరవినాడిక లనఁబడుచున్నవి. సూర్యుఁడు సౌమ్యగోళమున నున్నపుడీచరవినాడికలను సూర్యోదయకాలమునఁ గలుపుటయు యామ్యగోళమున నున్నపుడు తీసివేయుటయుఁ జేయవలయును. ఇట్లు చరార్ధదేశాంతరవినాడికలను సూర్యోదయకాలమున సంస్కరించి వారప్రవృత్తిని నిర్ణయించవలయును. ఇట్లే శ్రీపత్యాచార్యులచే సిద్ధాంతశేఖరమునందును:

శ్లో. లంకోదగ్యామ్యయామ్యాత్పరిధి మపరతః పూర్వదేశేచపశ్చాత్
అథోర్ధ్వాభి ర్ఘటీభి స్సవితు రుదయతో వాసరేశప్రవృత్తిః,
జ్ఞేయామార్గోదయాత్ప్రాక్పర శకలత వై శ్చాసుభిర్యామ్యగోళే,
పశ్చాత్ తైస్సౌమ్యగోళే యుతివియుతివశాచ్చోభవోఽస్పష్టకాలః.
అని చెప్పఁబడినది.

ఉపపత్తి—సూర్యుఁడు భూమధ్యరేఖ కూర్ధ్వమున నున్న విషువద్వృత్తమున నున్నపుడు లంకాపురమున సూర్యోదయ మగు సమయమున యామ్యోత్తరవృత్తమునందలి యవంతీ, కాంచీ మొదలగు సర్వదేశములందును నుదయ మగును. లంకాదేశాస్తమయసమయమునఁ దద్యామ్యోత్తరవృత్తస్థపురములం దస్తమయంబును నగును. ఇట్లు భూమధ్యవృత్తమున నుండు నేపట్టణమున నైన నుదయమగు సమయమునఁ దత్పట్టణమునకు యామ్యోత్తరములనుండు పురములందును నుదయమగుచుండును. అందుచే లంకాపురమునకును స్వనిరక్షదేశమునకును నంతరమగు యోజనములఁ గనుఁగొనవలసియున్నది. సూర్యుఁడు భూమిచుట్టు నొక్కపర్యాయము









౧. (ఎ) శ్రీ రావు వెంకటజగ్గారావుగారు (శి) (బి) శ్రీ శిద్దుగోవిందుగారు (శి) (సి) శ్రీ పోకల సత్యనారాయణగారు (శి) (డి) శ్రీ వేంకటసదాశివగారు (శి) (ఇ) శ్రీ పోతంశెట్టి బసివిరెడ్డిగారు (శి). ౨. జిల్లా ఉప్పుసత్యాగ్రహము-శిబిరము, చిన్నాపురము. ౩. ఉప్పుసత్యాగ్రహము-సత్యాగ్రహులు ఉప్పు ప్రోగుచేయుచున్నారు. ౪. సత్యాగ్రహులు ప్రోగుచేసిన ఉప్పు మట్టిలో గలుపుట.











౧. శ్రీ సి. రాజగోపాలాచారిగారు (శ) ౨. శ్రీ కెప్టను కే. ఉపేంద్రపాయిగారు (శ) ౩. శ్రీ మొసలికంటి తిరుమలరావుగారు (శ)
౪. (ఏ) శ్రీ సింగన రాజయ్యగారు. (బి) శ్రీ సింగని సత్యనారాయణగారు. ౫. శ్రీ మండపాక రంగయ్యనాయుడుగారు (శ)







౧. ఆంధ్రపత్రిక ఉద్యోగబృందము (సంపూర్ణము), ౨. ఆంధ్రపత్రిక చిత్రకళాశాఖ







౧. ఆంధ్రపత్రిక అచ్చుకూర్పుశాఖ. ౨. భారతి అచ్చుకూర్పుశాఖ






౧. ఆంధ్రపత్రిక అచ్చొత్తుశాఖ, ౨. ఆంధ్రపత్రిక బైండుచేయుశాఖ

తిరిగివచ్చుటకు ౬౦ సావనఘటికల కాలమగుచున్నది. భూమధ్యవృత్తమును నాల్గు సమవిభాగములఁ జేయుచు సమదూరమున నొకదాని కొకటి పశ్చిమమున నున్న లంకారోమకసిద్ధపురీయవకోటు లనెడు నాల్గుపురములందును సృష్ట్యారంభమునఁ గ్రమముగ నుదయార్ధరాత్రాస్తమయమధ్యాహ్నము లగును. తదంతరదేశములందుఁ దత్తద్దేశాంతరయోజనములఁబట్టి కాలభేదము కలుగుచున్నది. ౩౬౦ యామ్యోత్తరవృత్తములఁ జుట్టి వచ్చుటకు ౬౦ ఘటికలు లేక ౩౬౦౦ విఘటికల కాలమగుటచే నొక్కొక్కవృత్తమునకు ౩౬౦/౩౬౦౦=౧౦ విఘటికలు లేక ౪ నిమిషముల కాలమగుచున్నది. ఇట్లు లంకాయామ్యోత్తరవృత్తమునుండి స్వదేశయామ్యోత్తరవృత్తాంతరము తెలిసికొనఁ దగియున్నది. భూవ్యాసము (Diametre) ౧౬౦౦ యోజనములు లేక ౮౦౦౦ మైళ్లు. దానివర్గమును ౧౦ చే హెచ్చించి పదముఁ గనుఁగొనగా నగు ౫౦౫౯ యోజనములు భూపరిధి(Equator) ప్రమాణమని సౌరాదిసిద్ధాంతములఁ జెప్పఁబడినది. ఇందు II౬౧౦ అని స్థూలముగా గ్రహింపఁబడినది. కాని భాస్కరాచార్యులచే సిద్ధాంతశిరోమణియందు:—

శ్లో. ప్రోక్తో యోజనసంఖ్యయా కుపరిధి స్సప్తాంగనందాబ్ధయః
తద్వ్యాసః కుభుజంగసాయకభువః సిద్ధాంశకేనాధికః.

భూపరిధి ౪౯౬౭ యోజనములును భూకర్ణము ౧౫౮౧ ౧/౨౪ యోజనములనియు సూక్ష్మరూపమునఁ జెప్పఁబడినది. పాశ్చాత్యసిద్ధాంతమునందును భూపరిధి (Equator) సుమారు ౨౫౦౦౦ మైళ్లని చెప్పఁబడినది. కావున ౫ మైళ్లొకయోజనమని తెలియుచున్నది. ౮ మైళ్లొకయోజన మగునను వాదమునకుఁ బ్రమాణము కాన్పించదు. భూవృత్తము ౪౮౦౦ యోజనములని గణితలాఘవార్థము కరణాదులందు గ్రహింపఁబడుచున్నది. సూర్యుఁడెల్లప్పుడును పశ్చిమమునకుఁ దిరుగుచుండుటచేఁ బశ్చిమమున నుండు దేశములం దొకదానికంటె మరియొకదానియం దాలస్యముగ సూర్యోదయ మగుచుండును, భూవృత్తప్రమాణమగు ౪౮౦౦ యోజనములను సూర్యుఁడు ౬౦ ఘటికలు లేక ౩౬౦౦ విఘటికలలోఁ జుట్టివచ్చుటచే నొక్కొక్కయోజనమునకు ౩౬౦౦/౪౮౦౦=౩/౪ విఘటికల కాలమగుచున్నది. కావున లంకాదేశమునుండి స్వనిరక్షదేశము యొక్క దేశాంతరయోజనముల కెంతకాలమగునను త్రైరాశికమున దేశాంతరయోజనములలోఁ ద్రిచరణము ౩/౪ దేశాంతరవిఘటికలగునని చెప్పఁబడినది. లంకాదేశమునకుఁ బూర్వమున నుండు దేశములందు లంకాదేశమునకంటెఁ బూర్వమే సూర్యోదయ మగుచుండును. తత్పూర్వదేశోదయానంతరముగాని లంకాదేశోదయము కాకుండుటచే నాదేశోదయకాలమున దేశాంతరవినాడికలఁ గలుపఁగా లంకాదేశోదయకాల మగును. లంకాదేశపశ్చిమపురములందు లంకోదయానంతర ముదయ మగును. తత్పశ్చిమదేశోదయమునకుఁ బూర్వమే లంకోదయమగుటచేఁ దత్పశ్చిమదేశోదయకాలమున దేశాంతవినాడికలఁ దీసివేయ లంకాదేశోదయకాల మగును. ఇట్లు దేశాంతరవినాడికలఁ బ్రాగ్దేశమునఁ గలుపుటయుఁ బశ్చిమదేశమునఁ దీసివేయుటయుఁ జేయఁగా లంకోదయకాల మగును. తత్సమయమునుండియే వారప్రవృత్తి యగును. లంకోజ్జయిన్యాదిపురగతయామ్యోత్తరవృత్తమునుండి కొన్నిప్రధానపురముల ప్రాక్పశ్చిమదేశాంతరయోజనములు మద్విరచితహోరాసాగరమునందుఁ దెలుపఁబడినవి. అవియే త్రిచరణముగ దేశాంతరవినాడికలుగ గ్రహింపఁదగి యున్నవి.

సూర్యుఁడు విషువద్వృత్తమున నున్నపుడు నిరక్షదేశములందునుఁ దదితరదేశములందును సమరాత్రందివములు కలుగుచుండును. విషువద్వృత్తమునుండి యామ్యోత్తరములం దున్నపుడు నిరక్షదేశమున మాత్రమే సమరాత్రందివములు కలుగునుగాని తదితరదేశముల దివారాత్రప్రమాణములం దెచ్చుతగ్గులు కల్గుచుండును. ఈ వైషమ్యమునకు నిరక్షక్షితిజ స్వక్షితిజములకుఁ గల్గు నంతరరూపకమగుచరము కారణమైయున్నది. సూర్యుఁ డుత్తరగోళమున నున్నపుడు నిరక్షోత్తరక్షితిజమునకంటె స్వక్షితిజము క్రిందుగానుండుటచే లంకోదయమున

కంటె చరవినాడికలచేఁ బూర్వముగనే స్వదేశోదయ మగుచున్నది. సూర్యుఁడు దక్షిణగోళమున నున్నపుడు నిరక్షయామ్యక్షితిజమునకంటె స్వక్షితిజ మూర్ధ్వముగ నుండుటచే లంకోదయముకంటెఁ జరార్ధవినాడికలచే ననంతరముగ స్వదేశోదయమగును. కావున రవి యుత్తర గోళమున నున్నపుడు చరవినాడికల సూర్యోదయ కాలమునఁ గలుపుటయు దక్షిణగోళమున నున్నపుడు చరవినాడికలఁ దీసివేయుటయుఁ జేయవలయును. ఇది భూమధ్య వృత్తమునకు నుత్తరముననున్న దేశవిషయము. దక్షిణముననున్న యాస్ట్రేలియా, న్యూజీలండ్, దక్షిణ మెరికా, దక్షిణాఫ్రికా మొదలగు దేశములం దిది వ్యత్యయముగనగును. ఇట్లు దేశాంతరచరవినాడికల రెంటిని సూర్యోదయకాలమున సంస్కరింపవలయును. ఇందు రెండును గలుపఁదగినవైన వీని మొత్తముఁ గలుపుటయు, రెండునుఁ దీసివేయఁదగినవైన వీని మొత్తముఁ దీసివేయుటయుఁ జేయవలయును. ఇందొకటి ధనమును రెండవది ఋణమును నైనయెడల వీని యంతరమును ధనాధికమైనఁ గలుపుటయు ఋణాధికమైనఁ దీసివేయుటయుఁ జేయవలయును. ఇట్లు సాధింపఁగా వేర్వేరు దేశములందు వేర్వేరు సమయములందు వారము ప్రారంభమగును. తద్వారప్రవృత్తికాలమునుండియే వారాధిపత్యమును హోరాధిపత్యమును నారంభమగును.

ఇందులకు వసిష్ఠసంహితయందు:—

శ్లో. "వారప్రవృత్తివిజ్ఞానం క్షణవారార్థమేవహి,
అన్యేషు సర్వకార్యేషు దినాది రుదయారవేః"—

క్షణవారార్థము, అనఁగాఁ గాలహోరాసాధనార్థము గణితాగతవారప్రవృత్తివిజ్ఞాన మవసరము. తదితరసర్వకార్యములందును "ఉదయా దుదయంవారం" అను వాక్యము ననుసరించి సూర్యోదయమునుండియే వాసరారంభమని గ్రహింపఁదగియున్నది. అంతియగాని యర్ధరాత్రమునుండి సర్వదేశములందును వాసరారంభమని గ్రహించుట యప్రామాణికము. సూర్యుని యామ్యోత్తరగోళస్థితిచే నహోరాత్రప్రమాణములందు న్యూనాధిక్యతలు కలుగుచున్నను నర్ధరాత్రమునుండి మధ్యాహ్నపర్యంతమును, మధ్యాహ్నమునుండి మధ్యరాత్రపర్యంతమును నగు కాలము లెల్లపుడును ముప్పదిఘటికలు లేక ౧౨ ఘంటలు ప్రమాణముకలవియే యగును. కావుననే యర్ధరాత్రమునుండియు మధ్యాహ్నమునుండియు ఘంటాగణన మారంభమగుచున్నది. అంతియేగాని యర్ధరాత్రమునుండి సర్వదేశములందును వాసరారంభమని యెంచఁదగదు.

3

వారాధిపత్యక్రమము సూర్యసిద్ధాంతమునందు:—

శ్లో. హోరేశా స్సూర్యతనయా దథోధః క్రమశ స్తథా
మందాదధః క్రమేణస్యు శ్చతుర్థా దివసాధిపాః".

షష్టిసావనఘటీప్రమాణమగు దినమును చతుర్వింశతివిభాగములఁ జేయ సార్ధద్విఘటికాప్రమాణమగు నొక్కవిభాగ మొక్కహోర యనఁబడుచున్నది. ఇదియే ఘంట (Hour) యనియు వ్యవహరింపఁబడుచున్నది. ఈహోరలకు

"మందామరేజ్యభూపుత్ర సూర్యశుక్రేందు జేందవః"

అను కక్ష్యాధఃక్రమమున శనిగురుకుజరవిశుక్రబుధ చంద్రు లధిపతులగుదురు. దినమునందలి ౨౪ హోరలకును వారాధిపతి మొదలుగ నీక్రమముననే మరల మరల నధిపతు లగుదురు. ప్రతిదినమునందును బ్రథమహోరాధిపతియే తద్వారాధిపతియు నగుటచే నాదివారమునఁ బ్రథమహోరకు రవి యధిపతియగును. రవినుండి పూర్వోక్తక్రమమున రవి, శుక్ర, బుధ, చంద్ర, శని, గురు, కుజులు సప్తహోరల కధిపతు లగుదురు. ఎనిమిదవహోరకు మరల రవియే యధిపతియగును. ఇట్లు త్రిరావర్తముచే ౨౧ హోరలుకాఁగ ౨౨ వ హోరకు మరల రవియు ౨౩ హోరకు శుక్రుఁడును ౨౪ వ హోరకు బుధుఁడును నధిపతులగుదురు. ౨౫ వ హోరకు ననఁగా మరుదినమునఁ బ్రథమహోరకు బుధుని తరువాతి గ్రహమగు చంద్రుఁ డధిపతి యగును. ప్రథమహోరాధిపతియే దినాధిపతియగుటచే

నాదినము సోమ(చంద్ర)వార మగుచున్నది. ఈ దినాధిపతి యగు చంద్రుఁడు కక్ష్యాధఃక్రమమున రవినుండి నాల్గవ వాఁడగును. ఇట్లే తదితరవారాధిపతులును నగుదురు. కావుననే “మందాదధః క్రమేణస్యుశ్చతుర్థాదివసాధిపాః” శని నుండి యధఃక్రమమున నాల్గవగ్రహము దివసాధిపతియగు నని చెప్పఁబడినది. ఈ క్రమమున నేడువారములకును రవి, చంద్ర, మంగళ, బుధ, గురు, శుక్ర, శను లధిపతు లగుచున్నారు.

## ౪

హోరాధిపానయనము వృద్ధవసిష్ఠసిద్ధాంతము నందు:—

శ్లో. వారప్రవృత్తేర్ఘటికాదిసే శాత్కాలాఖ్యహోరాపతయఃక్రమేణ,
సార్ధేన నాడీద్వితయేన షష్ఠష్షష్ఠ శ్చషష్ఠశ్చపునః పునశ్చ.—

రెండున్నర ఘటికలొక హోరయని చెప్పఁబడుటచే వారప్రవృత్తిసమయమునుండి గడచిన ఘటికల ౨౹౺ చే భాగింపఁగా లబ్ధమువలన గతహోరలు తెలియును. వానికిఁ దద్వారాధిపతి మొదలుగ వారాధిపక్రమమున నారవగ్రహము లధిపతులగును. ఆదివారమునఁ బ్రథమ హోరకు రవి యధిపతియగును. ద్వితీయహోరకు నాది వారము మొదలుగ నారవదియగు శుక్రవారమున కధిపతి యగు శుక్రుఁడధిపతియగును. ఇట్లే తదితరహోరలకును నగును. ఇట్లు వారాధిపక్రమమున నారవగ్రహము కక్ష్యాధః క్రమమున రెండవదియే యగును. హోరాధిపానమునయ నందు వారప్రవృత్తిని నిర్ణయింపవలసి యుండుటచేతనుఁ బ్రతిదినమునందును బ్రథమహోరాధిపతియే దినాధిపతియగుటచేతను వారాధిపత్యనిర్ణయమును వారప్రవృత్తినుండియే గణింపఁదగియున్నది. కావుననే శ్రీపత్యాచార్యులచే “వాసరేశప్రవృత్తిః” అని చెప్పఁబడినది. ఇట్లే భాస్కరాచార్యులచేతను “దినప్రవృత్తి” అనియుఁ జెప్పఁబడినది. కావున

శ్లో. “వారప్రవృత్తే ర్జననోద్భవారః ప్రకల్పనీయస్సదినాధినాథః”—

వారప్రవృత్తిసమయమునుండి దినారంభముఁ గల్పించి తత్సమయమునుండియే తద్వారాధిపత్యమును నిశ్చయింపవలయు ననెడు గణేశవాక్య మయుక్తమనెడు దివాకరవచన మయుక్తికము. గ్రహషడ్బలాంతర్గతకాల బలమునందు దినాధిపబలనిర్ణయార్థమును వారప్రవృత్తినుండియే వారారంభమని యెంచఁదగియున్నది. తదితర సర్వకార్యములందును సూర్యోదయమునుండియే వారమారంభమని స్వీకరింపఁదగియున్నది.



# మొగలి రేకు

వేంకట కాళిదాసకవులు, (ఆంధ్రగీర్వాణసాహిత్య పరిషత్తు)

౧

ప్రియుఁడు పంపిన కానుకయై ప్రేమలొలుకు
నగమువాడిన యీ తెలిమొగలిరేకు,
నరసగతి వికసించిన జంటపూల
భావిజీవితకావ్యంపుఁ బాటతోడ:

"పూవులు రెండు పూచినవి
ముద్దులు గుల్కెడు నట్టి రూపుతోఁ;
దావులు నించునో, మధుసు
ధారసముల్ కురియించునో, దళ
శ్రీవిభవమ్ముతోడ నల
రించునో, యీ వని భిన్నభిన్నమై
పోవునొకో, పరస్పరము
పోలికలేక యదృష్టశక్తిచే."

౨

మబ్బులోపలి తెలి చందమామ వోలెఁ
దరుణయువతీవినీలకుంతలములందు
నగ్రపదవీవిభూషణమై కరమ్ము
పొలుపుఁ గనుచుండు గేదగి పూలరేకు;

చెలియ శయ్యాతలమ్ము రచించుకొరకుఁ
బొలుపను బ్రతుకెడలిన పూలరేకు;
రాగమూర్తుల యోగవియోగములకు
మూలకారణమగునట్టి పూలరేకు;

మాసిపోవని నూత్నవికాసమునకుఁ
దీయఁదనములు చిప్పిల్లు తేనియలకు,
ఆశలం గాంచు వలపుల కాకరమగు
రాలిపోవని యందపుఁ బూలరేకు!

పూజలకు వినియుక్తమా పూలరేకు,
ముగ్ధ జడలోనఁ జెలువొందు పూలరేకు
ప్రేమకు నుపాయనముగ లభించుటెట్లు,
ఏపురా జన్మముననో పూలీయకుండ?

ముద్దులొల్కుచుఁ బూచిన పూలు రెండు
పిదిలిగాలిలో నిటునటు వెడలనిమ్ము,
అవి పరస్పరాశ్లేషసౌఖ్యంబుఁ గాంచు,
వలపుచే దవ్వుదవ్వుల మెలఁగినైన.

మృదుమధురకంఠములు నశియించినంత
నూహలోననె గాన ముజ్జూతలూగు;
విరులు వాడిపోయినయంతఁ బరిమళమ్ము
లాత్మ రేకెత్తు భావమునందె క్రమ్ము.

పూలరేకులనే వాడిపోవనిమ్ము,
వలపు లెన్నఁటికేనియు వాడిపోవు;
చెరిగిపోవవి యెదల రచించునట్టి
ప్రేమరేఖ లదృష్టంపు రేఖలగుట.

వాడిపోయిన రేకులో వలపుఁ గాంచి
తలఁపులో శాశ్వతమ్ముగా నిలుపుకొందు;
ఎప్పటికపుడె యెన్నొ నా హృదయమునకు
నగపరచు భావగతుల నీ మొగలిరేకు.

ప్రేమ మూర్తీభవించిన రేకు గాన
నణువణువునందు వలపుతీయందనములె;
హృదయముల రెంటి నేకీకరించునట్టి
ప్రణయబంధంబు నిల్చు శాశ్వతముగాఁగ;

తేనె లీను ప్రణయదృష్టిఁ గాని కానఁ
బడని హృదయాంతరాళపు టడుగునందు
దాఁచియుంచితి నిపుడు భద్రముగఁ గానుక-
గా లభించిన యీ తొలిపూలరేకు.

చివురు పొత్తిళ్ల ప్రేమపుఁ జేతులందొ,
ప్రియతచేత నెడముకాని వేణియందొ,
నలిగి పోనిమ్ము పూరేకు నవయనిమ్ము;
అంతకంతకు వలపు లనంతములగు.

హృదయవేదనకో, స్థిరప్రేమమునకో,
మొదటి చిహ్నము వాడిన మొగలిరేకు—
చిన్ని నాయెదలోన వసించి, లో, వ
హించుకొన్నది భావప్రపంచములను.

---



# రాగములందలి శ్రుతులు

వింజమూరి వరాహనరసింహాచార్యులుగారు

ఇదివరలో ఆంధ్రపత్రిక సంచికలందు * భారతీయగానమునందలి ద్వావింశతిశ్రుతులమాత్ర మెంచుటకు గల కారణములును షడ్జపంచమషడ్జమధ్యమషడ్జగాంధారపద్ధతులవలన అనగా సంవాదిపద్ధతి (Quentd and tertian Harmonics) వలన వీనిని కనుగొను విధమును, వివరణమును, అప్పటి వీని విలువలు, తంతియందు వీనిచే స్ఫురింపచేయబడుసంగతి పూర్వపువాగ్గేయకారులు శార్ఙ్గదేవుడు, రామామాత్యుడు, అహోబలుడు, సోమనార్యుడు, వేంకటమఖి మున్నగువారు చెప్పిన వీని వివిధవిధము లగు పేరులును, సామరస్యముచేసి నే చెప్పు విధమును, అందులకు కారణములును శ్రుతులను గూర్చిన పెక్కు ఇతరాంశములు చెప్పబడియుండెను.

మరియు ప్రమోదూతఉగాదిసంచికయందు ఇరువదిరెండు శ్రుతులను కొన్ని కర్ణాటకరాగములందు ఎంచి సహేతుకము లగు కారణములతోగూడ కొంత చర్చించియుంటిని. పెక్కువత్సరముల నుండి వివాదహేతువగు నీశ్రుతుల యంశ మిప్పుడు కొంతజనసమ్మతము దాల్చుట సంగీతకళయొక్క భావిభాగ్యదశకు సూచకము. ఈయంశము నెడ విసుగుజెంది, నిరాశగలవారై పూర్తిగ దీనిని విడనాడిన మన పెద్దలుసహిత మిప్పుడు క్రమక్రమముగ దీనియందు శ్రద్ధాభక్తులు కలవారగుచుంట భావ్యమే.

కాని కొందఱు రాగములందు శ్రుతులను ఎంచి పేర్కొనునప్పుడు అర్థానికి విస్మయముజెంది యందుల కిష్టపడనివారు పెక్కురిప్పుడు కలరని వినుటకు విచారమగుచున్నది. ప్రకృతపు గాయకులు రాగములందు ఒక్కపన్నెండుస్వరములనే కాక ద్వావింశతిశ్రుతులను పాడుచునేయున్నారు. రాగములు నియతస్వరమూర్ఛనయుతము లయ్యు కొన్ని తదితరశ్రుతులనుగూడ చేర్చుకొని మిగుల రంజకము లగుచున్న సంగతి-అనగా తమ ౧౨ స్వరములకన్న నెక్కువవానినే రాగములందు పాడునది వీరు గ్రహింతురుకాని ఇదమిత్థమని ప్రత్యేక శ్రుతిని గ్రహించి చెప్ప నొల్లకున్నారు. రక్తిరాగకళాపోషకము లగు శ్రుతులు-అనగా రాగమును సువ్యక్తముచేయు శ్రుతులు-ప్రకృతమందలి రాగములందు మనవారు పాడువిధమున ఎంచిచెప్పుట సంగీతకళ నుద్ధరించుటే యని వీరు గ్రహింపవలయును. ఇందుచే నిటీవల మద్రాసు సంగీతపరిషత్సభవారు ౧౨ మాసములకు పైగా రాగములందు శ్రుతులను పేర్కొను అంశముగూర్చి చర్చగావించి, కడచిన ఏప్రియల్ మాసమందు ప్రత్యేకసలహాసంఘమును కూర్చి పైసంగతులను, మరికొన్ని భాషాంగరాగముల లక్షణమును విచారించియున్నారు. కష్టసాధ్యము గు వీరిపనిని సంగీతప్రియులు మెచ్చుకొనక తప్పదు.

రాగములందు శ్రుతులు సమయమువచ్చినప్పుడెల్ల వ్యక్తము లగుచుండినను పూర్వపు వాగ్గేయకారులు-ముఖ్యముగ నిటీవలి వేంకటమఖి మున్నగువారు-మేళకర్తలనుచెప్పునప్పుడు ద్వావింశతిశ్రుతులను గ్రహించి వానితో జేర్చిచెప్పక వింతగ పదునారుపేర్లను పేర్కొనుచు పండ్రెండు స్వరములనుమాత్రము చేర్చి వీనితోనే మేరువు లెక్కవేసి డెబ్బదిరెండుమేళకర్త రాగములు లేక రాగాంగరాగములు ఏర్పరచుటకు కారణము ఇతడు ౘ్ఞ్౧ విలువగల పైత్రాగియస్ కోమా (Koma) అని పాశ్చాత్యులు చెప్పుకొను శ్రుతిని యెంచకపోవుటయే. ఇంతకు కారణ మిది స్వల్పవ్యత్యాసమగు ధ్వనిమాత్రము కలిగిన దగుటయే. కాని ఈపృథక్ (స్వల్ప) ధ్వనులను మన పూర్వపు వాగ్గేయకారు లేమి, పాశ్చాత్యశాస్త్రవేత్త లేమి గ్రహించియే యుండిరి. ఇట్టి పృథక్‌ధ్వనులు చేర్చనిది రాగకళ పూర్తికానేర దని ప్రతిధేశము వారును చెప్పుచుంట చూడగలము. భరతుడు పై ౘ్ఞ్౧ శ్రుతిని ప్రమాణశ్రుతియని యెంచెను. ఈ శ్రుతియొక్క యాధిక్యము నతడు గమనించియుండె ననుట కతడుచెప్పు షడ్జమధ్యమగ్రామము లందలి శ్రుతుల గనుగొనునప్పుడు వీణయందు చెప్పిన దృష్టాంత మే నిదర్శనము. భరతుడు ప్రమాణశ్రుతిగూర్చి యిట్లు చెప్పెను:

"మధ్యమగ్రామేతు శ్రుత్యపకృష్టః పంచమః కార్యః.

పంచమశ్రుత్యుత్కర్షాదపకర్షాద్వా యదన్తరం మార్దవాదాయతత్వాద్వా తత్ప్రమాణశ్రుతిః." (భరత. పు. ౩౦౬.)

* మూడుడు ఆంధ్రపత్రిక ఉగాదిసంచికలు శుక్లప్రమోదూతసంవత్సరములు.

అనగా షడ్జగ్రామమందలి పంచమము షడ్జముతో సంవాదిగ నున్నది. ఇందుచే నితడు మరియొకతావున

"అత్రయో యత్రాంశః సత్రవాగీ, యయోశ్చ నవత్రయోదశకం పరస్పరతః శ్రుత్యన్తరే తావన్యోన్యసంవాదినౌ, యథా—షడ్జపంచ మౌ ఋషభధైవతౌ గాంధారనిషాదవాస్తా షడ్జమధ్యమావితి షడ్జ గ్రామే, మధ్యమగ్రామే ష్వేవమేవ షడ్జపంచమవర్జం పంచమర్ష భయో శ్చాత్ర సంవాద ఇతి."

అని చెప్పినట్లు షడ్జపంచమములను రెండుస్వరములమధ్య ౧౩ శ్రుతు లున్నవి. మరియు మధ్యమగ్రామమున పంచమము ఋషభముతో సంవాదిగ లేదు. పంచమఋషభములు రెండుస్వరములందు పదిశ్రుతులు కలవు కావున వీనిని సంవాదిస్వరములుగ జేయుటకు వీనియందలి ౧౦ శ్రుతులలోను ఒక్కశ్రుతి యపకృష్టము చేయవలయును. అనగా వీనియందు ౯ శ్రుతు లుండునట్లు చేయవలయును. ఇంటుచే షడ్జ గ్రామమందలి షడ్జపంచమముల ౧౩ శ్రుతులు మధ్యమగ్రామమున ౧౨ శ్రుతు లగుచున్నవి. ఇట్లు షడ్జగ్రామపంచమము ర మధ్యమగ్రామ మందు ఎంతప్రమాణమున తగ్గింపబడినదో యదియే ప్రమాణశ్రుతియని భరతుడు చెప్పెను. ఇదియే పై ౮౧/౮౦ విలువగల శ్రుతి. ఇయ్యది చతు శ్శ్రుతికమునుండి త్రిశ్రుతికమును తీసివేయునప్పుడు కలుగుచున్నది. (౯/౮ × ౮౦/౧౦ = ౮౧/౮౦) ఈ ప్రమాణశ్రుతి పూర్వపు గ్రామరాగపద్ధతి యందును కందుము. భరతునికాలమునుండియు రాగములందు 'పృథక్' ధ్వనులు వాడబడుచుండినట్లు పై సంగతివలనను గ్రహింతుము.

అనంతరము పైశ్రుతినిబోలు మరిరెండు "పృథక్" ధ్వనులు కూడ పూర్వపు వాగ్గేయకారులు వాడుచుండినట్లు విదితము. ఇవి—

(౧) త్రిశ్రుతికము ౧౦/౯ నుండి ద్విశ్రుతికము ౧౬/౧౫ తగ్గింపబడు నప్పటి ౨౫/౨౪ విలువగల శ్రుతియు (౧౦/౯ × ౧౫/౧౬ = ౨౫/౨౪).

(౨) త్రిశ్రుతికద్విశ్రుతికములనుండి చతుశ్శ్రుతికము ౯/౮ తగ్గింపబడునప్పటి ౨౫౬/౨౪౩ విలువగల శ్రుతియు (౧౦/౯ × ౧౬/౧౫ ÷ ౯/౮ = ౨౫౬/౨౪౩ దీనిని పాశ్చాత్యులు పైతాగ్రియన్ లైమా (Pythagorean lima) అని చెప్పుదురు.

వీనిని రామామాత్యుడు, వేంకటమఖి మున్నగువారు రాగము లందు చేర్చినట్లు స్పష్టము. పాశ్చాత్యదేశములందును, పూర్వము గ్రీసు, పెరిషియా, అరేబియా మున్నగు దేశములందును నిట్టిశ్రుతులు వాడబడి నట్లు వినుదుము. శార్ఙ్గదేవుడు తన వికృతస్వరములందు చ్యుతమధ్య మము, చ్యుతషడ్జములను గ్రహించెను. కావున ఇవి రామామాత్యుని చ్యుతమధ్యమగాంధారము, చ్యుతషడ్జనిషాదములే కావున వీనివిలువలు వరుసగ ౮౧/౬౪; ౨౪౩/౧౨౮ అగుటచే వీనితో మధ్యమషడ్జములు చేరిన రాగములందు ౨౫౬/౨౪౩ లైమాశ్రుతి యుపయోగింపబడినట్లు విదితము. శార్ఙ్గదేవుని వెనుకటివాడగు రామామాత్యుడు పేర్కొనిన యిరువది రాగాంగములందును ౮౧/౮౦; ౨౫౬/౨౪౩ విలువలుగల శ్రుతులను వాడినట్లు చూతుము. ఇట ఒక సంగతి—ఇతడు చెప్పిన ౨౦ మేళములందును ౧౫ మేళములుమాత్రము సువ్యక్తములు. తక్కిన ౫ రాగాంగములును ౧౫ మేళములలో నేదేని యొక మేళమునకు దుల్యమే యగును. ఇతని సారంగనాట యిరువదియవ మేళము కాంభోజమండి భిన్నముకాదు. ఇందుచే దేలిన ౧౫ రాగాంగములందును పైవిధములగు శ్రుతులు వాడ బడుట కందుము. దృష్టాంతముగ ౮౧/౮౦ విలువగల శ్రుతి ఇతని శ్రీరాగము సారంగనాట, హిందోళ, దేశాక్షి, కన్నడగౌళ, శుద్ధనాట, ఆహిరి, రీతిగౌళ మున్నగు మేళములందును, ౨౫౬/౨౪౩ విలువగలశ్రుతి మాళవగౌళ, సారంగనాట, హిందోళ, దేశాక్షి, శుద్ధనాట, ఆహిరి, నాదనామ క్రియ, శుద్ధవరాళి, వసంతభైరవి, కేదారగౌళ మేళములందును చూతుము.

ఇక వేంకటమఖియు నైవిధమగు శ్రుతులను రాగములందు చేర్చియుంచుట గమనింపవలసిన విషయము. ఇవి యీతనికాలమున ప్రసిద్ధములగు ౧౯ మేళములందును కలవు.* ౮౧/౮౦ శ్రుతి ఇతని వసంత భైరవి, గౌళ, ఆహిరి, భైరవి, శ్రీరాగము, హుజ్జిజ్జి, కాంభోజి, సింహా రవ మేళములందును, ౨౫౬/౨౪౩ శ్రుతిసామవరాళి, ఆహిరి, శ్రీరాగము, కాంభోజి మున్నగుమేళములందును చూతుము.

అనంతరము క్రీ. శ. ౧౭౬౩-౧౭౮౭ కాలమునాటి తుల జేంద్రరాజాగారి "సంగీతసారామృతము" నుండియు నీ ౮౧/౮౦ విలువ గలశ్రుతి ఇతని ౧౯ మేళములందలి శ్రీరాగము, శుద్ధరామక్రియ, వేళావళి, శంకరాభరణము, భైరవి, వేగవాహిని, హుజ్జిజ్జి, వసంత భైరవి మేళములందును మరి ౨౫౬/౨౪౩ శ్రుతి శుద్ధనాట, మాళవగౌడ, వేళావళి, వరాళి, శంకరాభరణము మున్నగువానియందును వాడబడి నట్లు స్పష్టము. ఈసంగతులవలన ప్రకృతివికృతిస్వరములకు కార ణములగు చతుశ్శ్రుతిక, త్రిశ్రుతిక, ద్విశ్రుతికములును మరి వీనిసంయో గములు, పంచశ్రుతికములు, షట్శ్రుతికములు మున్నగునవే కాక ద్విశ్రుతికము (౧౬/౧౫) కన్న తక్కువగు "పృథక్" ధ్వనులు ౮౧/౮౦; ౨౫/౨౪; ౨౫౬/౨౪౩; ౩౧/౩౦; ౨౬/౨౫; ఇత్యాదులగు విలువగల ఏకశ్రుతి, అర్ధ శ్రుతి మున్నగునవి పూర్వమునుండియు రాగములందు వాడబడుట విదితము కాగలదు.

గ్రీసు, పెరిషియా, అరేబియా మున్నగుదేశములందు నీ యంత రములు విరివిగా వాడబడుచుండినట్లు తెలియవచ్చును. ౧౪-వ శతాబ్ద మందుండిన అబ్దుల్ ఖాదర్ సంగీతవేత్త మతము అరేబియా పెరిషియా దేశములందు పాదుకొనినట్లు చరిత్రవల్ల గ్రహింతుము. ఇతడు ౨౫౬/౨౪౩ విలువగల లైమాయంతరమును విస్తారముగను, ఇంతకన్న తక్కువశ్రుతి

* ఇతని ౭౨ మేళములు తనకల్పితములని చెప్పుకొనినాడు. కాని తనకాలమునందలి వాడుకయందుండిన రాగాంగములు ౧౯ మాత్రమే అని చెప్పినాడు. వీనివివరణము రాగములగూర్చి వ్రాయునప్పుడు చేతును.

౮౧/౮౦ విలువగల కోమాయంతరమును కొలదిగను చేర్చుకొని స్థాయియందు పదునారుస్వరములను గ్రహించి చెప్పెను. ఈ ౧౬ స్వరములు ఆయా దేశములందు ప్రబలము లగుటయేకాక మనదేశమునందు నీపద్ధతికి చోటుకలిగియుండెననియు నెంచవచ్చును. ౧౬-వ శతాబ్దమునాటి రామామాత్యుడు ఈపద్ధతి కొంత యెరిగియుండియే కాబోలు ఏడు వికృతములతో చేర్చబడిన ౧౬ స్వరములను పేర్కొనెను. ఇట్లెంచుటకు కారణము ఆనాటికి పారశీకులు భారతసామ్రాజ్యలక్ష్మిని చేబట్టి తమదేశమునుండి కవులను గాయకుల నీదేశమునకు తమతో దీసుకువచ్చియుండిరనియు నిందుచే వీరినుండి మనవారు కొన్ని సంగతులు గ్రహించి కాని, వారికి చెప్పిగాని యుందురనియు నెంచుటకు వీలగు చరిత్రాంశములు కలవు. అనంతరము వేంకటమఖియు నిట్లు పదునారు స్వరములకు పేర్లుచెప్పి పైనతెలిపినట్లు ౮౧/౮౦ మున్నగు విలువగల శ్రుతులను గమనింప నొల్లకుంటచే బన్నెండుస్వరములే వీనినుండి గ్రహించియుండెననియు దెలియుదుము.

ఇట్లు భారతీయరాగములందుగల ఇదివరలోచెప్పబడిన శ్రుతులు అనగా ౨౫/౨౪. ౩౨/౨౭, ౮౧/౬౪, ౨౭/౨౦, ౬౪/౪౫, ౨౫/౧౬, ౨౭/౧౬, ౨౪౩/౧౨౮ మున్నగు విలువగలవి పై ౮౧/౮౦, ౨౫౬/౨౪౩, ౨౫/౨౪ శ్రుతియంతరములను పన్నెండు స్వరములకు చేర్చిన కలుగుచున్నవని యెంచితిమికదా. పైవిధములగు శ్రుతులు మాత్రముకాక యనేకవిధములగు శ్రుతులు సంవాదిపద్ధతి ననుసరించి కలిగినవానిని పారశీకులు, అరేబియనులు మున్నగు పాశ్చాత్యులుకూడ తమరాగములందు వాడుచుండుట గమనింపవలసిన విషయము. ఇందుచేతను పన్నెండుస్వరములే రాగములను ధ్రువపరచగలవను సంకుచితభావమును కొందరు మనవారికె మనమున వీడగలరు. అరేబియా పారశీక ప్రదేశములందలి "జాల్ జాల్" రాగమున ౨౭/౨౨; ౧౨/౧౧ యంతరమును, మరి ౧౬/౯ విలువగల మనశుద్ధనిషాదమును వాడబడినట్లు విదితము. వారి "నావా" రాగమందు ౩౨/౨౭, ౯/౮ విలువగల మనశుద్ధగాంధారచతుశ్శ్రుతిఋషభములు వాడియుండుట కందుము. (ఇందుచే వీనియందుగల ౨౫౬/౨౪౩ శ్రుతిని వీరు గ్రహించియుండుట గమనింపదగిన విషయము) ఇంకను ౨౭/౨౦ యంతరమునకు చేరువగు వింతయంతరములను ౮౧/౬౫ ౬౨/౬౧ కూడ వారు గ్రహించియుండుట పెక్కుశ్రుతులను చేర్చుకొను ఆతురతను తెలియజేయుచున్న దనవచ్చును. జావాదేశమున మరియొక [illegible] యంతరమును (ఇది స్థాయి ౫-వ భాగిక మగుచున్నది.) ఇట్టి ౨౩/౨౦, ౧౫/౧౩ విలువగలవియు వాడబడుచున్నవి. ఇంక ననేకవిధములగు శ్రుతులు ఆయాదేశములందు వాడబడుచుండినట్లు తెలియగలము.

ఈవిధమున అరేబియా మున్నగుదేశములందలి వాదకులోగల పెక్కుశ్రుతులు ౨౭/౨౨, ౧౨/౧౧, ౧౧/౯, ౩౩/౩౨ మున్నగు విలువగలవానిని మనవారు గ్రహింపకున్నారు. ఈశ్రుతులు చేర్చబడిన పారశీకపు స్వరావళియు పంచమభావము (Perfect fifths) ననుసరించియే నిర్మింపబడినదని హెల్మ్‌హోల్ట్జు శాస్త్రవేత్తయు నంగీకరించియుండెను.

పైనచెప్పిన అబ్దుల్ ఖాదర్ శాస్త్రజ్ఞుడు షడ్జపంచమభావమును పదియారు పర్యాయములు యెంచి తన ౧౬ స్వరములను చెప్పునప్పటి విలువలతో నలరారు పైయంతరములుగల శ్రుతులు మనము కూడ గ్రహించుట భావ్యమే. ఈతని ౧౬ స్వరము లిట్లు చెప్పబడెను: స; స-౨; రి†-౩; రి*-౪; రి-౫; గ†-౬; గ*-౭; గ-౮; మ-౯; ప-†౧౦; ప*-౧౧; ప-౧౨; ద†-౧౩; ద*-౧౪; ద-౧౫; ని†-౧౬; ని-౧౭; స-౧౮. [ఇట రెండుస్వరములమధ్య – (అర్ధగీత) ౨౫౬/౨౪౩ విలువకును,*(నకుత్రాకారము) ౮౧/౮౦ విలువకును చెందును. †గుర్తు కోమలస్వరము.]

ప్రకృతపు రాగములందు మనవారును పెక్కు శ్రుతిప్రమాణములను (Ratio) చేర్చి పాడుచుండుట విదితమని ఎంచియుంటిమి. ఇందుకు తార్కాణముగ ముఖ్యములగు కొన్ని రాగములం దిచ్చుట ఈ యీశ్రుతులు కలుగుచున్న దియు సహేతుకముగ గ్రిందటిసంచికయందు కొంత చెప్పియుంటిమి. కొలదిమాసముల క్రితము జరిగిన సంగీతపరిషత్సభయొక్క ప్రత్యేకసంఘమునం దీశ్రుతులు రాగములం దీవిధమున నిరూపింపబడెను.

(౧) ౨౫/౨౪ (లేక ౩౧/౩౦) విలువగల ఏకశ్రుతిఋషభము ఇప్పటి ౭౨ మేళముల ననుసరించిన తోడి, గౌళ మున్నగురాగములందును
(౨) ౧౬/౧౫ ద్విశ్రుతిఋషభము మాయామాళవగౌళ మేళమునను
(౩) ౧౦/౯ త్రిశ్రుతిఋషభము భైరవి, కాంభోజియందును
(౪) ౯/౮ చతుశ్శ్రుతిఋషభము కల్యాణియందును
(౫) ౩౨/౨౭ శుద్ధగాంధారము భైరవి, తోడియందును
(౬) ౬/౫ సాధారణగాంధారము ఖరహరప్రియయందును
(౭) ౫/౪ అంతరగాంధారము కాంభోజి, శంకరాభరణములందును
(౮) ౮౧/౬౪ తీవ్ర లేక చ్యుతమధ్యమగాంధారము కల్యాణియందును
(౯) ౪/౩ శుద్ధమధ్యమము శుద్ధమధ్యమరాగములందును
(౧౦) ౨౭/౨౦ తీవ్రమధ్యమము బేగడయందును
(౧౧) ౪౫/౩౨ ప్రతిమధ్యమము పూర్వకల్యాణియందును
(౧౨) ౬౪/౪౫ వరాళిమధ్యమము వరాళిరామప్రియలయందును
(౧౩) ౩/౨ పంచమము పంచమవర్జముకానివానియందును
(౧౪) ౨౫/౧౬ (లేక ౩౧/౨౦) ఏకశ్రుతిధైవతము సావేరియందును
(౧౫) ౮/౫ ద్విశ్రుతిధైవతము మాయామాళవగౌళ తోడియందును
(౧౬) ౫/౩ త్రిశ్రుతిధైవతము కాంభోజియందును
(౧౭) ౨౭/౧౬ చతుశ్శ్రుతిధైవతము కల్యాణియందును
(౧౮) ౧౬/౯ శుద్ధనిషాదము కాంభోజి, భైరవియందును
(౧౯) ౯/౫ కైశికినిషాదము ఖరహరప్రియయందును
(౨౦) ౧౫/౮ కాకలినిషాదము శంకరాభరణము, మాయామాళవగౌళయందును

(౨౧) ౨౪౩/౧౨౮ తీవ్రనిషాదము లేక చ్యుతషడ్జము కల్యాణి, కురంజి యందును

(౨౨) ౧. షడ్జము అన్ని రాగములందును - ఇట్లు వాడబడుచుండినట్లు విదితము.

గ్రీసు మున్నగు పూర్వపు పాశ్చాత్యదేశములందును హిందూ దేశమునందువలె శ్రుతులు వాడబడుచుండినట్లు యెంచితిమికదా! భరతుడు, శార్‌ఙ్గదేవుడు మున్నగు మనవాగ్గేయకారులు చెప్పుచుండిన ౧౬/౧౫, ౮/౫ విలువలుగల శుద్ధఋషభ శుద్ధధైవతములను వారు గ్రహించి యుండిరి. కాని వేంకటముఖి సంప్రదాయము ననుసరించిన ౭౨ మేళములందును యీవిలువలను చూడము. ఇతడు వీనిని పాటించుటకు బదులు ౯/౮, ౨౭/౧౬ విలువలుగల చతుశ్శ్రుతిఋషభధైవతముల నే గ్రహించి వీనినిచేర్చి తన ౭౨ మేళముల నేర్పరచెను.

ఇదివరలో చెప్పబడినట్లు ౧౦/౯, ౩౨/౨౭, ౨౭/౨౦ విలువలుగల "పృథక్" ధ్వనులను మేళములందు వేంకటముఖి చేర్చియుండకపోవుటచే భైరవి ఖరహరప్రియరాగములందు ఒక్క గాంధారమునే - అనగా ౬/౫ విలువగల సాధారణ గాంధారమునే చెప్పియుండెను. కాని భైరవి యందు ౬/౫ సాధారణగాంధారము కాక దీనికి కొంచెము కోమలముగు ౩౨/౨౭ విలువగల శుద్ధగాంధారము వాడబడుట విదితము. ఇట్లు ఖరహర ప్రియయందు ౬/౫ గయు, భైరవియందు ౩౨/౨౭ గయు వాడుచుండినను అట్లు యెంచక రెండురాగములకు వేంకటముఖి ఒక్క గాంధారమే చెప్పియుండెనని భావించి సరికి బారెడు హెచ్చుతగ్గుగ మనవారు చెప్పుచుంట వింతగొల్పకమానదు. ఈవిధముననే తోడిమాయామాళవగౌళ ఋషభములు, కాంభోజికల్యాణిగాంధారములు, బేగడశంకరాభరణ మధ్యమములు మరి పూరికల్యాణినరాళిమధ్యమములు, మాయామాళవ గౌళకల్యాణినిషాదములు, కాంభోజిఖరహరప్రియధైవతములు, వేరు వేరయ్యు వీనిని ఒక్కవిధమువనిగనే యెంచుట సరికాదు. ఇట్లు చేయనిది కలాపోషకము కాదు. ఇప్పుడే రాగములు సువ్యక్తములై సులభగ్రాహ్యము లగుచున్నవి. విద్వాంసు లాయాసంగతుల నెరిగి యుండినను విద్యార్థి కీరహస్యము తెలియకపోవుటచే రాగమును సుందరముగ సువ్యక్తము చేయజాలకపోవుచున్నాడు కావున వీని వివరణ మిప్పుడు ఆవశ్యక మగుచున్నది.

కొంద రెంచునట్లు పూర్వపు వాగ్గేయకారులు ప్రతిశ్రుతి చేరికగల రాగాంగములను చెప్పక ప్రకృతిస్వరములతోను మరికొన్ని ముఖ్యములగు స్వరములు అనగా ఉత్కర్షాపకర్షల నొందినప్పటి శ్రుతి మార్పువలన కలిగిన వికృతిస్వరములతోను మాత్రము మేళకర్తల నేర్పరచియుంటచే శ్రుతులను గమనించియుండలేదనుట సరికాదని పై సంగతులవలననే తెలియును. ఈసంగతిగూర్చి యింకను తెలియుటకు ప్రాచీనగ్రామరాగపద్ధతి యెట్లుమారి రాగాంగరాగపద్ధతి కెట్లు తావిచ్చినదియు నీరాగములచరిత్రము నెరిగియుండుట యవసరము. వీని నెల్ల నిట వ్రాయుట వేరుగ్రంథము నిర్మించుట కావున ముఖ్యమగు సంగతిమాత్రము చెప్పెదను.

పూర్వమునుండి శ్రుతులు, మూర్ఛనలు, గ్రామములు, రాగములు, తానములు మున్నగునవి యెట్లు పరిణామము చెందుచుండినదియు నెంచుటకు మూడుకాలము—(౧) గ్రామరాగకాలము (౧౫-వ శతాబ్దమువరకు) (౨) మధ్యకాలము (౧౫-౧౭ శతాబ్దము వరకు) (౩) ఆధునికకాలము-ల నెంచి వీనియందలి వీనిచరిత్ర నారయ వలసియున్నది. గ్రామరాగకాలమున రాగములు ఏడు ప్రకృతిస్వరముల నుండిమాత్రము గ్రహించిరనియు నాకాలమున భరతుడు చెప్పిన మరి నాలుగు అంతరస్వరములు (వికృతిస్వరములు) "స్వరసాధారణ" మను పేర రాగములందు కొంతనియమముతో నైనను వాడబడుచుండె ననియు గ్రహింతుము. ఇతని పదునాలుగు గ్రామరాగములు విస్పష్టములు కావనియు, షడ్జగ్రామరాగములకును మధ్యమగ్రామరాగములకును కడుస్వల్పభేదముమాత్ర ముంటచే ముఖ్యమగునవి ఏడుగ్రామరాగములుమాత్రము గ్రహింతుమనియు తెలియవలయును. ఇందుచేతనే ఇతడు తనపూర్వపుగ్రామరాగములనుండి ఏడు శుద్ధజాతులనుమాత్రము పేర్కొనె నందురు. ఈ సప్తజాతులు మన మేళకర్తలవలె సప్తస్వరములను కలిగియున్నవి. ఇవికాక ఇతడు పై 'స్వరసాధారణ' చేర్చియు షాడవఔడవభేదములచేత మరికొన్ని వికృతజాతులను చెప్పెను. అనంతరము శార్‌ఙ్గదేవుడు భరతునిజాతులను పూర్వప్రసిద్ధములుగమాత్రము చెప్పి తనకాలమునందలి వాడుక ననుసరించి పెక్కు వికృతములను చేర్చిన రాగాంగభాషాంగక్రియాంగఉపాంగరాగములను విపులముగ జెప్పియుండెను. ఇందుచే భరతుడు నియమముతో రాగములందు చేర్చిన యన్యశ్రుత్యాశ్రయము లగు వికృతస్వరములను ఇతడు విరివిగ రాగములందు వాడియుంట తెలియుదుము. ఇట్లు పూర్వమునను ప్రతిశ్రుతిచేరికగల రాగములు ధ్రువమగుట లేదు. కాని శుద్ధస్వరములు మరి యన్యశ్రుత్యాశ్రయము లైన వికృతస్వరములు క్రమక్రమముగ రాగములందు వానిని సువ్యక్తములు సేయుటకై చేర్చబడుచుంట కందుము.

ఇక మధ్యకాలమున ప్రకృతివికృతిస్వరసంజాతము లగు రాగములు పెక్కులు వెలసియుంటచే బూర్వపు గ్రామరాగపద్ధతిమారి శార్‌ఙ్గదేవుడు సూచించిన రాగాంగభాషాంగపద్ధతి నవలంబ తెచ్చుటకుగల కుతూహలము మిక్కుటముగ నుంట గమనించగలము. రామామాత్యుడు, సోమనాథ్యుడు, పుండరీకవిఠలుడు, అహోబలుడు మున్నగు నీకాలమువారు రాగములందు ప్రకృతివికృత స్వరముల నన్నియుజేర్చి వారువారెంచువిధమున ౧౯ లేక ౨౦ మేళములు మాత్రము చెప్పుచుండిరి. ఈమేళములు అన్ని స్వరములు క్రమముగా మేరువు లెక్కవలన చేర్చబడియుండకపోవుటచే గాబోలు వేంకటముఖి యట్లులెక్కవేసి తన ౭౨ మేళముల పద్ధతి చెప్పి



శ్రీ ఇర్విను ప్రభువు



శ్రీ గాంధీమహాత్ముడు



ఇండియన్ రౌండుటేబిల్ కాన్ఫరెన్సు సెంటుజేమ్సుభవనము, లండనునగరము.

౧. ఎనుబది తొమ్మండుగురు ప్రతినిధులు.

౨. హౌస్ ఆఫ్ లార్డ్సులో ఇండియన్ కాన్ఫరెన్సు, కాశ్మీరమహారాజు ఉపన్యాసమును చదువుచుండుట



జాలరి

చిత్రకారుడు: మ. సూ. ప్రకాశరావుగారు.

యుండెను. ఈపద్ధతియే నవీనముగ మనము చెప్పుకొనుచున్నారము. మేళముల నేర్పరచునప్పుడెల్లను సప్తస్వరయుక్తములుగ నవి యుండు నట్లును, సాధ్యమగునంతవరకు ప్రకృతివికృతస్వరముల చేరికలుగనే యుండునట్లును నీకాలపువాగ్గేయకారులు ఎంచియుండిరి. వీనియందును ద్వావింశతిశ్రుతులు వరుసగ నెంచబడలేదు. అట్లెంచబడుటకు వీలును లేదు. కొన్నిశ్రుతులవలన జనించిన స్వరములే రాగములందు చెప్పుట యాచారముగ నున్నది. ఇవి రాగమునకు పువాదులుగ నుండగలవు. కాని రాగకళలను వట్టి సప్తస్వరములు పోషింపలేవని వారును గ్రహించి యుండకపోలేదు. కావుననే రాగమును విస్పష్టము సేయుటకు పెక్కు గమకములను వారు చెప్పుచుండిరి.

ఇట్లుకాక ద్వావింశతిశ్రుతులను వేరువులెక్కచే రాగముల నెంచినయెడల యనంతములగు రాగాంగములు కలిగి యవి యస హ్యములగుటయేకాక యగ్రాహ్యములుగకూడ నుండగలవు. ౧౨ స్వర స్థానములను చేర్చినప్పుడే మనకు ౭౨ మేళములు కలుగుచుండ, నివియే యనావశ్యకములని కొందరు తలంచుతరి పై విధములగు రాగ ములు కడువ్యర్థములు ననావశ్యకములు నగుచున్నవనిన వింతలేదు. అందుచే బలిశ్రుతి చేరికగల రాగము లెప్పుడును చెప్పబడియుండ లేదు. కాని రాగములందు ఏకశ్రుతి యంతరములను మరి యిట్టి చిన్న యంతరములను పైకాలములం దెల్లప్పుడు వాడబడినసంగతి మరువ కూడదు.

మరియొక సంగతి. వేంకటమఖి ౭౨ మేళముల నేర్పరచు నప్పుడు ఏకశ్రుతి, ద్విశ్రుతి ఋషభములకు ఒక్క శుద్ధ 'రి'యు, త్రిశ్రుతిచతుశ్శ్రుతిఋషభముల కొక్క చతుశ్శ్రుతి 'రి'యు, నిట్లు శుద్ధచతుశ్శ్రుతి దలకు చతుశ్శ్రుతి 'ధ'యు, శుద్ధసాధారణగాంధార ములకు సాధారణ 'గ'యు, అంతరతీవ్రగాంధారములకు అంతర 'గ'యు, తీవ్రశుద్ధమధ్యమములకు శుద్ధ 'మ'యు, ప్రతిమధ్యమ వరాళిమధ్యమములకు ప్రతిమధ్యమమును, శుద్ధకైశికినిషాదముల కొక్క కైశికి 'ని'యు, తీవ్రకాకలినిషాదముల కొక్క కాకలి నిషాదము నిట్లు పదిస్వరములకును ఒక్కొకదానియందు రెండేసి శ్రుతు లనుచేర్చి చెప్పియుండెనుకదా! ఈ రెండేసిశ్రుతులయొక్క స్వల్పస్వనుల కొక్క పేరు చెప్పుటకు కారణ మితడు చిన్నయంతరములను [illegible] ౨౫౬/౨౪౩, ౮౧/౮౦ ఇట్టివానిని స్థాయినుండి తీసివేసియుంట గమనించి యుంటిమి. పైరెండుశ్రుతులు స్థూలముగ నించుమించు ఒక్కధ్వని వలె నుండునని యెంచికాని, రాగములను విస్పష్టము సేయుటకు సప్త స్వరములుకాని మరి యితరస్వరములు కొన్నికాని చాలియుండక పోవుటచేతను, స్వరము లెప్పుడును శరీరమందలి యెముకలవలె రాగ ముల కాధారము లగుచున్నవి కావున అవి రాగమున కందము తీసికొనిరావలెనని యెంచినప్పుడు సప్తస్వరమూర్ఛనయుతముగనే రాగములను పేర్కొనిన చాలునని యెంచికాని వేంకటమఖి ౧౨ స్వర ములయొక్క ప్రస్తారములతోనే రాగాంగములను చెప్పియుండెనని యెంచవచ్చును. కాని యాకాలమునందేమి, ఇప్పుడేమి రాగముల కాధారములగు స్వరములుమాత్రము కాక మరికొన్ని శ్రుతులనుకూడ గమకములతో జేర్చి మనవారు రాగకళను పోషించుచునే యుండిరనుట మరువకూడదు.

కాని వేంకటమఖి యేర్పరచిన ౭౨ మేళములు కొన్ని వివాది దోషముతో నున్నవని వింతగ కొందరు చెప్పుచుంట కలదు. వివాది దోషముగల నలువది మేళములందలి పైదోషమును పారద్రోలుటకు వివాదిస్వరమును వర్జించియు, లేక యది సంవాదియగునట్లు గమకముతో జేర్చియు పాడుట సంప్రదాయమని యిటీవలి సుబ్బరామదీక్షితులు తన 'సంగీతసంప్రదాయప్రదర్శిని' గ్రంథమున జెప్పియుండెను. వివాదిస్వరసంయోగము లనబడువానియందు అవి రంజకము లగుటకు అన్యశ్రుతులను గమకముల పేర చేర్చబడుట విదితము కావున రాగము లందు పైశ్రుతులు వ్యక్తము లగుచునే యున్నవి. ఇట్లు కొన్ని ప్రత్యేక శ్రుతులను గమకములచే వ్యక్తీకరించుచునేయుండిరని యంగీకరించి నప్పుడు ఆయాశ్రుతులను రాగములందు పేర్కొనుట యావశ్యక మగు చునే యున్నది. తక్కినరాగకళ గమకములచే పోషింపబడుచున్నది.

మరియు ద్వావింశతిశ్రుతులు వరుసగ నాలపించుట పూర్వము కాని యిప్పుడుకాని చూడము. కాని కొందరు ముఖ్యముగ నుత్తర హిందూస్థానపు విద్వాంసులు వీని నట్లు పాడుట కలవడుచుండినట్లు విందుము. ఏరాగమందైనను మూడుశ్రుతులు వరుసగ అనగా చతు శ్శ్రుతి, పంచశ్రుతి ఋషభములు మరి యంతరగాంధారములు పాడ బడుట పూర్వగ్రంథములనుండియు జూడము. ఇందుకు కారణము ఒక స్వరమునకును మరియొక స్వరమునకును మధ్యగల యంతరము వివాదిగ నుండుట యందురు. శుద్ధస్వరములలో (రిగ) ధనిలు పరస్పరవివాదు లగుననియు వికృతస్వరములలో సాధారణ అంతరగాంధారములు, కైశికికాకలినిషాదములు వివాదులగుననియు వేంకటమఖి యెంచి యుండెను. వివాదిస్వరములగూర్చి సోమనాథు డిట్లు చెప్పెను:

"ఏకశ్రుత్యంతరితౌ వివాదితౌ వైరిణౌ మిథో భవతః"

ఈసంగతి గ్రీకులును గ్రహించియుండిరి. అరిస్టోక్సనసు (Aristoxeneus) వరుసగ నుండిన మూడుశ్రుతులను వినుట దుస్తర మని యెంచెను. (It is impossible to hear three next door notes in succession) తంత్రి కంపించునప్పుడు కలుగు 'స్వయంభు' ధ్వనులు లేక "అనురణనాత్మకధ్వనుల"ను మనము గ్రహించునప్పుడవి వరుసక్రమమునకాక పంచమము, మధ్యమము, అంతరగాంధారము, సాధారణగాంధారము ఇట్లు కలుగుచుండుట ప్రకృతిస్వాభావికము. ఇందుచే వరుసశ్రుతులు పాడుటకు యోగ్యము లనదగదు. కావుననే ఇట్టివానిని రాగములందు ఏకాలమునను కానము.

పైసంగతులవలన నిప్పటికి తేలినయంశము లిట్లు గమనింతుము: (౧) శ్రుతియనినను స్వరమనినను ఒక్కయర్థముగనే భరతాదివాగ్గేయకారులు ఎంచిరి (౨) ఇట్లే యనంతరము రామామాత్యులు మున్నగు శాస్త్రవేత్తలు గ్రహించియుండిరి. (౩) శ్రుతియన వినబడుశబ్దము లేక ధ్వనికావున యిది శ్రావ్యమగుధ్వని (Musical sound) లేక ధ్వనిగ (Any sound) నుండవచ్చును. కాని స్వరము రంజకత్వము గల ధ్వనియే (౪) స్వరము నిర్ణయము చేయబడిన శ్రుతియనవచ్చును (౫) శ్రుతులు రాగములం దుపయోగింపబడినప్పు డవి స్వరముపేర నెంచబడెను (౬) కొన్ని శ్రుతులుమాత్రము రాగములం దుపయోగింపబడనప్పుడు వీనిని రాగములందలి వానినుండి ప్రత్యేకముగ జెప్పుటకై శ్రుతియని వ్యవహరింపబడుచుండును (౭) ఇట్లు రాగములందు వదలివేయబడిన శ్రుతులు మరియొకరాగమున నుపయోగింపవచ్చునను టచే నివెల్ల శ్రావ్యమైనవిగనే గ్రహింపవలయును (౮) శ్రుతులు ఆయారాగములందుండి రాగకళను పోషించుచున్నవి (౯) మన రాగకళ నిట్లు పోషించునట్టి శ్రుతులు ఇరువదిరెండుమాత్రము పూర్వము నుండియు మనవారు గ్రహించుచుండిరి కావున నవియే చాలును (౧౦) రాగకళ నింకను పుష్టము చేయగలుగుటకు మనవారు గమకములు చేర్చుచుండిరి కావున విస్తారములగు శ్రుతులు ఆవశ్యములు కావు (౧౧) పెక్కురాగములందు సూక్ష్మ శ్రుతులు గమక సంజాతములు కానివే యిరువదిరెండుమాత్రము రాగములం దావశ్యకములు కావున వానిని ప్రతిబింబింపను నెరిగియుంట ధర్మము. (౧౨) పెక్కుశ్రుతులను మధ్యస్థాయియందు చేర్చుట ద్వావింశతిశ్రుతి పద్ధతిని వ్యతిరిక్తముగ మార్చబూనుట కావున నవ్యమగు నీపద్ధతికి భంగము కలుగునట్లు అనేకశ్రుతులను చేర్చుట భావ్యము కాదు. (౧౩) అనేకులు అనేకవిధముల శ్రుతిజాతములు చెప్పుచుండినను పైన తెలిపిన పేర్లు నవీనకాలమునకు తగియున్నవని గ్రహింపబడు మన్నవి. (౧౪) రాగలక్షణము నారయునప్పు డీపేర్ల నుపయోగించుట భావ్యము.

---

# వసంతము

అంబటిపూడి నరసింహశర్మగారు

౧

అరుణసహకారమృదుపల్లవాంకురములు
కొరికి కోయిలల్ గీతాల గూర్చుకొదమ
తుమ్మెదల పిండు పుష్పరసమ్ముఁ గ్రోలి
యువనిమ్రోఁగ ఝుంకారరవము సేయ
పశ్చిమానిలు డతిశుష్కపత్రములను
దాకి యుత్కటమర్మరధ్వని రచింప
చెట్టులన్నియు చివురెత్తి, చిన్ని చిన్ని
పవడములగాసి బహుమతుల్ పైకి జూప
ప్రకృతినృత్యవిద్యాభ్యాసపాటవమ్ము
నెఱపు నవవసంతర్తుమందిరములోన.

౨

ప్రకృతివర్ణనాసక్తులౌ భావకవుల
తరళరత్నమ్ములైన గీతాలలోన
లలితసుమనోజ్ఞ వ్యాససంకలనమునను
చెలగునట్టి ఉగాదిసంచికలలోన
పటుతరప్రేమపాశసంబద్ధులైన
కామినీ కాముకాంతరంగాలలోన
రక్తవిద్రుమకీస్తివిరాజితమయి
నవనవంబగు చూతపల్లవములోన
ప్రవిమలంబగు కోయిల పాటలోన
జాగరించెడి నూత్నవసంతలక్ష్మి.

౩

ఓ వసంతమా! వివిధవిధోరుపుష్ప
సంచయం బేకడల సమార్జించినావు
సర్వదిగ్వ్యాప్తగంధవిస్తారములను
చిన్ని పుష్పాలలో నెట్లు చేర్చినావు
ప్రకృతిచిత్రమ్ములో ,,పాదపమ్ము కొసల
రక్తరేఖాంకితమ్ముగా రక్తపల్ల
వప్రసూనాల చిత్రించి వ్రాసినావు
గరిమ నెట నేర్చితీ చిత్రకారవిద్య.

---

# రాత్రి

తల్లాప్రగడ విశ్వసుందరమ్మగారు

కోపభరవివశురాలు
కోమలాంగి మోమురీతి
సాయంసంధ్యారుణ రుచి
సాంద్రం బయ్యెన్.
ఆపై దలి గట్టిన న
ల్లని చీరయొ యనుస్త్రీవిధమ,
నల్లని చీకట్లు డాసె
నలుగడ లందున్.

పొరుగువారి జగడంబుల
పొంచి చూచులోకుల నగ
మినమిన లాడుచు మిన్కులు
మింటను మెరసెన్.
తొయ్యలి దేర్పగ వచ్చిన
నెయ్యపు ప్రియుడేమోయన
అర్ధచంద్రు డుదయించెను
ఆకసమందున్.

నెల కిరువంకల నిలబడి
వీచోపుల విసరు భటుల
పగిదిని పయ్యెర గ్రాలుచు
పలుమరు వీచెన్.

కావలి రా భటుడు బట్టు
కంచు కాగడా రీతిని
వేగుజుక్క విహాయసమున
వెలుగులు నించెన్.

రాజగృహము ముంగట బా
కాలు బట్టు వారిరీతి
కుక్కుటగణములు కొక్కొరో
కోయని కూసెన్.

నిశవల్లని చీరవీడి
తెలివలువను దాల్చులీల
వెలికాంతులతోడ జగతి
తె తెలవారెన్.

## నీతిగీత

నండూరి శివరావుగారు

౧

మరల రాని నిన్న కొఱకు కడలక, రాక
నరయ రాని రేపు కాసపడక
కడచునేఁడె నీదిగా నెంచి యెప్పటి
దపుడు చేయు మెల్లి యనక సుమతి!

౨

తిని పనిం జేయకుంటచేఁ దనువు సెడును
తనువు చెడుటను దలఁపులు తాఱుమాఱు
దానఁ దీరని యిడుములు తవులుఁగాన
సోమరికి సౌఖ్యమన్నది సున్న యెపుడు.

౩

ఒరుని కలిమికిఁ దన లేమి కోర్వలేక
యన్యసత్కృతులకు దురూహలు ఘటించి
వాని చెఱుపంగఁ బన్నినపన్నుగడలఁ
బడి నశించును సాలీని పగిది కుమతి.

౪

దుర్దశలు నీయహంకారదుష్కృతముల
ఫలమని యెఱింగి, విధిదూఱ కలఁతి మతిని
చక్కపఱచుము, ఫలములు చక్కనగును
విత్తొకటివేయఁ జెట్టట్లు వేఱుదగును.

౫

తృప్తికంటె సుఖము తృష్ణకంటెను దుఃఖ
మొసఁగునట్టి వవని నొండు లేవు;
కలుగుదానఁ దృప్తికలవాఁడు కలవాఁడు
లేనివాఁడు దానిలేనివాఁడు.

౬

సహజముగ న్యాయకామ్యముల్ సఫలపఱుచు
విశ్వపిత నీహితాహితవిధము లరసి
యధికకష్టప్రయత్నకార్యములు కొన్ని
చెఱుపవగవకు మది మేలుకొఱకె యగును.

౭

ధనము తఱుగుకొలఁది తఱుగుపై పేరున
కున్న వారి కూరకొనఁగనేల?
తఱుగు కొలఁది పెఱుగు తగు పేరుకోరిన
బీదసాద కిడుము ప్రియమెలర్ప.

౮

తలకు మీఱినపనిఁ జేయఁదలఁప కెపుడు
మొదలిడిన కార్యమును నసంపూర్తి విడకు
ధైర్యసాహసముల కసాధ్యంబు లేదు
సంశయాత్మకుఁ జెందు నాశంబునందు.

# సనాతనధర్మవాదులు

వల్లూరి సూర్యనారాయణరావు గారు, బి.ఏ., బి.ఎల్.

శ్రుతి స్మృతిపురాణేతిహాసములమీద యాధారపడిన మన కర్మకాండయంతయు, దైవనిర్మితమనియు, అనాదియనియు, అనుల్లంఘనీయమనియు, ఈ కర్మలను విధ్యుక్తముగ నాచరించనివారు పతితులై నరకమున బడుదురనియు, లేక నికృష్ట జన్మపరంపరల నెత్తుదురనియు, మన హిందూసనాతనధర్మవాదుల వాదనయని నేనభిప్రాయపడుచున్నాను. ఇదియే వారిలో బహుమంది యభిప్రాయమైనయెడల వారివాదన నెదుర్కొనుట యీసమయములో ముఖ్యావసరము. పూర్వకాలమం దన్నిజాతులలో నున్న మూఢవిశ్వాసములు, మూఢాచారములు, మూఢభయములు, మనలో కూడ నుండెను. ఇవి కాలవశమున కొన్ని పూర్తిగా నశించినవి; కొన్ని మారుచున్నవి; కొన్ని యింకను ప్రతిదేశములోను విద్యాగంధములేని పామరజనములో వ్యాపించియున్నవి. కాని, వానియందు పిచ్చినమ్మకము కలిగి గాని, లేక ప్రజలలో బాహ్యాంతశ్శుచులను కలుగచేయవలెననిగాని, మరి యే యితరయుద్దేశ్యములతోనో మనపూర్వులు వానిని మతముతో ముడిపెట్టి వాని నుల్లంఘించిన వారికి దైవికశిక్షల నేర్పరచి వర్ణాశ్రమధర్మముల నిలబెట్ట ప్రయత్నించిరి. వీని మంచిచెడ్డలు ఆవశ్యకతానావశ్యకతలు మన స్వతంత్రాలోచనకు వదలక ధర్మశాస్త్రరూపముగ జనుల నెల్లపుడు బంధించునట్లు చేయగలిగిరి. ఇట్లు రెండుమూడువేల సంవత్సరములు గడచినవి మనదేశములో బుద్ధదేవుడు, జైనగురువులు, రామమోహనరాయి, దయానందసరస్వతి మొదలగువారు వివిధమార్గముల సంస్కరణలకు ప్రయత్నించినను జనసామాన్యమంతయు ధర్మశాస్త్రములకే పేరునకుమాత్రము కట్టుపడుచున్నట్లు కనుపడుచుందురు. వీనిని విమర్శించి కాలానుసారముగ మార్చుకొనుటకు అధికారముగల పూర్వపు ధర్మజ్ఞసభల కీరోజులలో తావు లేకపోవుటచే వ్యక్తుల యింగితజ్ఞానమునకు వీనిని వదలక తప్పనిసరి వచ్చుచున్నది. కాని యిట్టిస్థితిలో మన మనవసరముగ సంఘము కొరకు అనేకమూఢాచారములను పట్టుకొని వ్రేలాడవలసివచ్చుచున్నది.

ఈ యాచారకర్మకాండలు సృష్ట్యాదినుండి దేవుడు మనకేర్పరచెనని యీ సనాతనధర్మవాదులు చేయువాదన మన సాంఘికాభివృద్ధికి మిక్కిలి యాటంకము కలిగించుటయే కాక యీ వాదన సత్యమునకు విరుద్ధమయినట్లు సాంఘికపరిణామశాస్త్రము వేనోళ్ళ ఘోషించుచున్నది. మానవకోటిలో ఆయా జనసంఘములలో యెప్పుడెప్పుడు ఎట్టి విధానములు ప్రబలుచుండినవో, అప్పటప్పటి కాలస్థితులనుబట్టి అవి యెట్లెట్లు మారుచుండినవో మన ప్రజాసామాన్యము తెలిసికొనజాలమిచే కూపస్థమండూకములవలె మన పూర్వధర్మశాస్త్రములలో వ్రాసిన విధులన్నియు నిత్యములు, అనుల్లంఘనీయములు నని నమ్ముటయు, వానిని "యథాశక్తి నహాగమన"మను సామెత ప్రకారము ఏదియొ యొక విధముగ నంధప్రాయముగ నాచరించుటయు జరుగుచున్నది. ఈ శిలారూపములయిన కట్టుబొట్లు కాలానుసారముగ కొంతవరకు సడలుచున్నను ఈ సనాతనధర్మవాదులు వానిని తిరిగి నిలబెట్టుటకు కొన్ని భగీరథప్రయత్నములు చేయుచుండుటచే వీరిని డీకొనుట సంఘసంస్కరణవాదుల విధి. వీరికి ఇతరుల సువిమర్శనలు తలకెక్కవనియు, ఈ పూర్వాచారములు, నమ్మకములు శ్రౌతస్మార్తకర్మకాండలు నిలువనేరవని యెంత వీరికి సహేతుకముగ బోధించినను తమ ప్రయత్నములు విడువరనియు మావంటివారికి తెలిసియున్నను లోకసంగ్రహార్థము వీరిమాటలు పాటింపకూడదని మేము తరచుగా ప్రజలకు నచ్చచెప్పక తప్పదు. మనలో ప్రబలియున్న ఆచారము లనేకములు, మతముతో సంబంధింపజేయవలసినవి కావు. వీనిలో వర్ణాశ్రమధర్మములు ముఖ్యములు. ఇవి లేనిచో హైందవమతమెక్కడుండునని కొందర డుగవచ్చును. ఇది ఆధ్యాత్మికతత్త్వజ్ఞానములోనే యున్నది. జ్ఞానభక్తికర్మయోగముల సముచ్చయమే నిజమైన హైందవమతము. శ్రౌతస్మార్తకర్మకాండలు, వర్ణాశ్రమ ధర్మములు మొదలగునవి సుమారు మూడువేల సంవత్సరములక్రింద యేర్పడిన బ్రాహ్మణమతము. ఈ రెండవదానిని క్రమక్రమముగ వేరుపరచి లేక తగ్గించివైచి, మొదటిదానిని జనసామాన్యములో వ్యాపింపజేసి రాజకీయసాంఘికసంస్కరణలకు మనతోడి మానవులతో పాటుపడవలెనుగాని పరలోకశిక్షలకు భయపడి యీ పిచ్చిమతాచారములచేత అనవసరముగ బంధింపబడుట మనకు తగదు.

నిజముగా ఈ మతాచారములే దైవదత్తములైనచో పరమకరుణాళుడును నిష్పక్షపాతియు నగు దేవుడు ఇన్ని భిన్నమతముల నేర్పరచి వానివిధుల నుల్లంఘించినవారిని, ఆమతము ననుసరించనివారిని నరక

కమున బడ్రోయునా? అన్ని జాతులకును ఒకేవిధమైన యాచారముల నేల కల్పించలేదు? ఈ యాచారములు కాలానుసారముగ మారుచుండగా ఏల యూరకొనుచున్నాడు? అడవిజాతులకు కూడ ఈ నవనాగరికుల బుద్ధులను ఆచారములను ఏల ప్రసాదింపలేదు? ఏకకాలమందు బహుభార్యాస్వీకరణము, బహుభర్తృస్వీకరణము మొదటి నుండియు అనేకజాతులలో నుండగా వానిని లేకుండ అనేకమతములు శాసించుటేల? వివాహములకు వావివరుసల విషయమై కొంచె మాలోచించుడు. సమీపబంధువులలోనుండి తెచ్చుకొనకూడదను నాచారము అనేకములగు అడవిజాతులలో ఇప్పటికిని కలదు. అన్యములగు తెగలలో నుండియే వరునిగాని, వధువునుగాని తెచ్చుకొనవలెను. కొన్ని జాతులలో అన్నదమ్ముల బిడ్డలు, అప్పచెల్లెండ్ర బిడ్డలు ఒండొరులతో వివాహము చేసికొనకూడదుగాని మేనత్తబిడ్డలు, మేనమామబిడ్డలు వివాహములు చేసికొనవచ్చును. నాగరికజాతుల మనుకొను క్రిస్టియనులలో, మహమ్మదీయులలో అన్నదమ్ముల బిడ్డలు వివాహము చేసికొనెదరు. సుమిత్రాదీవిలో మేనత్తకూతురిని వివాహము చేసికొనకూడదుగాని మేనమామకూతురుని చేసికొనవచ్చును. మలేయాదేశములోవలె స్త్రీలగుండా వారసత్వముగల జాతులలో తండ్రి తన కొడుకుయొక్క లాభమునకు తన చెల్లెలికి కాకపోయినను ఆమె కొమార్తెకును, తనకూతురుయొక్క లాభమునకును ఆమెను తినసహోదరి కొమారునకును ఇచ్చి వివాహము చేయుచుండును. కన్నడదేశములో కప్పిలియన్ అను జాతివారు చెల్లెలికొమార్తెను, పినతల్లికొమార్తెను విధిగా వివాహము చేసికొందురు. జంబీకొండలలో ఇరులన్ జాతివారు తమ్ముని కూతురును వివాహము చేసికొందురు. గారోలు జాతిలో పినతల్లిని చేసికొనుట ఆచారము. పినతల్లిగాని పెదతల్లిగాని లేకపోతే మేనమామకొమార్తెలను చేసికొందురు. వితంతువులైన పెదతల్లి పినతల్లులుండగా వారు దూరపుబంధువులను వివాహము చేసికొనుట గొప్ప తప్పుగా భావించబడును. వీరు చనిపోతే వీరికొమార్తెలను తప్పక వివాహము చేసికొనెదరు. కొన్ని జాతులలో రాజవంశమువారు తమలో పరులరక్తము కలియకూడదని తమ అక్కచెల్లెండ్రనే వివాహము చేసికొనెదరు.

ప్రపంచములో నెక్కడను తల్లి కొమారుని, తండ్రి కొమార్తెను వివాహముచేసికొను నాచారము కనబడదు. ఈక్వడారురాష్ట్రమందలి కొన్ని జాతులలో వితంతువులు తమ కొమాళ్లనే యుంచుకొనుచున్నట్లును, అమెరికాసంయుక్తరాష్ట్రముల వాయవ్యమూలనందు అడవిజాతులలో భార్య చనిపోయినవారు తమ కొమార్తెలనుంచుకొనుచున్నట్లును కనపడుచున్నదట గాని, అట్టి సంపర్కములు హేయముగానే చూడబడుచున్నదని వ్రాయబడియున్నది. సాలోమన్ ద్వీపములలో తండ్రి తనకొమార్తెలవలన పిల్లలను కని పెంచుకొనునట. ఇట్టి సంబంధములు మలయామార్షల్ ద్వీపములయందును, పెరూ మెడగాస్కర్ సింహళములలోకూడ కనుపడుచున్నవట. ఈజిప్టులో పూర్వరాజులు తమ చెల్లెండ్రను తప్పక వివాహము చేసికొనుచుండిరి. బర్మాలోను, సయాములోను రాజులు తమ సవతిచెల్లెండ్రను వివాహము చేసికొను నాచారము కలదు. 1900 వ సంవత్సరములో సయామురాజునకు మొదటి యిద్దరుభార్యలు ఆయన సవతిచెల్లెండ్రే. గ్వాటిమాలాలో అన్నయు చెల్లెలు తమతండ్రులు వేరైన యెడల వివాహము చేసికొనవచ్చును. నేటికిని అనేకజాతులలో సహోదరుని యొక్కయు, సహోదరియొక్కయు కుమార్తెలను, మేనత్తను, పినతల్లిని వివాహమును చేసికొనుట విధ్యుక్తాచారముగ నున్నది. బర్మాదేశములో తల్లి, కూతురు, చెల్లెలు, పినతల్లి, అవ్వ, మనుమరాలు తప్పతక్కిన సమీపబంధువులను వివాహము చేసికొనవచ్చును. రష్యా ఆస్ట్రియా హంగెరీ స్పెయిన్ దేశములలో సహోదరులబిడ్డలు చెల్లెండ్ర బిడ్డలు ఒండొరులతో వివాహములు చేసికొనకూడదు. కొన్ని యడవిజాతులలో తమ తెగలలో చేరని దూరపుజాతులనుండియే సంబంధములు కుదుర్చుకొని మన నవనాగరుకులకు మార్గదర్శకులుగ నున్నారు.

ఈ విధముగానే వివాహములకు తల్లిదండ్రుల యంగీకారావశ్యకత, గాంధర్వవివాహములు, వివాహచ్ఛేదనము, బహుభార్యాత్వము, వివాహకర్మలు మొదలగువానిలో, యెన్నియో భేదము లున్నవి. వీని నన్నిటిని దేవుడు సృజించెనా? వీనిని మార్చుకొనుచున్న పాతిత్యమా? వీనిలో ఉత్తమమని తోచినవానిని గ్రహించుచు, తక్కినవానిని విసర్జించుచు అనావశ్యకశృంఖలములను త్రెంచివైచి సంఘములు ముందుకు పోవుచుండును. మనలో ముఖ్యముగా మంచిచెడుదినములు, వారములు వర్జములు, తద్దినములు మొదలగు కర్మలు జ్యోతిషము, సాముద్రికము, అస్పృశ్యత మొదలగు విషయములందు జనులకున్న మూఢవిశ్వాసములను తొలగించవలెను. కాని యీ సనాతనధర్మవాదులు విశాల దృష్టితో విమర్శించుటమాని తమ పూర్వాచారపరాయణత్వమును నిలబెట్ట జూచుట మిక్కిలి విచారకరము.





# వివాహవిచ్ఛేదకశాసనము

అయ్యదేవర లక్ష్మీనరసింహంగారు

దేశము నేడు విపరీతగతుల నడుచుచున్నది. ప్రపంచమున చెలరేగిన విప్లవతరంగములు కేవల రాజకీయములుమాత్రమే గాక, ధార్మికసాంఘికములుగా గూడ పరిణమించి వాని సీమల నున్మూలించుచున్నవి. ప్రపంచము సకలయుగముల నొకే నడక నడువజాలదనియు, కాలానుగుణముగ మతసాంఘికనియమములు మారుచుండుననియును ప్రాపంచికచరిత్రవలనను, ప్రాచీనగ్రంథసమాలోకనమువలనను దెలియగలదు.

మార్పులేక నిర్వికారముగా నిలుచుట కీశ్వరునకైన దరముగాదు. మన భరతవర్షమున మతసాంఘికనియమములు చాలవరకు వాని పరిపూర్ణవికాసకాలమున సృజింపబడినవే. కావుననే యుగములు గడచినను, నిర్మాతలు, అస్తంగతులయినను చెక్కుచెదరక నిలిచియున్నవి. కొన్ని నియమములుమాత్రము కాలప్రవాహమున కెదురీదలేక నిర్బంధములపాలై యినుపపంజరముల బడి నేటివరకు నడచుచున్నవి. కొన్ని నైజస్వరూపధర్మముల గోల్పోయి నామమాత్రావశిష్టములుగా నున్నవి. సంఘము అనేకదురాచారములపాలయి కుంటినడకల నడచుచున్నది. సక్రమపథమున సంఘమును నడపుటకు సంస్కార మవసరమే. లోపముల కప్పిపుచ్చి మాసంఘమే సర్వోత్కృష్ట మయినదనియును, మేమే సర్వజ్ఞులమనియును, మాయాచారము లనాదులనియును, నిర్దుష్టము లనియును, వానివిషయమున వేలుజూపిన మహాపాతకమనియును భావించువారు స్వాభిమానులు, అహంకారులు ననకతప్పదు. ప్రతిమానవునకు తన జాతి, తన సంఘము, తన ధర్మము-వీటిపై నభిమానముండుట తప్పుగాదు. అభిమానము, ప్రేమ లేనివాడు పుడమిలేనివాడే.

మనలో వ్యాపించిన కొన్ని దురాచారముల రూపుమాపుటకు కొందఱు మహనీయులు పూనుకొని కృషి నల్పుచున్నారు. పాపము! ఆమహనీయులకు మతగ్రంథపరిచితి స్వల్పము. అదియును ఏ మాక్సుముల్లరువంటో పాశ్చాత్యవిద్వాంసుల దయవలననో గల్గిన దేగాని వారికి స్వయముగా మాతృకవలన గ్రహించినది అల్పమే. వారికి పాశ్చాత్యాచారములు పరమాదర్శములు. భారతదేశము నొక్కసారిగా యింగ్లండునకు ప్రతిబింబముగా జేయనెంతురు. రెండవవారు సనాతనాచారులమని జెప్పుకొను సంకుచితస్వభావులు గ్రామఫోనుల వలె వేదశాస్త్రముల నప్పగించుచుందురు. కాని విషయవిమర్శన మన్న వీరికి తలనొప్పి. వేదార్థముల ముచ్చటించుటమహాపాపము. సంస్కారముపే రెత్తినవారు వీరి దృష్టియందు చండాలురు. ఈ రెండుకక్షులవారి నడుమ జిక్కి సంఘము ముక్కిరిబిక్కిరి యాడక కృశించుచున్నది.

మన దేశమున సాంఘికజీవనము ఐహికసుఖానందముల నిచ్చునదిమాత్రమేగాక యాధ్యాత్మికమోక్షమునకు గూడ మార్గముగా వచింపబడినది. హైందవసాంసారికజీవనము అనేకబాధ్యతలతో గూడి 'సంఘసేవ కత్యంతోపకారియై పరమపవిత్రమయినదిగా గల్పింపబడినది. ఇందు కేవలధర్మచింతనమే ప్రధానము.

హిందూవివాహము జీవితమును సఫలమొనర్చునొక పవిత్రకర్మ. హిందూదాంపత్యబంధనము వధూవరుల శాశ్వతప్రేమపాశబద్ధుల జేయునది. వారి యిష్టముపై ద్రెంచివేయసాధ్యమయినది కాదు. మరణానంతరమునగూడ సంబంధము వీడునదిగాదు. ఇతరసంఘములలో నిది విషయసుఖ మాదర్శముగాగల యొకబడంబడిక

(Contract). తక్కిన కంట్రాక్టు లన్నిటివలెనే పాక్షికుల (Parties) యిష్టముపై విచ్ఛేదముగూడ కావచ్చును. ఇదియే హిందూసంఘమునకును తదితరసంఘములకును గల విలక్షణవిభేదము. కావుననే వధూవరు లిరువురు అనురూపశీలవయోవిద్యాదులు గలవారై తమ బాధ్యతల గురితింపగలవారుగా నుండవలెను. వివాహము వధూవరుల యానందముకొఱకుగా నుండవలెగాని లోకుల యానందముకొఱకు గాదు. దానికి వయఃపరిపాకము, దేహస్వాస్థ్యము, విద్యాశిక్షణము అనునవి అవసరము. బొమ్మపెండ్లిండ్లు చూచువారు సంతోషించుటకే. కొంతకాలమునుండి బాల్యవివాహములు మనలో నేకారణముననో బాదుకొని సంఘమునకు వేరుపురుగులై బాధించుచున్నవి. వాని నాపుటకై సంస్కారులు సల్పిన కృషి తాత్కాలికముగా ఫలకారి కాజాలకపోయినను వ్యర్థము కాలేదనిమాత్రము చెప్పవచ్చును. వివాహపరిమితి స్వైచ్ఛికముగనో, అస్వైచ్ఛికముగనో పెరుగుచునే యున్నది. కాని సంఘసంస్కారులు సనాతనధర్ము లను ముల్లాలచేతులలోబడి హిందూసంఘము ముర్గీముర్దార్ (శవప్రాయము) అయినది. సనాతనాచారులు మనలో ఎన్ని సాంకర్యము లున్నను ఒక వెంట్రుకవాసియైన ముందు సాగరాదని పట్టుబట్టినారు. సంఘసంస్కారులు ఒక్కగంతున కైలాసశిఖరముపై కెగరవలెనన్నారు. పోతే కైలాసము, పడితే పాతాళము; రెండవమార్గము పనికిరాదని పట్టుబట్టిరి. ఎన్ని ప్రగల్భములు పలికినను, ఎంత పలుకుబడిగలవారమని తలచినను, ఎంతప్రయోజకుల మని గర్వపడినను నేటివరకు తరతరములుగా నాటుకొనిన యాచారములందుగల యాదరము అభిమానమును ప్రజాసామాన్యము విడుచునట్లు చేయ సాధ్యమగునా? వారియెదుట వీరియాటలు సాగునా? కనుకనే వీరు శారదాగారిని ముందుబెట్టుకొని యొక నూతన శాసనమును సృజించి మతస్వాతంత్ర్యమును మంటగలిపిరి. వివాహపవిత్రతను విచ్ఛేద మొనర్చిరి. వయఃపరిమితి హెచ్చించిన హెచ్చించవచ్చును. దీనికి శాసనమును శరణ్యముగా బడయనేల? వివాహము రిజిష్టరీ కావలెను. వివాహములకై ప్రత్యేకకచేరీలు, రిజిస్ట్రారులు, కోర్టులు స్థాపన కావలసి వచ్చినది. ఇన్నికట్టుదిట్టములు, ఇన్ని కాగితపత్రములు జరిగిన యీ వివాహబంధము చిరస్థాయిగా నుండవలెనను నియమముకూడ లేదు. సూర్యచంద్రులు, పంచభూతములు, అగ్నిహోత్రము సాక్షులుగా జేయబడిన వైదికవివాహమునందలి పవిత్రత చిరస్థాయిత్వము యీనవీనవివాహమున నెక్కడ గలదు? ఈ శాసనము విషయమున నీదేశమున తీవ్రాందోళన బయలుదేరినది. గోరుచుట్టుపై రోకటిపోటువలె స్త్రీసంఘపవిత్రతను రూపుమాపుటకు వివాహవిచ్ఛేదకశాసనములకై కృషిసల్పుచున్నారు. వివాహవిచ్ఛేదకశాసనముల గోరువారు వివాహమేల జేసికొనవలెనో బోధపడకున్నది. ఈ కృత్రిమ వివాహముల జేసికొనిన యిల్లాండ్రకన్న వివాహమే యొల్లక మనసుకు నచ్చిన యొకపురుషునితో జీవయాత్ర గడపిన వారవధూమణి యేల పరమపూజ్యురాలు గాదు? 'మాదేశము సీత, సావిత్రి మున్నగు పరమపతివ్రతాశిరోమణుల గన్నతల్లి. మా జన్మభూమియందలి ప్రతియణువును వారి పాదస్పర్శచే పవిత్రమైనది. వారి యశోగానమును మన దేశమునందలి ప్రతి చెట్టు, గట్టు, పుట్ట సల్పుచున్నది—కాదు, ప్రపంచమునందలి ప్రతివస్తువును వారిని కీర్తించుచున్నది. వారి పవిత్రరక్తమింకను వేడిగనే మా శరీరముల ప్రవహించుచున్నది. మేము వారి బిడ్డలము. మాజాతి యత్యంతశ్రేష్ఠమైనది' అని యితరుల యెదుట జెప్పుకొనుచుంటిమే, ఇంక నేమొగముతో మన యాధిక్యము జెప్పుకొనగలము?

మన స్వాతంత్ర్యమా మాసిపోయినది. ఐశ్వర్య మడుగంటినది. పౌరుషము పాడైనది. అవిద్య తాండవమాడుచున్నది. అన్నియు నస్తంగతము లయినను ఆభిజాత్యమును గోల్పోక, పవిత్రతను పరుల కమ్ముకొనక ప్రత్యేకవ్యక్తిత్వముతో తపోమూర్తు లగు మహర్షులయు, పావనశీలలగు పతివ్రతామతల్లులయొక్కయు సంతతివారమని చెప్పికొని మురియుచున్నాము. వారి పాతివ్రత్య విఖ్యాతి ఖండఖండాంతరముల గీర్తింపబడుచుండ, వారి

# రౌండు టేబిలు మహాసభ - లండను - ౧౯౩౦, ప్రతినిధులు


రామ్సే మెక్డొనాల్డుగారు, ప్రధానమంత్రి


వెజ్ వుడ్ బెన్నుగారు, ఇండియామంత్రి


సాంకె ప్రభువుగారు


హెచ్. జి. హేసుగారు


సర్. మాల్కం హెయిలీగారు


ఆర్థర్ హెండర్సన్‌గారు


ఆస్కార్. డి. గ్లాన్విల్‌గారు


రీడింగు ప్రభువుగారు


సర్. ఛార్లెస్ ఇన్నిస్‌గారు


జే. హెచ్. థామస్‌గారు


ఆర్. ఏ. హెచ్. కార్టరుగారు


శ్రీ పీలుప్రభువుగారు


శ్రీ|టి. వి. కృష్ణమాచార్యులుగారు


శ్రీ నవనగర మహారాజాగారు


సర్. సామ్యూల్ హోర్‌గారు


శ్రీ బికనీరు మహారాజాగారు


శ్రీ ఆళ్వారు మహారాజాగారు


శ్రీ పాటియాలా మహారాజాగారు


శ్రీ సాంగ్లీ రాజాగారు


శ్రీ ధోల్‌పూరు (ధవళపురము) రాణాగారు


శ్రీ భోపాల నవాబుగారు


శ్రీ దర్భాంగ మహారాజుగారు


శ్రీ జమ్మూ కాశ్మీరముల మహారాజుగారు


శ్రీ బరోడా మహారాజుగారు


శ్రీ ఛతారి నవాబుగారు


శ్రీ సర్. అక్బర్ హైదరిగారు (నైజాము)


శ్రీ సర్. మీర్జా యమ్. ఇస్మాయిలుగారు (మైసూరు)



శ్రీ బి. శివరావుగారు



శ్రీ డి. బి. ఎ. రామస్వామి మొదలియారుగారు



శ్రీ పర్లాకిమిడి రాజుగారు



శ్రీ సర్. సి. పి. రామస్వామయ్యరుగారు



శ్రీ యస్. బి. తంబెగారు



శ్రీ సర్. ఏ. పి. పాత్రోగారు



శ్రీ యం. ఆర్. జయకరుగారు



శ్రీ వి. యస్. శ్రీనివాసశాస్త్రిగారు



శ్రీ సర్. తేజబహాదర్ సప్రూగారు


శ్రీ రా. బ. ఆర్. శ్రీనివాసన్ గారు


శ్రీ రా. బ. ఏ. టి. పన్నీరుసెల్వమ్‌గారు


శ్రీ కే. టి. పాలుగారు


శ్రీ సర్. మహమద్ షాఫీగారు


శ్రీ మహమ్మదాలిగారు


శ్రీ నవాబ్ సర్.
మహమ్మద్ యూసఫ్‌గారు


శ్రీ హెచ్. పి. మోడిగారు


శ్రీ సర్. ఫిరోజ్ సేత్నాగారు


శ్రీ సర్. కోవస్జీ జహాంగీర్‌గారు


శ్రీ ఎ. హెచ్. గజ్నవిగారు


శ్రీ జే. యస్. బాసుగారు


శ్రీ నరేంద్రనాథ్ లా గారు


ఖా. బ. సర్.
షానవాజ్ ఖాన్ గులాం ముర్తజాఖాన్ భుట్టో


శ్రీ ఏ. కె. ఫజల్ హక్గారు


శ్రీ యం. ఏ. జిన్నాగారు


హెచ్. ఏ. గిడ్నీగారు


శ్రీ సర్. చిమన్‌లాల్ సెతల్వాడ్ గారు


శ్రీ డా. బి. యస్. మూంజిగారు


శ్రీ సర్దారు సాహెబ్ ఉజ్జ్వలసింగ్ గారు


శ్రీ యు. బా పెగారు


శ్రీ యం. యం. ఓన్ ఘీనే గారు


శ్రీ యన్. యం. జోషిగారు


శ్రీ బి. వి. జాధవ్


శ్రీ ఓ. డి. గ్లాన్విల్


శ్రీ ది. బ. యం. రామచంద్రరావుగారు


శ్రీ నవాబ్ సుల్తాను అహమద్ ఖాన్ గారు


శ్రీ సర్. పి. సి. మిత్తర్ గారు

సౌశీల్యము ఆదర్శముగా నంగీకరింపబడుచుండ వారి సంతతియగు మనమే వారి కీర్తిని మంటగలప వలెనా? మనకు పాశ్చాత్యధర్మములు పరమప్రమాణములా? భార్యాభర్తలు ఒకరిలోపముల నొకరు మన్నించి చెడు వర్తన గలిగినవారిని మంచిత్రోవను నడిపించుటకు యత్నింపవలెను. అప్పుడే వివాహము సౌఖ్యప్రదము కాగలదు. మనసంసార మాదర్శప్రాయమై యలరగలదు. సోదరసోదరీమణులారా! వివాహవిచ్ఛేదముల గావింపకుడు. సంసారముల నిస్సారము జేయకుడు. మీ జాతిని దుర్నీతిపాల్జేయు విపరీతసంస్కారములకు గడంగకుడు. మీ మూలపురుషు లగు, భరద్వాజ, విశ్వామిత్ర, వసిష్ఠ మొదలైన మహర్షులయొక్కయు, అరుంధతి, అనసూయ, గార్గి మొదలైన సాధ్వీమణులయొక్కయు సందేశముల దేశదేశాంతరముల జాటుడు. శాసనము నూతనము గాని హైందవజాతీయగౌరవమును నాశనము చేయకుడు. వివాహవిచ్ఛేదకశాసనము పనికిరాదని దొరతనమువారికి మహజర్లద్వారా తెలియపరచుడు.

---

# శంపా విరహిణి

మల్లవరపు విశ్వేశ్వరరావుగారు

శంపాలతాతన్వి
కింపారుపూలసె
జ్జను కూర్చి నాడు చం
ద్రుడు నింగిపై తార
కాసంతతిని విచ్చి!

ఆ పూలలో రత్న
జ్యోతిర్లసత్కాంతు
లసియాడి మిసిమి వె
న్నెల కీలకల బాడి
మిలమిలా నినదించు:

" సురభికాంతులను మా
మరిగించు గీతాల
ననుభవించ వరించి
యరుగు దెంచెడి ప్రేమ
శాలినీ మణీమెవ్వరో?
రావమ్మ! శంపాలతా, కూరుచో!"

" నే నిరాశాభావ
జీమూతముల నెక్కి,
యంతరాళాంతమ్ము
లంటె, యందని మనో
హారు నేకోరకా ఈ
యిరుల బర్వుచు, నంత

మేలేని యన్వేష
ణాన నిస్పృహ కెంది
నాను, సామై వాడి
నాను,—పిల్చెడి నెవ్వరో!
ఆహ్వాన మీవి పాడెడి దెవ్వరో? "

" అడుగడుగు నాబాష్ప
ముల ముత్తియము లురల,
నడుము బంగారు ఒ
డ్డాణమ్ముతోడ వి
న్నాణమ్ముగా ప్రాల,

అమ్లాననేత్రాల
నే భావగంభీర
మౌనాశలో నిరా
శలో చంచలించంగ
కళవెళ ప్రాకంగ,

నడిరేయి నిట్టూర్పు
నుడులతో మము పల్క
రించునో మెరపుకాం
తా! చుక్కలము మేము
తళుకు పూవుల మేము!

నిలిచి వెల్గెడినింగి
నీరాజనము లేము!

పలుకరిస్తున్నాము—
సురభిళాహ్వానాలు
పరచి పిల్చెడిది మేమమ్మా
మా రాణి! విరియు శుభగీతాలుమా వే."

" ఓ తారకా రత్న
భాసమాన సుమా
వళీ! సెజ్జగామిమ్ము
దూసి కూర్చిన రాజు
రాకాశశాంకుడే?

నా వెన్నెలల రేడే?—
నన్ను గన్నాబ్రిమి యా
మిన్ను వాక హృదంత
రాన నే చీకట్ల
లోనో నదృశ్యమై,
దరిలేని యెడబాటు
దరికొల్పి, నాయెడం
ద విదుర్చు రాకాసు
ధాకరుండే నేడు
మీకే తళుకులిచ్చె?,
మీకే పలుకులిచ్చి
నాకోసమే పూల
గాసెజ్జ నమరించె?
పిలిపించె? పలికించె?—
ఓ చుక్కలార మీ రేనా
నన్నిట్లు నటియించి పిల్చుచున్నారా?"—

*        *        *

ఆనింగి-మొలదాగి
ఆలకించె సుధాంశు
డావేళ నామంజు
తారాసుమాలతో
గోరివల్కెడి శంప!

అంత నంతంత నా
శాంతమ్ములను సుధా
కాంతు లల్లన బర్వి,
వింతగా బెరుగుతూ
విరిసి పల్కెను రాజు:

" క్రూరాత్మకుడ నేనె
కోరి నిన్నెడబాసి
నాను శంపాలతా!
నాప్రేయసీ! నిన్ను
నడి శూన్యతను డించి;

ఆ నీలమేఘాల
దూలి సోలుచుపోయి
నావో, నీ కన్నీరు
కారెనో సుమకోర
కాలభాతి, లతాంగి!

నీ ఎడంద విదుర్చి
నిట్టూర్పు వెతలెల్ల
నాత ప్తహతా గుండె
నదిమి తీర్తున నేడు,
పొదవి కౌగిలిలోన!

ఆపూల వన్నెవ
న్నెల తారకాసెజ్జ
నీకోసమే పాడు!
నీకోసమే యాడు!

నీకోసమె చలించు!
ఓ తటిత్కాంత! నీ
వో సరిల్లిన తార
లాదిగి మిలమిలబాడు!
కదలుచో నీమోవి
కలకలా వికసించు!

కష్టంపు చీకట్లు
కడచిపోయెను ప్రియా!
కారు నైరాశ్యమ్ము
గరగించె నీరాలు
వడ్డ కంఠశ్రుతులె!
ప్రేమపథము విచ్చె,
ప్రియప్రేయసుల గూర్చె,
నీగుండెల వ్యథా
నిశితగీతారవమె!
ఓ విరహిణీ! నీ తపస్సె
విరియించె నీఘనీభవహా తమస్సుల్,"

# ఉన్నతవిద్య — హ్టారాగునివేదికవిమర్శన

ఏ. లోకనాథంగారు

హిందూదేశము తూర్పు ఇండియా సంఘము వశములో నుండగా ౧౮౫౪ సంవత్సరములో ఇండియా దొరతనమువారు ప్రాథమిక విద్యనుండి విశ్వవిద్యాలయ విజ్ఞానమువరకు బాధ్యులైయుండవలసినదని ఇంగ్లాండు కంపెనీవారు ఉత్తరవు చేసిరి. తదాది ఉన్నత విద్యకూడ దొరతనమువారి యధీనమం దుండెను. ౧౮౫౮ సంవత్సరములో తూర్పు ఇండియా సంఘపరిపాలన బ్రిటిషురాజుల వశమయ్యెను. బ్రిటిషురాజులుకూడ విద్యావ్యాప్తియందెట్టి మార్పులుచేయక కలకత్తా, మదరాసు, బొంబాయిపట్టణములలో విశ్వవిద్యాలయములు స్థాపించి ఉన్నతవిద్యావ్యాప్తిమాత్రే మెక్కువ యుత్సాహము చూపిరి. ౧౮౫౪ సంవత్సరము డిస్పాచిలో నిర్వచింపబడినట్లు, ౧౮౭౧ సంవత్సరములో కేంద్రప్రభుత్వమువారు విద్యాశాఖను స్థానికప్రభుత్వములకు వదలివేసి కొంత గ్రాంటును మాత్ర మిచ్చుచుండిరి.

౧౮౮౨ సంవత్సరములో ఉన్నతవిద్యాభివృద్ధిని గణించుటకై యొక సంఘము నేర్పచిరి. ఈసంఘమువారు ప్రాథమికవిద్యావిషయమై పెక్కు సలహాల నిచ్చిరి. సదరువిద్య, స్థానికసంస్థల వశముచేయవలసినదిగా గొప్ప సలహాల నిచ్చిరి. ౧౯౦౧ సంవత్సరములో లార్డ్ కర్జన్ విద్యావిషయసభ నొకదానిని జరిపి, ౧౯౦౨ సంవత్సరములో హిందూదేశవిద్యావిధానపు తీర్మానము నొకదానిని ప్రచురించిరి. సదరు తీర్మాన ప్రకారము విద్యా సంస్థలు స్థానిక సంఘముల వశమయ్యెను. ఉన్నత విద్యా పాఠ్యానుక్రమణిక యాయా దేశములకు తగినట్లుగను, మాతృభాషలోనే విద్య నేరుపవలయునని నిర్వచింపబడెను. తదాది ఉన్నత విద్య వృద్ధిచెందు చుండెను. ౧౯౧౨ సంవత్సరములో జార్జి సార్వభౌముడు విద్యా విషయమందు చూపించిన పట్టుదలను శ్లాఘించుచు ఇండియా దొరతనమువారు దేశములోని విద్యా విధానములను విమర్శించి తీర్మాన రూపమున ప్రకటించిరి. ఈతీర్మానమునందు ఉన్నత విద్య ప్రధానముగా ప్రజాసంఘములచే పోషింప బడవలయుననియు దొరతనమువారు గ్రాంట్ విధానముల అమలు జరుపవలయుననియు పాఠ్యానుక్రమణిక, దేశకాలపాత్ర భేదముల ననుసరించ వలయుననియు ననిరి. యుద్ధానంతరము దేశములో ప్రబలిన ఆర్థికదుస్థితివలన విద్యావ్యాప్తి అంత ఎక్కువగా జరుగలేదు. ౧౯౨౦ సంవత్సరములో విద్య, ప్రతిరాష్ట్రములోను మంత్రుల వశమయ్యెను. తదాది వృద్ధిగాంచె ఉన్నత విద్య నిప్పటియావశ్యకత్వము బయల్పడెను.

## విద్యావిషయకములగు లెక్కలు

ఉన్నతమాధ్యమికపాఠశాలలో ప్రస్తుతము చదువువారు ఎనిమిదిలక్షలు. పండ్రెండుకోట్ల మగవారికి ఉన్నతపాఠశాలలలో చదువు విద్యార్థుల సంఖ్య ౬ లక్షల ౫౦ వేలు. ఇందులో ఇంగ్లీషు చదువువారు ౩౭ లక్షలు. ఉన్నత పాఠశాలల సంఖ్య ౫,౮౫౫. దొరతనమువారి ఉన్నత పాఠశాలలు ౮౧౭. స్థానిక సంస్థలు (జిల్లాబోర్డు మునిసిపాలిటీలు) ౮౦౬. దొరతనమువారి గ్రాంటును పొందు ఇతర విద్యాశాలలు ౩౩౭౭. గ్రాంట్ పొందనివి ౧౨౧౯. ఇందు మాధ్యమికపాఠశాలలు ౩౨౦౦. చెన్నరాజధానిలో ౩౮౨ హైస్కూలులు మాత్రమే కలవు. ౨ కోట్ల ౫౦ లక్షల ప్రజలున్న వంగదేశములో ఉన్నతపాఠశాలలో ౨ లక్షల ౩౭ వేల విద్యార్థులున్నారు. ఒకవేయి ఉన్నత పాఠశాలలున్నవి. ౨ కోట్ల ప్రజలుగల చెన్నరాజధానిలో ౧ లక్ష ౮౦ వేలు విద్యార్థులుమాత్రమే కలరు.

## ఉన్నతవిద్య లక్ష్యములు

ప్రస్తుతము మనదేశమందున్న ఉన్నతపాఠశాలల గమ్యస్థానము రెండువిధముల పరిణమించుచున్నది. (౧) విశ్వవిద్యాలయవిద్యాభ్యాసమునకు తయారుచేయుట (౨) గవర్నమెంటు ఉద్యోగములకు ప్రవేశార్హతను బొందుట. ఈరెండు ఆదర్శముల బట్టి పైసంఖ్యలను విమర్శించినయెడల ఉన్నతవిద్య పెంపొందుచున్నదని ఉత్సాహపడవలసిన యవసరము కాన్పింపదు. రెండవ యాదర్శమునకు లోనైన విద్యార్థుల పాట్లు ప్రస్తుతము చెప్పకయే ప్రతివానికి తెలియును. నూటికి సగమునకు పైగా నిరుద్యోగులై తిరుగుచున్నారని ప్రతిరాష్ట్రములవారు ప్రచురించుచున్నారు. ఉన్నత విద్య ప్రస్తుతము ఆరు, ఏడు సంవత్సరముల పరిమితిగలిగియున్నది. ఈసంవత్సరమునుండి వంగదేశమందు ఉన్నత పాఠశాల లన్నిటిలోను మాతృభాష ద్వారానే విద్య జరుపబడును. ౧౯౨౫ మొదలు చెన్నరాజధానిలో మాతృభాషద్వారా విద్య నేర్పుట కనుమతి యివ్వబడినను మిగుల నల్పసంఖ్యాకము లైన పాఠశాలలు మాత్రమే మాతృభాష ద్వారా

విద్య నేర్పుటకు గడంగినవి. మొత్తముమీద ఉన్నత విద్య నేటివరకు ఆంగ్లేయభాషాద్వారముననే బోధింపబడుచున్నది. ఉన్నతవిద్య త్రిమూర్త్యధీనమైయున్నది: (౧) దొరతనమువారు (౨) విశ్వకళాపరిషత్తులు (౩) ప్రత్యేక సంస్థలు. దొరతనమువారు గ్రాంటు నిచ్చుటకై పాఠశాలల పరీక్షచేయు అధికారము గలిగియుండి వారి స్వంత ఆలోచనపరులు చెప్పు విద్యా విధానక్రమణికల ననుసరించినది లేనిది చూచుటయు వీరివిధి. భవననిర్మాణములు వగైరాపనులు ఒకరీతినుండవలయునని, నిబంధన లేర్పరచియున్నారు. మద్రాసు రాజధానిలో అయిదింట మూడుపాళ్లు ప్రయివేటు పాఠశాలలు. ఇవి వంగదేశములో మూడింట రెండుపాళ్లు. బొంబాయిలో సగమునకు సగము. మొత్తముమీద బ్రిటిషు ఇండియాలో అయిదింట మూడుపాళ్లు ప్రైవేటుపాఠశాలలు. ఇట్లు ప్రజలచే నేర్పరుపబడి గ్రాంటు పొందు పాఠశాలపై దొరతనమువారు సంపూర్ణాధికారము గలిగియున్నారు. విశ్వకళాపరిషత్తులు ఉన్నతవిద్యావిధానమందు పాఠానుక్రమణిక యేర్పరుచుటలో జోక్యము కలిగించుకొనక ఉన్నత విద్యాంతపరీక్ష యందుమాత్రమే అధ్యక్షపీఠము నధిష్ఠించియున్నవి. అనగా తమ విశ్వవిద్యాలయములలోనికి వచ్చువారి యర్హతను నిర్ణయించుచుండును. ఇట్టి యర్హత నిర్ణయించుటే దీని విధిగావున ఉన్నతవిద్యాలక్ష్యముల నిర్వచింప వీటికి పనిలేదు. విశ్వకళాపరిషత్ప్రవేశపరీక్షగా ఉన్నత విద్యాంతపరీక్షను చేయుట వీరికార్యము. దీనికిగాను పాఠ్యగ్రంథముల ప్రచురించుట దీనిపనియే. ప్రత్యేక - ఉన్నతవిద్యాసంస్థలు కొన్ని రాష్ట్రములలో పలహాల నిచ్చువనిమాత్రమే. మొత్తముమీద ఈప్రత్యేకసంస్థలు ఉన్నతవిద్యాంతపరీక్షను జరుపుటకు, జరిపించుటకు ఏర్పరుపబడినవి. ఇవి కలకత్తావిశ్వవిద్యాలయకమిషన్ రిపోర్టువారి ఫలితములు. ఈపరీక్ష జరిపించు నధికారము విశ్వకళాపరిషత్తుల యధీనములనుండి తొలగించబడెను. కొన్ని విశ్వవిద్యాలయముల కీజరిపించు అధికారము గలదు. కాని కొన్నిచోట్ల పాఠానుక్రమణికలు తయారుచేయుట, పాఠశాలలకు రికగ్నిషన్ యిచ్చుట, ఈసంస్థల అధీనమైయున్నవి. ఈత్రిమూర్తుల యధీనమందున్న ఉన్నతవిద్య కెవరును బాధ్యత వహించవలసినవారు కాకపోవుటచే, నామమాత్రావశిష్టమై సరియైన ఆదర్శములు లేక దిక్కుమాలినదై యుల్లాడుచున్నది. దొరతనమువారు గ్రాంటుల నద్విని యోగము, విశ్వకళాపరిషత్తువారు తమకు కావలసిన ఉత్తీర్ణసంఖ్యను, ప్రత్యేకసంస్థలు పరీక్ష జరిపించు అనుకూలములు యోచించుచున్నారే కాని యీ ఉన్నతవిద్యావిధానాంత మేది, దీనిలక్ష్య మెట్లుండవలె మొదలగు ప్రశ్నలను పరిష్కరించవలసిన ఆవసరము కలిగించుకొనుట లేదు. నెలకు తనకు వచ్చు సరాసరి ౨ రూపాయల ఆదాయములో తనకుమారుని ఉన్నతవిద్యకై వెచ్చింపవలసిన రెండురూపాయల నాలుగు అణా లెట్లు వ్యర్థమైపోవుచున్నవో గమనించు తండ్రియు లేడు. పరిస్థితులు విషమించు చుండ నిరుద్యోగసమస్య తలయెత్తినది. తన రాబడిలో నాల్గవ వంతు కుమారుని విద్యకై ఖర్చుపెట్ట బడుచున్నదనియు, సదరు ఖర్చు ఆర్థికముగా బూడిదలోపోసిన పన్నీ రగుచున్నదనియు ఉన్నత విద్యనేర్చు విద్యార్థుల తండ్రులు గుర్తెరుంగగలరను సూచన గన్పడుచున్నది. ఇట్టి యాందోళన ప్రజలలో అంకురించినది. హర్టాగు కమిటీ వారు కొంతవరకు దీనిని గమనించియే యున్నారు. వారు సూచనలు చెప్పుటకు పూర్వము మరికొన్ని విషయములు తెలిపెదను. బ్రిటిషు ఇండియాలో మొత్తముమీద ౮ కోట్ల రూపాయలు ఉన్నతవిద్యకు ఖర్చు అగుచున్నవి.

| | |
|---|---|
| స్కూలుపిల్లల జీతముమీద ఆదాయము | ౪౨. ౩% |
| లోకల్ బోర్డు సెస్సులు ... ... ... | ౯. ౯% |
| గవర్నమెంటు కోశమునుండి ... ... | ౩౩. ౮% |
| ఇతర ఆదాయములనుండి ... ... ... | ౧౪. ౧% |

గవర్నమెంటువారు ఉన్నతవిద్యకై వెచ్చించుచున్నది ఖర్చులో మూడింట ఒకపాలు. మదరాసురాజధానిలో రూపాయకు మూడుఅణాలవరకు గవర్నమెంటువారు ఇచ్చుచున్నది. విద్యార్థుల జీతమునుండి రూపాయకు ౯ అణాలవరకు; లోకల్ బోర్డుసెస్సుల నుండి రూపాయకు అణాకాని ఖర్చగుచున్నది. వంగదేశమునందు విద్యార్థుల జీతములనుండి నూటికి ౬౩. ౯ ఖర్చగుచున్నది. మొత్తము మీద గవర్నమెంటువారు ఉన్నతవిద్యకై వెచ్చించు సొమ్ము ఎక్కువో తక్కువో పాఠకులే గమనించెదరు గాక! ప్రాథమికవిద్యకై వెచ్చించు ధనముతో దీనిని సరిపోల్చ నవసరము లేదు. దొరతనమువారు వెచ్చించిన ధనమెట్టి వినియోగముపొందుచున్నదో పాఠకులే గమనించగలరు. కొంతకాలమునకు ఉన్నతవిద్యాపరిపూర్ణులు ఉద్యోగముల పొందగలిగిరి. కాని నేడు వీరు అధిక సంఖ్యాకులగు పట్టభద్రులతో తులదూగలేకున్నారు. ఇది విహీకముగా చూచిన లేలినఫలము. ప్రస్తుత ఉన్నతవిద్యావిధానము మొదలంట లోప భూయిష్ఠమైనదని నేటికి తేటతెల్లమైనది. హర్టాగుకమిటీవారు ఉన్నతవిద్యాఫలితములు రెండుగా తేలినవని నిర్వచించుచు ఆంగ్లేయభాషయం దభిమానము ప్రజలయం దెక్కువగుచున్నదని చెప్పుచున్నారు. వీరియిట్టి వ్యామోహమునకుగల కారణములను పూర్తిగా నియ్యక అక్కడక్కడ స్వవచనవ్యాఘాతములతో పేజీల నింపియున్నారు. ప్రాథమికవిద్యావిధానములోనున్న 'వంచన' (Wastage) ఉన్నతవిద్యావిధానమందు లేదని చెప్పుచున్నారు. "More Practical" విధానములు ఉన్నత పాఠశాలలో లేవనియు, ఉన్నతవిద్య ప్రతివిద్యార్థికిని విశ్వకళాపరిషత్ప్రవేశ ఉద్యోగప్రవేశములకు అర్హతలను మాత్రమే కలుగజేయగలదని తేలుచున్నదనియు వచించినారు. ఉన్నతవిద్యాంతపరీక్ష ఫలితాంశములను జూడ నూటికి ౪౦ మంది మాత్రమే విశ్వకళాపరిషత్తునకు ప్రవేశార్హులగుచుండ మిగిలిన అరవైమంది యేమగుచున్నారో హర్టాగు కమిటీవారు చెప్పకపోయినప్పటికిని ప్రాథమిక

విద్యావిషయసందర్భమున నిర్వచింపబడిన 'దండుగ' సిద్ధాంతములో చేరుచున్నారని తేలుచున్నది. అధికసంఖ్యాకులు పరీక్షలో తప్పుటకు కారణములు చెప్పుచు పాఠశాలలయందు నిర్మాణకార్యక్రమములలో లోపము లుండవచ్చుననియు విద్యావిధానములు విద్యార్థుల స్వభావములకు విరుద్ధములై యున్నవనియు నుడివినారు. ప్రస్తుత విధానములో గొప్పలోపము సంవత్సరాంతమున జరుగు తరగతివారి పరీక్ష ఫలితములు. కారణాంతరములచే ప్రధానోపాధ్యాయులు తరగతులవారి ఉత్తీర్ణ సంఖ్య బహుళము చేయుటవల్లనే విద్యాగరిష్ఠత (Efficiency) తగ్గిపోవుటకు కారణమయ్యెనని చెప్పుచున్నారు. పర్యవసానముగా వీరు తేల్చిన విషయ మేమన: బహుళసంఖ్యాకులగు విద్యార్థులు ఉన్నత పాఠశాలలో తమ ఆర్థికశారీరక శక్తులను దుర్వ్యయపరచుచున్నారనియు దీనికి కారణ మెట్టి లక్ష్యము లేని ప్రస్తుత విద్యావిధానమే యనియు ఘంటాపథముగ జెప్పుచున్నారు. ఇటువంటి 'దండుగ'కు ఈకమిటీవా రెంతయో చింతిల్లుచున్నారు. అన్నిరాష్ట్రములలోను తరగతులవారి ప్రమోషనులు బహుళములకనైనవని వీరినిశ్చితాభిప్రాయము.

హర్టాగు కమిటీవారు విద్యాభివృద్ధినిమాత్రమే విచారించుచు ప్రధానాంశము వదలిపెట్టవలసి వచ్చినవారైరి. ఉన్నతవిద్యాలోపముల క్రోడీకరించి యాయాలోపములు సవరించు బాధ్యత కలుగజేసికొనక రెండు సామాన్యసిద్ధాంతములను మాత్రము పొందుపరచిరి. విద్యావిధానము దేశమంతయు ఒక్కరూపమున నుండగూడదనుటకు తగిన కారణములు చూపకయే మాతృభాషలో విద్యగఱపు మాధ్యమికపాఠశాలలు పల్లెటూళ్ల నుండవలయుననియు అందు పాఠానుక్రమణికలు వివిధములుగ నుండవలయుననియు మొదటిదిగ జెప్పిరి. సదరు పాఠశాలలో విద్యార్థులకు పారిశ్రామిక వ్యాపార సంబంధమైన కళాశాలల ప్రవేశమునకు తగు ప్రథమశిక్ష గఱపవలయుననియు నిర్వచించిరి. వ్యవసాయవిద్య యెక్కువ ప్రాధాన్యము పొందవలయుననియు గ్రామపరిశుద్ధత, సహకారసంఘసూత్రములు మొదలగునవి పాఠ్యములుగ నుండవలెనని వీరి కోరిక. దొరతనమువారి కోరికలకు కొఱత యుండదు. ఉద్దేశ్యములు భావగర్భితములు. ఊరడింపు లెక్కువ. కార్యము లల్పములు. ౧౮౫౪ వ ఉడ్డుగారి డిస్పాచినుండి నేటివరకు పరిపాలకుల విద్యావిషయములగు తీర్మానములన్నియు భావగర్భితములు. క్రియారూపమును దాల్చువేళలయందు ఈచుప్రాతనాబడుచున్నవి. సంకుచితములై నిష్ప్రయోజనములై విద్యార్థిని నైతికార్థికబలహీనునిగ జేయుచున్నవి. దొరతనమువారి తీర్మానముల సారాంశమేదన మాతృభాషలలో ఉన్నతవిద్య వ్యాపింపజేయుట. మాతృభాషలో విద్యగఱపుట కెట్టి ప్రోత్సాహము పొందుటలేదు. ప్రతిబంధకములు దొరతనమువారు వేరుగ సృష్టింపబనిలేదు. ఉద్యోగములకు, విశ్వకళాపరిషత్ప్రవేశములకు మాతృభాష చెల్లనిడబ్బు. మరియు, ఉగ్గుపాలతో నాంగ్లేయభాష నభ్యసించి దానివల్ల పెక్కు ఐహికగౌరవములను సంపాదించిన ఆంగ్లమానసపుత్రుల యధికారములకు లోనివై, సంకుచితభావప్రపంచమున దిరుగులాడు తార్కికుల కుతర్కవాదములకు ఆలవాలమై యుండు విశ్వకళాపరిషత్తులు, మాతృభాషాప్రాధాన్యము గల ఉన్నతవిద్య కెట్లు గౌరవింపగలవు? మాతృభాషను విద్య గఱపుటకు విరసించు విశ్వకళాపరిషత్తులు గొప్ప పరిషత్తు లనిపించుకొనుచుండ ఉన్నతవిద్యావిధానమునందు మాతృభాష యెట్లు ప్రధానస్థానము పొందగలదు? ఒక్కపెట్టున మాతృభాష ఉన్నతవిద్యలోనికిని, విశ్వకళావిద్యలోనికిని జొరబడలేదు. మాతృభాష ప్రవేశము కలిగించుకొనుట కెట్టి పరిణామము పొందవలెనో విద్యాభిమానులని గర్వపడెడు ఆంగ్లమానసపుత్రులే చెప్పవలెను.

వ్యవసాయవిషయమై విచారించుట కేర్పడిన రాయల్ సంఘమువారు ఉన్నతవిద్యయొక్క నిజమయిన రూపమును మోమోటమిలేక దెల్పిరి. 'అరుదు' సూత్రము ననుసరించి కొంతకాలము క్రిందట ఆంగ్లవిద్యయందు ప్రజలు గాఢాభిమానులై యుండిరనియు అందువల్ల పల్లెటూళ్ల విద్యార్థులు బస్తీల నింపిరనియు, ప్రస్తుతము సప్లయికావలసినదానికంటె సరకెక్కువైనదనియు అందుచే విద్యావిధానము సంపూర్తిగ మారవలయుననియు అల్లుమారి నూటికి 75 మంది విద్యగలవారైనప్పుడు విద్యయొక్క పరమార్థలక్ష్యములు సరిగా గ్రహింపబడుననియు వీరు తలంచుచున్నారు. నిజము కావచ్చును. కాని యీరెంటికిని సంధిసమయమున విద్యయొక్క సహజమయిన విలువ చాలవరకు తగ్గవలసివచ్చును. ప్రజలలో విరక్తిభావము హెచ్చి విద్యార్థుల సంఖ్య తగ్గుదలచెందజీరునను సూచనలు చాలచోట్ల పొడసూపుచున్నవి. మాతృభాషద్వారా విద్యగఱపు పాఠశాలల విద్యావిధానము ఆయాదేశకాలపాత్రములకు తగినట్లు సవరింపబడిన పల్లెటూళ్లు వృద్ధినొందగలవని హర్టాగుకమిటీవారి యభిప్రాయము. ఉన్నతవిద్యకు, ప్రాథమికవిద్యకు ఉపాధ్యాయులను తయారుచేయుటకు యంత్రశాల కావలెనట. పల్లెటూళ్ల పాఠశాలలయందు పనిచేయుటకు వేరుగ క్రమశిక్షను పొందిన యుపాధ్యాయులు కావలెనని వీరి గట్టియభిప్రాయము. వీరితో నేకీభవించుటకుముం దొకసిద్ధాంతమును చర్చించవలయును. ఉన్నతవిద్య దేశమందంతయు ప్రధానాంశములలో నేకోన్ముఖమై యుండవలయునా, లేక పట్టణములు గ్రామము లనుభేదములకు తావివ్వవలయునా? ఈవిషయము చక్కగా చర్చింపవలసినదగుటచే ప్రస్తుతము వదిలివేయవలసివచ్చుచున్నది. విద్యావిధానము స్థలాంతరభేదములకు ఒకపక్షమున తావిచ్చినప్పటికిని మూలసూత్రములను విద్యాలక్ష్యములందు భేదముకలిగి యుండరాదు. విశ్వకళాపరిషత్ప్రవేశమునకు ప్రతివారికిని అవకాశముండవలసినచో విద్యావిధానమందు భేదముల కల్పింపరాదు. ఉన్నతవిద్యయే పరమావధిగా కోరువిద్యార్థులు కూడా దేశమంతటను భిన్నభిన్నలక్ష్యములు గలవారై యుండుట సమంజసముగాదని తోచుచున్నది.

సాంకేతికవిద్యల విషయములో, యిప్పు డవలంబింపబడు చున్నవిధానములు భౌతిక పనికిరావనియు, లాభశూన్యములనియు విద్యార్థి భావి పారిశ్రామిక కళా విద్యకు సోపానములు కావనియు, కన్నీళ్లుతుడుచుటకును ఆత్మవంచన చేసికొనుటకునుమాత్రమై యున్నవనియు వీరభిప్రాయపడుచున్నట్లు వీరి అభిప్రాయములవలన విశదమగుచున్నవి. అనగా మనరాజధానిలోని ఉన్నతవిద్యాపాఠశాలలలో 'మాన్యుయల్ ట్రైనింగు' (Manual Training) తరగతులు నిష్ప్రయోజనము లని తేటతెల్లమగుచున్నది. ఇందుకొరకై వెచ్చింపబడు అర్థము వ్యర్థమగుచున్నది. శిక్షనుపొందు విద్యార్థులు దాని విలువను గ్రహించలేక పోవుటయేగాక దానిపరమార్థమును, ఆటపాటముగ నెంచుచున్నారని హార్టాగుకమిటీవారికి తోచినది. ఇది ముమ్మాటికి నిజము. ఉన్నత విద్యకును సాంకేతికవిద్యకును పరస్పరసంబంధము కలదని యేవిద్యాభిమానులు గుర్తించలేదు. దొరతనమువారు నట్టి సంబంధము గ్రహించినట్లుగా తేలుటలేదని వీరి నిశ్చితాభిప్రాయము. అందరు విద్యార్థులు కొంత జ్ఞానము సంపాదించిన పిదప సాంకేతికవిద్యలు విశ్వకళాపరిషత్ప్రవేశార్హత కలిగించు విద్యలు నేర్చుకొనవలయునని వీరియభిప్రాయము. ఇట్టి యుత్తమవిద్యావిధానపుపట్టికలను తయారుచేయుట కెవరు బాధ్యులో యెప్పుడు తయారు కావలయునో వీరు చెప్పక వదలిపెట్టుట సమంజసముగా లేదు. ప్రస్తుతము విద్య మంత్రులయధీనమైన శాఖ కావున డిపార్టుమెంటు వేత్తల సలహాలుపొంది విద్యావిధానము వీరు తయారుచేయవలయును. ఉద్యోగస్థులకు మంత్రులకు గల అభిప్రాయ మేకీభవించినగాని కార్యము కొనసాగదు. ఇట్టి యిద్దరు వ్యక్తుల మనోభావము లేకీభవించుట కడు దుస్తరము. సదరు విషయములో సైమను సంఘమువారి వ్యాఖ్యానములు పాఠకులు గమనించెదరు గాక!

## పరీక్షలు

మాధ్యమికపాఠశాలాంతమున కేంద్రపరీక్ష జరుపవలెనని కొందరుసాక్షు లభిప్రాయ పడినట్లుగా వీరు వచించినారుగాని యీవిషయమై యిదమిత్థమని చెప్పలేదు. ఉన్నతవిద్యాంతపరీక్షను గూర్చి చర్చించుచూ అతీతమైన 'దండుగకు' కారణమగుచున్నదని వీరభిప్రాయపడుచున్నారు. అధికసంఖ్యాకులు ఉన్నతవిద్యపొందుచున్నప్పుడు ఆ విద్యాగరిష్ఠత తగ్గిపోవుచున్నదనియు, యిట్టి తగ్గుదలకు కారణము అర్హతలేని విద్యార్థులను ప్రమోషన్లు చేయుటయే యనియు వీరు తేల్చినారు. గరిష్ఠతప్రమాణము లెట్లునిశ్చయించవలెనో వీరు నిర్వచించిన బాగుండెడిది. ఉత్తీర్ణుల సంఖ్య అత్యల్పమైనప్పుడు గరిష్ఠత ఎక్కువగు నను వాదమునకు వీరు ప్రతివాదులు. వీరు క్రోడీకరించిన లెక్కల ప్రకారము ఉత్తీర్ణత సరాసరి నాటికి ముప్పదిగా నున్నది. ఇట్లున్నను గరిష్ఠత పోయినదని విలపించుట చూడ రాముడు చందమామకై యేడ్చినట్లున్నది. గరిష్ఠతాప్రమాణములు మనః ప్రపంచ పరిణామములు. కేవలము కల్పనాకథలుగా తోచెడి. భావశూన్యులై వ్యాకరణాదిగ్రంథముల కంఠపాటగా నప్పగించగల ప్రపంచ జ్ఞానశూన్యు లగు పూర్వ పట్టభద్రులం దెక్కువ గరిష్ఠత గలదో, విశాల భావనారూఢులై విశ్వమానవ ప్రపంచమును కవిపోల్కి చూచి ఆనందించు నవీనపట్టభద్రుల ప్రావీణ్యము ఎక్కువో చెప్పగలిగినవారు చెప్పవచ్చును. వారి ప్రావీణ్యమును నిర్ణయించు సిద్ధాంతముల కూడ నిర్వచింప బూనవలయును. హార్టాగు కమిటీవా రిట్టిపని పెట్టుకొనలేదు.

## ఉపాధ్యాయవర్గము

విద్యానైపుణ్యము ఉపాధ్యాయవర్గముపై నెక్కువగా నాధారపడియున్నది. బోధనశిక్షను పొందిన ఉపాధ్యాయులసంఖ్య యీతీరున నున్నది. బొంబాయి 12%, వంగదేశము 22%, చెన్నరాజధాని 78%, చెన్నరాజధానిలో ఉన్నతవిద్యాలయములలో 20.1 ఉపాధ్యాయులు, వంగదేశమందు 12.18 మంది కలరు. బోధనకళాశాలలో అమలులో నున్న శిక్షావిధానములు నవీనపద్ధతుల ననుసరించుటలేదనియు, యంత్రములతో సులమూసు ఉపాధ్యాయులను తయారుచేయుచున్నవనియు ఉపాధ్యాయవృత్తికిగల బాధ్యతను గుర్తెరింగించగల పాఠానుక్రమణికలుకూడ లేవనియు వీరియభిప్రాయము. బోధనపాఠశాలలు గవర్నమెంటు ఉద్యోగస్థులపరమగుటచే వీరి పడికట్టుపద్ధతు లనవసరములై విద్యార్థియం దెట్టియభిరుచిని కలిగించలేకపోవుచున్నవి. ఇక్కడికి వచ్చు ఉపాధ్యాయు లనుభవముగలవారు కాక ఉద్యోగరీత్యా కాలము గడుపువారైయున్నారు. అట్టివారిచే బోధనవిధాన మెంతచిత్రముగ బోధింపబడునో శిక్షనుబొందు ఉపాధ్యాయులకే అనుభవము.

## వేతనములు

ఉపాధ్యాయుని వేతనములు కడుతక్కువగ నున్నవి. వంగదేశమందు ఉపాధ్యాయుని వేతనము హీనతమముగా నున్నది. ఇది యిట్లుండ ఉద్యోగస్వామ్యము (Tenure of office) బుద్బుదప్రాయమై యున్నది. స్థానికసంస్థలలోని ఉపాధ్యాయవర్గమువారి గతి కూడ హార్టాగుకమిటీవారు చెప్పినట్లు అనిత్యమై,సంప్రదాయశూన్యమై అల్లాడుచున్నది. ఏరాష్ట్రమందుగూడ ఉపాధ్యాయుని వేతన మతని యర్హతకు తగియుండలేదు. అనిత్యమైన ఉద్యోగముపై ఆధారపడుట వలన ఉపాధ్యాయులు సద్విద్యావ్యాప్తికి సహకారులు కాలేరని వీరి యభిప్రాయము. వీరియభిప్రాయముతో నేకీభవించుచు ఈలోపములు సవరించుమార్గములు వీరు సూచింపనందులకు చింతిల్లవలసియున్నది. తామరాకుమీది నీటితుల్యములైన ఉద్యోగముల నమ్ముకొని ఉపాధ్యాయులు సంతృప్తమనస్కులై శక్తివంచనలేక పనిచేయగలరని నమ్ముట పిచ్చి. ఈవిషయములో గ్రాంట్స్మృతిలో కొన్ని మరతులను చేర్చినగాని పరిస్థితులు మారవు. క్రతములు, పాఠ్యములు, బెదరింపులు ఎట్టిపనినిచేయజాలవు; చేయుటయు లేదు.

దేహదార్ఢ్యము పెంపొందుటకు, పౌరసత్వపు హక్కులర్థము చేసుకొనుటకు, సంఘసేవా కార్యముల ప్రోత్సాహించుటకు, తగిన సౌకర్యములు ఏర్పడుచున్నవే కాని నిజమైన సంస్కరణ లింతవరకా చరణలోనికి రాలేదు. వైద్యపరీక్ష పేరునకు మాత్రమే జరుగుచున్నది. రోగము తెలిపిన మాత్రమున నారోగ్యము వృద్ధిపొందదు. పరీక్షించిన వైద్యుడు యింగ్లీషుభాషలో రోగము పేరు వ్రాసిపోయినంతనే తల్లిదండ్రులు తగినశ్రద్ధ తీసుకొనెదరని నమ్ముట చాల పొరపాటు. అట్లు తీసికొనవలసిన యవసరము వారికి గనుపడుట లేదు. బాలభటసంఘముల చర్యలు దుస్తులడాబుతోను, పత్రికాముఖమున గోరంతలు కొండంతలుగా పొగడుకొనుటలోను సరిపోవుచున్నవి. విద్యార్థులందు సాంఘిక సేవవీక్షను పురికొల్పక, బాహ్యచిహ్నప్రాధాన్యమును జాటుచున్నవి.

ఉన్నతవిద్యాప్రశంస ముగింపుచు హార్టాగుకమిటీవారు ఉన్నత పాఠశాలలలో చదువు విద్యార్థుల తెలివితేటలు బాగుగ తగియున్నవనియు పురోభివృద్ధికి చాల అనుకూలము లనియు పొగడియుండిరి. విద్యావిధానముమాత్రము మార్పుచెందవలె నని రూఢిగ తెల్పివారు. వారి సంస్కరణవిధానముల నన్నిటిని కొంతవరకు విమర్శించియుంటిని.

సైమనుసప్తకము హార్టాగునివేదికను తమ నివేదికలో పొందుపరుచుకొనుచు, విద్యావ్యాప్తిని పరీక్షించుటకు ఒకవిచిత్రసిద్ధాంతమును నిర్వచించిరి. విద్య ప్రజలలో పౌరసత్వపు హక్కులను గ్రహించుటకును, రాజకీయ సమస్యల నన్వయించుటకును సమర్థతను చేకూర్పవలెనని వీరి సిద్ధాంతసారము. సరియగు రాజకీయనాయకులు, రాజకీయతంత్రజ్ఞులు తయారైనయెడల విద్య గమ్యస్థానమునకు చేరినదని యెంచవలెనట. సైమన్‌సప్తకము క్రొత్తవిద్యావిధానము నిర్వచించుట వారిపనిగాదని సంతోషించుచు హార్టాగువారిసూచన లమలులో పెట్టుట శ్రేయోదాయకమని సలహాలనిచ్చినారు. విద్యావిధానసంస్కరణలు తాము నివేదించిన రాజకీయసంస్కరణలతోపాటుగ నుండు నేమోయని తలచికాబోలు ఊరకుండి ధన్యులయిరి. హిందూవిజ్ఞానముపట్ల వీరికిగల సానుభూతి వీరిని నడపించినదృష్టిలో నిమిడియుండెను. అమెరికావారికి ఆదేశచరిత్ర స్వాతంత్ర్యస్థాపనతో మొదలిడినట్లు హిందూదేశములోనివిద్య ఆంగ్లేయపరిపాలనతో వచ్చినట్లుగా వీరు నిర్వచించిరి. విద్యయనగా వీరిసిద్ధాంతముప్రకారము అచ్చొత్తింపబడిన పుస్తకములసంఖ్య. ప్రస్తుతవిద్యావిధానమునకు పూర్వసంప్రదాయము లరిష్టములుగా పరిణమించెననియు, అందువల్ల మంత్రులపరమైన విద్య సంఖ్యలలో వృద్ధిచెందినప్పటికిని నష్టదాయకముగ పరిణమించుచున్నదనియు వీరు వ్రాసినారు. మంత్రులకు పూర్వము అనగా ౧౯౨౦ వ సం॥నకు వెనుక విద్యానిపుణులని చాటింపబడి యింగ్లాండునుండియే దిగుమతిచేయబడిన అధికారులచేతులలో నుండెను. అట్టి విద్యావిధానమును సైమన్‌సప్తకము తుత్తునియలుగా ఖండించినది. ఇట్టి నిష్ప్రయోజన విద్యావిధానమునకు బాధ్యు లెవ్వరో పాఠకులు గమనించెదరు గాక!

పదింట తొమ్మిదిపాళ్లు హిందూదేశీయులు గ్రామములలో నివసించుచున్నారు. లెక్కలనుబట్టి ప్రపంచములోని జనాభాలో నీ రారవవంతు. ఆడతేక మద్దెలమీదపడినట్లు దొరతనమువారు విద్యావ్యాప్తికి గడించి శతాబ్దమున్నరపైనే యైనప్పటికిని హిందూదేశములో ౧౦౧ కి పదిలోపుగా విద్యావంతులున్నారని చెప్పుకొనుటకు సిగ్గుపడక, గ్రామములలోని ప్రజాబాహుళ్యము విద్యావ్యాప్తికి ప్రతిబంధకముగానున్నదని సాహసించి వ్రాయుటయందు వీరిసుహృద్భావములు గోచరించుట లేదు. బస్తీలయందు విద్యాశాలల సౌకర్యములు పెంపొందించుట, గ్రామములయందు విద్యాశాలల నిరుత్సాహపరుచుట దొరతనమువారి సంప్రదాయమైయున్నది. ఏ గ్రామములందు వారి ఉన్నతవిద్యాలయములు స్థాపించిరి? మచ్చునకొకటైనను లేదుకదా! వారి ఉద్యోగస్థులవసతిసౌకర్యములు, రాకపోకల ప్రతిబంధకములు వారికి ముఖ్యము. అట్టితరి గ్రామప్రజలు విద్యావ్యాప్తికి ఆవకట్టులని చెప్పుటకు వీరికెట్లు తోచినదో తెలియకున్నది. పరిస్థితులు సరిగ లేవను సిద్ధాంతము కుతర్కవాదములది. పరిస్థితుల నేర్పరుచుట పాలకులబాధ్యత. ఇది త్రోసిపుచ్చి ప్రజల నిందించుట అసమర్థుల వాదము. వీరి సారాంశ ధోరణి యిట్లుండ వీరి నిర్మాణపరత యెట్లుండునో లేలికగా ఊహించవచ్చును. ఉన్నతవిద్యపట్ల వీరి విమర్శనలు నిష్ఠురములేక నిజము తెలిపినవి. విశ్వకళాపరిషత్ప్రమాణముక్రింద పెంపొందవలసిన ఉన్నతవిద్య సంకుచితమై ఆదర్శవిహీనమై వెచ్చింపబడిన అర్థమును ఫలశూన్యముచేయునని వీరి నిశ్చితాభిప్రాయము. విద్యావిధానములో జరుగవలసినమార్పులు నిర్మాణములలో నుండవలెననియు స్థానికసంస్థలకు దూర మాలోచింపక సత్వరముగ విద్యను వశముచేయుటచే తప్పులు మెండైనవనియు వీరియుద్దేశ్యము. విద్యాశాఖాధికారుల సంఖ్య హెచ్చింపవలెననియు ప్రావీణ్యమున నెక్కువ యాదరము చూపుట యవసరమనియు అట్టి పరీక్షాధికారులచే నడపింపబడువిధానము సక్రమమార్గమున నడచుననియు వీరియభిప్రాయము. ఇది చర్చనీయాంశమే. ఉపాధ్యాయవర్గమునకు సంతుష్టిచేసి, పాఠ్యములను విద్యార్థుల సహజశక్తుల కనుకూలముగా చేయు సంస్కరణముచే ఫలించునుగాని తక్కిన మార్పులు ఫలదాయకములు గావు.

విద్యాలక్ష్యములు జాతిసంప్రదాయములను, జాతిపరిణామమును అనుసరించియే యుండవలెను. మనదేశమందలి విద్యావిధానము, సమష్టి మానవలక్షణమున కనువాదముగా నుండవలెను. చతుర్విధ పురుషార్థము లను ధర్మార్థకామమోక్షములే విద్యలకు లక్ష్యములుగా నుండవలెను. బ్రహ్మచర్యము, ఛాత్రశిక్ష, ప్రాక్పశ్చిమభేదము లేని విజ్ఞానము, జాతివైలక్ష్యమును జూపించు కళలు, విద్యావిధానమందిముడ్చవలయును. సాంకేతికవిద్య లని పిలువబడు చతుష్షష్టికళలకు విద్యావిధానమందు తా వుండవలయును. అవశ్యపాఠ్యములు, మాతృభాష, ప్రజాసేవ, అభిమానపాఠ్యముకూడ నుండవలెను. ఉన్నతవిద్య ఆది అంతము గలదై యుండి ద్రవ్యోపార్జనకుకూడ సహకారియై నిరాడంబరముగల బాహ్యచిహ్నములుగలదై నాలుగుసంవత్సరముల ప్రాయముతో నుండిన బాగుండునని తోచుచున్నది. హార్టాగుకమిటీవారినివేదికను విమర్శించుటే యీవ్యాసముయొక్క ప్రధానోద్దేశ్యము గాన విద్యావిధానము విపులముగ నెట్లుండవలెనో వ్రాయుట లేదు.




౧

అండపిండాత్మకమగు బ్రహ్మాండమును సృజించి, నవనవోన్మేషమగు ప్రకృతిరంగమధ్యమున లీలావినోదియగు భగవంతుఁడు ప్రాణప్రతిష్ఠ యొనర్చిన ప్రాకృత వ్యక్తులలో నే నొకరిని. అపుడే లావణ్యము నాసొమ్మయ్యెను. ననుఁగాంచి సృష్టి సార్థకమయ్యెనని నాజనకుఁడు సంతసించెను. జన్మము ధన్యమయ్యెనని నాసైదోడు సంభ్రమాశ్చర్యచకితుఁడయ్యెను. పృథివి నవపల్లవసూనసమాశ్రితములగు వృక్షములతో నన్నాహ్వానించెను. ఉదకము చల్లదనము నొసఁగు సన్నని వానతుంపురలతో నన్నెదుర్కొనెను. సూర్యతేజ మసంఖ్యాకములగు కిరణములతో నాకు మార్గదర్శియయ్యెను. వాయువు అనంతసహస్రసూనముల సుగంధమును నాకారగింపు వెట్టెను. ఆకసము దివ్యజ్యోతిర్విలసితమై నాకు గొడుగు పట్టెను. ఇటుల పంచభూతములును, నారాకవలన విలసనోన్ముఖములయ్యెను. మంగళప్రదమగు నా సుముహూర్తమునఁ బుట్టిన రెండు వ్యక్తులలో కేంద్రమును నేను. ప్రకృతియందంతటను వెల్లివిరియు రామణీయకమును, సౌకుమార్యమును నాకొఱకే సృజింపఁబడినవి. అంతియకాదు. చేతనాచేతనమగు నఖిలప్రపంచము నాకర్షించి దానివలన నాకర్షింపఁబడు మూలవిరాట్టును నేను. సంకల్పసిద్ధి లేని నా సైదోడునకు జ్ఞానప్రబోధ మొనర్చి ఉత్సాహోత్తేజములను కల్పించినది నేనే. ఆతని చక్షువులను వెలుంగుదెసకు త్రిప్పినది నేన. ఆతనికి సౌఖ్యానందముల రుచి చూపినది నేన. పుణ్యప్రచారమునం దతని లక్ష్యము నిల్పినది నేన. కాని చాంచల్యమువలన పాపఫలమును పుడుక ప్రోత్సహించినదియు నేనయని యీ లోకమున వాడుక. పుణ్యపాపములు, సుఖదుఃఖములు, చీకటివెలుఁగులు, అవినాభావములు; ఈసృష్టికి నైసర్గికములు; ఇహలోకసాంప్రదాయములకు పునాదులు. వీని వివక్షత లేకున్న నిది దేవలోకమో, రాక్షసలోకమో యగును. మానవలోకనిర్మాణమున కావశ్యకతయే లేదు. సృష్టియందు ప్రస్ఫుటమగు ద్వంద్వమును పురుషునకు వివరించుట విజ్ఞానోపదేశమా? పాపప్రబోధమా?

౨

నేను ఆదిశక్తిని. పురుషుఁడు ఘటనాదక్షుఁడగు శక్తిమంతుఁడు. త్రిమూర్త్యాత్మకమగు భగవదంశమునందు నాయునికి ప్రత్యక్షము. ప్రథమమున శివుఁడు నన్ను నిరసించి విరాగియై ప్రశమోత్సాహియయ్యెను. కాని యచిరకాలమున విజితుఁడై యర్ధదేహమును నాకు పంచి యిచ్చెను. నన్ను జటాజూటమున ధరించెను. అతనికి అప్రతిమానమగు శక్తిని ధారపోసిన శాంకరిని నేనే. విష్ణువు ప్రసిద్ధములగు వివిధావతారములయందు నాకై దండ విడువలేఁడు. అతఁడు నా సాహచర్యమువలననే యుగయుగమున ధర్మసంస్థాపనము చేయఁగలిగెను. బ్రహ్మచే వేదవాక్కులను పలికించినది నేనే. సకలవిద్యలకు నధిదేవతను నేనే. నా చరిత్రము పవిత్రము. నాప్రతిభ అప్రతిమానము. నాయునికి ఉత్సాహజనకము. నారూపము కోమలము. దేవతలు నాకు లలితపీఠము నిచ్చిరి. మునులు నాసుగుణముల స్తుతించిరి. పురుషులు దేవీరూపమున నన్ను పూజ చేసిరి. నిస్సహాయత నొంటరిగ వనములఁ దిరుగుచున్న నన్ను క్రూరమృగములు హింసింప వెఱచి

# ౪౫-వ అఖిలభారతజాతీయమహాసభాచిత్రములు



శ్రీ. డా. చోయిత్ రాం పి. గిద్వానీగారు

స్వాగతసమితి అధ్యక్షులు



శ్రీ సర్దార్ వల్లభాయిపటేలుగారు, అధ్యక్షులు.

౪౫-వ అఖిలభారతజాతీయ మహాసభ, కరాచి



శ్రీ లాలా యశ్వంతరాయి చురమనిగారు




శ్రీమతి కికిబెన్ చబల్దాసు లాల్వానిగారు
(స్వాగతసమితి ఉపాధ్యక్షులు)



శ్రీ స్వామి గోవిందానందుగారు



శ్రీ ఆర్. కె. సిధ్వాగారు
స్వాగతసమితి కార్యదర్శి



శ్రీ సేఠ్ లాల్ పనచందుగారు
స్వాగతసమితి కోశాధికారి



శ్రీ శాంతదాసు ఇదన్మాల్ గారు
శాంతిసైనిక దళాధిపతి



శ్రీ కుమారి పార్వతి టి. గిద్వానిగారు
శ్రీ స్వాగతసమితి కార్యదర్శిని

తమ క్రౌర్యమును వదలి మచ్చికపడినవి. చైతన్యరహితములగు అయశ్శకలములు గూడ నే నొనరుచోసిన యుదకమునందు సాధువులై సిద్ధభోజ్యములైనవి. ప్రేమపాత్రుండగు పురుషుని యమపాశబంధవిముక్తునిఁ గావించి, దుర్జయమగు మృత్యువును సాధించి, జయించినది నేనే. నాకెంత సాహసమో అంత ఆనందపిపాస. ఎంత ఉత్సాహమో అంత ఔదార్యము. ఎంత చంచలతయో అంత పట్టుదల. సాగరమథనోపలబ్ధమగు అమృతభోజనమును సురలకు పంచి రక్కసులకు దక్కనీకుండచేసిన నాసామర్థ్యమువలన మానవలోకమునకేకాక దేవలోకమునకును కల్యాణము చేకూరలేదా? దుష్టశిక్షణదీక్షాబద్ధుఁడైన పురుషోత్తము నెదుర్కొని మూర్ఛిల్లఁ జేసిన నరకమహావృతమును మొదలంటనఱకిన వీనాహస్తములే సుఁడీ! కాని యీ నాప్రతిభ యీర్ష్యారహితులగు దేవతలకైనను గిట్టలేదు. సర్వసమర్థులగు వారికేలోటు? అసంగతమైనను సహజమనిపింపఁగలుగు నొక విపరీతపు పన్నాగము పన్నఁబడినది. తుట్టతుదకు నేను దేవగురునకు ద్రోహమొనర్చితి ననిరి. ఇది విశ్వసనీయమా? అయినచో నాద్రోహమెట్టిది? పురాణప్రోక్తమగు నానిష్కళంకచరితము నరసి యిందులకు సమాధాన మొసఁగుఁ డని మనవి.

3

కలి యవతరించెను. ఖడ్గము ధర్మకల్పకమయ్యెను. పురుషుఁ డీర్ష్యాసముద్రమునఁబడి మరణసంక్షోభమునఁ గన్నుఁగానకున్నాఁడు. అట్టితఱి నతఁడు రాగద్వేషానక్తుఁడై అధఃపతితుఁడు కాకుండ నడ్డుపడి నాశౌర్యోత్సాహములవలన సులక్షణలక్షితుఁగా నొనర్చియుంటిని. సర్వసమర్థులకేనియు దుర్ఘటమై తోఁచు రాజ్యభారమును నా భుజస్కంధములం దిడుకొని రామరాజ్యమును మఱపించు రీతిని పరిపాలన మొనరించు నేర్పు నాకుగ్గుపాలతోఁ బెట్టినది. నూతనరాజ్యసంస్థాపనమునందును, శత్రురాజ్యవినాశనమునందును, నేను ముందంజవైచితిని. నేనాశ్రయించిన చోటులు నగరములై, రాజ్యములై రాష్ట్రములై ఖండములయ్యెను. నా రూక్షారుణనేత్రములు ప్రసరించిన స్థానములు క్షణకాలములో విధ్వంసములైనవి. నా యుద్బోధనమువలననే ధనముకంటె, నిహలోకసుఖములకంటె, ప్రాణముకంటె మానమే లోకోత్తరమగు ప్రతిభావంతమయ్యెను. నాసాహసౌదార్యములకుఁ బురుషుఁ డచ్చెరువంది వినతముఖుఁ డయ్యెను. పురుషులు పరస్పరద్వేషమువలన మాతృదేశమును పరుల కర్పణము చేయునపుడు పరకీయజీవనప్రవాహము దేశమున చొరకుండఁ జెలియలికట్టనై నిలిచినది నేనే. నాకు బలము లేదనుట పరిపాటి. కాని శతసహస్రయుద్ధములు నాకు విజయము చేకూర్చిన సామర్థ్యము నేమనిపిలుతురు? నేను శరసంధానకౌశలముపొందుట కభ్యంతరకారులగు నవయవములను ఖండించుటకేనియు వెఱచితినా? కొన యూపిరియున్నంతవరకు స్వరాజ్యమును ప్రవేశించిన శత్రువులతోఁ బోరాడి చచ్చుటయో చంపుటయోగాని పగరకు వెన్నిచ్చి యెఱుఁగనే! నేపోరినయుద్ధములు, నే స్థాపించినసంస్థానములు, నే నాశనమొనర్చిన రాజ్యములు లెక్కించినదెవరు?

౪

ప్రకృతితో నాకుఁ బోరాటము ముగిసెను. సంధానము కుదిరెను. కోమలమగు నాశరీరమునందలి కోమలతరమగు హృదయము ప్రవిమలమగు ప్రకృతియందు లీనమయ్యెను. ఫలితము కుసుమకోమల మగు కావ్యము, గానము, నేను. బాహ్యప్రపంచమునందు జీవాణువు, పునస్సృష్టి చెందు క్షేత్రమును; అటులనే నాహృదయము భావప్రపంచము నందు సజీవమగు కవితాబీజము మొలకలెత్తుటకు పదనగు క్షేత్రము. నాపలుకు మధురము. నా కవిత మధురతరము. నా గానము తన్మయానందము. కులము హీనమైనను కలము కాదు. గంటమునాకు అహీనమగు వన్నె తెచ్చెను. నామూర్తియందలి మార్దవము, నా కావ్యములందు ప్రతిఫలించినది. నాతనువునందలి సౌకుమార్యము నాకవనము నావహించినది. నాచేష్టలయందలి సహజశృంగారము నాపాటలయందు వెల్లివిరిసినది. నా కవనమును గ్రహించి నాగానము నాలకించి సోల్లాసితుఁడు సమ్మోహితుఁడుకాని మానవుఁడేఁడీ! లేఁడు.

౫

నాకు గృహమే ప్రపంచము. దేశము రాజ్యము. సంసారమే మోక్షము. నాశౌర్యము నేలఁ గలసినది. నాకవితాధోరణి గడ్డలపాలైనది. నాగానఝురి గహనసీమలందు దాఁగినది. పురుషున కానందదాయకమగు నొకపుష్పముగా నేను మాఱితిని. పురుషుఁ డొకమాఱు నన్ను మృదు

లపల్లవములగుదులయం దునిచి మన్ననసేయును. ఒకమాఱు నన్ను కన్నుల కద్దుకొని జీవన్ముక్తినందితినని సంతసించును. ఒకమాఱు నన్ను సమాఘ్రాణించి దరహాసితవదనుఁ డగును. ఒకమాఱు నన్ను సుకుమారముగ చుంబించి తన్మయత నందును. వేఱొకమాఱు కుపితచాలనమున నన్నుఁ బిడికిటఁ బట్టి నలిపివేయును. కోపవశమున నోటనమలి మ్రింగివేయును. క్రోధోద్ధురతవలనఁ గాలితో నేలరాచి రూపుమాపును. నేను పురుషునిచేతి కీలుబొమ్మను. అతని కుపయోగపడునంతవఱకే నాజన్మము సార్థకము. నికృష్టుఁడగు పురుషాధమున కయినను నేనపకృతి సేయనెంచుట మహాపాతకము. నాశరీరమునందు ధరించుటకు రత్నభూషణములకు, చీనాంబరములకు, కొదవలేదు. తనుశ్శృంగారమే నాకు ముక్తి. పురుషుని కుపచారమే నాకు భుక్తి. అతనియం దనురాగమే నాకుధర్మోక్తి.

౬

నిద్రాణమైన నా అంతశ్శక్తి త్వరలోనే మేల్కొన్నది. విజ్ఞానచక్షువు నావరించిన తిమిరములను ఉదయభానునివలె పటాపంచ లొనర్చినది. నన్ను సంక్షుభితమొనర్చిన పరాధీనవాయువులను తఱుమఁగొట్టినది. కలకలలాడు గృహమునందు నే నధిష్ఠానదేవత నైతిని. ప్రపంచముయొక్క భావిస్థితి కాధారభూతులగు వారికి నేనుపదేష్టనైనపుడు నేను నజ్ఞానాంధకారమునందు అస్వాతంత్ర్యపంకమునందుఁ బడియుండు టెట్లు? నికృష్టమగు పరాధీనత కొలఁదికాల మనుభవించినంతనే నాస్వభావసిద్ధమగు స్వేచ్ఛాపిపాస వేయి మడుంగులు విజృంభించి నన్ను కార్యశూరత్వమునకు పురికొల్పినది. మొక్క వోయి మూలనుబడియున్న నా కత్తికి సానపెట్టితిని. విఱిగిపోయిన నా కలమునందు సంజీవము పోసితిని. తెగిపోయిన నా వీణాతంత్రులను జక్కఁజేసి విశ్వశ్రుతికి మేళవించితిని. ఇది నాకొక పునర్జన్మము. సూక్ష్మగ్రాహి యగు పురుషుఁడు నాయం దుద్భవించిన ఆనూతనతేజము దేవదత్తమైనదిగా గ్రహించి యథాస్థానమున నా కభిషేక మొనర్చెను. ఆ తెజోవాహినిని గుఱుతింపలేక దాని మార్గమధ్యమున తారాడుచు నిలచిన పుట్టలు, మెట్టలు, గుట్టలును కొట్టుకొనిపోయివిశాలసముద్రమునందు విలీనములై పోయినవి. సహజధర్మోపలబ్ధిచే నాయందు వికాసము హెచ్చెను. నా తోడు లేక పురుషుఁ డేకార్యమును చేయసాహసింపఁడు. పురుషుని అనుకూలత లేక నే నేపనియు చేయఁబూనను. నాభావముల నతఁడు మన్నించును. అతని సంకల్పముల నేను గౌరవింతును. నా తోడ్పాటువలన నే పురుషునకు జయము సిద్ధించును. జ్ఞానము అభివృద్ధి యగును. జీవితము పవిత్రమగును; స్వర్గము సాధ్యమగును.

౭

నేను మానవుని ప్రాణములోని ప్రాణమును. కంటిలోని పాపను. కంఠములోని స్వరమును. వెలుఁగులోని తెజస్సును. లోకములోని జ్యోతిని. నాఆకారము సుందరము. భావము శ్రేయస్కరము. వాక్కు మృదువు. నటన రమ్యము. మానము పావనము. పురుషునిఅర్ధభాగము—కాదు సర్వస్వము, నాది. నా ధర్మమును తప్పను. నా బాధ్యతలకు వెనుదీయను. నాహక్కులను విడువను. నా స్వాతంత్ర్యమును పరాధీనము చేయను. నాసాహసమును, నాసౌశీల్యమును, నా సాధుభావమును ప్రచార మొనర్చి ప్రపంచము నింకను సుఖప్రదముగా మానవజీవితముల నింక నుత్సాహవంతములుగఁ జేయఁగల ననః అకుంఠితవిశ్వాసము నాయందు మూర్తీభవించియున్నది. హ్రస్వములగు దుస్తులు, సంక్షిప్తములగు కేశములు వేఱొక ఫలితమును సూచించునందురేమో! ఇవి యవలక్షణములే యగుచో కాని వెయ్యవి? నేను పారతంత్ర్యశృంఖలముల త్రెంచుకొని స్వధర్మనిర్ణయ మొనర్చుకొను నీసమయమునఁ గొంచెము ముందునకు చూడుఁడు! నేనుసృష్టియందు స్వస్థానము నాక్రమించి సహజగుణములవలన రాణకెక్కి పురుషుని రాణింపఁజేయఁగల సామర్థ్యము నాయందు నివురుగప్పిన నిప్పువలెనున్నది సుఁడి! బోధనయందు, వాదనయందు, రాజకార్యనిర్వహణమునందు, వర్తకవ్యాపారములందు—ఇది యది యన నేల?-ప్రపంచవ్యవహారములం దన్ని శాఖలయందును నా యునికివలన నూతనోత్సాహసంరంభములు సువ్యక్తములు కాఁగలవు. విమలమగు నా ప్రేమవలన, హృదయపూర్వక మగు నా సేవవలన లోకకల్యాణము సిద్ధింపఁగలదు. అపుడు నేనుః "ధన్యాఽస్మి" యనుకొందును.



# రుష్యావ్యాపారాభివృద్ధి

వోలేటి నరసింహస్వామిగారు

వర్తమానకాలమున ప్రపంచమంతటిని అన్నివిధముల నాకర్షించుచున్న దేశము రుష్యాయని చెప్పవలసియున్నది. ఇందుకు కారణము తద్దేశముయొక్క యభివృద్ధియే. నూతనమార్గముల ననుసరించి యచిరకాలమున నిట్టి యద్భుతాభివృద్ధి గాంచిన దేశమింకొకటి మనము గాంచము. ఇట్లీయభివృద్ధినొందుటకు కారణ మేదియో యించుక పరికింతము.

రుష్యాదేశము చక్రవర్తిపాలనమునుండి ౧౯౧౭ సంవత్సరమున తప్పింపబడి ప్రజాయత్తము గావింపబడినది. అప్పటికీదేశమిట్టి పేరుప్రతిష్ఠలను కలిగియుండలేదు. ఐరోపామహాసంగ్రామమందు పాల్గొని కడు నిడుములు పొందుచుండెను. ప్రజలు కడుపునిండ తిండిలేక మలమల మాడుచుండిరి. దేశము విశాలమైనదైనను వ్యవసాయము తక్కువగ నుండెను. పరిశ్రమలందుకూడ నెక్కువ యభివృద్ధి లేదు. అట్టిసమయమున ప్రజలు చక్రవర్తిని చంపి, రాజ్యమును ప్రజాయత్తము గావించుకొనిరి. కాని చాలకష్టములు పడవలసి వచ్చెను. దేశమునందుగల కలహములతోపాటు ఐరోపామహాసంగ్రామము వారికి గోరుచుట్టుపై రోకటిపోటువలె గాన్పించెను. తదితర ప్రభుత్వములు నీప్రభుత్వము నొప్పుకొనరైరి.

అయినను ప్రజాప్రభుత్వము కొనసాగినది. నూతనప్రభుత్వము స్థిరముగా నుండుటకై ప్రయత్నించినది. ఒక సంవత్సరకాలములో తన నూతనమార్గముల నవలంబించినది. ప్రజలలోగల యశాంతిని మాన్పుటకై మిక్కిలి పాటుపడినది. వ్యవసాయదారులకు బంజరు భూములను సాగునకిచ్చి పంట నభివృద్ధికి దెచ్చినది. అందువలన కరవు తగ్గి ప్రజలయందు శాంతి నెలకొనినది. అదిగాక, చక్రవర్తిప్రభుత్వముచే చేయబడిన ఋణములన్నిటి నిచ్చుటకీ నూతనప్రభుత్వము నిరాకరించినది. అందువలన తదితరప్రభుత్వములకు కోపము వచ్చినను దేశమునందీప్రభుత్వముపట్ల ప్రేమ జనించినది. బ్యాంకులను, విదేశీయ వ్యాపారమును జాతీయమొనర్చి రక్షణపద్ధతి నవలంబించినది. దేశీయ వ్యాపారమును ప్రభుత్వము స్వాధీనపరుచుకొని, చేతి పరిశ్రమలనభివృద్ధి నొందించినది.

ఇటు లొకసంవత్సరము గడచినది. తరువాత ఒదేశవ్యాపారమడుగంటినది. తదితరదేశములవారికి సాంఘికప్రభుత్వమునం దిష్టములేనందున, రుష్యాదేశములోనికి దిగుమతులుగాని, తద్దేశమునుండి యెగుమతులుగాని జరుపుటను వారు నిషేధించిరి. అందువలన ముట్టడిలోనుండు పట్టణమువలె రుష్యా మెలగవలసి వచ్చెను. స్వరక్షణార్థము భోజనసామగ్రిని, తదితరజీవనాధారములగు వస్తువులను బీదవారికిని, అవసరముగలవారికిని ప్రభుత్వమువా రుచితముగ పంచిపెట్టుచుండిరి. వర్తకమునంతయు ప్రభుత్వమువారు లోబరచుకొని దేశీయులనుపోషించుచుండిరి. మూడుసంవత్సరములవరకు నీపద్ధతి నవలంబించిన తరువాత దీని యవసరము తీరినది. అప్పుడు నూతనార్థికపద్ధతి ననుసరించిరి.

ఈ నూతనపద్ధతివలన స్వేచ్ఛావాణిజ్యము ప్రబలినది. భోజనసామగ్రిని ఇచ్చు పద్ధతి ఆపివేయబడెను. ప్రతివ్యాపారసంస్థకును "ట్రస్టు" ల నేర్పాటుచేయు పద్ధతి ప్రారంభమయినది. అవసరమగు సామగ్రిని మాత్రమే కొనుటయు, అనవసరపుసరకునుమాత్రమే యమ్ముటయు జరుగుచుండెను. అందువలన ప్రజలకు సౌఖ్యముకలిగి, చాలధనము చేకూరెను. ఈపద్ధతియే ప్రస్తుతమందుకూడ నవలంబింపబడుచున్నది.

తరువాత ప్రభుత్వము విదేశీయులుకూడ నొప్పుకొనున ట్లొనర్చుటకై తన స్థిరత్వమును సంపాదించుటకు ప్రయత్నింపబడెను. ప్రభుత్వము స్థిరముగా నుండుటకు నాణెముల చెలామణి యవసరము. ఇందుకు తగిన మూలధన ముండవలెను. అందుకై ప్రభుత్వమువా రొక బ్యాంకును స్థాపించి యందుపై నచ్చులాభముతో నాణెముల నేర్పరచిరి. ప్రస్తుతము దీనాణెములు ౬౦౦,౦౦౦,౦౦౦ రూబుల్సు ఉన్నవని తెలుపుచున్నారు. అందువలన ప్రభుత్వము బాగుగా స్థిరపడినది.

ఒక వత్సరము గతించినపిమ్మట పరిశ్రమాభివృద్ధికై ప్రభుత్వము తగిన శాసనముల నేర్పాటు చేసినది. ప్రభుత్వమువారే స్వయముగా కొన్ని పరిశ్రమలను స్థాపించి ప్రోత్సాహపరచిరి. అనవసరపు ఖర్చులను తగ్గించి అందుచే మిగిలినదానిని యీ పరిశ్రమలకు మూలధనముగా నుపయోగించిరి. అన్నివిధముల యంత్రములను దేశమునందు నెలకొల్పి దేశీయులకు కావలసిన సామగ్రిని తయారు చేయించిరి.

ఇట్లు మరొక సంవత్సరకాలము గడచినపిదప సహకారోద్యమముపై ప్రభుత్వము తనపనిని కేంద్రీకరించినది. సహకారజ్ఞానము ప్రజలందు హెచ్చుగ వ్యాపించినది. దినపత్రికలన్నియు ప్రతిదినమును సహకారోద్యమమును గురించి తగు వ్యాసములను తప్పక ప్రచురించుట

మొదలిడెను. అందువలన సహకారసంస్థ లెన్నియో స్థాపింపబడినవి. ఇతరులకై తాను పాటుపడుటయను సూక్తిని ప్రజలు బాగుగ గ్రహించిరి. అందుపై ప్రభుత్వమునకు చాల ఉపయోగము చేకూరెను.

ఇట్లు ప్రభుత్వ మన్నివిధముల ప్రజలకు ఉపయోగపడి దేశమును మహోన్నతదశకు తెచ్చినది. అందుచే ప్రస్తుతమున రుష్యా ప్రభుత్వము నన్నిదేశములును గుర్తించినవి. ఆదేశముతో వర్తకపు టొడంబడికలను చేసికొనుచున్నవి. కానివారి ప్రభుత్వవిధానమునం దితరుల కిష్టములేదు. అది సాంఘిక ప్రభుత్వము. ప్రజలకు సొంత ధనమనునది లేదు. అంతయు ప్రభుత్వమువారిదే. ప్రభుత్వమే ప్రజలను పోషించును. ప్రజలు కష్టపడి ప్రభుత్వమునకు సొమ్ము చేకూర్చవలెను. ప్రభుత్వము, ప్రజలు నేకమై మెలగుచున్నారు. అందుచేతనే యచిరకాలములో నంత యభివృద్ధిని జెందుటకవకాశము కలిగినది.

ప్రస్తుతమున వ్యాపార మంతయు తక్కిన దేశములలోవలెనే జరుగుచున్నది. నాణెములు, నోట్లు గలవు. ఐరోపాదేశము లన్నిటికంటె అచ్చటి జీవనము సులభమైపోయినది. వస్తువు లన్నియు చవుకగా లభించును. అన్ని వస్తువులకంటెను పుస్తకము లతిచౌకగాను, హెచ్చుగాను దొరకును. ప్రతిచోటను పెద్దదుకాణములు, మారకపు కచేరీలు, బ్యాంకులు తదితరదేశములలోవలెనే యున్నవి. కాని నవనాగరికతా వ్యామోహము వారిని పూర్తిగా వశముచేసికొనజాలక పోయినది. శుభ్రమగు వస్త్రముల నాప్రజలు వాడుదురుగాని "ఫేషను" కు వారు లొంగరు. మిక్కిలి పనిగల యున్నతోద్యోగులు మాత్రమే మోటారు బండ్లలో కనబడుదురు గాని తదితరులు నడచిగాని, గుర్రపు బండ్లలోగాని పోవుదురు. మొత్తముపైని వ్యక్తిధనము గోచరించదు.

వ్యాపారము సాధారణముగా జరుగుచున్నది. వ్యాపారసంస్థలన్నియు సహకారసంఘములచే గాని, ప్రభుత్వమువారిచేగాని నడుపబడుచున్నవి. "మాస్కో సిటీ బ్యాంకు" అనేకశాఖలను గలిగి యాపట్టణపు మ్యూనిసిపాలిటీవారిచే నడుపబడుచున్నది. "ఆల్ రష్యను టెక్స్టైలు సిండికేటు" సంస్థ ప్రభుత్వమువారి పాలనలో నున్నది. అదిగాక "ప్రోంబ్యాంకు" "కోఆపరేటివు బ్యాంకు" కూడ ప్రభుత్వమువారి యధీనములోనే కలవు. "ప్రోంబ్యాంకు" అనునది పరిశ్రమలకు సహాయముచేయు ధనసంస్థ. ఇట్టిదే వ్యవసాయదారుల యుపయోగార్థము "అగ్రికల్చరల్ బ్యాంకు" కలదు. దీనికి యాభై రెండు శాఖలు గలవు గాన దేశములోనుండు రయితు లందరకు నందుబాటులో నీ బ్యాంకు గలదు. అదిగాక "సిటీబ్యాంకు" కార్మికులకు ఉపయోగపడుచున్నది. అన్ని బ్యాంకులు ప్రజల సమూహములచే నడుపబడుచున్నను పోటీమాత్రము హెచ్చుగా నుండును.

ఒక ధనాగారములేగాక వస్తుక్రయవిక్రయసంఘము లెన్నియో కలవు. పెద్దపెద్ద దుకాణములన్నియు ప్రభుత్వమువారి పాలనలోనే యుండును. మిగతవిమాత్రము సహకారసంఘములచేతను, జాయింటుస్టాకుకంపెనీలచేతను నడుపబడుచున్నవి. వ్యక్తివ్యాపార మాదేశములో పూర్తిగ నడుగంటినదని చెప్పవచ్చును. బట్టల "స్టోరు" లు, తేయాకు "స్టోరులు", మందుల "స్టోరు"లు, మొదలుగున వన్నియు ప్రభుత్వపు ప్రత్యేకశాఖల పరిపాలనలో నున్నవి. సహకారసంస్థలును, తదితరసంఘములును వ్యాపారపు పన్ను కొలదిగ మాత్రమే చెల్లించుచుండును. ప్రభుత్వమువారి మిల్లులు వస్తువులను తయారుచేసి సహకారసంస్థల పర మొనర్చును. అవి వానిని విక్రయించుచుండును. ఇతరులతో పోటీగాని, కరువుగాని సంభవించినపుడు వస్తువుల వెలలను ప్రభుత్వమువారు తగ్గించి పోటీకి నిలబడెదరు. మిల్లులలోని యజమానులుగ కార్మికుల కిష్టులైనవారినే నియమింతురు. కార్మికుల తగవులను వారిలో కొందరొక సంఘముగా నేర్పడి యజమానుల సహాయముతో పరిష్కరింతురు. వీరి తగవులను మూడవమనిషి యెన్నడు తీర్చ నవసరము లేదు. లాభములో పదియవవంతు కార్మికుల యభివృద్ధికై వెచ్చించెదరు. అందుచేత కార్మికులు యజమానులయెడలను, పనియందును మిగుల శ్రద్ధ గలిగియుండి తగవులకు స్థాన మొసగరు. యజమానులుకూడ నిరాడంబరముగ కార్మికులతో కలిసి పనిచేయుటచే కార్మికుల గౌరవమునకు లోటు లేదు. అదిగాక కార్మికులకై భీమాకంపెనీలు మొదలగునవికూడ గలవు.

ఇట్లుండుటచేతనే రుష్యా త్వరలో నభివృద్ధి గాంచినది. అభివృద్ధికి మూలము ధనమేకదా. అట్టి ధనము ముఖ్యముగ వ్యాపారమువలననే వచ్చును. ఈదేశము వ్యాపారము నందుచేతనే మొదట నభివృద్ధి చేసి, ఆధనమును తదితరవిధములుగ ఖర్చు చేయుచున్నది. విద్యాసంస్థల నెక్కింటిని నెలకొల్పి దేశస్థుల నందరిని అక్షరజ్ఞానము కలవారినిగ నొనర్చినది. నూతనయంత్రనిర్మాణమునందు నెక్కు పరిశోధనలను చేయుటకు కొందరను నియమించినది. అదిగాక అక్షరజ్ఞానహీనులకు సైతము పాలనావిధమును తెలుపుటకై యెప్పటి వార్త లప్పటికి కార్మికులకు వినిపించునటులు ఏర్పాటుచేసినది. అది యెట్లన: ప్రతిసాయంకాలమున నాలుగురోడ్లు కలియు స్థలములందు దూరశ్రవణ యంత్రములను నిర్మించి దినవార్తలను వినిపించుదురు. అందువలన పత్రికలను చదువకయే ప్రజలకు నాటివార్తలు తెలియుచుండును. విద్యుచ్ఛక్తిని బాగుగ నాదేశ ముపయోగించుచున్నది.

ఇట్టిదేశ మభివృద్ధి జెందుటలో నాశ్చర్య మేమున్నది? రుష్యాదేశమునకును మనదేశమునకును చాల సంబంధముగలదు. అచ్చటవలెనే వ్యవసాయము మనదేశములో విరివిగ జరుగవచ్చును. అనవసరపు ఖర్చులు తగ్గించినచో పంటకాలువల నెన్నిటినో యేర్పరచి వ్యవసాయ మభివృద్ధిలోనికి తెచ్చుట కవకాశ మున్నది. రైలు మొదలగుసంస్థలను ప్రభుత్వమువారు స్వాధీనపరచుకొనినచో ప్రభుత్వమున కెంతయో లాభము చేకూరి ప్రజలు సుఖపడవచ్చును. దేశీయులయందు నిర్బంధవిద్య నెలకొల్పుట కవకాశ ముండును. ధనము లేదను సాకు నశించును. కల్లుదుకాణము లెత్తివేయవచ్చును. దేశము సత్వరాభివృద్ధి గాంచగలదు.

# ఉదయశంకర్

భారతీయనర్తకుడు

ఉదయశంకర్ ఖండాంతరములయందును ప్రఖ్యాతిగన్న నర్తకుడు. వంగీయమగు నొక సద్వంశమున నితడు జనించెను. పదియేండ్లకు పూర్వము ఇంగ్లాండునకు బోయి అచట వర్ణచిత్రరచనమున నితడు కౌశలమును సంపాదించెను. అచ్చట తన సామర్థ్యమును మెరయించి గొప్ప కళాప్రదర్శనములందు బహుమతులను, ప్రఖ్యాతిని గడించెను. శిల్పకళయం దితని కభిరుచి మెండు. సౌందర్య లాలిత్యప్రసాదగాంభీర్యాదిగుణములు వెల్లివిరియించు భారతీయశిల్పవిగ్రహముల నొక్కమొగి పరికించి, పరిశీలించి, భావించి, వాని సౌందర్యము మననము చేసికొని, వానిస్థితిసన్నివేశములను గుర్తెఱిగి, నృత్యకళ నభ్యసించి యందు ప్రవీణుడయినాడు. యూరపుఖండమున ప్రసిద్ధములయిన మహానగరములయందు నృత్యమొనరించి ప్రఖ్యాతికెక్కినాడు. భారతదేశసంస్థానములను, మహాసభలను నృత్యముచేసి 'ఔరా' అనిపించినాడు. ఈతని ఈకళకు భావము, ఆపాదమస్తకము తాళలయబద్ధమగు శరీరసంచలనము ప్రధానాంగములు. భారతీయనృత్యకళ నుజ్జీవింపజేయ నితడు నడుముకట్టినాడు.

ఇతనివెంట చిత్రకళాకుశలులు, గాయకవాదకశ్రేష్ఠులు నగు పదుగురుభారతీయులు గలరు. వా రందరు పట్టభద్రులు, సద్వంశములవారలు. వారిలో నొకరు ఔత్తరాహగాయకచక్రవర్తి పండిత విష్ణుదిగంబరు నొద్ద పదియేండ్లు గానకళ నభ్యసించినవారు. ఏబదిరైదుజాతులకు చెందిన నూటయెనుబది వాద్యముల నుదయశంకర్ తనమేళమున చేర్చుకొనినాడు. ఇంతేయు నొరులవలన ధనసాహాయ్య మంతగా లేక తానే నిర్వహించుకొనుచున్నాడు. ఇదికాక:—

ఉదయశంకర్ పదునైదువేల అడుగుల పొడవుగల చలనచిత్రమాలనొకదాని నిటీవల తయారుచేయించినాడు. కళామయమగు భారతీయజీవితముయొక్కయు, శిల్పాదికళలయొక్కయు, ప్రశస్తనృత్యనాట్యములయొక్కయు గొప్ప దేవతామహోత్సవముల యొక్కయు సుందరదృశ్యము లిందుగలవు. ఈచిత్రమాలకు శబ్దసంయోజనము కావించి సంభాషణ చిత్రములు (Talkies) గ తయారుచేసి యూరపు, అమెరికాఖండములయందు ప్రదర్శింపనున్నాడు.

ఉదయశంకర్ ౧౯౨౨ వ సంవత్సరమున ప్రపంచవిఖ్యాతిగన్న రష్యను నర్తకిని పవ్లొవాను కలిసికొని యామెకు భారతీయనృత్యమును నేర్పెను. ఆమెతోడ తానును పెక్కు పాశ్చాత్యనగరములయందు నృత్యము చేసెను. ఈ యిరువురి నృత్యములలో 'రాధాకృష్ణ' నృత్యము మేలుబంతి. ఇతడు యూరపుఖండపు బాలికలకు పెక్కురకు భారతీయనృత్యమును నేర్పెను. ఇపు డా దేశములలో ప్రజలు భారతీయనృత్యప్రదర్శనములనిన చెవిగోసుకొనుచుందురు. ఇట్లు ఉదయశంకర్ భారతీయ నృత్యకళకు పేరుప్రఖ్యాతులను దెచ్చుట కెంతయొ వ్యయప్రయాసములకు లోనయ్యెను.

ఇతడు కడచిన సంవత్సరమున పదునెనిమిదేండ్ల ఫ్రెంచిబాలికను 'సింకీ' అను నామెను తన మేళమున కలుపుకొని ఆమెకు భారతీయనృత్యమును నేర్పినాడు. క్రొత్తభావములను, క్రొత్త యావేశమును గలిగించు క్రొత్తక్రొత్తనృత్యముల నలవరుచుకొనుటకయి యిపుడు యూరపున తిరుగుచున్నాడు. ఇక నొకయేడాదికి తనసమాజమువారితోడ భారతదేశమునకు రానున్నాడు. ఈ చిత్రములు అతని వెవ్వేఱు నృత్యప్రదర్శనములు.

# ఉదయశంకర్ భారతీయనృత్యచిత్రములు

(G. S. A. ఛాయాచిత్రములు.)



శివతాండవము

ఉదయశంకర్-శివుడు.

కుమారిసింకి-పార్వతి (ఫ్రెంచిదేశపు యువతి)



సావిత్రీసత్యవంతులు

ఉదయశంకర్-సత్యవంతుడు.

కుమారి ఆడిలైడ్ లా ఫ్రాంచి-సావిత్రి. (ఇటలీదేశపు యువతి)

## ఉదయశంకర్ భారతీయనృత్యచిత్రములు



గోపికానృత్యము

ఉదయశంకర్. సింకికుమారి.



వసంతనృత్యము

కుమారిసింకి





నాగనృత్యభేదము
(SNAKE DANCE)
ఉదయశంకర్.



కొండొక నృత్యము
ఉదయశంకర్.